# వీరరసము

## (ఆంధ్ర సారస్వతము)

[1959-60 సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి రెండువేల రూపాయల బహుమతి నందుకొన్న గ్రంథము]




గూడ వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రుల, ఎం. ఏ.

ఆంధ్రోపన్యాసకుఁడు, పరుగల్లు కళాశాల.

# అంకితము

పూజ్య భ్రాతృపాదులగు

బ్రహ్మశ్రీ

**బిదురు వేంకటశేషయ్యగారికి.**

## సమర్పణము

భారతకావ్యశాస్త్రపథంబు [illegible] [illegible]ము మట్టి [illegible]
త్సారగుణ[illegible] [illegible]టుపడ [illegible]
హారము గూర్చి భారతికి [illegible]
సారవివేకసౌరభ వి[illegible]టభావనిధీ ! [illegible] !

వచియించినాఁడవు వ్యంగ్యగౌరవ మొప్ప
దత్తదేవుని గాథ తత్త్వఫణితి;
రచియించినాఁడవు రసకోవిదులు మెచ్చ
రాయల 'హృదయదర్పణము' చెలఁగ ;
వెలయించినాఁడవు విజ్ఞాన సంపద
'మేధావి పత్రిక' మెప్పులంద;
లిఖియించినాఁడవు లెక్కకుఁ బెక్కులౌ
వ్యాసముల్ 'బోధనాపద్ధతు'లను;
సర్వసాహిత్యశాస్త్ర సంసార సార
మెఱిఁగి 'కావ్యకళాతత్త్వ' మింపు సొంపుఁ
బరఁగగా నాంధ్రగీర్వాణభాషలందు
నలఘు పాండిత్యగరిమతో నిలిపినావు.

శ్రీనివాసార్యగురువర్యు చిత్తమలర
సమధిగత సాంఖ్యయోగాది సాధనుండ
వయితి వెల్లప్పు డాత్మ[illegible]
సాహితీలోకమున కొక్క [illegible].

నీవు మాయన్న నగుటయే [illegible]
వేయితపముల పంటయై [illegible];
అట్టి యనఘుని [illegible] నాదరింపు
చేర్మిఁ గృతినిచ్చి నతుఁ[illegible]చిగా !

★

**Dr. D. S. REDDI**
Vice - chancellor :
Osmania University

HYDERABAD-7
31st July, 1961

It gives me great pleasure to learn that the Book 'VIRARASA' in Telugu Literature, written by Shri G.V. Subrahmanyam, M. A., Lectuner in Telugu, has been awarded a prize by the Andhra Pradesh Sahitya Academy. The subject matter of the book as well as its treatment by him are both of great interest. He has endeavoured to prove that the emotion of "heroism" in its various aspects permeats Telugu Literature and that the sentiment of 'utsaha'—sustained effort for the achievement of the right cause- provides the back-ground for Virarasa. In Propounding his thesis, he has made the full use of several standard works on poetics. The author deserves congratulations for the valuable contribution he has made to the study of Telugu Literature.

(Sd.) **D. S. Reddi**

# అభిప్రాయము

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఎం. ఏ.,
ఉపాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ.

శ్రీ గూడ వేంకట సుబ్రహ్మణ్యంగారు రచించిన 'వీరరసము' అన్న గ్రంథము స్థాలీపులాక న్యాయముగనే చూడఁగలిగితిని. విషయ విభాగమే వారి శ్రద్ధకు సాక్ష్యము. ఇది అకాడమీ బహుమతిపొందిన దనుట దాని గుణముకు వేఱే చెప్పనక్కఱలేదు. బహుగ్రంథ పరిశీలనము, బహు విషయ నిరూపణము శ్రీ సుబ్రహ్మణ్యంగారి పాండిత్యము నకు నిదర్శనములు. రసవిషయము గహనమైనది. దానిని నిరూపించుటకుఁ జేసిన ప్రయత్నము ప్రశంసనీయము.

శ్రీ సుబ్రహ్మణ్యంగారితో ఽధిక గ్రంథరచన చేసి స్వప్రతిభా పాండిత్యములచేత నాంధ్ర సరస్వతీ పూజ చేయుదు రని యాశ పడుచున్నాను.

★

# స్థాపన

ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఎం. ఏ.,
ఆంధ్రశాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము.

శిష్యభావ సహకృతమైన మిత్రభావముచే నా కత్యంతాప్తులైన చి. శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యంగారు రచించిన 'ఆంధ్ర సారస్వతమునందలి వీరరసము' అను గ్రంథమును యథాసాధ్యముగా సవిమర్శముగ చదివి యానందించినాను. విషయము మహత్తరమైనది. రచయిత పిన్నవాఁడు. అయినను 'పిన్న చేతి దివ్వె పెద్దగా వెలుగదా!' అను వేమన సూక్తి ఈ గ్రంథముపట్ల సార్థకమగుచున్న దనియే నా విశ్వాసము. విశ్వవిద్యాలయములలో పరిశోధన పట్టమును పొందఁ దలఁచినవారు సమర్పించు సిద్ధాంత వ్యాసము (Thesis) ల కోసకు చెందదగిన దీ రచన. పరిశోధనమందు రెండు మార్గములు గుర్తింపఁబడుచున్నవి. ఒక యంశముపై నూతనాధారములను కనిపెట్టి వాని సహాయమున క్రొత్త సిద్ధాంతమును ప్రతిపాదించుట యొకటి పూర్వాధారములనే సమగ్ర పునర్వి మర్శనము చేసి నవ్యాలోకమును ప్రసరింపఁజేయుట రెండవది. సాధారణముగ భౌతిక శాస్త్రములందు మొదటి పద్ధతియు, కళాత్మక శాస్త్రములందు రెండవ రీతియు గోచరించుచున్నవి. శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యముగారి గ్రంథమీ ద్వితీయ కక్ష్యకు చేరి, అట్టి రచనలకు చక్కని యుదాహరణ మగుచున్నది.

ఆంధ్ర సాహిత్య క్షేత్రమున పెక్కు రసతరంగిణులు ప్రవహించుచున్నను సాహిత్యకులు తరుచు శృంగార రసధునిని మాత్రమే గుర్తించి కీర్తించు చున్నారు. ఇతర రసములు కొన్ని యస్ఫుటముగను, అంతర్వాహినులుగను ప్రవహించుచునేయున్నను వానికంతగ పరిగణనము జరుగలేదు. ఈ లోపమును తీర్చుటకే కాబోలు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు 'ఆంధ్రసారస్వతము నందలి వీరరసము'ను గూర్చి పోటీ వ్యాసములను ఆహ్వానించిరి. 'నృహరీ వాదములేల లేర యితరుల్ నీ లీలకున్ బాత్రముల్' అనునట్టి చిత్తవృత్తి గలవారైనను చి. సుబ్రహ్మణ్యముగారు జంకు గొంకులతో మిత్రకృత ప్రోత్సా హమునకు లోగి యీ ప్రయత్నముచేసి అకాడమీవారి బహుమానము నందు కొనుట ముదావహము.

వీరి గ్రంథరచనా ప్రణాళిక ననుసంధింతము. కావ్యనాటకములందు వీరశృంగారములలో నొక్కటి యంగిరసము కాఁదగునని యాలంకారికుల మత ముండనే యున్నది. మహాకవులు కొందరీ యనుశాసనమును మన్నింపక పోవుటయు మన మెరుగుదుము. 'ఏకోరసః కరుణ ఏవ' అని భవభూతి యమృత

వారి. వీరరసమును గూర్చి [illegible] శృంగారమే సర్వ[illegible] [illegible]పము, శాంతమే ప్రకృతిరసము, తక్కినరసములు వికృతు[illegible] [illegible]ప్రా[illegible]ర్యులును ఆలంకారికులలో నేక వా[illegible] [illegible] [illegible]ము[illegible]. కాని మే సర్వమానవప్రవృత్తులకును [illegible] ప్ర[illegible]ర్తించు [illegible] [illegible] వేత్తలు [illegible]నరు సతీర్థ్యు లగుచున్నారు. ప్రసిద్ధ [illegible] [illegible] సుబ్రహ్మణ్యముగారు చిన్నవారలయ్యు వీరివలెనే [illegible] ప్ర[illegible]నము[illegible] అని చెప్పఁదగియున్నారు. వీరి మతమున వీరమే సర్వమానవప్రవృత్తులకును బీజభూతము. వీరమునకు స్థాయిభావము ఉత్సాహము. కాముమే మానవుని యెల్ల యిచ్ఛాక్రియాశక్తులకు పునాది యని యంగీకరించినపుడు గూడ వీరము లేనిచే కామము శోభావిహీన మగునని యొప్పుకొందురు. కావున కాముని కంటెను మూలప్రవృత్తి యుత్సాహరూపమైన వీరమని అంగీకరింపక తీరదు. ఇట్లు వీరమే 'రసానాం రసః' యన నొప్పియున్నది. వాదకుశలులైన సుబ్రహ్మణ్యముగారు దీనికి మఱియొక యుపపత్తిని చూపుచున్నారు. ప్రాణి మనో వికాసమునందు కామము పూర్ణజీవిత వ్యాప్తిగల ప్రవృత్తి కాదనియు, అది అర్ధజీవితమును మాత్రమే రంజితము చేయఁగలదనియు వీరు చెప్పుచున్నారు. దీని నెవ్వరును కాదనజాలరు. శంకరభగవత్పాదు లీ యర్థము నిట్లు ప్రతిపాదించిరి.

> బాలస్తావ త్క్రీడాసక్త
> స్తరుణ స్తావ త్తరుణీ సక్తః
> వృద్ధస్తావ చ్చింతాసక్తః
> పరే బ్రహ్మణి కోఽపి న సక్తః[1]

దీనిలో నొక అంశమునే కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు చమత్కరించినాఁడు.

> "పనివడి నారికేళ ఫలపాకమునం జవియైన భట్టహ
> ర్షుని కవితానుగుంభములు సొమరిపోతులు కొంద[illegible]య్య[illegible]"
> నని నొనియాడ నేర రదియట్టిద ; లేఁజవరాలు చెక్కు
> టిన వసవల్చు బాలకుఁడు డెందమునం గలగంగ నేర్చునే ?"
>
> —శృంగారనైషధము. 1—17.

1. క. "ఆటల సక్తుఁడు బాలుఁడు
బోటుల సక్తుండు వయసు పురుషుఁడు, వృద్ధుఁడే
గాటపు చింతాసక్తుఁడు
పాటింపఁడు [illegible]క్కరుఁడు బ్రహ్మసక్తి !—"
—అమవాదము బ్ర. శ్రీ. వేమూరి [illegible]రామశాస్త్రిగారు.

ఇట్లు బాల్య మవిదితకామము, వార్ధక్య మనాదృతకామము అని నిశ్చయింపఁ దగి యుండుటచే కామము జీవితసాఫల్యావర్తి యని చెప్పవీలులేదు. ఉత్సాహస్థాయియైన వీర మట్లుకాక జీవితపాత్రము నంతను అన్ని యవస్థలయందును ఏదో యొకరూపమున ఆశ్లేషించియే యుండుననుట అనుభవసిద్ధము. కామముఖ్యప్రవృత్తివాదు లిట్లు చెప్పవచ్చును. కామ మనగా రసప్రతియే కాదు. బాల్యమునందలి మాతాపితృననురాగము, కౌమారము నందలి మిత్రకృత ప్రణయము, వార్ధక్యమునందలి పుత్రపౌత్రానందము—ఇవి యన్నియు కామభావనయొక్క దశాపరిణామమే యని ప్రతిపాదింతురేమో. ఇది మాకును ఇష్టాపత్తియే. ఒక భేదముమాత్రము నిరూపింతుము. కామము ఇచ్ఛారూపమై భావములోనే పర్యవసించును. ఉత్సాహము జ్ఞానక్రియాన్వృత్తులకు ప్రేరకమై ప్రాణిని క్రియాశీలము చేయుచున్నది. భావముకంటె క్రియాశీలత్వము జీవిత సాఫల్యమునకు సన్నిహితప్రవృత్తియై ప్రత్యక్షోపకార మగుచున్నది. దానికి మూలమైనది యుత్సాహము. ఉత్సాహపరిణామమైన వీరరసము రసమూర్ధన్యమనుట హేతుబద్ధముగా నున్నది. క్రియావృత్తి శ్రేష్ఠతమ మని శ్రీకృష్ణదేవరాయలవా రిట్లు వ్రాక్రుచ్చిరి.

> అలసతఁ బరున్న మనుజుండు కలియుగంబు,
> ద్వాపరం బెన్నఁ గూర్చున్నవాఁడు, త్రేత
> యుత్థితుండు, యాయి మఱి కృతయుగమటన్న
> నముచి దమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినమె. ఆము. 3 ఆ. 45 ప.

ఉత్కటోత్సాహము వీరరస మనబడునని చెప్పనైనది. ఎట్టి దెట్టి యుత్సాహము? దారులుకాచి పాంథులను దోచుకొను పాటచ్చరుని యుత్సాహము గూడ క్రియాశీలతయే కదా. ఇట్టి శంకను శ్రీ సుబ్రహ్మణ్యము గారు మెలకువతో పరిహరించినారు. ధర్మబద్ధమైన యుత్సాహమే వీరరస పర్యవసాయి యగుచున్నదని వారు వాకొనుట యుక్తముగా నున్నది.

గ్రంథ ప్రణాళిక: రసాభ్యుదయమను మొదటి భాగమునందు వీరు రసస్వరూపమును, విభావాదుల లక్షణములను, రసనిష్పత్తి క్రమమును, రసము యొక్క అలౌకికత్వమును ప్రాచీనాలంకారికుల మతము ననుసరించి సుస్పష్టము చేసిరి. కావ్యానందము బ్రహ్మానంద సబ్రహ్మచారియని చెప్పుదురు. ఇది బ్రహ్మానందముతో నెట్లు భేదించుచున్నదో వీరు చక్కగా నిరూపించిరి. "కావ్యానందము ఇచ్ఛాక్రియాత్మక వృత్తులణగిన మనస్సుయొక్క జ్ఞానవృత్తిచే ననుభ

యోగ్యములైన యుదాహరణములను ప్రదర్శించి, తను విస్తృత సాహిత్య పరిచయమును నిరూపించుకొనినారు. అచ్యుతరాయలు దనుగొన్న 21 శాఖలకును బుద్ధిమంతులైన సుబ్రహ్మణ్యముగారు మఱి మూఁడింటిని చేర్పఁగలిగిరి. అవి: స్వాతంత్ర్య వీరము, యశోవీరము, మానవీరము. మధ్యయుగమునందు మునల్మానులతో రాజపుత్రులు మున్నగు వారికి జరిగిన యుద్ధమునందు స్వాతంత్ర్య వీరమును, ఫ్రెంచివారితో బొబ్బిలి వీరులకు జరిగిన యసమ యుద్ధమునందు మాన వీరమును చూచుచున్నారు. ఇవి యుద్ధవీరమునందు సంగమించునవి కావా అను కొండొక శంక కలుగుచున్నది. ఈ విధముగా స్తోకోద్దిష్టములైన వీరరస భేదములను చతుర్వింశతిగా పరిగణించుట గాంచి వింత పడనక్కరలేదు. అలంకారముల సంఖ్యయు నిట్లే పెరిగినది. భరతాచార్యుఁడు ఉపమ, రూపకము, దీపకము, యమకము అను నాలు గలంకారములను మాత్రమే గుర్తించియుండ అనంతరికులగు నాలంకారికు లలంకార విభాగములను నూటయెనిమిది వఱకు పెంచుట మన మెరిగిన విషయమే.

వీరరస స్వరూపమును తద్భేదములను స్థాపించి శ్రీ సుబ్రహ్మణ్యముగారు ఆంధ్ర వాఙ్మయమందు వీరరసోల్లాసమును సందర్శించుటకు పూనొ్కని విశేష కృషి సల్పిరి. ఆంధ్ర మహాభారత రామాయణములలోని ముఖ్యరసము వీర రసాంతర్భావితమని వీరు సయుక్తికముగ నిరూపించిరి. ఇచ్చట గ్రంథకర్తగారు ప్రసంశనీయమైన స్వతంత్రాలోచనమును, సాహస నిర్ణయములు చేయు శక్తియు ప్రదర్శించిరి. మహాభారతము శాంతరస ప్రధానమనియు, రామాయణము కరుణరసాత్మక మనియు, ఆనందవర్ధనాదులగు ప్రాచీనాలంకారికులు నిర్దేశించిరి. సుబ్రహ్మణ్యముగారు సవినయముగనే వీరి యుక్తులను ప్రత్యాఖ్యానము చేసి ఈ మహాగ్రంథములందలి అంగిరసము ధర్మవీర మనియు, శాంతకరుణములు దీని కంగములుగా భాసించు చున్నవనియు సాగించిన చర్చ సోపపత్తికము, గంభీరమునై యొప్పుచున్నది.

ఆంధ్ర వాఙ్మయమునందు భారత భాగవతములకు సర్వాతిశాయియైన ప్రజాదరణ మున్నది. భాస్కరరామాయణమునకు వానితో తుల్యప్రతిపత్తి యున్నట్లు తోఁచదు. ప్రస్తుత రచయిత ఈ మూఁడు మహాగ్రంథములను శిఖరభూతములుగా భావించి రత్నత్రయమని పేరిడి విశిష్ట విచారణ చేయుట ప్రశంసనీయముగా నున్నది. విషయవివేచన సౌకర్యమునకై తదితర గ్రంథములను వస్తుకావ్యములు రసకావ్యములుగా విభజించుకొని చర్చ సాగించిరి.

ద్రునివలె ప్రకృతిలో లీనుఁడు కాలేదు. బుద్ధునియం దాతని సహజ గుణము లైన దయయు అహింసయు సముజ్జ్వలములై అపరిమితమును సంధ్యారాగ మంజులము చేసినవి. కావున బుద్ధభగవానుని మహాత్మాగాంధిని దయావీరులుగ ఎన్నుటయే లోకహృదయమునకు తృప్తి నొసంగును.

సంపూర్ణ కావ్యములందు వీరరస వివేచనము చేయుటతో చాలింపక శ్రీ సుబ్రహ్మణ్యముగారు ఆంధ్ర లఘుకావ్యములందు, ముక్తకములందు, నవలలు, నాటకములు మున్నగు బహుళ సాహిత్య ప్రక్రియలందు వీరరస ఘట్టముల ననుసంధించుచు తమ రసనౌకను విహరింపఁ జేసినారు. ఈ గ్రంథము నామూలాగ్రముగ చదివిన తరువాత ఆంధ్ర వాఙ్మయము శృంగార ప్రధాన మను భావము తొందరపాటుచే కల్గినదేగాని వాస్తవము గాదని నిరూపిత మగును. శ్రీ సుబ్రహ్మణ్యముగారి బహుమూలగ్రంథ పరిశోధనము, యుక్తి యుక్తమైన విషయ విస్తరణము, అలంకృతమయ్యు, ప్రసన్నతను గోల్పోవని శైలియు వీరి రచనకు వన్నెబెట్టుచున్నవి. వీరందందు ప్రకటించిన అన్ని యభిప్రాయములతోను అందరము ఏకీభవింపక పోవచ్చును. నా మట్టుకు నాకు మనుచరిత్రము నందలి ప్రవరుని వృత్తాంతము త్యాగవీరమున కుదాహరణగా గైకొనుటయు (పుట 35), అహింసా వీరమునకు జనమేజయుఁడు విభావ మనుటయు (పుట 95) సంతృప్తి నీయలేదు. 'లోకో భిన్నరుచిః.'

చిన్న వయస్సుననే గహనమగు నలంకారమార్గమున చక్కని బాటలు వేసికొనుచు పోయి రసధునీకూలమును చేరి నదీజలముల చిరు అలల గలగలల కలరుచు, సముచిత యశోమలయపవనముల కొదములను వినయనమ్రస్మిత ముఖముతో నందుకొనుచు మూర్తిభవించిన తృప్తివలె గోచరించు చిరంజీవి సుబ్రహ్మణ్యము నా మనస్సునందును వాస్తవిక జీవితమునందును చిరకాలమట్లే వర్ధిల్లుగాక! ఇట్టి యుత్తమ గ్రంథరచనకు దోహద మొసంగిన ఆంధ్రసాహిత్య అకాడమీవారి నభినందింతును.

★

# నివేదనము

తాను ధర్మస్వరూపమై తదితర పురు
షార్థ సాధనమున సహాయమయి యింద్ర
దైవతమయి ఘోర దీప్త్యాత్మకమగు
వీరరస సిద్ధి సాహితిన్ వెలయుఁ గాక !

వీరరసము ఏజాతికైనను జీవభూతమైనట్టిది. అది సాహిత్యమున నిక్షిప్తమైనప్పుడు దానికి ఆత్మరూపమే యనఁదగును. శ్రుతిస్మృతి పురాణేతిహాసములు భారతజాతికి ధర్మప్రబోధక సాహిత్యమనఁదగి యున్నవి. అందు ప్రభుసమ్మితముగ, మిత్రసమ్మితముగ, కాంతాసమ్మితముగ తదుపదేశము గర్భితమై యున్నది. అనఁగా ధర్మోత్సాహాశ్రయమైన వీరరసమే శ్రుతి పురాణ కావ్యాదులలో వాచ్య-గుణీభూత వ్యంగ-వ్యంగ్యరూపమున సాక్షాత్కృతము గావింపఁబడి యున్నదనవచ్చును. సాహిత్యవిషయమున సంస్కృత సాహిత్యపు టడుగుజాడలలో జాలవరకు నడచిన నన్నయ తిక్కనాది ప్రాచీన కవులనుండి సామాన్యముగా నాధునిక కవులవఱకు వీరరస సాహిత్యము ఉపాదేయమేయైనది. అదియే నేటివఱకు తెలుఁగు జాతిలో ధార్మికోత్సాహ జ్యోతిని సముజ్జ్వలముగా నిల్పుకొనుట కాధారమైనది.

ద్రష్టలయిన మహర్షులు తమలోను సర్వజగత్తులోను ఆత్మదర్శనము చేసినట్లు ద్రష్టలయిన మహాకవులు తమలోను కావ్యజగత్తులోను కావ్యాత్మయైన రసదర్శనము గావించు భాగ్యము ప్రప్రథముగ భారతదేశమునకే లభించిన దనవలయును. కావుననే సాహిత్యతత్త్వజ్ఞులు "రసో వై సః" అను శ్రుతిని సాహిత్యపరముగ నన్వయింపఁ గల్గిన సౌదాత్మ్యమును ప్రదర్శింపఁ గల్గినారు! సాధకునికి ఆత్మస్వరూపము సాధ్యమైనట్లు సాధకులగు కవి-సహృదయులకు రసము సాధ్యమని "సాధ్యో హి రసో యథా తథం ఽవిధిః" అని నన్నయ భట్టారకుఁడు నిరూపించియున్నాఁడు—ఈ తత్త్వము వీరరసమను పదమునందే ఇమిడియున్నట్లు నాకు స్ఫురించుచున్నది. ఇందు వీరము సాధనరూపము; రసము సాధ్యము. మానవుఁడు—సహృదయుఁడు—ఉన్నస్థితినుండి పురుషార్థచతుష్టయరూపమైన ఉన్నత స్థితివఱకు పాదప్రక్షేపము చేసి పురోగమనము చేయించు విక్రాంత్యర్థము కలిగినది వీరపదము. అట్టిదానిచేత సాధ్యమైనది రసానందము. ఈ వీరపదము రసపదముతో సమానాధికరణమై సాధనయందు

సాధకుఁ డెదుర్కొను కష్టనిష్ఠురములనుగూడ ఆస్వాద్యములుగఁ జేసి రస ప్రాప్తి పర్యంతము వానినతిక్రమించుశక్తి దానియందున్నట్లు భావింపనగును. ఇంతటి మహార్థ సంచయము వీరరస సాహిత్యమున లభించునని సరళముగాఁ జెప్పవచ్చును. ఈ ప్రక్రియనే ఋషిమార్గమున రసోపాసనము, రససాక్షాత్కారము నని నిర్వచింప వచ్చును. ఈ గ్రంథ నిర్మాణముద్వారమున అట్టి వీరరసోపాసనకు అవకాశము లభించినందుకులకు నా భాగధేయము నభినందించుకొందును.

రసజ్ఞులగు భారతీయ లాక్షణికుల రసదర్శనము చాల విచిత్రమైనది: "అణోరణీయాన్ మహతోమహీయాన్" అని ఋషులుచేయు ఆత్మదర్శనము వలనే 'రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్' అన్నట్లు శబ్దరూపకావ్యము నుండి రామాయణాది మహాకావ్యము వఱకు పరివ్యాప్తముగ రసదర్శనము వారు చేసియుండిరి. కావుననే లక్షణగ్రంథములలో ముక్తక కావ్యమనఁదగు ఒక్క శ్లోకమునందే మహార్థ వ్యంగ్యముగా రసదర్శనము గావింపఁ గల్గిరి. అట్లే ఆ దృష్టి రామాయణమువంటి మహాకావ్యమువఱకును నడచినది. తదనుయాయులైన ఆంధ్ర లాక్షణికులును ఆ మార్గమునే అనుసరించియున్నారు. అదేప్రక్రియ ఈగ్రంథ రచనా సందర్భముననను అనుసరింపఁబడినది.

నన్నయ నుండి నేటివఱకు ఆంధ్రసాహిత్యమున బెక్కు సాహిత్య ప్రక్రియలు వెలిసినవి. వానియందలి వీరరసనోదయోల్లాసములు సంగ్రహింపఁబడి యిందు సంపుటీకరింపఁ బడినవి. అట్లే అంగాంగి భావాపన్నమైన వీరరస స్వరూపము వస్తు రసకావ్యప్రక్రియలలో సందర్శితమై యిందు సాధింపఁబడినది. అనఁగా వీరరస సంబంధముగల యెల్ల తెలుఁగు కావ్యప్రక్రియలును యథాశక్తిగా స్థాలీపులాక న్యాయమున పరామర్శింపఁ బడినవని మనవి !

రసము లన్నింటియందును లౌకిక, కావ్య జీవితములలో నధికవ్యాప్తిని పొందినది వీరరసము. అందువలననే కవులు లాక్షణికులు దీనిని విశాల దృక్పథముతో దర్శించి కావ్య శాస్త్రాదులయందుఁ జేర్కొనిరి. అట్టి అనంత వీరరస విరాడ్రూప దర్శనోత్సుకులైన సహృదయులకు ఈగ్రంథము తత్పాద పల్లవ మాత్ర దర్శనావకాశము గల్పించినను-నా కృషి ఫలించినట్లే.

సంస్కృతమున శృంగారరసముపైఁ బ్రత్యేక గ్రంథములున్నవి. కాని వీరరసముపై లేవు. తెలుఁగున రెండింటియందును సమగ్ర పరిశోధన జరుగ వలసియున్నది. దీనిని గుర్తించి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి యంశ

ముపై గ్రంథరచన మాహ్వానించి, నాకీ సదవకాశము కల్పించిరి. నాకు తెలిసినంతవఱకు ఈ విషయముపై నింతకు పూర్వము ప్రత్యేక గ్రంథ మేదియు లేదు. 'మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో' యనుకొనుచు వ్రాసెడి భాగ్యము నాకబ్బినది. దీని నాదరముతో మన్నించి, బహుకృతి నొసంగి మెచ్చుకొనిన సాహిత్య అకాడమీ వారికి, తత్కార్యదర్శులగు శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారికి. నా కృతజ్ఞతాభివందనములు.

చిన్ననాటినుండియు నాకెల్లు మార్గదర్శకులై యుండిరి—అట్లే ఈ గ్రంథరచనమునందును నాకు వెలుఁగుబాటను చూపించి నడిపించిన మా పెద్దన్న శ్రీ బిదురు వేంకట శేషయ్యగారికి, రచనకుఁ దోడ్పడిన గ్రంథకర్తలకు, అనుక్షణము నన్ను ప్రోత్సహించి, సహాయపడిన మిత్రులు శ్రీయుతులు ఎ. సత్యనారాయణమూర్తి, యం. ఆర్. సత్యనారాయణ, [illegible]. శ్రీ రామచంద్రుఁడు, ఇరివెంటి కృష్ణమూర్తి గారలకు, శిష్యవాత్సల్యముచే నీ గ్రంథమున కమూల్యమగు పీఠిక—స్థాపన—సిద్ధపరచిన అస్మద్గురువర్యులు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారికి, దయతో నా విన్నపము మన్నించి తమ సహృదయాభిప్రాయముల నొసంగిన శ్రీయుతులు డి. సదాశివరెడ్డి, విశ్వనాథ సత్యనారాయణగారలకు, ఈ గ్రంథరచనా ప్రణాళికలో కొన్ని ముఖ్యసూచన లొసంగిన అస్మద్గురువర్యులు డా. దివాకర్ల వేంకటావధాని, డా. బి. రామరాజుగారలకు, ముఖపత్రము చిత్రించి యిచ్చిన మిత్రులు శ్రీ డి. సోమేశ్వరరావుగారికి, శుద్ధ ప్రతులను సిద్ధముచేయుటలో సాయపడిన చిరంజీవులు యం. సరస్వతమ్మ, జి. సత్యనారాయణ, యం. వీరభద్రయ్య ప్రభృతులకు, అత్యంత శ్రద్ధాభిమానములతో నీ గ్రంథమును సర్వాంగముగా ముద్రించి యిచ్చిన 'అజంతా ప్రెస్' అధిపతులు శ్రీనివాస సోదరులకు— నా కృతజ్ఞతా నమస్కారములు.

—గ్రంథకర్త

★

# విషయసూచిక

# 1. రసావతారము

"అనన్తాయ నిరన్తరాయ మహతే జ్ఞానాయ విశ్వాత్మనే
నిత్యాయాక్షతతేజసే సుమహతాం గమ్యాయ వై యోగినామ్
నానాకారవిధాయినేఽప్యవికృతాకారాయ చిత్తాన్తరే
ప్రోన్మీలద్రసరూపిణే భగవతే తస్మై పరస్మైనమః."

## భావము - భాష

చేతనాచేతనరూప మీ జగత్తు. రాశీభూత తమోమూర్తులనఁదగు పర్వత రాజపంక్తుల నిర్భరగాంభీర్యము, ద్రవీభూత కరుణాంతరంగలగు నదీమతల్లుల తరంగరాగములు, ఋతువున కొక్క సింగారము వెలార్చు పుష్పోద్యానవన సుందరుల విలాసములు - మొదలైనవి అచేతనరూప విశ్వసంపద. పిపీలికాది బ్రహ్మపర్యంతమయిన జీవసముదాయము చేతనాత్మక జగదైశ్వర్యము. అనంత సౌందర్య విలసితమగు ప్రకృతి నేపథ్యముగా, దానియందు జీవించు ప్రాణి కోటి పాత్రసముదాయముగా, తత్ప్రాణులు ప్రకటించు చిత్తవృత్తులు రసభావ ములుగా నూహించి భావుకుఁడు లోకము నొక రూపకముగా భావించు కొనుచుండును.

ప్రాక్తన మానవుఁడపూర్వ ప్రకృతి సౌందర్యమునుగాంచి, హృదయ ముప్పొంగ నవ్యక్త మధుర గీతము నాలపించుచు నానంద పారవశ్యములోఁ జిందులు త్రొక్కియుండి యుండును. అతని మధుర గీతాలాపనమే భాషకు శ్రీకారమైనది. అతని యానంద నృత్యమే అభినయమైనది. నిశ్చలమైన యాతని హృదయములోఁ బ్రథమముగా గల్గిన వికారమే భావము.[1] ఆ భావమేయాతనిని సచేతనునిగా నిరూపించినది; సహృదయునిగా భాసింపఁ జేసినది.

మనోవికార రూపమగు భావమే సర్వ జంగమ జగత్ప్రవృత్తికిచిహ్నము. నిర్వాత ప్రశాంత నిశీథిని నిర్మల నిశ్చల సరోవర గర్భమునందు వికస్వర కల్హార హృదయ మకరంద పానమత్తుఁడగు తుమ్మెదద్రిమ్మరిని పదహతినూని సాగు చిఱుతరఁగ వోలె భావ మంతరంగమున జనించి క్రమముగా నాశాంతము నందుకొనును. అల్లరాజు తన 'రసరత్న ప్రదీపిక'లో—బీజము మొలకెత్తుట

1. నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమ విక్రియా.

కున్ముఖమైనప్పుడు దానియం దేర్పడు 'ఆదివికారము' వలె భావము హృదయమున వికార రూపముగా జనించునని తెల్పినాఁడు.[1]

అతఁడే భావోదయ క్రమము నిరూపించుచు హృదయమున వికాస విస్తరక్షోభవిక్షేపములు కించి దుత్థితము లగుటవలన భావ ముత్పన్నమగునని పేర్కొనినాఁడు: "సాచతుర్ధా నిగద్యతే వికాసవిస్తరక్షోభవిక్షేపైః కించి దుత్థితైః" అని. వికాసాదుల వ్యుత్పత్త్యర్థములఁ బట్టి[2] విచారించినచో[3] భావము మొదట వ్యాపించు రూపమున సాక్షాత్కరించి (Manifestation), మనస్సున (ను) విశేషముగా విస్తరించి (కప్పి) (Expansion), కలఁత పట్టి (Agitation), ఎగురవేసినట్లు, విసరివేసినట్లు బహువిధములుగా చిత్తమును ప్రేరేచునని (Distraction) తేలుచున్నది.

లోకస్వభావము నాశ్రయించి భావములు సుఖదుఃఖాత్మకములు. "లౌకిక శోక హర్షాది కారణేభ్యో లౌకిక శోక హర్షాదయో జాయంతే" అని సాహిత్య దర్పణకారుఁడు. పాశ్చాత్య మనస్తత్త్వవేత్తలుకూడ నీ విషయమునే ప్రతిపాదించి యుండిరి. ఉ॥ "This pleasantness—unpleasantness dimension was universally recognized and commonly assumed to be the only scale of feelings"—Wundt.

—Psychology - R.S. Woodworth. Page. 405

"Pleasure and pain are by common consent, the true types of feelings"—Mc. Dangall.

—Outlines of Psychology Ch. XII.

భావము పాలపొంగువంటిది. ఉత్థితమైన చాలును సామాన్యముగా బహిర్గతము కాకపోదు. అట్లగుటకుఁ బ్రధానోపకరణములు వాగంగ విక్షేపాదులు. అంగవిక్షేపమునకు భావబోధకశక్తి కొంత కలదు. భావ ప్రకటనావసరమున మానవుఁడు తనకు నైజమైన సహజావబోధము (Natural Instinct) వలన తన కనుగుణమైన ఆకార చేష్టాదుల నొనరించుట

1. "చిత్తస్య వికృతిః సత్త్వం వికృతేః కారణేసతి
తత్రోల్లాస్య వికృతిర్యావో బీజస్యాది వికారవత్"

2. వికాసము = వికసతి విస్తారం ప్రాప్నోతీతి వికసితః – కసగతౌ – వికసించునది; విస్తారమును పొందునది.

విస్తరము = విస్తారో విగ్రహో వ్యాసః – అమరము. విస్తృతిర్విస్తారః స్తృఞ్ ఆచ్ఛాదనే – విశేషముగా కప్పునది; క్షోభమన విశేషముగా కలఁత పడుట; విక్షేపణమన ఎగురవేయుట, విసరివేయుట, విశేషముగా పేరేపించుట.

లోకమునందుఁ గాంచుచున్నాము. అట్టి వానిలో సంకేతరూపములగు చేష్టా దుల వలన గొన్ని నియమిత భావములు ప్రకటితములగుటయు, వాని నితరులు గ్రహించుటయు గలదు. అంగవిక్షేపాత్మకమైన భావ ప్రకటనము లోకమందంతటను ఒకే రూపమున సాగుచున్నది. మనోభావబోధక క్రియారూపమగు (Expressive movements) నా సంజ్ఞలు సహజావబోధన కక్ష్యను దాటి జ్ఞానవంతుఁడగు మానవుని సంశ్లిష్ట విశేష భావములను బ్రకటింప సమర్థములు కావు. ఆ వెల్తినిఁ బూర్తిచేసికొనుటకై మానవుఁడు భాషను సృజించుకొనవలసిన అవసర మేర్పడినది హృదయగత భావములను వ్యక్తము సేయు నర్థ ప్రధానములగు పదవాక్య సముదాయము భాష. అది వాగ్లేఖన భేదముచే ద్వివిధము. ఒక విధముగా నాంగిక విక్షేప ద్వారమున భావ ప్రకటనము చేయుట చేష్టా సంజ్ఞాత్మకమైన భాష యనవచ్చును (Gesture language). దాని స్వరూప నిరూపణముఁ జేయుచు Richard P. Blackmur "Language as Gesture" అను వ్యాసమున నిట్లు నుడివియున్నాఁడు. "Gesture, in language is the outward and dramatic play of inward and imaged meaning It is that play of meaningfull ness among words which cannot be defined in the formulas in the dictionary, but which is defined in their use together; gesture is that meaningfulness which is moving, in every sense of that word; what moves the words and what moves us."[1]

చేష్టాత్మకమైన భాషయందు సమర్థములగు భావములు కొన్ని ప్రకటితము లగును. ఉ. అభిజ్ఞాన శాకుంతలము నందలి—

> "దర్భాంకురేణ చరణః క్షత ఇత్యకాండే
> తన్వీ స్థితా కతిచిదేవ పదాని గత్వా"
> ఆసీ ద్వివృత్త వదనా చ విమోచయన్తీ
> శాఖాసు వల్కల మసక్తమపి ద్రుమాణామ్."

అను శ్లోకమునఁ గాళిదాసు శకుంతల చేష్టలను వర్ణించి వానివలన 'కామ' భావమును వ్యంగ్యముగా వ్యక్తమొనర్చినాఁడు. శకుంతలఁ గాంచిన దుష్యంతుఁడు—"మిథః ప్రస్థానే పునఃశాలీనతయాఽపి కామమావిష్కృతో భావ

1. Literary Criticism in America. Edited by Albert D. Van Nostrand— Page 315.

స్తత్ర భవత్యా" అని వ్యాఖ్యానించినాఁడు. అనఁగా నాయికా భావము ఎదుటి వానికిఁ బండొలిచి చేతికిచ్చినట్లర్థమైనదని దాని తాత్పర్యము.

కాని దుష్యంతుఁడు శకుంతలను వర్ణించుచు—

"అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహైః
అనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదిత రసం
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూపమనఘం
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః."

అని అన్న వాక్యములలోఁగూడ నాయికా హృదయగత రాగభావావిష్కారము జరిగినది. కాని యిది అంగ విక్షేపమాత్రముననే వ్యక్తీకరింపబడజాలదు. ఇచ్చట వ్యక్తము సేయవలసిన వ్యంగ్య సంశ్లిష్ట భావము లెన్నియో గలవు. ఇందు భావము శబ్దార్థ వ్యంగ్యమైనది. అచ్చట భావము చేష్టాత్మక భాషా వ్యంగ్యమైనది. ఇట్టి పట్టులందు చేష్టా సంజ్ఞాత్మక భాష విఫలమైపోవును. అంతియు గాక భావగ్రహీత ప్రకాశకునిఁ గట్టెదుట నుండి యనూహ్యాన చిత్తముతో గమనించినగాని ఆ భాష అర్థముగాదు. అంతేను ఎట్టి విచ్ఛిత్తి చెంచలనుగాని, ఎట్టి యవరోధము గాని యేర్పడినచో భావగ్రహణావకాశమే యేర్పడదు. అందువలననే నాట్యమునుగాంచు ప్రేక్షకుల నుద్దేశించి భరతరస ప్రకరణమున—

"యతో హస్త స్తతో దృష్టి ర్యతో దృష్టి స్తతో మనః
యతో మన స్తతో భావో యతో భావ స్తతో రసః.

అని తెల్పఁబడి యున్నది.

చేష్టా సంజ్ఞాత్మక భాష విఫలమైనప్పుడు వాగ్రూపమైన భాషయే భావ ప్రకటనమునకు శరణ్యము. ఇందు భావములకు రూపమిచ్చునవి శబ్దార్థములు. శబ్దార్థముల సంబంధము నిత్యము. కాళిదాసు వాని స్వరూపము నర్ధనారీశ్వరునిగా భావించినాఁడు. అర్థవంతమగు వాగ్రూప భాషానిర్మాణ గౌరవము మానవునికే లభించుచున్నది. పశుపక్ష్యాదులు సహజావబోధములగు సంగీతరవములతోపాటు భావావేశముతోఁ గొన్ని శబ్దములు చేయుచున్నను సమర్థమగు భావ ప్రకటనము వాని వలన జరుగుటలేదు. కావుననే భాష వలన మానవుఁ డితర జంతువులకన్న శ్రేష్ఠుఁ డగుచున్నాఁడు. అతఁడు తరతరాలుగాఁ దన భావావేశములను ప్రదర్శించుచు భాష నొక కళగా తీర్చి దిద్ది పోషించినాఁడని భాషాశాస్త్రవేత్తలు భావింతురు.[1]

---

1. "Language is the most massive and inclusive art we know, a mountainous and anonymous work of unconscious generations" —Edward Sapir, "Language" P. 220.

## మానవుని వ్యక్తిత్వము

భావ ప్రధానుఁడైన మానవున కొక వ్యక్తిత్వము గలదు. తత్త్వవేత్త లా వ్యక్తిత్వము నిట్లు వివరింతురు: మానవుఁడు మన శ్శరీరాదులచే పరివృతుఁడైన ఆత్మస్వరూపుఁడు. 'ఆత్మైవాఽనందః' అను శ్రుతి వలన నాతఁ డానంద రూపుఁడు. ప్రకృతిచ్ఛన్నతచేత స్వానందమును మఱచి ప్రకృతి కధీనుఁడై జీవ రూపమున వ్యవహరించుచున్నాఁడు. ప్రకృతి త్రిగుణస్వరూపముగలది. ప్రకృతి అంతర్గతముగా నతని ఆత్మను ఆవరించుటయేగాక బహిర్గతమై జగద్రూపమున భాసిల్లుచున్నది. ఆత్మ వ్యాపకరూపముతో గ్రహింపఁబడి 'బ్రహ్మ' యనఁబడినది. 'సర్వం బ్రహ్మమయం జగత్' అను శ్రుతిచే సర్వ జగత్తును తద్రూపముగనే యున్నది. 'బ్రహ్మైవానందః' అను శ్రుతిచే జగత్తు తనకంటె అభిన్నమై ఆనందరూపమున గోచరించి, దుఃఖస్పర్శ లేకుండుటయే మానవుని జీవిత పరమార్థమని తాత్పర్యమగుచున్నది.

మానవుఁడు స్థూల సూక్ష్మ శరీర విశిష్టుఁడు. అతని స్థూల శరీరము సప్తధాతుమయమైనది. సూక్ష్మ శరీరము ప్రాణేంద్రియమనోబుద్ధి సంయుతమై ఆత్మాశ్రయమైయుండు బుద్ధియందు ప్రతిబింబించుచు ఆత్మరూపమే జీవుఁ డనఁబడి వ్యవహారమున బిలువఁబడు చున్నది.

"జీవుఁడు (సూక్ష్మ శరీరి) స్థూల శరీరమును గ్రహించి స్త్రీ గర్భము నుండి బయటఁ బడుటయే జననమనియు, దానిని త్యజించుటయే మరణ మనియు అనఁబడును. అనాదినుండి చూచిన యెడల మానవుఁడు స్థూల శరీర దృష్టితో ననేక జనన మరణములను గడచి యున్నాఁడు. మనశ్శరీరి, మనస్వి యగు మానవుని మనస్సు ప్రకృతి రూపము. అదియే జ్ఞానము, అదియే క్రియ, అదే ఇచ్ఛ, అదియే సర్వము'[1] అని యనబడుటచే అది జ్ఞానేచ్ఛాక్రియాత్మక మగుటయేగాక సర్వము నటయె యని శ్రుతి నిరూపించుచున్నది. మనస్సు ఇంద్రియములకు ప్రేరకమై జ్ఞానేంద్రియములద్వారా విషయగ్రహణముచేయుచు, కర్మేంద్రియముల ద్వారా స్థూల శరీరమును సాధనముగాఁ జేసికొని కర్మాచరణమునకుఁగడఁగును."[2] మనస్సు స్వతస్సిద్ధముగా శక్తిమయము. అందు ఇంద్రియ జ్ఞానమువలనఁ గలుగు వికృతి-లేక స్పందనము-వృత్తి యని పేర్కొనఁబడును.

---

1. 'మనః ప్రకృతి రిత్యుక్తం । మనోజ్ఞానం మనః క్రియా । మన ఇచ్ఛా మనస్సర్వం'
—ఉపనిషత్తు.

2. కావ్యకళాతత్త్వప్రకాశిక - శ్రీ బిదురు వేంకటశేషయ్యగారు. పుట ౬.

భావోత్థానస్థితియే వృత్తి. అట్లగుటచే జ్ఞానేచ్ఛాక్రియాత్మకమైన మనశ్శక్తి స్పందించినచో జ్ఞానేచ్ఛాక్రియాత్మకవృత్తిత్రయరూపముగాఁ బరిణమించును. అది వాగంగాభినయాదుల వలన బహిర్గతమగును.

జ్ఞానేచ్ఛాక్రియావృత్తులలో జ్ఞానవృత్తిలోని శక్తి మనస్సనియు బుద్ధియనియు లభించుచున్నది. వ్యావహారికదృష్టిలో మనోబుద్ధు లొక్కటియే. కాని సూక్ష్మముగాఁ గాంచినచో కొంత భేదము గలదు. బాహ్యేంద్రియసంగతవృత్తి మాత్రము సంబంధించిన జ్ఞానశక్తి మనస్సును, ఇటు మానసికమైనట్టియు, అటు ఆత్మసంబంధమైనట్టియు జ్ఞానశక్తి బుద్ధిని కూడియుండును. బాహ్యేంద్రియముల వలన జ్ఞానము కలుగును. అది మనస్సునఁ బ్రతిఫలించును. సంశయాకార రూపములగు భావములు చంచలములు. వానిపై నిశ్చయజ్ఞానరూపమైన స్థిర భావము బుద్ధిగతము.[1]

ఇచ్ఛావృత్తి కర్మేంద్రియాశ్రయమై బహిర్గతమగును. భావము కామ నిష్పన్నమని భరతాచార్యులు. కామము ఇచ్ఛా సంపన్నము.

"ప్రాయేణ సర్వభావానాం కామాన్నిష్పత్తి రిష్యతే
సచేచ్ఛాగుణసంపన్నో బహుధా పరికల్పితః
ధర్మకామ స్త్వర్థకామో మోక్షకామ స్తథైవచ
సర్వః ప్రాయేణ లోకోఽయం సుఖమిచ్ఛతి సర్వదా."

(నా. శా. 22 అధ్యా. )

అను భరతుని పల్కులఁబట్టి పురుషార్థములగు ధర్మార్థకామమోక్షములయొక సర్వభావములును బహుధాపరికల్పితములైన రూపములను ధరించి ఇచ్ఛాగుణ సంపన్నమగు కామమునుండి నిష్పన్నములని ధ్రువపడినది. ఈ కామము ఇచ్ఛా వృత్త్యాత్మకమగు మనోభావము. క్రియావృత్తి కర్మేంద్రియ చేష్టారూపమున గోచరమగును. తత్కర్మవిశేషముచే కామము సఫలమగును. తదనుభవ విశేషము మనస్సున జ్ఞానరూపమున నిలిచి 'సంస్కార'మై బుద్ధియందు స్థిరరూపముఁ దాల్చును. ఇట్టివానినే 'వాసన' లని పేర్కొందురు. బుద్ధి ఆత్మసంబంధయగుటచే వాసన లాత్మ నాశ్రయించును. జీవుఁడు బహుజన్మల యాత్రఁ జేయు బాటసారి యగుటచే నాత్మ నాశ్రయించియున్న వాసనల తోడనే స్థూలదేహములందుఁ బ్రవేశించి నిలచును. ఇవియే జన్మాంతరవాసన లనఁబడును.

---

1. "నిశ్చయాత్మికా బుద్ధిః, సంకల్పవికల్పాత్మకం మనః".
2. జని సంహారబహుప్రయాణమగు సంసారంపుద్రోవ న్పరా
చనుచుండు స్వనమోహఖేదములమ న్సంసారి పాంథుండు, వా

ఆత్మనుండి ఇంద్రియముల, వఱుసఁగల పూర్వాపర స్థానములు తెల్పుచు భగవద్గీతాకారుఁడు ;

"ఇంద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః." (తృ. అ. 42 శ్లో)

అని తెల్పినాఁడు. భోజుఁడు వాసనలు రెండు విధములుగా నిరూపించెను. "ద్వివిధాః వాసనాః ; స్మృతిఫలా జాత్యాయుర్భోగ ఫలాశ్చ జాతనేయుర్భోగ ఫలా ఏకానేక జన్మభవా ఇతి పూర్వమేవకృత తన్నిశ్చయాః యాస్తుస్మృతి మాత్ర ఫలస్వతః కర్మణోఽన్యాదృక్శరీర మారబ్ధం దేవమానుషతిర్యగాది భేదం తస్య అనుగుణానురూపవాసనా స్తాసామేవ తస్మా దభివ్యక్తి ర్వాసనానాం భవతి" (అ. శా. వ్యాఖ్య, రాఘవభట్టు). కాళిదాసీ తత్త్వమును అభిజ్ఞాన శాకుంతలమున—

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీ భవతి యత్సుఖితోపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వమ్
భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

అను శ్లోకమునఁ జక్కఁగాఁ బ్రదర్శించి యున్నాఁడు.

ఆంధ్ర లాక్షణికు లీ విషయమున నిట్లు వ్రాసియుండిరి.

కం॥ బహిరర్థాలంబనమై
విహరించు మనోవికార విలసితము సుమీ
విహితమగు భావమన; నది
మహి విజ్ఞానంబునా సుమతులం బరఁగున్.

కం. ఘనవిజ్ఞానం బాత్మకు
మనసునసే కలుగు నట్టి మనసున కబ్బున్
గన దింద్రియముల చేతన్
వినఁగా వీనులకు నొదవు విషయప్రాప్తిన్."

—కావ్యాలంకార చూడామణి—విన్నకోట పెద్దన ప్ర. ఉ. ప. 18, 19

సీ. రమణ మనోవికారము బహిర్వ్యాప్తమై
భాసిల్లునదిసుమీ భావమనఁగ ;

---

సనలన్ ధూళిముసుంగు గాఁగ; నెపుడేన్ జ్ఞానంపుటుష్ణోదకం
బునఁ దత్క్షాళనసేయు, వాని కపు డమ్మోహాశ్రమంబు ల్లనున్"
ఆముక్తమా. ఆ. 8; ప. 70

కావ్యమునఁ బ్రతిబింబించుచుండును. పురాజన్మసుకృతఫలముగా ప్రతిభను కలిగి, లోకాద్యవేక్షణమువలనను, కావ్యశాస్త్రాదుల పఠనమువలనను వ్యుత్పత్తి గడించి వానిని కావ్యమునందు రసవత్తరముగాఁ బ్రదర్శించును కవి.

ప్రాచీనులు 'కవిర్మనీషీ పరిభూః స్వయంభూః" అని ఈశ్వరునిగనే కవిని గీర్తించిరి. భూతభవిష్యద్వర్తమాన పరిస్థితులను సక్రమముగా నెఱుఁగు నేర్పాతని కుండుట చే 'క్రాంత దర్శీ కవిః' యనిరి. క్రాంతదర్శియైనవాఁడు ఋషి. 'నానృషిః కురుతే కావ్య' మ్మనుటచే ఋషి కానివాఁడు కవి కాజాలఁడు. 'ఋషీశ్చ మంత్రద్రష్టా' యనుట వలన ఋషి లౌకికాలౌకిక వస్తువులను స్వయముగ దర్శించువాడగుచున్నాఁడు. కవి ఋషియనుటచే నాతఁడు తొలుత ద్రష్టయై పిమ్మట స్రష్టయగుచున్నాఁడు. కావున అతని కావ్యము లోకాతీతమును, అనితరసాధ్యము నగు వస్తు సంపత్తికి ప్రతిబింబమై యలరారు చుండును. భట్టతౌతుఁడు కవి నిట్లు నిరూపించినాఁడు :

> ''నానృషిః కవిరిత్యుక్త మృషిశ్చ కిల దర్శనాత్
> విచిత్రభావ ధర్మాంశ తత్త్వ ప్రఖ్యాచ దర్శనం
> స తత్త్వ దర్శనాదేవ శాస్త్రేషు పఠితః కవిః
> దర్శనా ద్వర్ణనాచ్చాథ రూఢాలోకేకవిశ్రుతిః
> తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యేప్యాదికవేర్మునేః
> నోదితా కవితాలోకే యావజ్జాతానవర్ణనా.''
>
> —హేమచంద్రుని కావ్యానుశాసనమునుండి

కావ్యములు ప్రధానముగా రెండు విధములు: దృశ్య శ్రవ్య కావ్యము లని. చక్షురింద్రియ ప్రధానముగా కావ్యార్థములు మనస్సుచే గ్రహింపఁబడుట కనువైనది దృశ్యకావ్యము. శ్రోత్రేంద్రియములచే గ్రహింపఁబడు కావ్యార్థములు కల్గినది శ్రవ్యకావ్యము. ఒకటి దర్శనయోగ్యము, రెండవది శ్రవణయోగ్యము. అనఁగా వాగంగసత్త్వాభినయాత్మకమైనది దృశ్యము ; శబ్దార్థ ప్రధానము వర్ణనాత్మకము నైనది శ్రవ్యము.

అపారమగు కావ్యసంసారమున కవియే ప్రజాపతి. రమణీయార్థ ప్రతిపాదకశబ్దముల నెన్నుకొని, రసాత్మకమైన వాక్యసముదాయముతో వ్యంగ్యార్థ ప్రధానమైన కావ్యముల నాతఁడు సృజించును. "నహి రసాదృతే కశ్చి దర్థః ప్రవర్తతే" అట్టి రసము నాయకాశ్రయము. 'రసస్తు కథానాయకా శ్రయః' (ధ్వన్యాలోకము). రసము సామాజికులచే నాస్వాదితము. ధీరుఁడును, ఉదాత్తుఁడును, ఉత్తముడునైన నాయకుని జీవితమే కావ్యమున కితివృత్తము. అట్టి

[illegible]ను నిర్మింపవలెనను ఇచ్ఛావృత్తి కవిని ప్రేరేపింపగా నాతఁడు వాసనా బలమున జ్ఞానశక్తితో విభావాదులయందు తాదాత్మ్యము [illegible] [illegible] మనోగత భావములను కావ్యగత శబ్దార్థముల ద్వారమున కావ్యరూపమున బహిర్గత మొనర్చును. ఆ కావ్యము నందలి బహిరర్థములను సామాజికుఁ డింద్రియ ముల ద్వారమున మనస్సున గ్రహించి, [illegible] భావములను విమర్శించి, వానిలో తాదాత్మ్యమును పొంది, [illegible] రసానందము పొందగలుగుచున్నాఁడు. దృశ్యకావ్యమున కవి [illegible] భావముల నెఱింగి నటుఁడు రామాదులవలె [illegible] విభావాదులఁ బ్రకటింప వానిని జ్ఞానేంద్రియముల ద్వారమున గ్రహించి వాస నాత్మకమగు 'స్థాయిభావము' వలన సామాజికుఁడు రసానందమును పొందు చున్నాఁడు.

జ్ఞానేచ్ఛాక్రియావృత్త్యాత్మకత సమగ్రమైన మానవజీవనమునకు మూల భూతము. అట్టిదియె నాయకునియందు గోచరించును. ఆ వృత్తిత్రయమున కావ్యరచనావేశముగల కవియందు ఇచ్ఛావృత్తి ప్రాధాన్యము వహించును. అందులకై యాతఁడు సంపాదించిన విజ్ఞానమంతయు జ్ఞానవృత్తిరూపమునఁ బూర్వరంగముగా భాసిల్లును. కేవల లేఖనరూపమగు క్రియావృత్తి గోచ రించును. అట్లే నటునియందు మనోహరమైన నటనారూపమైన క్రియావృత్తికి ప్రాధా న్యము కలదు. తత్పూర్వరంగముగా నాయకస్వభావపరిజ్ఞానము తాదా త్మ్యము మొదలగు వానిచే జ్ఞానవృత్తియు, అభినయనైపుణ్యవిషయమగు నిచ్ఛావృత్తియు తదంగములుగా నుండును. సామాజికుల విషయమున వాని వ్యావహారికమైన ఇచ్ఛాక్రియావృత్తుల సమాశ్రయము సగ్గి అం దిచ్ఛావృత్తి కావ్యశ్రవణ దర్శనేచ్ఛామాత్రరూపమునను, క్రియావృత్తి శ్రవణదర్శనేంద్రియ మాత్రప్రవృత్తిరూపమునను ఉండును. ఇది కవి నాయకాదులయందు గోచ రించు జ్ఞానాదివృత్తి వివేకము.

కావ్యము లోక ప్రవృత్తినుండియే జనించును. కవి తనచుట్టుగల మానవ చర్యలయందలి ప్రీతియు, వాస్తవ ప్రపంచమునందును భావనా ప్రపంచము నందును గల యభిరుచియు, తన భావములను లోకమునకు జెప్పవలెనని కోరికయు, కావ్యమునందు వ్యక్తీకరించుచు వర్ణించి చెప్పును. కావున కవిత్వ మునకుఁ బ్రాతిపదిక భావమే యగుచున్నది. దీనినే సబర్ క్రాంబీ మొదలగు పాశ్చాత్య విమర్శకు లిట్లనిరి : **"The Poet first derives an inspiration**

from the world by the power of his imagination; the art of Poetry then imitates this imaginative inspiration in language."

"Poetry is simply the most delightful and perfect form of utterance that human words can reach." "For Poetry idea is every thing; the rest is a world of illusion, of divine illusion. Poetry attaches its emotion to the idea; the idea is the fact."

—Matthew Arnold.

లోకవృత్తికి సంబంధించిన భావము లౌకికభావము. ఇది మానవునకు సుఖ దుఃఖములను కల్గించును. కావ్యమునందు ప్రతిపాదితమై లోకవృత్తికి సంబంధించినభావము అలౌకికము అది సామాజికునకు రసానందము కల్గించును.

భావలక్షణము

భావములని యనుట యెందులకు? ఉద్భవించుటవలన భావములయ్యెనా? లేక భావింపఁ జేయుటవలన భావము లయ్యెనా? అని విచారించుచు భరత మహార్షి :

"వాగంగ సత్త్వోపేతా న్కావ్యార్థా న్భావయ న్తీతి భావా ఇతి. భూ ఇతి కరణే ధాతుః తథా చ భావితం వాసితం కృత మిత్యనర్థాంతరమ్. లోకేఽపి చ సిద్ధమహో హ్యనేన గన్ధేన రసేన వా సర్వమేవ భావిత మితి - తచ్చ వ్యాప్త్యర్థమ్" అని పేర్కొనెను.

లోకము సుఖ దుఃఖాత్మకము గాన నట్టి భావములే కావ్యమునందు ప్రపంచిత మగుచుండును. అట్టి సుఖ దుఃఖాత్మకములగు (కావ్యార్థ) భావములను గ్రహించి, వివేచనాత్మక జ్ఞానవృత్తిలో సుఖ నిర్వేద రూపముగా సామాజికుఁడు హృదయమునందు (అనుభవించును) భావించును.[1] (చర్వణము లేదా సంవేదనముచేయును). అట్లు హృదయ సంవాదియగు నర్థభావనమే రసోద్భవ హేతువు. ఆస్వాదయోగ్యమగు తదర్థమె శుష్కమైన కాష్ఠమందు అగ్నివలె శరీరమునంతటను వ్యాపించును.[2] ఇదియే 'వాసితమన్న' భావలక్షణ తాత్ప

1. 'సుఖదుఃఖాదికైర్భావైర్భావస్తద్భావ భావనమ్'

—దశ. రూ. ప్ర' 4; శ్లో. 4.

2. "యోఽర్థో హృదయ సంవాదీ తస్య భావో రసోద్భవః।
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠమి వాగ్నినా॥"

—భ. నా. శా. 7 అ. శ్లో 7.

"రసానుకూలో వికారో భావః" —రసతరంగిణీకర్త.

"భావయన్తి స్వాత్మానం లౌకిక దశాయాం అనాస్వాద్యమపి ఆస్వాద్యం కుర్వన్తి యద్వా భావయన్తి వ్యాప్నువంతి సామాజికానాం మనః ఇతి భావాః" —కావ్యానుశాసనకర్త.

"బాహ్యార్థాలంబనోయస్తు వికారో మానసో భవేత్
సభావః కథ్యతే సిద్ధిః తస్యోత్కర్షో రసః స్మృతః" —భావప్రకాశనకర్త.

కావ్యకళా తత్త్వ ప్రకాశికాకర్త భావశబ్ద నిష్పత్తిని గూర్చి లాక్షణికుల నిర్వచన, శబ్దకోశముల[1] సహాయముతో చర్చించి "భావము సత్తాత్మకమైన మనస్థితి యనియు, జ్ఞానేచ్ఛా క్రియా వృత్త్యాత్మక 'మనో విక్రియా' రూప మనియు, ఆత్మవాసనలచే భావిత(వాసిత)మై యున్న వస్తురూప మనియు, అందుచే నది బహిర్గోచరమై గ్రహీతల కుపదేశాత్మకమై యుండునట్టి దనియు, అది బహిర్గోచరము కానప్పుడు సత్తాత్మకము గనుక, వాసనారూపమై మనః క్షేత్రమున నిల్చి పొల్చుచు, అవసరమును బట్టి వ్యాపకమై ప్రసరింపఁ గల్గునట్టి దనియు, ఎప్పటికప్పు డేదోయొక యుద్దేశముతో నేర్పడుచుండునట్టి దనియు, 'వికారము గనుక'[2] వివిధముగా— చంచలముగా— పురోగమనాత్మకముగా, కొంచెము కొంచెముగా, శుద్ధాశుద్ధముగా, చేయఁబడునట్టిది యనియు తద్భావాత్వర్థ గర్భితాశయముల నన్నింటిని గుదిగ్రుచ్చి విచారించి 'భావ స్వరూపము' ను నిర్ణయించినారు.

సుఖదములు గాని, తదితరములైనవి గాని అగు భావములలో నేదానిచేతనైన నావిష్టుఁడైన వ్యక్తి తదాహిత సంస్కారములు కలవాఁడై, తద్భావ మయముగనే చూచును.[3] దీనినే రసభావ తాదాత్మ్య మనవచ్చును.

## విభావములు

ఒక కార్యము జరిగెనన దానికొక కారణము (హేతువు; నిమిత్తము) ఉండితీరును. అట్లే భావోత్పత్తికిని ఒక కారణముండి యుండవలెను. వెనుక

---

1. భూసత్తా; అవకల్కనం (మిశ్రీకరణము) చిన్తన మిత్యన్తే; ప్రాప్తి.
ఆప్టే: భావ: State of mind, meaning; purpose or intention, mind, soul, movement gesture, thing or substance, advice, instruction; భూ: to be born or produced, to be, to mix, to think, to obtain; భావన = Mental perception, recollection, imagination; భావిత = Pervaded by; animated, inspired.

2. ఆప్టే: వి–Variety, motion, progress;—ఈ పదర్థము, చాంచల్యము నానార్థ: మోహాము, సంశుద్ధి మొ. నవి.

3. "యోయేన భావే నోద్దిష్టః సుఖదే నేతరేణవా
సతదాహిత సంస్కారః సర్వంపశ్యతి తన్మయం"—భ. నా. శా. 25 అ. శ్లో. 38

భావము నిర్వచింపఁబడునప్పు డది విభావములచే సామాన్యమైన కావ్యార్థ ములను భావింపఁజేయునది యని తెలుపఁబడినది. అట్లగుటచే భావవ్యక్తి హేతువులు విభావములని తేలుచున్నది. అనుభావము లా భావములను గమ్యమాన ములుగా నొనర్చును.

'భావ్యతే' అను క్రియకు మిశ్రీక్రియతే అను వ్యుత్పత్త్యర్థము కలదు. "విభావానుభావసంయుక్తా భావాః" అను భరతోక్తి ప్రకారము విభావాను భావ సంయోగముచే మిశ్రరూపముగా నేర్పడునది భావమని భావింపవచ్చును. అనఁగా భావమునకు స్వతంత్రాభివ్యక్తి లేదనియు, విభావానుభావాశ్రయ మనియు దీనివలన తేలుచున్నది.

విభావమునకు కారణము, నిమిత్తము, హేతువు అనునవి పర్యాయ పదములు. విభావితమనఁగా విజ్ఞాతమని అర్థాంతరము. అనఁగా విశిష్ట జ్ఞాన హేతువని భావము. దీనివలన వాచికాంగిక సాత్త్వికాభినయాశ్రయములగు పెక్కు అర్థములు విభావ్యములగును. (విశిష్టముగాఁ దెలిసికొనఁబడును).[1] కావున విభావము చిత్తవృత్త్యుద్భవ హేతుకమైన విషయమని గ్రహింప వచ్చును.[2]

శ్రవ్యకావ్యమునందు విభావానుభావ రూప వర్ణనాత్మకమైన శబ్దార్థ ములు కూర్పఁబడియుండును. శ్రోత తదర్థములను విశిష్టముగా నింద్రియ ముఖమున గ్రహించి, వానిని హృదయమున భావించి, బుద్ధియందు వానిని సాక్షాత్కరింపఁ జేసికొని, అందు తాదాత్మ్యమును పొంది తదనుభూతిని గాంచును.[3] దృశ్యకావ్యమునందు సామాజికుఁడు వాగంగసాత్త్వికాభినయ ముచే కావ్యార్థములను గమ్యమానము చేయు నాయికా నాయకాదులతో సాధారణీకరణ రూపమగు తాదాత్మ్యమును పొంది, తద్భావ భావనమువలన

---

1. విభావః కరణం నిమిత్తం హేతురితి పర్యాయాః । విభావ్యతేఽనేన వాగంగసత్త్వాభి నయ ఇతి విభావః । తథా విభావితం విజ్ఞాత మిత్యనర్థాంతరమ్.
బహవోఽర్థా విభావ్యన్తే వాగంగాభినయాశ్రయాః
అనేన యస్మాత్తేనాయం విభావ ఇతి సంజ్ఞితః"
—భ. నా. శా. 7 అ. 6 శ్లో.

2. "చిత్తవృత్త్యుద్భవహేతుః విషయః విభావ శబ్దస్యార్థః ఇతి జ్ఞాతమ్"
—అభినవభారతి వ్యాఖ్య.

3. "శబ్దోపహిత రూపాంస్తాన్ బుద్ధే ర్విషయతాంగతాన్ ।
ప్రత్యక్షానివ కంసాదీన్ సాధనత్వే న మన్యతే".
—భర్తృహరి. వాక్యపదీయము. 3-3-5

భావానుభూతిని పొందును.[1] నటుఁడు కావ్యార్థములను భావించి కావ్యగత నాయకాభేద రూపమున భావములను వ్యక్తీకరించు కవి యొక్క మనోగత భావములను విశిష్టముగాఁ దెలిసికొని, వానిని ప్రత్యక్షీకరించుకొని, బుద్ధికి విషయములుగా నొనర్చి, వారిలో తాదాత్మ్యమును పొంది, తదర్థములను వాగంగ సాత్త్వికాభినయముల ద్వారమున ప్రేక్షకులయందు విభావ్యము లగునట్లుగాఁ బ్రపంచించును.

అభినయము ఆంగికవాచికాహార్య సాత్త్విక భేదముచే నాల్గు విధములు. కావ్యార్థములను సామాజిక హృదయములకు అందఁజేయును కావున అభినయమున కా పేరు వచ్చినది. నటులు ఇంద్రియ పాటవముకలవారు కావున చతుర్విధాభినయమున కావ్యార్థములను వ్యక్తపరుచుచున్నారు. కాగా నొక పాత్రగతమైన భావమును సంపూర్ణముగాఁ దెలిసికొనుటకు తోడ్పడు విషయములు రెండు. అవి తదవస్థ, తత్పరిసరములు అని. ఈ రెండును నటునిచే విభావితమైన భావము నుద్దీపింపఁ జేయును. ఉదాహరణమునకు నాయికానాయకు లొకరియం దొకరు 'రతి' భావమును వ్యక్తపరచుచున్నా రనుకొందము. తద్భావోద్దీపనము - వారుండు పరిసరములపైనను, వారి శరీరాద్యవస్థల పైనను ఆధారపడి యుండును. చంద్రమలయానిలోద్యానవనాది పరిసరములు, పూర్ణయౌవన సౌందర్యాది కాలావస్థలు అప్పటి వారి భావమును పోషించి యుత్తేజిత మొనర్చును. తద్ద్వారమున కావ్యార్థము విశేషముగా బోధపడును. భరతుఁ డందువలననే నాయకాదులతోపాటు- "రతిర్నామ ప్రమోదాత్మికా ఋతు-మాల్యానులేపనాభరణభోజనవరభవనానుభవ - నా ప్రతికూల్యాదిభిః విభావైః సముత్పద్యతే" అని పేర్కొని యున్నాఁడు. ఈ దృష్టితో భరతుని తరువాత ధనికాదులగు లాక్షణికులు విభావములలో నాలంబనోద్దీపన భేద మొనర్చి ప్రపంచించుట మొదలిడినారు. నాయికానాయకు లాలంబన విభావములు, మలయానిలాదు లుద్దీపన విభావములు.

> "జ్ఞాయమానతయా తత్ర విభావో భావపోషకృత్
> ఆలంబనోద్దీపనత్వ ప్రభేదేన స చ ద్విధా. దశరూ. 4 ప్ర. 2 శ్లో.

శృంగారతిలకమునందు ఉద్దీపనవిభావములు గుణచేష్టాలంకరణ తటస్థ భేదములచే చతుర్విధమని వివక్షింపఁబడినది. అందు రూపయౌవనాదులు గుణ

1 "విభావ్యన్తే ఆస్వాదాంకురణ ప్రాదుర్భావయోగ్యాః క్రియన్తే సామాజిక రత్యాది భావాః ఏభిః".

అనుకూలమైనట్టిదై, క్రమబద్ధముగా వ్యవహరించుచు, (వివిధ) భావములలో (ప్రతి) భావమునకు సామాన్యముగ నుండుచు వ్యంగ్యమగు భావదృష్టితో వ్యంజకమగు తా నప్రధానమే యైనను భావమంత ఆయామము కలదై, మాటిమాటికిని—'సూత్రేమణిగణా ఇవ'— భావము తనయం దనుస్యూతపఱుచు కొని, భావముతోఁ గూడ వర్తించుచు, వాగాది చతుర్విధాభినయ రూపమున ప్రకాశించునట్టిది అనుభావమని యేర్పడుచున్నది."[1]

అనుభావములు కాయిక మానసికాహార్య సాత్త్విక భేదమున చతుర్విధములు. లోకస్వభావ సంసిద్ధత, శరీరమునుండి పుట్టుట, భావసంసూచనాత్మకత, భ్రూవిక్షేప కటాక్షాదులవలన సామాజికులకు అనుభావ్యము చేయుట మొదలగునవి అనుభావలక్షణములు. భ్రూవిక్షేప కటాక్షాదు లనుభావములని లాక్షణికులు. అనుభావస్వరూప లక్షణాదుల గూర్చి దశరూపకర్త :

"అనుభావో వికారస్తు భావ సంసూచనాత్మకః
హేతుకార్యాత్మనోః సిద్ధి స్తయోః సంవ్యవహారతః.

స్థాయిభావాన్ అనుభావయన్తః సామాజికాన్ స భ్రూవిక్షేప కటాక్షాదయో రసపోషకారిణః అనుభావాః" అని వచించినాఁడు.

లోకస్వభావసిద్ధము లగుటచే విభావానుభావములు సర్వసామాజికానుభవ విశేష రూపములుగనే యుండునని తాత్పర్యము. అట్టి అనుభావము లను నటుఁడు లోకమునుండి గ్రహించి అభినయించును. జ్ఞానేంద్రియముల ద్వారమున వానిని సహృదయుఁడు గ్రహించి హృదయగతములగు వాసనల బలముచే రత్యాదిభావము లనుభవించును.

కావ్యకళాతత్త్వప్రకాశికాకర్త విభావ - భావ - అనుభావములు జ్ఞానేచ్ఛాక్రియావృత్త్యాత్మకము లని సమన్వయించి చూపెను. "మనస్సు జ్ఞానేచ్ఛాక్రియావృత్త్యాత్మకము. అది జ్ఞానేంద్రియముల ద్వారా విషయస్పర్శ కలిగినప్పటినుండి కాని, పూర్వసంచిత వాసనా ప్రేరణోద్ధతిచే గాని, వృత్తి రూపమును ధరించి, పూర్ణరూపమున వ్యవహారమునఁ బ్రవేశించును. అత్తటి మానవుని వ్యవహారము వృత్తిత్రయ తుల్యాభాసురమై సమగ్రవ్యవహార మనిపించుకొనును. 'యద్భావః తద్భవతి' అన్న న్యాయమునుబట్టి వ్యవహారమంతయు భావాశ్రయమని యేర్పడును. లౌకిక వ్యవహారముతోపాటు కావ్య

1. కావ్యకళాతత్త్వ ప్రకాశిక.

(నాట్య) వ్యవహారము కూడ తదధికృత నాయికానాయకాది భావ వ్యవహారమైనప్పుడు తద్భావము స్వదృష్టితో వాసనారూపమై అవ్యక్తస్థితి కలది కనుక విభావానుభావ సంయుక్తమై సమగ్ర వ్యవహారయోగ్యము కాఁగలదు."

ఈ విధముగా భావములు విభావానుభావ సంయుక్తరూపములని తేలినది. రసానుకూల చిత్తవికారములగు నీ భావములు నలుబదితొమ్మిదని భరతర్షి. ఇవి సాత్త్విక, వ్యభిచారి, స్థాయిభేదముచే ముప్విధము. ఎనిమిది స్థాయి భావములు, ఎనిమిది సాత్త్విక భావములు, మిగిలిన ముప్పదిమూఁడు వ్యభిచారి లేక సంచారి భావములు. వీని స్వరూప లక్షణాదు లరయవలసియున్నది :

## స్థాయిభావములు

నరులలో నృపతి, శిష్యులలో గురువువలె సర్వభావ సముదాయములో స్థాయి భావము మహనీయమైయొప్పును.[1] రాజు తన విరోధులచేతను, మిత్రులచేతను భంగపడక నుచితరీతిని బ్రజలఁబాలించుచు, అతిరస్కృతమూర్తియై వారందరివలన సేవలను గొనుచు, తన రాచరికమును నిరాటంకముగాఁ జిరకాలము ఎట్లు సాగించుకొనునో అట్లే స్థాయిభావము విభావానుభావాదుల సంబంధముకలిగి (వానివలన వ్యక్తము జేయబడి) సజాతీయ విజాతీయ భావములచే భంగపడక రసస్ఫూర్తి పర్యంతము చిరకాలము సహృదయుని హృదయమున నిలుచును.[2] దీనినే వాసనారూపమని పేర్కొందురు. 'సామాజి

1. "యథా నరాణాం నృపతిః శిష్యాణాంచ యథా గురుః
ఏవంహి సర్వ భావానాం భావః స్థాయీ మహా నిహ"—భ. నా. శా. 7 అ. 12 శ్లో.
"నానా భావోపగతా అపి స్థాయినో భావా రసత్వ మాప్నువంతి."
—భా. నా. శా. పు. 71.
"విభావానుభావ వ్యభిచారి పరివృతః స్థాయిభావో రసనామ లభతే నరేంద్రవత్"
—భ. నా. శా. పు. 350.
"బహ్వాశ్రయత్వాత్ స్వామిభూతాః స్థాయినో భావాః అన్యే భావాః తాన్ గుణతయాశ్రయన్తే పరిజనభూతా వ్యభిచారిణః"—భ. నా. శా. పు. 350.
2. "చిరంచిత్తే ఽవతిష్ఠంతే సంబధ్యంతే ఽనుబంధిభిః
రసత్వం యే ప్రపద్యంతే ప్రసిద్ధాః స్థాయినోఽత్ర తే"—స. కంఠా. 5 అ. 19 శ్లో.
"సజాతీయ విజాతీయైః అతిరస్కృత మూర్తిమాన్
యావద్రసం వర్తమానః స్థాయిభావ ఉదాహృతః"—దశ. రూ.
"అవిరుద్ధాన్ విరుద్ధాంశ్చ భావాన్ యో వశతాం నయేత్
సురాజేవ విరాజేత సస్థాయీ భావఉచ్యతే"—సా. కౌ. అ 4. శ్లో. 7.
"విరుద్ధైరవిరుద్ధైర్వా భావో విచ్ఛిద్యతే నయః
ఆత్మభావం నయత్యన్యాన్ సస్థాయీ లవణాకరః"—దశ. రూ. 4 అ. 34 శ్లో.

కానాం వాసనారూపేణ స్థితః స్థాయీభావః' అని కావ్యానుశాసనకర్త. (2 అ. 57 శ్లో). ఏతచ్చిత్తవృత్తి వాసనాశూన్యుఁడగు మానవుఁడుండఁడు. అట్టి వాసనా రూపమున నతిసూక్ష్మముగా అవస్థితములగు అవిచ్ఛిన్న ప్రవాహ రూపములు స్థాయిభావములు,[1] రసనామ విరాజితములు. దీనినిఁబట్టి చూచి నచో నధికవిభావాదులవలన నభివ్యక్తములగుచు కావ్యారంభమునుండి అంతమువఱకు స్థిరరూపముఁదాల్చిన భావమే స్థాయిభావమని తేలుచున్నది. "తత్ర ఆ ప్రబంధం స్థిరత్వా దమీషాంభావానాం స్థాయిత్వమ్" అని రసగంగా ధరకారుఁడు.

స్థాయిభావము లెనిమిది: రతి, హాసము, శోకము, ఉత్సాహము, భయము, జుగుప్స, క్రోధము, విస్మయము అనునవి. భరతునితర్వాతి కోహాలు ననుసరించి లాక్షణికులు శమమునుగూడ పైవానిలోఁ జేర్చిరి. మఱికొందఱు భక్తి, వత్సల, మాయారసములను స్థాపించి యుండియుండుటచే వాని స్థాయి భావములును గణింపవలసియున్నది. కాని ప్రసిద్ధులగు లాక్షణికులు రస సంఖ్యపై చర్చజరిపి నవరసములనే ప్రధానముగ నిర్ణయించిపెట్టిరి.

## వ్యభిచారి(సంచారి)భావములు

'వ్యభిచారి భావములు' అను శబ్దమునందే తద్భావలక్షణ స్వరూపము సూచితమయి యున్నది. (వి=విశేషణ, అభి, చరంతి వ్యభిచారిణః) 'వి' 'అభి' అనునవి యుపసర్గలు, చర అను ధాతువు గత్యర్థకము. ఈ వ్యుత్పత్తివలన రస ముల విషయమున నాభిముఖ్యముతో వివిధముగాఁ జరిపించునవి వ్యభిచారి భావములని తెలియుచున్నది.[2]

"విశేషాదాభిముఖ్యేన చరణాద్వ్యభిచారిణః
స్థాయిన్యున్మగ్న నిర్మగ్నాః త్రయస్త్రింశచ్చ తే మతాః"
—సాహిత్యదర్పణము.

---

1. "వాసనారూపతయా అతి సూక్ష్మరూపేణ అవస్థితాః
అవిచ్ఛిన్న ప్రవాహాః స్థాయిభావాః"—ఝుల్‌కీకర్.
"ఇతర భావస్య అత్మభవోపనాయకత్వేసతి సజాతీయ విజాతీయ భావాభిభావ్యః ప్రథమః వరానభిభావ్యో మనోవికారో వా సకలప్రధానో మనోవికార ఇతి వా స్థాయీభావః చరమసమయ పర్యంత స్థాయిత్వా దస్య స్థాయిత్వ వ్యపదేశః"
—రసతరంగిణి పు. 2
2. "వి అభి ఇత్యేతౌ వుపసర్గౌ చరగతౌ ధాతుః వివిధ మాభిముఖ్యేన రసేషు చరంతీతి వ్యభిచారిణః"—నాట్యశాస్త్రము.

విశేషించి యనఁగా విభావానుభావసాత్త్వికభావములనన్ను నతిశయించి రసానుగుణముగా చరించునవి వ్యభిచారులు,[1] విభావానుభావసంయుక్తముగా వెలువడిన యీ వ్యభిచారిభావములు నిర్వికారముగా నిండియున్న మనస్సునందలి సంస్కారాత్మకములగు స్థాయిభావములను జాగృతమొనర్చి, వానియందు స్వధర్మముల నర్పించి, తద్ధర్మోపజీవనముతో చరించి, అందే అంతర్హిత మగుచు, మఱల మఱల నట్లే యొనర్చుచు స్థాయికి పుష్టినొనర్చి, రస్యమానముగా నొనర్చి దానిని విశేషముగా సంచరించునట్లు చేయు అనవస్థితరూపమైన భావములు. స్థాయిభావము సముద్రమైనచో నందు వ్యభిచారిభావములు ఊర్మికలవలె ఆవిర్భవించుచు నందే లీనమగుచు ఉన్మజ్జన నిమజ్జనములఁ గావించుచుండునని రసార్ణవసుధాకరకర్త.[2]

వ్యభిచారి భావములకు సంచారి భావములని నామాంతరము. "సమ్యక్ చారయంతి" అను వ్యుత్పత్తిచే నవి స్థాయిని స్వసంయోగముచే తెస్సగా రసరూపమునఁ జరింపఁ జేయునవియని తేటపడుచున్నది.

వ్యభిచారి భావములు ముప్పదిమూఁడని భరతుఁడు; అవి :

1. నిర్వేదము
2. శ్రమము
3. దైన్యము
4. జాడ్యము (జడత)
5. గ్లాని
6. త్రాసము
7. శంక
8. ఆర్తి (వ్యాధి)
9. రోషము (అమర్షము)
10. గర్వము
11. ఆవేగము
12. ధృతి
13. స్మృతి
14. చాపలము
15. ఔగ్ర్యము
16. అవహిత్థ
17. త్రప
18. విషాదము
19. మదము
20. ఔత్సుక్యము
21. మతి
22. నిద్ర
23. మోహము
24. విబోధము
25. మరణము
26. మదము (హర్షము)
27. ఆలస్యము
28. వితర్కము
29. సుప్తి
30. అసూయ
31. ఆధ్యానము (చింత)
32. ఉన్మాదము
33. అపస్మారము

1. కావ్యాలంకార సంగ్రహము—శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి పు. 888
2. "ఉన్మజ్జన్తో నిమజ్జన్తః స్థాయిన్యంబునిధావివ
ఊర్మివద్వర్ధయన్త్యేనం యాన్తి తద్రూపతాంచ తే"—2 ఆ. 8 శ్లో.
ఇట్లే దశరూపకర్త :
"విశేషాదాభిముఖ్యేన చరన్తో వ్యభిచారిణః
స్థాయి న్యున్మగ్ననిర్మగ్నాః కల్లోలా ఇవ వారిధౌ"—ద. రూ. అ 4. శ్లో. 8

భానుదత్తుఁడు రసతరంగిణిలో 'ఛల' మను మఱియొక సంచారి భావమును "అత్ర ప్రతిభాతి ఛల మధికో వ్యభిచారిభావ ఇతి" అని ప్రతిపాదించెను. వ్యభిచారిభావములగూర్చిన విశేషాంశములను గూర్చి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగా రిట్లు వ్రాసినారు. "భరతుఁ డెనిమిది స్థాయి భావములుగూడ ఇతర రసములందు వ్యభిచారు లగునని చెప్పెను. ఆ పక్షమున వ్యభిచారి భావములు నలుబది యొకటి యగును. శోకస్థాయి భావము వ్యభిచారి యైనపుడు ఈ ముప్పది మూఁటిలోని విషాదము వ్యర్థమగుచున్నది. భయస్థాయి భావము వ్యభిచారియైనప్పుడు 'త్రాసము' వ్యర్థమగుచున్నది. క్రోధస్థాయి భావము వ్యభిచారియైనప్పుడు అమర్షము వ్యర్థమగుచున్నది. వ్యభిచారి భావములోని గ్లాని శ్రమలలో నొక్కటే చాలును. అని ఈ విధముగ 'ఈషద్వైషమ్య మవక్షిత' మ్మను లోకోక్తిని బట్టి వానికిఁగల యలతిభేదమును గణింపక వ్యభిచారిభావములను గొందఱు తగ్గించిరి. భోజుఁడు తన శృంగార ప్రకాశికలో అపస్మారమరణములను తీసివేసి ఈర్ష్యాశయములను గ్రహించెను. 'గురుదేవ నృపపుత్రాదివిషయారతిశ్చేతి చతుస్త్రింశత్' (గురు నృప పుత్రాది విషయకమగు రతిగూడ భావమే; కాన భావములు ముప్పది నాలుగు) అని రసగంగాధరకారుఁడు. భామహుఁడు గురుదేవ నృపపుత్రి విషయప్రీతి వర్ణనమును ప్రేయోఽలంకారమని నుడివెను. ఉద్భటుఁడు దానిని భావాలంకారమనెను."[1] వీనికి తోడు కోహలుఁడు ప్రతిపాదించిన శాంత రసస్థాయిభావము శమము, రుద్రటుని ప్రేయోరసస్థాయి స్నేహము, ధర్మసూరి పేర్కొనిన వత్సలరసస్థాయి వాత్సల్యము, పూర్వాచార ప్రతిష్ఠితమగు భక్తికి స్థాయి భక్తిభావము, భానుదత్తుని మాయా రసస్థాయి 'మిథ్యా జ్ఞానము' అను వానిని గ్రహించినచో వానినిగూడ సంచారి భావములుగాఁ బేర్కొనవచ్చును.

సంచారిభావములు విభావానుభావములచే ననుగమ్యమానము లగును కావునను, స్వతః ప్రతిభాసించు శక్తి వానియందు లేదు కనుకను వానిని అభ్యంతరభావము లనియు, సాత్త్వికభావములు స్వతః బహిర్గోచరములగును కావున వానిని బాహ్యభావములనియు భానుదత్తుఁడు పేర్కొనెను.

భావప్రకాశములో నిట్లు కలదు.

---

1. కావ్యాలంకార సంగ్రహము—పుట. 339. వ్యా. శ్రీ. స. సూ. శా.

"విభావో ఒప్యనుభావస్స్యా దనుభావో విభావవత్
తౌ పున శ్చారిణౌ స్యాతాం తే చ తౌస్యుః పరస్పరమ్."

"విభావ మనుభావ మగును; అనుభావము విభావముగును; అవి రెండును సంచారు లగును; ఆ సంచారి భావములు పరస్పరము అనుభావము లగును" అని. నాయకునియం దనురక్తురాలైన నాయికయొక్క చేష్టలు నాయకుని కుద్దీపన విభావము లగును. అదియే నాయికాశృంగారమున ననుభావమై యుండవచ్చును. కాని చేష్టయే నాయకుని కనుభావముగా నుండదు. ఇట్టి విభావాదుల భేదము వ్యక్తిభేదమును బట్టి యేర్పడుననియు, ఒక్కనియందే విభావాది సాంకర్య ముండదనియు తేలుచున్నది.

## సాత్త్వికభావములు

మనః ప్రభవము సత్త్వము[1] దీనిని భరత మహర్షి సమాహితమైన మనస్సు (అనగా సామాధ్యవస్థయందున్న మనస్సు) నుండి నిష్పన్నమైనదని నిర్వచించెను.[2] పరగత సుఖదుఃఖ భావనచే భావితమైన అంతఃకరణము సత్త్వమని ధనిక విద్యానాథాదులు.[3] సత్త్వశబ్దము ప్రాణివాచకము గాన సత్త్వమనగా జీవశరీరము, దాని ధర్మము సాత్త్వికమని రసతరంగిణీకర్త భానుదత్తుడు.[4] రజస్తమములచే నస్పృష్టమైన మనస్సు సత్త్వమనబడునని సరస్వతీకంఠాభరణ కర్త భోజుడు.[5] స్వాఽత్మ విశ్రాంతములగు రత్యాదులకు ప్రకాశకారియగు అంతర్ధర్మము సత్త్వమనియు[6] భావాంతర నిరపేక్ష చేసినే రసమును ప్రత్యక్షమొనర్చు బలవిశేషము సత్త్వమనియు[7] నిర్వచనములు కనబడుచున్నవి. సత్త్వమునుండి జనించిన భావములు సాత్త్విక భావములు. ఇవియును

---

1. "సత్త్వంనామ మనఃప్రభవమ్"—నా. శా. 7 అ. 147 శ్లో.
2. "తచ్చ సమాహితమనస్త్వాదుచ్యతే మనసః సమాధౌ సత్త్వనిష్పత్తిః భవతీతి"
—భ. నా. శా. 7 అ. 147 శ్లో.
3. "పరగత సుఖాదిభావనయా భావితాంతఃకరణత్వం సత్త్వం; తతో భవాస్సాత్త్వికాః"
—ప్రతాపరుద్రీయమ్ పుట 187
4. "సత్త్వశబ్దస్య ప్రాణివాచకత్వా దత్ర సత్త్వం జీవశరీరం తస్యధర్మాః సాత్త్వికాః"
—రసతరంగిణి, చతుర్థసర్గము
5. "రజస్తమోభ్యామస్పృష్టం మనః సత్త్వమిహోచ్యతే"
—సరస్వతీ కంఠాభరణము. 5 అ. 20 శ్లో.
6. "స్వాఽత్మ విశ్రామ ప్రకాశకారీ కశ్చన అంతరధర్మ స్సత్త్వం"
7. "భావాంతర నైరపేక్ష్యేణ రసాపరోక్షీకరత్వ లక్షణో బలవిశేష స్సత్త్వమ్".

కార్యరూపములే. అట్లగుటచే నివియును కార్యరూపములగు అనుభావములే యగును. కాని అనుభావములు శరీరజములు, ఇవి సత్త్వజములు. శరీరజములు బుద్ధిపూర్వకముగా నుత్పాద్యమానము లగును; సత్త్వజములు స్వతః ప్రవర్తమానము లగునని కొందఱు లాక్షణికులు.

స్తంభము, స్వేదము, రోమాంచము, స్వరభేదము, వేపథువు, వైవర్ణ్యము, అశ్రువు, ప్రళయము అను నెనిమిదియు సాత్త్వికభావములని భరతర్షి పేర్కొనెను. స్తంభాదులు స్వతః ప్రవర్తించునవి. స్మిత కటాక్షాదులు (అనుభావములు) బుద్ధిపూర్వకముగా నుత్పాదితము లగునవి. ఈ రెండును స్వతః ధీపూర్వకములే. కాని స్వధర్మభేదములచే 'ధర్మ భేదాత్ ధర్మిభేదః' అను న్యాయమున భేదించుచున్నవి. అట్లయినను భావబోధకత్వరూపమగు నేక ధర్మముఁ గల్గియుండుటవలన సాత్త్వికభావములు కూడ అగుననియు, అది సమ్మతమే ననియు కొందఱందురు.[1] దీనికితోడు సాత్త్వికభావములు తఱచుగా అనుభావములతోఁ జేర్పఁబడి చెప్పఁబడుట సాహిత్యశాస్త్రములందు పూర్వము నుండియు కనఁబడుచున్నది.

సంస్కృత లాక్షణికులందఱు భరతమహర్షి ప్రోక్తమగు సాత్త్విక భావాష్టకమునే తమతమ గ్రంథములందు ప్రపంచించిరి. రసతరంగిణీ కర్త యగు భానుదత్తుఁడు 'జృంభ' యను నవమ సాత్త్విక విభావమును ప్రతిపాదించెను.[2] దీనిని తర్వాతి లాక్షణికులు స్వీకరించినట్లు కానరాదు.

## రసనిష్పత్తి

స్థాయిభావము విభావజనిత మగుటచే నీ రెంటికిని కార్యకారణ లేక ఉత్పాద్యోత్పాదక సంబంధము కలదు. ఇట్లే అనుభావములచేత జ్ఞాపింపఁబడునది కావున నా రెంటికిని జ్ఞాప్య జ్ఞాపక లేక వ్యంగ్య వ్యంజక సంబంధమును, వ్యభిచారి భావములచేఁ బోషింపఁబడుచున్నది కాన నా రెంటికి పోష్య పోషక సంబంధమును కలదు. సాత్త్వికభావములును అనుభావము లట్లే. ఇట్టి సంబంధము కలిగిన విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావముల సంయోగము చేతనే రసనిష్పత్తి కలుగుచున్నది.

1. సాహిత్య కౌముది. పుట 29. టీక.
2. "జృంభా చ నవమః సాత్త్వికో భావ ఇతి ప్రతిభాతి"—ర. త. 4 అ.

నిష్పత్తి శబ్దమున కర్థము : కారణములగు విభావపక్షమున కార్యమగు రసమును గలుగఁ జేయుటయు, అనుభావపక్షమున జ్ఞాప్యమగు రసమును జ్ఞాపించుటయు, వ్యభిచారిభావపక్షమున పోష్యమగు రసమును పోషించుట యును నని చెప్పఁబడును.[1] అనఁగా విభావానుభావ వ్యభిచారి భావములు సంయోగమును జెంది స్థాయి భావములను సామాజికుని కాస్వాదయోగ్య ముగా నొనర్చునని తాత్పర్యము. దాని చర్వణమువలన రసానందము సామా జికుఁడు పొందుచున్నాఁడు. కావుననే ధనంజయాదులు :

"విభావైరనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయీ భావోరసః స్మృతః"

అని, స్థాయి భావమే రసమగును గాన దానికి రససంజ్ఞ నొప్పుకొనినారు. వీరందఱికి మూలగ్రంథము నాట్యశాస్త్రము.

సాహిత్య శాస్త్రమునందు బహుళప్రచారమునంది వివిధాలంకారికుల మధ్య చర్చాత్మక వివాదములకుఁ దావిచ్చిన ప్రసిద్ధ రసనిష్పత్తి సూత్రమును భరతమహర్షి యిట్లిచ్చినాడు ;

"విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" (విభావానుభావ వ్యభిచారిభావసంయోగము వలన రసము నిష్పన్నమగును). దీనికి దృష్టాంతము నిచ్చుచు లోకమున నానా వ్యంజనౌషధి ద్రవ్యసంయోగమువలన రసములు (షాడబాదిరసములు) సిద్ధమగు (నిష్పన్నమగు) చున్నట్లే విభావాదుల సంయో గమువలన రసము నిష్పన్నమగునని తెల్పెను. పైఁ జెప్పఁబడిన సూత్రమున విభావానుభావవ్యభిచారి సంయోగమువలన నాస్వాద్యమాన మగునట్టియు రసరూపముఁ దాల్చునట్టియు స్థాయిభావప్రశంసఁ జేయలేదు. కాని భరతుఁడు రసపదార్థ నిరూపణము సేయుచు "రసః ఇతి కః పదార్థః। ఉచ్యతే ఆస్వాద్య త్వాత్" ఆస్వాదింపఁ బడుచున్నది కాన రసమనఁ బడుచున్నదని పేర్కొనినాఁడు. ఆపై దాని నాస్వాదించు క్రమమును దృష్టాంత రూపమున వివరించుచు నానా వ్యంజన సంయుక్తమయిన అన్నమును సుమనస్కులయినవారు భుజించుచుఁ దద్గతమయిన రసముల (రుచుల) నాస్వాదించుచు హర్షాదుల నందుచున్నట్లే నానా భావాభినయ వ్యంజితములును వాగంగ సత్త్వోపేతములును అగు స్థాయి భావములను సుమనస్కులగు ప్రేక్షకు లాస్వాదించు చున్నారని తెల్పెను.

---

1. "కార్యోత్పత్తి ర్విభావస్య కార్యజ్ఞప్తి స్తతఃపరం
అనుభావస్య కార్యస్య సంపుష్టి ర్వ్యభిచారిణః
ఇతి సూత్రస్థ నిష్పత్తి శబ్దార్థః పరికీర్తితః"—భ. ర. ప్ర. శ్లో. 10.

భరతుఁడు పైనిచ్చిన విషయక్రమమునుబట్టి విచారించినచో రసనిష్పత్తి - రసాస్వాదనము అను రెండు విషయముల నాతఁడు స్పష్టపరచుచున్నాఁడని తెల్పవచ్చును. రసములు (పాడబాదులు) సిద్ధములు కావలయునన్నచో ప్రధానములయిన ద్రవ్యములను (బెల్లము మొ॥నవి) వానితోపాటు వివిధములయిన వ్యంజనములను, ఓషధులను సంయోగింపవలసి యున్నది. అట్లే విభావానుభావములను వ్యభిచారి భావములను సంయోగ పరచినచో రసరూపము సిద్ధమగునని తాత్పర్యము. నిష్పత్తిపదమునకు వెనుకఁ జెప్పఁబడిన అర్థము ప్రకారము విభావాదులు తమతమ ధర్మములు నిర్వహించుచు నేకోన్ముఖమగుట యనియేగదా దీనివలన తేలినది.

"విభావానుభావ వ్యభిచారీ పరివృతః స్థాయి భావో రసనామ లభతే" అను భరతోక్తి ప్రకారము ఆస్వాదయోగ్యమగు స్థాయిభావమే రసనామమున విరాజిల్లుచున్నది. ప్రసిద్ధములైన నవరస స్థాయిభావము లీక్రిందఁ బేర్కొనఁబడుచున్నవి. ఇందెనిమిది రసములు భరతునిచేఁ బ్రతిపాదితమై వర్ణదైవతములఁ గూడియున్నవి.

| | రసము | స్థాయిభావములు | వర్ణము | దైవతము |
|---|---|---|---|---|
| 1. | శృంగారము | రతి | శ్యామవర్ణము | విష్ణువు |
| 2. | హాస్యము | హాసము | సితవర్ణము | ప్రమథులు |
| 3. | కరుణము | శోకము | కపోతవర్ణము | యముఁడు |
| 4. | రౌద్రము | క్రోధము | రక్తవర్ణము | రుద్రుఁడు |
| 5. | వీరము | ఉత్సాహము | గౌరవర్ణము | మహేంద్రుఁడు |
| 6. | భయానకము | భయము | కృష్ణవర్ణము | కాలుఁడు |
| 7. | బీభత్సము | జుగుప్స | నీలవర్ణము | మహాకాలుఁడు |
| 8. | అద్భుతము | విస్మయము | పీతవర్ణము | బ్రహ్మ. |
| 9. | శాంతము | శమము | ధవళవర్ణము | శ్రీనారాయణుఁడు[1] |

స్థాయిభావము భావోత్కర్షరూపమగు మనోవృత్తి. భరతమహర్షి సంచారి స్థాయిభావముల అభినయమును గూర్చి తెల్పుచు :

"స్థాయీ సత్త్వాతిరేకేణ ప్రయోక్తవ్యః ప్రయోక్తృభిః
సంచార్యాకార మాత్రేణ స్థాయీ యస్మాదవస్థితాః

1. ఈ పట్టికను శ్రీ పో. అప్పారావుగారి నాట్యశాస్త్రమునుండి గైకొంటిని.

అనెను. సంచారిభావములు ఆకారమాత్రముచేతనే సువ్యక్తము చేయవచ్చును గాని స్థాయిభావములను మాత్రము సత్త్వాతిరేకముచే ప్రయోగింపవలెనని నిర్ణయించి యున్నాఁడు.

"బాహ్యార్థాలంబనోయస్తు వికారో మానసోభవేత్
స భావః కథ్యతే సిద్ధః తస్యోత్కర్షో రసఃస్మృతః"

అను భావప్రకాశమును, "వికాసవిస్తరక్షోభవిక్షేపా భావయంతి చిత్తం ధావన్తి (సంచారిభావాః) రసే పునః సమ్యక్" అను రసరత్నప్రదీపికను సమన్వయించు కొని ఆలోచించినచో రసము, రసనామకమగు స్థాయిభావము భావోత్కృష్ట రూపమని తేలుచున్నది. దృశ్యకావ్యమున నటుఁడు స్థాయిభావమును భావోత్కర్షతో నభినయింపవలసి వచ్చినపుడు నటాభినయము కావ్యనాయక తాదాత్మ్యముతో నొనర్చు కార్యరూపము కావున తత్కావ్యమునందును భావోత్కర్ష ప్రపంచితమై యుండవలెను. అట్లే శ్రవ్యకావ్యము వర్ణనాత్మకమగుటచే నందును నట్టి భావోత్కర్ష స్థితి విభావానుభావ సాత్త్విక సంచారి భావ సమ్మిశ్రరూపముగా వర్ణితమై శ్రోతకు భావ తాదాత్మ్యము గల్పింపవలెనని తాత్పర్యము.

రుద్రటుఁడు సంచారి భావములును రసత్వము నొందునని సిద్ధాంతీకరించెను.[1] ఇతర లాక్షణికు లెవ్వరును దాని నంగీకరింపలేదు గాని పాశ్చాత్య మనస్తత్త్వ శాస్త్ర దృక్పథముతో రసతత్త్వము నిరూపించు నవ్యులు కొందఱీతని సిద్ధాంతము ననుసరించుచున్నారు.[2] భరతుఁడు స్థాయి భావములే రసము లగునని స్థాపించినవిధమిది: సమానలక్షణులు, తుల్యపాణి పాదోదర శరీరులు, సమానాంగ ప్రత్యంగ సంయుతులునైన పురుషులు కుల శీల విద్యా కర్మ శిల్పాది లక్షణములవలన రాజత్వమును బొందుచున్నారు. అల్పబుద్ధులగు నితరులు వారి కనుచరు లగుచున్నారు. అట్లే బహ్వాశ్రయమువలన స్థాయి భావములు స్వామి భూతము లగుటయు, ఇతర భావములు తదంగ భూతములై తదాశ్రితము

1. "రసనాద్రసత్వమేషాం మధురాదీనా మివోక్తమాచార్యైః
నిర్వేదాదిష్వపి తన్నికామ మస్తీతి తే ఒపిరసాః"

—రుద్రట కావ్యాలంకారము పుట. 160

2. In the whole range of Samskrta and Hindi poetics there seems to have been only one critic viz. Rudrata who had the courage to stand against the great authority of Bharata and to declare that even the 'Sanchari Bhavas' make as good 'Rasas' as do the Sthayi".

—Psychological studies in Rasa - Rakhesh Gupta. P. 165-166.

లగుటయు నగుచున్నది. వ్యభిచారి భావములు కేవలము పరిజనభూతములై యుండును. దీనికి దృష్టాంతము : లోకమున మహాపురుషుఁ డైనంతమాత్రమున గాక సపరివారుఁ డైనప్పుడే అతనికి 'నరేంద్ర'పదము వచ్చుట ప్రసిద్ధము. అందువలననే విభావానుభావ వ్యభిచారిభావ పరివృతమగు స్థాయికి మాత్రము రసనామము కల్గుట !

భరతుని రసనిష్పత్తి సూత్రముపై లాక్షణికులలో రేఁగిన వాదోపవాదముల నుద్దేశించి వాని అన్వయము కావ్యకళాతత్త్వ ప్రకాశకర్తలు తమ గ్రంథమునం దిట్లు ప్రతిపాదించి యున్నారు.

1. "తత్ర విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః."
2. "నానాభావోపగతా అపి స్థాయినో భావాః రసత్వమాప్నువంతి."
3. "విభావానుభావ వ్యభిచారిణః (గుణతయా) స్థాయిభావా నుపాశ్రితా భవన్తి"
4. "విభావానుభావ వ్యభిచారి పరివృతః స్థాయీభావో రసనామ లభతే."
5. "విభావానుభావయుక్తో హ్యంగవస్తు సమాశ్రయః
   సంచారిభి స్తు సంయుక్తః స్థాయ్యేవతు రసోభవేత్"

"అను పంచసూత్రికి ఏకవాక్యతను సాధించి యున్నయెడల అంతటి శ్రమ వారికి లేకుండెడిది. ఒక్కచో ప్రకరణమున-మొదటి సూత్రమునకు దార్ష్టాంతిక రూపముగా నున్న రెండవ సూత్రమును బట్టియే సంయోగ రసనిష్పత్తి పదములకు ఉపగతత్వము, రసత్వాప్తి అని అర్థము చెప్పుకోన వీలున్నది. కడమ మూఁడు సూత్రములయందును పై 'ఉపగత' పదమునకు 'రసత్వాప్తి' అనుటకును వివరణప్రాయముగ 'ఉపాశ్రితత్వము, పరివృతత్వము' అనియు 'రసనామలబ్ధి' 'రసీభవనము' అనియు అర్థములు లభించుచున్నవి. ఈ పదముల స్వారస్యమునుబట్టి స్థాయి వ్యభిచారి భావము లెట్లు కావ్యమున సమావేశ పరుపఁ బడెడివో - అదియును, స్థాయిభావము రసరూపముగ నెట్లు పరిణమించెడిదో అదియును తెలియుచున్నది. "...విభావై రుత్పద్యతే" అని మహర్షి చెప్పుటయు, పైవానికి విరుద్ధముగా లేదు ; పై సూత్రములలో స్థాయిభావ దృష్టితో నవి రసత్వమును పొందుననియు రసములే యగుననియు, రసములని పేరుపొందుననియు చెప్పినట్లుగా - అదే విషయమును రసదృష్టితో రసములు ఉత్పన్నములగుననియు, నిష్పత్తి అభివ్యక్తి అభినిర్వృత్తి యగుననియు, నివర్తించుననియు, ఇంకొక దృక్కోణముతో చెప్పఁబడినదే కాని మఱొకటి కాదు.

రసాధ్యాయ - భావాధ్యాయములు రెండును కలిపి అన్వయించుచో నింత సౌకర్యము కలదని నా మనవి."

భావహీనమైన రస ముండదు- అట్లే రసవర్జితమైన భావ ముండబోదు. ఇట్లు పరస్పరావినాకృతమైన రస - భావముల సిద్ధి అభినయమున సంభావ్య మగును. రసహీనమగు అర్థము ప్రవర్తింపదు. ఈ విధముగా భరతుఁడు (కావ్య) నాట్యరసముల ప్రాధాన్యము నుగ్గడించినాఁడు.

రసపదము లక్షణశాస్త్రములందు- కావ్యరసముగా గ్రైకొనఁబడు చున్నను, దాని కా యర్థము మొట్టమొదట లేదు. రసశబ్ద ప్రసక్తి మొదట ఋగ్వేదమునందు సోమరసము - జలము - క్షీరము - సారము - రుచి అను అర్థములందు కానఁబడుచున్నది. అథర్వ వేదమునందును శతపథ బ్రాహ్మణము నందును రసమునందలి తృప్తి సాధన స్వాదనలు సూచింపబడి యున్నవి. భరతుఁడు తన నాట్య శాస్త్రమున రసపదము అథర్వ వేదమునుండి గ్రహింపఁబడినదని సూచించినాడు. ఉపనిషత్తులలోని "వేదాహి రసాః తేషా మేతే రసాః" (ఛాం. 3-5-4); రసో వై సః రసగ్ం హ్యేవాయం లబ్ధ్వా...నందీ భవతి" (తై. 2-7-1) అను వాక్యములు సారరూపమగు ఆత్మతత్త్వ ప్రతి పాదకములయి సర్వసారాత్మానందమును సూచించుచున్నవి. రామాయణ మున రసపదము కావ్యరస రూపముననే గ్రహింపఁబడినది. భరతుఁడు నాట్య శాస్త్రమున దృశ్యకావ్య పరముగా నిరూపించిన రసస్వరూపాదులను తరువాతి భామహాద్యలంకారికులు శ్రవ్య కావ్యమున కన్వయించి సాహిత్యమున స్థాపించి యున్నారు.

"సంస్కృత భాషలో సాధారణముగా కానవచ్చు వర్ణాభేద గ్రహణ ప్రక్రియ ననుసరించి 'రల' ల అభేదముఁ రసశబ్దమును 'లస' ధాతూత్పన్నము గను, లాస్య లసనార్థకముగను గ్రహించుచో-[1] రసము క్రీడనరూపమై కావ్యా ర్థములను ఆలింగనముచేసి, వ్యాపించి, అన్నిటియందును స్థూలముగాఁ బ్రకా శించుచు వాటిని ప్రకాశవంతముగా జేసి, శిల్పయోగముచే నైపుణ్యాత్మక కళాధిష్ఠానమై సామాజికులకు హర్ష ప్రీత్యానందము లీయఁజాలు నొక భావ వ్యంజక ప్రక్రియ (work) రూపమున పరిచ్ఛన్నముగను, తద్వ్యంగ్యభావ విశేష రూపమున వ్యాపకముగను గోచరించునట్టిదనియు గ్రహింపవచ్చు"నని కావ్య కళాతత్త్వ ప్రకాశికాకర్త.

---

1. లసశ్లేషణ, క్రీడనయోః ; to embrace, to play, to be sklful, to work, to shine, to be brilliant, to be happy or delighted. (ఆప్టేకోశ).

## రస మలౌకికము

లోకమున నింద్రియ గోచరములగునవి యన్నియు వ్యావహారిక సత్తా రూపములు, లౌకికములు; మనోగోచరము లన్నియు వ్యావహారిక సత్తను కల్గియుండవుగాన మనస్సుచే గ్రహింపఁబడుచున్నవిగాన ప్రాతిభాసిక సత్తా రూపములు అలౌకికములు (లేని రూపును కల్పనము చేసికొనునవి); ఆత్మ సాక్షాత్కారాదులు ఆధ్యాత్మిక సత్తా రూపములు. ఈ దృష్టితో బంధుత్వాదులు, గుణగణాదులు, వ్యక్తి వివేకాదులు, ప్రతిభాదులు, కావ్యగత భావాదులు, విభావాదులు అలౌకికములే, ప్రాతిభాసికములే. జాగ్రదవస్థలో వ్యావహారిక సత్తారూపుఁడైన మానవుఁడు స్వప్నములో స్వాప్నిక జగత్తును సత్యమని తచ్చర్వణాంతము ఎట్లూహించి అనుభవించుచున్నాఁడో రసజగత్తునుగూడ శ్రోత తచ్చర్వణాంతము తన్మయుఁడయి అనుభవించుచున్నాఁడు. భానుదత్తుఁడు రసతరంగిణిలో – 'రసము లౌకికము', 'అలౌకికము' అని ద్వివిధమని పేర్కొనెను.[1] 'లౌకికవిషయసంబంధముచే కల్గినది లౌకికము; అలౌకికవిషయసంబంధముచేత కలిగినది అలౌకికము. లౌకికరస మారువిధములు. అలౌకికరసము 'స్వాప్నిక' 'మానోరథిక' 'ఔపనాయక' భేదములచే త్రివిధము. అందు కావ్యపద పదార్థ చమత్కారనాట్యనిష్ఠమైనది ఔపనాయకము. ఈ రెండును ఆనందరూపములే. ఇట్లనుటలో స్వాప్నిక మానోరథికము లెంత అలౌకికములో లేక ప్రాతిభాసికములో[2] ఔపనాయకము నంతే అలౌకిక మగునని స్పష్టము.

లోకమున ప్రేయసీ ప్రియులు రతిభావయుక్తులైనపుడు పరస్పరాలోకనములు, హాసాదులు కార్యకారణములుగా జనించుటఁ గాంచుచున్నాము. కాని ఇట్టి రతిభావమే కావ్యమున నాయికా నాయకులందు గోచరించుచో వారు పై యిరువురివలె లౌకికులు కారు కనుక వా రలౌకికు లనఁబడుచున్నారు.

'దృశ్యకావ్యమున విభావాదుల సమ్మిశ్రితరూప మగు స్థాయిభావమును అభివ్యక్తము సేయువాఁడు నటుఁడు. ఆ నటుఁడు లౌకికుఁడు. అతనియందు

1. "సచ రసో ద్వివిధో లౌకికోఽలౌకికశ్చేతి లౌకిక సన్నికర్ష జన్మా లౌకికః। అలౌకిక సన్నికర్ష జన్మాత్వ లౌకికః లౌకిక సంనికర్షః షోఢావిషయగతః। ......అలౌకిరస స్త్రిధా స్వాప్నికోమానోరథిక ఔపనాయక శ్చేతి। ఔపనాయకశ్చ కావ్యపద పదార్థ చమత్కారే నాట్యేచ। పరంతు ద్వయో రప్యానంద రూపతా".
—రసతరంగిణి - భానుదత్తుఁడు - 6 వ తరంగము. పుట 25.

2. కావ్యకళాతత్త్వ ప్రకాశికాకర్త 'ప్రాతిభాసిక' మను శబ్దమును వాడెను.

ప్రాతిభాసిక సత్తారూపమున— దృష్టి సృష్టి న్యాయమున సామాజికులు నాయకుని నటునిపై నారోపించి, మనోమయముగా గ్రహించుచున్నారు. ఇచ్చట నాయకుఁడు మిశ్రప్రాతిభాసికుఁ డగుచున్నాడు. శ్రవ్యకావ్యమున శుద్ధప్రాతిభాసికుఁ డగుచున్నాడు. మిశ్రప్రాతిభాసికుఁడగు దృశ్యకావ్య నాయకునికి కవి జ్ఞానేచ్ఛాశక్తి వృత్త్యాత్మకానుభవమయాంతశ్శరీరునిగను, నటుఁడు క్రియాశక్తి వృత్త్యాత్మకానుభావమయ బాహ్యశరీరునిగను ఉన్నారు. ఈ దృష్టితో నాయకుఁడు ప్రాతిభాసిక సత్తారూపుఁ డనవచ్చును. ఆనందవర్ధనుఁడు 'రసస్తు కథానాయకాశ్రయస్తద్విపక్షాశ్రయోవా' అని ధ్వన్యాలోకమున జెప్పుటచే రస మిట్టి నాయకాశ్రయమై యుండునని తెలుచున్నది.'[1] ఆనందవర్ధను ననుసరించియే విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమున 'అత్ర రసో నాయకాశ్రయ ఏవయది పరం నిపుణనటచేష్టయా తథావిధ కావ్యశ్రవణ బలేన నసామాజికైః సాక్షాద్భావ్యతే తదాపరగతస్యాఽపి రసస్య సమ్యగ్భావనయా పరత్ర నిరతిశయానంద జనన మవిరుద్ధమ్' అని పేర్కొని యుండుట.

## రసాస్వాదము

ఇకఁ రసానుభూతి సామాజికునిదే. సామాజికులలో కావ్యరసాస్వాదనకై సుసంస్కారవంతులయిన సహృదయులే అర్హులు. ధ్వన్యాలోకమున సహృదయు లిట్లు నిర్వచింపఁబడిరి. "యేషాం కావ్యానుశీలనవశాత్ విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవనయోగ్యతా తే హృదయ సంవాద భాజః సహృదయాః" అని భరతుఁడు ప్రేక్షకుల లక్షణములఁ దెల్పుచు,

> "అవ్యగ్రై రింద్రియైః శుద్ధ ఊహాపోహ విశారదః
> త్యక్త దోషోఽనురాగీచ స నాట్యే ప్రేక్షకః స్మృతః
> యస్తుష్టౌ తుష్టిమాయాతి శోకేశోకముపైతి చ
> దైన్యేదీనత్వమాయాతి సనాట్యే ప్రేక్షకః స్మృతః
> యస్తుష్టౌ తుష్టి మాయాతి శోకేశోకముపైతి చ
> క్రుద్ధః క్రోధే భయేభీతః సశ్రేష్ఠః ప్రేక్షకస్మృతః"[2]

అనుటలో రసానుభూతి అట్టి ప్రేక్షకులదే యని ధ్రువపడినది. ప్రేక్షకుఁడు జ్ఞానేచ్ఛాక్రియా వృత్త్యాత్మకమగు మనస్సునకు ఇచ్ఛాక్రియావృత్తి నుజ్ఝ

1. కావ్యకళాతత్త్వ ప్రకాశిక.
2. భరతనాట్యశాస్త్రము. 27 అధ్యా. 42, 54, 61. 62 శ్లో.

గింపఁ జేసి, వాసనాత్మకమగు శుద్ధ సత్త్వజ్ఞాన వృత్తితో కావ్య రసాస్వాదన మొనర్చుచు తదనుభూతిని పొందును.

సామాజికుఁడు రసానుభూతిఁ బొందుటకు నాల్గవస్థలు దాటవలెననియు, అయిదవ దానిలో రసానందము కలుగుననియు అభినవగుప్తుని సిద్ధాంతము. దీనిని సారరూపమున శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు వ్రాసిన విషయము నిచ్చట పొందపఱచు చున్నాను. (నా. శా. పుట 228).

"1. హృదయ సంవాది అయిన విభావము (Aesthetic object) సామాజికుని కనులను, చెవులను విప్పార జేయును (Sense level).

2. ఈ దర్శన శ్రవణముల వలన సామాజికుఁడు భావనకు మొదలు పెట్టును. ఆ భావనవలన క్రమముగా నతఁడు ఆ విభావముయొక్క పరిమిత బాహ్యస్వరూపమునే కాక అందు దాగియుండి బాహ్యేంద్రియములకు కన్పట్టని విశిష్టధర్మమును, అనంతత్వమును దర్శింపగల్గును (Imaginative level). ఇందులకు రంగమున ప్రదర్శితమగు కావ్యమున వర్ణితమగు అనుభావాదికము దోహదము చేయును.

3. ఇట్లు విశిష్టదర్శన మైనంతనే వానిప్రవృత్తియే మారిపోవును. ఇప్పుడు వానికి ఎదుట ప్రత్యక్షముగ కన్పించు విభావాదులతో పనిలేదు; వాని అంతర్యమునుగూర్చి తాను భావనచేసిన విశిష్టస్వరూపమే వాని మనః ఫలకము ఎగుట నిలిచియుండును; (ఇట్టి అర్థమునందే "Art is the representation of the real in its mental aspect" Worsfold పేర్కొనెను) అనఁగా సామాజికుఁడు లౌకికప్రవృత్తినుండి మరలి, స్వీయసృష్టి అయిన ఒకానొక భావనాలోకమున సంచరించును. ఆ స్థితిలో అతఁడు పునః పున రనుసంధానముచే తనభావనకు కారణమైన విభావముతో తాదాత్మ్యమును (Identity) పొందును. అనఁగా నాయకాద్యభేదమునుపొంది, సాక్షాత్తుగా తదనుభవమునే తానును పొందుట కభిముఖుఁడగును. వెనువెంటనే నాయకాదుల ఆవేశాదులెట్టివో అట్టివే వీనికిని కలుగగలవు. అనఁగా వారి సుఖదుఃఖములనే ఈతఁడును పొందుచుండును. ఇదియే ఉద్వేగస్థితి లేదా సత్త్వస్థితి (Emotional level) సామాజికునికి లేదా పాఠకునికి ఇట్టిస్థితిని పొందింపఁగల ప్రయోగము లేదా కావ్యముమాత్రమే ఉత్తమమని తెలియవలెను.

4 ఇట్లు సాజాన్నాయకాద్యనుభవమునే పొందుచు, ఆ భావతీవ్రతకే లోనైన సామాజికుఁడు క్రమముగా తన్నుతాను మరచిపోవును.(self-forget fulness) అనగా అతఁడు స్వ-పరభేదములకు కారణమైన వ్యక్తిత్వమునే కోల్పోవును. ఇట్టి అలౌకిక స్థితికే 'సాధారణీకరణ' మని పేరు (universalisation). సంభావన సరిగా లేకపోవుట మొదలగు ఏడు విఘ్నములను తొలగించి నప్పుడే సామాజికుఁ డిట్టిస్థితిని పొందగలడు.

5. ఈ సాధారణీకరణస్థితిలో సామాజికుని బాహ్యేంద్రియములు పని చేయుట పూర్తిగా మానివేయును. స్థాయితోకూడిన హృదయము, ఆనంద ముతో కూడిన ఆత్మ - ఇవిరెండు మాత్రమే పనిచేయుచుండును. ఇదియే బ్రహ్మానంద సబ్రహ్మచారి అయిన రసస్థితి (Transcendency)".

## రసానందము

కావ్యమువలన సామాజికుఁడు రసానందము నొందుననియు, నది బ్రహ్మానందమునకు సబ్రహ్మచారి యనియు లాక్షణికుల మతము. ఆనందము ఆత్మస్వరూపము. అదియే అఖండానందము. తచ్ఛాయా రూపములే సటనగా నందములు. ఆత్మస్వరూపజ్ఞానముతో జనించునది ఆత్మానందము లేక బ్రహ్మానందము. రసజన్యమగునది రసానంద మనఁబడును, దీనినే బ్రహ్మానంద సబ్రహ్మచారి యని అందురు. విషయజన్య మగునది విషయానందమనియుఁ జెప్పఁబడు చున్నది. ఇట్లనుటలో కావ్యానందము బ్రహ్మానందము కాదని స్పష్టము. కావ్యానందము ఇచ్ఛా క్రియాత్మక వృత్తు లణఁగిన మనస్సుయొక్క జ్ఞానవృత్తిచే ననుభవింపఁ బడును. బ్రహ్మానందము మనస్సంబంధములేని బుద్ధిచే ననుభవింపఁ బడును. అట్టి బుద్ధినే ప్రజ్ఞయని అందురు. అట్టి ప్రజ్ఞను సాధించుటయే 'ఉన్మనీభావ' మనియు, అమనస్క యోగమనియు తాత్త్వికు లందురు. అట్టి యున్మనస్థితియందు బుద్ధి యమనస్కమై ఆత్మ వ్యాప్తమగును. అందు స్వానందము ప్రతిఫలిం బించును. "ఆత్మాభిముఖ ధీ వృత్తౌ స్వానందః ప్రతిబింబతి" అని వేదాంత పంచదశి (11 ప్ర. 86 శ్లో). ఆత్మానంద మతీంద్రియము, నిత్యము, నిర్విష యము, నిరతిశయమునయి వఱలుటచే బుద్ధిగ్రాహ్యమగుచున్నది. "సుఖ మాత్యంతికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్" (6 అ. 21 శ్లో.) అని భగవద్గీత. కాని కావ్యానందము ఇంద్రియ మనోగ్రాహ్యములగు కావ్యార్థముల వలన జనించినదియు, అందును అంతఃకరణ వృత్తి ప్రధాన

ముగాఁ గల్గినదియు, సర్వావస్థలయందును నిత్యమై యుండునది కానట్టిదియు విషయత్వముతో గూడినదియు నగుచున్నది. ఇట్లనుటలో విషయానందమున కన్న కావ్యానందము భిన్నమని స్పష్టము. రసము అలౌకికములగు విభావాదులచే నిష్పన్నమగుచున్నది కావున లౌకికమగు విషయానందము కాఁజాలదు. విషయానందము క్షణికము, అనిత్యము. స్థాయిభావ చర్వణము వలన అనుభూతమగు రసానందము చిరకాలిక మగుచున్నది. కావ్య కళాతత్త్వ ప్రకాశికా కర్త బ్రహ్మానందమును సార్వకాలికానంద మనియు, కావ్యానందము దీర్ఘకాలికానందమనియు, విషయానందము క్షణకాలికానంద మనియు సూచించియున్నారు. విషయానందముకన్న అలౌకికమై (ప్రాతిభాసికమై) మనోజ్ఞానవృత్తితో ననుభూతమగు రసానందము అమనస్కమగు ప్రజ్ఞతో ననుభవింపఁబడు ఆత్మానందమునకు సబ్రహ్మచారి యనుట సమంజసమే.

అల్లరాజు తన రసరత్న ప్రదీపికలో రసానందము బ్రహ్మానందమునకును, విషయానందమునకును మధ్యస్థమగునది యని పేర్కొనెను.

"సుఖం ద్విధేవ కథితం నిత్యానిత్య విభేదతః
నిత్యం బ్రహ్మస్వరూపం హి అనిత్యం విషయోద్భవమ్
కేవలం యోగిభిర్గమ్యం బ్రహ్మానంద మయం విదుః
ప్రచారో విరలస్తస్య లోకేస్మిన్ విషయోన్ముఖే.

యత్సుఖం విషయోత్థం హి నానారుచి సమాశ్రయమ్
తదేవ బహుధాభిన్నం ప్రాన్తౌ నైవాతి సుందరమ్.

రస రూపం సుఖం యత్తు తద్వయోరపి మధ్యమమ్
అనిర్వాచ్యతయా యత్తు పూర్వాచార్యై ర్నిరూపితమ్.

తస్మాదసారే సంసారే సారరూపో రసోమతః
యత్ర ప్రీతిః సువిపులా వర్ధతే చ దినేదినే.

—రసరత్న ప్రదీపిక. ప్రథమ పరిచ్ఛేదము. శ్లో. 10-15.

బ్రహ్మానందము ఏకరూపముగా నఖండముగా అప్రమేయమైయుండును. రసానందము రత్యుత్సాహాది రూపములగు వివిధస్థాయి చిత్తవృత్తులచే వివిధముగా గోచరించును. బ్రహ్మానందమున ఆత్మేతరము గోచరముకాదు. రసానుభూతియందు రత్యాది చిత్తవృత్తులతో నుపహితమగుటచే నా యా రసములు గోచరించుచు, విభావాది చర్వణపర్యంతవ్యాప్తమైన ఆనందము తెలియఁబడుచుండును. ఇదియే బ్రహ్మానందమునకును, రసానందమునకును గల భేదము.

రసములన్నియు నానందజనకములని అభినవగుప్తపాదుల యభిమతము. అట్లే సాహిత్యదర్పణకర్తయు :

> "హేతుత్వం శోక హర్షాదే ర్గతేభ్యో లోకసంశ్రయాత్
> శోకహర్షాదయో లోకే జాయంతాం నామ లౌకికాః.
> అలౌకిక విభావత్వం ప్రాప్తేభ్యః కావ్య సంశ్రయాత్
> సుఖం సంజాయతే తేభ్యః సర్వేభ్యోఽపీతి కా క్షతిః.

అని లౌకిక కారణ కార్యరూపములగు శోకహర్షాదులు కావ్యమున నలౌకిక కారణ కార్యరూపములై హర్షమునే కల్గించునని నుడువుచున్నాఁడు. జగన్నాథుఁడు కావ్యరసానందము బ్రహ్మానందమునకు సబ్రహ్మచారి యని అభినవగుప్తపాదుల మతమును సమర్థించుచు నది కేవలానందమే యన్నట్లు ప్ర[illegible] స్యముచే నిరూపించినాఁడు. భరతుఁడు నాట్యశాస్త్రమున

> "తుష్యంతి తరుణాః కామే విదగ్ధాః సమయాన్వితే
> అర్థే ష్వర్థపరాశ్చైవ మోక్షేచాఽథ విరాగిణః.
> శూరా బీభత్స రౌద్రేషు నియుద్ధేష్వాహవేషు చ
> ధర్మాఖ్యాన పురాణేషు వృద్ధాస్తుష్యంతి సర్వదా.
>
> (27 అ. శ్లో. 57, 58).

అని తెల్పినాఁడు. ఇందు మొదటి శ్లోకమున పురుషార్థ [illegible] లక్ష్యములను సాధించు పురుషార్థ సాధకుల నుద్దేశించి [illegible] కానవచ్చు చున్నది. ఇక రెండవశ్లోకమునఁ జెప్పఁబడిన శూరులు ఉత్తములు. వారు బీభత్స రౌద్ర వీరాదులందు తుష్టినే పొందుదురని తెల్పినాఁడు. బీభత్స రౌద్ర ములు దుఃఖ ప్రధానములు. వానియందే తుష్టిని పొందుచున్నారన్న సర్వరస ములు ఆనందదాయకములే యని భరతుఁడు భావించుచున్నాఁ డనుటలో సందేహ ముండదు. లాక్షణికులలో నిట్లు కావ్యరసము లానంద దాయకము లను వారొక శాఖకుఁ జెందినవారు.

కావ్యరసము సుఖదుఃఖాత్మక మని ప్రతిపాదించువారు మఱియొక శాఖకుఁ జెందినవారు. ఈ శాఖకును ఒక విధముగా భరతుని యందే మూలము కానవచ్చుచున్నది. సామాజిక స్వరూప నిరూపణము చేయుచు భరతుఁడు

> "యస్తుష్టౌ తుష్టిమాయాతి శోకే శోక ముపైతి చ
> క్రుద్ధః క్రోధే భయే భీతః స శ్రేష్ఠః ప్రేక్షకస్మృతః.

అని యనుటలో దృశ్యకావ్యమున సుఖదుఃఖాత్మకములగు స్థాయిభావ ములు నటులచే ప్రయుక్తములగుచుండ నందు తాదాత్మ్యముఁ బొందిన ఉత్తమ

ప్రేక్షకుఁడు సుఖదుఃఖాత్మకమగు రసానందము ననుభవించుచున్నాఁ డని తెలుచున్నది. నాట్యదర్పణకర్త దీనిని సమర్థించుచు "స్థాయీభావః శ్రితోత్కర్షో విభావవ్యభిచారిభిః, స్పష్టానుభావ నిశ్చేయః సుఖదుఃఖాత్మకో రసః" అని ప్రపంచించినాఁడు. ఈ భావమునే భోజుఁడు,[1] రుద్రభట్టు,[2] శారదా తనయుఁడు మొదలగు లాక్షణికులు స్వీకరించి తమతమ గ్రంథములందు నిబద్ధించిరి. శారదా తనయుఁడు భావప్రకాశమున వాసుకి, నారద మతముల ననుసరించి రసోత్పత్తినిగూర్చి వ్రాయుచు రసములు త్రిగుణసంబద్ధములని పేర్కొనినాఁడు. భగవద్గీతలోని – "రజసస్తు ఫలం దుఃఖం – అజ్ఞానం తమసః ఫలమ్ – సత్త్వాత్ సంజాయతే జ్ఞానం" అను వాక్యములఁబట్టి చూచినచో త్రిగుణాత్మకములగు రసములు సుఖదుఃఖాత్మకములని తెలుచున్నవనుటలో విప్రతిపత్తి యుండఁబోదు.

లాక్షణికులలో నేర్పడిన ఈ రెండు వాదములలో సత్యాసత్యముల మాట నటుంచి పైవారి అనుభవములను దృష్టాంతముగాఁ గొనినచో రెంటిను సత్యములని గ్రహింపవలసి వచ్చును. రసానుభూతి సామాజికులయందే జరుగుచున్నది. కాని అది వారివారి అధికారమునుబట్టి జరుగునని పేర్కొనుచు, భరతర్షి

> "నానాశీలాః ప్రకృతయః శీలాన్నాట్యం వినిర్మితమ్
> ఉత్తమాధమ మధ్యానాం వృద్ధబాలక యోషితామ్."

అని వారిని ఉత్తమాధమ మధ్యమ భేద మొనర్చినాఁడు. ఇందు ఉత్తములు శుద్ధ సాత్త్విక మనోవృత్తి సంపన్నులు. వారికి సుఖదుఃఖాది రసము లన్నియు ఆనందరూపములుగా భాసింపవచ్చును. ఇఁక మధ్యములు సాత్త్విక రజోగుణ మిశ్రరూపమనోవృత్తి కలవారగుటచే వారికి సుఖములు సుఖములుగను, దుఃఖములు దుఃఖములుగను గోచరించుననవచ్చును. ఇట్లు లాక్షణిక ప్రసిద్ధములే కాక, అనుభవసిద్ధములైన ఈ రెండు మతములను సమన్వయించి చూచినచో స్వారస్యమును, యథార్థమును కాఁగలదు.

ప్రయోగదృష్టితో పరిశీలించినచో కావ్యమునం దొక్క రసము మాత్రమే కాక పెక్కు రసములు ప్రయుక్తము లగుచుండును. అం దొక

1. "రసాహి సుఖ – దుఃఖావస్థా రూపాః"—భోజుఁడు.
2. "కరుణామయానా మప్యుపాదేయత్వం సామాజికానామ్ రసస్య సుఖదుఃఖాత్మకయా తదుభయ లక్షణత్వేన ఉపపద్యతే"—రసకళిక.

రసము ప్రధానమగుచో తదితరములు దాని కంగభూతములుగా నుండి దానికిఁ బుష్టిఁ జేకూర్చుచుండును. ఇట్టి ప్రధానరసము కావ్యమంతట వ్యాపించి చిర కాల ముండునుగాన స్థాయిరసము అనఁబడును. తదితరములు సంచారిరసము లగును.

సంచారి స్థాయిరసములకు అంగాంగి సంబంధము తెల్పుచో నవి అంగ రసములు, అంగిరసములు అనఁబడును. సాధారణముగా కావ్యములందు శృంగారవీరములే అంగిరసములుగాఁ బ్రయుక్తములు కావలెనని లాక్షణికోక్తి. అట్లయినను శాంత, కరుణాద్భుత భక్తి రౌద్రము లంగిరసములుగాగల కావ్య ములును సాహిత్యమునందు కానఁబడుచున్నవి.

జన్యజనక భేదముచే రసములను లాక్షణికులు ద్వివాకరించిరి. శృంగార వీరరౌద్ర భీభత్సములు మాత్రమే ఉత్పత్తి హేతుభూతములగు రసములు. వీనిలో శృంగారము నుండి హాస్యమును, రౌద్రమునుండి కరుణమును, వీరము నుండి అద్భుతమును, బీభత్సమునుండి భయానకమును ఉత్పన్నములైనవి. నవమ రసమగు శాంతరసము అభినవగుప్తాదులచే సర్వరసములకు ప్రకృతిరసముగ నుగ్గడింపఁబడినది. దానినుండియే యితరరసములు స్వస్వప్రయోజనములచే జనించి తమ నిమిత్తములను ముగించుకొని దానియందే మరల లీనమగును.

"స్వం స్వం నిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
పున ర్నిమిత్తాపాయే చ శాంత ఏ వోపలీయతే."

రసములలో మిత్ర (పోషక) శత్రు (విరోధి) భేదముచేత నీ క్రింది విధముగా విభాగ మేర్పడుచున్నది.

| రసము | విరోధి రసములు | పోషక రసములు |
|---|---|---|
| 1. శృంగారము | కరుణము, బీభత్సము<br>రౌద్రము, భయానకము | అద్భుతము, హాస్యము<br>వీరము |
| 2. హాస్యము | భయానకము, కరుణము | శృంగారము |
| 3. కరుణము | హాస్యము, శృంగారము | |
| 4. రౌద్రము | హాస్యము, శృంగారము<br>భయానకము | వీరము |

| రసము | విరోధిరసములు | పోషకరసములు |
|---|---|---|
| 5. వీరము | భయానకము, (శాంతము?) | రౌద్రము, అద్భుతము శృంగారము |
| 6. భయానకము | శృంగారము, వీరము, రౌద్రము, హాస్యము, శాంతము | |
| 7. బీభత్సము | శృంగారము | వీరము |
| 8. శాంతము | (వీరము?) శృంగారము, రౌద్రము, హాస్యము, భయానకము[1] | |

అమృతానందయోగి విరచితమైన అలంకార సంగ్రహమున శాంత రసము సర్వోత్కృష్ట రసమనియు, దానికి మిత్రవిరోధములు లేవనియు తెల్పఁబడియున్నది. "శాన్తః సర్వ రసోత్కృష్టో నమైత్రీ నవిరోధితా."[2]

దైవతాధివాసమై బ్రహ్మానంద సబ్రహ్మచారియగు రసానందము నందించు నిట్టి రసావతారము నుపాసించుటవలన కలుగు ఫలితమును అల్లరాజు ఇట్లు పేర్కొనినాడు. (రసరత్న ప్రదీపిక. ప్ర. ప. 23 శ్లో)

> "దానే ముఖ్యం ఫలం పుణ్యం కీర్తిస్తత్రానుషంగికీ
> యథా తథా రసే పుణ్యం ముఖ్యం ప్రాసంగికం సుఖమ్."



1. ఈ పట్టిక శ్రీ పో. శ్రీ. అప్పారావుగారి నాట్యశాస్త్రమునుండి గైకొనఁబడినది.
2. శృ. పరి. 64 శ్లో.

# 2. వీరరసవివేకము

## సాహిత్యము

సహృదయుఁడు జీవించుటకు, అనుభవించుటకు జగత్తులు రెండుగలవు. వానిని బాహ్యజగత్తు, కావ్య (రస) జగత్తు అని పిలువవచ్చును. బాహ్యజగత్తు బ్రహ్మచే సృష్టమై లౌకికసత్తారూపమై, నిత్యజీవితరంగమై సుఖదుఃఖ రూపమైనది. కావ్యజగత్తు కవి (బ్రహ్మ) చే సృష్టమై ప్రాతిభాసిక సత్తారూపమై రసజీవితరంగమై ఆనందఫలదమైనది. ఒకటి సృష్టిస్థితిలయాత్మకమగు విశ్వము; మఱియొకటి అక్షరరమ్యమైన కావ్యజగత్తు - లేక సాహిత్యము. సాహిత్యమునే వాఙ్మయమనియు సారస్వతమనియు పిలుతురు.

సాహిత్యమొక లలితకళ. చతుష్షష్టి కళలలో సుకుమారములు, మనోహరములు నైనవి లలితకళలు. అవి నాట్య, శిల్ప, సంగీత, కవిత్వ, చిత్రలేఖనములు. అందు కవనమునకుఁ జెందినది సాహిత్యము. సాహిత్యము విశ్వజనీనమై నిర్వ్యాజముగనిర్హేతుకానందము కల్గించు మహాత్వము కల్గియుండును. ఎంతగా యానందమును జూఱగొన్నను దానియందితరులకు గల్గు ఆనందము పొంగుగను. పై పెచ్చు ఆలోచించినకొలది అమృతము లూరుచుండును. ప్రకృతిరూపానుకరణముతో పాటు భావానుకరణ రూపమునయి కావ్యకర్తలలోని సంపూర్ణ స్వతంత్ర ప్రతిభనుండి జనించిన రసమూర్తి సాహిత్యము.

సాహిత్యమునకు ప్రథమలక్షణము శాశ్వతత్వము కావున వ్రాయఁబడిన లేక పలుకబడిన ప్రతిశబ్దము సాహిత్యమునఁ బడదు. నిత్యజీవిత వ్యవహారములందుపయోగింపఁబడు శుష్కసంభాషణాదులు, వ్రాతకోతలు, వార్తాపత్రికలు, పంచాంగములు మొదలగునవి తాత్కాలిక ప్రయోజనములు కలవగుటచే సాహిత్యమున చేరవు. రెండవలక్షణము విశ్వజనీనత : దీనివలన "సెవడు" కొందఱకు మాత్రమే నిచ్చఁగల్పించు శాస్త్రగ్రంథాదులు, చరిత్రాదులు ఇందు చేర నేరవు. మూఁడవ లక్షణము కావ్యకర్తయొక్క వ్యక్తిత్వపు ముద్ర. అందువలన విషయప్రధానములైన వైద్య న్యాయశాస్త్రాదులుగాక కవి తన యనుభూతులను, భావావేశములను, వ్యుత్పత్తిని ప్రతిభాన్వితముగా స్వీయముగా స్వాతంత్ర్యముతో రసాత్మకముగాఁ బ్రకటింపగల్గు కావ్యమే సాహిత్యమునఁ దావేర్పరచుకొన గల్గుచున్నది. నాల్గవలక్షణము ఆలంకారిక రచన. దీనివలన కావ్యేతివృత్తము నిసర్గ మధురమయ్యు శోభాదాయకములగు నలంకార

ములతోఁ తరళకాంతులనీనుచు పఠితల కాహ్లాద జనకమగుననియు తేలుచున్నది. అట్లే కళాస్ఫూర్తియు, వ్యంగ్యమర్యాదయు, సాహిత్యలక్షణము లగుచున్నవి. పైఁజేర్కొనిన లక్షణములన్నియు కావ్యమున కొక్కదానికే సరిపడు చున్నవి. కావున సాహిత్యమనఁగా కావ్యజాలమనియే లాక్షణికులు గ్రహింతురు.

కావ్యమును పెక్కుఱు విమర్శకులు పెక్కు దృక్కోణములతోఁ బరీక్షించి తమతమ యభిప్రాయములను నిర్వచనరూపములుగా నిచ్చియున్నారు. వానిలోఁ గొన్నింటినిచ్చుటఁ బొందుపరచుట సందర్భ విరుద్ధమనుకొనను.

"మృదులలిత పదాఢ్యం గూఢశబ్దార్థ హీనమ్
జనపద సుఖబోధ్యం యుక్తిమన్నృత్య యోజ్యమ్
బహుకృత రసమార్గం సంధిసంధాన యుక్తం
స భవతి శుభకావ్యం నాటక ప్రేక్షకాణామ్" —భరత నాట్యశాస్త్రము

"శాస్త్రే శబ్దప్రధానత్వ మితిహాసేషు నిష్ఠతా
అభిధాయాః ప్రధానత్వా త్కావ్యం తాభ్యాం విభిద్యతే
సంక్షేపాద్వాక్య మిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ" —కావ్యాదర్శము

"శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" —భామహుఁడు

"కావ్యం గ్రాహ్య మలంకారాత్ సౌందర్య మలంకారః కావ్యశబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోః శబ్దార్థయో ర్వర్తతే సఖ ల్వలంకారో దోషహానాత్ గుణాలంకారాధానాచ్చ సంపాద్యః కవేః" —వామనుఁడు

"తదదోషౌ శబ్దార్థౌ సగుణావ నలంకృతీ పునః క్వాపి" —మమ్మటుఁడు

"గుణాలంకార సహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ
గద్యపద్యోభయమయం కావ్యం కావ్యవిదో విదుః" —విద్యానాథుఁడు

"నిర్దోషా లక్షణవతీ సరీతిర్గుణభూషితా
సాలంకార రసానేక వృత్తిర్వాక్ కావ్యనామ భాక్" —జయదేవుఁడు

"నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతం
రసాన్వితం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతిం చ విందతి" —భోజరాజు

"సాధు శబ్దార్థ సందర్భం గుణాలంకార భూషితమ్
స్ఫుటరీతి రసోపేతం కావ్యం కుర్వతి కీర్తయే" —వాగ్భటుఁడు

"సగుణాలంకారా రసభారా దోషపరిహారా
జగదనురంజనశీలా కవికృతలీలా సరస్వతీ జయతి"
—అలంకార చంద్రికాకారుఁడు

"తత్ర నిర్దోష శబ్దార్థ గుణవత్త్వే సతిస్ఫుటం
గద్యాదిబంధ రూపత్వం కావ్యసామాన్య లక్షణమ్"
—అచ్యుతరాయలు - సాహిత్యసారము

"వాక్యం రసాత్మకం కావ్యమ్" —విశ్వనాథుఁడు

"వాక్యం రసాదిమద్వాక్యం శ్రుతం సుఖవిశేషకృత్" —కేశవమిశ్రుఁడు

"ప్రసిద్ధస్య రసప్రాధాన్యా దఖిలలోక రంజనతయా ఖ్యాతస్య నాటకాదేః"
—నాట్యదర్పణము

"విశ్వశ్రేయః కావ్యమ్ సావాగ్యా రసవృత్తిః" —నన్నయభట్టు

"రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్" —జగన్నాథపండితుఁడు

"శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ" —దండి

"కావ్యస్యహి లలితోచిత సన్నివేశ చారుణః"[1] —ఆనందవర్ధనుఁడు

"సముచిత లలిత సన్నివేశ చారుణా కావ్యేన" —జగన్నాథుఁడు

"సర్వత్రాఽనంద సౌందర్య పరప్రేమానుభావినః
ప్రమాణజ్ఞస్య సుధియః కవేస్తు క్రాంత దర్శినః.
వాఙ్మయం కర్మకావ్యంస్యా జ్జగద్రూపం జగద్ధితమ్
అదోషం సగుణం సాలంకారం చాపి రసాత్మకమ్.
లలితోచిత సత్సన్నివేశ చారుత్వ సంభృతమ్
విచిత్రం రమణీయార్థ ప్రతిపాదక మప్యథ.
ప్రతిభా వర్ణనా పూర్ణం కలాఢ్యం లోకరంజనమ్
శబ్దాది సన్నివేశాన్తం దృశ్య శ్రవ్య మహోదధిత్."
—కావ్యకళాతత్త్వ ప్రకాశిక

పై నిర్వచనములను గమనించినచో స్థూలముగా లాక్షణికులు అలంకార రస మార్గములను రెంటికి చెందినవారుగా గోచరింతురు. వామనాదులు సర్వ దోషరహితమును గుణాలంకార (సౌందర్య) సంస్కృతము శబ్దార్థరూపము నైనదే కావ్యమని ప్రతిపాదించి అలంకార మార్గమును పోషించిరి. కావ్య మునం దల్పదోషమును సైతము మన్నింపని మమ్మటాదుల మతమువలన - "ప్రమాదో ధీమతామపి" యను న్యాయముచే నేదేనియొక స్వల్పదోషము కానఁబడినను - రామాయణాది మహాకావ్యము కావ్యత్వముఁ గోల్పోవలసి వచ్చును. ఇందులకు 'న్యక్కారోఽహ్యాయమేవ' అను ఉదాహరణము ప్రసి

1. లలితశబేన గుణాలంకార సంగ్రహ మాహ—లోచన వ్యాఖ్య.

ద్ధము. ఇట్టి కఠిన నియమములను దెగద్రెంచి విశ్వనాథాదులు రసత్వమునకే ప్రాధాన్యమిచ్చి రసమార్గమును బలపరచి యుండిరి. శరీరమున ప్రాణమెట్లు అదృశ్యమయ్యును సర్వావయవములందును వ్యాపించి చేతనాత్మకముగ నుండునో అట్లే రసము కావ్యము నంతటను వ్యాపించియుండును. రసవంత మగు కావ్యమునందు కొలఁదిగా దోషము లున్నను సూర్యునియందలి మచ్చల వలె పైకి గోచరింపక రసప్రకాశముచేఁ గప్పఁబడి నిర్దోషమే యగుచున్నవి.

ఆలంకారిక మతమునఁ గావ్యమునకు అలంకార, గుణరీత్యాదులును, శబ్దశుద్ధియు, నదోషత్వమును ప్రధానములు. రసమతానుయాయుల ప్రకారము రసము, ధ్వని, ఇష్టార్థము, శ్లోకైకమయత, అనన్యపారతంత్ర్యము ప్రధానములు.

కావ్యశరీదము శబ్దార్థము లని భామహాదులు. భరతుఁ డితివృత్తము కావ్యశరీరమని పేర్కొనెను. మానవుని శరీరమునం దెట్లాత్మ యున్నదో అట్లే కావ్యమునం దాత్మ యుండునని వామనాదులు తరువాత నూహించిరి. వామనుఁడు కావ్యాత్మరీతి యనియు, ఆనందవర్ధనుఁడు ధ్వని యనియు, అభినవగుప్తుఁడు వస్త్వలంకార రసధ్వనిరూపమగు ధ్వనిలో రసధ్వనియే కావ్యాత్మ యని ప్రతిపాదించిరి. ఇం దానందవర్ధనుని ధ్వని సిద్ధాంతమే సర్వజనసమ్మతమై యొప్పుచున్నది. ఆనందవర్ధనుని మతమును మహిమభట్ట కుంతక క్షేమేంద్రాదులు ఖండించిరి గాని వారి వాదముల కెక్కుడు ప్రాచుర్యము లభింపలేదు. ధ్వన్యాలోక వ్యాఖ్యాతయగు అభినవగుప్తుఁడు "రసేనైవ సర్వం జీవతి కావ్యం. నహి రస శూన్యం కావ్యం కించిదస్తి । రస ఏవ వస్తుతః ఆత్మా; వస్త్వలంకారధ్వనీతు సర్వథా రసం పర్యవస్యతే"అని రసధ్వని కావ్యాత్మగాఁ బేర్కొనెను దీని నాధారముగాఁ గొని "వాక్యం రసాత్మకం కావ్యమ్"; "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అను ప్రసిద్ధ సిద్ధాంతములు రూపొందినవి. రస ప్రాధాన్యమును గూర్చి అగ్నిపురాణమున "వాగ్వైదగ్ధ్య ప్రధానేఽపి రస ఏవాత్ర జీవితమ్" అనియు, ధ్వన్యాలోకమున "నహికవే రితివృత్తమాత్ర నిర్వాహేణ ఆత్మపదలాభః ఇతిహాసాదేవ తత్సిద్ధేః" అని పేర్కొనుటఁబట్టి చూడ రసాత్మకమైనది కావ్యమనియు, అట్టి కావ్యస్రష్ట కవి యనియు, తద్భోక్త రసికుఁడనియు తేలుచున్నది. రసవత్కావ్య సముదాయము సాహిత్యము. సహృదయుఁడు కావ్యరసాస్వాదనము చేయుటయే సాహిత్యోపాసన మనఁబడును.

## కావ్యప్రయోజనములు

భరత మహర్షి నాట్యస్వరూపమును నిర్వచించుచు

"ధర్మం యశస్య మాయుష్యం సోపదేశం ససంగ్రహమ్"

"ఉత్తమాధమ మధ్యానాం నరాణాం కర్మసంశ్రయం
హితోపదేశ జననం ధృతిక్రీడా సుఖాదికృత్"

"ధర్మ్యం యశస్య మాయుష్యం హితంబుద్ధి వివర్ధనమ్
వినోదకరణం లోకే నాట్యమేతద్భవిష్యతి"

అని పేర్కొని యుండెను. కావ్యప్రకాశమున,

కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మితతయోపదేశయుజే"

అని కలదు. వీరిరువురి యభిప్రాయములంబట్టి కావ్యప్రయోజనములు : ధర్మ ప్రబోధము, యశస్సు, అర్థలాభము, ఆయుర్వృద్ధి, హితోపదేశము, బుద్ధి వివర్ధనము, ధృతిక్రీడాసుఖాదులు కల్గుట, శివేతరక్షయము, సద్యఃపరనిర్వృతి, కాంతాసమ్మితత్వము మొదలగునవి యని బోధపడుచున్నది.

కావ్యప్రయోజనములు కవి, సామాజిక దృష్టులతోఁ బేర్కొనఁబడినవి. ఎట్లన : యశస్సు, అర్థలాభము మొదలైనవి కవికి సంబంధించినవి. కావ్య రచనము వలన కవికేర్పడు ఆనుషంగికలాభము లివియే. మిగిలినవన్నియు సామాజికులకు సంబంధించినవి. అపూర్వ కవి ప్రతిభావిలసితమయిన కావ్యము యొక్క పఠన శ్రవణాదులచే సామాజికుల హృదయములు పరిపక్వములును, విజ్ఞానవంతములును అగును. బుద్ధి వివర్ధనము ద్వారమున ధృత్యాదులేర్పడి వారు ధీరులును, సమాహిత చిత్తులును, ఆనందస్వరూపులును అగుదురు. కావ్యము ఆనందము నిచ్చునది కనుక-మానవునికి ఆనందాపేక్ష సైజము గనుక సామాజికునకు తత్పఠన శ్రవణాదులపై నిచ్ఛ కల్గును. అప్పుడు కావ్య సంపాద నాది క్రియావృత్తియందు సామాజికుని మనఃప్రవృత్తి పని చేయును. అట్లు ప్రయత్నపూర్వకముగా సాధించిన కావ్యమును సామాజికుఁడు జ్ఞానవృత్తితో నుపాసించును. కావ్యము ధర్మప్రబోధము చేయును గనుకను, శివేతరక్షయము సద్యఃపర నిర్వృతి గల్గించును గనుకను సామాజికుఁడు ఆనందానుభూతితో పాటు పాపనివృత్తి నొంది శుద్ధసాత్త్వికుఁడై జ్ఞానవృత్తితోఁ గాంతాసమ్మిత

మైన కావ్య హితోపదేశమును గ్రహించును. కావున సాహిత్యము ఆనంద దాయకము, నీతిబోధకమునని బోధపడుచున్నది.

సాహిత్యము సామాజికుల కుపదేశమొనర్చు విధానములు మూఁడు. ౧. ప్రభువువలె శాసించుట, ౨. మిత్రునివలె హితవు చెప్పుట. ౩. కాంతవలె ననునయించుట. ఈ ముల్విధముచే పాఠకుని మనస్సును సమ్మతింపఁజేసి కావ్యము ప్రబోధించును. తద్ద్వారమున లోకమున సాంస్కృతికోద్ధరణము నిర్వహింపఁబడును. 'సత్యంవద ధర్మంచర' అను వేదవాక్కులు ప్రభు సమ్మితములు. ఉపాఖ్యానరూపమున ధర్మసామ్యమునుఁ జూపి మంచిచెడ్డలు పండు నొలిచి చేత నుంచినట్లు ప్రబోధించు పురాణాదులు మిత్రసమ్మితములు. రసపూరితములును, వ్యంగ్య మర్యాద విలసితములును, హృదయాహ్లాద జనకములును, మధురములును అగు కోమలపద సముదాయములతో నసద్వర్తనుఁడగు నాథుని సన్మార్గునిగా నొనరించు కాంతవలె ప్రబోధ మొనర్చునవి కావ్యములు. ఈ మూఁడింటియందును కాంతా సమ్మితములగు కావ్యములే జనులచే నధికముగా నుపాదేయము లగుచున్నవి. అట్టి కావ్యములం దవినీతి వ్యాపించినచో జాతి క్షీణదశకు వచ్చుననుటలో సందియము లేదు. అందువలననే "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని నీతి బాహ్య శృంగారాదుల బోధించు కావ్యముల పట్ల లాక్షణికులు నిష్ఠురముగాఁ బలికినారు!

ఉపదేశ శబ్దస్వరూప నిరూపణము-నిఘంట్వర్థ సహాయమున[1] నొనర్చుచు కావ్య కళాతత్త్వ ప్రకాశికాకర్త యిట్లు వ్రాసియున్నారు. "ఉపదేశమనఁగా (ప్రభువై) ఆజ్ఞారూపమునఁ దెల్పుట; (మిత్రుఁడై) సాహాయ్యరూపమునఁ దెల్పుట" మార్గదర్శకత్వము (రామాదివ ద్వర్తితవ్యమ్ అని) సాదృశ్య రూపముగాఁ దెల్పుట. (ఇట్లు చేసిన చెడిపోవుదని) నిందాగర్భముగాఁ దెల్పుట, (ఉపదేశ్యుఁడు బాగుపడవలెనని) ఇచ్ఛాపూర్వకముగ బోధించుట, (నీ కర్తవ్యమిదియని) క్రియాత్మకముగా తదర్థమై తెల్పుట, (ఇట్లు చేయుట పనికిరాదు అని) వ్యతిరేక ముఖముగా తెల్పుట, (ఇట్లు చేసినచో నెంతలాభమో చూడు

1. ఉప + దిశ్ = ఉపదేశము.

ఉప = Excess, over, above, inferior, minor, near, likeness, resemblance, ornament, command or help; reproof, astonishing, giving, diffusion, wish or desire, effort, exertion, reverse (ఉపరతి), alternately, before.

దిశ్ = To show, to exhibit, to explain, to make intelligible, to order or command; to direct or send; to say, to speak, to give, to point out at a distance with finger.—అష్టేకోశము.

మని ఆశ్చర్యాదులను కల్పించి చెప్పుట, (సాధ్యవస్తువునకు) సామీప్యమున త్రోవచూపుట, దయతో బోధించుట, మేలు కల్గుటకై తెల్పుట, సుందరముగా నలంకారప్రాయముగా బోధించుట; తెలియఁ జెప్పుట, సూచించుట,(ఉత్తమస్థితి ప్రాప్తికిఁ గల) కోఱతను పూరించుట, (ఈ మార్గము నీకు శ్రేయస్కరమని) నిశ్చయముతోఁ జెప్పుట మొ॥ అర్థవిశేషములు ప్రకరణానుకూలముగా లభించుచున్నవి."

ఇది యిట్లుండఁగా - భామహాదులు చతుర్వర్గ వ్యుత్పత్తియే కావ్య ప్రయోజనముగాఁ జేర్కొనిరి.

"ధర్మార్థ కామ మోక్షేషు వైచక్షణ్యం కలాసు చ
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్య నిషేవణమ్" —భామహాలంకారము.

"జగతి చతుర్వర్గ ఇతి ఖ్యాతి ర్ధర్మార్థ కామ మోక్షాణాం
సమస్తానభిదధ్యాద్రససమ్మిశ్రాన్ ప్రబంధేషు" —రుద్రటాలంకారము.

"చతుర్వర్గ ఫలోపేతం చతురోదాత్త నాయకమ్" —కావ్యాదర్శము

భరతమహర్షి నాట్యమున ధర్మార్థ క్రీడాశమములు ఎడ నెడ ప్రయోగింపఁ బడునని పేర్కొనెను. "క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః" "తుష్యంతి తరుణాః కామే......అర్థే ష్వర్థపరాశ్చైవ - మోక్షే చాథ విరాగిణః; ధర్మాఖ్యాన పురాణేషు వృద్ధా స్తుష్యన్తి సర్వదా" అని చెప్పుటచేత సామాజికులు కావ్యము వలన పురుషార్థ విషయము లందును తుష్టి రూపమగు సుఖమును పొంది ఆనందించెదరని తేటతెల్లమగుచున్నది.

మానవుఁడు తనువును దాల్చినది మొదలు మరణాంతము వఱకు తన జీవిత లక్ష్యము నుద్దేశించి పురోగమించుట సహజము. మానవుఁ డొనర్చు సర్వకర్మలను స్థూలముగా విభజించినచో నాల్గు విధములుగా నేర్పడును. అవి: ధర్మార్థ కామ మోక్ష సాధనము లని. లోక ప్రవృత్తి కంతటకును కామము మూలము. దానివలన అర్థప్రాప్తి కల్గును. అర్థకామములు సర్వజన సామాన్య ధర్మములు. ఉత్తమ మధ్యమాధమ భేదములచే త్రివిధమగు లోకము సత్త్వరజస్తమోగుణ ప్రధానమై యుండును. అం దధము లర్థకామ ప్రధానులు. మధ్యములు ధర్మార్థకామముల ననుష్ఠింతురు. ఉత్తములు పురుషార్థ చతుష్టయమును సాధింతురు. మధ్యములు రజః ప్రధానులగుటచే సహంకార ప్రవృత్తులయి యుండుటయు, ఉత్తములు సత్త్వప్రధానులై నిరహంకారులై యుండుటయు గాంచెదము. అధములు క్రమముగా మధ్యమోత్తమత్వము

లను, మధ్యములు ఉత్తమత్వమును సాధించుటయే లోకాభ్యుదయము. ఇట్టి పురోగమన ప్రధానమగు మానవ చిత్తప్రవృత్తియు, వారి సాధనాత్మక చర్యా విశేషములును సంస్కృతి యనఁబడును. ఇట్టి సంస్కృతిని ప్రతిబింబించు కొనునది కావ్యము.

ఇచ్చట నొక చిన్న విషయము: పురుషార్థములలో మోక్షమొకటి. ఇది శమప్రధానమగు ఋషిపుంగవులకును ఉత్తములకును సాధ్యమగును కనుక దానికి వేదాంతజ్ఞాన మవసరము. అయినచో నట్టి జ్ఞానబోధకు శ్రుత్యాదులు లేవా. దానిని కావ్యము లేల బోధింపవలెను? అను సంశయము రావచ్చును. దానికి సమాధానముగా విద్యానాథుఁ డిట్లనినాఁడు :

"యద్వేదా త్ప్రభు సమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
యచ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్
కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీబుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే"

దీనివలన—పరిణత బుద్ధులు వేదాదుల నాశ్రయించినను స్నిగ్ధహృదయు లగు రసికులు కావ్యము నాశ్రయింతురని అర్థమగుచున్నది.

కావ్యము పురుషార్థ వ్యుత్పత్తని సామాజికున కానంద ప్రధానముగా నందించును. ఏ వస్తువునందయిన బలమైన ఇచ్ఛ కల్గినచో, జనుఁడు దానిని సాధించి అనుభవింపగలఁడు. అతని యనుభవానంద సాంద్రత, ఆ వస్తువుపై నాతనికుండు గాఢేచ్ఛపై నాధారపడి యుండును. కావుననే సుఖదుఃఖ ఘూయిష్ఠమగు లోకముకన్న విలక్షణమయి కేవలానంద ప్రదాయకమయి ప్రాతిభాసిక లోకమగు సాహిత్యము సర్వదా ఆనందము నభిలషించు మానవున కవశ్యోపాదేయ మగుచున్నది. అట్లగుటచే మానవుఁడు కావ్యమునుండి ప్రథమముగా కోరునది ఆనందము. ఆ యానంద మఖండమయి యున్నపుడు దానియం దాతఁడు తన్మయుఁడై అనుభవించుచుండ కాంతా సమ్మితముగా నా కావ్యమెట్టి యర్థములను బోధించినను హృదయమువఱకు గైకొని వాని ననుష్ఠింప యత్నించును.[1] లోకమునందు ప్రియకాంతాభ్యర్థనములను, బోధ

1. "శ్రోతౄణాం వ్యుత్పత్తి ర్యద్యప్యస్తి యథోక్తం ధర్మార్థకామమోక్షేషు తథాపి ప్రీతి రేవ ప్రధానమ్ అన్యథా ప్రభుసమ్మితేభ్యో వేదాదిభ్యః మిత్రసమ్మితేభ్యశ్చ ఇతిహాసాదిభ్యః కోఽస్య కావ్యరూపస్య వ్యుత్పత్తిహేతో ర్జాయా సమ్మితత్వ లక్షణో విశేషః ఇతి ప్రాధాన్యేన ఆనంద ఏవోక్తః చతుర్వర్గ వ్యుత్పత్తే రపి చ ఆనంద ఏవ పార్యంతికం ఫలం"
—అభినవగుప్తపాదులు

లను, ప్రియు లభిమానముతో నెట్లు గైకొని వానిని సాధింప నుత్కటో త్సాహముఁ జూపింతురో నట్లే కావ్యబోధలను (పురుషార్థములను) సామాజికుఁ డభిమానముతో గైకొని వాని సాధనయం దధికోత్సాహ భావమును ప్రకటిం చును. తదుత్కటోత్సాహమే వీరము.

## వీరరసము - స్థాయిభావము

వీరరసమున కుత్సాహము స్థాయిభావము.

"అథ వీరో నామోత్తమప్రకృతి రుత్సాహాత్మకః" — భరతుఁడు

"పరపరాక్రమ దానాది స్మృతిజన్మా ఔన్నత్యాఖ్య ఉత్సాహః" — రసగంగాధరము

"లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ప్రయత్నః ఉత్సాహః" — ప్రతాపరుద్రయశోభూషణము

"పరిపూర్ణ ఉత్సాహః సర్వేంద్రియాణాం ప్రహర్షో వా వీరః" — [illegible]

ఉపర్యుక్త లక్షణార్థక్రమమును గమనించినచో నీ క్రిందివిధముగా నుత్సాహ నిర్వచన మేర్పరుపవచ్చును. ఉత్సాహ ముత్తమ ప్రకృతికము. ఉత్తములయందు సహజముగా సర్వకార్యాచరణమునందు కానవచ్చు చిత్త స్థైర్యము మహాసంకట సంప్రాప్తి సమయములందు చలింపని - పరుల పరాక్రమ దానాదుల స్మరణమునఁ గలుగు నౌన్నత్యమును నాశ్రయించి లోకోత్తర కార్యసాధన కాధారమై, సత్త్వసంపత్తి శౌర్యత్యాగాది గుణ సంభవమై సర్వేంద్రియ ప్రహర్షముచే పరిపూర్ణతఁ జెంది సుస్పష్టమగు భావ విశేషమైనచో నది ఉత్సాహము.

శారదాతనయుఁడు ఉత్సాహ శబ్ద వ్యుత్పత్త్యర్థమును దెల్పుచు "తంద్ర తను (తూగుట, కునికిపాటు పడుట) అభిభవించునది (తిరస్కరించునది, జయించు నది) 'ఉత్సాహ' మనియు ఈ పదమునకు ఉత్సాహమును పొందుట, ఉత్సాహ పెట్టుట, ఉత్సాహపడుట అను నర్థములు గల్గుననియు జెప్పెను.[1] ఉత్సాహ ప్రధానలక్షణము 'తంద్రతాభిభవ' మని చెప్పుటచే ఉత్సాహానుప్రవృత్తి నుం డెట్టి స్తబ్ధతయు, నిద్రాది తమోగుణ లక్షణములు, ప్రమాదాదులు వచ్చున కైన గోచరింపవన్నమాట; పైపెచ్చు తత్ప్రవృత్తి మెరపువలె చురుకైనదై

1. "ఉత్తంద్రతా మభిభవ త్యత ఉత్సాహ నిర్వహః
ఉత్సాహ్యతే చోత్సహతే, ఉత్సాహ యతి వా భవేత్" — భా. ప్ర. 2 అధి. ౪౬ పుట.

తరళసుందరమై, నిరంతర ప్రవాహరూపమై తేజోమయమై సర్వకార్యము లందు సత్వర ప్రసార క్రియాలక్షణ సంశోభితమై యొప్పునని తాత్పర్యము. దీనినే శారదాతనయుడు "ఉత్సాహః సర్వకృత్యేషు సత్వరా మానసీక్రియా"[1] అని ఉత్సాహ భావనిర్వచనము మణిదీపమువలె వెలయించినాఁడు. మనోవికార రూపమగు భావము తదీయ విభావాదులచేత ఉద్దీపితమై తదుచిత అనుభావములచేత వ్యక్తమై సామాజికులకు తత్జ్ఞానమును కలిగించు లక్షణము సహజ సిద్ధము. ఈ దృష్టితో శారదాతనయుని లక్షణమును పరిశీలించిన యెడల భావముయొక్క విభావోద్దీపిత్వమును- "ఉద్దీప్యతే" అను పదము చేతను, దాని యుద్బుద్ధదశను "ఉత్సాహతే" అను పదముచేతను, దాని బహిర్గోచరత్వమును సామాజికానుభూతి విషయత్వమును 'ఉత్సాహయతి' అను పదముచేతను అతఁడస్పష్టముగా నిరూపించినట్లు చెప్పవచ్చును.

స్థాయి భావమగు నుత్సాహమునకు ఆశ్రయ భూతములగు విభావములు ఇచ్చట పేర్కొనఁబడును. భరతుఁడు 'ఉత్సాహో నామ ఉత్తమ ప్రకృతిః స చావిషాద శక్తి ధైర్య శౌర్యాదిభి ర్విభావై రుత్పద్యతే' అని నుడివినాఁడు. అవిషాదము, శక్తి, ధైర్యము, శౌర్యము మొదలగు విభావముల వలన నుత్సాహ ముత్పాద్యమానమగును.

**అవిషాదము :** విషాదమును భరతుఁడిట్లు నర్వచించెను :

"కార్యాని స్తరణ దైవవ్యాపత్తి సముత్థః" కార్య మసంపూర్ణమగుట చేతను దైవికమైన ఆపత్తి కలుగుటవలనను విషాదము జనించును. తదభావము అవిషాద మనవచ్చును.[2]

**శక్తి :** సర్వ కార్యకరణ దక్షత శక్తి; బలిమి. (ఉత్సాహము, ప్రభుత్వము, మంత్రము, ఈ మూడును శక్తులనఁబడును.)

**ధైర్యము :** వికార హేతువులు బలీయముగాఁ బెక్కు లున్నను చలింపని హృదయస్థితి ధైర్యము.[3] నిశ్చితార్థములనుండి విరమణాభావము,[4]

1. భావ ప్రకాశము—రెం. అధి. పుట 85.
2. శారదా తనయుఁడు "మానసో వివిధః సాదో విషాద ఇతి కీర్తితః చౌర్యాది గ్రహాణా ద్విఘ్నా ద్విషాదో నామ జాయతే" అని విషాదమును నిర్వచించెను. తదభావము అవిషాదము.
3. "వికార హేతావపి విక్రియంతే యేషాం న చేతాంసి త యేవ ధీరాః" —కాళిదాసుని కుమారసంభవము
4. "న నిశ్చితార్థా ద్విరమన్తి ధీరాః" —నీతిశత. భర్తృహరి. 71 శ్లో.

న్యాయమార్గమునుండి తొలఁగకుండ యుండుట[1]యు ధైర్యమే. 'శీలాద్య లంఘనం నామ ధైర్య మిత్యభిధీయతే' అని ప్రతాపరుద్రీయము.

శౌర్యము : 'శూరస్య భావః శౌర్యమ్' శూరునియొక్క భావము శౌర్యము. శౌర్యము అమరమున బలిమి యర్థమునఁ బేర్కొనఁబడినది. "ద్రవిణంత రస్సహోబల శౌర్యాణి స్థామ శుష్మంచ శక్తిః పరాక్రమ ప్రాణౌ." దీనిచేత శత్రువునుగూర్చి పోరుదురు కనుకను, దీనిచేత నాపదను లెరింతురు కనుకను, దీనిచేత శత్రువు నోర్తురు కనుకను దీనిచేత బ్రతుకుదురు కనుకను బలముల కిన్ని నామములు కల్గినవి. బలవంతుఁడు శూరుఁడు. అతని భావము శౌర్యము.

స్థాయిభావము రసనామక మగుటచే భరతుఁడు వీరరసప్రకరణమునఁ బేర్కొనిన విభావములనే ఉత్సాహ విభావములుగా ఆదిశబ్దప్రయోగమువలన గ్రహించుచున్నాను. కలత చెందకుండుట అసమ్మోహము; పట్టుదల అధ్యవసాయము; సంధి విగ్రహాదులయందు సమ్యక్ప్రయోగము నయము; ఇంద్రియ జయము వినయము; హస్తి రథాశ్వ పదాతిరూప చతురంగబలము 'బలము'; శత్రు మండలాదుల నాక్రమించుట పరాక్రమము; యుద్ధాదులయందు చూపెడు సామర్థ్యము శక్తి; శత్రువులకు సంతాపము కలిగించు ప్రసిద్ధి ప్రతాపము; అభిజన బంధుమంత్రి సంపద ప్రభావము. ఇంకను యశః ప్రభృతుల గైకొనవచ్చును.

స్థైర్య, ధైర్య, త్యాగ, వైశారద్యాదులగు అనుభావములచేత నుత్సాహము అభివ్యక్త మగును. స్థైర్యమన అచలనము, గాంభీర్యము, సంవరణము, శౌర్యము, యుద్ధాదిక్రియ.[2] త్యాగమన దానము. వైశారద్యమన సామాద్యుపాయ చతుష్టయమును నేర్పుతో నుపయోగించుట. ఆదిశబ్దముచే గర్వోత్సాహ పరాక్రమాధిక్షేప వాక్యాదులు గ్రహింపవచ్చును.

పైఁ బేర్కొనఁబడిన విభావానుభావములలో రెంటను ధైర్యాదులగు కొన్ని గుణములు పేర్కొనఁబడి యున్నవిగదా! వాని స్వరూపముల నెట్లు నిరూపింపవలయు నన్నది ప్రశ్న. పరనిష్ఠములుగా దృష్టశ్రుతములై సవిభావానుభావములై అనుకరణీయములైన ధైర్యశౌర్యాదులు నాయకుని యందలి స్థాయిభావమునకు విభావరూపము లగును. ఉదాహరణమునకు శివాజీ తన

1. "న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః" —నీ. శ. భర్తృ. 74 శ్లో.
2. "స్థైర్య మచలనం, గాంభీర్యకృతం, సంవరణం, శౌర్యం యుద్ధాదిక్రియా" —అభినవభారతి పు. 326

బాల్యమున తల్లియగు జిజియాబాయివలన భారత వీరగాథలను వినుచుండెడి వాఁడు. క్రమముగా నాతని యందు ధైర్యశౌర్యాదులు గూడుకట్టుకొనినవి. జిజియాబాయిచే బోధింపఁబడిన రామాయణాదిగాథలలో రామాదులచేత ననుభావయుతముగా వ్యక్తీకరింపఁబడిన ధైర్యాదులు - రామాదులకు అనుభావములైనను - వానిని వినుచున్న శివాజీకిమాత్రము విభావములగు చున్నవి. శివాజీ నిశ్చల చిత్తవృత్తితో వానిని వినుటవలన విభావములచే నుత్థితమైన మనోగత ధైర్యాదులు అతనిచే చర్వితమొనర్పబడి కార్యరూప మున - వాగంగ సత్త్వరూపమున - బహిర్గతము లొనర్పఁబడును. అట్టియెడ ధైర్యాదులు శివాజీకి అనుభావము లగుచున్నవి. అనఁగా ధైర్య శౌర్యాదు లకు అభివ్యంజకములైన చేష్టితములే అనుభావరూపములని యర్థము. శారదా తనయుఁడు అనినట్లు 'విభావ మనుభావమగుటకును అనుభావము విభావ మగుటకును అవకాశమున్నది' కనుక పైఁజెప్పిన ధైర్యాదిగుణములు స్థూల ముగా విభావములయందునుఁ అనుభావములయందును బేర్కొనఁబడినవి. విభావములు పరనిష్ఠములు; అనుభావములు స్వనిష్ఠములు.

భరతమహర్షి విభావానుభావములు లోకప్రసిద్ధములనియు, నాట్య శాస్త్రమునందుఁ బేర్కొనఁబడనివి లోకమునుండి సహృదయులు గ్రహింప వచ్చుననియు చెప్పియున్నాఁడు. భావాదులకువలె సంఖ్యానియమము వీని కాతఁడు నిర్ణయింపలేదు. దీనినాశ్రయించియే యితర లాక్షణికులు శృంగా రాది రసనిరూపణ మొనర్చు నప్పుడు విభావ, అనుభావములను లోకము నుండి గ్రహించి విపులీకరించినారు. కాని 'రసరాజ' మని భావింపఁబడిన శృంగారరసమునందు చూపించిన విషయ వివేచనము, విపులీకరణమునందలి శ్రద్ధ లాక్షణికు లితర రసములందుఁ బ్రకటింపరైరి. "ఇట్లే ఇతరరసములకు నూహించుకొనునది" అనియే వదలివేయుచుండిరి. ఇట్టి పరిస్థితులలో సహృద యుఁడు చేయవలసిన పని యిట్టిది : అపారమగు కావ్యప్రపంచమున కవి ప్రతిభాజనితములగు కావ్యములందు వ్యంగ్యముగా వ్యక్తీకరింపఁబడిన విభా వానుభావాదులను సౌహార్దముతో గ్రహించి వానిని దత్తదనుకూల పరిస్థితు లలో నన్వయించుచు పోవుచుండవలెను. విభావానుభావములు సర్వమాన వానుభవ సులభములుగా నుండునుగావున వానిని గుర్తించుటయందుగాని, గ్రహించుటయందుగాని ఎట్టిక్లేశ ముండదని భావింతును.

స్థాయిభావమగు నుత్సాహమునందు స్వధర్మముల నర్పించి, తద్ధర్మోప

జీవనముతోఁ జరించుచు, తదంతర్గితములగుచు, తత్పుష్టికి కారణములై దానిని రస్యమానముగా నొనర్చునవి వ్యభిచారిభావములు. అవి : ధృతి, మతి, గర్వము, ఉగ్రత, అమర్షము, స్మృతి, ప్రతిబోధము మొదలగునవి.

౧. ధృతి :

"జ్ఞానాభీష్టాగమాద్యైస్తు సంపూర్ణ స్పృహతా ధృతిః
సౌహిత్య వచనోల్లాస సహాస ప్రతిభాదికృత్" —సాహి. దర్ప.

౨. మతి :

"నీతిమార్గానుసృత్యాదే రర్థ నిర్ధారణం మతిః
స్మేరతా ధృతి సంతోషౌ బహుమానశ్చ తద్భవా" —సాహి. దర్ప.

౩. గర్వము :

"గర్వో మదః ప్రభావశ్రీ విద్యా సత్కులతాదిజః
అవజ్ఞా సవిలాసాంగ దర్శనా వినయాదికృత్" —సాహి. దర్ప.

౪. ఉగ్రత :

"శౌర్యాపరాధాదిభవం భవే చ్చండత్వ ముగ్రతా
తత్ర స్వేద శిరఃకంప తర్జనా తాడనాదయః" —సాహి. దర్ప.

౫. అమర్షము :

"అమర్ష స్స్వపరాధేషు చేతః ప్రజ్వలనం మతం" —ప్ర. రు.

౬. స్మృతి :

"చిర విస్మృత వస్తూనాం స్మరణం స్మృతి రుచ్యతే" —భా. ప్ర.

౭. ప్రబోధము లేక విబోధము :

"విబోధశ్చేతనావాప్తి ర్జృంభాక్షి పరిమార్గకృత్" —ప్ర. రు.

ఇవియేగాక 'ఆది' శబ్దముచేత భరతుఁడు నాట్యశాస్త్రమునందు సప్తమ ప్రకరణమున నాయారసములందుఁ బ్రయోగింపఁదగు భావములనుఁ గూర్చి తెల్పుచు నుడివిన ఆవేగము, హర్షము, మదము, క్రోధము, అసూయ, వితర్కము అనెడి భావములను కూడ గ్రహింపవచ్చును.

౧. ఆవేగము :

"ఇష్టానిష్టాగమాజ్జాత ఆవేగ శ్చిత్తసంభ్రమః" —ప్ర. రు.

౯. హర్షము :

"ఇష్ట ప్రాప్త్యాది జన్మా సుఖవిశేషో హర్షః" —రసగంగాధరము

౧౦. మదము :

"హర్షోత్కర్షో మదః పానాత్స్ఖలదంగవచోగతిః
నిద్రాహాసో౽త్ర రుదితం జ్యేష్ఠ మధ్యాధమాదిషు" —దశ. రూ.

౧౧. అసూయ :

"అసూయాన్యగుణాదీనా మౌద్ధత్యా దసహిష్ణుతా
దోషోద్ఘోష భ్రూ విభేదావజ్ఞా క్రోధేంగితాదికృత్" —సా. ద.

౧౨. వితర్కము :

"సందేహా ద్యనంతరం జాయమాన ఊహో వితర్కః స చ నిశ్చయానుకూలః"
—రసగంగాధరము

౧౩. క్రోధము :

రౌద్రరసమునకు స్థాయిభావము క్రోధము. స్థాయిభావములలోనే యొక్కటికైనను ఇతరములు సంచారులుగ నుండవచ్చును గనుక నుత్సాహాము నకు క్రోధము వ్యభిచారిభావ మైనది.

క్రోధమన—"ప్రతికూలేషు తైక్ష్ణ్య స్యావబోధః క్రోధ ఇష్యతే"
"అపచికీర్షా జుగుప్సా హేతుః పరితాపావేశః క్రోధః".
—నాట్య. దర్ప.

## వీరరసనిష్పత్తి

పైఁ బేర్కొనిన విభావానుభావములచే నభివ్యక్తమయి సంచారి భావ ములచేఁ బరిపుష్టమైన స్థాయిభావమగు నుత్సాహాము వీరరసముగా నిష్పన్న మగును. భరతుఁడు :

"ఉత్సాహాధ్యవసాయా దవిషాదిత్వా దవిస్మయా ద మోహాత్
వివిధార్థవిశేషా ద్వీరరసో నామ సంభవతి
స్థితిధైర్యవీరగర్వై రుత్సాహ పరాక్రమ ప్రభావై శ్చ
వాక్యై శ్చాక్షేపకృతై ర్వీరరసః సమ్యగభినేయః"

[ఉత్సాహాధ్యసాయావిషాదావిస్మయామోహాము లనువాని వలనను ఇట్టివే యగు నితరార్థ విశేషముల వలనను వీరరసోత్పత్తి యగుచున్నది. స్థైర్య ధైర్య వీర గర్వోత్సాహ పరాక్రమాక్షేప భాషణము లనెడి అనుభావ ములచే వీరరసము నీయమాన మగుచున్నది.]

"విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః"

అను ప్రసిద్ధ భరతరస నిష్పత్తి సూత్రము ప్రకారము రసాభివ్యక్తి కారణములయిన విభావాదులు తత్కార్యరూపములైన అనుభావములు తత్పోషకములయిన వ్యభిచారి భావములు సంయోగము చెందుటచే నుత్సాహ మగు స్థాయిభావము రసనామకమై నిష్పన్నమగునని తాత్పర్యము.

శారదా తనయుఁడు 'వీర' రసపదమును నిర్వచించుచు, 'రా' దాన ఇతియోధాతుర్వా...దేచవర్తతే। 'లా' దాన ఇత్యయం ధాతుః జ్ఞాన ఖండన యోరపి॥ ర, ల యో రవిశేషోపి కథితః శబ్దవాదిభిః। విరుద్ధాన్ రాతిహంతీతి వీరశబ్దస్య నిర్వహః॥ వివిధంచ విచిత్రంచ లాతిజనాతి కృంతతి। ఏవంవా వీరశబ్దార్థః కథితః పూర్వసూరిభిః॥ ప్రేరయత్యత్ర విద్విష్టానితి వీరో నిరుచ్యతే" భా. ప్ర. 2 అధి. అని పేర్కొనియున్నాఁడు.

కావ్యకళా తత్త్వప్రకాశికాకారుఁడు కోశాదులయం దీయఁబడిన అర్థవిశేషముల నాధారముగాఁ గొని 'వీర' పదమునకొక సమగ్ర నిర్వచన మీయ యత్నించినాఁడు. "వీరరసము - శక్తిమత్త్వమును, ధీరత్వమును, దుర్వారకృత్య నిర్వాహమును, వ్యాపకత్వమును, చలనమును, చాలనమును, విహారమును, విషయ (భావ) గర్భితత్వమును అభిలాషయును, ప్రేరకత్వమును, ధీరభాషణమును, నెట్టుకొని పోవునట్టి లక్షణమును, మార్గదర్శకత్వ లక్షణమును, ప్రక్షేపణమును అనెడి అర్థవిశేషములు కలిగి[1] తదాలంబన భూతుఁడగు నాయకునియందీ లక్షణము లన్నియు మూర్తీభవించునట్లు చేయఁ గల్గునని యూహింపవచ్చును. ఈ శబ్దార్థ విశేషముల నిరూపణము చేతనే తన్నాయకుని జీవితచర్యా స్వరూపములు తేటపడఁగలవు కూడ!"

వీరరసోత్పత్తి తత్త్వమును శారదాతనయుఁడు వివరించుచు వాసుకి నారదుల మతములను పేర్కొనియున్నాఁడు. వాసుకి మతమునుఁబట్టి "స్థిరా విభావాస్తు యదా స్వయోగ్యైః సాత్త్వికాదిభిః భావైః స్థాయిని వర్తంతే స్వీయాభినయ సంశ్రయాః తదా మనః ప్రేక్షకాణాం సత్త్వవృత్తి రజో

1. (1) వీర (10 cl.) to be powerful or valiant, to make heroic or irresistable effort అనియు,
   (2) అజ to go and వీ substituted for the root రక్ (ఉణాది) అనియు, 'వీ' అనఁగా (2 cl.) to go, to move, to pervade, to conceive, to be impregnated, to desire, to send, to eat అనియు,
   (3) వి + ఈర (2) to go, to shake, (1-10) to go, to throw, to direct, to drive or force on to speak.

న్వయి సాభిమానశ్చ తత్రతోర్యో వికారో యః ప్రవర్తతే స వీరరసనామాస్యాత్ రస్యతే సచత్తైరపి" అనియు, నారదుని మతమునుబట్టి 'అహంకార రజః సత్త్వ యుక్తా ద్యాభ్యోర్థ సంగతాత్ మానసో యో వికారస్తు సవీర ఇతి కథ్యతే, తస్మా దేవాద్భుతో జాతో రజోహంకార వర్జితాత్" అనియు నిరూపించెను. ఈ రెండు మతములును స్థూలముగా నొకే యర్థమును ప్రతిపాదించుచున్నవి. రసనామకమగు స్థాయిభావము అభిమానాహంకార రజస్సత్త్వయుక్తములగు సామాజికుల మనస్సులందు వికార రూపముగా నుదయించి దీర్ఘకాలము చర్వ్యమాణమగును. అనఁగా వీరాది రసములు త్రిగుణాశ్రయములయి తత్ప్రభావితము లగుచు సామాజికుల కానంద మిచ్చుచున్నవన్నమాట! కాని ఇట్లాస్వాద్యమానమగు వీరరసము ఉత్తమ ప్రకృతికము ఉత్సాహాత్మకము నని పూర్వమే నిరూపితమైనది. దీనికి సమన్వయము కుదర్పవలెను.

అర్థసాధనేచ్ఛాత్మకమైన కామము లోకమున సర్వమానవకార్యములకు మూలము. కామము అర్థము సర్వసామాన్యములు. కాని అవి ధర్మబద్ధము లైనప్పుడే పురుషార్థము లగును. అట్లు గానిచో లోకమున విశృంఖలత్వము, అరాజకము, కల్లోలము, చివరకు సర్వనాశనమును గల్గును. స్వార్థపూరిత విశృంఖల కామముచేత సాటిమానవుని దాసునిగా భావించి బాధించుట, మారణాస్త్రముల ననుసంధించుటవంటివి నేఁటి ప్రపంచమునఁ గాంచుచునే యున్నాము. ఇట్టి విపత్తునుండి తప్పించుకొనుటకు కామమును ధర్మబద్ధ మొనర్చుట యెంతైన అవసరము.

> "ధర్మకామంబులు దఱుగంగ నర్థార్థియగువాఁడు పతితుఁడౌ నర్థసేవ
> నర్థార్థముగఁజేయు నతఁ డుగ్రవనములో గోరక్షసేయు నక్కుమతిఁ బోలు
> నర్థధర్మములకు హానిగాఁ గామార్థియగు నాతఁ డల్పజలాశయమున
> జలచరం బెట్టు లజ్జలములతోఁ జెడునట్లు కామంబుతో హానిఁ బొందు
> నర్థధర్మములు మహాబ్ధిమేఘము లట్టు లుభయమును పరస్పరోదయమ్ము
> లిట్లుగాఁ ద్రివర్గ మెఱిఁగి సామ్యమున సేవించువాఁడు సర్వవిత్తముండు"
>
> —అరణ్య ప. ప్ర. ఆ. ప. 245

అని నన్నయ ప్రబోధము. "తతోఽర్థకామయో ర్ధర్మమూలకత్వాత్ ధర్మప్రధానో వీరః" అని అభినవగుప్తుఁడు. కావున ధర్మవిరుద్ధమైన 'యుత్సాహము' వీరమునకు స్థాయి కాఁజాలదు. ధర్మపురుషార్థులగు ధీరోదాత్తుల నాశ్రయించిన యుత్సాహమే వీరనామ యోగ్యమని తాత్పర్యము. భరతర్షి :

"భావా యే ఉత్తమానాంతు నతా న్మధ్యేషు యోజయేత్
యో భావాశ్చైవ మధ్యానాం నతా న్నీచేషు యోజయేత్"
—నాట్య. శా. 25 అధ్యా. 116 శ్లో.

అని శాసించుట దీనిని స్పష్టపరచుచున్నది.

చతుర్విధ నాయకుల జీవితములను ధర్మవీరమే శాసించుచుండుట గాంతుము. ధీరోదాత్తునియందు ధర్మము వీరమును, ధీరోద్ధతునియందు వీరము రౌద్రమును, ధీరలలితునియందు వీరము కామమును, ధీరశాంతుని యందు శాంతము వీరమును అనుశాసించును. ఈ అంశమును ముందు వివరింతును.

కొంద ఱాలంకారికులు స్వభావముచే నాయకు లుత్తమ మధ్యమాధమ-జ్యేష్ఠ మధ్యమ కనిష్ఠ వర్గములకు చెందుదురనియు, కథావశమున నీచుఁడును నాయకుఁడు కావచ్చుననియు పేర్కొని యున్నారు.

"స్వభావా ఉత్తమ మధ్యమ భేదేనైవ వర్ణనీయాః నీచో౽పీశః కథావశాత్"
—నాట్యదర్పణము.

"నాయకస్తత్ర గుణత ఉత్తమో మధ్యమో౽ధమః"
—సరస్వతీ కంఠాభరణము

"జ్యేష్ఠో మధ్యః కనిష్ఠశ్చ త్రిధా నాయక ఉచ్యతే" —భా. ప్ర.

ఇందులో నాట్యదర్పణకారుఁడు "కథావశమున" ననుటలో నొక విష యము గమనింపఁదగి యున్నది. ఉపదేశాత్మకమగు కావ్యమున నితివృత్తము సంధించుట ద్వివిధము—రామాదులగు ఉత్తముల జీవితవర్ణనముచేత ఆదర్శ జీవిత ప్రతిపాదన మొనర్చుట—లేక-రావణాదులను నాయకులుగా గ్రహించి వాని క్రమపతనమును నిరూపించి తద్ద్వారమున వ్యంగ్యముగా తద్విరుద్ధమైన రామాదుల తత్త్వమునే స్ఫురింపఁజేయుట. పైఁ బేర్కొనఁబడిన ఉత్తమేతర నాయకులు రెండవపద్ధతికిఁ జెందిన ఇతివృత్తమున వర్ణితనగు నవకాశము కలదు. అట్లు కాక నొక్కొక్కసారి కవు లుత్తమేతర నాయకులను నైకొని నను, వారియందు పశ్చాత్తాపాదులఁ గల్గించి, ధర్మబద్ధమైన పురుషార్థ సాధనా త్మకమగు మనఃప్రవృత్తిని క్రమక్రమోన్మీలితముగా నిరూపింపవచ్చును. ఆ పురోగమనములో నతని యధర్మచేష్టితములను గ్రమముగా దిగవిడుచుచు నతనియం దంతర్వాహినిగా ధర్మోత్సాహమును ప్రచురముగా వర్ణించుచు నాయకుని పురుషార్థసాధనను కవి కావ్యమున నిరూపింపవచ్చును. అటు ఉత్త

ములగు ధీరోదాత్తుల లక్ష్యమును పురుషార్థ సిద్ధియేకాని వీరిరువురికిని మధ్య అధికారభేదము లేకపోలేదు. ఉత్తమేతరుల యుత్సాహ మిట్టి పరిస్థితులలో నుత్తమత్వసాధన నిమిత్త మగుచున్నది కావున వారి యుత్కటోత్సాహమును గూడ వీరరసనామయోగ్యముగా గ్రహించుటలో విప్రతిపత్తి యుండదని భావింతును. దీనికి దృష్టాంతముగా "అమానిత్వాదులు జ్ఞానమని చెప్పఁబడ నప్పటికిని అవి జ్ఞాననిమిత్తములగుటచే వానికి జ్ఞానమను పేరు కుదురు"నని శంకర భగవత్పాదులు సంభావించినారు. "జ్ఞాన నిమిత్తత్వాత్ జ్ఞానముచ్యతే ఇతి హి అవోచామ; జ్ఞానసహకారి కారణత్వాచ్చ" అని. అట్లగుటచే "ఉత్సాహాత్మకో వీరః" అన్నచోట కూడ ఉత్తమప్రవృత్తి సాధననిమిత్తమైన ఉత్సాహము గూడ క్రమముగా వీరరసమగుననుటలో విప్రతిపత్తి యుండదను నా వినయపూర్వక విజ్ఞాపనమును విజ్ఞులు మన్నింతురుగాక !

## జన్యజనక రసములు - వాని సంబంధము

భరతుఁడు శృంగార వీర రౌద్ర బీభత్సములు జనకరసము లనియు హాస్యాద్భుత కరుణ భయానకములు జన్యరసములనియు సిద్ధాంతీకరించెను.

> "తేషా ముత్పత్తి హేతవ శ్చత్వారో రసాః తద్యథా శృంగారో రౌద్రో వీరో బీభత్స ఇతి. అత్ర
>
> శృంగారాద్ధి భవేద్ధాస్యో రౌద్రాచ్చ కరుణోరసః
> వీరాచ్చైవాద్భుతోత్పత్తి ర్బీభత్సాచ్చ భయానకః"

అని జన్యజనక రససంబంధము (ఉత్పాద్యోత్పాదక సంబంధము) స్థాపించుచు శారదాతనయుఁడు ఒక ఉపాఖ్యానమును దెల్పెను. "భరతులచే ప్రయుక్తమైన 'త్రిపురదాహ' మను రూపకమును గాంచుచుండిన చతురాననుని నాల్గు ముఖములనుండి నాల్గు వృత్తులతోపాటు శృంగారాదులగు ప్రధాన రసములు నాల్గుదయించెను. అందు (భరతులు ప్రయోగించిన త్రిపురమర్దనమును గాంచుచుండిన) చతుర్ముఖుని దక్షిణ దిఙ్ముఖమునుండి సాత్త్వతీవృత్తితో వీర ముదయించెను. త్రిపురమర్దనావసరమునందు శివునిచే ప్రదర్శితమైన వీరమువలన సమస్త భూతములందును అద్భుతము జనించినది". (అప్పారావుగారి అనువాదము) ఈ గాథ అద్భుత వీరరసములకుగల జన్యజనక సంబంధము ధ్రువపరచు చున్నది.

అద్భుత రసస్ఫూర్తి కల్పించుటకు కవులు తమతమ కావ్యములలో సామాన్యముగా రెండుమార్గము లవలంబింతురు. ఒకటి: నాయకునియందు లోకోత్తర కార్యసాధన రూపమైన ఉత్కటోత్సాహము వర్ణించి సామాజికులకు అద్భుత రసస్ఫూర్తి కల్గించుట. రెండవది: నాయకాశ్రయమైన వీరమును గాంచి కావ్యగతపాత్రలే ఆశ్చర్యముద్ర వహించినట్లు వర్ణించుట. లాక్షణికుల దృష్టినిబట్టి - కావ్యగతవీరము హేతువుగా జన్యమైన అద్భుతము కావ్యమున ప్రదర్శితమగుటయే ఉత్తమవిధమనియు, జన్యజనక రసనిరూపణ మార్గ మదియే ననియు నూహింప వీలగుచున్నది. ఎట్లనఁగా; సామాజికులు నాయకుని యందు తాదాత్మ్యమునుపొంది తద్గతమైన భావోత్కర్షస్థితి ననుభవింతురు కదా![1] అట్టియెడ నాయకగతమగు వీరమే సామాజికుఁ డనుభవించునుగాని అద్భుతముకాఁజాలదు. కాని సహృదయుఁడగు సామాజికుడు నాయకుని సాహసమును హృదయమున వితర్కించుకొని తత్ఫలితముగా నద్భుతమును తరువాత ననుభవించును. అనఁగా సద్యస్స్ఫూర్తిగా వీరము, వితర్కానంతరము అద్భుతము సామాజికునియం దుద్భవమందునని తాత్పర్యము. సర్వజన సులభముగా రసస్ఫూర్తి కల్గుటకై కవి ఆశ్చర్య ముద్రాంకితులైనట్లు కొన్ని పాత్రలను కావ్యముననే సృజించి వానితో తాదాత్మ్యముఁబొందు సామాజికులకు రసాస్వాదనావకాశము కల్పించును. ఇది మొదటి పద్ధతికన్న సులభము, అనుసరణీయము. శారదాతనయుని యుదాహరణమున త్రిపుర మర్దనుని వీరముగాంచిన బ్రహ్మయందు వీరరసస్ఫూర్తి కల్గినది; అద్భుతము ప్రకటించిన సకల భూతములఁ గాంచిన సామాజికులచే నద్భుత మాస్వాదితమైనది. కావున కావ్యములందే నిబద్ధింపబడు వీరాద్భుతములు కావ్యరసములుగ సామాజికుఁ డనుభవించునని తాత్పర్యము.

కావ్యమున వీరరస ఫలితముగా నద్భుతరస మనుసంధింపఁబడుటయందు రసానందము కావ్య ప్రయోజనమైనను సామాజికులు తద్వీరౌన్నత్యము నర్థము చేసికొని దానిని జీవిత రంగమున గౌరవించునట్టి మనశ్శిక్షణారూపమైన ప్రబోధముకూడ వ్యంగ్యమార్గమున గ్రహింతురు యుద్ధవీరాదులు శారీరబల పరాక్రమాదులను ప్రదర్శించుటవలనను, దాన దయా జ్ఞాన వీరాదులు సాత్త్విక భావాదులను వ్యక్తపఱచుటవలనను నాయకునియం దవి గోచరమగుచుండును.

1. యస్తుష్టౌ తుష్టిమాయాతి శోకేశోక ముపైతిచ
దైన్యే దీనత్వ మాయాతి సనాట్యే ప్రేక్షకస్స్మృతః. — నా. శా. 27. అధ్యా. 62 శ్లో

సామాజికుఁడుకూడ తదుచితమైన చిత్తౌన్నత్యమును సాధించినగాని తదౌన్నత్యమును గుర్తింపఁజాలడు. కావ్యానుశీలనమువలన నాతఁడు తదధికారముఁ బొందనేర్చును.

## శత్రు మిత్ర రసములు

వీర రసమునకు శాంతభయానక రసములు విరోధిరసములని లాక్షణికులు కొందఱు పేర్కొనియున్నారు. కాని శాంతరసము వీరమునకు విరోధియనుట అంత సమంజసము, సహేతుకము కాదు. శాంతము సర్వరసములకుఁ బ్రకృతి రసమనియు తదితరములన్నియు వికృతి రసములనియుఁ బేర్కొని, అవన్నియు శాంతమునుండియే జన్మించి అందే అంతర్లీనమగునని అభినవగుప్తుడు.

"భావా వికారా రత్యాద్యా శ్శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే
స్వంస్వం నిమిత్తమాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయేతు శాంత ఏవ ప్రలీయతే"

["శాంతము ప్రకృతిరసము. రత్యాదిభావములు వికృతులు. ప్రకృతి వలనఁ బుట్టిన వికృతి ప్రకృతియందే లీనమగును. ఆ యా నిమిత్తమునుబట్టి శాంతమునుండి రత్యాదులు ప్రవర్తిల్లును. ఆ నిమిత్త మడఁగగానే శాంతమే నిలుచును. కావున శాంతము భిత్తివంటిది. రత్యాదులు దానిపై వ్రాయబడిన చిత్తరువుల వంటివి. భిత్తి స్థిరమైనది. చిత్తరువు లస్థిరములు. ఒక చిత్తరువునుఁ జెఱపి మఱొక చిత్తరువును వ్రాయుచున్నను భిత్తి యేకరూపముగా నిలుచును. కావున శాంతరసమునుండియే నిమిత్తమునుబట్టి ఇతర రసములు వెడలును. చిత్త మడఁగగానే మఱల శాంతమే నిలుచును.]

కొందఱు లాక్షణికులు ఉత్సాహము శాంతమునకు స్థాయి భావముగాఁ బేర్కొనిరి. ధర్మవీరమే శాంత రసమనిరి. ధర్మము ప్రవృత్తి నివృత్తి భేదముచే ద్వివిధము. ప్రవృత్తిధర్మము వీరము. నివృత్తి ధర్మము శాంతము అని వారి భావము. అట్లగుచో మోక్షమును సాధించుటకు తీవ్రమగు యత్నమవసరముగాన శాంతరసమున కుత్సాహమే స్థాయి అని అనియుండిరి. ముముక్షువులకు సాధనసంపత్తిలో శమాది షట్కసంపత్తి చేర్పఁబడియున్నది. ఇది ఉపనిషత్సిద్ధము. ఈ దృష్టితో శమము సాధనరూపమగును. సాధకుఁ డుత్సాహవంతుఁ

1. కావ్యాలంకార సంగ్రహము (శ్రీ స. సూ. శా. వ్యా. ఆ. 800 పుట.

డగు ననుట నిర్వివాదాంశము. అతనియందు వీరరసము నిబంధింపఁబడుటయు నపేక్షితమే. కావుననే అభినవగుప్తుఁడు "దాన ధర్మ వీర శాంత ప్రధానో ధీర శాంతః; మోక్షఫలకః శాంతః" అనియు నిర్దేశించినాఁడు. కొందఱు శాంతమును వీర బీభత్సాదులలో నంతర్భవింపఁ జేయుదు రని ధనంజయాదులు పేర్కొనియున్నారు. అంతేగాక - శాంతమునకు విరోధి అనిగాని, మిత్రమని గాని చెప్పఁబడు రసములేదని అమృతానందయోగి. "శాంతః సర్వ రసోత్కృష్టో న మైత్రీ న విరోధతా" (అలంకార సంగ్రహము.)

పైఁ బేర్కొనఁబడిన వీర శాంతరస సంబంధము సమీక్షించినచో వీరమునకు శాంతము విరోధిరసమని పేర్కొనుట కెట్టి యుపపత్తులు గోచరింపవు. వీరమున శాంత మంతర్భూతము కాకపోవచ్చును కాని శమసాధనపర్యంతము ముముక్షువునం దుత్సాహము శాంతమునకుఁ బోషకముగా నిలుచుచున్నపుడు శాంతమునకు వీరము విరోధియనుట అసమంజసము.

భయానకముగూడ వీరమునకు శత్రురసముగాఁ బేర్కొనఁబడినది. భయ భావోత్కర్ష రూపమైన భయానకము ఉత్సాహవంతునియందు గోచరింప రాదని వారి భావము. భయానకమువలన లోకోత్తర కార్యసాధనను కుంటు వడి యనౌచిత్య మేర్పడు నవకాశము గలుగును. కాని ఉత్సాహము స్థాయి భావమైనప్పుడు రత్యాదులగు భావములు సందర్భోచితముగా వ్యభిచారి భావములుగాఁ బోషింపఁ బడవచ్చునుకదా! సంచారి భావములు కించి దుద్బుద్ధితములైన భావములు మాత్రమే. అవి రసమునకు పుష్టిదాయకములగును. కావున భయ ముత్సాహమునకు సంచారి భావముగాఁ బ్రయోగింపఁబడినప్పుడు తత్పుష్టికిఁ దోడ్పడినచో దానిని మనము గ్రహింపవచ్చును.

లోకమునందు కార్యసాధకులలో తమతమ కార్యములు సఫలములగు లోపల తద్విఘాతుకములైన విఘ్నము లావహిల్లునేమో యను భయము తలచుగాఁ గానఁబడుచుండును.

> "భోగే రోగభయం, కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం
> మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయాః భయం
> శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాంతాద్భయం
> సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయమ్"[1]

అని భర్తృహరి సర్వ మానవహృదయ తత్త్వమును వివరించియున్నాఁడు.

1. భర్తృహరి సుభాషితము. వైరాగ్యశతకము. శ్లో. 31.

పైఁ జెప్పిన భయములన్నిటికిని ఉదాహరణములు గ్రంథ విస్తృతిభయముచే విరమించుచు నొక్క దానినిమాత్రము మచ్చునకిత్తును. ఆముక్తమాల్యదలో మాలదాసరి కథయందు దాసరి బ్రహ్మరాక్షసుని కిచ్చిన వాగ్దానమును నిలువఁ బెట్టుకొనుటలో అసత్యభయము నొందుట వర్ణితమైనది.

"అతఁడు తదల్ప పాపఫలమందుట సుంకము దీఱిపోయి త
చ్ఛత దళపత్త్రినేత్రునకుఁ జాగిలిమ్రొక్కి రణద్విపంచియై
స్తుతికలిత ప్రబంధములఁ జొక్కఁగఁ బాడి యసత్యభీభర
ద్రుతగతి వచ్చి రాత్రిచరుతో వ్రతపూర్తిగతార్తి నిట్లనున్"[1]

నిత్య సత్యసాధకునకు అసత్య భయముండుట సహజమని దీనివలన స్పష్టపడుచున్నది. రత్యాదులవలె భయమును వాసనాత్మకమైన స్థాయిభావమే. కాని ఉత్సాహము వీరనిష్ఠ మగుటచే వారియందది పూర్తిగా నిండియుండును. ఉత్తమవీరులందు భయము వాసనాత్మకముగా నంతరాంతరమునందు మెఱపువలె నొక్కసారి తళుక్కున మెరసినను, అది మఱుక్షణమున నుత్సాహమును ద్విగుణీకృత మొనర్చుచుండును. హరిశ్చంద్రునియందు విశ్వామిత్రుని ఋణ మెట్లు తీర్తునాఁయనెడి భయము లేకపోలేదు; కాని అదియే అతని సత్యనిష్ఠను మెఱుగువెట్టి యుత్తమపథమునకు దారితీసినది. "శ్రేయాంసి బహువిఘ్నాని" అను సామెతయు,

"ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్ననిహతా విరమన్తి మధ్యాః
విఘ్నైర్ముహుర్ముహు రపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి"

అను ఆర్యోక్తియు లోకప్రసిద్ధములే. కావున భయమును ఉత్సాహమునకు సంచారిభావముగను, భయభావోత్కర్ష రూపమైన భయానకరసము మాత్రము వీరమునకు విరోధిగను పరిగణించుట యుక్తమని నా విధేయ విజ్ఞాపనము.

ధ్వన్యాలోకకర్త కావ్యమున విరోధి రసములు కూడ నొకచో స్వీకరింపవచ్చునని పేర్కొని యుండెను. విరుద్ధరస సమ్మేళనముఁగూర్చి ఆయన పల్కిన పల్కు లివి: "అంగిగా వివక్షితమగు రసము స్వసామగ్రియగు విభావానుభావ వ్యభిచారులచేఁ జక్కఁగ పరిపుష్టమైన పిమ్మట విరోధి రసాంగములగు విభావానుభావాదులఁ గైకొని నిరూపింపవచ్చును. వానిని స్వీకరించు

1. ఆముక్తమాల్యద-షష్ఠాశ్వాసము. పద్య. 44.

నప్పుడు ఆ విషయము మాత్రము చాల జాగ్రత్తగా గమనింపవలెను. ఆ విరోధి రసాంగములు వివక్షిత రసమునకు బాధ్యకోటి లోనైన నుండవలయును, లేదా అంగములుగానైన ఉండవలెను. బాధ్యత యేర్పడుటకు మార్గమిది. విరోధి రసాంగములు వివక్షిత రసముచే నభిభవింప వీలగునట్లుండవలయును. మఱియొక విధముగా బాధ్యత యేర్పడదు. ఇట్లు బాధ్యములైన విరోధి రసాంగములు ప్రకృతమగు వివక్షిత రసమును జక్కగాఁ బోషించుటలోనే పర్యవసించును."[1]

## అంగాంగిరస నిరూపణము

దృశ్య శ్రవ్య కావ్యములందు అంగిరసములుగా శృంగార వీరములు మాత్రమే ప్రయోగింపవలెనని లాక్షణికులలో కొందఱి మతము. మఱి కొందఱు వీనితోఁబాటు శాంతమును, కరుణమును, అద్భుతమును, అంగి రసములుగా నంగీకరించిరి. ప్రస్తుతమీ చర్చ అనవసరముగాన వదలుచున్నాను. కాఁగా శృంగార వీరములే కావ్యాంగి రసములుగా నేల గ్రహింపఁబడినవని యోచింపవలసి యున్నది. "లోకమునందు శృంగారము సర్వప్రాణి సాధారణము. దీనివలన సంసార మేర్పడును. తద్రక్షణమున వీరమావశ్యకము" అని కొందఱును "కామము సకలజాతి సులభము. అది అందఱకును హృద్యమైనది. అందుచే శృంగారము మొదట చెప్పఁబడిన"దని అభినవగుప్తుఁడును వ్రాసి యున్నారు.[2]

శృంగారము హృద్యముకాని జీవి యుండదనుమాట సత్యమే. కాని అందులో దేశకాల పాత్రముల ననుసరించి సర్వ ప్రాణులు శృంగారము ననుభవింపలేవు. ఉదా : బాలురు, వృద్ధులు మొ. వారు. భరతర్షి యన్నట్లు శృంగారము యువతీ యువకులకు సంబంధించినది మాత్రమే. "సచ స్త్రీ పురుష హేతుక ఉత్తమ యువప్రకృతిః" (నాట్య. శా. 6. అధ్యా 86 పుట). అయినను బాలవృద్ధాదులకు గూడ నది ఆహ్లాదజనకము గావచ్చును. కాని వారు పాత్రలలో తాదాత్మ్యము పొందఁజాలరు. కావున శృంగారము మానవ జీవితమునందు కొన్ని యెడల అనుభూతికి దూరమై, ఆశ్రయ చతుష్టయ వ్యాప్తిని పొందఁజాలక పోవుచున్నది. దానికి కారణములు :

1. కామము మానవుఁడు పుట్టినదాది జీవితాంతము వఱకు అనుభవించలేఁడు.

---

1. ఆంధ్ర ధ్వన్యాలోకము. (వే. వి. వేం.) తృ. పుట 440.
2. నాట్యశాస్త్రము శ్రీ పో. శ్రీ. అ. 216 పుట., 8 వ విశే.

2. పురుషార్థములలో కామ మొక్కటి మాత్రమే. తదితరములగు ధర్మార్థమోక్షములను ప్రాణి సాధింపవలసి యుండును. రఘువంశమున కాళిదాసు

"శైశవేఽభ్యస్త విద్యానాం, యౌవనే విషయైషిణాం
వార్థకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్.[1]

అని రఘువంశ రాజుల పురుషార్థ సాధనాత్మకమైన జీవిత క్రమమును వర్ణించినాఁడు. ఒకవేళ నెవ్వఁడైన కామపురుషార్థము నే జీవితమున సాధించినను అది ధర్మబద్ధముగా నుండి యత్నసాధ్యముగా నున్నది అనఁగా ధర్మరూపమై ఉత్సాహాత్మకమైన వీరముచే కామము శాసింపఁబడునని తాత్పర్యము.

వీరమునకు మాత్రము జీవితరంగమున తదితర రసములకులేని వ్యాప్తి కలదు. పుట్టిన దాది గిట్టునంతవఱకు నుత్తమత్వ సాధనకై జీవి ఉత్సహించుట కాంచుచున్నాము. ఉదాహరణమునకు :

1. బాలుఁడు : పెద్దల యందును, విద్యాసాధనము నందును చూపు శ్రద్ధాయుతమైన భక్త్యుత్సాహము. ఉదా : ధ్రువ, ప్రహ్లాదాదులు.

2. యువకుఁడు : రూప కలామాన కవిత్వాహింసాదుల యందును, ధనైశ్వర్య క్షమాదులయందును చూపు ఉత్సాహము. ఉదా: కచ, యామునాచార్యాదులు.

3. వృద్ధుఁడు : యోగతపోమోక్షాదుల సాధనమందు చూపు ఉత్సాహము. ఉదా : విష్ణుచిత్త విదురాదులు.

4. శూరుఁడు : యుద్ధోత్సాహాదులు. ఉదా : భీమాదులు.

5. విజ్ఞుఁడు : దాన, దయా, ధర్మ, త్యాగ, యోగ, పాండిత్య, వాద సత్యాదులయందు ప్రదర్శించు నుత్సాహము. ఉదా : యుధిష్ఠిర, హరిశ్చంద్ర, దివోదాసాదులు.

కావుననే ధర్మప్రధానమైన వీర శృంగారాదులు కావ్యమునందు అంగి రసములుగాఁ బ్రయోగింపఁ బడుట.

కావ్యారంభము నుండి అంతము వఱకు బహురసములు వ్యంజితములగుచున్నను వానిలో నేదాని రూప మధికముగా గోచరించునో అది అంగి రసమనియు, మిగిలినవన్నియు నంగములుగా నుండి స్థాయి నుద్దీపింపఁ జేయుచు ప్రవర్తించును గాన నవి అంగరసములనియు పిలువఁబడును. వీరరసమంగి

1. రఘువంశము. ప్రథమ సర్గ. శ్లో. 8.

రసముగాఁ బ్రపంచితమై నప్పుడు మిగిలిన రసములు అంగములుగా నుండి దాని నెట్లు పోషించునో ఇంచుక గమనింతము.

## వీరము - శృంగారము

"తత్ర సంభోగవిషయ ఇచ్ఛా విశేషో రతిః" అని విద్యానాథుఁడు, నాయికానాయకుల ప్రథమవీక్షణమునం దేర్పడిన రతి భావోదయము మొదలు వారి సంభోగాంతముగా వ్యాపించియుండు రతిభావోత్కర్ష రూపమగు శృంగారము అయోగ, సంభోగ విప్రలంభములనెడి అవస్థాత్రయముగా విభజింపఁ బడినది. కథావశమున వీరరసనాయకునకు నాయికా సంబంధము కలిగినప్పుడు వీరరసాంగభూతముగా శృంగారము సంధింపబడును. ఉదాహరణమునకు శమంతకోపాఖ్యాన గాథను గైకొనవచ్చును. శ్రీకృష్ణుఁడు తనకేర్పడిన నిందను నివారించుకొనుటకై శమంతకమణి సాధనప్రయత్న విశేషరూపోత్కటోత్సాహమును ప్రకటించును. అందు యశోవీరము ప్రతీయమానమగుచున్నది. ఇట్లు వీరరసము ప్రధానముగానడచు కథయందు జాంబవతీ, సత్యభామలను, కృష్ణుని నాశ్రయించిన శృంగారవర్ణనము అంగభూతమై ఆనందమును చేకూర్చుచున్నది.

## వీరము - హాస్యము

"వికృతి దర్శనాది జన్యో మనోవికారో హాసః" (ప్ర. రు). అట్టి హాసము హాస్యమునకు స్థాయిభావము. వికృతాకార వాక్చేష్టలుగల వ్యక్తిగాని విషయము గాని హాస్యమునకు ఆలంబన విభావము. వారిచేష్టలే ఉద్దీపనములు. హాస్యమంతస్థమనియు, పరస్థమనియు ద్వివిధము. విభావాదులచే ప్రకటితమగు హాసమునుగాంచి నవ్వినచో నది ఆత్మస్థమనియు, ఇతరులు నవ్వగా వారితో కలిసి నవ్వినచో నది పరస్థమనియు ననఁబడును. ఉదా : ద్రౌపదీ స్వయంవరమునకు వచ్చిన రాజలోకము ద్రుపదునిపైఁ దిరుగఁబడ "ద్రుపదుండు కడు భీతుఁడై బ్రాహ్మణుల మఱువుసొచ్చె నిట్లు శరణాగతుండయిన ద్రుపదు నోడకుండుమని బ్రాహ్మణులు దమ తమ దండాజినంబులెత్తికొని ప్రతిబలంబులపయి వీచుచున్నంత వారలంజూచి నగుచు నర్జునుఁ డిట్లనియె."

"కడఁగి మదీయాస్త్రము లనియెడు పటుమంత్రముల నిప్పుడీ నృపరిపుల
న్నడిఁచి విషాహుల దర్పం బుడిగించెదఁ దొలఁగి చూచుచుండుడు మీరల్"

—మహాభారతము. ఆది. సప్త. 192, 193

ఇందర్జునుని వీరమునకు బ్రాహ్మణాశ్రితమైన హాస్యము అంగము. వారి చేష్ట లకు అర్జునునితోపాటు మనము నొకసారి కడుపార నవ్వికొందుము కదా !

యుద్ధవీరాదులయందు నాయకుని ఉత్సాహాతిశయమును గాంచి శత్రు వులు వడఁకినచో నచ్చట హాస్యము కల్గు నవకాశము గలదు. హాస్య బీభత్స రసములు ఆలంబనము విరివిగా వర్ణించిన మాత్రమునసే ఉదయించును. అప్పుడు సామాజికులే ఆశ్రయ విభావము లగుదురు.

## వీరము - కరుణము

"ఇష్ట జన వియోగాదినా ఆత్మని దుఃఖాతిభూమి శ్శోకః" (ప్ర. రు.) శోకము కరుణమునకు స్థాయి. కరుణము వీరమున కొక్కతటి అంగ మగు చుండును. ఇష్టజన వియోగమువలన నాయకుఁడు శోకమును బొంది తత్కా రకులగువారిని సంహరింప నుత్సహించును. ఉదాహరణమునకు - అభిమన్యు మరణ కారకుఁడు సైంధవుఁడని వినిన అర్జునుఁడు పుత్త్రశోకాతురుఁడయ్యు సైంధవ వధార్థమై ఘోరప్రతిజ్ఞఁ బూని దానిని నిలువఁబెట్టికొనెను. పరశు రాముఁడు పితృవియోగతప్తుఁడయ్యు తత్కారకులగు కార్తవీర్యార్జునుని సంతతిని నిరువదియొక్కసారి సంహరింతునని ప్రతినఁ బూనినాఁడు.

ఇట్లుగాక ప్రతినాయక గతమగు కరుణముగూడ నాయకుని యుత్సా హముఁ బోషించును.

## వీరము - రౌద్రము

"శత్రు కృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః" (ప్ర. రు.). రౌద్రము నకు క్రోధము స్థాయి. ఇచ్చట శత్రు కృతాపరాధము లనుచోట స్వజనాప రాధము కూడ జతపరుపవలసియున్నది. యుద్ధ వీరాదులయందు శత్రుకృతాప రాధ ప్రశంస యెక్కువగా నుండును. ధర్మవీరాదులయందు నాయకుఁడు స్వజనులయందును అపరాధమును క్షమింపఁడు. ఉదా. ఛత్రపతి శివాజీ తన సైన్యాధిపతియగు సోన్‌దేవుఁడు బీజాపురనవాబు నోడించి అతని రాణివాస మును బందీగొని తన ముందునకు తీసికొనిరాగా, నతనిపై మండిపడి—

> "ఆ - యేమీ యొక రాణివాసమును బన్యావాసమున్ దెచ్చినా
> వా ? యే హైందవుఁడైన నీ గతి నమర్యాదన్ బ్రవర్తించునే ?
> మా యాజ్ఞన్ గమనింపవో ? జయమదోన్మాదంబునన్ రేఁగి నీ
> యాయుస్సూత్రములీవ త్రుంచుకొనెదో ? యాద్ధత్య మోర్వన్ జుమీ !"

"అనుచున్ జేవులు మీఱు కన్నుఁగవతో నాస్పందితోష్ఠంబుతో ఘన హుంకారముతో నటద్భ్రుకుటితో గర్జించు" శివాజీ యందు రౌద్రము మూర్తీభవించి ప్రజ్వలించినది "వనితారత్నంబులీ భవ్య హైందవ భూ జంగమ పుణ్యదేవతలు" అను పవిత్రభావముతో నుత్సహించెడి అతని మనఃప్రవృత్తి లోని ధర్మవీరమునం దా రౌద్ర మంతర్భవించుచున్నది. అట్లే 'సత్యాగ్రహ' ఉద్యమ నాయకుఁడై దేశభక్తుల నందఱ నొక్కత్రాట నడపించి శత్రువులగు ఆంగ్లేయులు చేయు అపచారములకు రుద్రుఁడగు గాంధీగారి తత్త్వము, సత్యాగ్రహములో వేదైన లోపము తనవారివలన కలిగినను అతనియం దేర్పడు క్రోధము 'స్వాతంత్ర్యవీరము'న కంగభూతములై దేశము నభ్యుదయమార్గమున నడపి ప్రపంచాదర్శత్వమును తీర్చిదిద్దినవి.

## వీరము - భయానకము

"రౌద్ర సంస్పర్శనాదిభి రనర్థా శంకనం భయమ్." (ప్ర. రు.). భయము భయానకమునకు స్థాయి. శత్రు నాయకాశ్రితమగు భయానకము నాయకుని వీరమున కంగమగుచుండును.

## వీరము - బీభత్సము

"అర్థానాం దోషసందర్శ నాదిభి ర్గర్హణా జుగుప్సా" (ప్ర. రు.). జుగుప్స బీభత్సమునకు స్థాయి. యుద్ధ వీరాదులలో నాయకరణోత్సాహ ఫలితముగా రక్తసిక్తమైన రణరంగాదులను వర్ణించునప్పుడు వీరమున కది అంగముగా నుండ గలదు. వీరమునకు బీభత్సము ప్రత్యక్షముగాఁ పోషకము కాకపోయినను పరోక్షముగానైనను గాకపోదు.

ఇఁక వీరమునకును అద్భుత శాంతాదులకును గల సంబంధము పూర్వమే చర్చింపఁబడినది.

శృంగారాదులు అంగిగాగల కావ్యములందు వీరమంగముగా నిలుచును. అసలు శృంగార వీరములే అంగిరసములుగా నుండఁదగినవని పెక్కుఱు లాక్షణికుల మతము. ఈ చర్చ పూర్వమే చేసితిని. ఇంతియకాక కరుణ రౌద్ర శాంతాదులు కావ్యములం దంగిరసములుగా నెడనెడ గానఁబడుచునే యున్నవి. వానికిని వీర మంగముగా నుండి తద్రసపోషణకుఁ దోడ్పడును.

★

# 3. వీరరస భేదములు

లోకవృత్తము కార్యబహుళము. కార్యసాధనా స్వరూపములన్నియు నొకటియే యైనను వాని నిమిత్తములనుబట్టి భిన్నభిన్న నామములతోఁ బిలువఁబడు చుండును. సంగీతము, చిత్రలేఖనము, కవిత్వము, శిల్పము మొదలగు కళలను సాధించుటయందలి ప్రయత్నమంతయు నొకే రూపమైనను, తత్తన్నిమిత్తాదులచే తత్తన్నామములతో భాసించుట యిందులకు దృష్టాంతము. అట్లే అపూర్వకార్యసాధనోత్సాహ రూపమగు వీరము నిమిత్తభేదముచే పెక్కు విధములుగా బిలువఁబడును. లోకోత్తరదానవ్రతమును సాధించుటయందొకఁడు, అపూర్వ దయాసాధనమందొకఁడు, అఖండ ధర్మసాధనమందొకఁడు, అకుంఠిత సత్యవ్రతసాధనమందొకఁడు, అచంచల తపోదీక్షయందొకఁడు-ఉత్కటోత్సాహమును ప్రకటించుచుండ వచ్చును. వారివారి భావోత్కటస్థితిని క్రమముగా—దాన దయా ధర్మసత్యతపోవీరములని పేర్కొన వచ్చును. అయినను వీని యన్నిటియందును పూసలలో దారమట్లు ఉత్సాహము స్థాయిభావముగా నిలిచియున్నదని తాత్పర్యము.

మానవ జీవిత సర్వావస్థలయందు వ్యాపించిన "వీరము" బహుముఖములుగా సాధకునికి గోచరించును గావునను, సాహిత్యమునందును అట్టిది ప్రతిబింబించును గావునను, లాక్షణికులు వీరరసమును బహువిధములుగా వింగడించి ప్రపంచించినారు. మఱియు లోకవృత్తమును గమనించుచు, ఉచితములైన మఱికొన్ని భేదము లొనరించుకొన వచ్చునని సహృదయులకు సదవకాశముఁ గల్పించి తమ విశాల హృదయములఁ బ్రకటించి యున్నారు.

బ్రహ్మదేవునిచే వీరము త్రివిధముగా విభజింపఁ బడెనని భరతమహర్షి;

"దానవీరం ధర్మవీరం యుద్ధవీరం తథైవ చ
రసం వీరమపి ప్రాహ బ్రహ్మా త్రివిధ మేవచ"[1]

ధనంజయాదులు కూడ వీరమును త్రివిధముగాఁ బేర్కొనిరి. "సచదయారణదానయోగా త్త్రిధా" అని, (దశరూపకము). కాని భరతుఁడు చెప్పిన దాన ధర్మయుద్ధ వీరములకు బదులు దయాదానయుద్ధములను (ధర్మవీరమును వదలి) పేర్కొని యుండిరి. విద్యానాథాదులు ధర్మవీరమును గలిపి, దాన, ధర్మ దయా యుద్ధములని వీరమును నాల్గువిధములుగా నొనరించి యుండిరి.

1. భరతనాట్యశాస్త్రము - 6 వ అధ్యా. శ్లో. 80

అంతటితో నాఁగక రసగంగాధరకారుఁడు వీరము నెనిమిది విధములుగాఁ జేర్కొనెను. అవి : యుద్ధవీరము, దానవీరము. దయావీరము, ధర్మవీరము, సత్యవీరము, పాండిత్యవీరము, క్షమావీరము, బలవీరము అనునవి. అచ్యుత రాయలు మఱియొక అడుగు ముందుకు వేసి, తన సాహిత్యసారమున వీర మును మొదట ద్వాదశ భేదములుగా నొనర్చెను.

"యుద్ధదాన దయాధర్మ సత్యవిద్యా తపోబలైః
త్యాగయోగ క్షమాజ్ఞానై స్తదుపాధే ర్ద్విషేదతః"[1]

అతఁడే మఱికొన్ని భేదములను జేర్చి యిరువది యొక్కటిగా తరువాత పెంచెను.[2] అవి :

1. యుద్ధవీరము.
2. దానవీరము.
3. దయావీరము.
4. ధర్మవీరము.
5. సత్యవీరము.
6. విద్యావీరము(పాండిత్యవీరము)
7. తపోవీరము.
8. బలవీరము (యత్నవీరము).
9. త్యాగవీరము.
10. యోగవీరము.
11. క్షమావీరము.
12. జ్ఞానవీరము.
13. సంపద్వీరము.
14. రూపవీరము.
15. కళావీరము.
16. గానవీరము.
17. అహింసావీరము.
18. ఐశ్వర్యవీరము.
19. కవిత్వవీరము.
20. శ్రద్ధావీరము.
21. భక్తివీరము.

ఇట్లు బహువిధములుగా వ్యాపించియుండు వీరము మూఁడు విధములనిగాని, నాల్గు విధములనిగాని నిర్ణయింపఁ గూడదు. కావ్యానుశీలన ప్రవృత్తులగు సహృదయులు కావ్యలోకమున మఱికొన్ని భేదము లేర్పఱుచుకొనవచ్చును. విజ్ఞులు దానికి సంతసింతురు.

అభినవగుప్తాదులు ధర్మప్రధానమైనది వీరమని చెప్పియుండుట గమనించి యున్నాము. ధర్మనిష్ఠముగాని యుత్సాహము వీరరసరూపము దాల్పఁజాలదు. అట్లగునప్పుడు వీరము ధర్మైకావలంబనమైనది. అదియే దాని మూలస్వరూ

1. సాహిత్యసారము-పూర్వార్ధము. 4వ ప్రకరణము 99 శ్లో.
2. "సంపద్రూప కళాగానాహింసై శ్వర్య కవిత్వతః
శ్రద్ధా భక్త్యాదిభి శ్చాస్య తద్వైవాను భవో యతః."
—పూర్వార్ధము - 4వ ప్రక. 118 శ్లో.

పము. తదితర వీరభేదములు ధర్మనిష్ఠమైన ఉత్సాహభావములే కావున— ఆ ధర్మవీరమునకు పలువిధములైన అవాంతర రూపములే యగుచున్నవి. సలిల మొక్కటియేయైనను ఆవర్త, బుద్బుద, తరంగవికారములచే భిన్న భిన్నాకృతులతో నెట్లు కానఁబడుచున్నదో - అట్లే ధర్మానుప్రాణితమైన వీర రసభేదము లన్నియు ధర్మస్వరూపములయ్యు తత్తదాశ్రయనిమిత్త భేదములచే వివిధ నామములతో వ్యవహరింపఁబడుచున్నవి.

ధర్మము ప్రవృత్తి నివృత్తి భేదముచే ద్వివిధము. లౌకికధర్మములన్నియు ప్రవృత్త్యాత్మకములు ; మోక్షసంబద్ధములైన ధర్మములు నివృత్త్యాత్మకములు. వీర మీ రెండింటియందు వ్యాపించియున్నను, ప్రవృత్తిధర్మమునందే సమగ్ర రూపమును దాల్చును. నివృత్తిధర్మమునందు శమసాధన పర్యంతము శాంత మున కంగముగా నిలచి తత్పోషకమై, తదుపరి తదంతర్లీనమగును.

ధర్మలక్షణము నీ క్రిందివిధముగాఁ బ్రాచీనులు కొందఱు నిర్వచించిరి :

"చోదనా లక్షణోఽర్థో ధర్మః" —జైమిని సూత్రము

"విద్వద్భి స్సేవిత స్సద్భిః నిత్యమ ద్వేషరాగిభిః
హృదయేనాఽభ్యనుజ్ఞాతో ధర్మః" —మనుస్మృతి

"ధృతిః క్షమా దయాఽస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః
హ్రీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణం" —మహాభారతము

"అహింసా సత్యమస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః
దానం దమో దయా క్షాంతిః సర్వేషాం ధర్మసాధనమ్
—యాజ్ఞవల్క్య స్మృతి

"వేదోక్తోహి ద్వివిధో ధర్మః ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణశ్చ"
—శాంకర గీతాభాష్యము

పై వాక్యములఁబట్టి - ధర్మము విధివాక్య ప్రతిపాద్య మనియు, ద్వేష రాగ రహితులగు విద్వాంసులచే నిత్యమాచరింపఁబడునదనియు, సంస్కృత మైన హృదయముచేత నభ్యనుజ్ఞాతమైనదనియు, ధృతి, క్షమ, దయ, అస్తే యము, శౌచము, ఇంద్రియనిగ్రహము, విద్య, సత్యము, క్రోధము అను పది యును (ప్రవృత్తి) ధర్మలక్షణములనియు, అహింస, సత్యము, అస్తేయము, శౌచము, ఇంద్రియనిగ్రహము, దానము, దయ, క్షాంతి మొ. వానివలన ధర్మ సాధన మగుననియు, ధర్మము ప్రవృత్తి నివృత్తి భేదముచే ద్వివిధమని వేదోక్తి యనియు తాత్పర్యముగాఁ దేలుచున్నది. "ధర్మము సత్త్వాఖ్య శక్తిరూపము;

బుద్ధిజన్యము". "ప్రసన్నచేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి" అన్నట్లు అది బుద్ధి జన్యమగుటచే (బుద్ధి ఆత్మకు సన్నిహితమై తత్ప్రకాశానందమయ మగుటవలన) ధర్మాచరణ జన్యమగు ఆనందము సహజముగా వ్యాపకమై వైశాల్యోన్నత్య గాంభీర్యధుర్యమై యుండుననుటలో సందేహము లేదు. కేవల ధర్మమయుల జీవితమట్టి విశాలోన్నత గంభీర సుఖమయమై యుండునని దృఢముగాఁ జెప్ప వచ్చును. కావుననే వారు అర్థకామనాశాదుల విషయమున నాసంగము చింతింపరు. అది అట్లు వ్యాపకముగనుకనే జీవితావసరములగు అర్థకామముల యందు వ్యాపించి తజ్జన్యానందమును నిర్మలపఱుచును."[1]

ప్రవృత్తి ధర్మములో సామాన్యధర్మము, విశేషధర్మము అని రెండు విధములు కలవు. అహింసాస్తేయాది దశకము సామాన్యధర్మములు. వేదోక్త ధర్మములకు, నఖిలస్మృతి పురాణవర్గములయందుఁ జేర్కొనఁబడిన ధర్మములకు వాదయినచోట విశేషధర్మము లనుష్ఠేయములగును. వానినే ధర్మ సూక్ష్మములనియు నందురు. దీనికి భారతమునుండి యుదాహరణ మొండిచ్చుటఁ బొందుపఱుచుట అప్రస్తుతము కాదనుకొందును. కర్ణపర్వతృతీయాశ్వాసమున కర్ణునిచే బాధితుఁడయి శిబిరమునకుఁ దిరిగివచ్చిన ధర్మరాజుయొక్క సేమమరసి పోవుటకై అర్జునుఁ డేతెంచును. అతఁడు కర్ణుని సంహరింపకయే తనను జూడ వచ్చెనని ధర్మజుఁ డసూయామర్షముల నొంది తమ్ముని నిందించుచు—

"హరి గలుగంగ నేటికి భయం బగున విన్బితి నీదు గాండివం
బెరవుగ నిచ్చి నీవు నొగలెక్క హరిస్ రథిఁ జేయఁ గన్న ని
ష్ఠుర భుజవిక్రమోగ్రుఁ డగు సూతతనూభవుఁ దత్సహాయులం
బోరిఁ గొనఁడె సుయోధనుని పోఁడిమి దూలఁగ నొక్కమాత్రలో"

అని నిష్ఠురముగాఁ బల్కును. అర్జునుఁడు తన గాండీవము నొరున కిమ్మను వాని శిరముఁ బగులవ్రేయఁ బ్రతినఁబూనినవాఁడు. కావున ధర్మజునిఁజంప నుంకించును. కృష్ణుఁడు పార్థుని వారించి, అతని కసత్యదోషము రాకుండగను, అహింస పరిరక్షింపఁబడునట్లుగను ధర్మసూక్ష్మమును బ్రసాదించి పాండవుల రక్షించును. కృష్ణుఁడన్నమాటలివి :

"నీకు వృద్ధసేవ లేకున్కి యెఱుఁగంగనయ్యె రిత్త యిట్టు లడిచిపడుటఁ
బట్టి; ధర్మవిధి విభాగజ్ఞులైన వా రేల చేయఁబొత్తు రిట్టిదాని"
"చేయంగవలయు వానిం జేయుట యిట్టివి యె? కొన్ని చేయకునికి ధ
ర్మాయత్తచిత్తుఁడై నానా యోగ్యస్థలము లెఱిఁగి నడవఁగ వలదే"

1. కావ్యకళాతత్త్వ ప్రకాశిక. పుట. ప్రాతప్రతి. 119, 120.

"సత్యము నహింసయు నను నత్యుత్తమ ధర్మయుగళమందు నహింసన్
సత్యము గాచుట ధర్మ మసత్యమున నహింసఁ గావఁ జనునండ్రు బుధుల్"
"కర్మసూక్ష్మభంగి గానక యిమ్మెయి సత్యరక్షణంబు సలుపు పొంటి
భ్రాత ధర్మపరుఁడు రాజిమ్మహాత్ముఁ జంపఁగఁ దలఁచుట ధర్మపథము గాదు"
అంతియగాక—
"ప్రాణహాని వచ్చుపట్టున సర్వధనాపహార వేళయందు నడపు
సత్య మనృతమండ్రసత్యంబు సూనృతమని పరిగ్రహింతు రార్యజనులు."[1]
ఈ ఘట్టమునందు ప్రతిజ్ఞానిర్వహణ రూపమగు సత్యధర్మమునకును, అహింసా ధర్మమునకును సంఘర్షణ మేర్పడినది. ఇం దహింసను సత్యముతోఁ గాపాడుట సామాన్యధర్మము. కాని అది ఇచ్చట అసాధ్యమగుచున్నది. కావున నసత్యమున నైనను అహింసను గాపాడుట ధర్మమని ధర్మకర్మ సూక్ష్మము ప్రతిపాదిత మైనది.
"ధర్మజ్ఞులైన పురుషులు ధర్మువునకు బాధసేయు ధర్మువునైనన్
ధర్మముగా మదిఁ దలఁపరు ధర్మువు సర్వంబునకు హితంబు కావలయున్"[2]
అందువలననే శాస్త్రకారులు—"న జాతు కామాన్నభయాన్న లోభాత్ ధర్మం త్యజే జ్జీవితస్యాపి హేతోః" అని నిర్దేశించియున్నారు.

## 1. యుద్ధవీరము

లాక్షణికులలోఁ గొందఱు వీరమనగా యుద్ధవీరమనియే భావించినట్లు నిర్వచనోదాహరణములను తమతమ గ్రంథములందుఁ బొందుపఱిచియుండిరి, వీరరస భేదములలో యుద్ధవీరమునకొక ప్రత్యేకత గోచరించుచున్నది. వీరరస కావ్యమున యుద్ధము ధర్మబద్ధముగాఁ బ్రయుక్తము కావలెను; లేక యుద్ధము ధర్మసాధన కుపకరింపవలెను. ఇట్లనుటలో నర్థమిది: కీర్త్యాదులను గాని, ప్రజారక్షణమును గాని అర్థించి వీరుఁడు శత్రువులతో పోరాడినను, అది యుద్ధ ధర్మ విరుద్ధముగను, న్యాయవిరుద్ధముగను ఉండరాదనుట మొదటిది. క్షత్రియులకు యుద్ధము కులధర్మమనుట రెండవది. భగవద్గీతయందిట్లు చెప్పఁ బడినది:
"స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే"
—భగవద్గీత. అ. 3; శ్లో. 31.

1. ఆంధ్ర మహాభారతము- కర్ణపర్వము. తృ. ఆ. పద్య. 65, 71, 72, 73, 74, 77.
2. ఆంధ్రమహాభారతము. అరణ్యపర్వ. తృ. ఆ. ప. 230.

కావున క్షత్రియులకు యుద్ధమొనర్చుట యొకవిధమైన ధర్మసాధన రూపమైన కర్మమగుచున్నది. ఎట్లైనను యుద్ధము ధర్మముచేత శాసింపఁబడుచున్నది కావునను, ధర్మ విరహితమైనది వీరరస నామార్హము కాదు కనుకను యుద్ధ వీరము ధర్మవీరముయొక్క రూపాంతరమే యగుచున్నది. "ధర్మయుద్ధ వీర ప్రధానో ధీరోదాత్తః వీరరౌద్ర ప్రధానో ధీరోద్ధతః" అని వక్కాణింపఁబడి యుండుటచే ధర్మ యుద్ధవీరములందు ధీరోదాత్తుఁడు నాయకుఁడనియు, వీర రౌద్రములందు ధీరోద్ధతుఁడనియు నిర్ణయింపవచ్చును. యుద్ధవీరమున ధీరోదాత్తుఁడు నాయకుఁడైనచోఁ బ్రతినాయకుఁడుగా ధీరోద్ధతుఁడుండవచ్చును. రౌద్ర ప్రధానుఁడగు ప్రతినాయకుఁడు అర్థ సాధనపరుఁడై ధర్మరహితమైన రణమునుగూడ ఆచరించును. కాని నాయకుఁడుమాత్రము ధర్మదృష్టి వీడఁడు. కొన్నియెడల ఇరువురును ధర్మప్రధానులై యుద్ధమొనర్పవచ్చును.

నాయకుఁడు శత్రురాజులపై విజయార్థియై యొనర్చు ప్రయత్న విశేషాదుల సంపుటీకరణము యుద్ధతంత్రము. సామదానభేదదండములని నీత్యుపాయములు నాల్గువిధములు. అందు సామదాన భేదోపాయములు యుద్ధ విరమణ ప్రయత్నములు. దండమనునది తద్వైఫల్యానంతర మొనర్చు యుద్ధ కాండ. అందు సామాన్యముగా క్రోధ భావస్ఫూర్తి కలుగుచుండును. అది అధిక్షేపము, అవమానము, అసత్యవచనము, ఉపఘాతము, వాక్పారుష్యము, అభిద్రోహము, అసూయ మొ. నవి కారణములుగను, కొట్టుట, విఱుచుట, మర్దించుట, నరకుట, ఆయుధములను గ్రహించుట, శస్త్రములను బ్రయోగించుట, రక్తమును స్రవింపఁజేయుట మొ. నవి కార్యములుగను ప్రపంచితమయి, రక్తనయనములు, స్వేదము, భృకుటిముడి వేయుట, పండ్లు కొఱుకుట, ఔడు గఱచుట, చెక్కిళ్ళు అదరుట, అరచేతులు నొండొంటికి రాచుట మొదలగు చేష్టలరూపమున వీరునియందు గోచరించి, సమ్మోహము, ఉత్సాహము, ఆవేగము, అమర్షము, చపలత, ఉగ్రత, గర్వము, వేపథువు మొ. భావములచే నా క్రోధము పరిపుష్టమై రౌద్రరసరూపమున వ్యక్తముకావచ్చును. అప్పు డొకవిధముగా వీరము రౌద్రానుప్రాణిత మగును. కాని శుద్ధవీరము క్రోధానుభావ విరహితమైనప్పుడే స్ఫురించును. కాగా వీరరస మంగిగానుండ దానికి యుద్ధగతమైన రౌద్రము అంగరసముగా కావ్యములందు నిబంధింపఁబడుచుండును. అప్పుడు శత్రురాజులతో యుద్ధప్రయత్న మొనర్చునెడఁ బ్రకటించు క్రోధము ఉత్సాహ స్థాయిభావమున కంగమయి తత్పోషకత్వమునకు

హేతుభూతమగునే కాని వీరమును మించి ప్రవర్తింపనేరదు. వీరను యుద్ధ విషయక సర్వోత్సాహోత్కట స్వరూపమై, సువిశాలమై, సర్వవ్యాప్తమై ప్రకాశించుచుండగా రౌద్రము క్రోధభావ ప్రకటనావసర యుద్ధ క్రియాపర్యంత పరివ్యాప్తమై వీరమునందే లీనమైపోవుచుండును.

యుద్ధవీరమునకును రౌద్రమునకును గల భేదమరయుట యిచ్చట అవసరము. యుద్ధనిమిత్తమైన ఉత్కటోత్సాహమున ధర్మసాధనము ప్రధానమై అర్థకామములు ఆనుషంగికములైనచో నది యుద్ధవీరము. అర్థసాధనోద్దిష్టమైన యుద్ధమున ధర్మమానుషంగికమైన క్రోధభావోత్కటస్థితి రౌద్రము. వీరమున స్థాయి యగు నుత్సాహమునకు క్రోధము సంచారి, రౌద్రమున నుత్సాహము క్రోధమునకు సంచారి. వీరాంగమగు రౌద్రమును ధర్మము శాసించును. యుద్ధక్రియాంతము వఱకు నిలుచు నుత్కటోత్సాహము ధర్మనిష్ఠమై యుద్ధ వీరమనఁబడును.

యుద్ధమాంతర మనియు, బాహ్య మనియు ద్వివిధము. మానవజాతి పుట్టిన దాది నరుఁడు అరిషడ్వర్గముతో చేయు నిత్యసంగ్రామము అంతర్యుద్ధము. ప్రబోధ చంద్రోదయాదులయందు ప్రపంచితమైన తత్త్వమిదియ. మానవుఁడు నైతికముగా నాధ్యాత్మికముగా నభివృద్ధి గాంచవలయు ననిన నీ యంతర్యుద్ధమున విజయము సంపాదింప నత్యంతోత్సాహముఁ జూపవలెను. నేటి ప్రపంచమునందు చేఁతలకు, మాటలకు సమన్వయము కుదురక పరస్పర స్వార్థపూరిత వైషమ్యములఁ బెంచుకొని మారణాయుధములతో భూమాతను బుగ్గిసేయ యత్నించు మానవుల అంతఃకరణములఁ బరిశీలించినచో భౌతిక విజ్ఞానమునకు వారిచ్చుచున్న ప్రాధాన్యము నైతికాధ్యాత్మిక విజ్ఞానమున కిచ్చుట లేదని తేలుచున్నది. అంతశ్శత్రువుల జయించి ప్రపంచశాంతికి కృషి చేయుటలో భారతీయు లగ్రగాము లగుచుండుట యిచ్చట సంతోషింపఁదగిన విషయము.

బాహ్యయుద్ధములు ప్రధానముగా నుపకరణములతో నొనర్చునవి. ఇందు జయాపజయములు దైవాధీనములు. ఇచ్చట గమనింపవలసిన విషయ మొండు కలదు. ధర్మ మార్గానువర్తియగు వీరుఁడు ధర్మయుద్ధము నొనరించుచు, దైవ దుర్విపాకముచే నొక్కయెడ తన యత్నమునందు సఫలీకృతుఁడు గాక దేహమును చాలించె ననుకొందము. ఇట్టియెడ అపజయము ధర్మమునకు జరిగినట్లుకాదు, అధర్మము ధర్మముపై సాధించిన విజయము మృగతృష్ణ వంటిది. అది అర్థప్రధాన మగుటచే అర్థము అశాశ్వతమగుటచేతను నదియు

నశ్యమగుచున్నది. ధర్మ మనశ్వరమగుటచే నెప్పటికైనను విజయవంతమగుటకు వీలున్నది. అధర్మ విజయి ఒకసారి కుప్ప గూలినచో నంతటితోసరి; ధర్మవిజయి నడుము విరిగి పడిపోయినను సమయము కొఱకు వేచి అచంచలోత్సాహముల మఱల తలయెత్తు నవకాశముండునని తాత్పర్యము. విష్ణుధర్మోత్తరఖండమున "నాయకో ధర్మ విజయీ, సతాః పంథాన మాశ్రితః తథా చ లోక విజయీ విజ్ఞేయః ప్రతి నాయకః" అని కలదు. ఈ లక్షణముచే నాయకుఁడు ధర్మవిజయి, ప్రతినాయకుఁడు లోక విజయి; లోకవిజయి అనఁగా నధర్మార్థ కామ సంగ్రహరూప లోకవిజయమును సంపాదించినవాఁడు. ధర్మవిజయి అనఁగా తాను ధర్మనిష్ఠుఁడై లోక జీవితమున వెలయుచున్న అర్థకామములను ధర్మ్యము లనుఁగాఁ జేసికొని సాధించి, విజయ పూర్వకముగా ననుభవించువాఁడు.

ఉదాహరణము :

"క్షత్రియుఁ డోడునే తగదు కౌరవరాజ! యొకండ వేఁ బృథా
పుత్రులలోనఁ జిన్న నినుఁ బోరికిఁ జిల్వఁగ మానినాఁగ ని
ద్ధాత్రిఁ బ్రసిద్ధికెక్కి బలదర్ప సమగ్రుఁడవైన నీవు నీ
మిత్రులుఁ గూడ నిట్లయిన మెత్తురె? వత్తురె కొల్వ భూభుజుల్"

—ఆం. మ. భా. విరాట. 5 ఆ. ప. 208

ఈ వాక్యములు ఉత్తర గోగ్రహణమున - రణరంగమునుండి ససైన్యముగా విముఖుఁడై పాఱు సుయోధనుని గాంచి అర్జునుఁడు పల్కినవి. ఆలంబన విభావము దుర్యోధనుఁడు, శత్రువీర సైన్య దర్శన ముద్దీపనము, ధైర్య, శౌర్య, వీర్య, పరాక్రమ ప్రభావాక్షేపాదులు అనుభావములు, గర్వావు త్సాహౌత్సుక్యాదులు సంచారిభావములు. సంచారులతోఁ బరిపుష్టమైన యుద్ధో త్సాహము వీరరస మనఁబడుచున్నది.

"పేరుకొని పోరిలోన నపార పరాక్రమము నుభయబలములు వొగడన్
దోరంబుగ విహరించు నుదారత రణవీర మనఁగఁ దనరుం గృతులన్"

అని కావ్యాలంకార చూడామణి కర్త.

## 2. దానవీరము

'తమ కార్యంబు బరిత్యజించియుఁ బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్' వారు ధర్మదీక్షాపరతంత్రులు.

దానవీరుఁడని కీర్తిఁగాంచిన కర్ణుఁడు సూర్యునితో ననిన మాట లివి :

"భూసురకోటి వేఁడుటయుఁ బోఁడిగఁ బ్రాణములైన నీగినా
బాస దినేశ! లోకమునఁ బ్రస్ఫుట మింతయు నట్లు గావునన్
వాసవుఁ డట్టె నన్నడుగవచ్చుఁ బ్రియంపడి నాకు నొక్క బ్రా
తే సురలోకవందిత! మదిం గవచంబును గుండలంబులున్"

—ఆం. మ. భా. అరణ్య ప. 7 ఆ. ప. 290

ఆర్యుఁడయిన కర్ణుఁడు అర్థులకొఱకై కవచకుండలములనేగాక ప్రాణములను సైతము నీయ నుత్సహించినాఁడు. దాన మొక జీవితధర్మముగా జీవించిన వీరులకు - దానము ధర్మమే యగుచున్నది. అట్టి ధర్మమునకు చ్యుతి యేర్పడకుండ శరీర త్యాగమున కయినను సిద్ధపడి, తమ జన్మవ్రతమును సాధించుటలో తీవ్రప్రయత్నపూర్వకోత్సాహముఁ బ్రకటించుటఁ గాంచెదము. కావున దానవీర మొక విధముగా ధర్మవీర రూపాంతరమే యగుచున్నది.

వామనుఁడు మూఁడడుగుల నేల నభ్యర్థింపఁగా, దానమీయ నుత్సహించు బలీంద్రుని శుక్రుఁడు వారింప నాతనితో బలి యన్న మాటలు దానవీరమునకుఁ జక్కని యుదాహరణము :

"ధాత్రిని హాలికులకును సుక్షేత్రము బీజములు నొకఁటఁ జేకుఱు భంగిం
జిత్రముగ దాత కీవియుఁ బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే!

కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వా రేరీ? సిరిమూటఁ గట్టికొనిపోవం జాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!

మేరువు దలక్రిందైనను బారావారంబు లింకఁ బారిన లోలో
ధారుణి రజమైపోయినఁ దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్"

—ఆం. మ. భాగ. 8 స్కం. ప. 589, 590, 595

ఇచట దానవీరరసమునకు స్థాయిభావము దానోత్సాహము. వామనుఁ డాలంబన విభావము. శుక్రుని పల్కులు, శిబిప్రముఖులొనర్చిన దానాదుల గూర్చిన స్మృతి ఉద్దీపన విభావములు; స్థైర్యము, త్యాగము, ప్రసాదము, గుణాగుణ విచారము మొ.నవి అనుభావములు; ధృతి, హర్ష, స్మృతి, మత్యాదులు సంచారిభావములు. వీనిచే నుత్సాహము పరిపుష్టమై దానవీరమగుచున్నది.

"అతి వితరణ శూరతచే నతుల బహిఃప్రాణమైన యర్థము నర్థి
ప్రతతికి నొసఁగెడు సద్గుణచతురత యిల దానవీర సంజ్ఞం బడయున్"
అని విన్నకోట పెద్దన నిర్వచనము.

షోడశ దానములు ధర్మశాస్త్ర ప్రసిద్ధములు. అవి : గో, భూ, తిల, హిరణ్య, రత్న, విద్యా, కన్యా, దాసీ, శయ్యా, గృహ, గ్రహార, రథ, గజాశ్వ, ఛాగ, మహిషీ దానములు. ఈ కాలమున శ్రమదానము, జ్ఞానదానము, మొ. నవి వ్యాప్తిలో గలవు. దానవీరము షోడశ మహాదాననిమిత్తమై బహు రూపములతో నుండునని మన మేర్పఱుచుకొనవచ్చును. దానస్వరూపమును నిఘంటువు లిట్లు తెలుపుచున్నవి. ఇచ్చుట, విడువఁబడుట అను కార్యరూపమున నుండును గాన త్యాగ, విహాపితము లనియు, దీనిచేత నరకమును తరింతురు గాన వితరణ మనియు, దానమందు వస్తువు స్పృశింపఁబడునుగావున ఉపచార మున స్పర్శనమనియు, దీనిచేత పుణ్యము ప్రతిపాదింపఁబడును కనుక ప్రతిపా దనమనియు, మీఁదిజన్మమునకు మొలవఁ బెట్టఁబడునది గావున నిర్వాపణ మనియు, దీనిచేత పాపము వర్జితమగును గాన అపవర్జనమనియు, పాపమును జెఱుచునదిగాన అంహతి యనియు దానము పిలువఁబడును. దానవీరమువలన నైహికమైన కీర్త్యాదులతోపాటు, పాపక్షతియు, పుణ్యప్రాప్తియు, మఱుజన్మ యందు సత్ఫల సంపత్తియు, తద్ద్వారమున నిత్యానందస్వరూప జ్ఞానమును, శాశ్వత బ్రహ్మలోకావాప్తియు ఫలములుగా గలిగి పురుషార్థఫలసిద్ధి యొన గూడుననియు తాత్పర్యముగాఁ దేలుచున్నది.

## 3. దయావీరము

దయాగుణము సంపూర్ణ మానవత్వమున కొక విశిష్టలక్షణము. లోక బాంధవుఁడు సైతము ధర్మగ్లాని జరుగునప్పుడు దుష్ట సంహారార్థము, శిష్ట సంరక్షణార్థము అవతారమెత్తుట యందలి తత్త్వ మారసినచో నాతని హృదయమందు నిండి నిబిడమైయున్నది భక్తరక్షణ పరాధీనతాత్మకమగు దయావీర మనియే తేలఁగలదు. అట్టిదే ఉత్తములందును లోకమునఁ గానఁ బడును. ఆర్తులయెడ దయఁగలిగి రక్షించు వీరుల ధర్మము దయ కావున నిదియు ధర్మరూపమే యగుచున్నది.

ఉదాహరణము : ధీరోదాత్తుఁడగు శివాజీ ముష్కరుల పాల్పడిన గోమాతను గాంచి, జాలిపడి, తద్రక్షణకై యుత్సహించి, వారిని వారించి, వారితో నిట్లనుచున్నాఁడు.

"ఇది యే ధర్మపథంబు ? మానవులు గారే ? జాలి లేదయ్యెనే
మది ? మీ కొండొక ముల్లు గ్రుచ్చుకొన 'నమ్మా' యంచు వాపోదురే
గద ! మీబిడ్డల నెవ్వఁడైనఁ జెనకంగా వాదుకుం బోదురే
గద ! యే దిక్కునులేని జంతువనియేగా కత్తులన్ దూయుటల్ !"

"మీవలెఁ గాలకింకరులు మేకొని మీ యసిధారకంచెనున్
జేవగలట్టి శస్త్రములఁ జేకొనుచున్ యమలోకవీధి నీ
యావునుబోలె మిమ్ము నుడియంబడ నేలను గొట్టి కుత్తుకల్
గావుకొనంగ రారె ? నరకమ్ములతో నిటు నవ్వులాటలే ?"

"నన్నెడచేసి గో తనువునన్ ములు మోయఁగరాదు బుద్ధిసం
పన్నుల కింతకంచె నుడువన్ బనిలేదు.... ......."

—శివభారతము. ఆ. 2. 158, 159, 162 ప.

శివాజీకి గోమాత ఆలంబన విభావము.[1] ముష్కరుల ఘాతుక కృత్యములు, గోవ్యాకులత ఉద్దీపన విభావములు. గోరక్షణమునకైన ధైర్య, స్థైర్య, త్యాగ, శౌర్య వైశారద్యాదులు అనుభావములు. ధృతి, ఉగ్రత, అమర్షము, మతి మొదలగునవి సంచారి భావములు. స్వీయ ప్రాణత్యాగమున నయినను ప్రపన్నత్రాణశీలమగు దయ నిమిత్తముగాగల ఉత్సాహ స్థాయి భావము వీనిచేఁ బుష్టమై దయావీరమగుచున్నది.

"అసువిలయంబుననైనను బసగల్గు నుదార సార భాషాదుల సా
హస రచనయ కరుణాత్మకరసవీరం బనఁగఁ బరగు రసికోత్సవమై"

అని చిన్నకోట పెద్దన.

కొందఱు లాక్షణికులు శాంతరసమును దయావీరమున నంతర్భవింపఁ జేసిరి. విశ్వనాథాదులు దీనిని ఖండించిరి. "ఇది (శాంతము) దయావీరాది కానేరదు; ఏలన - నిరహంకార రూపము గావున. ఎట్లన - దయా వీరాదుల యందు నాగానందాదులలో జీమూత వాహనాదులకు మధ్యలో మలయ వత్యాద్యనురాగాదియు, అంతమున విద్యాధర చక్రవర్తిత్వాది ప్రాప్తియుం గనఁబడుటంబట్టి అహంకారోపశమము కనఁబడదు. అందువలన శాంతము సర్వ ప్రకారములచేతను అహంకార ప్రశమనైక స్వరూప మగుటంబట్టి దాని

1. "దానవీరమునకుఁ దగుపాత్రమును దయా
వీరమునకు దీనపూరుషుండు
యుద్ధవీరమునకు బద్ధవైరంబు నా
లంబనములు భూతలంబునందు." (కావ్యా. చూ. ద్వి. ఉ. ప. 114).

(దయా వీరాది) యందు అంతర్భావమును జెందఁదగదు. అందువలన నాగానందాదులు శాంతరస ప్రధానమనుట అపాస్త మయినది" అని సాహిత్య దర్పణకర్త (వేదము వేంకటరాయ శాస్త్రుగారి అనువాదము-పుట 100).

## 4. ధర్మవీరము

"ధరతి విశ్వం ధర్మః, ధృఙ్ ధరణే"...విశ్వమును ధరించునది అని పుణ్యార్థమునను "ధ్రియతే వా జనై రితి ధర్మః"—జనులచేఁ బూజింపఁబడునది అని వేద విహిత కర్మార్థమునకును, ధర్మశబ్దము ప్రయుక్తమగును.

"ధర్మః పుణ్యయమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ
ఉపమాయా మహింసాయాం కార్ముకేచ నిగద్యతే" —విశ్వకోశము

సాధారణముగా - స్వధర్మ నిర్వహణమునందు నాయకాశ్రితమైన ఉత్కటోత్సాహమే ధర్మవీరముగా గ్రహింపఁబడును. వీరమునందు ధర్మమునకున్న ప్రాధాన్యమునుగూర్చి వెనుక చాల వఱకు చర్చింపఁబడినది. ఉదాహరణము: తన తండ్రియగు షాజీ నవాబుల నిర్బంధమునందుండ నాతని విడిపించుటకై యత్నించు శివాజీ తల్లియెదుట చేయు ప్రతినయందు ధర్మవీర స్ఫూర్తికలదు.

"సత్యమలంబు ధర్మపథ మందు జయంబు ధ్రువంబు దానితో
నిత్యము లాపదల్, మనసునిండిన యోర్మి కడంకతెంపు సాం
గత్యము వొంది పండు నటుగావున సాత్త్వికభూమికా
నృత్యముల న్నటింతు; జననీ! నడిపింపుము కార్యరంగముల్ !"

"అంతటి షాహజీనృపున కర్మిలిబిడ్డఁడనై యుదాత్త శు
ద్ధాంతర జీజియా యమృతహ స్తములన్ బెనుపొంది ఖాండదే
వంతటి దేశికున్ గొలిచి యాప్తుల నందఱ నేలగల్గి—యీ
క్రంతలు కాటియల్ దుడువఁ గానక యే నిఁక రిత్తవోదునే !"

—శివభార. చతు. 50, 51

ఇందాలంబన విభావము కోపోద్రిక్తయైన జీజియాబాయి; షాజీబంధనము, నవాబుల దురంతము ఉద్దీపన విభావములు. స్థైర్య ధైర్య శౌర్య త్యాగ వైశారద్యాదు లనుభావములు; ధృతి, ఔత్సుక్యము, గర్వము, అమర్షము, ఉగ్రత, వితర్కము మొ. నవి సంచారిభావములు. వీని సంయోగముచే నిష్పన్నమైన యుత్సాహ స్థాయిభావము ధర్మప్రధానమగుటచే ధర్మవీరమనఁబడును.

## 5 సత్యవీరము

"సత్సుసాధుషు భవం సత్యమ్" - సత్పురుషులయందు బుట్టినది సత్యము. సత్యమనఁగా నిజముపలుకుట. సత్యము సేయుట, సత్యాపనము, సత్యంకారము, సత్యాకృతి యనఁబడును. 'ఋషయస్సత్య వచసః' జ్ఞానపారమ్యమును బొందిన వారగు ఋషులు సత్యమైన వాక్కులుకలవారు. (గురుబాల ప్రబోధిక) అందువలన నే భవభూతి :

"అనఘులాద్యులు నగు మహామునుల పల్కు-
పల్కు వెంబడి నర్థంబు పరుగులెత్తు" —మల్లాదివారి అనువాదము

అని పల్కియున్నాఁడు.

సత్యవాక్య మాహాత్మ్యమునుగూర్చి భారతమున -

"నుతజలపూరితంబులగు నూతులు నూటికంటె సూనృత
వ్రత! యొకబావి మేలు; మఱి బావులు నూటికంటె నొక్క స
త్క్రతువది మేలు; తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు త
త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడగన్.

వెలయంగ నశ్వమేధంబులు వేయును నొక్కసత్యమును నిరుగడలం
దులనిడి తూఁపఁగ సత్యమువలనన ములుసూపు గౌరవంబునఁ జేర్మిన్.

సర్వతీర్థాభిగమనంబు సర్వవేద సమధిగమము సత్యంబుతో సరియుఁగాన
యెఱుఁగు మెల్లధర్మంబుల కెందుఁబెద్దయండ్రు సత్యంబు ధర్మజ్ఞులైనమునులు"
—ఆం. మ. భా. ఆ. పర్వ. 4 అ. ప. 94, 95, 96

అని ప్రశంసింపఁబడి యుండుటచే సర్వధర్మశ్రేష్ఠమైన సత్యమును ఉత్తముఁడు సాధింప నుత్సహించి సత్యవీర నామాంచితుఁడగును. సత్యము ధర్మస్వరూపమే యగుటచే నదియు ధర్మవిశేషమే యగుచున్నది.

ఉదాహరణము : చిత్రాంగద విచిత్రవీర్యుల మరణానంతరము శంత నుని భార్యయగు సత్యవతి సత్యధర్మ వ్రతనిష్ఠుఁడగు భీష్ముని తత్ప్రజ్ఞకు విరుద్ధముగా వివాహమాడి రాజ్యభారము వహింపుమని కోరఁగా—

"విని భీష్ముఁ డనియె మీ కిట్లని యానతి యీఁగఁ దగునె యిమ్మెయి నా వ
ల్కిన పల్కును మఱి నా చాల్చిన వ్రతమును జెఱుప నంత చిఱుతనె చెప్పుఁడా!
హిమకరుఁడు శైత్యమును నర్యముఁడు మహాతేజమును హుతాశనుఁ డుష్ణ
త్వము విడిచి రేని గుర్వర్థము నా చేసిన సద్వ్రతంబు విడుతునే" —అని.
—ఆం. మ. భా. ఆదిపర్వ. అ 4; ప. 223, 224

ఇచ్చట సత్యవ్రతనిష్ఠయందలి యుత్సాహము స్థాయి, సత్యవతి ఆలంబన విభావము. తదుక్తవాక్యము లుద్దీపన విభావములు. అనితరదద్యోతితమగు ధైర్యము అనుభావము. ధృతి, ఉత్సాహము, భక్తి, గర్వము మొ.నవి సంచారి భావములు. సంచారులతో నుత్సాహము పరిపుష్టమై వీరరస మగుచున్నది.

## 6. విద్యావీరము - పాండిత్యవీరము

అజ్ఞానాంధకారమగు మానవుని హృదయమున వెలుఁగును ప్రసాదించు తేజస్సు విద్య. 'విద్య లేనివాఁడు వింతపశువు'.

"భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదుపుష్పసుగంధ జలాభిషేకముల్
భూషలు గావు; పూరుషుని భూషితుఁ జేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణ మే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్.

విద్య నిగూఢగుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదైవతము విద్యకుసాటి ధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే"

—ఏనుఁగు లక్ష్మణకవి అనువాదము

అని భర్తృహరి సుభాషితము. విద్యాధనము దొంగిలింప శక్యముగానిది; కీర్తిదాయిని; అర్థుల కెంతయిచ్చినను తరుఁగక హెచ్చునట్టి మహత్త్వము గలది; యుగాంతవేళలందును నిలచునది; అనఁగా శాశ్వతమైనది. ఇట్టి విద్య లౌకికాధ్యాత్మిక భేదముచే ద్వివిధము. లౌకికవిద్య ధర్మార్థ కామ సాధనమందును, ఆధ్యాత్మిక విద్య మోక్షసాధనమందును పురుషార్థ సాధకునకు శక్తి నిచ్చును. అందువలననే **'Knowledge is Power'** అను సూక్తి యేర్పడినది.

లౌకికాధ్యాత్మిక విద్యలందు నిష్ణాతుఁడైన వానినిఁ బండితుఁడనియందురు. సకల కావ్యశాస్త్రపురాణవేదాంతయోగవిద్యావేది కాని అట్టివాఁడు కాఁడు. కాని లోకమున సర్వజ్ఞుఁ డెవ్వడునులేడు; భగవంతుఁ డొక్కఁడే అట్టివాఁడు. మఱి పండితులనఁగా నెట్టివారని ప్రశ్న! వారివారి యభిరుచికందిన నా యా విద్యావిషయములలో మాత్రము పారంగతులైనవారని అర్థము గైకొనవలెను. న్యాయశాస్త్రవేత్తలు; సాహిత్యవేత్తలు, వేదవిదులు, లక్షణవేత్తలు, రాజకీయవేత్తలు మొ. భేదములు పండితులలో నిందువలననే ఏర్పడుచున్నవి.

అయినను అందులో నెవ్వరైన బహుశాస్త్రవిషయపారీణు లుండవచ్చును. కాని సర్వజ్ఞులుండరు.

జగన్నాథాదులు వీర రస భేదములలో పాండిత్యవీరమును పేర్కొనిరి. దానినే సాహిత్యసార కర్తయగు అచ్యుతరాయలు విద్యావీరముగా గ్రహించి నాఁడు. ఇరువురి ఉదాహరణములు 'పాండిత్యవీరము'నకు సమన్వయపడునట్లే యున్నవి. ఇచ్చట నాదొక్క మనవి: వీరరసయోగ్యులగు ఉత్తమ ప్రకృతు లనుగూర్చి చర్చించుచు ఉత్తమత్వ సాధకులను గూడ గైకొంటిమికదా! అట్లే పాండిత్యసిద్ధులతోపాటు, పాండిత్యసాధకులను గూడ వీరరసయోగ్యులుగా గ్రహించి - సాధకులయందు విద్యాసాధన కొఱకైన ఉత్సాహము, సిద్ధుల యందు పాండిత్య ప్రదర్శనోత్సాహము వ్యక్తమగును గాన - సాధకులయంద లిది విద్యావీరమనియు, పండితుల (సిద్ధుల) వాదాదులయందలిది పాండిత్య వీరమనియు గ్రహించినచో సమంజసముగా నుండునని భావించుచున్నాను.

ఇచ్చట మఱియొక విషయము: లౌకికాధ్యాత్మిక విద్యలలో నీ విద్యా వీరమునందు లౌకికవిద్యలను మాత్రమే గ్రహించుచున్నాము. ఆధ్యాత్మికము లగు యోగాదులను ప్రత్యేకవిభాగముక్రింద లాక్షణికులు విచారించియుండిరి.

విద్యావీరమున కుదాహరణము: శంకరులు—

"ఉపనయనశబ్ద మర్థనముపేత మగునట్లు గురునియొద్దకుఁ జని యా
చ్చపు భక్తిఁ బఠించెను దన్నిపుణుఁడు సాంగముగ నాల్గు నిగమము లోలిన్.
ఇంచుకగాని నేడ యెపు డింతటి విద్యగ్రహించె నద్భుతం
బంచుఁ బ్రజల్ నుతింప వటులందఱుతోడఁ బఠింపఁ జాల కిం
చించుక వెన్కవెన్కఁబడ నెవ్వఁడు వీనికి విద్యఁ జెప్పలేఁ
డంచు గురుండు జంక నతఁ డధ్యయనం బొనరించెఁ జెచ్చెరన్.
ద్విత్రమాసముల యధీతి నాయా విద్య గురుసమత్వ మొందె గురువు పగిది
నతఁడ వేదముల సహాధ్యాయులకు లెస్స జెప్పఁజాలె నతివిచిత్ర మెన్న!
శ్రుతులన్ బ్రహ్మ; తదంగబోధమున గార్గ్యుం డర్థ తాత్పర్య సం
గతమౌ తత్కథలన్ బృహస్పతి తదుక్త బ్రహ్మకర్మాంతర
జ్ఞతలన్ జైమిని తద్వచఃకలిత విజ్ఞానంబునన్ వ్యాసమౌ
ని దదీయాభిన వాకృతిన్ వెలయు వాణీపూర్ణుఁడాతం డహో!

—శంకరవిజయము. ప్ర. ఆ. పద్య. 135-138

ఇందు శంకరుఁడు చెచ్చెరగా నధ్యయన మొనరించుట యందలి యుత్సాహము ధ్వనితము. వటులు, గురువులు ఆలంబన విభావములు, జనస్తుతి, సహాధ్యా

యుల అసమర్థత, గురువుల నిస్సహాయత మొ॥నవి ఉద్దీపన విభావములు, స్థైర్యధైర్యాదులు అనుభావములు. ధృతి, మతి, ఉత్సాహ, వేగాదులు వ్యభిచారి భావములు. వీని సంయోగముచే పాండిత్య సాధనాత్మకమైన ఉత్సాహ స్థాయి భావము విద్యావీరరూపముఁ దాల్చును.

పాండత్యవీరమునకు ఉదాహరణములు :

కాతంత్ర వ్యాకరణకర్త శర్వవర్మ రాజు నారుమాసములలో గీర్వాణ భాషా మనీషునిగా నొనర్తునని శపథము గావించెను. అది అసాధ్యమని గుణాఢ్యుని వాదము. శర్వవర్మ అప్పుడు తన పాండిత్యప్రకర్ష ప్రదర్శితమగునట్లు గుణాఢ్యునిగాంచి ఇట్లనెను.

"ఓ గుణాఢ్యసూరి ! యోరిమిఁ బోఁజొచ్చి
యూర కిటుల చిచ్చు నుమియ నేల ?
వెడఁగు ప్రతిన కెడఁద వెలచి డాఁగఁగ మాకుఁ
గొండగుహలు లేకయుండు నోటు !

జానలు - వీసమెత్తు విలువంగొన నెత్తని వట్టి యూఁయుప
న్యాసము - కంఠశోషము గదా ! పదశాస్త్రము మేరముట్ట ష
ణ్మాసములన్ వచింతు మతిమన్ననికేనికి; దీనఁ దప్పినన్
దాసుఁడ నౌచు నీ యడుగుఁ దామర పెండెరమోచు నుండెదన్"

—ఆంధ్ర పురాణము - సాతవాహన పర్వము. ప. 113, 114

ఇందు రాజున కాఱునెలలో గీర్వాణము నేర్పి తన పాండిత్యముఁ బ్రకటించు నుత్సాహము స్థాయి. గుణాఢ్యసూరి ఆలంబన విభావము, అతని ఆక్షేపణ ఉద్దీపన విభావము, ధైర్య, స్థైర్య, శౌర్య, ఆత్మవిశ్వాస వాక్యములు అనుభావములు. ఉత్సాహ ధృతిమతి గర్వావేగామర్షాదులు సంచారి భావములు. వీని సంయోగముచే నిష్పన్నమగు నుత్సాహము స్థాయియై పాండిత్య వీరరస మనఁబడుచున్నది. ఇట్లే శ్రీ పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు రచించిన "కవిత్రయావేదన" యను ఖండకావ్యమున — భారతముపైఁ గువిమర్శలఁ జేయువారిఁ గాంచి తిక్కన నన్నయతో నన్నట్లు రచించిన ఈ క్రిందిపద్యము పాండిత్యవీరమునకు సరసోదాహరణము :

"కయ్యము గల్గినట్లయిన గంధకవి ప్రకరంబు కావ్యముల్
వ్రయ్య విమర్శకాళి యెగురంబడి ప్రయ్యఁగ నిందు నెందు నే

డయ్యామి కేరు వెక్కసపడం గనుపండువు సేయఁగోరు నా
దయ్యము నెత్తికోలు తుది దాఁకుటఁ గాంచెదుగాక నన్నయా!"
—తెలుఁగురాజకృతులు - పుట 165

ఋగ్యజుస్సామాధర్వణ వేదములు, శిక్షావ్యాకరణ చ్ఛందోనిరుక్త జ్యోతిషకల్ప మీమాంసాన్యాయ పురాణ ధర్మశాస్త్రములు—అనునవి చతుర్దశ విద్యలు, ఆయా విద్యల నిమిత్తమున నైన సాధన మాయాభేదములచే విద్యా వీరముగను, తత్తత్సిద్ధితో నాయా భేదములు పాండిత్యవీరముగను గోచరమగు చుండును.

## 7. తపోవీరము

"తప మనఁగ సకలవిషయ వ్యపేతమగునట్టి బుద్ధి వైభవము సుమీ
తపమున సుస్థిరుఁడగు యోగపరునకుం గలవె యొండు కర్తవ్యంబుల్"
—ఆం. మ. భా. అరణ్యపర్వ. 5 ఆ. ప. 90

అని మహాభారతము. ఐహికాముష్మిక సుఖముల నందగోరువారు పరమాత్మునిఁ గూర్చి విషయవాంఛలకు దూరమైయున్న సమాహితబుద్ధితో నిష్ఠను బూను దురు. అట్టి బుద్ధివైభవమే తపస్సనఁబడును. తపస్సువలన నైహిక సుఖములే కోరఁబడినచో నవియ లభించును. ఆముష్మిక సుఖములఁ గోరినచోఁ నవియ సిద్ధించును. ఈ విధముగాఁ దపోవీర మైహికాముష్మిక భేదముల వరలుచున్నది. వీనినే ప్రవృత్తి నివృత్తులనియు బేర్కొనవచ్చును. ఆముష్మిక ఫలప్రదమగు తపస్సును సాధించు వీరుఁడు నిరహంకారియై లౌకిక వాంఛాతీతుఁడయి నిర్వికల్పసమాధి స్థితుఁడగును. తపస్సుచే నణిమాదిసిద్ధులను సాధించి, లౌకి కౌన్నత్యాదులను అహంకార సంవృతముగాఁ బ్రకటించు నుత్సాహవంతుఁడు లౌకిక తపోవీరుఁడనఁబడును.

ఉదాహరణము : సత్యహరిశ్చంద్రీయములో విశ్వామిత్రుఁడు :

వ. "దుర్ఘటమైన కార్యక్రమము పై వేసికొన్నందుల కనివార్యంబుగా దాని నిర్వహింపవలెను. ఇందు నాకు జయమా పరాజయమా అని ముందు యోజించెద...అయినను విశ్వామిత్రుండ నగు నాకుగూడ నపజయ భయమేమిటి ?

"క్రతు భుక్సంతతితోడఁ బోరి సురలోకం బొండు గల్పించి ది
వ్య తపశ్శక్తిఁ ద్రిశంకునం దునిచెనే భవ్యుండు ప్రాక్సృష్టికిం

ప్రతిసృష్టిన్ ఘటియించి బ్రహ్మపదమే రాజర్షి సాధించె న
ట్టి తపోరాశి తలంప వాని కవె వాటిల్లున్ జయారంభముల్''
—బలిజేపల్లి లక్ష్మీకాంతకవి రచన : ద్వి. అం. విష్కంభము

వశిష్ఠుఁడాలంబన విభావము, ఇంద్రసభలోని వశిష్ఠ శపథాదుల స్మృతి ఉద్దీపన విభావములు, స్థైర్య, ధైర్య, శౌర్య, వైశారద్యాదులు అను భావములు. వీని సంయోగముచే నిష్పన్నమగు తపోవిభవ ప్రదర్శనాత్మకమగు నుత్సాహము తపోవీరమనఁబడును.

## 8. బలవీరము - యత్నవీరము

"బల శబ్దమునకు బలియుట, సత్తువ, సేన (కాకి, బలభద్రుఁడు) అను అర్థములు కలవు. బలం త్యేన బలం, బలం ప్రాణనే, బలతి చిరంజీవతీతి, బల మస్యాస్తీతి, చబలః—దీనిచేత బ్రతుకుదురు ; బహుకాలము జీవించును ; బలము కలవాఁడును గనుక బలము, బలుఁడును నగును." (గురు బాలప్రబోధిక) పురుషార్థ సాధకుఁడైన మానవుఁడు ఆరోగ్యవంతుఁడై బలసమన్వితుఁడై యుండవలెను. స్వయముగా మానవుఁడు ఆరోగ్యమును బలమును కాపాడు కొనుటచే ప్రత్యక్షముగా నాతనికేగాక, పరోక్షముగా జాతికిని, ప్రపంచము నకును గొప్ప మేలు చేసెడివాఁడగును. "A sound mind in a sound body" అను ఆంగ్లోక్తి ననుసరించి బలవంతునియందే సమర్థమగు బుద్ధివికసనము కాననగునని కొందఱు తలంతురు. వేదాంతులు 'నాయమాత్మాబలహీనే నలభ్యః' అని తెల్పియుండుటచేత ఆత్మజ్ఞానముకూడ బలహీనున కసాధ్యమని తేలుచున్నది.

"యీసురోమని మనుషులుంటే
దేశ మేగతి బాగుపడునోయ్ ?........"

"దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్........"

అను మహాకవి గురజాడవారి ప్రబోధమునుబట్టి బలవంతులగు దేశస్థుల మీఁదనే దేశకల్యాణ మాధారపడి యున్నదని స్పష్టమగుచున్నది.

బలమనునది రెండు విధములు. ఇంతవఱకుఁ జెప్పఁబడినది శారీరక బలము. కాని ఇంతకన్న విలక్షణము, ఉత్తమము, ఆంతరమునైన "ఆత్మబల" మొండు కలదు. విజ్ఞులు కార్యసాధనయందు శారీర బలమేగాక ఆత్మబలము

నకు గూడ అధిక ప్రాధాన్యము నిచ్చుచుందురు. ఇచ్చట బలశబ్దము రెండు విధములుగను గైకొనఁ దగును.

సాహిత్యసార కర్త తనగ్రంథముయొక్క సరస మోదాఖ్య వ్యాఖ్యలో బలవీరమును యత్నవీరముగాఁగూడ పేర్కొనెను. దానికి కారణము మాత్రము సూచింపలేదు. యత్నమనఁగా ప్రయత్నము, ఉద్యమము, పాటుపడుట, కష్టపడుట, (యత్న m. Eflort, exertion E యత to endeavour strenuously off) బలవీరము యత్న వీరముగాఁ బేర్కొనఁబడుటకు కారణము మన మిట్లూహింపవచ్చును; బలము శరీర ధర్మమనియు. హృదయ ధర్మము కాదనియు కావున నిది భావరూపమైన వీరముగాఁ బేర్కొనగూడదనియు వాదించువారున్నారు, అట్టివారికి సమాధానముగా నుండునట్లు బలము నాయకునియందు యత్నరూపముగా గోచరించును, శరీర మనోబలములు రెండును తద్యత్నోత్సాహముననే అతని నాశ్రయించి యుండును అని నిరూపించుటకే యట్లు నామద్వయ ముంచియుండి యుందురు. ఇట్లయినను యత్నవీరమునకు కొంత విశిష్టత లేకపోలేదు. యుద్ధ తంత్రాదులయందు నాయకుఁడు చతురుపాయములలో బలోపాయమునకు పూర్వము సామదాన భేదోపాయములు సఫలమగునట్లు యత్నించుటలో నుత్కటోత్సాహమును జూపినచో దానిని యత్నవీర మనవచ్చును, మహాభారతమున నుద్యోగ పర్వములో ధర్మజాదుల సంధియత్నము లీ శాఖకు జెందినవే.

ఉదాహరణము : విష్ణువు దేవరాక్షస సమూహముల ప్రార్థనపై క్షీరాబ్ధి మథనమునకు కవ్వపు కొండయైన మందరనగమును పెకలించునప్పటి వర్ణనము:

"కటిమండలంబునఁ గనకంపు నునుఁజేల దృఢముగా బిగియించె దిండుగట్టి
కట్టాయితంబైన కంఠహుంకారంబు గావించె దిక్కులు గ్రక్కతిలఁగ
సమధికావష్టంభ సంరంభజృంభణ సమకూర్చె నిజభుజా స్తంభమునకుఁ
బాదాభిఘట్టనఁ బార్శ్వదేశంబుల నదలించి ధాత్రి గ్రక్కదలఁ జేసె
పట్టె కదలించె నసియార్చెఁ బాఁతగల్చె నెత్తె వక్షఃస్థలంబున వెఱియ నొత్తెఁ
దోయజాక్షుండు లోకైకధూర్ధరుండు దాల్చె నవలీల నిట్లు మందరనగంబు"

—హరవిలాసము - శ్రీనాథుడు. 6 అ., ప. 44

ఇందు శ్రీకృష్ణుని బలవీరము వ్యంగ్యము. అది యత్నరూపముగా వర్ణితమగుట గమనార్హము. మందరనగమాలంబన విభావము; దేవదానవ ప్రార్థన ముద్దీపన విభావము; శౌర్యాదు లనుభావములు; ధృత్యౌత్సుక్యాదులు సంచారి భావములు.

## 9. త్యాగవీరము

దానమునకు త్యాగమనియు మారుపేరుకలదు కాని ఈ రెంటియందును స్వరూపలక్షణాదులలోఁ గొంత భేదము కానఁబడుచున్నది. దానమనఁగా 'దీయతే ఇతిదానం దాఞ్ దానే' ఇచ్చుట అనెడి అర్థముకలది. 'భిక్షాం దేహి' అని అడిగిన అర్థికి 'దదామి' అని ఇచ్చునది దానము. త్యాగమనగా - పర హితార్థమైగాని, ఆత్మహితార్థమైకాని, ధర్మసంరక్షణార్థమైకాని తన్నాశ్ర యించి యుండి తనకు లాభమును, సుఖమును కల్పించు నొకవిషయమును ధర్మవిరుద్ధము గాకుండ, అర్థింపఁబడకయే తృణమువలె పరిత్యజించుట త్యాగ మనఁబడును.

ఉత్కృష్ట ధర్మవిషయములు రెండు తనయెదుట నిలువఁబడినప్పుడు వానిలో నెద్దానిని గ్రహింపవలెను, ఎద్దానిని త్యజింపవలెను అనునది త్యాగ వీరున కొకప్రశ్న! అది అతని మనః ప్రవృత్తిపై నాధారపడి యుండును. మోక్షసాధనైక చిత్తప్రవృత్తి కలవాఁడగు ధీరశాంతుఁడు ఖాండిక్యుఁడు. కేశిధ్వజుఁడు రాజ్యసర్వస్వమును గురుదక్షిణగా నిచ్చెదనని వేడుకొనినను, ఒల్లక సకల భవక్లేశ సంక్షయంబగు నధ్యాత్మవిద్య నర్థించి సర్వరాజ్యమును త్యజించెను. క్షత్రియధర్మము రాజ్యమేలుటయైనను దానిని త్యజించుట యనెడి క్రియను ధర్మబద్ధముగా సమర్థించి త్యజించినాఁడు ఖాండిక్యుఁడు.

> "విను కేశిధ్వజ! ధాత్రి వేడమికి నావేదించెద స్త్రైతువ
> జ్ఞునకుంగాక వివేకి కేల జనియించున్ లోల్య మెందున్ రణం
> బునఁ బాడిన్ రిపు గెల్చువాఁడియుఁ బ్రజాపోషంబు ధర్మంబు రా
> జునకౌ; నైన నశక్తు త్వద్విజితరాజ్యా న్న న్నఘంబంటునే"

అని అనినట్లు ఆముక్తమాల్యద.

ఇట్టి నిగ్రహము పురాకృత బహుజన్మ పుణ్యఫలముచే నేర్పడెడి సంస్కారము!

ఇఁక లౌకిక పారలౌకిక లాభములలో నేదేని త్యాగము చేయవలసి వచ్చినప్పుడు ధీరులగువారు పారలౌకికమునకై లౌకికమును పరిత్యజింతురు. ఉదాహరణమునకు మనుచరిత్ర ప్రబంధమున ధీరశాంతుఁడగు ప్రవరుఁడు వరూధిని తనను గోరినప్పుడు - గార్హస్థ్యాశ్రమధర్మము, ఏకపత్నీవ్రతము, నిత్య కర్మానుష్ఠానము వదలలేక తద్ద్వారమున తానుసాధించు పారలౌకికాభ్యుదయ మును వీడజాలక - "తనంత తా వలచివచ్చిన కన్నియఁ ద్యజింపరాదను"

లౌకికన్యాయమును త్యజించెను. ధర్మసాధనార్థమై విషయసుఖ త్యాగమునం దుత్కటోత్సాహమును బ్రకటించుటయే త్యాగవీరము.

"ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు వొంగారమై
యంచు ల్మోయఁగవుగలించి యధరం బాసింప 'హా శ్రీహరి'
యంచు న్బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయం బంటి పొ
మ్మంచుం ద్రోచెఁ గలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్"

—మనుచరిత్రము

వరూధిని ఆలంబన విభావము. తదాలింగనాదులు ఉద్దీపనములు. "హా శ్రీహరీ" యనుటలోని దోషభావము, తిరస్కృతి అనుభావము, స్థైర్య, ధైర్య, శౌర్య, ప్రభావ, త్యాగ, శమాదులు సంచారులు. వీని సంయోగముచే త్యాగోత్సాహము పుష్టినొంది వీరరసరూపముఁ దాల్చును.

ఇట్లే భర్తృహరి వైరాగ్యశతకమున అవధూతచర్యను వర్ణించుచు, భైక్షుకవృత్తి గైకొని సంపదను త్యజించు ప్రవృత్తిని వర్ణించినాఁడు.

"మాతర్లక్ష్మి! భజస్వ కంచిదపరం మత్కాంక్షిణీ మాస్మ భూ
ర్భోగేషు స్పృహయాళవస్తవ వశే కానిః స్పృహాణా మపి
సద్యః స్స్యూతపలాశ పత్త్రపుటికా పాత్రే పవిత్రీకృతై
ర్భిక్షా వస్తుభిరేవ సంప్రతివయం వృత్తిం సమీహామహే"

మఱియు లోకకల్యాణార్థము సర్వసామ్రాజ్య సౌఖ్యమును, భార్యాపుత్రులను పరిత్యజించిన బుద్ధదేవుని త్యాగవీరము లోకోత్తరము.

## 10. యోగవీరము

యోగ శబ్దమునకు కవచాదులనియు, సామాద్యుపాయము లనియు, ధ్యానమనియు, కూటమియనియు, కూర్చుటయనియు అర్థవిశేషములు కలవు. "యుజ్యత ఇతి యోగః, యుజిర్ యోగే - కూర్పబడునది." యోగస్సూత్రే ద్రవ్యలాభే విష్కంభాదౌచ భేషజే" ఇతి విశ్వః.

యోగ సూత్రములందు యోగశబ్దము జీవాత్మ పరమాత్మ సంయోగార్థమున వాడఁబడియున్నది. యోగ మష్టాంగ సమన్వితము, యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధారణధ్యానసమాధులని అష్టాంగములు ప్రసిద్ధములు. ప్రాకృతము, వైకృతము, కుంభకము అని అభ్యాసయోగము త్రివిధము. ఆరురుక్షులు, ఆరోహకులు, ఆరూఢులు అని యోగాభ్యాసకులు ముప్విధములుగా నుందురు.

"యోగేనాంతే తనుత్యజామ్" అని రఘువంశ రాజుల చరమ లక్ష్యము వర్ణించినాఁడు కాళిదాసు. అటి లక్ష్యసాధనమే పురుషార్థ సాధకుని మతము గావున యోగమాతనికి మోక్షహేతువగుచున్నది. యోగసిద్ధుఁడు తన యోగశక్తి జగత్కల్యాణార్థము వినియోగింప నుత్సహించుటయు యోగ వీరమనఁబడును

ఉదాహరణమునకు: అగ్ని అదృశ్యుఁడైన సందర్భమున దివోదాసు తన ప్రజలతో నిట్లనినాఁడు.

"భరమౌనే గుడిగ్రమింగ లింగము హారుం బంపంగ నీ దిప్ప్రలా
గరిమల్ జూపెడివారు ? మా నుదులకున్ గైకోలులే దింగ మ
ద్వర ప్రభా వాగ్నికీలల జగద్వ్యాప్తంబులం జేసి యె
ల్లర లోపంబులనెల్లఁ దీర్చెద మహోల్లాసంబు సంధిల్లగన్"

—దివోదాస నాటకము - శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి
పంచ. అం. పుట 49

పావకాది దివ్యులు ఆలంబన విభావములు, వారి స్వరూపాపోపసంవాదము క్రియ లుద్దీపనములు, స్థైర్య ధైర్య శౌర్యాదులు అను భావములు. ధృతి మతి గర్వామర్ష తర్క స్మృత్యాదులు సంచారులు. వీని సంయోగముచే యోగోత్సాహము వీరరస నామమున వరలుచున్నది.

## 11. క్షమావీరము

క్షమాశబ్దమునకు ఓర్పు, భూమి అనునవి ప్రధానమైన అర్థములు. ఆప్టే కోశాదులలోని విశేషార్థముల గమనించినచో క్షమాభావ స్వరూపము నిట్లూహింపవచ్చును :[1] బహు దుర్భర క్లేశదుఃఖములందు కుంఠితముగాని సహన భావము, పరదోషములవలనఁ గల్గిన మనఃక్లేశముల సహించి వానిని త్వరగా మనస్సునుండి వదలుకొని (మఱచిపోయి) ఉదాత్తశక్తి సమన్వితమైన దయను ప్రదర్శించుటయు, ఎవ రెట్టికష్టములు కల్గించినను సామర్థ్యముతో, ధర్మైక బుద్ధితో వానిని భరించుటయు, కష్టభాజనులగు శత్రువులందు సైతము కని కరము, ప్రీతి, స్నేహము నిగుడించుటయు క్షమయని చెప్పవచ్చును.

పాండవులు ద్వైతవనవాసులై యున్నసమయమున ధర్మజుఁడు ద్రౌపదికి క్షమావీరుని మాహాత్మ్యము నిట్లుపన్యసించెను.

---

1. క్షమ = Patient, enduring, Resigned 2. Refraining from forbearing 3. able, adequate 4. benevolent, friendly, fit, appropriate, suitable, Proper, F. 1. Patience 2. The earth, Night, A name of Durga, (fn) Propriety, fitness.

"క్షమగలవానికిఁ బృథ్వీనమునకు నిత్యంబు విజయసంసిద్ధి యగున్
క్షమయైనవాని భుజవిక్రమము గడున్ వెలయు సర్వకార్యక్షమమై"

మఱియు

"తేజఃప్రభవంబులైన యమర్ష దాక్షిణ్య శౌర్య శ్రీప్రభుత్వంబులను నాలుఁగు గుణంబులు క్షమావంతునందు వీర్యవంతంబులగుఁ దొల్లి కశ్యపగీతలైన గాథల యందీ యర్థంబు వినంబడు. వేదంబులు, యజ్ఞంబులు, శౌచంబును, సత్యంబును, విద్యయు, ధర్మువు సచరాచరంబయిన జగమంతయు క్షమయందు నిలచినవి. తప స్స్వాధ్యాయ యజ్ఞకర్తలయు, బ్రహ్మవిదులయుం బడయు పుణ్యగతులు క్షమావంతులు పడయుదురు." —ఆం. మ భా. అరణ్య ప. ఆ. 1, పద్య. 223, 224

ఏ జాతియం దెక్కుడు సహనము నిలిచియుండునో అది ఉత్తమసంస్కృతి సహితమగును. సహనమే సంస్కృతియని డా. సర్వేపల్లి రాధాకృష్ణపండితులు. "To understand all is to forgive all" అని ఫ్రెంచి నానుడి.

"చంపఁదగినయట్టి శత్రువు దనచేతఁ జిక్కెనేని కీడు సేయరాదు;
పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు విశ్వదాభిరామ వినురవేమ !"

అని వేమన యోగి.

ఉదాహరణము : ద్రౌపదిని బలాత్కరింపఁ బ్రయత్నించిన సైంధవుని పాండవులు బంధింపగా నాతఁడు ప్రాణభయంబున "ఎల్లసభలందు పాండవ దాసుండ" నని చెప్పుకొందునని వేడుకొనగా వానినిగాంచి పాంచాలి నవ్వి– 'ఇప్పాపాత్ముండు భవదీయదాసుండయ్యెం గావున వీనిం బోవిడువుండని విడిపించె నా సైంధవుండును ధర్మజునకుఁ దత్సభాగతులైన మునులకు మ్రొక్కిన నజాతశత్రుం డిట్లనియె' :

"ఎట్టి కష్టుఁడైన నిట్టి పాపముసేయ నెత్తికొనునె యోరి నీవు దక్క ?
నరుగుమింక నేమి యందుము నిన్ను నింద్రియవిలోలు నల్పు ధృతి విహీను"
—ఆం. మ. భా. అరణ్య. షష్ఠా 252

ఇందు సైంధవుఁడు ఆలంబన విభావము, ద్రౌపది పల్కులుద్దీపనములు. ధైర్య, స్థైర్య, పరాక్రమ, నిరాదర వచనాదులు అనుభావములు, గర్వాదులు సంచారి భావములు. వీని సంయోగముచే క్షమోత్సాహము వీరరసరూపమును దాల్చుచున్నది.

## 12. జ్ఞానవీరము

'మోక్షే ధీర్జ్ఞానమ్ జ్ఞాయతే అనేనేతిజ్ఞానం జ్ఞా అవబోధనే.' 'దీనిచేత నెఱుఁగఁబడును' అని వ్యుత్పత్తి. మోక్షసాధనమైన బుద్ధి పేరు జ్ఞానము. జ్ఞానము త్రివిధము. సంజ్ఞానము (పదపదార్థ జ్ఞానము) విజ్ఞానము (పదపదార్థ జ్ఞానానంతరమునఁ గలిగిన యభిప్రాయ విశేషము) ప్రజ్ఞానము (బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము) అని. జ్ఞానవీరమున ప్రజ్ఞానమే సామాన్యముగా లెక్కఁ బెట్టఁబడును. జ్ఞానమఖండజ్యోతి అది మానవమేధ సాధించు చిట్టచివరి అవస్థ.

ఉదాహరణమునకు : ఆముక్తమాల్యదయందలి ఖాండిక్యకేశిధ్వజసంవాదమున — ఖాండిక్యుఁడు అర్థవాదులగు మంత్రులను వారించి, కేశిధ్వజుని జ్ఞానము నభ్యర్థించును.

"అనవుఁడు నల్లనవ్వి మనుజాధిపుఁ డిట్లను-' మీరలర్థ సా
ధనపరతంత్ర కోవిదులు దక్క, మహాసుఖదాయి మోక్షమా
ర్గ నయ విచారకోవిదులుగా, రతిచంచల రాజ్యలక్ష్మి నే
మని చని వేఁడువాఁడఁ బరమార్థము వేఁడక యమ్మహామతిన్".

"ఆస పడుదురె బుధులు రాజ్యంబు, మమత
మానని జడాత్ముల? ట్లహం మాన పాన
మత్తులకుఁ గాక యది యేల, మాదృశులకుఁ?"

(ఆముక్త. అ. 8. ప. 58, 68)

ఇందు విభావములు మంత్రులు, కేశిధ్వజుఁడు. ఉద్దీపన విభావము కేశిధ్వజుని ఆగమనము. స్థైర్యధైర్యత్యాగసహనాదులు అనుభావములు, ధృతిమత్యాదులు సంచారులు. వీని సంయోగముచే జ్ఞానసాధనాయత్తమైన ఉత్సాహ ముత్కట రూపము దాల్చి జ్ఞానవీరముగా స్ఫురించుచున్నది.

## 13. సంపద్వీరము

'సంపత్తిః శ్రీశ్చ లక్ష్మీశ్చ', సంపద్యతేజనైరితి సంపత్ సంపత్తిశ్చ, పద్ 'గతౌ' జనులచేత పొందఁబడునది సంపత్తి; దానినే శ్రీ, లక్ష్మి యనియు నందురు. "ఆప్టే: సంపద్ (f) Success, Prosperity, Power, fame 2. advancement in good qualities, Perfection, excelence, 3. a necklace of Pearls; సంపత్తి = Prosperity, success, Power or happiness (శ్రేయస్సు, అభివృద్ధి, క్షేమము, శుభము, జయము, కార్యసిద్ధి,

శక్తి, బలము, పలుకుబడి, చెల్లుబడి, కీర్తి, ప్రతిష్ఠ. సద్గుణాభివృద్ధి, సుఖము, రత్నహారము, బంగారము మొ. అర్థములు కలవు.) సామాన్యముగా నర్థ గౌరవము కాంచనముతోఁ గొలుచుట జరుగును. కాంచనము సర్వలోహము లలో విలువగలిగినది. దానినే ద్రవ్యమని వ్యవహరింతురు. 'ధనమూల మిదం జగత్.' దానినే భర్తృహరి :

"యస్యాస్తి విత్తం సనరః కులీనః, స పండిత స్స్రశుతవాన్ గుణజ్ఞః
స ఏవ వక్తా స చ దర్శనీయః, సర్వేగుణాః కాంచన మాశ్రయన్తి."

ధర్మబద్ధముగా కాంచనము సంపాదించుట గాని, తత్ప్రదర్శనము గాని చేయుటయం దహంకార పూరిత భావము ఉత్సాహము. అదియే సంపద్వీర మునకు స్థాయి.

ఉదాహరణము : దిక్పాలక గర్వభంగ మొనర్చి, దైవసంపత్తిని లంకకు తరలించిన రావణుఁడు మందోదరితో ననిన మాటలు.

"ధనదుసంపద నెదలోనఁ దలఁతువేల ?
సర్వదిక్పాలకాశ్రితాఖర్వలక్ష్మి
నాదు నట్టింట నడయాడు నయముమీఱ
పొలతి ! భృత్యుండు ప్రభువుతోఁ బోలు నెట్లు ?[1]

కుబేరుని సంపద ఆలంబన విభావము. మందోదరీ కృత కుబేర సంపద్వర్ణన ముద్దీపనము. రావణుని మాటలందు ధ్వనించు స్థైర్య, శౌర్యాదు లనుభావ ములు. గర్వాదులు సంచారి భావములు. వీనిచే పరిపుష్టమైన యుత్సాహము సంపద్వీరముగా బిలువఁబడును.

సంపద అను పదమునకు లక్ష్మియను అర్థము కలదు గాన—అష్ట లక్ష్ములనఁబడు ధన, ధాన్య, జయ, బల, ధైర్య, రాజ్య, మోక్ష, సంపల్లక్ష్మ లన్నియు నిందే చేరును.

## 14. రూపవీరము

"రూపయతి విమోహయతీతి రూపం" మోహింపఁ జేయునది యని రూప శబ్దమునకు వ్యుత్పత్తి, రూపసంపద గల్గిన ప్రతి వస్తువు రసికుల హృదయములను మోహింపఁజేసి ఆకర్షించును. ఈ రూపము బాహ్యాంతర భేదముచే ద్వివిధము. సర్వాంగ సుందరమగు శరీరము కల్గియుండుట బాహ్యా

1. మందోదరి, కుబేరస్య రావణే గణనైవ కా
యస్య మే కింకరాయంతే సంక్రందన ముఖాః సురాః
—సాహిత్యసారము—పూర్వ. అ. 4—శ్లో 114)

రూపము. సద్గుణ సంశోభితమైన శీలసంపదc గల్గిన వ్యక్తి బాహిరముగా నంత రూపవంతుcడు కాకపోయినను సహృదయుల నాతcడాకర్షింపc గల్గుచున్నాcడు. మహాత్మా గాంధీగారు గొప్పదగు ఆంతరరూప సంపదcగలవారు. బాహిర మగు రూప మంత ఆకర్షణీయము కాకపోయినను సత్యాహింసలతో గూడిన అతని మహత్తర కార్యదీక్ష నాతనిపై ననంత కాంతి సౌందర్యము వెల యించినది, ప్రపంచము నంతటను ఆకర్షింపc గల్గినాడు. ప్రాచీన లాక్షణికులు నాయకునికి "రూపవాన్" అను లక్షణము తెల్పియున్నారు. అందు రూప ద్వయ మిమిడియున్నది. రూపవంతుcడగు నాయకునిచే నాకృష్టులై సామాజికు లాతని వృత్తమును అభిమానముతోగాంచి తద్గతోపదేశమును వ్యంగ్యముగా గ్రహింతురు. సామాన్యముగా రూపవంతుcడు గానివాడు జనాకర్షకుcడు కాcజాలcడు. కాగా వీరరసమునకు శృంగార మంగమైనపుడు 'కాంతారూప మిచ్ఛంతి' అన్న న్యాయమున నాయకుcడు తప్పక వీరుcడును, రూపవంతుcడు నగును. ఇచ్చట మఱియొక విషయము. రూపనిర్ణయము శరీరముపైకన్న హృదయముపై నెక్కువ ఆధారపడి యున్నది. "కాకిపిల్ల కాకికిముద్దు" అన్నట్లు ఎవరి ఆప్తులు వారికి అందగాండ్రే. ప్రతివారును సుందరరూపు నొక్కనే వరింతురనుట అసంభవము. వారి అభిరుచులనుబట్టి. దేశకాల పాత్రములనుబట్టి, పూర్వజన్మ సంస్కారమును బట్టి లోకమున రూపనిర్ణయ రీతి ప్రతివ్యక్తియందును మారుచుండును.

ప్రకృతిగతప్రతి విషయమునందలి సౌందర్యమును గుర్తించి, తద్ద్వార మున విశ్వాంతర రూపసౌందర్య మరయుటయే కవి తనకవిత్వముపలన సాధించెడిది. అందువలననే యాతcడు సామాన్య మానవునికన్న మిన్నయై సుందర హృదయుcడై సర్వసమన్వయ రూపుcడగు ఈశ్వరుc డగుచున్నాcడు. అతని భావనకెక్కిన ఎట్టివస్తువైనను అఖండ రూపసంపద సంతరించుకొని రస రూపమై విరాజిల్లుచుండును.

"రమ్యం జుగుప్సిత ముదార మథాఒపి నీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు
యద్వాప్యవస్తు కవిభావక భావ్యమానం
తన్నాస్తి యన్నరసభావ ముపైతిలోకే"

కవిబ్రహ్మయగు తిక్కన జుగుప్సావహములగు దృశ్యములను సైతము ఎట్లు రమణీయ దర్శనములుగ నొనర్చినాcడో గమనింపcదగును :

"శక్తిస్ఫార ధనంజయాయత భుజాసంరంభ గాండీవ ని
ర్ముక్త క్రూరశరావళీదళిత శత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమశ్రేణీ వికాసోల్ల స
ద్రక్తాశోకతరు వ్రజంబుల క్రియన్ రంజిల్లి యొప్పెన్ కడున్"
—ఆం. మ. భా. విరా. ప. పం. ఆ ప. 38

ఉదాత్త రూపసంపద బాహ్యప్రకృతియందు లభించుట దుర్లభము. దాని కొఱకు సాహిత్యము నాశ్రయింపవలసినదే. కాళిదాసు సృజించిన శకుంతల పాత్ర అనన్య సామాన్యరూప గౌరవము కలిగినది. అది రసప్రపూరితాపర బ్రహ్మ మానససృష్టి.

"చిత్రేనివేశ్య పరికల్పిత సత్త్వయోగా
రూపోచ్చ యేన విధినా మనసా కృతాను;
స్త్రీ రత్న సృష్టిరపరా ప్రతిభాతిసా మే
ధాతుర్విభుత్వమను చిన్త్య వపుశ్చ తస్యాః." (అభి. శాకుం.)

ఇట్టి రూపసంపదను సాధించుటయందుగాని, తత్ప్రదర్శనము నందుగాని అహంకార సమన్వితమైన యుత్సాహోత్కట భావమే వీరరసము.

ఉదాహరణము : కళాపూర్ణోదయ కావ్యమున దేవవిలాసినియగు రంభ తన యెదుట నారదుఁడు కలభాషిణీ రూపాతిశయము నభివర్ణింపఁగా నీసున దన్మహర్షితో నన్నమాటలు :

"ఊహ యొనర్పరో? యతిశయోక్తుల వర్ణలందు నిట్టి య
వ్యాహతి చెల్లునంచునొ యిటాడితి? రింతియకాక యే వరా
రోహలు మమ్ముఁ బోలమికి రూఢిగ నిమ్మెయినున్న యీ జగ
న్మోహనమూర్తి యర్థపతి ముద్దుకుమారుఁడె సాక్షి"...
(కళా. పూ. ప్ర. ఆ. ప. 165)

ఇందు కలభాషిణి ఆలంబనవిభావము. నారదకృత కలభాషిణీ వర్ణన ముద్దీపన విభావము, స్థైర్యధైర్యాక్షేపాదులు అనుభావములు, గర్వాసహానాసూయా దులు వ్యభిచారి భావములు, వీని సంయోగముచే నుత్కటమగు నుత్సాహము రూపవీర మనఁబడుచున్నది.

## 15. కళావీరము

క = **pleasure** లా = **to bring** సంతోషముఁ దెచ్చు(ఇచ్చు)నది కళ. (ఆప్టే) చతుష్షష్టికళలు లోకప్రసిద్ధములు. శిల్పాదులందులో లలితకళలు.

ఉదాహరణము: ఒక శిల్పి తన శిల్పకళాఖండముల నుద్దేశించి ఇట్లనెను.

"మయుఁడు నేఁడిట నుండిన మామకీన
శిల్పవైభవ మొకయింత తెల్పియుండు
శిల్పశాస్త్రార్థ సారముఁ జేర్చి పేర్చి
మలఁచినాఁడను - నరులకు నలవియగునె?"

మయుఁ డాలంబన విభావము, అతని శిల్పశాస్త్ర పాండిత్యముద్దీపన విభావము. స్థైర్యకౌశలాదు లనుభావములు, గర్వాదులు సంచారి భావములు. వీని సంయోగముచే నుత్సాహము కళావీరమగుచున్నది.

## 16. గానవీరము

గానమనఁగా పాట. గీతమని దానికి నామాంతరము. అది ఆపాత మధురమైన లలితకళ. సర్వ హృదయాహ్లాద సంజనకము గానము. ఆ అర్థము "శిశుర్వేత్తి పశుర్వేత్తి" అను శ్లోకము చాటుచున్నది. విద్యలలోకెల్ల సంగీత విద్యయే శ్రేష్ఠమని కొందఱు :

"విద్యలందెల్ల సంగీతవిద్య మిగుల
నుత్తమము గాదె! యిది పురుషోత్తమునకు
నర్పితంబగునేని యేమని నుతింతు........"

అని నారదుఁడు (కళాపూర్ణో. ద్వి. ఆ. ప. 63) సంగీత జ్ఞాన విహీనులకు మోక్షము కలదా?' అని త్యాగరాజుగారి ప్రశ్న! ఇట్టి గానకళను సాధించి, తద్ద్వారమున మోక్ష పురుషార్థసాధన మొనరించిన భక్తులే త్యాగరాజాదులు. వారు నాద బ్రహ్మోపాసన మొనర్చిన ఋషికల్పులు. వారి దాధ్యాత్మికదృష్టి. కాని కొందఱు లౌకికులు గానమును ధర్మార్థ కామసాధన కంగముగా నుంచు కొందురు. తత్సాధనయం దనంత ప్రయత్న విశేష మొనర్చి సఫలులగుదురు.

ఉదాహరణము : కళాపూర్ణోదయ కావ్యమున నారదుఁడు తుంబురుని గానవిద్యలో గెలుతునని ప్రతినఁబూని హరినిగూర్చి తపమొనర్చి, అతనియొద్దనే కృష్ణావతారమునందు శిష్యత్వము చేసి, గానవిద్యయం దఖండ పాండిత్యము నొంది తుంబురునిగూర్చి యన్నమాటలు.

"ఏనున్ వేగమ యేగి నా పడినపాట్లీడేర నాకంబులోఁ
గానీ కాంచనగర్భు కొల్వునడుమంగానీ పురద్విట్సభం

గానీ తొల్లిటి విష్ణుదేవుకడనే కానీ మదియోల్లస
ద్గానప్రౌఢిని వాదుఁబూని గెలుతున్ గర్వోన్నతుం దుంబురున్''
—కళా. పూ. 2 ఆ. ప. 66

తుంబురుఁడు ఆలంబన విభావము, అతని సంగీత విద్యాపాటవము ఉద్దీపన విభావము, స్థైర్యాదు లనుభావములు. ఉత్సాహధృతిమతివేగామర్షాదులు సంచారి భావములు. వీని సంయోగముచే నుత్కటమగు నుత్సాహము గాన వీరమని పిలువఁబడును.

## 17. అహింసా వీరము

'అహింసాపరమోధర్మః' అని స్మృతి. సర్వమతములంగీకరించు ధర్మ మిది. అహింసయన నేజీవికి నెట్టియపకారము దలపెట్టకుండుట. హింసయను పదము దొంగతనము, కొట్టుట, చంపుట మొ. అర్థములందు ప్రయుక్తము కావున తదభావ మహింస యనవచ్చును. మహాభారతమున ధర్మవ్యాధుఁడు కౌశికునకు అహింసాస్వరూపము దెల్పుచు నిట్లనియెను.

''సలిలము లుర్వి యాకసము సర్వము జంతుమయంబు గావునం
గలుగు నవశ్యమున్ సకలకర్మములందును హింస, హింసకున్
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘటమైనటులుండు నింతయుం
దలఁప రహింసనేయమని తారు తలంతురు గొంద ఱిమ్మహిన్.

పనిపడి యహింస వ్రతముగఁగొని వనముననున్న మునులకుం దొడరదె హిం
సనము తరుమూలఫలశాక నిపీడన మదియు హింసగా దొకొ తలఁపన్.

హింస సేయనివాఁడు లేఁ డిజ్జగమున నొక్కఁడైనను; దమతమ యోపినట్లు
హింస తెరువున కెడకల్గి యేఁగవలయు నదియ చూవె యహింసనా నతిశయిల్లు''
—ఆం. మ. భా. అరణ్య. పం. ఆ. ప. 58-60

సాధ్యమైనంతవఱకు హింస కెడమగుట, హింసను మాన్పించుట అహింస యనఁబడును.

ఉదాహరణము : ఆస్తీకుఁడు సర్పయోగమొనర్చు జనమేజయునితో నిట్లనెను.

''మానిత సత్యవాక్య ! యభిమన్యు కులోద్భవ ! శాంతమన్యుసం
తానుఁడ ! దయాభినిరతస్థితి నీవు మదీయ బంధు సం
తాన మనోజ్వరం బుపరతంబుగ నాకుఁ బ్రియంబుగా మహో
ర్వీనుత ! సర్పయాగ ముడిపింపుము కావుము సర్పసంహాతిన్''
—మ. భా. ఆది. ప. ద్వి. ఆ. 230 ప.

ఇందు విభావము జనమేజయుఁడు, సర్పవంశక్షతి ఉద్దీపనము, స్థైర్య ధైర్య ప్రార్థనాదైన్యాదులు అనుభావములు. ధృతిమతి యత్నానునయాదులు సంచారిభావములు. వీనికూడికచే నుత్కటమగు నుత్సాహము అహింసా సాధనాత్మక మగుటచే నది అహింసావీర మనఁబడుచున్నది.

## 18. ఐశ్వర్యవీరము

'విభూతిర్భూతి రైశ్వర్యం'–విశేషేణ భవతీతి విభూతిః; భూతిశ్చ: ఇ. సీ. విశేషముగా గలుగునది. ఈశ్వరస్వభావ ఐశ్వర్యం అ. న. ఈశ్వరభావ మైశ్వర్యము (గు. భా ప్ర). ఆప్టే: "ఐశ్వర్యం=Superhuman power, the divine faculties of omnipresence; omnipotence, invisibility, supremacy, dominion, sway, power, might. ఈశ్వర=a master, a deity". ఐశ్వర్య మణిమాదిభేదముచే నష్టవిధము. అవి :

1. అణిమ=అనురూపప్రాణులందు పరమాణులందు పరమాణు రూపమున నుండుట.

2. మహిమ=విరాడ్రూపముగ నుండుట.

3. గరిమ=బ్రహ్మాండాదుల కంటె బరువుగానుండుట.

4. లఘిమ=దూదివలె తేలికయైయుండుట.

5. ప్రాప్తి=వలయు వస్తువులు లభింపఁ జేసికొనుట.

6. ప్రాకామ్యము=స్వేచ్ఛా సంచారశక్తి.

7. ఈశత్వము=సమస్తమునకు నధికారియై యుండుట.

8. వశిత్వము=సమస్త భూతజాలమును లోఁబఱుచుకొనుట, స్వాధీనేంద్రియత్వము.

ఉదాహరణము : ఉత్తర హరివంశమున శ్రీకృష్ణుఁడు ఘంటాకర్ణునకు ఇంద్రపదవి నిచ్చుటయందు తన ఈశత్వమును ప్రకటించుకొనినాఁడు :

"అతనికిఁ బ్రీతి నిట్లను మురారి బలారిపదంబు నీకు ని
చ్చితి నతనిం దొలంగ విధిచేసినవాఁ డమరావతీపురీ
పతివని నేఁడ నీ నుదుటఁ బట్టము గట్టితిఁ గొంతకాల మి
ట్లతిశయ భోగమొంది పరమాత్ముని గూడఁగ రమ్ము పిమ్మటన్"
—ఉత్తర హరివంశము – ద్వి. ఆ. పద్య. 164

ఇందు ఘుటోత్కచుఁ డాలంబన విభావము, ఉద్దీపన మాతనిశక్తి, స్థైర్యాదులను భావములు, ధృతిమత్యౌత్సుక్య దయాదులు సంచారిభావములు. ఇందు ఐశ్వర్య వీరము శ్రీకృష్ణు నాశ్రయించియున్నది.

## 19. కవిత్వవీరము

కావ్యమీమాంసా కారుఁడగు రాజశేఖరుఁడు కవికి కవనశక్తి జన్మాంతర సంస్కార బలముచేతను, అపూర్వ ప్రతిభావిశేషముననను అనన్య సహాయముగా లభించుననియు, అట్టి శక్తితో నాతఁడు మహాకావ్య సృష్టి నొనర్చుననియు అట్టి కావ్యనిర్మాత యే 'సహజకవి' యనియుఁ బేర్కొనెను. కావ్య వస్తుతత్త్వమును ప్రధానముగా నెంచుకొని కవుల గుణ తారతమ్యము నరసినచో కవులలో నాహార్య - ఔపదేశిక - కవులని మఱిరెండు తెగలేర్పడునని రాజశేఖరుని మతము. జన్మసంస్కారములు లేకపోయినను, సత్కావ్యపఠన గురుకులవాసాదులవలన బుద్ధి వైశద్యముఁబడసి కావ్యనిర్మాణమొనర్చు కవులు 'ఆహార్యకవు' (పండితకవులు) లనఁబడుదురు. అనఁగా వారిహాజన్మసంస్కార శేముషీధురంధరు లన్నమాట! ఇఁక నిహాజన్మసంస్కార రహితులై, ప్రతిభాశూన్యులై మంత్రతంత్రోపాసనాబలమున కవనమొనర్చు కవులు 'ఔపదేశిక కవు' లనఁబడుదురు. రాజశేఖరుఁడు కవనశక్తి ఇహాపర జన్మాంతర సంస్కారమున జనించునదికాని, మంత్రాదులవలన జనించునట్టిది కాదనియు, సహజాహార్య కవులే కవులనియు బేర్కొనియున్నాఁడు. అతఁడే కవులలో శాస్త్రకవి, కావ్యకవి, ఉభయకవి అను భేదములుచేసి, వారిలో నుత్తరోత్తరుఁడు శ్రేష్ఠుఁడనియు తెల్పెను. అందులో విద్వత్కవియని ఉభయకవి కీర్తింపఁబడును. "విద్వత్కవయః కవయః కేవల కవయస్తు కేవలం కపయః".

పైనఁ బేర్కొనఁబడిన కవులలో సహజకవి సహజకవిత్వ విశారదుఁడగుటచే నాతనిమాట నటుంచి, పండితకవి కవనముగూర్చి యించుక విచారింతము. ఇతఁడు పూర్వజన్మ సంస్కారబలమునఁగాక సత్కావ్యపఠన గురుశుశ్రూషాదులచే నుత్తమకవిత్వము సాధించినవాఁడు. ఈ సాధన ఉత్సాహాత్మకము. ఈ దృష్టితో - కవిత్వసాధనము, కావ్యరచనము, పండితకవి వాదము, కవితాప్రదానము, కవితాప్రదర్శనము (అవధానాదులు) మొ. నవి యన్నియు కవిత్వవీరమున భాగములగుచున్నవి.

ఉదాహరణము : తిరుపతి వేంకటకవులు :

"దోసమటంచెఱింగియును దుందుడు కొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండుభాషలకు మేమె కవీంద్రులమంచుఁ దెల్పఁగా
రోసము గల్గినన్ గవివరుల్ మము గెల్వఁడు గెల్తురేని యీ
మీసముఁదీసి మీ పదసమీపమునన్ దలలుంచి మ్రొక్కమే"

నానారాజ సందర్శనము - పుట 57

పండితులకు, కవులకు ఒప్పని మీసము నెందుకుంచినారని యడిగిన పృచ్ఛకు నుద్దేశించి తిరుపతి వేంకటకవులు కూర్చిన అవధాన కవిత్వమిది. ఇందు పృచ్ఛకుఁడాలంబనము. వారి పల్కు లుద్దీపనములు. ధైర్య, స్థైర్యాక్షేపాదులు అనుభావములు. ఉత్సాహధృతి మతి గర్వావేగామర్షౌగ్ర్యములు సంచారులు, ఇందలిది కవిత్వ వీరము.

## 20. శ్రద్ధావీరము

శ్రద్ధాశబ్దము భక్త్యతిశయమునకును, ఇచ్ఛకును పేరు. దానివలన విశ్వసింతురుగాన దాని కా పేరు వచ్చుట. శ్రద్ధ= Faithful. believing n. a funeral ceremony ob. served at various fixed periods and for different purposes; consisting of offerings with water and fire to the gods and manes and gifts and food to the relations present and assisting brahmanas. (ఆప్టే). దీనినిఁబట్టి పితృదేవకార్యములందును, బ్రాహ్మణ బంధుసమూహములయందు నుపచరించు శ్రద్ధయు నిచ్చుటగై కొనవచ్చునని తెలియుచున్నది. "లోకో భిన్నరుచిః" అన్న న్యాయమునమ వారివారి ఇచ్ఛకు అనువైన వస్తుసంపాదనలో చూపించు నుత్కటమైన శ్రద్ధాపూర్వ కోత్సాహము వీర మనఁబడును.

ఉదాహరణము : రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టారకునితో నన్న మాటలు :

"విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రముల తెఱం గెఱింగితి నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్"

"వ. అయినను నా హృదయంబున ననవరతంబును శ్రీమహాభారతమునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయైయుండు"

—ఆం. మ. భా. ఆదిపర్వ. ఆ. 1, వ. 10, 11

ఇందు రాజరాజనరేంద్రుని మహాభారత శ్రవణాభిలాష యితర కావ్యము లెన్ని చదివినను వీడక శ్రద్ధారూపమున పరిణమించి నన్నయభట్టుచే దానిని నాంధ్రీకరింపఁ జేయుటకై ప్రార్థింపఁ జేసినది. ఇచ్చట పురాణాదులు ఆలంబన విభావములు. వాని జ్ఞాన ముద్దీపన విభావము. వైశారద్యము, స్థైర్యము మొదలగునవి అనుభావములు. ధృతి మతి స్మృతి తర్కాదులు సంచారిభావ ములు. వీనిచే పరిపుష్టమైన ఉత్సాహముఉత్కటరూపమంది వీరరస నామము వహించును.

## 21. భక్తివీరము

"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం".

అని శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ. ముముక్షువునకు భక్తికన్న సులభమార్గము లేదు. మహాయోగులు ఘోరతపములవలన సాధింపఁజాలని కైవల్యము భక్తివలన గల్గునని ప్రహ్లాదుఁడు.

"చిక్కఁడు వ్రతముల; గ్రతువులఁ జిక్కఁడు; దానముల శౌచశీలతపములం
జిక్కఁడు; యుక్తిని భక్తిని జిక్కిన క్రియ నచ్యుతుండు, సిద్ధముసుండీ!

చాలదు భూదేవత్వము చాలదు దేవత్వ; మధిక శాంతత్వంబుం
జాలదు హరి మెప్పింప విశాలోద్యములార! భక్తి చాలిన భంగిన్".

—ఆం. మ. భాగ, 7 స్కం, ప, 243, 244.

"దనుజారి లీలావతారంబు లందలి
శౌర్యకర్మంబులు సద్గుణములు
విని, భక్తుఁ డగువాఁడు వేడ్కతోఁ బులకించి,
కన్నుల హర్షాశ్రు కణములొలుక
గద్గదస్వరముతోఁ గమలాక్ష! వైకుంఠ!
వరద! నారాయణ! వాసుదేవ!
యనుచు నెత్తిలి పాడు, నాడు, నాక్రోశించు,
నగుఁ, జింతనముసేయు, నతియొనర్చు,
మరులుకొనియుండుఁ; దనలోన మాటలాడు;
వేల్పుసోకిన పురుషుని వృత్తిఁదిరుగు;
బంధములఁ బాసి, యజ్ఞాన పటలిఁగాల్చి
విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తివివశుఁడగుచు".

—ఆం. మ. భాగ. 7 స్కంధ, ప. 240.

భక్తుఁడు భక్తిభావముతో నద్వైతస్థితిని పొందుట యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వరశతకమున నిట్లు వర్ణించినాఁడు.

"భవికిన్ భక్తిమహత్త్వ మంకురితమై పాటిల్ల భక్తుండు బాం
ధవ మాత్రుండగు; భక్తిపుష్పితముగాఁ దద్భక్తుఁడా శ్శేషుఁడై
సవిశేషస్థితిఁదోఁచు; భక్తిసఫలోత్సాహంబునుం బొందగా
నవికల్పస్థితి నంత భక్తుఁడును నీవై యుండు సర్వేశ్వరా !

—సర్వేశ్వరశతకము-ప. 52.

భక్తిసఫలోత్సాహభావరూపముగాంచి, పైసీసమునఁ జేర్కొనఁబడిన విభావాను భావాది రూపమున భక్తునియందు గోచరించి, భక్తివీరముగాఁ బిలువఁబడు చుండును.

భగవద్భక్తిరసాయన కర్తయగు మధుసూదన సరస్వతి భక్తికి రసత్వ మును స్థాపించెను. "అనుభవ మాత్రము వలననే సాక్షాత్సుఖవిరుద్ధములయిన శోకక్రోధ భయాదులకు రసత్వ మంగీకృతమై యున్నది. అనుభవసిద్ధమయి మిగిలిన రసములకన్న వేయిరెట్లధికముగా రస్యమానమగుచున్న భక్తిరసము గాదనుట ఎట్లు? ఇతర దేవతావిషయకమగు రతి భావమే; వలన వారు జీవులే యగుటచేఁ బరమానందము కలుగదు. పరమాత్మస్వరూప శ్రీకృష్ణరతి పరమా నందమునకుఁ గొంపోవును. మఱియు కాంతాది విషయకములగు నేరసము లందును భగవద్రతి యందువలెఁ బూర్ణసుఖములేక యానందము గలుగదు. కాన, వానియందుఁ దగిన రసపుష్టిలేదు. అవి క్షుద్రరసములు, భగవద్రతి పూర్ణరసము. అది మిడుఁగురు పురుగులకన్న సూర్యకాంతి ఎట్లు బలవత్తర మో అట్లే మిగిలిన రసములకన్న శ్రేష్ఠతరము, బలవత్తరము" అనియును వచించెను.[1]

1. "శోకక్రోధ భయాదీనాం సాక్షాత్సుఖ విరోధినాం
రసత్వ మభ్యుపగతం తథాఽనుభవమాత్రతః.
ఇహానుభవసిద్ధేఽపి సహస్రగుణితో రసః
జడేనేవత్వయా కస్మాదకస్మాదపలప్యతే.
రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః
భావః ప్రోక్తో రసోనేతి యదుక్తం రసకోవిదైః.
దేవాంతరేషు జీవత్వా త్పరానందాఽ ప్రకాశనాత్
తద్యోజ్యం; పరమానంద రూపేన పరమాత్మని.
కాంతాది విషయావాయే రసాద్యాస్తత్ర నేదృశం
రసత్వం పుష్యతే పూర్ణసుఖాస్పర్శిత్వ కారణాత్.
పరిపూర్ణ రసాక్షుద్రరసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్యప్రభేవ బలవత్తరా.

—కావ్యాలంకార సంగ్రహమునుండి. పుట 808.

(శ్రీ స. సూ. శాస్త్రిగారి అనువాదము). కాని ధనంజయాదులు భక్తిని రస ముగా గాక భావముగా నంగీకరించిరి. పెక్కు రీ మతమునే అవలంబించి యున్నారు.

ఉదాహరణము : హరికీర్తనము వీడుమని ప్రబోధించు చండా మార్కులఁ గాంచి ప్రహ్లాదుఁడు పల్కిన పల్కులలో భక్తివీరము ప్రస్ఫుటము కాఁగలదు.

మాటలు వేయు నేమిటికి మాధవుఁ డొక్కడ దైవమేను ము
మ్మాటికిఁ జాటితిన్ గుటిల మత్సర భావము లుజ్జగించి య
మ్మేటి భజింపుఁ డీ తెరువు మేలుగఁ గైకొనుఁ డాత్మలోన మో
మాట మొకింతలేదు హరి నొల్లమి యెప్పుదు చెప్పితింజుఁడీ!

(నృసింహపురాణము - ఎఱ్ఱాప్రగడ - చతు. ఆ. ప. 102)

ఇందు గురువులు విభావములు. వారి బోధ లుద్దీపనములు. స్థైర్యవైశారద్యాదు లనుభావములు. స్మృతి, మతి, వితర్క, హర్షాదులు సంచారి భావములు. వీని సంయోగముచే విష్ణుమహిమాభివర్ణనాత్మకమైన భక్త్యుత్సాహము భక్తి వీర మనఁబడుచున్నది.

భక్తిమార్గములు తొమ్మిది.

"తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనమున్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి, స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతున్ సత్యంబు"

అని భాగవత కర్త. భక్తివీర మీతొమ్మిది విధములుగా సాహిత్యమునందు గోచరించును.

దైవభక్తియేగాక, గురుజనులను, దేశమును గూర్చిన భక్తియు నిందు జేరును. భీష్ముఁడు గుర్వర్థముచేసిన ప్రతిజ్ఞ దీని కుదాహరణము.

"వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతు లిందఱు నే గురుప్రయో
జనమునఁ జేసితిన్ సమయసంస్థితి యీ లలితాంగి కుద్భవిం
చిన తనయుండ రాజ్యమును జేయఁగ నర్హుఁడు వాఁడ మాకునె
ల్లను బతి వాఁడ కౌరవకుల స్థితికారుఁ డుదారసంపదన్."

(ఆం. మ. భా. ఆది ప. 4 ఆ. ప. 187)

పైన వివరింపఁబడిన వీరరస భేదములన్నియు నుత్తమ ప్రకృతికములు, ధర్మప్రధానములు నగుటచే నొక విధముగా ధర్మవీరాంతర్గములే యగు

చున్నవి. కాని సహృదయులు తత్తన్నిమిత్తములు నాధారముగాఁ గొని వానిని పెక్కు తెఱఁగులుగా విభజించి యుండిరి. అట్టిది శ్లాఘనీయము.

రసగంగాధరకారుఁడు తన గ్రంథమున వీరమును అష్టవిధములుగా నిరూపించుచు, తత్సమర్థన మీ క్రిందివిధముగా నొనర్చియున్నాఁడు: "వస్తుతస్తు బహవో వీరరసస్య శృంగారస్యేవ ప్రకారా నిరూపయితుం శక్యన్తే." వస్తుతః శృంగారమునందున్న భేదములవలెనే వీరమునందును నిరూపింపవచ్చును. ధర్మ వీరాద్యుదాహరణములందు కొన్ని పదములను మార్చి చూపినచో మిగిలిన వీరరస భేదములఁ గొన్నిటికి నుదాహరణములుగా గూడ కానుపింపవచ్చును

"న చ సత్యస్యాఽపి ధర్మాంతర్గతతయా ధర్మవీర రస ఏవ తద్వీరస్యా ప్యన్తర్భావ ఇతి వాచ్యమ్ దానదయయోరపి తదంతర్గతయా తద్వీరయోరపి ధర్మవీరా త్పృథగ్గణనానౌచిత్యాత్ ఏవం పాండిత్యవీరోఽపి ప్రతీయతే." సత్యముగూడ ధర్మాంతర్గత మగుటచే సత్యవీరము ధర్మవీరమనరాదు. దాన దయావీరములు కూడ ధర్మాంతర్గతము లగుచున్నను, ప్రాచీనులు పృథగ్గణన మెందు కొనర్చియున్నారు ? వారి పృథగ్గణ నౌచిత్యము ననుసరించి సత్య వీరము కూడ ప్రత్యేకముగా పరిగణింపఁబడుట ఉచితము. అట్లే పాండిత్య వీరముగూడ ప్రతీయమానమగుచున్నది.

పాండిత్యవీరమున ప్రతివాదులతో నొనర్చు వాదము వాగ్యుద్ధరూపము కావున దానినిఁగూడ యుద్ధవీరమనియే కొందఱు పేర్కొనవచ్చునను శంకకు సమాధానముగా జగన్నాథ పండితరాయలు: "చాఽత్ర యుద్ధ వీరత్వమ్ యుద్ధత్వస్య వాద సాధారణస్య వాచ్యత్వాత్ ఇతిచేత్ క్షమావీరే కిం బ్రూయాః? బలవీరేవా కిం సమాదధ్యాః?" పాండిత్యవీరమును యుద్ధమునం దంతర్భ వింపఁ జేసినను, క్షమాబల వీరములలో నేమి చెప్పెదరు ? అని ప్రశ్న వేసినాఁడు. ఈతనిదృష్టి నభినందించి, ఇతని బాటలో నడచినవాఁడు అచ్యుతరాయలు. అతఁడిరువదియొక్క విధములుగా వీరమును ప్రతిపాదించుచు తన మతమున కిట్లు ప్రాతిపదిక వేసికొనినాఁడు. "నచ రసతరంగిణ్యాం వీర ముపక్రమ్య సచ త్రివిధః యుద్ధవీర దానవీర దయావీర భేదాదితి త్రివిధస్తత్రైవ తస్యోక్తేః కథం ద్వాదశధాస్యాదితి వాచ్యమ్ రసగంగాధరే యుద్ధదాన దయాధర్మ సత్య విద్యాక్షమాబల భేదై రష్టవిధస్యాఽపి తస్యోపలబ్ధత్వేన ధర్మాదివత్తపస్త్యాగ యోగ జ్ఞానాఖ్యానాం భేదానామప్య నిరాకార్యత్వాత్ అతోయుక్తమే వేదం

ద్వాదశ విధత్వం తస్యేతిదిక్" అని. ద్వాదశవిధములు ముందు జేర్కొని తరువాత నిఱువదివఱకు వానినిఁ బొడిగించెను.

వీరి యభిమతములవలనఁ దేలిన విషయమిది : వీరరసమునకు భేదము లిన్నియని నిర్ణయింపఁజాలము. కావ్య పరిశీలనా తత్పరులగు సహృదయులకు వీరము బహు రూపములతోఁ బ్రత్యక్షము కావచ్చును. వా రట్టివానిని స్వరూప నిరూపణము గావించి ప్రపంచించినచో బుధులంగీకరింతురు.

"న చైవ సంఖ్యాఽసంఖ్యత్వం దోష స్తస్యేప్సితత్వతః
ఏవ మన్యేపి తద్భేదా బుధై రూహ్యాః సతాం మతాః"[1]

అని అచ్యుతరాయలు. (సాహిత్యసారము పూర్వ. ఆ. 6 శ్లో. 112)

రసములందిట్టి విపుల విమర్శనము లాక్షణికుల విద్వన్మూర్తికొక సహజాలంకారమై వరలుచున్నదనుటలో సంశయము లేదు.

పై ఆలంకారికుల దృక్పథము నారాధించుచు, ప్రాచీన నవ్య సాహిత్య పర్యాలోచనానంతరము నేనును నా సాయశక్తుల వీరమునందు మఱికొన్ని భేదముల నొనరింపఁ బూనుకొనుచున్నందులకు విజ్ఞులు మన్నింతురుగాక !

నాచే బ్రతిపాదితమగుచున్న వీరరసభేదములు మూఁడు అవి :

1. స్వాతంత్ర్యవీరము
2. యశోవీరము
3. మానవీరము

## స్వాతంత్ర్య వీరము

భారతీయులు స్వాతంత్ర్యప్రియులు, అభిమానధనులు - అని వారి చరిత్రలోని ప్రతిపుటయు వక్కాణించుచున్నది. అట్లగుటచే, అఖిలభారత మాంగ్లేయులకు దాసోహమని దాస్యశృంఖలలో చిక్కుకొనుటఁగాంచిన భారతీయుని యందు స్వాతంత్ర్యజ్యోతి యుజ్జ్వలముగా ప్రకోపించినది. అది పారతంత్ర్య తమస్సులను అణచిగాని ఆగలేదు. ఆ ప్రచండపావకుని కాంతిలో తన ప్రాచీన చరిత్రమంతయు స్వచ్ఛముగ, స్వాతంత్ర్యభావ విలసితముగ గోచరించి

1. "అస్య ప్రకృత వీరరసస్య అసంఖ్యాత్వం దోషః స్యాదితి న కుతః తస్య అసంఖ్యత్వస్య ఈప్సితత్వతః ఇష్టత్వాదితి యోజనా రసభేద బహుత్వేన తద్విపులత్వం హి అలంకారా యై వాలంకారికాణామితి తాత్పర్యం"
—(సాహిత్యసారము-సగసమోద వ్యాఖ్య-పుట 124)

నది భారతీయులకు. వారు దానిని సాహిత్యమునఁ గీర్తించినారు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అని జన్మభూమినే స్వర్గముగా భావించి దానికి స్వాతంత్ర్యసిద్ధిఁ గల్పించుటకై అసువులనుసైతము బలిచేయుటకు సిద్ధమైనారు. వారి భావనలో –

"భూమిపాలుర పాదములు గొల్వఁగా పూజ్యమగు ప్రపంచాధిపత్యమున కన్న,
దేవేంద్రు విభవంబు దెగడి యానందసౌఖ్యము గూర్పఁజాలు భోగముల కన్న
బరమసౌందర్య సంపద్విభూషిత లప్సరస్త్రీరహో విహారమునకన్న
నవసంఖ్యానిధులకు నాయకుండగు రాజరాజాధికార గౌరవముకన్న

నట్టి నళకోటి శతకోటి యంత లెక్కుడగుచు నాత్మస్వతంత్రత యలరు దాని
కన్న దేశస్వతంత్రత యధికమగు; స్వతంత్రతను మించు దైవము ధరణిలేదు"
—అమరసింహ చరిత్రము.

స్వాతంత్ర్యసిద్ధికై ప్రయత్నించుటయందలి యుత్కటోత్సాహమే స్వాతంత్ర్య వీరము. నేటి ప్రపంచమునంతయు ననుశాసించుచున్న యేకైకధర్మమిదియే. నవ్యసాహిత్యమంతయు చాలవఱకు ఈ వీరముద్రఁగలిగియే యున్నది. అది ముందు విచారింపఁబడును. ప్రస్తుత ముదాహరణకై హైందవమత రక్షకుఁడును, మేవాడు స్వాతంత్ర్యకాంక్షియునగు రాణాప్రతాపసింహుని స్వాతంత్ర్య వీరస్ఫోరకములగు వచనస్థితిని గైకొందును.

"క్ష్మాగోళమును ముంచు గాఢాంధ తమసంబు గర దివ్వెతో నార్పఁగడఁగునట్టు
లత్యగాధము సాగరానంత జలముల కేతమ్ముకవేయ నూహించునట్లు
వసుధ బొగ్గుగఁ గాల్చు ప్రళయాగ్నిహోత్రంబు గన్నీటిచే నార్పనున్న యట్లు
క్షయకాలమున రేఁగు సప్తమారుత ధాటిఁదేటి రెక్కల నాప దిపురునట్లు

లని జగము నన్నుఁ బరిహాస మాడుగాక!
యొక్కటని నిల్చి బలమెల్ల నెదురుపెట్టి
విధికి మాఱొడ్డి స్వాతంత్ర్య విజయలక్ష్మి
యడుగులకు నిత్తు ముత్యాల హారతులను" (రాణాప్రతాపసింహ చరిత్ర)

అక్బరు ఏకచ్ఛత్రముగా భారతమును పాలించుచు మేవాడును మ్రింగనుద్యుక్తుఁడయిన తరుణమది. రాణా తమ్ములక్బరుతో కలిసి కుతంత్రములు పన్నుచుండిరి. మేవాడు చిన్నరాజ్యము. రాణా అక్బరుతో పోరుట కొండతో ఢీకొనుటవంటిదే. కాని స్వాతంత్ర్యాభిలాష ప్రాణత్యాగమునకైనను వెనుదీయింపక ముందున కుత్సాహముతో నడిపించినది. ఇందతని నాశ్రయించిన స్వాతంత్ర్య వీరస్ఫూర్తి తెలిసికొనుట చాల సులభము.

## యశోవీరము

మానవుని శరీరము బుద్బుదప్రాయము. అది నశించినచో నాతఁడు నామావశిష్టుఁడగును. అట్టిస్థితియు కొన్నిదినములకు మాసిపోయి కాలగర్భమునఁ గలిసిపోవును. కాని మహాత్ములు పాంచభౌతిక శరీరము వీడినను యశఃకాయముతో చిరంజీవులయి లోకమున నిలిచిపోయెదరు. నేడును యశఃకాయులై ధర్మరాజు, హరిశ్చంద్రుఁడు, రాయలు, నన్నయ, గాంధి మొ॥ వారున్నారు. అట్టి శాశ్వతత్వ ప్రసాదరూపమగు యశస్సును ఒక మహాకార్య సాధనము మూలమున సాధించుటయే యశోవీరము. కార్యసాధన కానుషంగికఫలము యశమై యున్నను కొందఱు యశస్సునే ప్రధానముచేసి ధర్మము నిర్వహించువారును కలరు గావున నిట్లు యశోవీరము ప్రత్యేకముగఁ బేర్కొనుట జరుగుచున్నది. ఉ॥ ఆదిత్యుఁడు కర్ణున కింద్రుడు బ్రాహ్మణ వేషధారియై కవచకుండలముల నర్జున రక్షణార్థ మభ్యర్థించుట కేతెంచనున్నాఁడని తెల్పి, వానిని దానము చేయవలదని పేర్కొనగా కర్ణుఁడనిన మాటలివి :

"మతిఁ గుంతీసుత పక్షపాతి యగుచున్ మాయా స్వరూపంబుతో
జితదైత్యుండు శతక్రతుండు నను భిక్షింపంగ నేతెంచు న
ట్టి తెఱంగైనఁ దదీయ కీర్తియచుమీ డిందుం ద్రిలోకీ సము
న్నతమై యొప్పు మదీయ కీర్తి యిది సూ నాపుణ్య మిబ్భంగులన్."

కీర్తి విడువఁజాలఁ గీర్తితో మెలఁగగఁ జావు వచ్చెనేని జత్తుఁగాని
జగములోన నెల్ల నడికంబెుఁ జావు మేలనఁగఁ బరఁగు మాట యనఘ! వినవె?

"కీర్తియయిచ్చుఁ బుణ్యగతిఁ గీర్తియ తల్లియుఁ బోలె బ్రోచు స
త్కీర్తియ యాయువున్ సిరియుఁ గీర్తివిహీనుఁడచూ శవంబు దు
ష్కీర్తికు నెల్ల చేటులును గిట్టి హరించు ననంబె తొల్లి భ
ర్తారి హరుండు నాఁబరగు నంబుజసూతి జగద్ధితంబుగన్."

(మహాభారతము అరణ్య. 7. ప. 292-294)

కీర్తిప్రాశస్త్యమును ప్రతిపాదించి, తద్రక్షణకై ప్రాణత్యాగము సేయ నుత్సహించు కర్ణునాశ్రయించి యశోవీరము శోభించుచున్నది.

## మానవీరము

"మాన శ్చిత్తసమున్నతిః ఆత్మానం మానయతీతి మానః మాన పూజాయాం" (తననుఁ బూజించుకొనఁ జేయునది); చిత్తస్య సమున్నతిః పరత

ఉత్కృష్టేన చేతస ఉన్నతిర్మానః యథాశూరోస్మి, అర్థవానస్మీతి ప్రణతి యోగ్యేషు ఉన్నతిః కథంవా మానః" నేను ఉత్కృష్టుఁడను అనుచిత్తౌన్నత్యమునకు మాన మని పేరు. (గు. ప్ర.) శూరులకు ప్రాణములకన్న మానమే ముఖ్యము. వారి కది అమూల్యాభరణము. ధీరోదాత్తాది నాయకులకు కూడ అభిమాన మనునది ప్రధాన లక్షణము. అభిమానధనులు పరుల తిరస్కారమును సహింపలేరు:

"అర్కకాంత మచేతనంబయ్యు సవితృపాదములు సోకినంతనె ప్రజ్వరిల్లు
గాన నభిమానవంతుఁ డెంతైన శత్రుకృత తిరస్కార మెట్లు సహింపనేర్చు?"

వారి కత్యున్నతదశయో లేక తద్విపరీతమో కాని మధ్యేమార్గములు లేవు.

"కుసుమ గుచ్ఛంబులకుఁ బోలె బొసఁగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు:
సకలజన మస్తకప్రదేశములనైన
వనమునందైన జీర్ణభావంబుఁ గనుట"

ఉదా: బుస్సీ సైన్యము లుద్ధతితోఁ బోరి బొబ్బిలి రంగారాయని సేనల నురుమాడుచుండఁగా రంగరాయలు రణరంగమున వీరుల నెలుగెత్తి పిలిచి:

"బిలిచి యసమానకక్ష యిబ్బలము పెంపు
తెంపు సైరింప రా దింకఁ దెగువఁజేసి
మనల శుద్ధాంతకాంతా ప్రమాపణంబు
నెఱపి యభిమాన ధనమె మన్నింప లెస్స!"

"బలవంతుండగు వైరిపైఁ దొడరి దోఃపాండిత్యముల్ బాపిరన్
విలసత్ఖ్యాతియు మానరక్షణము సద్వృత్తిన్ ప్రవర్తిల్లిరన్
కులముం బెద్దలు మెచ్చుకొంటయును గల్గుస్మీద నాశారకా
జలజాతాప్త నిశాకరంబగు యశస్సంపత్తియుంబర్యెడున్"

—రంగారాయ చరిత్రము. 3-151-152.

ఇందభిమాన ధనసాధనమే ప్రధానము. దాని కానుషంగికఫలము కీర్తి, ఖ్యాతియు యశస్సంపత్తియు అనుటచేతను, మానధనము, మానరక్షణము అని నిశ్చయార్థము తెల్పుటచేతను అనుభావము స్ఫుటీకరింపఁబడుచున్నది. మాన సంరక్షణార్థమై యుద్ధమున కుత్సహించుటయందిచ్చట మానప్రధానమై వీరము స్ఫురించుచున్నది. "బొబ్బిలి యుద్ధ" నాటక విమర్శనమున ఈ విషయము విపులముగ వర్ణితము.

ఇచ్చట నొకటి మీమాంస్యమగును. సాహిత్యశాస్త్రమునందు నిబంధింపఁ బడిన యిన్ని వీరరసభేదములను చూచినపుడు — "అయితే యింక వీరరసము

కానిదేమున్నది ?" "ఆలంకారికులు వీరరసమున కతివ్యాప్తిని కల్పించి దానిని పల్చపరిచినారేమో ?" అను భావములు కొందఱికిఁగలుగవచ్చును. నా యభిప్రాయమున సాహిత్యమర్మజ్ఞులగు ఆలంకారికులదృష్టి సముచితమైనదేయని స్ఫురించుచున్నది. ప్రాచీనులదృష్టిలో జీవితమే ధర్మసాధనరూపమైనది. అది ప్రఫుల్లమగు నుత్సాహముతో నిండినది; మఱియు వివిధ దుర్గుణత్యాగపూర్వకముగ సద్గుణారంభ సముల్లసితమైనట్టిది. అట్టి సాధన వీరరసభూషితమై జీవిత పరివ్యాప్తమై సర్వపురుషార్థ సంపాదకమై యొప్పుననుటలో నాశ్చర్యమేమి ? అర్థకామ పురుషార్థములు పరిచ్ఛిన్నములై తదీయములైన రౌద్రశృంగారములకు గూడ అట్టి పరిచ్ఛిన్నతనే ఆపాదించుచున్నవి. ఒక్క ధర్మమే ప్రవృత్తి నివృత్తి భేదముచే ద్వివిధమై అదియే రసరూపమున వీరశాంతములు కాఁగా అందు సాధనరూపమైనవీరరసము అంగాంగిభావమున సర్వరసములకును పోషకమగుచున్నది. అది సాధకుఁడైన నాయకుని ప్రతిగుణమునందును, ప్రతిభావమునందును, ప్రతిచర్యయందును ప్రతిబింబించుటలో విప్రతిపత్తి యేదియులేదు. అట్టిచో నాయకునియందు నిబద్ధములైన గుణములన్నియు ధర్మాంశరూపములేయైనను కావ్యనిబంధనార్థమై ప్రత్యేకనిర్దేశముకొఱకు సత్యాదివీరముల పేరిట వివిధములుగా నిరూపింపఁబడియున్నవి. ఇది-అతివ్యాప్తము ననుచితము కాకపోగా వీరరసవైశాల్యమును సూచించుటకుఁదగిన ప్రక్రియ యని భావించుచున్నాను. శృంగారాదులగు రసముల విషయమున పూర్వోక్తములగు నియాత భేదమునే పాటించుచువచ్చిన ఆలంకారికులు – జగన్నాథ పండితుఁడు, అచ్యుతరాయలు మొ. వారు- వీరరస విభేదములను నిరూపింపవలసి వచ్చినప్పుడు సోపపజ్ఞముగా నిన్ని విభాగములొనర్చి వీరరసస్వరూపమును వ్యంగ్యముగా గుర్తించినారనవచ్చును. అట్లే వీరరసతత్త్వజ్ఞులయిన కవులు – శాస్త్రజ్ఞులు ఇంకను మఱికొన్ని భేదములను ప్రతిపాదించిన యెడల నది వారు తమ ప్రతిభాదృష్టితో చేసిన రసదర్శనముయొక్క ఫలితార్థములుగా భావించుట సహృదయుల లక్షణము.

ప్రవాహరూపములైన దేశీయభాషలలో నుదాత్తాశయసాధకమైన పెక్కు ధర్మదృష్టులు కాలానుసారముగాఁ దత్తత్సాహిత్యములలోఁ జేర్పబడి నూత్న స్వరూపములతో విరాజిల్లుట స్వాభావికమైన విషయము ! అప్పుడట్టి సార్వకాలిక ప్రయోజనముగల కవుల దర్శనములు వీరరసభేదములను ఇంకను పెంచి ఆ రసమునకు, మానవజీవితమునకు గల సమగ్రవ్యాప్తిని సూచించును. అందుచే నిట్టి ప్రక్రియ సముచితము, సువిశాల దృక్పథసూచకము నగునని మనవి !

★

# 4. వీరరసాశ్రయములు

## కావ్యేతివృత్తము

"శరీరమాద్యం ఖలు ధర్మ సాధనమ్" అని మహాకవి కాళిదాసోక్తి. ధర్మసాధకుఁడు తన శరీరము శిథిలము గాకుండ చూచుకొనుట ప్రథమకర్తవ్య మని యందలి తాత్పర్యము. తాత్త్వికదృష్టితో నీ వాక్యార్థమును లోతుగా నాలోచించినచో రెండు సత్యములు బయలు వడును. లోకమునఁ బ్రాణుల శరీరము లెన్నటికైనను శిథిలములగుట తథ్యము. కాని వానిని జాగ్రత్తగాఁ బోషించుకొనినచో దీర్ఘకాలము మనుటకు వీలుండి ధర్మసాధన కుపయోగ పడును. అయినను దేహి శరీరస్వభావమగు కౌమార యౌవన జరావస్థలను దేహాంతరప్రాప్తికిని లోనుగాక తప్పదు. ఇది యొక సత్యము. దేహి దేహమున కన్న భిన్నుఁడు. "దేహీనిత్య మవధ్యోఽయం దేహేసర్వస్య భారత !" (భ. గీ. ద్వి 30) అను గీతావాక్యముచే సమస్తప్రాణి శరీరములం దుండు దేహి (ఆత్మ) నాశనము లేనిదని తేలుచున్నది. దీనినిఁ దెలియుట రెండవ సత్యము. నరుఁడు జీర్ణవస్త్రములఁ బరిత్యజించి నూతన వస్త్రధారణ మెట్లుగావించునో అట్లే దేహి శిథిల శరీరములఁ బరిత్యజించి నవ్యములఁ బొందుచున్నాఁడు.[1]

"పురుషః ప్రకృతిస్థోహి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్" అను గీతా వాక్యముచే పురుషుఁ (ఆత్మ, దేహి) డాయా ప్రకృతు (దేహము) లందున్న వాఁడై దేహేంద్రియ సంఘాతరూప పరిణతమగు ప్రకృతినిఁ దనరూపముగా నజ్ఞానవశమునఁ దలఁచుచు, ప్రకృతివలన జనించిన సుఖదుఃఖ మోహాదులఁ బొందుచున్నాఁడు. అట్లగుటచే సర్వప్రాణివ్యాప్తమైన యాత్మస్వరూప మొక్కటియే యైనను భిన్నభిన్న ప్రకృతులందు వ్యాపించియుండుటవలన, భిన్నభిన్న నామరూపానుభవాదులతో భాసించుచున్నది. ఇచట దేహములందు భేదమే కాని పురుషునియందుఁ గాదు. ఇది బ్రహ్మసృష్టియందలి ప్రాణిలక్షణము.

కవిబ్రహ్మ సృష్టియందలి జీవలక్షణము దీనికన్న విలక్షణము. కవి సృష్టి కావ్యము. కావ్యమునకు శరీరము శబ్దార్థములు. శబ్దార్థముల సాయమునఁ గవి వర్ణనము (కవనము) సేయును. వర్ణన మొనర్చుటకొక వస్తువవసరము.

1. వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ. —(భ. గీ. ద్వి. 22).

అట్టి వస్తువే యితివృత్తము. కావుననే భరతుఁడు "ఇతి వృత్తంతు కావ్యస్య శరీరం పరికల్పితమ్" (నా. శా. 19 అ. శ్లో 1) అని ప్రవచించినాఁడు. కావ్య శరీరమునం దాత్మరసము. రసాత్మకమగు కావ్యము జీవించును. జీవాత్మవలెనే రసము శాశ్వతము, వ్యాప్తము, అనశ్వరము. కాని జీవుఁడు జీర్ణమగు దేహమును వదలి దేహాంతరమునఁ బ్రవేశించును. రసమునపట్ల నిట్టి ప్రవృత్తి లేదు, కావ్యవ్యాపియై యున్న రసము కావ్యమునుఁగూడ తనవలెనే యక్షరమును, సువ్యాప్తమును, ఆనంద సుందరమునుగా నొనర్చును. ఆత్మకువలెనే శరీరమునకు శైథిల్యములేని శాశ్వతత్వము గల్గుటయే యిందలి వైలక్షణ్యము, విశేషము.

కావ్యేతివృత్త నాయక ప్రవృత్తులఁబట్టి రసము బహురూపములుగ భాసించును. రతి స్థాయిభావముగాఁగల్గు కావ్యరసము శృంగారము. ఉత్సాహ ప్రధానమగు కావ్యరసము వీరము. ఇట్లే యన్నిరసములు. రసములు సంఖ్యకుఁ బెక్కులైనను అనుభూతియందవి యాస్వాద్యమానము లగుచు నానందైక రూపముఁ దాల్చుచున్నవి. మానవజీవిత సమాంతరముగ కావ్యజీవితము నిట్లు విమర్శించుట భారతీయుల విలక్షణత్వము.

'ఇతివృత్తము కావ్యశరీర' మని భరతుఁడు చెప్పిన శ్లోకమున కభినవగుప్తుఁడు చేసిన వ్యాఖ్యానము గమనార్హము. అనభినేయమైన కావ్యమునకు వృత్తము (కథ-story) శరీరము. అభినేయమైన కావ్యమునకు (దశరూపమునకు) ఇతివృత్తము (well-knit plot) శరీరము. 'ఇతి' యనఁగా పంచ సంధులతో నలంకరింపఁబడిన అని యర్థము.[1]

వృత్తము, వస్తువు అను పదములు తుల్యార్థదములుగను, పర్యాయ పదములుగను సాహిత్యమునఁ బ్రయోగింపఁబడుచున్నవి. కావున కావ్యవృత్త మన్నను కావ్యవస్తువన్నను నొకటియే. "రాజర్షి వంశచరితం-నదివ్యచరితం-నృపతీనాంయచ్చరితం యేనాయకాని గదితాః తేషాం ప్రత్యక్షచరిత సంయోగః "'వృత్తంస్యా దాధికారికమ్' అను నిర్వచనమువలన కావ్యవస్తువు ప్రత్యక్ష నాయకచరిత (వృత్త) మని యనఁబడుచున్నది.

'వస్తువు-వసంత్యస్మిన్ సర్వేకావ్యార్థాః నేతృగుణ భావకర్మాది రూపా ఇతి' అను వ్యుత్పత్తిచే నేతృగుణ భావకర్మలును 'ఆది' పదముచేఁ దద్విభావాది సామగ్రియు నిందు వసించును, వ్యాపించియుండును; గనుక 'వస్తువు' అని

1. శ్రీ పో. శ్రీ. అప్పారావు. నా. శా. వి. అం. 19 అధ్యా. పుట 586.

చెప్పఁదగును. వస, నివాసే, ఆచ్ఛాదనే, స్తంభే, స్నేహమోహాచ్ఛేదాపహారేషు" అనుధాత్వర్థ విశేషములచే కావ్యవస్తువు కావ్యమున కాధారము (స్తంభభూతము) అనియు, నాయకునిచే నాచ్ఛాదిత మయినట్టిదనియు, సామాజిక హృదయగత దుఃఖరూప సంస్కారములకు ఛేదకమయి వారి మనస్సుల నపహరించునట్టిది, సర్వకావ్యార్థములచే వాసితమై (వ్యాప్తమై) యుండునట్టిదనియు, సాత్త్విక హృదయుల స్నేహ (ప్రేమ) పాత్రమగును, రాజస, తామసహృదయులకు మోహకమునయి 'యస్తుష్టేస్తుష్టి మాయాతి, శోకే శోకముపైతిచ, దీనే దీనత్వ మాయాతి సనాట్యే ప్రేక్షకః, అనుస్థితికిఁ గూర్చునట్టిదియునగు నను అర్థవిశేషముల కాధారమైయున్నదని కావ్యాలోకాత త్త్వ ప్రకాశికాకర్త.

కవి కావ్యవస్తువు నెన్నుకొనుటనుబట్టి వస్తువు ప్రఖ్యాతోత్పాద్య మిశ్ర భేదభిన్నరూపమగుచున్నది. పురాణేతిహాస ప్రసిద్ధమగు కథప్రసిద్ధము; కవి కల్పిత ముత్పాద్యము; కొంత ప్రసిద్ధము కొంత యుత్పాద్యమునైన కథ మిశ్రము. రసౌచిత్యపోషణకై కవి ప్రఖ్యాతమును కొంతమార్చి స్వీయకల్పనఁ గొంతచేర్చి, కావ్య నిర్మాణ మొనర్పవచ్చును. ఇందుఁ బ్రఖ్యాతము పుట్టు రత్నమువంటిదనియు, కల్పితము కృత్రిమరత్నము వంటిదనియు, మిశ్రము సానఁబట్టిన జాతిరత్నమువంటిదనియు రామరాజభూషణుని యభిప్రాయము.

> "కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కృతుల్
> వావిరిపుట్టు రత్నము లవారిత సత్కవి కల్పనా విభూ
> షావహ పూర్వవృత్తములు సానఁదీరిన జాతిరత్నముల్"
>
> —వసుచరిత్ర 1 అ. 19 పద్యము

ఏ కావ్యవస్తువు అయినను సామాన్యముగా నొక ఫలసిద్ధి పర్యంతము నొనర్పు ప్రయత్నమును వర్ణించెడి స్వరూపము గలిగియుండును. ఫలసిద్ధికొఱకు తీవ్ర ప్రయత్నము చేయువాఁడును, తత్ఫలభోక్తయు నగువాఁడు కావ్య నాయకుఁ డనఁబడును. "నయతి వ్యాప్నోతి ఇతివృత్తం ఫలం చేతి నాయకః, సమగ్ర గుణః, కథావ్యాపీనాయకః" అని హేమచంద్రుఁడు. "కథాం నయతి స్వకర్తృ వ్యాంగ భావమితి కథానాయకః" అని విద్యానాథుఁడు. "కథాంనయతి స్వకర్తృవ్యాంగ భావమితి కథానాయకః, యోనిర్వహణేఫలభాగీ" అని ధ్వన్యాలోకవ్యాఖ్య. ఈ నిర్వచనములను పరిశీలించినచో నాయకుఁడు కథావ్యాపియు, ఫలభాక్కు, సమగ్రగుణుఁడు అని తెలుచున్నదికదా! అట్టివాఁడు

ధర్మార్థకామాది పురుషార్థసిద్ధికై యొనర్చు ప్రయత్న విశేషవర్ణనమే కావ్య వస్తువనఁబడుచున్నది. అనఁగా కావ్యవస్తు గుణస్వరూపములు నాయక గుణ స్వరూపములపై నాధారపడియుండునని తాత్పర్యము.

భరతుఁడు నాట్యేతివృత్తవ్యాప్తిని నిరూపించుచు "త్రైలోక్యస్యాఽస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనమ్" 'లోకవృత్తానుకరణం నాట్యమ్' "నానా పురుష సంచారానాట్యం - ఉత్తమాధమ మధ్యానాం నరాణాంకర్మ సంశ్రయమ్" అనుటచే స్వర్గమర్త్య పాతాళలోక స్వభావవృత్తానుకరణము నాట్య మని వ్యక్తమగుచున్నది. లోకవిభాగము ననుసరించియు, జాతివిభాగముఁ బట్టియు నాయకులు దివ్యులు, అదివ్యులు, దివ్యాదివ్యులు అను భేదములచేఁ బరిగణింపబడుదురు. కాని 'నరాణాం కర్మసంశ్రయం, సర్వేభావాస్తు దేవా నాం కార్యామానుష సంశ్రయాః' అను భరతోక్తులఁబట్టి దివ్యులుగూడ మానవ స్వభావ చేష్టితానుగుణముగా కావ్యమున వర్ణింపఁబడుదురని, భావింపఁబడు చున్నది. తద్ద్వారమునఁ బ్రేక్షకులకును. పఠితలకును రసానుభూతి కలుగు నవ కాశ మేర్పడుచున్నది. హేమచంద్రాదులు నాయకుఁడు సమగ్రగుణుఁడు (Ideal personality) అనుటచే నాతఁడు సర్వోత్తముఁడై యాదర్శజీవి యని పించు కొనవలెను. అట్టి నాయకుని గుణవృత్తాది వర్ణనముచేతనే కావ్యము నకు గౌరవము గలుగును. రామాయణాది కావ్యములకందులకే యధిక గౌరము. దీనిని భట్టుమూర్తి యిట్లు తెల్పియున్నాఁడు.

> "రామాయణాదిక గ్రంథంబు లనవద్యనేతృవర్ణనల వన్నియకు నెక్కె
> వైశేషికాది నానాశాస్త్రములు శివప్రతిపాదనమున సన్నుతి వహించె
> సంధ్యాదిమంత్రముల్ శశ్వదీశ్వరనామ జపసాధనత ననశ్వరము లయ్యె
> బలుకు లొండొంటికిఁ బ్రామిన్కులును బరబ్రహ్మగోచరములై ప్రణుతిఁ గాంచె
> ననినఁ గావ్యం బమేయనాయకవికస్వర స్వరూపనిరూపణ భ్రాజియగుట
> వేఱ వివరింప నేల? బంగారమునకుఁ జటుల సౌరభ్యలహరి యబ్బుటయ కాదె!"
>
> —కావ్యాలంకార సం. పీ. ప. 24

ఉదారచరిత నిబంధనమే ప్రబంధ ప్రతిష్ఠయని రుద్రటుఁడు; లోకోత్తర గుణోత్తరుఁడగు నాయకుని వర్ణనమొనర్చు కవియొక్క వాగ్వృత్తి యల్ప మైనను విద్వత్కర్ణావతంసమగునని భోజుఁడు.

"శబ్దార్థయో రపి పుణ్యశ్లోకచరిత నిబంధనేన సహృదయ హృదయానందిత్వం అతోనాయకస్యైవ కావ్యే ప్రాధాన్యమ్"

అని విద్యానాథుఁడు. అనల్పశిల్ప విన్యాసముగలిగిన శిల్పఖండము లన్నిటి యందు నుత్తమాదర్శగుణసమన్వితులగు దేవనాయకాదుల ప్రతిమలెట్లు పూజా గౌరవాదు లందుకొనుచున్నవో అట్లే కావ్యములం దుత్తమ నాయకములు విపుల విఖ్యాతి నొందుచున్నవి.

ఉత్సాహ ముత్తమ ప్రకృతికమగుటచేతను, వీరము ధర్మప్రధానమగుట వలనను వీరరస ప్రధాన కావ్యములం దుత్తమనాయకుల స్వభావవృత్తములే వర్ణితము లగుననుటలో విప్రతిపత్తిలేదు.

## కావ్య నాయకుఁడు

కావ్యనాయక గుణములనుగూర్చి లాక్షణికు లీ క్రింది విధముగాఁ జేర్కొని యున్నారు.

"నాయకాః నాటకాశ్రయాః తత్రోత్తమాయాం
ప్రకృతౌ నానాలక్షణ లక్షితాః" —భరతుఁడు నాట్యశాస్త్రము

"త్యాగీ కృతీ కులీనః సుశ్రీకో రూపయౌవనోత్సాహీ
దక్షోఽనురక్త లోకస్తేజో వైదగ్ధ్య శీలవాన్ నేతా" —సా. ద.

"నేతా వినీతో మధురస్త్యాగీ దక్షః ప్రియంవదః
రక్తలోక శ్శుచి ర్వాగ్మీ రూఢవంశః స్థిరోయువా
బుద్ధ్యుత్సాహ స్మృతిప్రజ్ఞా కలామాన సమన్వితః
శూరో దృఢశ్చ తేజస్వీ శాస్త్రచక్షుశ్చ ధార్మికః" —దశరూప.

"శోభావిలాస మధుర లలిత మాధుర్య స్థైర్య గాం
భీర్య తేజాం స్యష్టౌ సత్వజా స్తద్గుణాః" —కావ్యానుశాసనము

"మహాకులీన తౌజ్జ్వల్యం మహాభాగ్య ముదారతా
తేజస్వితా విదగ్ధత్వం ధార్మికత్వాద యో గుణాః" —ప్రతాపరు.

ఉన్నత కులమున జన్మించుట మహాకులీనత; రూపసంపన్న దేహము గల్గి యుండుట ఔజ్జ్వల్యము; విశ్వంభరాధిపత్యము మహాభాగ్యము; దానశీల మౌదార్యము; జగత్ప్రకాశకత్వము తేజస్విత; కార్యచాతుర్యము వైదగ్ధ్యము; ధర్మైక కాయత్తచిత్తము కల్గుట ధార్మికత; వినయస్వభావము వినీతత్వము; ప్రియ దర్శనత్వము మాధుర్యము: సర్వస్వమిచ్చుట త్యాగము; క్షిప్రకారిత్వము దక్షత; సర్వజనానురాగము లోకానురక్తి; మనోనైర్మల్యము శుచిత్వము; వాఙ్మనః క్రియాదులం దచంచలత్వము బుద్ధిమత్త్వము; ఉత్కట కార్యనిర్వహణ

సామర్థ్య ముత్సాహము; నవనవోన్మేష శాలినియగు ప్రతిభ ప్రజ్ఞ; ఉపకారి యెడ నుపకారబుద్ధి కృతజ్ఞత; చతుష్షష్టి కళాభినివేశము కలావత్త్వము; పట్టుదల దృఢత్వము; ఇత్యాదులు నాయకుని ప్రధానలక్షణములు. "గుణాః పూజాస్థాన" మ్మనుభవభూతి వచనము గుణవంతులే లోకమునఁ బూజార్హులగుదు రని బోధించుచున్నది. ఇట్టి యభిప్రాయముతోడనే లాక్షణికులు కావ్య నాయ కుని సంపూర్ణ గుణుఁడని ప్రవచించి యుండిరి. కాని నాట్యదర్పణ, సరస్వతీ కంఠాభరణ, భావప్రకాశన కర్తలు కథావశమున నుత్తమ మధ్యమాధమ నాయకులను గూడ ననుసంధింప వచ్చునని పేర్కొని యుండిరని యిదివరలో సూచింపఁబడినది. 'కేవలగుణవా నుత్తమః' అని జినవర్ధనసూరి 'సర్వగుణ సంప ద్యోగాదుత్తమః' అని భోజరాజు. 'స్వల్పదోషో, బహుగుణో మధ్యమః' అని ప్రతాపరుద్రీయవాఖ్య. 'హీనోగుణైశ్చ బహుభిరధమః పరికీర్తితః' అని భావ ప్రకాశనము. 'కేవలదోషవానధమః' ప్ర. రు. వ్యాఖ్య. మధ్యమాధమనాయకుల యందలి యుత్సాహ ముదాత్తలక్ష్యభూతముకాదు కావున దానివలన వీర ముత్పన్నముకాదు. ఇఁక నుత్తమ నాయకాశ్రయమైన కావ్యమే వీరరసో చితమనఁబడును.

నాయక స్వరూపము నిరూపించుచు విద్యానాథుఁడు

"యశః ప్రతాపసుభగః పుమర్థత్రయ తత్పరః
ధురంధరో గుణాఢ్యశ్చ నాయకః పరికీర్తితః"

అని పేర్కొనెను. కీర్తి, ప్రతాపసుభగత్వము, అర్థావనత్వము, ధర్మార్థ కామ తత్పరత్వము, ధూభరణత్వము, కావ్యగీతప్రియత్వము, లాక్షణికులు నాయ కుని యందు నిబంధించి తత్స్వరూపమును నిర్వచించుటలో నుత్తమపురుష స్వరూపమును వ్యంగ్యముగాఁ బేర్కొనినట్లగుచున్నది.

పైఁబేర్కొనఁబడిన నాయక గుణస్వరూపలక్షణాదు లన్నియు వీరరస ప్రధానకావ్యములందు నాయకునియందు గాననగును. ప్రకరణభేదము ననుస రించి నాయకునియం దీగుణము లొక్కొక్కసారి యొక్కొక్కటిగాని, కొన్ని గాని, లేక అన్నియుగాని గోచరింపవచ్చును. గుణవర్ణనము కవి రచనా నైపుణ్యముపై నాధారపడి యుండును. గుణములు మానవునకు పూర్వజన్మ వాసనాబలముననుు, ప్రస్తుతజన్మలోని పరిసర ప్రభావములవలనను, శిక్షాదుల వలనను హృదయమునందేర్పడెడి స్థిరమైన భావములు. ఆ భావములు చేష్టా

రూపమున వ్యక్తములగు సమయమున బహిర్గోచరములగును. ఇట్టి ప్రకటిత భావమున కాలంబనమై నాయకుఁడు సామాజికులకు విభావమగుచున్నాఁడు.

చిత్తస్థైర్య ముత్సాహవంతునకు ప్రధానలక్షణము. మహాసంకటములందును చలింపని ధృతి చిత్తస్థైర్యమనఁబడును. నాయకగుణములందుఁ జెప్పబడిన స్థిరోత్సాహదృఢత్వము లనునవి చిత్తస్థైర్యమును వ్యక్తీకరింప సమర్థములు. ఉత్సాహవంతుని రెండవలక్షణము సత్వరకార్యాచరణోన్ముఖమైన మానసక్రియ. దీనిని దక్షత, బుద్ధిమత్త్వము, ప్రజ్ఞ, వైదగ్ధ్యము మొ. నవి ప్రకటింప సమర్థములు. ఉత్తమత్వము, ధర్మానురక్తి కల్గియుండుట మఱియొక ముఖ్యలక్షణము. పైఁ బేర్కొనబడిన గుణములన్నియు, వీనినిఁ బ్రదర్శింప సమర్థములు.

జీవితము నిరాటంకముగా నల్లేరుపై బండివలె శ్వాసనిశ్వాసలవలె సులభముగా జరిగినన్నాళ్లు మానవులం దుత్సాహప్రవృత్తి ప్రవృద్ధినందఁజాలదు. సుఖలాలసులై లబ్ధములైన సుఖభోగములతో సంతృప్తిచెంది, వానివర్తులమందే కూపస్థమండూకములవలె చరించు మందప్రవృత్తుల హృదయమ్ములం దుత్సాహము నెలవేర్పరచుకొనఁజాలదు. కాగా ఇచ్ఛావృత్తి బలీయమై కార్యసాధన సమర్థమగుశక్తి యున్నవానియందు మాత్రమే నిలుచును. లోకవృత్తమునఁ గార్యాచరణమొక్కటియే చాలదు; దానికిఁదగిన జ్ఞానము మానవుని హృదయమున వెల్లివిరియవలసి యున్నది. జ్ఞానప్రవృత్తిలేని యిచ్ఛావృత్తి నిష్ప్రయోజనమేగాక నపాయకరముగూడ. ఇచ్ఛావృత్తి నిరాటంకముగాఁ బ్రవర్తించు జీవితమునం దుత్సాహము సాంద్రముగా నుండలేదు. అనవరతము అవరోధములను గురుతరకష్టములను ఎదుర్కొను జీవితమునందు మాత్రమే యుత్సాహ ముత్కటరూపముఁ దాల్పఁగలదు. సమతలమునందు గంభీరమందవేగముతోఁ బ్రవహించు మహానది కడ్డముగా నొక పర్వతము నిలిచినప్పు డాతరంగిణి కల్లోలవతియై, మార్గాంతరముకొఱకై యొనర్చు ప్రయత్నవిశేషము, కొండను ఢీకొనుటయందలి సంరంభము కాంచినచో నా చల్లని రస హృదయములోఁ బ్రబుద్ధమయిన విద్యుద్వేగభావ ముద్బోధితమగును. అట్లే మానవునికి స్వీయకార్యాచరణమునం దేదైన వ్యసన మేర్పడినచో నాతని హృదయమున యోచనాశక్తి యధికమై జ్ఞానశక్తి పెంపొందును. తద్ద్వారమున సానఁబట్టిన రత్నమువలె, పుటమువేసిన బంగారమువలె, నిచ్ఛావృత్తి ప్రకాశవంతమై యధికతర యత్నోత్సాహములతో నభ్యుదయమార్గమునఁ దురంగ

లించును. కావున కావ్యవస్తువునందు వీరుఁడగు నాయకుని పురుషార్థ సాధన మందెంత బలీయమైన యాటంకములు కల్పింపఁబడినవో తన్నివారణకై యాతఁడెట్టి ప్రయత్నము లొనర్చియున్నాఁడో. వానియందాతఁడు ప్రదర్శించు నుత్తమ వీరగుణ సముదాయమెద్దియో మొదలైన విషయములఁ బరిశీలించుట వలన వీరరస కావ్యవస్తు గౌరవము నిరూపితమగునని తేలుచున్నది.

కావ్యమున వివిధ ప్రవృత్తులుగల పాత్ర లధికముగా నున్నప్పుడు వాని యందు నాయక నిరూపణమెట్లు చేయవలెనో భరతుఁడు నాట్యశాస్త్రమునఁ జేర్కొనెను. "వ్యసనియయిగాని, దుఃఖమును పొందిగాని, పిమ్మట ఎవఁడభ్యు దయము పొందినవాఁడగునో అతఁడే ప్రధాన నాయకుఁడని తెలియవలెను. అనేకులకు ఒకేవిధముగా వ్యసనాభ్యుదయములు రెండును కలిగినప్పుడు ఎవని వ్యసనాభ్యుదయములు పరిపుష్టములై యుండునో అతఁడే నాయకుఁడగును."[1]

భరతుఁడు స్త్రీపురుష ప్రవృత్తుల కుత్తమమధ్యమాధమ భేద మొనర్చి నాఁడు. అందు మధ్యమోత్తమ ప్రకృతులలోనివారును నానాలక్షణ లక్షితు లైన వారును నాయకులు కావచ్చునని తెల్పియుండెను. 'జితేంద్రియుఁడు, జ్ఞానవంతుఁడు, నానాశిల్పవిచక్షణుఁడు, దక్షిణుఁడు, మహాలక్ష్యయుతుఁడు భీత (దీన) జన పరిసాంత్వనపరుఁడు, నానాశాస్త్రార్థ సంపన్నుఁడు, గాంభీ ర్యౌదార్యశాలి, స్థైర్య త్యాగగుణోపేతుఁడు, అయిన పురుషుఁడు ఉత్తమ ప్రకృతి గలవాఁడు; లోకాచారచతురుఁడు శిల్పశాస్త్ర విశారదుఁడు, విజ్ఞాన మాధుర్యయుతుఁడు, అయిన పురుషుఁడు మధ్యమ ప్రకృతి గలవాఁడు.[2] వీరిరు వురిలో నానా లక్షణ లక్షితత్వమును సాధించినవారే నాయకత్వార్హత గల్గి యున్నారు. ఈ గ్రంథమున ద్వితీయాధ్యాయమునఁ జేర్కొనఁబడినట్లు కావ్య మున నుత్తమేతర నాయకునిఁ గైకొనినను అతనియందు పురుషార్థసాధన రూప ప్రవృత్తి క్రమముగా వర్ణితమైనచో తత్ప్రవృత్తి ఉత్తమత్వ నిమిత్తమగుచున్నది కావున తదుత్కటోత్సాహమును వీరముగాఁ బరిగణింపవచ్చుననుటకు భరతుని యీ వచనముగూడ ప్రబలహేతు వగుచున్నది. మధ్యములు గూడ నానాలక్షణ లక్షితత్వమునుసాధించి నాయకులగుటకు భరతుఁడు శాస్త్రావకాశముఁ గల్పించి యున్నాఁడు.

## చతుర్విధనాయకులు

ఇట్టి నాయకులు చతుర్విధులని భరత మహర్షి.

1, 2. శ్రీ పో. శ్రీ. అప్పారావుగారి యనువాదము.

"ధీరోద్ధతో ధీరలలితో ధీరోదాత్త స్తథైవచ
ధీరప్రశాంత శ్చైవేతి నాయకా నాటకాశ్రయాః" —24 అ. 3 శ్లో.

ఈ విభాగమునే తరువాతి లాక్షణికు లంగీకరించి యున్నారు.

ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలిత శబ్దముల నాల్గింటనుగల "ధీర" శబ్దప్రయోగౌచిత్యమును గూర్చి చర్చించుచు శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు కావ్యాలంకార సంగ్రహమున నిట్లు వ్రాసి యున్నారు: "ఈ నల్వురికి ధీరత్వము సాధారణగుణము. ఉదాత్తత్వాదు లసాధారణగుణములు. ధీరత్వమన ధైర్యము. ఇది వీరుని ధర్మము. కాబట్టి యుదాత్తాదులు నలువురును వీరులుగాగూడ నుండవలెను...కొందఱు ధీరుఁడన సామాన్యనాయక గుణములు (కులము, మహాభాగ్యము, మొ॥నవి) గలవాఁడని యర్థముచెప్పుదురు. ఆపక్షమున నాయక సామాన్యగుణము లుదాత్తత్వాదులు అందఱకును ముఖ్యముగా నుండవలెను. వానితోపాటు విశేషగుణములగు నుదాత్తత్వాదులుండవలయు ననియు నందురు. కాని దీనికన్నఁ బై యర్థమే లెస్స".

చతుర్విధనాయక వృత్తములందెల్లెడలను ధీరత్వము ప్రపంచితమగుట వలన వానియందు వీర మనుస్యూతముగా నుండితీరునని ధ్రువపడుచున్నది. నాయకుఁడు పురుషార్థసాధనాత్మక ప్రవృత్తి గలవాఁడగుటచే నుదాత్తత్వాది విశేషగుణములకును పురుషార్థ సాధనమునకును అవినాభావసంబంధముండి యుండవలెను. దీనికిఁదోడు ధీరోదాత్తాదివిభాగము రసదృష్టితోగూడ నొనర్చిన ట్లభినవగుప్తుని "ధర్మయుద్ధ, వీరప్రధానః ధీరోదాత్తః, వీరరౌద్రప్రధానః ధీరోద్ధతః, వీరశృంగార ప్రధానః ధీరలలితః, దానధర్మ వీరప్రధానః ధీర శాన్తః" అనెడి నిర్వచనములవలనఁ దెలియుచున్నది. వీని తాత్పర్యము గ్రహించినచో ధీరోదాత్తాదినాయకులు వీరాదిరసప్రధానులనియు నారసములు పురుషార్థఫలప్రధానము లనియు విశదమగుచున్నది. అభినవగుప్తపాదులు "తత్ర చతుర్వర్గమధ్యే సర్వప్రాణి సులభస్య కామస్య సర్వహృదయంగమత్వాత్ ప్రథమం శృంగారః, తత స్తన్నిమిత్తభూతోర్థప్రధానో రౌద్రః, తతోఽర్థ కామయోర్ధర్మ మూలత్వాత్ ధర్మప్రధానోవీరః త్రివర్గ ఫలక రసానంతరం మోక్షఫల శ్శాంత రస ఇత్యేవ ముద్దేశక్రమోపపత్తిః" అని నాయక, రస పురుషార్థముల చక్కని సమన్వయము సాధించినారు. విశ్వనాథాదు లీతని నంగీకరించి యిట్టి సిద్ధాంతములనే ప్రవచించియున్నారు.

కావ్యప్రయోజన దృష్టితో కావ్య కళాతత్త్వ ప్రకాశికాకర్త చతుర్విధ నాయక విభాగము నీ క్రింది విధముగా సమన్వయించెను : "పురుషార్థతత్పరత్వమే స్వరూపముగా గల్గిన నాయకుని చతుర్విధ విభాగము పురుషార్థోపదేశము కొఱకు పురుషార్థ దృష్టితోనే చేయఁబడియుండునని నేనూహించుచున్నాను. పురుషార్థములు నాల్గు: ధర్మార్థకామమోక్షము లని; నాయకులు నలుగురు: దీరోదాత్తాదులని. ఈ నాయకులు నల్గురిని నాల్గు పురుషార్థములతో సంబంధింపఁ జేసినయెడల - ధీరోదాత్తుఁడు ధర్మపురుషార్థ సాధకుఁడనియు, ధీరోద్ధతుఁడు అర్థపురుషార్థ సాధకుఁడనియు; ధీరలలితుఁడు కామపురుషార్థ సాధకుఁడనియు, ధీరశాంతుఁడు మోక్ష పురుషార్థ సాధకుఁడనియు పైఁ జూపులకే మిక్కిలి సమంజసముగా గోచరించుచున్నది. భరతుఁడీ నాల్గింటికంటె నెక్కువ నాయకులుండకూడదని శాసించుట కిదియే హేతువయి యుండునని నాభావము" అని ప్రతిపాదించుచు కావ్యమునకు పురుషార్థములకును, కావ్యస్త్రీ పురుషులకును పురుషార్థములకును, రసములకును పురుషార్థములకును, సామాజికులకు, కావ్యప్రయోజనములగు పురుషార్థములకునుగల సంబంధమును భరతుని నాదర్శముగాఁ గొని తమ గ్రంథమున నిరూపించినారు వారు. 'నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే' అను వాక్యమునందు సమస్త కావ్య అంగములకు రసబంధము గలదనియు నట్టి కావ్యద్వారమున నాయకుఁడు పురుషార్థ-రసమయుఁడగుననియు స్పష్టపడు చున్నది.

ధనంజయాదులు నాయక స్వరూపమేగాక చతుర్వి ధనాయక లక్షణ నిరూణ మొనర్చి మఱియొక అడుగు ముందుకు వేసిరి.

## 1. ధీరోదాత్తుఁడు :

"మహాసత్త్వోఽతిగంభీరః క్షమావా నవికత్థనః
స్థిరో నిగూఢాహంకారః ధీరోదాత్తో దృఢవ్రతః" —దశరూపకము

మహాసత్త్వుఁడు, గంభీరుఁడు, సహనము గలవాఁడు, ఆత్మశ్లాఘ లేనివాఁడు, స్థిరుఁడు, గూఢాహంకారుఁడు, దృఢవ్రతుఁడు నగువాఁడు ధీరోదాత్తుఁడు.

## 2. ధీరోద్ధతుఁడు :

"దర్ప మాత్సర్య భూయిష్ఠో మాయాచ్ఛద్మ పరాయణః
ధీరోద్ధత స్త్వహంకారీ చలశ్చండో వికత్థనః" —దశరూపకము

దర్పమాత్సర్య భూయిష్ఠుఁడు, మాయావి, మోసగాఁడు, అహంకారి, చప

లుఁడు, ప్రచండుఁడు, ఆత్మశ్లాఘా నిరతుఁడు, శూరుఁడు, మత్సరి, అవలిప్తుఁడు, సులభకోపి యగువాఁడు ధీరోద్ధతుఁడు.

3. ధీరలలితుఁడు :

"నిశ్చింతో ధీరలలితః కలాసక్తః సుఖీ మృదుః" —దశరూ.

నిశ్చింతుఁడు, కళాసక్తుఁడు, సుఖి, మృదుస్వభావుఁడు, శృంగారి యగువాఁడు ధీరలలితుఁడు.

4. ధీరశాంతుఁడు :

"సామాన్యగుణయుక్తస్తు ధీరశాంతో ద్విజాదికః" —దశరూ

సామాన్య గుణసంయుతుఁడు, వినయోపశమ ప్రధానుఁడు, ధీరుఁడు, ప్రసన్నాత్ముఁడు, ద్విజాదులలో నొకఁడు నయినవాఁడు ధీరశాంతుఁడు.

ధీరోదాత్తాదుల లక్షణములు క్రమముగా ధర్మార్థ కామ మోక్షసాధకుల కన్వయపడునట్లు నిర్ణయింపఁబడినవి. అభినవగుప్తుఁడనినట్లు ఈ నాయకులందఱు వీరరసానుప్రాణితులగుటచే నుత్సాహవంతులగు సాధకు లగుచున్నారు.

అవస్థాభేదమును బట్టి బాల్య యౌవన కౌమార భేదము లెట్లేర్పడుచున్నవో అట్లే నాయకునియందు ధీరోదాత్తత్వాదిభేదము లేర్పడుచున్నవిగాని సంపూర్ణ లక్షణ సమన్వితుఁడగు నాయకుఁడొకఁడే యగుచున్నాఁడని కొందఱందురు. అట్లనుటచే నొక నాయకునియందే వివిధావస్థలయందు ధీరోదాత్తాది నాయక లక్షణములు గోచరింపవచ్చును. లేక కవి ఒక్కొక్క యవస్థాభేదమును విపులముగా రచింపఁదలచినప్పుడు ధీరోదాత్తాది నాయకుల నొక్కొక్కరిని విలక్షణముగా వర్ణింపవచ్చును. కాని కావ్యాంగి నాయకులయందు అవస్థాభేదము నొకే కావ్యమునఁ జూపరాదనియు, అంగనాయకులందు మాత్రము చూపవచ్చుననియు లాక్షణికనియమము గలదు.

"ధర్మయుద్ధ వీరప్రధానో ధీరోదాత్తః" అను అభినవగుప్తుని మతమున వీరరస ప్రధానకావ్యమునం దంగినాయకుఁడుగా ధీరోదాత్తుఁడే యుండుననియు, నతని వృత్త మందు వర్ణితమగుననియు విశదమగుచున్నది. కాఁగా రౌద్రరస ప్రధానుఁడగు ధీరోద్ధతుఁడు, శృంగార రసప్రధానుఁడగు ధీరలలితుఁడు, శాంతరస ప్రధానుఁడగు ధీరశాంతుఁడు నాయకులుగ నిబద్ధమైన అయా కావ్యములందు వీర మంగముగా నుండి నాయకవృత్తముఁ బ్రకాశమొనర్చుననియు, భావింపవచ్చును; లేక వీరరస మంగిగాఁగల కావ్యమున

నంగనాయకులలోఁ బైఁ జెప్పిన అవస్థాభేదములు కల్పింపవచ్చును. రౌద్రాది రసకావ్యములందు అంగనాయకాదులయం దవస్థాభేదము వర్ణించునప్పుడు ధీరోదాత్తులుగాఁ జిత్రింపవచ్చును. ఈ రెండువిధముల నాశ్రయించి వీరరసము సర్వకావ్యములందు నంగాంగి రూపములలో నేదోయొకవిధమునఁ దప్పక యుండు నవకాశమున్నదని తెలుచున్నది. అట్లగుటచేఁ గావ్యవస్తువునకు ఫలమగు కార్యసిద్ధి నాయక కార్యసాధనోత్సాహ వృత్తఫలమే కావున ఉత్సాహ ప్రవృత్తిలేని కథ యుండదనియు స్పష్టపడుచున్నది. దీనినిఁబట్టి తేలిన తాత్పర్య మిది: జీవితమునకు వీరము వెన్నెముక. అదిలేని బ్రతుకు నిరాలంబనము, శుష్కము. అట్లే వీర రసము కావ్యజీవిత మూలహేతువు. వీరములేనిది కావ్య శరీరమునకు జన్మాభ్యుదయములు లేవు. సర్వకార్య ప్రవృత్తికి మూల భూతమగు వీరములేనిది విశ్వప్రవృత్తి నాస్తి.

## నాయక సహాయులు

"క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే" అని లోకోక్తి. మహాపురుషుల కార్యసిద్ధి వారి మహిమలయందే యుండునుగాని సాధన సామగ్రి యందుండదు అని తాత్పర్యము. భోజుఁడీ పద్యపాదము సమస్యగా నీయగా నొక పండితుఁడిట్లు పూరించెనట!

"విజేతవ్యాలంకా చరణతరణీయో జలనిధి
ర్విపక్షః పౌలస్త్యో రణభువి సహాయాశ్చకపయః
పదాతిర్మర్త్యోఽసౌ సకలమవధీద్రాక్షసకులం
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే"

ఇందు నాయకుఁడగు శ్రీరాముని మహిమ అమోఘమే. అతని సాధన సామగ్రి యల్పమే కావచ్చును. మహామహుఁడైన రామునికి సైతము కాలానుగుణముగాఁ గపి పుంగవుల సహాయమర్థింపవలసిన యగత్య మేర్పడినదనిన — అట్టిది కాలదుర్విపాక మేయైనను పురుషార్థసాధకుఁడు ధర్మసాధనయందు స్వీయ శక్తిపై నెంత యాధారపడియున్నను ఇతరులసహాయ మత్యవసరము గావచ్చునని ధ్రువపడుచున్నది. రాముఁడు వీరుఁడు. ధీరోదాత్తుఁడు. ఇతనికి సహాయ మొనర్చిన వీరులు సుగ్రీవాదులు. అట్లగుటచే రామాయణమున రామ చరితముతోఁబాటు సుగ్రీవాదుల చరితములుగూడ కొంత వర్ణితములయి యున్నవి. అందు ప్రధానఫలసాధకుఁడు, ప్రధానఫల భాక్కుఅయిన నాయకుని చరిత మాధికారిక వృత్తము. ఉపనాయకులనఁ దగిన సుగ్రీవాదుల చరితము ప్రాసం

గిక వృత్తము. వృత్తమను పదము శ్రవ్యకావ్యములకును - ఇతివృత్తమను పదము దృశ్యకావ్యములకు సంబంధించినదని వెనుక తెలుపఁబడినది. అయినను నేఁటి విమర్శకులు రెంటిని సమానార్థకములుగ వాడుచున్నారు.

> "ఇతివృత్తం ద్విధాచైవ బుధస్తు పరికల్పయేత్
> ఆధికారికమేకంతు ప్రాసంగిక మథా పరమ్
> యత్ కార్యంహి ఫలప్రాప్త్యాం సమర్థం పరికల్ప్యతే
> తదాధికారికం జ్ఞేయ మన్యత్ ప్రాసంగికం విదుః"

అని భరతుని లక్షణము. ప్రాసంగిక వృత్తము దశరూపకమున "ప్రాసంగికం పదార్థస్య స్వార్థోయస్య ప్రసంగతః" "యస్యేతివృత్తస్య పరప్రయోజనస్య సత స్తత్ప్రసంగాత్స్వప్రయోజనసిద్ధి స్తత్ప్రాసంగిక మితివృత్తం ప్రసంగ నిర్వృత్తేః" అని నిర్వచింపఁబడినది. ప్రసంగవశమునఁ బ్రధానేతి వృత్తము నందుఁ బ్రవేశించి స్వప్రయోజనముఁ గాంచిన యితివృత్తము ప్రాసంగికము. ఇది పతాకా, ప్రకరీభేదములచే ద్వివిధము. "దూరం యదనువర్తతే ప్రాసంగికం సాపతాకా; సుగ్రీవాది వృత్తాన్తవత్ పతాకే - వాఽసాధారణ నాయక చిహ్నవత్తదుపకారిత్వాత్ యదల్పం సాప్రకరీ శ్రావణాది వృత్తాన్తవత్" అని దశరూపకము. రామాయణమునందు సుగ్రీవ వృత్తాంతమువలె నితివృత్త ములోఁ జాలదూరము దానికి సంబంధించి వర్ణింపఁబడునది పతాక. శ్రావణాది వృత్తాంతమువలె నల్పముగానుండునది ప్రకరి.[1] పతాకా ప్రకరీనాయకులు అంగి నాయకునికి సహాయభూతులయి పురుషార్థసాధనయందు యథోచితముగాఁ దోడ్పడుటచే వీరి యుత్సాహముగూడ అంగిగాఁ బోషింపఁబడు వీరరసమున కంగమై తత్పోషకమగుచున్నది. ఇది కవి కల్పనాశక్తిపైనను, సంవిధాన చాతుర్యముపైనను ఆధారపడి యుండును.

కావ్యకళాతత్త్వ ప్రకాశికాకర్త ప్రాసంగికేతివృత్తమును అనువృత్తము, ఉపవృత్తము, ప్రతివృత్తము - అని త్రిధాకరించెను. భామహాదుల 'వంశవీర్య శ్రుతాదీని, వర్ణయిత్వారిపోరపి, తజ్జయాన్నాయ కోత్కర్ష వర్ణనంచధినోతినః'

1. "ఈ ప్రాసంగికమందును ఫలప్రాప్తి లేకపోలేదు. అది 'ప్రాసంగికి' యనఁబడును. అది ప్రధాన ఫలప్రాప్తికి నుపకారము. ఆధికారేతివృత్తకల్పనమునం దుపయోగించు కవిశక్తిచేతనే ప్రాసంగికము గూడ కల్పింపఁబడును. లేదా ప్రత్యేకశక్తి నిష్పన్నమగును' అని ప్రత్యేకశక్తి యోగజము. తదయోగజము అని కొందఱు ప్రాసంగికమున ద్వైవిధ్యముఁ గల్పించిరి. కాని ఉపాధ్యాయు లంగీకరింపలేదు. [అభినవభారతి 3 వ సం. పుట 3, 8 ; నాట్యశాస్త్రము - శ్రీ పో. శ్రీ. అ. పుట 562 - అధస్సూచిక]

అను వాక్యముచే నాయకుని కథతోనే సంబంధపడి, తద్విపక్షాశ్రయుఁడయి స్వవిజయముచేఁ దదుత్కర్షాధాయకుఁడగు ప్రతి నాయకుడుగూడ కొన్ని కావ్యములలో - రామాయణాదులలోవలె - కానవచ్చుచున్నాఁడు కావున, ఆ దృష్టితో అట్టి నాయకుని యితివృత్తము ప్రతినాయకుని కథావిశేష రూపమగు "ప్రతివృత్తము"చే సంబద్ధమై యేకాకారముగ భాసించునట్లు చెప్పవచ్చును. ప్రతినాయక వ్యవహారముగూడ నాయకోత్కర్షాధానపూర్వకోపకార నిర్వాహకమే గనుక దానినిఁగూడ ప్రాసంగిక వస్తుభేదముగాఁ జెప్పవచ్చును అట్లే వక్ష్యమాణరీతిగా నుపనాయకులగు సుగ్రీవాదుల వృత్తాంతము కూడా నాయకోపకార సంభృతములై-అవి ప్రతివృత్తములు కాఁజాలవు కనుక - 'ఉపవృత్తము' లనఁదగియున్నవి ! ప్రధాన నాయకుఁ డొక్కఁడు గాక అతని ననుగమించి కావ్యమున నను నాయకస్థానముఁ బొందిన పాత్రల (లక్ష్మణ, భరత, భీమాదులవలె) వృత్తాంత మనువృత్తమనియుఁ జెప్పఁదగును, అప్పుడు ప్రాసంగికవస్తువు అనువృత్తము, ఉపవృత్తము, ప్రతివృత్తము అని త్రివిధముగా నుండవచ్చునని యేర్పడుచున్నది. ఇతరపాత్రల కథావిశేషములు "పరిజన కథానుబంధః" అన్నట్లు అనుబంధ కథారూపములే యగును గాని అవి యాధికారిక - ప్రాసంగిక వస్తుభేదములుగాఁ జెప్పఁబడఁదగినవి కానేరవు.

## పంచసంధులు

"ఇతివృత్తం తు నాట్యస్య శరీరం పరికల్పితమ్
పంచభిః సంధిభిస్తస్య విభాగః పరికల్పితః"

అని భరతుఁ డితివృత్తము పంచసంధులచే విభజింపఁ బడునని రూపక పరముగా మాత్రమే వివరించెను : 'భరతుని తరువాతి యాలంకారికులగు భామహాదులు (క్రీ.శ. 600-750) కావ్యముగూడ పంచసంధియుతము కావలెనని చెప్పియు వాటిని వివరింపలేదు. పంచసంధులను కావ్యపరముగా నన్వయింపఁ బూనుకొనిన వారిలో ఆనందవర్ధనుఁడు ముఖ్యుఁడు. కాని తరువాతివారు అభినవగుప్తునితో మరల పంచసంధులను రూపకపరముగనే వివరింపసాగిరి. 14 వ శతాబ్ది ప్రాంతమువారగు విశ్వనాథాదులు మఱల పై ప్రసంగమును తెచ్చి మహాకావ్యమందును నాటకసంధులను, తదంగములను యథోచితముగాఁ గూర్పవలెనని నిర్దేశించి యున్నారు.'[1]

1. నాట్యశాస్త్రము - శ్రీ పో. శ్రీ. అ. రా. అనువాదము. 9 అధ్యా. వి. అం. పుట 586.

భరతాదు లితివృత్తమును పంచసంధులచే విభజించుటయందలి తాత్పర్యము నరయవలసి యున్నది. లోక వృత్తానుకరణ రూపమైన నాట్యేతివృత్తపు విభాగము లోకవృత్తము ననుసరించియే యొనర్పఁబడి యుండుననుటలో సందేహము లేదు. ఇతివృత్తమొక ప్రధానకార్యముయొక్క ఆరంభనిర్వహణ పర్యంతవ్యాప్తమని వెనుకనే చెప్పఁబడినది. అట్లయినప్పుడు సాధారణముగా నొక ఫలసాధన రూపకార్యమెట్టి పరిణామగతులను పొందునో పరిశీలింపవలె నన్న ఈ క్రింది విషయములయొక్క జ్ఞానమవసరమై యుండును.

1. కార్యమెట్టిది ? దాని సాధకుఁడెవ్వఁడు ?

2. ఫలసాధనమునకై అతఁడు కావించు ప్రయత్నములెట్టివి ?

3. కార్యము నిరాటంకముగా సాధింపఁబడుచున్నదా ?

4. ఆటంకములు కలిగినవుడు సాధకుఁడు తన్నివారణము కొఱకు యత్నించు విధమెట్టిది ?

5. కార్యమారంభించినదాది వివిధావస్థలయందు నాయకుని మనోభావముల స్థితిగతుల పరిణామమెట్లున్నది ?

6. సాధనలో నేర్పడు వివిధ సన్నివేశములలో గలుగు వివిధ మనోభావములను కార్యోన్ముఖములుగా నొనర్చి ఫలప్రాప్తికిఁ దోడ్పడు, ఉపాయములు లేక హేతువులేవి ?

7. కార్యమెట్లు నిర్వహింపఁబడినది ?

ఈ అంశములను జాగ్రత్తగాఁ బరిశీలించినచోఁ దాత్పర్యాంశములుగాఁ గాననగునవి మూఁడు: 1. ప్రధానఫలముపై దృష్టిని కేంద్రీకరించిన సాధకుని చిత్తవృత్తుల క్రమదశ. 2. ఫలసిద్ధికి హేతువులు. 3. పురుషార్థసాధకుని వృత్తమున వర్ణితమైన కథావిభాగము. మొదటిది సాధకాశ్రయమై సాధనరూపమై కథాగమన పోషకమైనది. రెండవది ఉపాయపరమై కథాగమనమునకు హేతుభూతమైనది. మూఁడవది కవి కల్పనాపరమై కథారూపమైనది. ఈ మూఁడింటికిని లాక్షణికులు క్రమముగాఁ గార్యావస్థలు, అర్థప్రకృతులు, సంధులు అని నామములిడియున్నారు.

**కార్యావస్థలు :**

"సంసాధ్యే ఫలయోగేతు వ్యాపారః సాధకస్యయః
తస్యాను పూర్వ్యా విజ్ఞేయాః పంచావస్థాః ప్రయోక్తృభిః.

[నాట్యప్రకరణా భావా అవస్థాస్తా మతా ఇహ]
ధరార్థకామ సంబంధః ఫలయోగస్తు కథ్యతే
ప్రారంభశ్చ ప్రయత్నశ్చ తథా ప్రాప్తేశ్చ సంభవః
నియతాచ ఫలప్రాప్తిః ఫలయోగ స్తు కథ్యతే.

అని భరతర్షి. కావ్యమునందు కథానుసారము నాయకునిచే సాధింపఁబడు ప్రధానఫలమును గూర్చిన వ్యాపారమైదవస్థలుగా విభక్తమగుననియు, ఈ పంచావస్థలు నాటకములందును ప్రకరణములందును ధర్మార్థ కామ సంబద్ధములై యుండుననియు; అయిదవస్థలు క్రమముగా [1]ప్రారంభము [2]ప్రయత్నము, [3]ప్రాప్తి సంభవము. [4]నియతఫలప్రాప్తి, [5]ఫలయోగము అని పిలువఁబడుననియు తాత్పర్యము.

భరతుఁడు పేర్కొనిన ప్రారంభాదుల పేర్లు దశరూపకాదులయందు భిన్నములుగా గోచరించుచున్నవి కాని లక్షణమందు భేదములేదు.

"అవస్థాః పంచ కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థిభిః
ఆరంభయత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమాః"
(దశ. రూ. ప్రక. ౧-శ్లో. ౧౯)

ప్రారబ్ధసర్వకార్యము లందును ఫలప్రాప్తిపర్యంతము ప్రారంభాది పంచావస్థలు క్రమముగా గోచరించును. భిన్నభిన్న స్వభావములు కలిగిన ఈ పంచావస్థలు పరస్పర సంగతితో నేకోన్ముఖమై ఫలప్రాప్తికి హేతువులగును.

**అర్థప్రకృతులు :**

"బీజ బిందు పతాకాఖ్య ప్రకరీ కార్యలక్షణాః
అర్థప్రకృతయః పంచతా ఏతాః పరికీర్తితాః" దశ.రూ.

"అర్థప్రకృతయః ప్రయోజన సిద్ధిహేతవః"

ప్రయోజనసిద్ధి హేతువులగు అర్థప్రకృతులు బీజ, బిందు, పతాక, ప్రకరీ, కార్య భేదములచే నైదువిధములు. శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు అర్థప్రకృతులు ఇతివృత్తభాగములుకాదని యిట్లు విశదపరచియున్నారు. "అవస్థలనునవి ఫలసాధనమునందు నాయకుఁడు కావించు ప్రయత్నమునకును, వాని మనోగత భావములకును సంబంధించిన క్రమదశలు. వేర్వేరు స్వభావములు గల యీ దశలు పరస్పర సంబద్ధములై యుండుటకుఁ గారణములు లేదా హేతువులగు వానిని "అర్థప్రకృతులు" అందురు. అర్థమనఁగా ఫలము. ప్రకృతి

---

1. ఆరంభము, 2. యత్నము, 3. ప్రాప్త్యాశ, 4. నియతాప్తి, 5. ఫలాగమము, అని ధనంజయుని విభాగము.

యనఁగా హేతువు. కావున అర్థప్రకృతు లనునవి ఫలహేతువులని సారాంశము. ఇవి ఆశా అవస్థలకు హేతువులని చెప్పుట సమంజసమే కాఁగలదు. అంతియే కాని ఇతివృత్తమునకు సంబంధించిన భాగములని మాత్రము తలఁపరాదు. ఇవి కూడ ఇతివృత్త భాగములేయని శారదాతనయాదుల అభిప్రాయము. అది సరికాదు."[1]

సంధులు :

"అర్థప్రకృతయః పంచ పంచావస్థా సమన్వితాః
యథాసంఖ్యేనజాయంతే ముఖాద్యాః పంచసంధయః
అంతరైకార్థ సంబద్ధః సంధి రేకాన్వయేసతి
ముఖ ప్రతిముఖే గర్భః సావమర్శోపసంహృతః" —దశరూపకము.

బీజాదులగు అర్థప్రకృతులైదును ఆరంభాదులగు పంచావస్థలతోఁ గలియుటయు-మఱియు నొక ప్రయోజనముఁగూడిన కథాంశములకు నడుమ వేఱొక ప్రయోజనముతోడి సంబంధము నొందుటయు సంధియనఁబడును. పంచసంధులు- ముఖసంధి, ప్రతిముఖసంధి, గర్భసంధి, అవమర్శసంధి లేక విమర్శసంధి, ఉపసంహృతి సంధి లేక నిర్వహణసంధి అనునవి.

భరతమహర్షి సంధిని నిర్వచింపలేదు. ధనంజయుఁడు సంధిని రెండు విధములుగా సామాన్య విశేషలక్షణములచే నిరూపించెను. మొదటిది అర్థప్రకృతులు పంచావస్థలతోఁ గ్రమముగా కలియుటయే సంధియని. కాని దీనికి కొన్ని పూర్వపక్షములువచ్చు నవకాశమున్నది. అవి :

1. ప్రతికథలో నర్థప్రకృతులలోని పతాకప్రకరులు తప్పక యుండుట గాంచము. అట్టిసమయమున వానిపని బిందువే నెరవేర్చుచుండును. కావున నర్థప్రకృతు లైదును అవస్థాపంచకమును కలియుననుట కుదురదు.

2. "కలియుచున్నవి" యనుటచే నర్థప్రకృతులును అవస్థలును కలియుచోట సంధి యేర్పడుచున్నది. ఇది సరికాదు. సంధియుండా రెండు (కలియుచున్నవి యనుటకాక) కనఁబడుచున్నవి యనుట ఉచితము.

ఇఁక సామాన్య లక్షణముఁబట్టి ప్రధానఫల ప్రయోజనమునకు సంబంధించిన కథాంశములు అవాంతర ప్రయోజనములను సాధించునపు డేర్పడెడి వాని సంబంధము సంధియనఁబడును.[2]

---

1. నాట్యశాస్త్రము : పుట 592. విశేషాంశములు.
2. "ఏకేన ప్రయోజనే నాన్వితానాం కథాంశానా మవాంతరైక ప్రయోజన సంబంధః సంధిః" —ధనికవ్యాఖ్య - ధనంజయ దశరూపకము.

సంధి స్వరూపమును గూర్చి చర్చించుచు శ్రీ. పో. శ్రీరామ అప్పా రావుగారు తమ నాట్యశాస్త్రమున నిట్లు వివరించినారు. "ప్రారంభము మొదలు ఫలయోగము వఱకును వ్యాపించియుండెడి ఏ సమగ్ర కథలోనైనను ఐదు భాగములు వచ్చును. 1. అభిలాష జనించి మనస్సున నెలకొనెడి కథా భాగము మొదటిది. 2. అభిలాషను వ్యక్తముచేసి దానిని సిద్ధింపఁ జేయుటకు ప్రయత్నము మొదలుపెట్టెడి కథా భాగము రెండవది. 3. ప్రయత్నము ఫలించు విషయమున ఆశ నిరాశలు రెండును కలిగెడి కథాభాగము మూఁడ వది. 4. ప్రయత్నము ఫలించుననెడి నిశ్చయము కలిగెడి కథాభాగము నాల్గ వది 5. ఫలము సిద్ధించెడి కథాభాగము ఐదవది. ఈ ఐదు భాగముల నాలం కారికముగా పంచసంధులు అందురు. కావున నాటకరచనా ప్రారంభమునకు ముందు కవి కథను విభజించుకొనఁగా నేర్పడిన భాగములే అనఁగా కథా ఖండములే 'సంధులు' అనఁబడునని సారాంశము.[1] పంచ సంధులు ప్రధానేతి వృత్తమునందుండెడివి. ప్రాసంగేతి వృత్తములందును ప్రధాన సంధుల నాశ్ర యించి సంధులుండవచ్చును. అవి "అనుసంధు"లని పిలువఁబడును.

1. ముఖసంది :

"ముఖం బీజ సముత్పత్తి ర్నానార్థ రససంభవా
అంగానిద్వాదశై తస్య బీజారంభ సమన్వయాత్" దశ.రూ

నానార్థములకును, రసములకును. హేతువగు బీజము కావ్యేతి వృత్తమునం దెచ్చట నాటఁబడునో నా కథాభాగము "ముఖసంధి".

2. ప్రతిముఖసంధి :

"లక్ష్యా లక్ష్య తమోద్భేద స్తస్య ప్రతిముఖం భవేత్
బిందు ప్రయత్నానుగమా దంగా న్యస్య త్రయోదశ" దశరూ.

ముఖసంధియందలి బీజ మవాంతర కారణములచే మరుగుపడినచో దృశ్యా దృశ్యమగు తద్బీజమును ప్రకాశింపఁజేయు లేక ఉద్ఘాటనముచేయు కథా భాగము ప్రతిముఖసంధి.

3. గర్భసంధి :

"గర్భస్తు దృష్టనష్టస్య బీజస్యాన్వేషణం ముహుః" దశరూ.

ప్రతిముఖసంధితోఁగించిత్ప్రకాశమైన బీజము ఉత్కటరూపముగా గోచరించు

1. నాట్యశాస్త్రము అధ్యా 19. విశేషాంశములు. పుట 595.

టయు, మఱల మరుగుపడి నష్టమగుటయు, నష్టమయిన బీజముకొఱకై మఱల అన్వేషించుటయు మొదలగు అంశలను కల్గిన కథాభాగము గర్భసంధి.

4. **అవమర్శ లేక విమర్శసంధి :**

"క్రోధేనావమృశేద్యత్ర వ్యసనాద్వావిలోభనాత్
గర్భనిర్భిన్న బీజార్థః సోఽవమర్శోంగ సంగ్రహః" దశరూ.

క్రోధ, వ్యసన, విలోభాదులు కారణముగా గర్భనిర్భిన్నమై ఫలోన్ముఖముగా నున్న బీజార్థముఁగూర్చి గావింపఁబడు పర్యాలోచనముఁ గూర్చిన కథాభాగము అవమర్శసంధి.

5. **ఉపసంహృతి లేక నిర్వహణసంధి :**

"బీజవన్తో ముఖాద్యర్థా విప్రకీర్ణాయథాయథమ్.
ఏకార్థ్య ముపనీయన్తే యత్ర నిర్వహణం హి తత్" దశరూ.

విప్రకీర్ణములై పడియున్న ముఖసంధ్యాదులలోని బీజార్థముల కేకార్థత్వ మొంది ఫలనిష్పత్తికి సంబంధించియుండునో ఆ కథాభాగము నిర్వహణసంధి.

సంధులు కావ్య పరివ్యాప్త సమగ్రేతివృత్తమునఁగల వివిధ కథాభాగముల కేకత కల్పించి, ఫలప్రాప్తివఱకు క్రమ పరిణతమగు నాయకచరితమును తెల్పును. కాగా ముఖాది సంధులయందలి కథాభాగము లకైక్యముఁ గూర్చుటకై ముఖ్య ప్రయోజనోచితముగాఁ గొన్ని సంధ్యంగములను భరతాదులు నిశ్చయించిరి. వీని ప్రయోజనములఁగూర్చి పేర్కొనుచు భరతుఁడు :

"ఇష్టస్యార్థస్య రచనా వృత్తాంత స్యానుపక్షయః
రాగప్రాప్తిః ప్రయోగస్య గుహ్యానాం చైవ గూహనమ్
ఆశ్చర్యవదభిఖ్యాతం ప్రకాశ్యానాం ప్రకాశనమ్."

అని పేర్కొనెను. అంగహీనుఁడైన మానవుఁడు కార్యసాధన సమర్థుఁడెట్లు కాలేడో అట్లే సంధ్యంగరహితమగు నాటకము ప్రయోగయోగ్యత నందదని సంధ్యంగ ప్రాధాన్యమును భరతుఁడుగ్గడించినాఁడు. ముఖ సంధ్యంగములు పండ్రెండు, ప్రతిముఖ సంధ్యంగములు పదమూఁడు, గర్భ సంధ్యంగములు పదమూఁడు, విమర్శ సంధ్యంగములు పదమూఁడు. నిర్వహణ సంధ్యంగములు పదునాలుగు. మొత్తమరువదినాలుగు సంధ్యంగములు భరతాదులచేఁ ప్రతిపాదింపఁ బడినవి.

పాశ్చాత్యులు గూడ పంచసంధులకు పోలునట్లుగా నితివృత్తమును అయిదుభాగము లొనర్చిరి. 1. Initial incident, 2. Rising action or growth or complication. 3. Crisis or climax or turning point. 4. Falling action or Resolution or Denounement. 5. Catastrophe or Conclusion.

నాటకాదులలోఁ గనీస మైదంకము లుండవలెనను నియమమునకు పంచ సంధుల విభాగమే కారణమై యుండవచ్చును. కొందఱొకొక్కక్క యంకమునం దొకొక్కక్క యవస్థ వర్ణితము కావలెనని యందురు. కొంద ఱొకొక్కక్క సంధి యొకొక్కక్క అంకమందేకాక అంతకుమించి వ్యాపించియున్నను పంచ సంధులు సమగ్రముగా నుండునట్లు నాటకమును రచించుటయే లాక్షణికుల యుద్దేశమనియు, అందువలననే 'ఆ పంచాంకం, ఆ దశాంకమ్' అను నియమ మేర్పడినట్లు తెల్పుదురు. ఇతివృత్తమున నంకవిభాగము బాహ్యావిభాగమనియు సంధివిభాగము ఆంతరవిభాగము లాక్షణికుల యభిప్రాయము.

ఇతివృత్త విభాగమునకును వీరరసోదయమునకును సంబంధమేమి యని ప్రశ్న! ఒకవిధముగా నితివృత్తమున: నాయకుఁడు పురుషార్థ ఫలార్థియై యుద్య మించుచున్న సమయమున నేర్పడు నవరోధముల నధిరోహించుటయం దాతఁడు చూపు నుత్కటోత్సాహ మనః ప్రవృత్తియందలి యవస్థలు, తద్ధేతువులు వర్ణి తము లయినట్టిదియు, ప్రారంభపరిసమాప్తులఁ గల్గినదియును నగు కథ. వీరరస మన నుత్సాహభావముయొక్క ఉత్కటరూపము. ఆ భావము విభావకారణ ముగా అనుభావరూపమున వ్యక్తమై సంచారిభావములతోఁ బరిపుష్టమయి రస మని పిలువఁబడుచున్నది. రసోత్పత్తికి మూలము మనోవిక్రియారూపమగు భావము. ఇతివృత్తమున కార్యావస్థల విభాగము కార్యాచరణమునందు సాధ కుని మనోభావములను ఆధారముగాగొనియే చేయబడియున్నది. ప్రథమావస్థ యగు ప్రారంభమున ఫలప్రాప్తి నుద్దేశించి బీజానుగుణమైన ఔత్సుక్యము నాయకునియొక్కగాని, అనునాయకులయొక్కగాని హృదయములందు నెల కొనుటయే. అనఁగాఁ బ్రతికార్యారంభమునందును ఉత్సాహము ఈషణ్మాత్ర మైనను గోచరింపక తప్పదన్నమాట. ప్రారంభమునందు ఉపలక్షించిన ఫల ప్రాప్తి కలుగునప్పుడు ఆ ఫలమునుగూర్చి చేయు తీవ్రరూపమగు ప్రయత్నము నందు వ్యక్తమగు ప్రబలోత్సాహ భావనావస్థయే ప్రయత్నమనఁబడును. అనఁగా ప్రయత్నమునం దితివృత్తమున నెల్లప్పుడు అసాధ్య ఫలసాధనమందు

సాధనారూపమగు నుత్కటోత్సాహము గోచరింపకమానదనుట విశదమేకదా! ఈ కథాఘట్టమునందు అంగిరస మేదియైయున్నను అది వీరరస స్థాయిభావమగు నుత్సాహముచే ననుప్రాణితము కాకతప్పదు. ప్రాప్త్యాశయందు ఈషణ్మాత్రము ఫలప్రాప్తి భావము కలిగినను సంపూర్ణ ఫలప్రాప్తి కొఱకై ఉపాయచింతయు, అపాయ శంకయు కలుగుననియు నియతాప్తియందు అపాయాభావ నిర్ణయముకల్గి ఫలలాభము నిశ్చిత మగుననియు తెలుపఁబడినది. ప్రయత్నమునం దుత్సాహోత్ముకుఁడై కార్యాచరణ మారంభించిన సాధకునికి తత్ప్రయత్నమునందు ఉపాయాపాయశంక కలుగుటయు తన్నివృత్తికై ద్విగుణీకృతోత్సాహముం బ్రకటించి, సాధించి, నియతాప్తియను అవస్థను పొందుట ఇందు వర్ణింపఁబడును. అడుగడుగునకు నేర్పడు అపాయములను దాటునప్పుడు, సాధకుని యుత్సాహము క్షణక్షణ ప్రవృద్ధమానమయి, నిశితమై, అతని మహత్త్వమును హెచ్చించుచుండును. ఇచ్చట ధృతి, యత్నము, ఔత్సుక్యము మొదలగు భావములు సంచారులై యుత్సాహము నుత్కటపఱచును. ఫలయోగమునందు సాధకుఁడు తన ప్రయత్నమునకు తగిన ఫలమును పొందుచున్నాఁడు.

ఈ దృష్టితోఁ జూచినచో ప్రతికావ్యేతి వృత్తమునందును కాననగునైదవస్థలందును ఉత్సాహము సాధకుని మనస్సు నందుండి యాతనిని కార్యోన్ముఖునిగా నొనర్చునని తేలుచున్నది. కొన్నియెడల నది సర్వాంగపుష్టమై వీరరస నామార్థతగూడ నొందుచున్నది. సామాజికులకు ఆలంబన విభావములు నాయకాదులు. అనుభావములు వారిచేష్టలు. తద్ధేతువులు ఉద్దీపన విభావములు. ఆయా యవస్థలందు వారు ప్రకటించు రసపోషకములగు వివిధభావ పరంపరలు సంచారి భావములు. అనఁగా నర్థప్రకృతులు కార్యావస్థలకు హేతువులగుటం జేసి అవి యుత్సాహభావ వ్యక్తికి హేతువులై, ఉద్దీపన విభావములై తారసిల్లగలవు. విభావములచే ప్రకటింపఁబడిన యను భావములను వర్ణించుట యందలి క్రమ పరిణామమును సూచించు కథా ఘట్టములే సంధులు.

సంధ్యంగములందును సాధకోత్సాహవర్ణనము ప్రధానములైనవి చాల గలవు. ముఖ సంధ్యంగములలో ఉపక్షేపము, పరికరము, పరిన్యాసము, విలోభనము, యుక్తి, పరిభావన, ఉద్భేదము, భేదము, కరణము అను వానియందును, ప్రతిముఖ సంధ్యంగములలో పరిసర్పము, నర్మద్యుతి,

ప్రగమనము, వజ్రము, ఉపన్యాసము, వర్ణసంహారము లేక చాతుర్వర్ణ్యము[1] మొదలగు వానియందును, గర్భసంధ్యంగములలో అభూతాహరణము, మార్గము, ఉదాహరణము, క్రమము, సంగ్రహము, అనుమానము, తోటకము, అధిబలము, ఆక్షేపము అను వానియందును, అవమర్శ సంధ్యంగములలో - అపవాదము, సంఫేటము, ద్రవము, ద్యుతి, ప్రసంగము, వ్యవసాయము, విరోధనము, ప్రరోచనము, విచలనము, ఆదానము, అను వానియందును, ఉపసంహృతి సంధ్యంగములలో సంధి, విబోధము, గ్రంథనము, నిర్ణయము, పరిభాషణము, ప్రసాదము, కృతి, భాషణము, పూర్వభావము, కావ్యసంహారము, ప్రయోజనము అనువానియందును, ఉత్సాహప్రసక్తి రాకతప్పదు. అరువదినాలుగు సంధ్యంగములతో ఉత్సాహభావాకరములగు నంగములు నలుబదియైదు కానఁబడుచున్న వనఁగా ప్రతికావ్యేతివృత్తమునందును వీర మంగముగా నుండక యుండదని ధృవపడుచున్నది. పైచర్చనుఁబట్టిచూడ - వీరరసమునకే యితర రసములకులేని సర్వవ్యాపకత్వము సాహిత్యప్రపంచమున గలదని నిరూపితమైనది. కవి, పాఠక, నట, సామాజికులందరికీ వీరము లేనిచో కావ్యనిర్మాణము, కావ్యగానము, కావ్యప్రదర్శనము, కావ్యరసాస్వాదనములను నవికూడ దుస్సాధ్యములే యగును.

దశవిధరూపకము లందును వీరమున కుచిత స్థానముగలదు. నాటకము, ప్రకరణము, అంకము, వ్యాయోగము, భాణము, సమవకారము, వీథి, ప్రహసనము, డిమము, ఈహామృగము అనునవి దశవిధ రూపకములు. వీనియందు వీరరస మంగిగా నైదింటఁ బ్రయోగింప వీలగుచున్నది. నాటకమున వీర, శృంగారములలో నొకటి యంగి; వ్యాయోగమున వీరరౌద్రములు, సమవకారమున వీరము; డిమమునందు శృంగారహాస్యములు కాక తక్కిన యారు రసములనుటచే వీరము, వీథియందన్ని రసములని నుడువఁబడుటచే వీరము అంగిరసముగాఁ బ్రయోగింపఁబడు నవకాశము కల్గుచున్నది. నాటక, ప్రకరణ, భాణ, ఈహామృగ, వీథులయందు శృంగార మంగి కావచ్చును. వీథి,

---

1. "చాతుర్వర్ణ్యమనఁగా బ్రాహ్మణాది వర్ణములని అర్థము చెప్పరాదు. ఈ పదముచే పాత్ర లుపలక్షితులైనారు. వీరరస ప్రధానములైన రూపకములందు నాయక ప్రతినాయకులును తత్సచివులిరువురును ప్రధానముగా వర్ణింపఁబడుదురు. కావున వారు నలుగురు వర్ణములు. ఈ చతుర్వర్ణములవారి సమ్మేళనమే వర్ణసంహారమని భట్టతౌతుని యభిప్రాయము."

—(అభినవభారతి సం. 3. పుట 47. శ్రీ. పో. శ్రీ. అ. రా. గారి నాట్య శా. పు ట. 573. అధస్సూచిక.)

డిమము, అంకము — వీనియందు కరుణము, ప్రహసనము, వీథి, డిమము — వీని యందు హాస్యము అంగిరసములుగా నుండవచ్చును. ఎట్లుచూచినను, వీరరస మునకున్నంత వ్యాప్తి తదితర రసములకు దశరూపక విభాగమునఁ గానరాదు.

## వీరరసాభాసము

సాహిత్యశాస్త్రమున రసమున కెంతటి ప్రత్యేకస్థానమున్నదో రసాభాస మునకు అంతటి విశిష్టస్థానము కలదు. సముచిత విభావాలంబనము కలది రసము కాగా అనుచిత విభావాలంబనము కలది రసాభాసముగా సాహిత్యవేత్తలు నిర్ణయించియున్నారు. అనఁగా రసభావములు అనౌచిత్యముచేత ప్రవర్తితను లైనప్పుడు రసాభాస, భావాభాసములగునని వారి తాత్పర్యము. కాని ఆనంద వర్ధనుఁడు "అనౌచిత్యాదృతే నాఽన్యత్ రసభంగస్య కారణమ్" అనౌచిత్యము రసభంగ కారణమగునని తెల్పియున్నాఁడు. సూక్ష్మదృష్టితో చూచినచో కేవలము రసభంగ కారణమైన అనౌచిత్యమునకును రసాభాసాది కారణమైన అనౌచిత్యమునకును కొంత భేదము ఉండియుండునని కావ్య కళాతత్త్వ ప్రకాశికాకర్త భావించియున్నారు. అట్టి యనౌచిత్యముచే నేర్పడిన రసాభాస ములలో మనకు ప్రకృతమైనది వీరరసాభాసమొకటే.

"బ్రహ్మ వధాద్యుత్సాహేఽధమ పాత్రగతే తథావీరే" —కావ్యప్రకాశిక.

"వీరో భయానకావిష్టో వీరాభాస ఉదీరితః" —భావప్రకాశిక.

"హీనపాత్రేషు తిర్యక్షు...తదాభాసం విజానతే" —సరస్వతీ కంఠాభరణము.

ఇట్టి నిర్వచనములనుబట్టి బ్రహ్మహత్యాది మహాపాతకములు చేయుట యందలి యుత్సాహము, అధమపాత్రగతమైన యుత్సాహము, తిర్యగ్జడాదుల యందు దృష్టమైన యుత్సాహము, భయానక రసావిష్టమైన వీరరసము వీర రసాభాసమనఁబడును. ఇది వీరరసభేదము లన్నింటికి వర్తించుననియే నా యభి ప్రాయము.

ఉదాహరణమునకు: ఉత్తర హరివంశమునందలి హంస డిభకులు తపస్సం పన్నులయ్యు దుర్వాసుఁడు మొ. ఋషులను మదాంధులై బాధించుటయందుఁ గనపరచిన ఉత్కటోత్సాహ ప్రవృత్తి రసాభాస మగుచున్నది. మహాభారత పాత్రలలో సైంధవుఁ డధమ ప్రవృత్తి కలవాఁడు. చెల్లెలిని చెఱపట్ట నుంకించిన నీచుఁడాతఁడు. అట్టివాఁడు పాండవుల నడ్డగించు శక్తి సముపార్జించుటకై తపస్సుచేసి, అభిమన్యు యుద్ధఘట్టమున శత్రు వారిధి కడ్డమై నిలిచి యుత్స

హించిన అతని ప్రవృత్తి యంతయు రసాభాస మనఁబడుచున్నది. "పంచ తంత్రము"న పింగళకాది పశుపక్ష్యాది పాత్రల నాశ్రయించిన యుత్సాహ ప్రవృత్తియు వీరాభాసమే యగును. అనంతామాత్యుని భోజరాజీయమునందు ప్రసిద్ధమైన గోవ్యాఘ్ర సంవాదములోని గోవు నాశ్రయించిన సత్యవీరము శాస్త్రీయదృష్టితో వీర రసాభాసమైనను వీరరసము వలెనే మిక్కిలి చర్వణీయ మగుచున్నది. అందువలననే రసాభాసమునకును రసమున కున్నంత గౌరవము లభించుట! కురుసైన్యమును గాంచి గజగజ వణకిపోయి వెనుదిరిగి పరుగెత్త నుంకించిన క్షత్రియ వీరుఁడగు ఉత్తరకుమారు నాశ్రయించిన యుద్ధవీరము భయానక రసావిష్టమగుటచే రసాభాసమనియే చెప్పఁబడును. ఇట్టివి వాఙ్మయ పరిశీలనావసరమునందు సహృదయులు తెలిసికొనఁగలరు.



# ఆంధ్రసారస్వతము - వీరరసము

## తెలుఁగుకవుల రసదృష్టి

జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్". —భర్తృహరి

ఏ సాహిత్యమునందైనను ఉత్తమ కావ్యములే సర్వత్ర వెలయుట జరుగదు. కవులై కావ్యములు వ్రాసినవారందఱు రసవత్కావ్యములు నిర్మింపఁజాలరు. దానికిఁ దగిన సామర్థ్య మందఱికి నుండదు. సమర్థుఁడైన కవి యాచంద్రార్కము తన కావ్యముతో బ్రతుకును. ఇతరులు నామావశిష్టులై గతించెదరు. ప్రతి కవియు రసవత్కావ్యమును రచించుటకే పూనుకొనును; కాని శక్తికొలది లక్ష్యసాధన ముండును. లక్ష్యసాధనోత్సాహమును చూపించి దానిని సాధించినవారు రససిద్ధులగుచున్నారు. వారు మాత్రము సాహిత్యోపాసకుల పూజ లందుకొనుచున్నారు.

తెలుఁగు కవులలోఁ జాలమందికి రసవత్కావ్య నిర్మాణదృష్టియు, రససిద్ధియు నున్నవి. అట్టివారి కావ్యముల నుపాసించు శక్తి కావ్యపఠనాసక్తునకు గాని కలుగదు. అనవరత కావ్యపఠనము సామాజికుని నుత్తమసహృదయునిగాఁ దీర్చిదిద్దును. సహృదయుని హృదయైక వేద్యమే రసానుభూతి. ఇఁక కవి యొక్క రసదృష్టిని తెలిసికొనుటకై పఠితకు కావ్యమునందే కొన్ని మార్గములు గోచరించుచుండును. కవి సామాన్యముగా పీఠికలో కావ్యరచనము నందుఁ దనకున్న ప్రధాన లక్ష్యములను, స్వీయాశయములను, నియమములను పేర్కొనుచుండును. వానిని బట్టి కావ్యస్వరూప స్వభావములను కొంత యూహింపవచ్చును. కాని ప్రతి కవియు నిట్లే సూచించుచున్న నియమము లేదు, అట్టివారిని కావ్యపఠనమువలన నర్థము చేసికొనవలసినదే. "సారమతిం గవీంద్రులు..." అను పద్యమున నన్నయ తాను రసవత్కావ్య నిర్మాణము చేయుచున్నానని చెప్పలేదు. అందులకు కొందఱు ఇతిహాసమున రసము ప్రధానము కాదని సమాధాన పడినను. ఆనంద వర్ధనాచార్యులవంటివారు

శ్రీనాథుడు : కాశీఖండమున : ప్ర. ఆ. ప. 13.

"వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు."

రామరాజ భూషణుడు : "ఒక్కొక్క కావ్యంబు రసోచిత చమత్క్రియా కల్ప భవ్యంబుగా నొనరింప"—(వసుచరిత్ర), హరిశ్చంద్ర నల కథాయుగ యుగపదనుసంధానబంధుర రసానుబంధంబగు చిత్రప్రబంధంబు నిర్మింపఁ బూని" (హరిశ్చంద్ర నలోపాఖ్యానము).

కంకంటి పాపరాజు : ఉత్తర రామాయణమున :

"మృదువచోధారార్థ సందర్భ నిర్భర తత్తద్రసముల్ రహింప రచియింప బూనితిన్ వేడుకన్". —పీఠిక 13.

డి. రాజశేఖర శతావధానిగారు : రాణా ప్రతాపసింహ చరిత్రమున :

"అలరు తేనెల మఱపించు పలుకుఁబొందు, పలుకుఁబొందున కుచితమౌ భావపుష్టి
భావపుష్టికిఁ దగు రసవైభవంబు గూర్చు ధన్యుండె పో కవికుంజరుండు.

విశ్వనాథ సత్యనారాయణగారు : రామాయణ కల్పవృక్షమున :

"కవి ప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశముల యందుఁ దొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాధృతిని మించి"

కావ్యకర్తలు కొందఱు తమ కావ్యగుణములను, స్వీయ గుణగణములను కావ్యభర్తల ముఖమున నిబంధించుకొందురు. ఉ॥ కుమార ధూర్జటిని గాంచి ఆర్వీటి చిన వేంకటాద్రి ఇట్లనుచున్నాఁడు (కృష్ణరాయవిజయము) :

"చిత్రముగాఁగఁ జిన్నపుడె చేసితి వౌ రసముల్ చెలంగ సా
విత్రి చరిత్రమున్ మిగుల వేడుక నిందుమతీ వివాహమున్
స్తోత్ర మొనర్ప నర్హమగు సూక్తిగతిన్ రచియించితౌఁ గదా
ధాత్రిఁ బ్రసిద్ధిఁ గాంచితివి ధన్యుఁడవౌర కుమార ధూర్జటీ !"

"కుమార ధూర్జటీ రసార్థ గూఢ రూఢ వాగ్జటీ !"

ఈ మాటలవలన కుమార ధూర్జటి రసవత్కావ్య నిర్మాతయని తేటపడుచున్నది కదా !

భారతమునందలి అంగాంగి రసచర్చ చేసియేయున్నారు. నన్నయ కవితయందు రసపుష్టి లేదని యేప్రాజ్ఞుఁడు ననఁడు. "రస" పదముచే వాచ్యముగా నాతఁడు సూచింపకపోయినను కావ్యపఠనావసరమున సారమతితో నతని రసవత్కావ్య నిర్మాణదృష్టిని గమనింపఁదగు నని దాని తాత్పర్యము. ఐక్కన, తిరుపతి వేంకటేశ్వరులు మొ. వారు అతని కవితయందలి రసదృష్టిని కీర్తించియే యున్నారు.[1] ఇది యిట్లుండ నన్నయగా రాంధ్రశబ్దచింతామణిలో "విశ్వశ్రేయః కావ్యం తదదోషౌ పరికృతౌచ వాగర్థౌ సావాగ్యా రసవృత్తి స్స్యాద్ధ్యోహి రసో యథాతథం కవిభిః" అని ప్రపంచించుటలోనే యాతని కావ్యరసదృష్టి స్పష్ట మగుచున్నది.

కొందఱు కవులు తాము రసవత్కావ్యములను నిర్మించుచున్నామని సూటిగా చెప్పుటయు కలదు. ఉదాహరణమునకు: పాల్కురికి సోమనాథుఁడు:

"నా నేర్చుకొలఁది వర్ణన సేయువాఁడ
నవరస రసికత భువినిఁ బేర్కొన్న
శివకవి ప్రవరుల చిత్తంబు లలర" —బసవపురాణము.

తిక్కనామాత్యుఁడు :

"హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ........" —మహాభారతము. వి. రా. ప.

గోన బుద్ధారెడ్డి : రంగనాథ రామాయణమున :

"పదము లర్థంబులు భావముల్గతులు పదశయ్య లర్థ సౌభాగ్యముల్యతులు
రసముల కల్పన ల్ప్రాసి సంగతులు అసమాన రీతులు వన్నియుఁ గలుగ"

---

1. "వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు సత్ప్రబంధముల్
పాయక చెప్పిరిట్లు రసబంధుర వాగ్విభవాభిరామ ధౌ
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కరే
యేయెడ నన్నపార్యుగతి నిద్ధర నట్టి మహాత్ముఁ గొల్చెదన్"
—విక్రమార్క చరిత్రము ఐక్కన - ప్ర. ఆ. ప. 12.

"సారతరార్థ సంపదలు సారససార సరః ప్రసారము
ల్గా రసవత్తరంబుగ నిగారముగారము దోఁప సాహితీ
భారతి భారమంతయును భారతమం దిరవొంద నాంధ్ర భా
షారమణీరమం గొలుచు సజ్జను నన్నయభట్టు నెన్నెదన్."
—కలగూరగంప - తిరుపతి వేంకటేశ్వరులు.

అని పలికించి తనకావ్యసలక్షణత్వమును నిరూపించుకొనెను. ఇందు కవి తన కావ్యము తల్లక్షణములన్నియుఁగల్గి రసోత్కృష్టమైనదని వాచ్యముగాఁ దెల్పుటకు బదులు రసవ్యంజకములన్నిటిని బేర్కొని తదాశ్రయమైన రసభావముల ప్రాబల్యమును వ్యంగ్యముగా నిబద్ధించి యట్టివానిచే గూడిన కవితనే సుకవి నిబంధించునని పాత్రముఖమున చెప్పించి స్వకావ్యస్వరూపమును మనకు సాక్షాత్కరింపచేయుట యిందలి ప్రత్యేకలక్షణము.

ఒక్కొక్కకవి యొక్కొకరసము నభిమానముతో బోషించును. కాని కవి సర్వరససిద్ధుఁడే. తత్సమయముల కనుగుణమైన శబ్దార్థరీతి ప్రాణాలంకారాదులను తత్తద్రసపోషకములుగాఁ బెక్కురీతుల సమాహారమొనర్చుట యతనికి సహజము. కవి నైపుణ్యముఁబట్టి వ్యంజక నిబంధనమునందు వైవిధ్యము గోచరించుచుండును. వైవిధ్యములెన్నియున్నను నాస్వాదితమగు రస మఖండ రూపమే. అట్టి రసోదయక్రమమును సారభూతముగా కావ్యాలంకారకర్త భట్టుమూర్తి యిట్లు పేర్కొనినాడు.

"సరళ విరాజ దుచ్చరణ శస్తము వర్ణము; వర్ణపంక్తి వి
స్తరము పదంబు; తత్పదవితానము వాక్యము; వాక్యభేద సుం
దరతర మర్థ; మర్థ ఘనతత్త్వ విబుద్ధము భావ; మట్టి భా
వరుచిర సుప్రసన్న విభవంబు రసం బొడఁగూర్ప నేర్చినన్."

*　　　　*　　　　*

"తెలుఁగుసారస్వతమునందలి వీరరసము"ను గూర్చిన చర్చ ఈ గ్రంథమునందలి వస్తువు. సారస్వత మొక కల్పవృక్షము. అది బహు శాఖోపశాఖా విరాజితము. దాని ఆత్మస్వరూప మొకటియే. శరీర విలాసములు పెక్కు. "ఆత్మ" యగు 'రసము'ను గూర్చిన చర్చ పూర్వము ముగించితిని. ఇఁక తత్ శరీర విలాసముల నిరూపించి- తచ్ఛాఖాస్వరూపములఁ బేర్కొని వానియందు ఆత్మ ప్రకాశ మెట్లున్నదో బరిశీలింతును. అనఁగా వీరరస మాత్మగా గల్గిన కావ్యములిందు విమర్శితము లగునని తాత్పర్యము.

సారస్వత స్వరూప మనంతమగుటచే తద్విరాట్స్వరూపము నంతయు నొక్కపరి యుపాసించుట అసాధ్యము కావున తల్లీలావిలాసముల మాత్రము కొంత కీర్తించుట జరుగును. అట్టి ప్రయత్న స్వరూపమే ఈ గ్రంథము.

కృతిభర్తలు దేవతలయినపుడు వారు కలలోనో లేక యిలలోనో కవికి సాక్షాత్కరించి కవులకు రసోదంచిత కావ్యరచనోత్సాహముఁ గల్పించుటయు కలదు. ఉదా॥ హరిహరనాథుఁడు తిక్కనామాత్యుని గాంచి "వైదికమార్గ... కావ్యరసముం గొనియాడుచు నుండు చెప్పుడున్" అనుటలో తిక్కన కావ్య రసపోషణ దృష్టి ధ్వనితము.

నాచనసోమ రామరాజభూషణాదులవలె కొందఱాశ్వాసాంతగద్య లందు తమతమ బిరుదములఁ జేర్చొకొనుచుందురు. వానివలనఁగూడ వారి కావ్యలక్షణములు కొన్ని తెలియుచుండును. ఉ॥ "శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీన గుణసనాథ నాచనసోమనాథ" (ఉత్తర హరివంశము). "సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ" (వసుచరిత్ర) "రసవత్కావ్య నిర్మాణ చాతురీధురీణ" (రాణాప్రతాపసింహ చరిత్ర).

కుకవుల నాక్షేపించుచు రచించు పద్యములందు వారు రసభంగ మొనర్చి నవ్వులపాలౌదురని కొందఱు వర్ణించి, తమ రసపోషణమును వ్యంగ్యముగాఁ బ్రతిపాదించెదరు. ఉ॥ "పలుకుల పొందులేక రసభంగము సేయుచు......" అను పద్యము (తిక్కన నిర్వచనోత్తర రామాయణము) ప్రసిద్ధము. మఱియు

"నవశబ్దార్థ రసానుబంధ పదవిన్యాస క్రియా భావ గౌ
రవ పాకధ్వని రీతిశయ్యలఁ గవీంద్ర శ్రేణికావ్యాళిఁ జె
ప్ప వృథామత్సర మూని దుష్కవులుఁ జెప్పంజూతురిశ్లేకదా!
శివుడుం దాండవమాడ నాడవె పిశాచీభూత భేతాళముల్"

—విక్రమార్కచరిత్ర...ప్ర. ఆ. 15.

కొందఱుకవులు తమ కవితాలక్షణములను పాత్రముఖమున నిబద్ధించి వ్యంగ్యముగా తెల్పుకొందురు. మణికంధరప్రోక్త విష్ణుదండకమును గొని యాడు కలభాషిణీముఖమున పింగళి సూరన:

"పొసఁగుము తైపుసరుల్ పోహళించెడు లీలఁ దమలోన దొరయు శబ్దములఁగూర్చి
యర్థంబు వాచ్యలక్ష్య వ్యంగ్య భేదంబు లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు నర్హంబులగు వైదర్భి మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతులకుచితంబులై తనరారెడు ప్రాణంబు లిమ్ముగాఁ బాదుకొల్పి
యమర నుపమాదులను యమకాదులు దగునట్టి యర్థ శబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు వాంఛితార్థంబు లొనఁగని వారుగలరె?"

# 5. రత్నత్రయము

## 1. ఆంధ్ర మహాభారతము

భారతీయ సంస్కృతిపై నఖండ ప్రభావము వైచిన సాహిత్యగ్రంథ ములు మూఁడు. అవి : వాల్మీకి రామాయణము, వ్యాస మహాభారత భాగవత ములు. సాహిత్య గౌరవముతోపాటు మానవుని బహిరంతర్జీవితాదర్శ నిరూ పణము, పురుషార్థ సాధనోపాయము నీ కావ్యములందు రసవత్తరముగా నిరూపింపఁబడుటచే ప్రతి భారతీయుని హృదయదేవాలయము నందును వీనికి నిత్యార్చనలు జరుగుచున్నవి. కాలక్రమేణ వానిని గీర్వాణమునుండి తమతమ మాతృభాషలలోని కనువదించుకొని తత్కావ్యార్థ ప్రసాదమును సర్వజన భోగ్యముగా భారతీయులు తీర్చిదిద్దికొనిరి. అట్టివారిలో తెలుఁగువారు శ్రేష్ఠులు. తెలుఁగున ముందు భారత మవతరించినది. తరువాత రామాయణ భాగవత ములు అనువదింపఁబడినవి. మూలమునకన్న గౌరవ మేమాత్రము తఱుగకుండ తెలుఁగున నా కావ్యముల సంతరించిన కవులు వందనీయులు. మన సాహిత్య మున నన్నిగ్రంథము లొకయెత్తు; ఈ మూడు గ్రంథములు మఱియొక యెత్తు.

తెలుఁగుబిడ్డల నోములపంటలై త్రిమూర్తులఁ బోలి, భువి నవతరించి మహాభారత కావ్యప్రపంచమును సృజించి పురుషార్థ సాధనోపాయమును సూచించి తరించిన కవిత్రయము ప్రాతఃస్మరణీయము. వాగనుశాసనుఁ డగు నన్నయభట్టారకుని యొక్కయు, కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజి యొక్కయు, ప్రబంధ పరమేశ్వరుఁడగు నెఱ్ఱాప్రెగ్గడ యొక్కయు కవితా స్రవంతు లిందు కూడుటచే నియ్యది పవిత్ర త్రివేణీ సంగమక్షేత్రమై రసపూర్ణ మును, పుణ్యవంతమునయి యైహికాముష్మిక సుఖద మగుచున్నది.

"రసస్తు కథానాయకాశ్రయ స్తద్విపక్షాశ్రయోవా" అను ధ్వన్యాలోక కర్త మతానుసారము రసము నాయక ప్రతినాయకాశ్రయమని తేలుచున్నది. మహాభారతము భరతవంశజులగు చక్రవర్తుల చరితమైనను, పాండవుల సంపూర్ణ జీవితమే ప్రధానముగా వర్ణితమైన ఇతిహాసము. ఆదిపర్వమునం దొక విధముగా నీ విషయమును రాజరాజే సూచించియున్నాడు.

"హిమకరు దొట్టి పూరు భరతేశు కురుప్రభు పాండు భూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం

విషయ సౌలభ్యము కొఱకై సారస్వతము నీక్రింది విధముగా విభజించు కొంటిని: అవి: 1. మహాభారత రామాయణ భాగవతములు (రత్నత్రయము). 2 వస్తుకావ్యములు. 3. రసకావ్యములు. 4. నవ్య సాహిత్య స్రవంతులు. 5. జానపద సాహిత్యము. ఈ విభాగములక్రింద విమర్శనము నిర్వహించెదను.

రస విమర్శనము ఆత్మ విచారమువంటిది. అనిర్వాచ్యమగు పరమాత్మ స్వరూపమెట్లు వ్యాఖ్యాతము కాఁజాలదో అట్లే రస స్వరూపమును వ్యాఖ్యానము చేయుట కందదు. విమర్శకులు తత్స్వరూపమును శాస్త్రజ్ఞానముతో ననుభవించి, తదనుభూతి తేటపడునట్లుగా లోకమునకు చెప్పుటకై ప్రయత్నింతురు. శక్తికొలఁది ఫలము !

విభావాది నిరూపణము, కావ్యార్థములలోని విశేషము, ఇతివృత్త సంవిధానము. పాత్రపోషణమందలి యౌచిత్యము, కథాప్రవృత్తి యొక్కయు నాయక ప్రవృత్తి యొక్కయు సమన్వయము, అంగాంగిరస సమన్వయము, మొదలగు కావ్యాంశములయందు ఊనికనిడుచు రసవిమర్శన మొనరింతును. సహృదయులు గుణైకగ్రహణపారీణులై నా సాహసప్రయత్నమును మన్నింతురని ఆశించుచున్నాను.



శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెమ్మెయిన్''

—ఆది. ప్ర. 14.

అనుటలో నీ కావ్యేతివృత్తము పాండవచరిత్ర ప్రధానమని స్పష్టము. అనగా నీ కావ్యమున నాయకులు పంచపాండవులనవచ్చునుగదా! కాని అట్లయిదుగు రనుటకు వలనుపడదు. కావ్యారంభమునుండి ఫలప్రాప్తివఱకు నెవ్వనిజీవితము సమగ్రముగా వర్ణితమగునో అతనినే నాయకునిగా నెన్నుకొనుట సంప్రదాయము; సమంజసము. అట్లగుటచే - భీమాదులు దివంగతులైన తరువాత కూడ ధర్మమువీడక, సశరీరియై స్వర్గమునకరిగి, యమేంద్రాదుల దయావిశేషముచే దేవత్వముఁ బొందినవాడు ధర్మజుఁడగుటచే నాతఁడే ఫలభాక్కగు నాయకుఁ డగుచున్నాఁడు. భీమాదులు జీవికాజీవులవలె పరస్పరము భ్రాతృస్నేహముతో వర్తించి, భక్తిశ్రద్ధలతో నాజన్మాంతము ధర్మజుని సేవించి తరించి యుండుటచే వా రనునాయకులగుచున్నారు. వీరికిఁ బ్రత్యర్థి రారాజు. కర్ణాదు లాతని కండనిలిచినవారు. ఈ యిరుపక్షముల వారికి నేర్పడు సంఘర్షణమే భారత ప్రధాన కావ్యేతివృత్తము.

మహాభారతము సంపూర్ణ మానవజీవిత ప్రతిబింబరూపము. దాని కాదర్శవంతుఁడగు ధర్మరాజు నేతయై నిలిచినాఁడు. అతఁడు ధర్మజ్యోతిర్లింగ రూపుఁడగు స్వయంభూదేవుఁడు. పేరునందే ధర్మము మూర్తిఁగట్టిన మహాత్ముఁడు. ఆవిరాడ్రూపమున కాలయప్రాయులు నకులసహదేవులు; అంగరక్షకులు భీమార్జునులు. ధర్మప్రధానముగాఁ బురుషార్థముల సాధించిన ధీరుఁడు ధర్మరాజు. లోకమున నెట్టి కార్యసాధనమైనను పురుషకార దైవయత్నసంసిద్ధిపై నాధారపడియుండును. ధీమంతుఁడగు ధర్మసాధకుఁ డీ యర్థద్వయమును సప్రయత్నముగ సంధించి సాధించి, కృతార్థుఁడగును. ధర్మజుఁడట్టి ధీమంతుఁడు.

ధర్మజుఁడు స్వయముగ గొప్ప అదృష్టవంతుఁడు; జన్మతః ధర్మతత్త్వజ్ఞాని. ఇతని యదృష్టము భీమార్జునులను తమ్ములుగఁ బడయుటయే. వలయన వారులేనిది ధర్మజుని ధర్మసాధనము లేదు. వారిలో భీముఁ డరిభయంకరుఁడు; సింహబలుఁడు. ధర్మజుని ధర్మదీక్షారక్షణకై పురుషకారము సిద్ధనుసేయఁ గడుంగడు సమర్థుఁడు. అర్జునుఁడు నరనారాయణులలో నరాంశ సంభూతుఁడు, నారాయణుని మనసుకెక్కిన రాజభక్తుఁడు, అతి లౌకికశక్తి సంపన్నుఁడు, దేవసంభావితుఁడు నగుటచే నన్నకు దైవయత్నముఁ జేకూర్చిపెట్టు

టలో దివారాత్రములు కృషిచేసెడివాఁడు. ఒకఁడు బాహుశక్తియుక్తుఁడు, మఱియొకఁడు దైవవిద్యాశక్తిసమన్వితుఁడు. వీరిరువురి సుస్థిర సంరక్షణమున ఘటనిక్షిప్తమగు దీపకళికవోలె నెట్టి యవాంతరములు లేక యుధిష్ఠిరుఁడు తన జన్మవ్రతము నిశ్చింతగా నిర్వహించెను. 'శ్రేయాంసి బహువిఘ్నాని' అను న్యాయమున ధర్మజుని ధర్మశీలమున కడుగడుగునను ప్రతిపక్షము నుండి పరీక్షలే వచ్చెడివి. వ్రతరక్షకులైన భీమాదులు సమయోచిత భావావేశముతో నట్టివానిని భీషణ గర్జనములతో నెదుర్కొన సిద్ధమయ్యెడివారు. ధర్మజుని యనుమతియైనచో నాత్మార్పణమునకు సైతము వెనుదీసెడివారు కారు. శాత్రవుల రాక్షసకృత్యములకెంతయు ఘూర్ణిల్లిన భీమాదుల హృదయజలధులెన్నడును ధర్మజ శాసనమను మర్యాదను దాటియెఱుఁగవు. ఇట్టి యవ్యాజ సమన్వయసూత్రము పాండవుల నేకీకృతుల నొనర్చి కృష్ణాశ్రయులుగాఁ దీర్చిదిద్దుటచే వేదధర్మమున కుపనిషత్పురుషుని సాంగత్య మబ్బినట్లయినది.

శ్రీకృష్ణుని దృష్టిలో నాయకుఁడగు ధర్మజుఁడు ధర్మతరువు. ప్రతినాయకుఁడగు సుయోధనుఁడు రోషమయతరువు. వానిని నిరూపించుచు సంజయునితోఁ గృష్ణుఁడనిన మాటలివి.

> "రోషమయ మహాతరువు సుయోధనుఁడురు స్కంధ మందులోనఁ గర్ణుఁడలరుఁ
> గొమ్మ సౌబలుండు గుసుమ ఫలములు దుశ్శాసనుండు మూలశక్తి తండ్రి."

> "ధర్మజుండు ధర్మతరు; వర్జునుఁడు ఘనస్కంధ; మనిలసుతుఁడు శాఖ; కవలు
> పుష్పఫలము; లేను భూసురులును వేదములుఁ దదీయమైన మూలచయము"
>
> —ఉద్యో. ప్ర. 355. 356.

దైవమూలమై ధర్మరూపమగు ధర్మజమహావృక్షమే యిందు శ్రేష్ఠమనుటలో విప్రతిపత్తిలేదు. దుర్యోధనుఁడు అర్థకామనిష్ఠుఁడు. అతనికి ధర్మదృష్టి లేదు. అర్థసాధనమందు పురుషకారమును మాత్రమే నమ్మి, దైవ సహాయమును నిర్లక్ష్యముచేసి స్వార్థముకొఱకు ప్రాకులాడు దురభిమాని. అతని ననుసరించు వారాతని తమ్ములు. అందువలననే వ్యాసభట్టారకుఁడు

> "క్రూరులు విలుప్త ధర్మాచారులు ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని
> ష్కారణవైరులు వీరల కారణమున నెగులుబుట్టు కౌరవ్యులకున్"
>
> —ఆది. పం. 159.

అని నిరూపించినాఁడు. ఐహికముగా దుర్యోధనుఁ డదృష్టవంతుఁడు. సురాంశజులగు భీష్మాదులాతని పక్షవర్తులగుటయే యాతని యదృష్టము. కాని ధర్మదృష్టిగల భీష్మాదు లెన్ని హితవులు చెప్పినను అతఁడు పెడచెవినిఁ బెట్టెను. కర్ణుని దివ్యాస్త్ర పాండిత్యమును నమ్మెను. కర్ణుఁడు ధర్మైకశీలుఁడు. సేవాధర్మమునకును, ఆత్మధర్మమునకును ఎట్టి విచ్ఛిత్తి జరుగకుండ జీవితమునెంతో సంశ్లిష్టముగ నడపికొనిన వీరుఁడు. దుర్యోధనుఁడు భుజబలప్రధానుఁ డగుటచే భీముని కాతఁడు ప్రతి. దివ్యాస్త్ర శస్త్ర సంపన్నులగు భీష్మాదు లర్జునునకు ప్రతి. ఇఁక ధర్మమునందు ధర్మరాజున కెవ్వఁడు నీడులేడు. దీని తాత్పర్యమిది: నాయకుఁడు బలవిద్యాశక్తులనెడి సమర్థోపకరణములతో సప్రయత్నముగా ధర్మఫలమును సాధింపనేర్చు సమర్థుఁడు. ధర్మజుఁ డంగి; భీమాదు లంగములు. అంగి స్వయం ప్రతిభాయుతుఁడు, దైవాశ్రితుఁడు. ప్రతినాయకుని కిందు ప్రత్యేక వ్యక్తిత్వములేదు. కర్ణ దుర్యోధనులు విద్యాబల శక్తులనెడి యుపకరణములు; వీనిని ధర్మబద్ధముగాఁ బ్రయోగించు యజమానిలేఁడు. భీష్మాదు లట్టి యత్నము లెన్నియోసారులు చేసి విఫలులైరి. ధర్మసాధకములుగాని యీ ప్రతివీర శక్తులు విశృంఖల వృత్తి ననుసరించి స్వనాశనమునకు దారి తీసినవి. ధర్మజ ప్రవృత్తియందు ధర్మమున కర్థకామము లూడిగ మొనర్చును. సుయోధనునియందు అర్థకామములు బలీయములై ధర్మమును బహిష్కరించును.

ధర్మరాజు జన్మకాలమున నశరీరవాణి యతనిని యుధిష్ఠిరుఁడని కీర్తించినది.

"కురుకుల విభుఁడగు ధర్మస్థిరమతియగు నీతఁడనుచు ధృతిఁజేసి యుధి
ష్ఠిరుఁడను నామముఁ దా నుచ్చరించె నాకాశవాణి జనవినుతముగాన్"
—ఆది. 5. 97.

స్వర్గారోహణ పర్వమున యముఁడీ విషయమును సమర్థించినాఁడు :

"........చలన మొకప్పుడైన నీదు మదికించుక యేనియులేదు, దమము
శమము సత్యంబు మద్గత సారభక్తి నీకు నగ్గలములు మహనీయచరిత."

అని. ధర్మజుని జీవితారంభాంతములందు దేవతలే యాతనిని ధర్మస్థిరమతి యని కీర్తించి యుండుటచే నాద్యంత సమన్వయముతో నాతఁడు ధర్మవీరుఁడై వరలుచున్నాఁడనుట నిర్వివాదాంశము. యుధిష్ఠిర నామ మాకాశవాణి పల్కుటయందు దొక విచిత్రార్థ మిమిడియున్నది. యుద్ధమునందు స్థిరమైన

వాఁడని తత్పదవ్యుత్పత్త్యర్థము. ఇది అభిధ. ధర్మజుఁ డహింసాది గుణసమన్వితుఁ డైనను క్షత్రియవంశ సంజాతుఁడు కాన యుద్ధ మీతని కులధర్మమగుచున్నది. ఇట్లుగాక యీ శబ్దమును యౌగికార్థమున గ్రహించుచో సత్ప్రవృత్తులకు, దుష్టప్రవృత్తుల కనవరతము జరుగు నంతర్యుద్ధమున దుష్టవృత్తుల కోడని స్థిరైక చిత్తుఁడనియు భావమేర్పడును. ఇది ధర్మముచే ననుశాసితమని పైమాటల తాత్పర్యము. ఇట్టి ధర్మప్రవణత్వ మెట్లీతని జీవితమందు వ్యాపించి స్థిరత్వ మొందినదో పరామర్శించినచో నది అంగిరస చర్చ యనఁబడును.

పితృ మరణానంతరము హస్తినాపురి కేతెంచిన పాండుకుమారులు ధార్తరాష్ట్రులతోఁ గూడి బాల్యక్రీడలఁ దేలియాడిరి. అందు పాండవులందఱొకటి. వారి మనఃప్రవృత్తులు సర్వథా యేకరూపములే. అవియన్నియు ధర్మజాను శాశితములు. ఆ క్రీడలలో భీముఁడు తన భుజబలముతో దుర్యోధనాదులను వేధించెడివాఁడు. అతని బారికోర్వఁజాలక దుర్యోధనుఁ డుపాంశువధ గావింప నెంచి, భీముని బాముల గఱపించియు, నీటఁ ద్రోయించియు, విషభోజనము నిడియు సాయశక్తులఁ బ్రయత్నించెను. కాని యనంత సత్త్వుఁడైన భీముడు వాని నవలీలగాఁ దప్పించుకొనెను. భావిజీవితమున ధర్మజునికి భుజశక్తిగా నిలువఁబడు భీముఁ డరిబాధాకరుఁ డగునట్లు చిత్రించుట యెంతయో సమంజ సము. ఈ యర్థము దుర్యోధనుని పల్కులందును వ్యంగ్యముగాఁ గాననగును.

పృథ్వి : "ఉపాంశు వధఁజేసి మధ్యము మదోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి యే
నపాండవముగ సముద్ర వలయాఖిలక్షోణి మ
త్కృపాణ పటు శక్తి నత్యధికకీర్తినై యేలెదన్." —ఆది. ౯ 168.

అను మాటలలో- భీముఁడు ధర్మజ రక్షకుఁడై యున్నన్నినాళ్లాతఁడు బంధింపఁ బడడు; భీముఁడు లేనిచో ధర్మజునికి బలములేదు; అను తాత్పర్యముకలదు. అట్లని భీము దుద్ధతుఁడు, మదాంధుఁడు గాఁడు. అన్నమాట కడుగు దాటని వాఁడు. ఉపాంశువధా ప్రయత్నముగూర్చి క్రుద్ధుఁడై కౌరవతంత్రమును బట్ట బయలుసేయ నుత్సహించెడి భీమునిగాంచి ధర్మజుఁడు అర్థవంతమగు శాంతి వచనములతోఁ వారింప, నాత డౌచిత్యమెఱిగి మిన్నకుండినాఁడు. ఇందు సమ యోచిత కార్యనిర్వహణ దక్షత, పరస్పర స్నేహదృష్టి, క్షమ, దూరదృష్టి, ధర్మము, అప్రమత్తత అనెడి గుణములు ధర్మజాదులయందు గోచరించుచున్నవి.

భీముని యావేశము ధర్మజునిచే శాసింపఁబడుచు ధర్మపోషక మగుచున్నది. జీవితములో వారికి కష్టముల కిదియేనాంది.[1] ఇఁకముందును—ప్రతి యడుగడుగున నిట్టి విగ్రహ ప్రవృత్తి భీమాదులయందు, అట్టి నిగ్రహ ప్రవృత్తి ధర్మజుని యందును ప్రదర్శితములగుచునే యుండును.

విద్యార్థులుగాఁ గౌరవ పాండవులు ద్రోణునియొద్ద ధనుర్వేదము నభ్యసింప మొదలిడిరి. ద్రోణుఁడు శిష్యుల నందఱిని గాంచి,

> "అస్త్రవిద్యలు గఱచి నాకైన యిష్టమొగిని తీర్పంగ నిందెవ్వఁ డోపుననినఁ
> బాయ మొగమిడి కౌరవుల్ పలుకకుండి 'రేనుదీర్చెద'నని పూనె నింద్రసుతుఁడు"
>
> —ఆది. పంచ. 224.

ఇందు కౌరవులు మారు పల్కలేదని వ్రాసినాఁడుకవి. పాండవులలోను నలుగురుమాటాడలేదు. ఈ విషయముఁదెల్పకయే-అర్జునుఁడు మాత్రము గురుభక్తి దీపింప, పౌరుషము రాణింప "ఏనుదీర్చెద"నని వీరోక్తులఁ బల్కెనని వర్ణన. ఇట్లు చెప్పుటలో నొక సున్నితమైన రహస్యము కలదు. కౌరవులందఱొకటి. పాండవులెల్ల ఱొక్కటి. వీరిలో నెవ్వరేమన్నను అందఱనినట్లే; అర్జునునిమాట పాండవుల మాట యని తాత్పర్యము. దీనికొక ఆక్షేపణము రావచ్చును. కౌరవులన కురువంశ సంభూతులని యర్థముకదా! దానివలన పాండవులును కౌరవులే యగుదురని; అది సత్యమే యైనను, ఈ సందర్భమున నా పదము ధార్తరాష్ట్రులను అర్థమునఁ బ్రయుక్తము. ఈ యర్థముకానిచో పద్యరచనా విధానము మారవలసియుండును. అర్జునుఁడు దప్ప కౌరవులెవ్వరు నూటాడరైరియని యుండవలసినది. కావున నా యాక్షేపము పరాస్తమగుచున్నది.

ద్రోణుఁడు శిష్యులనెల్ల రావించి, నాకు గురుదక్షిణ నిండన నందఱుఁ మ్రొక్కి యెదుట నిలిచి మీకెద్ది యిష్టము సెప్పుఁడనిన నాతఁడు ద్రుపదునిఁబట్టి యిమ్మని కోఱుకొనెను. మఱుక్షణమున 'రాజనందనులెల్ల' రథారూఢులై ద్రుపదునిపై దాడి వెడలిరి. పాండవులు మాత్రము ద్రోణుని బరివేష్టించి పిరుందనరిగిరి. ద్రుపదునితోడి పోరులో నిలువనోపక 'కురుకుమారులు' (ఆది. ష. 76) పరాభూతులై పాండవులయొద్దకు పరతెంచినఁజూచి యర్జునుఁ డాచార్యునకు,

1. "తతో యుధిష్ఠిరో రాజా భీమ మాహ వచోఽర్థవత్
తూష్ణీంభవ నతే జల్ప మిదంకార్యం కథంచన
ఇతః ప్రభృతి కౌంతేయ రక్షతాన్యోన్య మాదృతాః
ఏవముక్త్వా......భ్రాతృభిస్సహిత స్సర్వైరప్రమత్తోఽభవత్తదా!"
—సం. భార. ఆది. 129. అ. శ్లో. 345.

ధర్మజునకు నమస్కరించి, పాంచాలునితోఁ బోరి గురుదక్షిణఁ జెల్లించెను. ఇచ్చట గమనింపవలసిన విషయమిది : కౌరవులావేశమున గర్వాంధులై ముందుఱికి యోడిపోయిరి. (ధార్తరాష్ట్రులను అర్థమున 'రాజనందనులు' 'కురుకుమారులు' అను శబ్దములు ప్రయుక్తములగుట గమనార్హము) పాండవులకు వారు గెల్వలేరను నమ్మకము గలదు. లేనిచో కౌరవులకు గురుదక్షిణను సాధించి యిచ్చిరను గౌరవ మబ్బునేమోయని కీర్తికై త్వరపడెడివారే. కాఁగా పాండవులైదుగురును గురుదక్షిణకొఱకు పాటుపడలేదు. యుద్ధమునకు వెళ్ళినది భీమార్జునులు మాత్రమే. ధర్మజ నకుల సహదేవులు ద్రోణు నొద్దనే కూరుచుండిరి. ఇదియేపాటి శిష్యధర్మము ? అను సంశయ మేర్పడును కదా ! కావుననే పాండవులంద ఱొక్కటి యనుట ! పై పెచ్చు అర్జునుఁడు యుద్ధమున కేగుచు, ధర్మజుని గురుతుల్యునిగా భావించి ప్రణమిల్లి పోవుట ! దీనివలన వ్యంగ్యముగాఁ బాండవనాయకత్వ మతనియందు ప్రతిష్ఠిత మగుచున్నది. ఇట్టి తత్త్వమే మహాభారతమంతట గోచరించును. ధర్మరథస్థుఁడు ధర్మరాజు, కవలు చక్రములు, హయములు భీముఁడు, సారథి అర్జునుఁడు, మార్గము వేదములు, వీరిదొక మహాప్రస్థానము. ఇట్లయినప్పుడు భీమార్జునాదు లాశ్రయముగా వ్యక్తమగు వీరరస మంతయు నాయకాశ్రయ మగు ధర్మవీరమునకు పోషక మగుచు శోభించు చుండునని భావము.

ధర్మరాజు యౌవరాజ్య పట్టాభిషిక్తుఁడై నలుగురు తమ్ములు తనను సేవించుచుండ పరమ ధర్మమూర్తియై ప్రజల మన్ననలకు బాత్రుఁ డయ్యెను. దుర్యోధనున కది కన్నెఱ్ఱ యైనది. అతఁడు తండ్రిని బోరుపెట్టి పాండవులను వారణావతీ నగరమున కంపున ట్లొనర్చినాఁడు. ధృతరాష్ట్రాజ్ఞను శిరసా వహించి కిమ్మనకఁ బయనమయినాఁడు ధర్మజుఁడు. అందాతని గురుభక్తి ప్రశంసనీయము. అది అన్యాయమని ఘోషించెడి ప్రజలతో ధర్మజు డిట్లన్నట్లు వ్యాసుడు :

"పితా మాన్యో గురుశ్శ్రేష్ఠో యదాహ పృథివీపతిః
అశంకమానై స్తత్కార్య మస్మాభిరితినో వ్రతమ్"

ధర్మదీక్షయం దాతని కున్న యుత్సాహము చిప్పిలుచున్న ట్లున్నదీ శ్లోకము. ఇట్టి రసవత్తర సంభాషణ మేలనో నన్నయ వదలినాఁడు. కారణ మేమైనను నన్నయ భారత విమర్శనమునఁ బఠిత యొక విషయము గుర్తుంచుకొనవలెను. మితహిత సత్యవాక్య పరిపాలకుఁడైన నన్నయగారి పాత్ర లన్నియు నాతని

ప్రవృత్తినే ముద్రించుకొని యుండును. అందు ధర్మప్రధానుఁ డగు యుధిష్ఠిరుఁడు పరమమౌనము దాల్చి కర్మశూరునివలె చేష్టాత్మకముగా ధర్మప్రవృత్తిని ప్రపంచించుచుండును. నన్నయగారి ధర్మజుని పాత్ర యందెంత మౌనముండునో అగంత గాంభీర్య మిమిడియుండు నన్నమాట! భావుకుని సూక్ష్మపరిశీలనముచే నది ప్రకాశిత మగుచుండును.

దుర్యోధనుఁడు కపటి యగుటచే నాయకుని గుప్తమంత్రములచేఁ జంప యత్నించినాడు. లాక్షాగృహ దహనాదు లిట్టివే. ధర్మము నాశ్రయించినచో రారాజునకర్థసిద్ధిలేదు. స్వార్థసహితమైన అర్థము ధర్మబద్ధమగుట కష్టము. త్యాగాదు లాతనియందు మృగ్యము. అందువలన నీర్ష్యాదు లధికమైనవి. అవి ధర్మముపై విజృంభించినవి. అట్టియెడ నాత్మరక్షణార్తై నాయకునకు బలోపాయము లావశ్యకమైనవి. అవిభీమాదులయందు తావేర్పరచుకొని ధర్మజుని బోదివి రక్షించినవి.

లాక్షాగృహమున దగ్ధులుగాక భీమరక్షితులై కుంతీ ధర్మజాదులు మహారణ్యగర్భమునకుఁ జేర్పఁబడిరి. హిడింబాసురు నాజ్ఞచే నతని సోదరి హిడింబ వారినిఁ జంపుటకు వచ్చి, పాండవసింహుఁడగు భీమునిగాంచి, వలచి ధర్మజాదుల వదలి తనను గైకొని సుఖంపుమని ప్రార్థించినది. భీముఁడు మనోహరాకృతి నున్న తత్కన్నియఁగాంచి మోహావేశుఁడుగాక ధర్మైకచిత్తముతో గురుజనరక్షణమే తన కర్తవ్యమని పలికి ధృతిని బ్రకటించెను. ఇట్లు :

"వినుజేల యెట్టి కష్టుఁడుఁ దన పురుషగుణంబు సెడఁగఁ దల్లిని దోఁబు
ట్టినవారి విడిచి రాగంబునఁ జపల స్త్రీసుఖంబు బొందునె చెపుమా ?

—ఆది. 6. 197.

హిడింబ మనసంతయు భీమునికిచ్చిన వనిత. ఎవ్విధముననైన మెప్పించి యతనిని బొందు నాత్రము దాల్చిన కామిని. అందువలననే కుంత్యాదులను బ్రబోధితుల నొనర్చినచో స్థలాంతరమునకుఁ గొంపోయెద నని మార్గాంతరముఁ జూపినది. భీమున కిది వీరధర్మముగాఁ దోపలేదు. రాక్షసాగమనభీతి, స్త్రీ సహాయాభ్యర్థనము అతఁడు కలలోనైన సహింపలేడు.

"అధికవీరుండు రక్కసుఁ డరుగుదెంచునని మనంబున భయమంది వనజనేత్ర!
వీరి సుఖసుప్తులై యున్నవారి నిద్ర సెడఁగ బోధింపనోప నా కడిమి వినుము"

"క్రచ్చఱ నొక్క రక్కసుఁడకాఁదు సురాసురులెల్ల నొక్కఁడై
వచ్చిన నీవ చూడఁగ నవార్య బలోన్నతిఁజేసి వారలన్

వచ్చి వధింతుఁగాక యిటువచ్చి శ్రమంబడియున్న నిచ్చట
న్మెచ్చుగు వీరిదైన సుఖనిద్రకు భంగము సేయనేర్తునే !"

అని తన బలోన్నతి తేటఁబడ నుగ్గడించెను. అందులకు హిడింబ తన యన్నను గూర్చి పల్కిన పల్కులు విభావములు, స్త్రీ సహాయమువలన నాత్మరక్షణ మొనర్చుకొను మను మాటలు ఉద్దీపనములు. శౌర్యధైర్యబలప్రతాపగురు జనరక్షాదు లనుభావములు; ధృతి గర్వాహంకారోత్సాహ మత్యాదులు సంచారి భావములు—వీనిచేఁ బుష్టిచెందిన యుత్సాహము బలసంబంధియగుటచే బలవీరమై గురుజన రక్షణ రూపమగుచు ధర్మబద్ధమగుచున్నది. హిడింబునితోడి యుద్ధ మీ వీరమునకుఁ బోషకము.

భీముఁడు హిడింబను తిరస్కరించి చంప నుంకించినాఁడు. స్త్రీవధ పేరు వినుచునే ధర్మజుఁడు చివుక్కుమనినాఁడు. అది ధర్మ విరుద్ధము. వెంటనే తమ్ముని వారించి యిట్లు ప్రబోధించినాఁడు.

"వధకు నర్హుఁడై వచ్చిన వానిఁజంపి తదియు ధర్మువ యిదిచాల నబల దీని
కలుగఁజన దాత్మరక్షకు నగ్గలంబు ధర్మరక్షయ యుత్తమధార్మికులకు"

"ఆపద యయినను ధర్మువ ప్రాపుగ రక్షింపవలయుఁ బరమార్థము ధ
ర్మాపాయమ ధార్మికులకు నాపద జన్మాంతరమున ననుగతమగుటన్."

—ఆది. 6. 200. 201.

భీమాదులు మదేభములవలె నావేశముచే ధర్మ లతాసంచయము నెప్పుడైన ధ్వంసము జేయఁబూనవచ్చును. కాని ధర్మజుని ధర్మాంకుశము వారిని సన్మార్గ మున నడిపించెను.

ఏకచక్రపురమున వసించునెడ పాండవులుండు బ్రాహ్మణుని యింట నొక్క మహాపద సంభవించినది. బకాసురుని కాహారముగా నాయింటి వారిలో నొక రేగవలసి యుండుటచే వారందఱు దుఃఖించుచుండిరి. వారి కేర్పడిన యాపదఁ దీర్చుటకై కుంతిచే బోధితుఁడై భీముఁడు దయా పూరితాంతః కరణుఁడై

"ఎఱిఁగి నాకుఁ జెప్పుమిది యేమి యెవ్వరి వలన నింతయయ్యె వగవనేల
యెంతకడిఁదిదైన నిదియేను దీర్చి యీ విప్రునకుఁ బ్రియంబు విస్తరింతు"

నని యుత్సహించెను, (ఆది. 6–246). భీముని కలరూపెరింగిన ధర్మజుఁడు కుంతీదేవి కారుణ్యబుద్ధికి, బ్రాహ్మణభక్తికి, ధర్మచిత్తమునకు సంతసిల్లి తానును భీమసేనుని నియోగించెను. భీముఁడు బ్రాహ్మణార్థమై తానే

యానాఁడాహార నెపమున రాక్షసునిఁ జేరి సంహరింప నిశ్చయించి, వానిఁ గాంచి

"ఇంచుకయేని పాపమున కెన్నడు రోయక యెల్లవారి బా
ధించి మనుష్య మాంసములు దించును గ్రొవ్వితి వానినెల్లఁ గ్ర
క్కించెద నీ మదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలుఁబ్రోలి కేఁ
గించెదఁ జక్కనై నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా!"
—ఆది. షష్ఠా. 297.

అని యాతనిపై లంఘించి ద్వంద్వయుద్ధముద్ధతముగా నొనర్చి ముష్టిఘాతముల వానిఁబొడిచి చంపెను. భీముని యుత్సాహమున కాలంబనము బకాసుర విజృంభణము. అతనిపలుకు లుద్దీపనములు. ధైర్యాద్యనుభావములతో నదివ్యక్తమై, ఉగ్రామర్షగర్వోత్సుక్యాది సంచారులలోఁ బరిపుష్టిఁజెంది యుద్ధవీరముగాఁ బరిణతిఁగాంచినది. ఇది బ్రాహ్మణ రక్షణార్థమైన దయయందతర్లీనమగుటచే దానికిది అంగము, పోషకము. అయ్యది ధర్మాత్మకమగుటచే ధర్మజునకు సంతుష్టి హేతువైనది.

ద్రౌపదీస్వయంవర సమయమున నర్జునునియుద్ధవీరము సుందరతరము. సకలరాజసమూహములు మత్స్యయంత్రభేదనసమర్థములు కాకపోగా బ్రాహ్మణ వేషధారి యగు నర్జునుఁ డవలీలగా దానిఁ ద్రుంచి ద్రౌపదిచేతి పూదండఁ గైకొనుటఁ గాంచి కౌరవేంద్రాదులు మత్సరగ్రస్తులై ద్రుపదునిపై కుటిక-

మత్త: "ఏల రాఁబనిచెన్ మహీశులనెల్లఁ జుట్టమపోలె ము
న్నేల సత్కృతిసేసె నిందఱ కిమ్మహారథులుండఁగా
న్నేల కన్యకనిచ్చె విప్రున కిందు నేఁడు శఠుండు పాం
చాలుఁ డిప్పుడు వీని నిర్గతసత్త్వుఁజేయుద మాజిలోన్" —ఆది. 7. 190.

అని రణోత్సాహముఁ బ్రకటించుచుండ బ్రాహ్మణమధ్యమునుండి రంగమధ్యమున దూకి సవ్యసాచి నవ్వుచు,

"కడఁగి మదీ యాస్త్రము లనియెడు వటుమంత్రముల నిప్పుడీ నృపరిపుల
నృడిఁది విషాహుల దర్పం బుడిగించెదఁ దొలఁగి చూచుచుండుఁడు మీరల్"
—ఆది. సప్త. 198.

అని విజృంభించినాడు. శత్రువీరుల మర్దించి కర్ణునిడీకొని విముఖునొనర్చినాఁడు. అతని పరాక్రమమునకు మెచ్చి కర్ణుఁడు:

"నా యెదురఁ జక్కఁగనై యని సేయఁగ భార్గవునకును శచీవరునకుఁ గాం
తేయుఁడగు విజయునకుఁ గా కాయత భుజశక్తి నొరుల కలవియె ధరణిన్?"

"నీ వప్రాకృతబలుఁడవు నీ విక్రమమునకు విల్లునేర్పునకు మహీ
దేవకులోత్తమ! మెచ్చితి నావుడుఁ బార్థుఁడు గర్ణునకు నిట్లనియెన్"

మధ్యాక్కర : "ఏను నీ చెప్పిన వారిలోపల నెవ్వఁడఁగాను (!)
గానీన! సర్వ శాస్త్రవిద్యలఁ గడుఁ బ్రసిద్ధుండ
భూనుత బ్రహ్మతేజోఽధికుఁడ నిన్నుఁ బోరిలో నోర్వఁ
గా నున్న వీరుండ నొండుదక్కఁ లోఁగక చక్కనిలుము."
—ఆది. సప్త. 200-202.

అని వెన్నంటితరుమ కర్ణుఁడు బ్రహ్మతేజ మజేయమని వైదొలఁగి పోయెను. అర్జును నోట 'ఎవ్వడగాను' అని పల్కించి అతని నసత్యదూరుని గాక నన్నయ రక్షించినాఁడు. నిశ్చయార్థకముగా గాక నాశ్చర్యార్థకముగా నూదిపల్కినచో 'నేనందఱను' అను అర్థము కల్గును. లక్షణార్థముఁబట్టి అర్జునుఁడు భార్గవుని తోడను, ఇంద్రునితోడను బలతేజసాదులలో తుల్యుఁడని యేర్పడుచున్నది. 'నిన్నుఁబోరిలో నోర్వగానున్న వీరుండ' నని యనుటలో నాతఁడు కర్ణుని బోరిలో నోడించుటకే జీవించియున్నట్లు ధ్వనించుచున్నది. లాక్షాగృహ దహనాది కౌరవ కుతంత్రముల బారినుండి తప్పించుకొని బ్రతికియున్నందుల కదియే ఫలమని తాత్పర్యము! అర్జునాశ్రయమైన యుద్ధవీరము భావిపాండవ వివాహహేతువై తారసిల్లి గార్హస్థాశ్రమ ధర్మసాధకమై వరలుచున్నది.

ద్రౌపదీ వివాహ విషయము దైవికమైన ధర్మసూక్ష్మమునకు సంబంధించినది. త్రికాలజ్ఞులగు మహర్షులకుగాని యవగాహనముగానిది. ధర్మజుఁడు స్థితప్రజ్ఞుఁడై దైవనియోగమున నిట్లు ధర్మప్రతిపాదన మొనర్చెను :

"గురువచనస్థితి మన కేగురురుకును నిది పత్నిగాఁదగుంగావున ని
త్తరుణిని బరిగ్రహింతము తిరముగ గురువచనమొండు దెఱఁగేలయగున్"

ఆ మాటలలో నతనియందుగల అవితథ మాతృవచనము లందలి గౌరవము, ధర్మానురక్తి గోచరించుచున్నది. వ్యాసభట్టారకుఁడు పాండుభూపాల తనూజపంచక మాలతాంగియందు పంచశరాహతి నొందుటకు కారణము నిరూపించి ధర్మత్వము సాధించినాఁడు. అది ధర్మరాజు ధర్మవీరమునకుఁ బోషకమై పాండవాభేదమును ప్రతిపాదించుచున్నది.

ధర్మజుఁ డింద్రప్రస్థపురమున నర్ధరాజ్యమునకు పట్టాభిషిక్తుడై సుఖముగ రాజ్యము సేయుచుండ నారదుఁడేతెంచి స్వర్గలోకవాసియైన పాండుక్ష్మాపాలు నభీష్టానుసారము రాజసూయము సేయఁ బ్రోత్సహించెను. పితృదేవతాప్రీతియు, విపులకీర్తియుఁ గల్గించు నా యజ్ఞము ధర్మజుఁడు సేయ సంకల్పించెను. అది చక్రవర్తియగు క్షత్రియున కుచితధర్మమై యాతని చరిత్రమునకు వన్నె తెచ్చినది.

రాజసూయాధ్వర ప్రవర్తకుఁడగు యుధిష్ఠిరుఁడు భీష్మ ప్రబోధితుఁడై శ్రీకృష్ణున కర్ఘ్యమీయ నుద్యమించెను. ఆదినారాయణుఁడును, యజ్ఞపురుషుఁడును నైన కృష్ణుఁడా పదవికిఁ దగినవాఁడని అనల్పతపోనిరూఢి పే నిరూపించి కురుపితామహుఁడు తన్మాహాత్మ్యమును బ్రకటించెను. శిశుపాలుఁడు దానిని సహింపఁ జాలకపోయెను. కృష్ణుఁడాతని జన్మశత్రువు. గోపాలుఁడు యాదవుఁడనియు, కష్టచరిత్రుఁడనియుఁ బూజార్హుఁడు కాఁడనియు, కురువృద్ధులు, జ్ఞానవృద్ధులు మూగియున్న యాగసభలో నోరు క్రొవ్వి శిశుపాలుఁడు శ్రీకృష్ణు నధిక్షేపించి, అతనిని బూజించు ధర్మజ భీష్ములఁ దృణీకరించెను. శిశుపాలుఁడు తాను నమ్మినదే, తనకు దెలిసినదే ధర్మమని ప్రతిపాదించుచు, ఎదుటివారిది ధర్మవిరుద్ధమని వాదించెను.

"కడుకొని ధర్మతత్త్వ మెఱుగంగ నశక్యము; ధర్మబాహ్యు ని
న్నొడఁబడ నిష్టుఁడై కఱపి, యుత్తములుండగ వాసుదేవుఁడ
జ్ఞునకుఁ బూజయిమ్మని విచార విదూరుఁడు భీష్ముఁ డెంతయున్
వెడఁగుఁదనంబునం బనిచె; వృద్ధుల బుద్ధులు సంచలింపవే."

—సభా. 2, 9.

అనియు, 'దాశార్హుఁడు పూజార్హుఁడు గా'డనియు, పెద్దలుండ పిన్నలఁ బూజించుట ధర్మము కాదనియు నాతని మతము. ఇది ధర్మతత్త్వము తెలియని మాటలు, భీష్మవచనము లర్థముకాక మత్సరబుద్ధితో ననిన పల్కులు, "కడుకొని ...... నశక్య"మను మాట సద్ధర్మమును గాంచి, అధర్మమని శంకించెడి అజ్ఞానినోట సాభిప్రాయముగా ననుసంధింపఁబడినవి. తానన్నమాట తనకే తగిలివచ్చునన్న వివేకము లేదాతనికి. ధర్మజుని సభలో ధర్మస్థాపన మాతని యత్నము. అది అనధికారి చేతఁబడి హాస్యాస్పదమైనది. పురుషోత్తముని తత్త్వ మెఱుఁగక, భీష్ముని వ్యక్తిత్వ మరయక, ధర్మజుని ధర్మనిష్ఠ దెలియక వారిని బరుషోక్తులతో నిందించుటచే నతఁనియత్న మసమంజసమైనది.

ఇట్టి మూర్ఖుని నైతము ననునయించు ధర్మజుని చరిత్ర మనింద్యము, నిష్కళంకము. అతిథిగా యాగమున కరుదెంచి, కుపితుఁడై వెడలుచున్న శిశుపాలుని సమాధాన పరచుట యజమాని బాధ్యత. కావుననే అతనిని ప్రియవచనముల నిట్లనుట !

"భూరి గుణోన్నతులనఁదగు వారికి ధీరులకు ధరణివల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహాదారుణమది విషముకంటె దహనము కంటెన్"

అని మందలించుటతో నుపక్రమించినాడు. ఇంద్రియ నిగ్రహత్వము, సహనము ధర్మజుని అనుభావములు. చెప్పుమాటలెంత సరళములుగా నున్నవో అంత నిశితములు. సున్నిత హృదయుఁడైనచో వినువాని నవి శల్యములై నేచఁ గల సమర్థములు. ఇట్లు మాట్లాడుట కార్యసాధకుని లక్షణము. ప్రత్యేకముగా క్షత్త్రియునకు నైజము (చూడు. ఆది. పు. 101) కావుననే "ధరణి వల్లభులకు వాక్పారుష్యము చన్నె !" యని అనుట! మహాపదలయందును ధృతిఁ దాల్చువాఁడు ధీరుఁడు. ఇచ్చట వాక్పారుష్యము ధృతి విహీనతను, అవివేకమును, తొందరపాటును, అసహనమును తెల్పుచున్నదని భావము ! అధిక సంఖ్యాకములగు గుణములచే నగ్రగణ్యులని కీర్తింపబఁడు వారికి వాక్పారుష్యము కూడదఁట ! అనగా నట్టి పారుష్యముఁ బ్రకటించినచో నన్ని గుణములు నాతనియందు రాణింపవని భావము; నిరర్థకములగునని యర్థము. 'అనఁదగు'వాఁడనుటలో నా గుణములు ప్రయత్నసాధ్యము లనియు, ఉన్నవాఁడు కోల్పోయినచో నపకీర్తిపాలు కాఁగలడనియు నూహ్యము. విషముకంటె-దహనము కంటె ననుటలో విఱుగుడు పెట్టినచో విషమువలె తగ్గుననియు, లేనిచో నిప్పువలె దహించి బూదిచేయుననియు బెదిరింపు కలదు. వ్యంగ్యముగా నాతని భవిష్యత్తును ధర్మజు డా మాటలలో ధ్వనించెను. ఇంత నిగూఢముగా మాట్లాడినాఁడు ధర్మరాజు. ఆపై సభాధర్మమును సమర్థించినాఁడు :

"ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు లో
కాది త్రిలోక పూజ్యుఁడని యాత్మనెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుక్తముకా కిదియేమి దోసమే"

—సభా. 2. 18.

ఇందు బ్రహ్మ, పితామహశబ్దము లేకార్థస్ఫూర్తి కల్గునట్లు సంధించుట కవి చమత్కారము. బ్రహ్మ జెప్పినమాటయే భీష్ముఁడు చెప్పెనని తాత్పర్యము.

సృష్టికర్తయే ఆదిపురుషుఁ డని వెన్నుని పేర్కొనగా నంతకన్న ఆద్యుఁడెవ్వఁ డను ప్రశ్నయే యుండదనియు, అది "ఆత్మ నెఱింగిన" గాని తేటపడదనియు ధర్మజుని భావము. ధర్మజుని బోధన లనధికారియగు శిష్యునికిచ్చు విద్యలవంటి వైనవి. అతని ధర్మోత్సాహమున శాంతి అంగముగా భాసించినది. కావున వీరులయందు సాధారణముగా గానవగు నహంకారాదు లతఁడంతగా ప్రకటింప లేదు. విభావానుభావౌచిత్య మిందరయుటలో నీ సత్యము మఱువరాదు. సహదేవుని తత్త్వమిందుకు విరుద్ధము. ధర్మజాదులవలె కృష్ణార్చనము ధర్మ మని తెలిసినవాఁడే కాని; అతని కన్నకున్న సహనము, శాంతి లేవు. ఆవేశ పరుఁడు, బలాఢ్యుడు నగుటచే తదుచితమైన భీకర ప్రతిజ్ఞచేసి దేవతల మన్ననల నందినాఁడు.

"ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీనికిం దొడం
బడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై
నిడియెదనంచు దా జరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై".

—సభా. ద్వి. 30.

తామసము నణచుటకు సత్త్వము విఫల మగుచుండ, రజస్సు ప్రకోపించి బెదిఱించి నిలువరించినది. సహదేవుని బలవీర మిందు సువ్యక్తము. శిశుపాలాదు లాలంబన విభావములు, తద్భాష లుద్దీపనములు. స్థైర్య, ధైర్య, శౌర్యాధిక్షే పాదు లనుభావనములు. ఉత్సాహ గర్వోగ్రామర్షాదులు సంచారి భావములు. చరణ మెత్తుట యనెడి యాంగికాభినయ మాతని పౌరుషమును వ్యక్తపరచు చున్నది. సభాసదులలో వ్యాపించిన భీతి సహదేవుని వీరమునకు ఫలితమై తత్పో షక మగుచున్నది. ఆపై పద్యము నందలి (సభా. ద్వి. 31) దేవతల మెప్పు కోలు, సభాసదుల విస్మయము, నారద సంతోషము దీని కంగములే. ఇట్లు సహదేవాశ్రయమైన బలవీరము ధర్మజుని ధర్మవీరమునకుఁ బోషకము.

ఈ సన్నివేశమునందు వర్ణితములైన శిశుపాలాదుల యుద్ధోత్సాహము, భీముని రౌద్ర విస్ఫూర్తి, శ్రీకృష్ణ శిశుపాల పరస్పరోపాలంభనము, శిశుపాల వధ మొ. ఘట్టములందు వీరరసస్ఫూర్తి కల్గి ధర్మజసవనరక్షణలక్ష్యప్రధానమై ధర్మబద్ధమై సొంపు నింపుకొనుచున్నది.

ద్రౌపదీ వస్త్రాపహరణ కథా భాగమునందు ధర్మరాజుని ధర్మవీరమే ప్రధానముగా నాస్వాద్యమానమగు చున్నది. దుర్యోధనుఁడు పాండవ సంపదఁ

గాంచి యీర్ష్యచే దానిని గపటోపాయమునఁ గబళింప యత్నించినాఁడు. అట్లగుటచే నాతని యుత్సాహమర్థ సాధన ప్రధానమే యయి వీరరస నామ యోగ్యత నొందుటలేదు. విదురుఁడు మాయాద్యూతము ధర్మ విరుద్ధమని పల్కినప్పుడు,

"పరుల సంపద సుఖోపాయ బలంబునఁ
గొనుట భూపతులకు గుణముకాదె" —సభా. ద్వి. 188.

అని దుర్యోధనుఁడు తన యత్నము నీతి సమ్మతమని సమర్థించుకొనినాడు. ఇందు ప్రతినాయకునిది ఐహికార్థ ప్రధానమైన ప్రవృత్తియని స్పష్టము. ఇఁక నాయకునిది ఐహికాముష్మిక ధర్మ ప్రధాన ప్రవృత్తి అనవచ్చును. మొదటి యుత్సాహ ముత్కటమై రసాభాసమగును. రెండవది ధర్మవీరమగును.

ధర్మరాజు జూదమున కొడఁబడుటకు ధృతరాష్ట్రి దుర్యోధనుల యాహ్వానము, శకుని నిష్ఠుర వచనములు హేతువులు. జూదము ధర్మవిరుద్ధమని పల్కిన యుధిష్ఠిరుని గాంచి శకుని "జూదంబున కీ వోడుదేని యుడుగు' మని సగర్వముగాఁ బల్కెను. ఇచ్చట ధర్మజున కభిమాన మడ్డము వచ్చినది.

"బలవద్యూతార్థముగాఁ బిలువంబడి మగుడనగునె పెక్కులు పలుకుల్
పలుకంగనేల యని యత్యలఘుఁడు ధర్మజుఁడు జూదమాడ గడంగెన్"
—సభా. ద్వి 172.

మానసంరక్షణార్థమై యత్నించి ధర్మజుఁడు లౌకికమగు క్షాత్రధర్మమును బ్రతిష్ఠించినాఁడు. కుపితుఁడైన భీమునితో నర్జునుఁడు తద్ధర్మ నిరూపణ మొనర్చి చూపినాఁడు.

"ధర్మ తనూజుండు ధర్మువు దప్పిన ధరణీతలంబెల్లఁ దల్లడిల్లుఁ
దగిలి సుహృద్ద్యూత ధర్మయుద్ధములకుఁ బరులచేఁ బిలువంగఁబడి విభుండు
గడగక విముఖుండుగాఁ జనదని శుభ క్షాత్ర ధర్మంబు లోకంబులందు
నిలిపెఁ దా నిది పతి నేరమియే ? దైవ వైపరీత్యంబైన వనరఁ దగునె ?
గురుల ధర్మపరులఁ గోపించి ధీరు లతిక్రమింతురే తదీయ నిత్య
ధర్మగౌరవం బధార్మికులగుచున్న పరులచేతఁ జెఱుపఁబడియె నిట్లు"
—సభా. ద్వి. 224.

కురుసభలో కౌరవుల దౌష్ట్య మింతింతయని లేక పెచ్చుపెరిగినది. భీష్మాదులు వారించుటకది యదనుకాదని మిన్నకుండిరి. ఏకవస్త్రయు, రజస్వలయునైన ద్రౌపది దుశ్శాసనాకృష్టయై సభ కీడ్వంబడినది. ఆమె యాక్రందించుచు

సభాసదులను ధర్మభిక్ష నభ్యర్థించినది. ఆమెకు సమాధానమిచ్చు ధర్మజ్ఞుఁడందు గానరాలేదు. వికర్ణుఁడు పిన్నవాఁడయినను సమయోచితముగాఁ బెద్దలనుంద లించుచు తానంతట తానే ముందుకు వచ్చి "నే నిందు ధర్మనిర్ణయంబు సేసెద నెల్లవారును వినుండు జూదంబును వేటయుఁ బానంబును బహు భక్షణా సక్తియు నను నాలుగు దుర్వ్యసనంబులం దగిలిన పురుషుండు ధర్మువుందప్పి వర్తిల్లునట్టి కృత్యంబులు సేకొనందగవు. కితవాహూతుండై వ్యసనవర్తియయి పరాజితుండయిన పాండవాగ్రజుండు పాండవులకందఱకు సాధారణధనంబైన పాంచాలిఁ బణంబుఁ జేసెంగావున యధర్మవిజిత, యక్కోమలి యేకవస్త్ర నిట దోడ్కొనితెచ్చుట యన్యాయం"బని యుద్ఘాటించెను. దానిని ఖండించుచు కర్ణుఁడు 'ద్రౌపది బంధకి యనంబడును గాన' వివస్త్రఁజేసి తెచ్చినను ధర్మ విరోధంబు లేదని నిరూపించి వ్యంగ్యముగా దుర్యోధనునికి వస్త్రాపహరణ భావము నందించినాఁడు. పాండవులకును ద్రౌపదికిని ననంతావమాన హేతు వగు నా కార్యమున కుద్యమించిన దుశ్శాసనునిఁ గాంచి భీముఁడు క్రుద్ధుఁడై

> "కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
> ద్ధురుఁడై ద్రౌపది నిట్లుసేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
> కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
> ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్"
>
> —సభా. 2 233.

"ఇట్లు సేయనైతినేని పితృపితామహుల గతికిం దప్పినవాఁడ నగుదు" నని పల్క సభాసదులు భయాశ్చర్యముద్ర వహించిరి.

విదురుఁడు ద్రౌపది యడిగిన ధర్మప్రశ్నమునకు సమాధానమిచ్చుట న్యాయమని సభకు ప్రబోధించినాఁడు. ద్రౌపది తాను దాసియౌనో కాదో నిరూపింపుఁడని సభాసదులను రుదితయై ప్రశ్నించినది; అట్టియెడ నక్కోమలిఁ జూచి నవ్వి :

> "తరుణి! యేవురకంటె నొక్కరుండ భర్త యగుటలగ్గు జూదంబున నాలినోటు
> వడని వానిఁగాదగు భర్త బడయుమింక ననుచురాధేయుఁ డుల్లసమాడె నంత"
>
> —సభా. 2. 246.

"భర్త" యను పదములోని రాజార్థమును గ్రహించి దుర్యోధనుఁడా విభీత హారిణాక్షిని తన రమ్య పృథూరుతలము నెక్కరమ్మని సైగఁజేసెను. ఇది యధర్మమునకుఁ బరాకాష్ఠ.

క్రూరులై యింతలు సేయు కౌరవులఁగాంచి ధర్మజుఁ డొక్కపలుక్కాడఁడు. అది క్షమాభావముయొక్క సమగ్రోత్కట రూపకల్పనము. భీముఁడు మాత్ర మాక్రోశముఁ బట్టలేక అంకెలువేసెను ఆయుధములవైపును, ధర్మజుఁడవైపును జూచుచు నిప్పుల నురుముచుండెను. సర్వజన భయానక క్రోధావేశుండయి

"ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరు దేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వార మదీయబాహు పరివర్తితచండ గదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్"
—సభా. ద్వి. 249

అని భీషణప్రతిజ్ఞఁ జేసెను. భీమునియందు రౌద్రము కార్చిచ్చువలె ప్రజ్వలించి వ్యాపించినది. కాని అగ్రజుని మొగము చూచుచు నిలిచిపోయినాఁడు. భీముని రోషము మానవసహజము, పరిస్థితిపరిపుష్టము; దాని నణచుకొనవలెనన్న యెంతయో ధృతి, శమదమము లవసరము. అట్టివి ధర్మజునియందు మూర్తీభవించినవి. అతని తమ్ము లతని శాసనమును దాటరు.

ఈ ఘట్టమున భీముఁ డొనర్చిన ప్రతిజ్ఞలు మూఁడు. "మొదటిసారి తాను ప్రతిజ్ఞచేసెనుగాని వెంటనే కౌరవులను చంపునూహ వెలువరుచనే లేదు. అప్పు డాతని కా యూహలేదు. ఆ యూహ రెండవసారి కలిగెను. దానిని భీష్మద్రోణవిదురులు వారించినమాత్రతో సరిపోయినది. మూడవ దన్నగారే వారించెను. చేయి వలదన్నట్లు పైకెత్తెను. ధర్మరాజు చేసిన దింతమాత్రమే. తొడలు విరుగగొట్టెద నన్నప్పు డన్నగారి యంగీకారమున్నదో లేదో యని తెలిసికొనుట కతనివంక చూచుచుండెను. శత్రువులంతటి యపకృతి చేసినప్పుడు, తన కంతటికోపము వచ్చినపు డన్నగా రంగీకరించునా లేదా యన్న విచారణ విచిత్రముగానున్నది! ఆ యన్న యదుపెట్టిదో! అతని నాయకత్వ మెట్టిదో! ఆ తమ్ముల యనుయాయిత్వ మెట్టిదో? మనసుపట్టని యొక శైష్యోపాధ్యాయిక వ్యంగ్య మగుచున్నది" అని కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.[1]

"ద్రౌపదీసంపాదిత రాజ్యానుభూతియందు అధమత్వమున్నదని భీముఁడు మిక్కిలి కోపించెను. ధర్మరాజు వారించెను! ధర్మరాజునకు మాత్ర మీ యధమాధమబుద్ధి లేదా? ఎందుకు వారించెను? ధర్మరాజుయొక్క ధర్మస్వరూపము

1. నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి-పుట. 156

చాల నిగూఢమయినది. ధృతరాష్ట్రు డిచ్చుటచేత రాజ్యమిప్పుడు వచ్చినది. పాండవులకు మఱల స్వాతంత్ర్యము వచ్చినది. తత్పూర్వము తమమీఁద తమకు, తమ యాయుధములమీఁద తమకు తమ వర్మవరూధమ్ములమీద తమకు నధికారములేదు. అందుకనియే ద్రౌపది యడిగిన రెండవ వరము :

"నెమ్మిని ధర్మజు నలువురు తమ్ములు తమ యాయుధములు తమ వర్మ వరూ
ధమ్ములయుతోడ సకల హితమ్ముగఁ బాయంగవలయు దాస్యము వలనన్."

అనియున్నది. అందుచేత నిప్పటి భీముని పౌరుషము, ఆయుధ ప్రయోగము చేయఁగల సామర్థ్యముకూడ స్త్రీ విత్తముక్రింద లెక్కఁగట్టఁ బడవలయును. రాజ్యసంపద ననుభవించుటకు స్త్రీ విత్త దోషమెంత యున్నదో తమ పరాక్రమము ప్రకటించుటకు స్త్రీ ప్రసాదకృత సామర్థ్యమను దోసమంతియే యున్నది. ఇందుచేత ధర్మజుఁడు కరతలమ్మున వారించెను. తొడలు విరుగగొట్టెద నన్నప్పుడు పరాక్రమము ప్రదర్శించుటకు వీలేలేదు. అందుచేత ధర్మరాజాతనివంక నే చూడలేదు."[1] భీముని భీషణ రౌద్రమంతయు నిట్లు ధర్మజుని క్షమా ప్రధానమగు ధర్మప్రవృత్తిచే ననుశాసింపఁబడిన దిచ్చట!

ద్వితీయ మాయాద్యూతమునందు నిట్టి తత్త్వమే గోచరించును.

"ధర్మతనయు పిఱుఁదఁ దమ్ములు నలువురు
నరుగు చుండి తత్సభాంతరమున
జనులు వినుచునుండ సంభృత క్రోధులై
పలికి రధిక పరుషభాషణముల." —సభా. ద్వి. 294.

భీమాదులు నల్వురును కృతప్రతిజ్ఞులై యన్నవెంట యడవికి నడచిరి. (సభా: ద్వి. 295-299) ఇందును ధర్మజుఁడేమియు మారు వల్కఁడు. దుఃఖావేశమందుమా! తుల్యావస్థ యందున్న తమ్ములు ప్రతిజ్ఞలు సేయుచున్నారే! కావున నది క్షమా ప్రధానుఁడగు ధీరుని లక్షణమే యని చెప్పుట యుచితము. "వికార హేతావపి విక్రియంతే, యేషాం నచేతాంసి తఏవధీరాః." ఇట్టి యుధిష్ఠిరుఁడు తమ్ములను శాసించుచు నింద్రియముల శాసించుచున్న యంతఃకరణము వలె గోచరించును.

పాశుపతాస్త్ర సంపాదనమునం దర్జునుని తపోవీరము సర్వాంగ సుందరము. మోక్ష పురుషార్థ సాధనాత్మకమైన తపమునకు విషయవిదూరమగు శమము స్థాయిభావమగును. కాని అర్జునుఁడర్థ పురుషార్థి యిచ్చట ! అది ధర్మ

1. నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి. (పుట 158—159)

బద్ధమగుటచే వీరరస నామయోగ్యత నొందుచున్నది. భీష్మాదులు పుంభావ ధనుర్వేదసారులు. వారి నెదుర్కొని జయముం బొందవలెనన్న దైవికములైన శస్త్రాస్త్రములు పాండవుల కత్యంతావశ్యకము. కావున నర్జునుఁడు ధర్మజ ప్రబోధితుఁడై యోగవిద్యను గ్రహించి, యింద్రకీలమునకుఁ బయనమయ్యెను. ద్రౌపది "యరి జయార్థమరుగు నాతని యుత్సాహ మెఱిఁగి యిట్టులనియె" నని నన్నయ (అరణ్యా. ప్ర. 283). ఆ వర్ణనలోనే కవి స్థాయిభావము వ్యంగ్యముగా సూచించి నట్లైనది.

తపోవీరమునకు యుద్ధోత్సాహమంగమముగా సంధింపఁబడిన యపూర్వ ఘట్ట మిది. "వీరుఁడు యోగవిద్యను, విల్లును దోడుగ నింద్రకీలమన్ భూరి నగంబుపైఁ గడఁగి పోవగ" (అరణ్యా ప్ర. 287) అను వాక్యమున నీ భావము ధ్వనించుచున్నది. తపస్వికి అచంచల దీక్ష, సమాహిత బుద్ధి, నైష్ఠికవర్తనము, భక్తిప్రధాన గుణములు. అవి పరీక్షితములై నాయకు నందు ప్రతిష్ఠితము లైనచో నుచిత విభావత్వము నిరూపితమగును. అందువలననే యింద్రుఁడు వృద్ధబ్రాహ్మణవేషమున నర్జునుని బరీక్షించెను. పుణ్యలోకములు, దేవత్వము, సర్వకామములు నాతని కిత్తునని శతమఖుఁడు ఆశపెట్టెను. కాని, అర్జునుఁడు

> "దివిజనాథ! నా కవియెల్ల నేటికిఁ బరమాస్త్ర లాభంబ కర మభీష్ట
> మరులుసేసిన మహాపరిభవక్లేశంబు వాపంగ నోపక యేపుటడవి
> నురు దుఃఖితుల సహోదరుల నందఱఁ బెట్టి చనుదెంచి మిన్నక చనినన్నుఁ
> దగువారు జగములోఁ దెగడరే."

—అరణ్యా. ప్ర. 294.

అని స్వీయ దీక్షాపాటవమును ప్రదర్శించి తపస్సునకు యోగ్యుఁడని నిరూపించు కొనినాఁడు.

అర్జునుని తపస్సడుగడుగునకు తీవ్రరూపముఁ దాల్చినది. కవి యిచ్చట తపోవీరుని అనుభావవర్ణనము, తపః ప్రభావ వర్ణనము నొనర్చి పార్థునియందు (తాత్పర్యశక్తితో) వీరరసస్ఫూర్తి యగునట్లు మెళకువతో రచించినాఁడు. ఋషుల యందును, సర్వ జీవులయందును అద్భుతము సంధింపఁబడుట వీరరస పోషకమగుచున్నది.

అర్జునుఁడు త్రికరణశుద్ధిగా నీశ్వరుని నమ్మి 'నిరంతర త్రిరాత్రోపవాస మున నొక మాసమును, ద్విగుణిత త్రిరాత్రోపవాస వ్రతమున రెండవ మాస మును, పక్షోపవాసంబున తృతీయమును, ఊర్ధ్వబాహుఁడై యేకపాదాం

గుష్ఠాగ్రమున నిలిచి వాయుభోజనము జేయుచు చతుర్థమాసమును, తపం బొనర్చె'ననుటలో నాతని యనుభావము లుత్కట నైష్ఠికోత్సాహమును వ్యక్తము చేయుచున్నవి. ఋషు లీ తపమునకు విస్మయమంది ఈశ్వరుని పాలికిఁ జని యిట్లనిరి :

> "భూరిబలుండు పాండవుఁ డపూర్వ తపం బొనరించుటం దదీ
> యోరు తపః ప్రభావ దహనోత్థిత ధూమచయంబు లంబుదా
> కారములై వనాంతరముగప్పె జగత్త్రయనాథ తత్తపో
> భారము సర్వజీవుల కపార భయావహ మద్భుతంబిలన్."
>
> —అరణ్యా. ప్ర. 298.

ఇందు తపోవీరమున కాలంబనము కిరీటి. తత్ఫలితములైన భయవిస్మయాదుల కాలంబనములు సర్వజీవులు. ఈరెండునుతాదాత్మ్యముతో ననుభవించిన విజ్ఞులు ఋషులు— పఠిత హృదయ సన్నిహితులు. ఇట్లు జనకరసమును నాయకుని యందును, జన్యరస మితర పాత్రములందును వర్ణించి, జనకరస విస్తృతాకార నిరూపణ మొనరించి, పఠితలకు రసాస్వాదన సౌలభ్యముఁ గల్పించుట యొక కావ్యరచనాశిల్పమని వెనుక పేర్కొనఁబడినదికదా!

కిరాతాకృతిలో నున్న యీశ్వరునితో సవ్యసాచి యుద్ధమునకు దిగు టకు మృగయాధర్మము కారణము, "నాయేసిన మృగంబునేసి మృగయాధర్మ మేలచేసితి" వని యాతఁడు ప్రత్యర్థిని గర్జించినాఁడు. ఎదుటివాఁడు సాక్షాత్పర మేశ్వరుఁడు. అతఁడు పరీక్షార్థమై కయ్యమునకు దిగెఁనాడు గాని క్రోధభావ మునఁగాదు. అంతియగాక నర్జునుని బాణ జాలమును తనయందు లీనమొనర్చు కొనఁగల మహిమాన్వితుఁడు. అతని యుద్ధము లీలయేగాని పురుషకారము కాదు. కాని అతనితో పోరు అర్జునియందు ద్విగుణీకృతోత్సాహము స్ఫురితమై పఠితచే వీరముగా నాస్వాద్యమగును. దేవుఁడు నరునితోఁబోరినచో నాశ్చర్యము లేదు కాని నరుఁడు దేవుని డీకొనుట విశేషమే!

కిరాతుని అధిక్షేపములకుఁ గలఁగి విజృంభించిన యర్జునుని దుర్వార నారాచములు "అవివేకి యందుఁ బ్రయుక్తంబులయిన సుభాషితంబులుంబోలె" శివుని యందు నిష్ఫలములగుచున్నవి. గాండీవ మపహృతమైనది; కృపాణము ముక్కవోయినది; రాలు విఫలములయినవి; శూలధరుని ధాటి కోర్వజాలక గాండీవి మూర్ఛలో మునిగినాఁడు. కాని త్రిపురాంతకునిముం దంతమాత్రము నిలుచు నరుఁ డేడి యీ లోకమున? అదియే యొక గుణము. శివుని దింద్ర

జాలముకాని యుద్ధముకాదు; ప్రతి నాయకుని చేతనే పొగడ్త లందిన నర్జునుని వీరత్వము సుప్రతిష్ఠితము. "అర్జునా! క్షత్త్రియు లొరులెవ్వరు నీయట్టి శౌర్య ధైర్యవంతులులేరు. నీతపఃక్షాత్రగుణంబులకు మెచ్చితి" నను మాటలు శివప్రోక్తములగుటచే నర్జునుని యందలి తపోవీరము, తదంగమగు యుద్ధ వీరము సఫలమగుచున్నది.

అర్జునుఁ డూర్వశీ విముఖుఁడగుట కాతని ధర్మప్రవృత్తియే కారణము. ఊర్వశిఁ గామించినచో తాను కురు సభతో బ్రహ్మచర్యమున వనవాస మొన రింతునని చేసినసమయము భగ్నమగును; శతమఖ పురూరవుల కనురక్తయైన యామెపట్ల మాతృధర్మము బాధితమగును. అందువలననే ఆమెతో నాతఁడు—

"ఓహో! యిమ్మెయి ధర్మద్రోహోక్తులు పలుకఁదగునె దోసంబది గా
దే హరిహర మనమున నూహింపక నన్ను బలుకు టుచితమె నీకున్"

—అరణ్యా. ప్ర. 364.

ఇం "దే కత్త్రైవానురాగశ్చే" దను లక్షణముచే శృంగార రసాభాసమై తత్ఫలిత ముగా హాసము జనించినను, అర్జునుని ధర్మప్రవణత దానిని శాసించుటచే నది ధర్మోత్సాహమే యగుచున్నది. తపోవీరుఁడగు నర్జునుని శీలమున కిది మెఱుఁగు వెట్టుచున్నది.

ఘోషయాత్రా ఘట్టమున ధర్మజుని దయావీరము మూర్తికట్టినట్లు ప్రత్యక్షమగును. చిత్రసేనునిచే సకుటుంబముగా బంధింపఁబడిన దుర్యోధనునిఁ గాపాడుటకు యజ్ఞదీక్షితుఁడగు ధర్మరాజు దయఁదలఁప, భీమార్జునులు రారాజు దౌష్ట్యముల నుగ్గడించి, యన్నను వారింప యత్నించిరి. ధర్మజుఁ డప్పుడు సాంత్వనవచనములతో వారికి ఇట్లనెను :

"కావరయ్య యనినఁ గరము దుర్బలుఁడైనఁ జెనసి యోపినంత సేయుననిన
నూరకుండు నయ్య యుత్తమ శూరుండు దీనజనుల యున్న తెఱఁగు సూచి."

"శరణంబని వచ్చిన భీకర శత్రువునయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణాపరుల తెఱం గిది యిరవుగ సరిగావు దీనికే ధర్మంబుల్."

"....నిన్నింత నిర్బంధింప వలవదేన యరుగుదు నిప్పుడు యజ్ఞదీక్షితుండనై యున్నవాఁడ గావున నాకుం జనరాదు,"

—అరణ్యా. పం. 412-414.

ఇందు విశృంఖలవర్తనము వలచిన వారువములను రథమునకు బూన్చు సారథి యొక్క సామర్థ్యము గోచరించుచున్నది భీమాదులు ధర్మజుని సమర్థించుటలేదు ఇంద్రియములును ఇట్లే యొక్కొక్కసారి ప్రకోపించును. వానిని నియమింపవలసి యున్నది. దానికి మర్మజ్ఞుఁడైన మనీషి గాని చాలఁడు. తమ్ముల మర్మ మెఱిఁగిన అన్న మాటాడు వైఖరి యిచ్చుట అప్రతిమానము. హతశేషులగు కౌరవ సైనికులు దైన్యముతో శరణు వేడినారు. భీమాదులు "దీనజనులయున్న తెఱఁగు సూచి" వారు. ఉత్తముఁడు, శూరుఁడు నైనవాఁడు అట్టి విభావముఁగాంచినచో తత్క్షణమున కుద్యుక్తుఁడగును. దానినే చమత్కరించి ధర్మజుఁడు "కరము దుర్బలుఁడైన యోపినంత సేయుననిన" అని వక్రోక్తి పల్కినాఁడు. బలహీనుల స్థితియే అట్టిదైనప్పుడు, బలవంతులు, మేటిశూరులునైన మీరెండులకు నీళ్లు నములుట ? యని తమ్ములకు పురినెక్కించినాఁడు వ్యంగ్యముగా; ఈ మాటలు భీమాదులకు విభావములయి యుత్సాహమును కల్పించును కాని దానిని సమర్థముగా నిర్వహింపవలెనన్న వారికి శరణువేడినవారియందు 'ప్రీతి' జనింపవలెను. దానికొఱకై రెండవపద్యము నుడివినాఁడు. 'భీకరుఁడైన శత్రువైనను శరణన్నచో ప్రీతితో కాచువారు దయామయు లనఁబడుదురని పేర్కొనినాఁడు. భయంకరులనే ప్రీతితో ప్రోచుట ధర్మమైనచో నిచ్చట శత్రుపీడితుఁడైన రారాజును బ్రోచుట విధ్యుక్తధర్మమగుచున్నది అని సూచన. ఇచ్చట దయామయత్వము ధర్మము. దీని "కిరవుగ" అనగా స్థిరముగ సరివచ్చు ధర్మము మఱొండు లేదని తెల్పుటలో తాత్పర్యమిది : ధర్మములు పెక్కులుండవచ్చును. వానిలో స్థిరమును, సార్వకాలికమును నైన ధర్మమునే మానవుఁడెన్నుకొనవలెనని వ్యంగ్యము. అంతియగాక తనతమ్ము లధర్మవర్తులని నెగ్గుటకష్టము. కావున వారిదియు నొకధర్మమేయని యొప్పుకొనుచు, అది స్థిరమైనదికాదు నైమిత్తికమైనదని త్రోసివేయుచు, "రత్నహారీతు పార్థివ" అను న్యాయముచే నుత్తమధర్మమునే క్షత్రియుఁడు గైకొనవలెనని ప్రతిపాదించినాఁడు. తమ్ములయందు కొంతయుత్సాహముఁ గాంచినాఁడు. కాని వారు మనసార నంగీకరించుటలేదు. ఇచ్చట చిన్న బెదరింపు చేసినాడు. "నిన్నింక నిర్బంధింప వలవదు" అనినాఁడు ! "లోకో భిన్నరుచిః" అన్న న్యాయమున తనకును, తన తమ్మునికిని భావభేదము గోచరించునది ! 'బలవంత మాఘస్నానము చేయించుట నామతముకాదు; మీరు వలదన్నచో నా మార్గము నాది ; కాని నేనుమాత్ర మీ ధర్మమును విడునదిలేదు' అను మంకుపట్టు

ఆ మాటలలో ధ్వనించినాఁడు. మెత్తని తమ్ములహృదయము లీ మాటతో కొంత బాధపడునని అతనికి తెలియును. కావున వెంటనే తానున్న పరిస్థితియు, అసమర్థతయు, ధర్మదీక్షయు ద్యోతమానమగునట్లు కొలదిగా తగ్గి మాట్లాడినాఁడు. ఇది యెదుటివానిని తనవైపు మొగ్గించు వాగ్వైఖరి. ఇట్లు సింహములవలె పరమ పౌరుషమూర్తులైన తమ్ములను నయభయాదులతో గురుశిక్షా న్యాయమున నొక్కత్రాట ధర్మమార్గమున నడిపించిన ధర్మజుఁడు నిజముగా నిందు ధన్యజీవి ! కడు సమర్థుడు !!

భీమార్జునులు చిత్రసేనునితో యుద్ధముచేయుచు ప్రదర్శించిన యుత్సాహము ధర్మరాజాశ్రయమైన దయావీరమున కంగమే. అతని దయ దుర్యోధనుని మన్నించి వదలుటలోఁ బరాకాష్ఠనందుచున్నది.

"ఎన్నఁడునిట్టి సాహసము లింక నొనర్పకుమయ్య ! దుర్జనుం
డన్నన సాహస క్రియలయందుఁ గడంగి నశించు గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁగైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్
సన్నుత దీని కొండొక విషాదముఁ బొందకు మీ మనంబునన్"
—ఆరణ్య. పంచ. 434.

ఇందు వ్యంగ్యశిల్ప మతి సున్నితము. పైకిమాత్రము ధర్మజుఁడు దయామయుఁడై వాత్సల్యముట్టిపడ రారాజుకు నీతిఁజెప్పి జరిగినదానికి వగవకుమని యోదార్చినట్లున్నది. లోతుగా నాలోచించినచో నా చల్లనిమాటలలో వేడి లేకపోలేదు. 'ఇట్టిసాహసము', 'అయ్య', 'దుర్జనుండు', 'నశించు', 'సన్నుత', 'ఒండొక' అను పదములు అన్యాపదేశముగా దుర్యోధనునియందు శల్యములవలెఁ బ్రయుక్తము లగుటచే శత్రుహృదయపుటభేదన సమర్థము లగుచున్నవి ; భీమాదులకు సంతోషకరములగుచున్నవి. దీనిని ఓదార్పుక్రింద గైకొనినను, మందలింపుక్రింద గైకొనినను ధర్మజుని పెద్దరికము, దయాగుణము, ధర్మాసక్తి అత్యంత కాంతివంతములే యగుచున్నవి.

ఇవన్నియు నిట్లుండ - సమయనిర్వహణరూప ద్వాదశవర్ష వనవాసవ్రతమంతయుఁ బ్రధానముగా ధర్మోపాఖ్యాన శ్రవణమునందే గడపినాఁడు ధర్మజుఁడు. మహాఋషుల సందర్శనభాగ్యము గల్గినపుడెల్ల నాతఁడు పుణ్యపురుషుల జీవితచరిత్రముల నడిగి తెలిసికొని వనవాసదుఃఖము నపనయించుకొనెడివాఁడు. ఒకపరి బృహదశ్వుఁడను మహర్షి కతిథిపూజఁ గావించి

"పుడమియు రాజ్యము బంధులు విడిచి మృగావలులఁ గలిసి విపినంబులలోఁ
గడుకొని మాయ ట్లిడుమలఁ బడిన నరులు గలరె యొరులు పరమమునీంద్రా"
—అరణ్య. ద్వి. 3.

అని తన నిర్వేదాతిశయము వెలిబుచ్చినాఁడు. తనవంటి కష్టాత్ముఁడు మఱి యొకఁడుండెనని తెలిపినచో, దచ్చరిత్ర చర్వణముచే నుత్కటశోకము నుపశమింపఁజేసికొని ధర్మధృతి మనంబునఁ గుదుటపఱచు కొనవలయునని ధర్మజుని యాకాంక్ష! బృహదశ్వుఁడు నలోపాఖ్యానమును జెప్పి అందాతఁడు భార్యను, రాజ్యమునుబాసి యొంటిగాఁ బడిన పాట్లెల్ల విశదీకరించి అతనిఁ గృతార్థుఁ జేసెను.

ఇంద్ర ప్రేరితుఁడై ధర్మజాదులను పుణ్యతీర్థములు దర్శింపఁ జేయుటకై భువి కేతెంచిన రోమశమహర్షివలన ప్రసక్తాను వశముగా నగస్త్య చరిత్రము, మాంధాతృ చరిత్రము, శిబి చరిత్రము మొ. యుపాఖ్యానములను బుణ్య ప్రబంధములుగా విని యుధిష్ఠిరుఁడు ధర్మాసక్తిఁ బెంపొందించుకొనెను. మార్కండేయ మహర్షియు ధర్మజునికిఁ బెక్కు ధర్మప్రబోధములు, శ్రీ రామోపాఖ్యానమును జెప్పి సైంధవ దుర్ణయమున నేర్పడిన విపుల దుఃఖమునపనయింపఁ జేసెను.

ధర్మరాజు భ్రాతృసమేతుఁడై బ్రాహ్మణుని యరణి దెచ్చుట కరిగి తిరిగి తిరిగి డస్సి, యొకచోఁ దటాకముగాంచి యందు నీరు ద్రావ నేఁగి మూర్ఛితులైన భీమాదుల రక్షించుకొనుటకై యక్షుని ప్రశ్నలకు సమాధానమిచ్చి యుత్తమ ధార్మికునిగాను, జ్ఞానిగను కీర్తిఁగాంచెను. అరణ్య పర్వమునందు నాయకుఁడు తాల్చిన ధర్మవ్రతనిష్ఠ కీ యముని ప్రశంస నిదర్శనము.

"ఏను ధర్ముఁడఁ జువ్వె రాజకులేంద్ర సత్యము శౌచమున్
దానముం దపమున్ శమంబును దాంతియున్ యశముం బరి
జ్ఞాన యుక్తియు నాదు మూర్తులు సమ్మదంబున నిప్డు మ
త్సూను నుత్తమ ధార్మికున్ నినుఁ జూచు వేడుక వచ్చితిన్"
—అరణ్య. సప్త. 462.

ధర్మజుఁ డుత్తమధార్మికుఁడని ప్రకటించుటకు ధర్మునికన్న నర్హతములు మఱెవ్వరు ?

విరాటపర్వమున భీమార్జునుల యుత్సాహము పాయలువారిన మహా తరంగిణివలె ప్రవహించి ధర్మజ మహాసాగరమున లీనమగుచున్నది.

మల్లురతోఁ బ్రారంభమయి కీచకులతో నున్నతస్థాయి నందుకున్నది భీముని బలవీరము. కీచకుఁడు ద్రౌపదీకామాయత్త చిత్తుఁడు. బలవంతమున నామెను పరిగ్రహింపవలెనని సహస్ర ప్రయత్నము లొనర్చినాఁడు. అతని బాధ కోర్వజాలక ద్రౌపతి తన స్థితి భీమునితో మొఱపెట్టుకొనినది. భార్య కేర్పడిన విపత్తు భీముని ద్రవింపఁజేసి, కీచకునిపై పగను రెచ్చగొట్టినది. అతఁ డాతనిని సంహరింతుననినాఁడు. అవమాన ఘూర్ణితమానసయైన ద్రౌపది యాతని యత్నమును పటిష్ఠ మొనర్చుటకై భీముని మ్రోల :

"వానిఁ దెగఁ జూడవై తేని వాయుపుత్ర ! నీవు గనుఁగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబునసైన నేను మేను దొఱఁగుదు నెట్టు నీ యానసుమ్ము!"
—విరా. ద్వి. 229.

అని బెదిరించినది. ఆ మాటల వెనుక ప్రత్యక్షమగుచున్న నామెయొక్క భావ తైక్ష్ణ్యము, తనను ప్రేరేచు ప్రయత్నము భీముఁడు గమనించినాఁడు. నిజముగా నప్పటికే కీచకునిపై నిప్పులు గ్రక్కుచున్నాఁ డాతఁడు. ఎదిరి పరాక్రమము నూహించి నిర్లక్ష్యముతో గూడిన ధృతినిదాల్చినాఁడు. సతి దానిని గుర్తించుట లేదు. 'ఓ యబలా ! నాకింత చెప్పవలెనా' యనున ట్లొక చిఱునవ్వు నవ్వి యిట్లనినాఁడు :

"జలజదళాక్షి కీచకునిఁ జంపుట కిమ్మెయి ముట్టఁ బల్కఁగా
వలయునె యేను జూడ ననివారణ నిన్నుఁ బరాభవించి వాఁ
డిల మననింక నాంద్రకును నెవ్వరు భంగము నీఁగఁజాలు వా
రలఘు మదీయ బాహుబల మప్పుడు చూపని తప్పు సాలదే."
—విరా. ద్వి. 231.

భీముఁడు కార్యవాది. "నేను జూడ నిన్నవమానించి కీచకుఁడు బ్రతుకుటయే!" "ఆంద్రకు భంగము గల్గనిచ్చు నాథు లీ భువిపై నెవ్వరుందు"రని ధైర్యము చెప్పినాఁడు. ఇంకను—

"ఎల్లి యెల్ల విధంబుల నెందుఁ జొచ్చెనేని నా ధర్మతనయుండు దానవచ్చి
యడ్డుపడెనేని నీవ పెంపారు కరుణఁ గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు."
—విరా. ద్వి. 232.

అనెడి భీకరప్రతిజ్ఞఁ జేసినాఁడు. ఎన్ని యవరోధములున్నను తన కార్యసాధన నాపునది లేదని యిందు తాత్పర్యము. ధర్మజుని శాసన మలంఘనీయము. ద్రౌపది దయ శత్రురక్షణ సమర్థము. ఆ రెం డాతని యత్నము నాపగల్గినచో

నావఁగలవు. అవియు నెల్లి ఫలింపవని చెప్పి భార్య మనసు రంజించునట్లు వీరము ప్రకటించినాఁడు.

కీచక సంహారోపాయమును నిశ్చయించి అతనిని 'సాఱువముగాకి నొడిసిన' భంగి చంపుట తథ్యమని తేల్చి, యొకవేళ తనకుఁ దీటైనవాఁడుగాఁ గీచకుఁడు తోచెనేని వానిని—

"అవనీచక్రము సంచలింపఁగ దివంబల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైల నికరం బాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతార్థత్వంబు నొందించి చి
త్రవధ ప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్."

—విరా. ద్వి. 284.

అని యుత్సహించి, రహస్యభేదనక్రమములూహించి, మఱునాఁడు నర్తనశాల సమీప సంకేతస్థలమునకేగి, వనితావేషమున నుండగా గీచకుఁడు కామాంధుఁడై సమీపించి తన రూపపరాక్రమాదులఁ గీర్తించుకొనెను. అతనితో భీముఁ డొనర్చిన గూఢార్థ సంభాషణలు హాస్యానుప్రాణిత వీరరసస్ఫోరకములు. మచ్చునకు :

"ననుముట్టి నీవు వెండియు వనితల సంగతికిఁ బోవువాఁడవె యైనం
దనువేఁ బడసిన ఫలమే కనియెద విదె చిత్తభవవికారము లెల్లన్."

—విరా. ద్వి. 339.

ఇందు వాచ్యమున వీరము, శ్లేషార్థమున హాస్యము స్ఫురించి పోష్యపోషక సంబంధమున వరలుచున్నవి. వీరాంగమగు హాస్యము వీరుని ముఖమున నింత సమర్థముగాఁ బోషించుట తెలుఁగు సాహిత్యమున నరుదు. భీమ కీచక మల్ల యుద్ధమునందును, ఉపకీచక వధయందును రౌద్రస్ఫూర్తి కలదు. అది భీముని బలవీరమున కంగము. తత్కారణముగాఁ బాండవుల గార్హస్థ్య ధర్మము సురక్షితమైనది కావున కావ్యనాయకాశ్రయమైన ధర్మవీరమునకిది పరిపోషక మగుచున్నది.

దక్షిణ గోగ్రహణము సుశర్మచే నూహింపఁబడి నిర్వహింపఁబడినది. అకాలవర్షముగా వచ్చిన గోగ్రహణవార్త విరటుని నగరమును గలవరపెట్టినది. అది విని విరటుఁడు :

"ఏమీ నిక్కమె మున్నె యుంగఁడె త్రిగర్తేశుండు మద్గోధన
స్తోమంబుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే మేలు మే
లామై తోడనె పోవుఁగాక యని వీరాలాపముల్ వల్కి."—విరా. తృ. 140.

మంత్రి దండనాథాదులఁ బురిఁగొల్పి సుశర్మను డీకొన నుత్సహించెను. ధర్మజుఁడు సమయ మెఱిఁగి, విరటుని బల మూహించి, భీమ నకుల సహదేవ సమన్వితుఁడై తానును రథారూఢుఁడై యాతని వెంట నరిగెను. విరట సుశర్మల మధ్య పోరు ఘోరమైనది. అందు సుశర్మ విరటుని బంధించెను. సైన్యము నిలువరింప శక్యముగాక వికావికలై పారిపోఁ జొచ్చెను. ధర్మజుఁ డా స్థితిలో విరటుని రక్షించుట ధర్మమని భీమునియెదుటఁ బ్రతిపాదించినాఁడు :

"ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రతికి
యున్న వారము గావున నుగ్రరిపుల
పాలువడకుండ విడిపింపఁ జాడి యితని
నెయిదు మెయిదుము రథరయ మెసక మెసఁగ."

"అనవుఁడు మేను వెంచుచు మహాబల నందనుఁ డప్పుడన్న కి
ట్లను నిదె సాలవృక్షము రయంబున దీన నరాతి సేన డొ
ల్లనడిచి యీసుశర్ముని బలంబుఁ జలంబును మాన్పి యవ్విరా
టుని విడిపించెదన్ రణపటుత్వము వైరులు పిచ్చలింపఁగన్"

"మీ పనిచినట్లు చేసెద నేపారిన వైరిబలము నెల్లను బాహా
టోపమున నోర్చి మత్స్య మహీపతి విడిపించి తెచ్చియిచ్చెద మీకున్"

—విరా. తృ. 204. 205. 210.

ధర్మజుని యత్నమున కృతజ్ఞతాభావము నిబిడము, అన్నగారి యాజ్ఞ భీమ మహార్ణవమునకు శరత్పూర్ణిమ. అతని మేనుబ్బినది. అతనిరూపు 'మహాబల నందనుఁడే' యను నట్లున్నది. సాక్షాత్ ప్రభంజనుఁడే యైనట్లున్నాఁడు. కావు ననే సాలవృక్షము పెరికి రణమున కున్ముఖుఁడగుట ! ఇందులో చక్కని పొందిక గానఁబడుచున్నది. గాలి భూరుహములఁ బెగల్చును గాని భూధరముల నొంప లేదుకదా ! "తెచ్చియిచ్చెద మీకున్" అనుటలోఁ బ్రభు భక్తికన్న భ్రాతృభక్తి విశేషముగా గోచరించుచున్నది. అభిమానఘనుఁడైన భీముఁడు ధర్మజునికి, ధర్మమునకు మాత్రమే తలవంచునను భావమిందు వ్యంగ్యము ! ఇందు భీముని యుద్ధోత్సాహము మిత్రజనాపదుద్ధరణ సమర్థము, శత్రుభంజన సమర్థము. వీరుని బలమునకిదే ప్రయోజనము. విరటుని రక్షించుటలో రెండుధర్మము లిమిడియున్నవి. అవి : ఉపకారికి నుపకారము చేయుట, గురుజనవాక్య పరి పాలన ; దీనివలన నర్థలాభ మొందుకలదు. విరటుఁడు లేనిచో తమ కాశ్ర యములేదు. "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనమ్". అంతియగాక ప్రస్తుతము

విరటుని కొల్వు సేయు నుద్యోగులుగా నుండి యుండుటచే నది సేవాధర్మము నగుచున్నది. సమయమున కుపయోగపడని బల మజాగళ స్తనమువలె వ్యర్థము. కావున భీముని బలవీరము నాయకుని ధర్మవీరమును పోషించుచున్నది. వీని కన్నిఁటికి మించినది ధర్మరాజు దయ. విరటుని కన్ని చెట్టలు తలపెట్టిన సుశర్మను వదలివేయుట తన కోర్కెయని విరటునితోఁ బల్కినాఁడు. ప్రాణము రక్షించిన ధర్మజుని యనుమతి విరటుఁడు కోరుట, అతఁ డనంతమైన దయఁ బ్రకటించుట వర్ణితమైన ఈ దృశ్య మసదృశము. ఉదాత్త ధర్మనిష్ఠులగు పురుషుల మనఃప్రవృత్తి కామాదివిషయాతీతముగదా!

ఉత్తరగోగ్రహణ ఘట్టమున నర్జునుని యుద్ధవీరము సారవివేక సుధా మధురము. దుర్యోధనుఁడు కురువీర సమేతుఁడై యెక్కుమ్మడి ఉత్తర గోగ్రహణ మొనర్చెను. విరాటనగరమున నుత్తరుఁడుతప్ప వీరులు మఱెవ్వరు లేరు. రాజ్యరక్షణ భారము, యుద్ధభారము నాతనిపైఁ బడినది. క్షత్రియోచితము లగు వీరవాక్యము లాతఁడును బల్కి రణోత్సాహమున బృహన్నలను సారథిగాఁ గొని కురుసేనవైపు నడచెను. కాని విపులమగు కురురాజ సైన్యముఁ గాంచుటతోడనే యాతఁడు భయకంపితుడైనాఁడు, దీన వాక్యములకు దిగినాఁడు, రథము దిగి వెన్నిచ్చి పరువెత్తినాడు. భీరుని నోటఁ బల్కించిన వీరాలాపములు తాత్కాలిక రసోత్కర్షకము లైనను పూర్వాపర విచారమున నాభాసగా గోచరించి హాస్యానుభూతిఁ గల్గించుచున్నవి. ఇది యర్జునుని రణోత్సాహమున కంగము, తదుత్కర్ష హేతువు. అర్జునుఁ డుత్తరుని భయకంపాదుల నూతగాఁ గొని, సైరంధ్రి నియామకము, పౌరదీవనలు మొ. వానిని హేతువులుగాఁ జెప్పి తద్గౌరవ రక్షణార్థము తానే గోమోక్షణోద్యోగమునకు జాకచక్యముగాఁ బూనుకొనుట కడు మనోహరముగా వర్ణిత మీ క్రింది పద్యమున :

"నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దానం బెంపుమైఁ బిల్చితో
డని తోడ్తెచ్చితి వీవు బంటుతన మట్లగ్గించి పౌరాళి దీ
వనలిచ్చెం దుదిఁబోయి కౌరవులు గోవర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్తవోదునె భయోత్కంపంబు నీ కేటికిన్"

విరా. చతు. 68.

"వెఱవకుమన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న
త్తెఱ గదియేల నీ కుడుగు తేరికి సారథికమ్ము నాకుఁ జీ

చ్చుఱ పిడుగెట్టు లట్టడరి శూరుల మొత్తము నుగ్గుసేసెదం
బఱపెద సేన రాజుధృతిఁ బాపెద గోవుల గ్రమ్మఱించెదన్"

—విరా. చతు 83.

అని కార్యసాధనోపాయమును ఎదుటివాని యెడఁద కెక్కునట్లు చెప్పినాఁడు. 'చిచ్చుఱ పిడుగట్టుల'ని తన శత్రుసంహార సామర్థ్యము నాలంకారికముగా వ్యక్తపఱచినాఁడు.

అర్జునుని పరాక్రమము, కౌరవపక్ష వర్తులగు ద్రోణాదులు పొగడుటచే మఱింత ప్రకాశించుచున్నది. మచ్చునకు-ద్రోణుఁడు :

"సింగం బాకటితో గుహాంతరమునం జేట్పాటుమై నుండి మా
తంగ స్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాస ఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేయాభిరామాకృతిన్."

"ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ
యాతత సేనలోఁ గలుగు టారయ సంశయ మెల్లభంగి గో
వ్రాత నివర్తనంబు సుకరంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసెనా వినమె పెంపెసలారెడు బాహుసంపదన్."

విరా. చతు. 95, 96.

ఆకలిగొన్న సింగముతోడి యుపమానము, యుద్ధమున రుద్రునిఁ బ్రీతునొనర్చె నను గత చరిత్రస్మృతియు నర్జునుని యరిజన భయంకరత్వమును నిరూపించుచున్నవి.

అర్జునుఁడు విభావముకాగా శత్రువీరుల యందుత్పన్నమగు నుత్సాహ మాతని యుద్ధ వీరమునకు హేతువును, పోషకమును అగుసు. ఉదాహరణమునకు కర్ణుఁడు ద్రోణాచార్యుఁడొనర్చిన యర్జునప్రశంసకుఁ గినిసి వీరలోకము నాలోకించి

"వెఱచితిరేని నిల్వుఁడొక వీరున కొక్కఁడ చాలుఁ గాక యెం
దఱు వలయుం గపిధ్వజము దవ్వుల మేల్మిడిఁ ద్రుంచివైచెదం
బఱపెదఁ దత్పిశాచముల భగ్నము సేసెదఁ దేరు సారథిన్
నెఱకులు నొంచెదం బొదులు నించెద నర్జును గాత్రశాలలోన్."

"క్రోధ జ్వాలలు నిగుడ విరోధి బలేంధనముఁ బొదువు క్రూరతమై దు
స్సాధ్యమగు నర్జునాగ్నిని సాధించెద నేన వూని శరవర్షమునన్."

విరా. చతు. 201, 203.

అనిన మాటలలో రణోత్సాహము వ్యక్తమగుచున్నది. ఇది కిరీటికి విభావము. ఇందర్జునుని యందుఁ బేర్కొనఁబడిన క్రోధభావము వీరమునకు సంచారి. "అర్జునాగ్ని...... శరవర్షమునన్" అనుటలోని రూపకాలంకారము సాభిప్రాయము, వ్యంగ్యార్థ సంభరితము. విభావనిరూపణసమర్థము.

"వీరావేశంబున" గర్జునిపై కుఱుకు బీభత్సునిఁ గాంచి, సారథియగు నుత్తరుఁడు :

"పుట్టినంతనుండి యిట్టివి యెన్నఁడుఁ గానవెందు నట్లుగాన చోద్య
మంది యంతరంగ మవశతఁ బొందిన కతన నింద్రియములకడఁక దక్కె."
—విరా. పంచ. 113.

అని కీర్తించును. పఠితకేర్పడెడి అనుభావమే పాత్రనిష్ఠమొనర్చి రసాస్వాదనను ద్విగుణీకృత సాంద్రము నొనర్చినాఁడు కవిబ్రహ్మ! వీరరసజన్యమగు అద్భుతము చూపఱులయందు వర్ణించి రసోత్కర్షకుఁ జాటుపడు కావ్యకళ కిది మఱియొక యుదాహరణము.

అర్జునుఁడు శత్రువీరులపై విజృంభించి వారలను నొప్పించి, యుప్పొంగి యధిక్షేపించును. తద్వచనము లాతని రణోత్సాహమునకు జీవతుల్యములు. ఉదాహరణమునకు అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట :

"క్షత్త్రియుఁడోడునే తగదు కౌరవరాజ ? యొకండనేఁ, బృథా
పుత్త్రులలోనఁ బిన్న నిను బోరికిఁ బిల్వఁగ మానినాఁగ ని
ద్ధాత్త్రి బ్రసిద్ధికెక్క బలదర్ప సమగ్రుఁడవైన నీవు నీ
మిత్త్రులుఁగూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ భూపతుల్"

"ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె
మణిమయంబైన భూషణజాలములనొప్పి యొడ్డోలగంబున నుండఁ గలదె
కర్పూర చందన కస్తూరికాదుల నింపు సొంపార భోగింపఁగలదె
యతి మనోహరములగు చతురాంగనలతోడి సంగతి వేడ్కల సలుపఁ గలదె
కయ్యమున నోడిపోయిన గౌరవేంద్ర
వినుము నాబుద్ధి మరలి యీ తనువువిడిచి
సుగతి వడయుము తొల్లింటి చూఱగలదె
జూదమిచ్చట నాడంగరాదు సుమ్ము" —విరాట. పంచ. 203, 204.

ఇందు బ్రయోగింపఁబడిన 'క్షత్రియుఁడు' 'కౌరవరాజు' 'పిన్న' 'బలదర్ప సమగ్రుఁడవు', 'ఇట్లయిన' 'కౌరవేంద్ర' మొ. పదములు వాఙ్మయాస్త్రము

లయి దుర్యోధనుని హృదయము నేఁచగలవి. 'జూదమిచ్చట నాడంగరాదు సుమ్మీ' అనుటలోఁ బ్రతినాయకుఁడు కపటపు యత్నములతో పరసంపద హరించు నేర్పుగలవాఁడేగాని వీరునియెదుట పౌరుషముతో నెదిరి పోరు సామర్థ్యము లేనివాఁడని అధిక్షేపము. గతస్మృతులచే నింద్రతనూజునియం దుత్సాహము 'రాజబెట్ట' బడుచున్నది. కురువీరులతోడి యుద్ధమున నెడనెడఁ గానఁబడు రౌద్ర మాతని వీరమున కంగము. భీష్ముఁడు సమ్మోహన బాణ పీడితులయి తేరుకొనిన కురువీరులఁ గాంచి పల్కిన పల్కులు కిరీటికి వీర నీరాజనములు :

"మోహన బాణ పాతమున ముం దలచీర లెఱుంగకున్న యీ
బాహుబలంబుతోఁ గడఁగి పార్థుని దాఁకెడు బుద్ధి గ్రమ్మఱన్
సాహసవృత్తిఁ జేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయఁడే మనలనందఱ నొక్కట మార్గణాగ్నికిన్"

—విరా. పంచ. 218.

సంజయుఁ డుపప్లావ్యమునుండి హస్తినాపురికిఁ జేరి ధృతరాష్ట్రునితో దెల్పుమని అర్జునుఁడు పుత్తెంచిన పల్కులఁ దెల్పినాఁడు. అవి వీరరసావలంబ నములు (ఉద్యో. ద్వి. 134-144). మచ్చునకు :

"వనవాసంబున భూశయ్యను ధర్మజుఁ డున్నయట్టి యాయాసము వో
పునె యంపశయ్య దుర్యోధనుఁడు రణక్షోణిఁబడక తక్కిన యేనిన్"

ఉద్యో. ద్వి. 136.

తిక్కన వాక్శిల్పమున కిది చక్కని యుదాహరణము. అల్పాక్షరము లలో ననల్పార్థరచన. "ధర్మజుఁ డున్నయట్టి ఆయాసము" అను పలుకుబడి కడుప్రౌఢము. ధర్మజుఁ డట్లుండుటవలన ఆయాస మేర్పడినది. ఎవరికి? ధర్మ జున కొక్కనికే కాదు - పాండవు లెల్లరకు! ఆ అర్థ మావాక్య నిర్మాణమున ధ్వనితము. అర్జునుఁడు ఆయాసము ననుభవించి దాని నాక్రోశముగా వెలువ రించినాఁడు. ధర్మజుఁ డాయాసము ననుభవించియు నావేశమునకు లోను కాలేదు. క్షమామూర్తియగు ధర్మజుఁ డాయాసపడిన వనవాస స్మృతి భ్రాతృ భక్తియుక్తుఁడు, పౌరుషవంతుఁడు నగు కిరీటికి విభావమై శత్రుసంహారరూప మగు రణోత్సాహమును రేకెత్తించినది. తమ్ముఁ డట్లనుచున్నప్పుడు అన్న మాట్లాడడు. మౌన మర్ధాంగీకారమను న్యాయమున్నను ఇది పూర్ణాంగీకారమే. అర్జునుని పల్కులు పాండవుల యేకవాక్యతను, ధర్మరాజు పెద్దరికమును

తమ్ముల అన్యోన్యమును, శత్రుగతామర్షమును, రణోత్సాహమును వ్యక్తము చేయుచున్నవి. ఇట్టి అర్థస్ఫూర్తికి తిక్కనగారి వాక్యరచనా శిల్పమే ముఖ్య కారణము.

ఉద్యోగపర్వమునఁ గౌంతేయుల నాశ్రయించినది యత్నవీరము. సామ దానాదినీత్యుపాయముల ననుసరించి పాండవులు కౌరవులతో సంధియొనర్చి, తమపాలు పొందవలెనని ప్రయత్నించుటయు, దుర్యోధనాదులు రణమునకే బద్ధకంకణులై యుత్సహించుటయు ఇందలి ప్రధానకథాభాగములు. "యత్నే కృతే యది నసిద్ధ్యతి కోఽత్ర దోషః" అను న్యాయము ననుసరించి ధర్మజుఁ డిందు "ధర్మనీతి" వర్తనమున మెలఁగి ధర్మవీరుఁ డని కీర్తిఁ బడసినాఁడు. కౌరవ పాండవ సంధి విధానము ధర్మనీతిబద్ధమని నిరూపించు ధర్మరాజు శ్రీకృష్ణునితో నన్నమాటలు :

"పగయడగించు టెంతయు శుభం బది లెస్సయడంగునే పగం
బగ వగగొన్న మార్కొనక పల్కక యుండకవచ్చునే కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగదీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా !"

"కావున శాంతిబొందుటయ కర్జము దానది యట్టులుండె శ్రీ
గావలె నంచుఁ బోరితము గామియుఁ గోరెద మెల్ల సొమ్ములుం
బోవుటయుం గులక్షయము పుట్టుటయున్ వెలిగాఁగ నొందుమై
నే విధినైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁజుమీ జనార్దనా !"

"మనమునఁ బక్షపాతగతి మానెన మానుము ధర్మనీతి వ
ర్తనముల రెండు దిక్కుల హితంబును బెంపును గల్గునట్టి చొ
ప్పున విదురాది సజ్జనుల బుద్ధికిరా నుచితంబుతోడి మె
ల్పులఁ బరుసందనంబునను భూపతులెల్ల నెఱుంగ నాడుమీ !"

—ఉద్యో. తృ. 21-23.

సామాన్యముగా రాజనీతియందు ధర్మాధర్మచర్చ అప్రధానము. దుర్యోధనుని నీతి ధర్మలుప్తమైనదే. ధర్మజుఁ డటుగాక ధర్మమును, రాజనీతిని జోడించి సార్థకనాముఁ డాయెను. పగయందు వైముఖ్యము, కులక్షయభీతి, ధర్మనీతి సంధానము పై పద్యములందు ధర్మజునికి శాంతిమార్గమైన సంధి యత్నమున నౌత్సుక్యము కలుగుటకు హేతుభూతము లగుచున్నవి. ఇతని యత్నవీరమునకు తమ్ము లండదండలై నిల్చి పోషించిరి. రౌద్రరసమూర్తియగు భీముఁడు శాంతి

ఛవనములు పల్కుటయు, అర్జుననకులులు సమయోచిత వాక్పటిమతో నన్నను సమర్థించుటయు, తత్పోషకములైనవి. సహదేవ శ్రీకృష్ణులు సంధి యత్నము సఫలముకాదని వాదించియు ధర్మజుని ధర్మదృష్టిని మెచ్చుకొని యంగీకరించిరి. దేశశాంతి నుద్దేశించి సంధియత్నము జరుపఁబడినది. సంధి కుదురనిచో రణమున కాయత్తులై యుండియుండుటచే నిది ఉపాయ సాధ నాత్మకమగు యత్నవిశేషమే యగుచున్నది. అనఁగా వారు పరిస్థితు లనుకూ లించినచో శాంతివీరులు; లేనిచో రణవీరులు అని తాత్పర్యము. ఇది ధర్మజుని ధర్మనీతి వర్తనము. శ్రీకృష్ణుడు కురుసభలో పాండవ మతమును వివరించుచు:

> "వారలు శాంతిశూరులు భవచ్చరణంబులు గొల్వఁ బూని యు
> న్నా రటుఁగాక మీకది మనంబున కప్రియమేని నింతకుం
> బోరికి వచ్చుచుండుదురు భూవర రెండు దెఱంగులందు నీ
> కారయఁ బథ్యమేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా."

—ఉద్యో. తృ. 284.

అని ధృతరాష్ట్రునితో బలికినాఁడు. పాండవ యత్నమునకుఁ గురుసభలో బ్రహ్మాండమంతగా రూపకల్పనముచేసి ప్రదర్శించినాఁడు శ్రీకృష్ణుడు రాయ బార ఘట్టమున. కర్ణుని పాండవ పక్షవర్తిగానొనర్ప శ్రీకృష్ణుఁడు చేసిన యత్నము రాజనీతికి పరాకాష్ఠ. ఇవి యన్నియు ధర్మజుని అహింసాప్రధాన మైన సంధియత్నమునకు పోషకములు. నిజముగా సంజయుఁ డనినట్లు :

> "ధర్మజునకు భోగంబులు ధర్మువునఁ ట్లింపుగావు ధర్మంబులలో
> నిర్మలబుద్ధి నహింసకుఁ గూర్మి గడుం గలఁ డతండు."

ఇంకను—

> "ఒకటి గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి
> మూఁట నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి
> యేనిటిని గెల్చి యాఱింట నెఱిఁగి యేడు
> విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు"-అతఁడు.

—ఉద్యో. ద్వి. 7, 37.

అట్టి వివేకముగల బుద్ధినుండి ప్రభవించినదే యుద్యోగ పర్వమునందలి "ధర్మనీతి వర్తనము."

యుద్ధ పంచకము యుద్ధ వీరమునకుఁ బ్రసిద్ధము. ఇందు వీరమేగాక రౌద్రాద్భుత బీభత్స కరుణాదులు సందర్భోచితములుగాఁ బోషింపఁబడినవి. నాయకాశ్రయమైన అంగిరసమునకవియన్నియు నంగములయి పుష్టినిఁ జేకూర్చు

చుండును. ధర్మమార్గానుయాయులై పాండవులు తమను నొడ్డుచేర్చు నావికు నిగాఁ గృష్ణు నెన్నుకొని కురుక్షేత్ర యుద్ధ మహాసాగరమును దాటఁగల్గిరి. పెక్కు ఇక్కట్టులు వారి నెదుర్కొన్నను కృష్ణ సాహాయ్యమున వాని నవ లీలగా దాటి లక్ష్యము నందుకొనిరి. కవిబ్రహ్మ యీ పర్వముల ననన్యసామాన్య మగు ప్రతిభతో నిర్వహించి రసపోషణ చక్రవర్తియైనాఁడు. సులలిత కవితా కళావిలాస విన్యాసములతోడను, అపూర్వ భావపోషణా వైశారద్యము తోడను, రసోచితార్థాలంకార ప్రయోగ నైపుణ్యముతోడను తిక్కన తన భాగము నిర్వహించి యొరులకుఁ జేతగాని తెలుఁగు కావ్య శిల్పమును సంత రించినాఁడు. వీరరస పోషణమున నాతఁడీ పర్వపంచకమునఁ బాటించిన మార్గ ములఁ గొన్నింటిని స్థాలీపులాకన్యాయమునఁ దడవి చూతును.

ఒక వీరుఁడు మఱియొకని కుత్సాహముఁ గల్పింపఁబల్కెడి మాటలచే వీరరసస్ఫూర్తి కల్గును. ఉదా. అర్జునుఁడు రాధేయ వధాక్రమంబు నూహించి భయపడి ప్రస్వేదకణములు మేన నింప కృష్ణుఁ డాతనిఁ దేర్చి, అతనియందు రణోత్సాహముఁ గల్పించినాఁడు. సామాన్యముగా నిట్టి ప్రబోధమునందు వీరుని కుత్సాహముఁ గల్పించుటకై పేర్కొనఁబడు నంశము లిట్లుండును. 1. ప్రతినాయకునికన్న నాయకుఁడు బలవంతుఁడని నిరూపించుట, 2. ప్రతి నాయక లోపములను విశేషముగా బేర్కొని నిందించుట. 3. ప్రతినాయకుని వలన నాయకుఁడు పూర్వమనుభవించిన పరాభవాదులేమైన యున్నచో వానినిఁ బేర్కొని యాతనియందు రోసము రాజఁబెట్టుట. 4. ప్రతినాయకునితోఁ గలుగబోవు యుద్ధములో నా వీరుఁడు సాధింపఁబోవు విజయము నప్పుడే రూప కల్పనఁజేసి, కన్నులకుఁ గట్టునట్లు వర్ణించి చెప్పుట. 5. పూర్వమేమైనఁ బ్రతిజ్ఞ లొనర్చియున్నచో వాని నా సందర్భమున బేర్కొని చెప్పుట. 6. శత్రువీరుల నెదుట విభావములుగాఁ జూపి తదనుభావదర్శనముచే నాతనియం దుత్సాహ స్ఫూర్తి గల్గింపఁజేయుట మొదలైనవి. వీని కన్నింటికి నుదాహరణములఁ బేర్కొనినచో గ్రంథ మతి విస్తరమగునను భీతిచే భావుకుల కీ యంశమును వదలుచున్నాను. మచ్చునకు : కృష్ణుఁడు అర్జునునితో—

> "కౌరవసైన్య మగ్గలముగాదె కడున్ భవదీయ సేనక
> వ్వారణకోటు లాతురగవర్గము లారథసంచయంబు లా
> వీరభటావళుల్ బహుళ విక్రమ కౌతుకివైన నీ శరా
> సారములన్ బడల్పడఁ గృశంబగుటప్పుడు నీకుఁ దోపదే."
>
> —కర్ణ. తృ. 118.

ఇది మొదటి యంశమున కుదాహరణము. మూడవ యంశమున కీ క్రిందిపద్య ముదాహరణము : జూదంబున నప్పు డా సభలోన ద్రౌపది నుద్దేశించి యప్పాపాత్ముండు—

"లేరిచట మగలు నీకును వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన నీపైఁ గూరిమిఁగల మగని వెదకికొను మొరు నవఁడే.

—కర్ణ. తృ. 123.

ప్రబోధితుఁడైన వీరునియందు ఫలరూపమగు రణోత్సాహమును వర్ణించి యొక యుపక్రమోపసంహార విధానము సంతరించుట కథాకథన శిల్పము. అర్జునుఁడు కృష్ణునితో :

"నీ తోట్పాటున నేఁ ద్రివిష్టపముల నెల్వంగ నూఁకింతు; నా
చేతం గర్ణుఁడు రూపుమాలిచను; మెచ్చింతున్ నినుం జూఁడుమీ
దై తేయాంతక ! యంచు శేషనిభహస్తం బుద్ధతిం జాఁచి ని
ర్ధూతారాతిబలుండు వుచ్చికొని యెన్ దుర్దాంతకోదండమున్."

—కర్ణ. తృ. 130.

కృష్ణప్రబోధార్థచర్వణము, కర్ణాదుల దర్శనము మొ. వానివలన నేర్పడిన యుత్కటోత్సాహమే గాండీవధారణ కర్జునునిఁ బురికొల్పినది.

ప్రతినాయక గత రణోత్సాహము వర్ణించుటయు వీరరసస్ఫూర్తికిఁ దోడ్పడును. ఇచ్చట దుర్యోధనుఁడు ప్రతినాయకుఁడు. అతఁడు తన సేనకు భీష్మాదుల నొకరు గతించిన తరువాత నొకరిని సర్వసైన్యాధ్యక్షునిగా నియమించుచు వచ్చినాఁడు. వారు రారాజు పక్షమునఁ బోరిరి. ఇట్లు పోరెడివారు ప్రకటించు నుత్సాహము కూడఁ (ప్రతినాయక పోషకమగు) వీర మనఁదగి యున్నది. కర్ణుఁడు సర్వసైన్యాధ్యక్ష పదవిని స్వీకరించి చేయు ప్రతిజ్ఞ ఇట్టిది :

"విను నీ కిచ్చినబాసయే మరతునే వీరంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్ర వీర్యమును నీ భూలోకసంచారులె
ల్లను గీర్తింపఁగ బాండు పుత్త్రుల మదోల్లాసంబు మర్దింతు నీ
వనుమానింపక నిల్చి చూడుము మదీయంబైన సంగ్రామమున్."

—కర్ణ. ప్ర. 55.

సేవావ్రతధర్మము నాశ్రయించి గర్ణుఁడు వల్కిన యుత్సాహంపు పల్కులును రసపోషకములు.

ప్రతినాయక సహాయులనోట నాయక బలాధిక్యముఁ గీర్తింపజేసి, 'రాజు కోరుచున్నాఁడు కావున తప్పదని, విధియని యుద్ధము చేయుచున్నా' రన్నట్లు వారిని రణరంగమునకుఁబంపి యుద్ధముఁజేయించి నాయక పరాక్ర మాదులను వ్యంగ్యముగా ప్రకాశించునట్లు జేయుటవలన నాయకాశ్రయ వీరము పుష్టినొందును. ఉదా: భీష్ముఁడు శరతల్పగతుఁడై రారాజును గాంచి పల్కిన పల్కులు:

"నరుఁ డత్యద్భుత విక్రముం డతని కా నారాయణుం డాప్తుఁ డె
వ్వరికిన్ వీరి జయింపరాదు సమరావష్టంభముం దక్కి ధ
ర్మరతుండైన యజాతశత్రునకు నింద్రప్రస్థ మి మ్మర్థ రా
జ్యరమం బొందుము మీరు కొందరయినం జాకున్న నీ కొప్పదే"

—భీష్మ. తృ. 435.

కర్ణుఁడు భీష్మునితో నన్నమాట లీ క్రిందివి:

"వారు మహాబలుల్ హరియు వారికిఁ బ్రాపుగలండు వారలం
బోర జయింపరామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
క్ష్మారమణుండు సేయు తగు మన్ననవెల్లఁ దలంచి చూచినన్
భూరివివేక యే విడిచిపోవుట ధర్మమె వీరకర్మమే" —భీష్మ. తృ. 447.

భీష్ముఁడు పాండవులు బలవంతులని రారాజును సౌమ్యముగా బెదరించు చున్నాఁడు. కర్ణుఁడు పాండవబలమును గుర్తించి రాజుచేయు మన్ననలకు ప్రతిఫలముగాఁ దన పరాక్రమమును కుదువఁబెట్టు చున్నాఁడు. ఇట్లు శత్రు వీరులలో నొక సమైక్యశక్తి లేదు. చేతలు వేఱు, చేతములు వేఱు. దీనికి విరుద్ధము నాయకపక్షము. అందఱొక్క త్రాటిన నడతురు; ధర్మజుని నందఱుకలసి పొదివి సమర్థించుచు రక్షింతురు; ప్రాణములకన్న నెక్కుడు గౌరవింతురు.

"భవ్యంబైన బలాధిపత్యమునకుం బట్టంబు గట్టుండు న
న్నవ్యాకీర్ణగజాదియై మెఱయు సైన్యశ్రేణిఁ బాలించి కౌ
రవ్యోత్సాహముఁ బెంచి మార్కొనిన వీరవ్రాతముం ద్రుంచి నా
దివ్యాస్త్రంబులఁ బంచి పాండవుల దీప్తిన్ మాయఁ జేయించెదన్"

—ద్రోణ. ప్ర. 74.

అని భీషణప్రతిజ్ఞఁ జేసిన ద్రోణుఁడు, రారాజు ధర్మరాజునుబట్టి యిమ్మని కోరినప్పుడు నరుని పరాక్రమముఁదలచి వెఱగంది యిట్లనెను.

"నరుఁ డెడసొచ్చెనేని విను నాకది దుష్కరమే నొకండనే
సురగణమైన వ్రేలిఁగొని చూపఁగఁ జాలరు వాఁడు లేనిచోఁ
దిరమయి పోరనిల్చిన యుధిష్ఠిరు ద్రౌపది పుట్టినింటవే
వురు వెఱగంది చూడ నలవుం జలముం జెడఁ బట్టితెచ్చెదన్."

—ద్రోణ. ప్ర. 113.

ఇందు అర్జునాదు లెల్ల రన్నివేళల నాయకుని పరిరక్షించుటయు, నందును అర్జునుఁడు దుర్నిరీక్ష్యుఁడై ప్రజ్వలించుటయు పాండవ సమైక్యాఽఖండశక్తిని వ్యంగ్యముగా బోధపఱచుచున్నది.

శత్రువీరుల ప్రతిజ్ఞలు విభావములయి తద్భావనచే నాయకాదులయం దుత్కటోత్సాహము వ్యక్తమగును. ద్రోణుని ప్రతిజ్ఞను విని ధర్మజుఁడు దానిని దమ్ముల కెఱిఁగించి విచారింప నర్జునుఁడు :

"గురుని వధియించుటయు భూవర నీవని నొవ్వకుండువలను ననుటయుం
బరికింప నొక్కరూపవి దురితంబులు వీనిఁ జేయుదునె యే నెందున్."
"క్షోణీవల్లభ వినుమేఁ బ్రాణముతో నుండ నిన్నుఁ బట్టికొనఁగనా
ద్రోణునకకాదు సగణస్థాణునకైనను వశంబె తలఁకేమిటికిన్."

—ద్రోణ. ప్ర. 119, 120.

అని వీరాలాపములాడుట దీని కొక యుదాహరణము.

ప్రతినాయకపక్షవర్తులు నాయకునియం దభిమానముఁ గల్గియుండుటయు, సమయమువచ్చినచో వారికిఁ జేతనైనంత సాయ మొనర్చుటయు, నాయకవిజయ హేతువులై వారి యుత్సాహముల నినుమడించును. భీష్మ ద్రోణులు తమ మరణరహస్యములను పాండవులకుఁ జెప్పుటయు, కర్ణుఁడు గాండీవిఁదప్ప పాండవులలో నెవ్వరిని సంహరింపనని కుంతికి వరమిచ్చుటయు, శల్యుఁడు కర్ణహృదయశల్యమగుటయు నిందులకు చక్కని యుదాహరణములు.

యుద్ధపంచకవిభాగ మొక విచిత్రకథాకథన విశేషమును దెల్పుచు పాండవవీరుల యుద్ధపాటవమును జాటుచున్నది. పాండవులకు ధృష్టద్యుమ్నుఁడు సర్వసేనాని. సౌప్తిక పర్వాంతమువఱకాతఁడు సజీవియై యుండెను. కౌరవులకు నల్గురు సేనానులు మారిరి. వారి నొక్కొక్కరిని సంహరించుట యందు పాండవయత్నము నిరూపించుటయే యొక్కొక్కపర్వము యొక్క ప్రయోజనము. క్రమముగా క్షీణించు కౌరవ వీరనివహము నొక వైపును, కొంత తఱిగినను మూలబలము చెదరని పాండవ బలమును మఱియొక వైపును

గాంచి తారతమ్యదృష్టితో పరిశీలించినచో పతితకు నాయకుని యుద్ధసాధన సామర్థ్యము వ్యక్తముగాకపోదు.

యుద్ధపంచకమునఁ గనఁబడు వీరులలో ప్రతివాఁడును ఉత్తమునివలె భాసించి, కారణజన్ముఁడై నట్లును, ఏదోయొక వైయక్తిక ధర్మము నాశ్రయించి యుద్ధము చేసినట్లును, గోచరించెదరు. ప్రతినాయకుఁడగు దుర్యోధనుఁడు సైతము తాను యుద్ధముచేయుట దైవికమగు నాత్మధర్మమని పూర్వమే నిరూపించి మనకాశ్చర్యము కల్పించినాఁడు,

> "మునులార! నన్ను విధి యేమని మును బుట్టించె నట్టుల య్యెడుఁ గాకీ
> వినఁజవిగాని పలుకులకు బనిగలదే యుడుగుఁడింక బహుభాషణముల్"
>
> —ఉద్యో. తృ. 325.

క్రాంతదర్శులు ఋషిపుంగవులు నయిన నారదాదులగాంచి రారాజన్న మాట లివి. "నా జన్మరహస్యమును త్రికాలజ్ఞులయిన మీరు గుర్తింపలేదా!" యని ఎగతాళి. ఆరణ్యపర్వమునఁ బాతాళలోకమున రాక్షసులు సుయోధను జన్మరహస్యము దెల్పెడి ఘట్టమున (ఆరణ్య. షష్ఠా. 43-49) ఈ విషయము స్పష్టమగుచున్నది.

మహాత్ములు ధర్మవర్తులునని కీర్తిగాంచిన ప్రతిపక్ష వీరుల కగ్నిపరీక్ష వంటి క్లిష్టపరిస్థితుల నేర్పరచి తన్నివృత్తికొఱకయి వారిచేత ఘోరమయిన అధర్మము నొనర్పఁజేసి, తత్కారణముగా నాయకునియందు నిర్దయతోకూడిన రణోత్సాహముఁ గల్పించి, ధర్మదీప్తమగు యుద్ధవీరమును పోషించుట యొక పద్ధతి. ద్రోణపర్వమునఁ బద్మవ్యూహభేదన మొనర్చి, శత్రువీరులఁ జెండాడి, ప్రచండ పరాక్రమమున నవలీలగా రణకేళి సలుపుచున్న యభిమన్యుఁడుఁ కౌరవవీరుల కసాధ్యుఁడు కాగా యుద్ధావేశమున ద్రోణుఁడే యాతని వధ వంచనచేసాధ్యమని సూచించినాడు (ద్రోణ. ద్వి. 105). దాని నాసటగాఁ గొని కర్ణాదు లొక్కుమ్మడిగా బాలుని చుట్టుముట్టి, యాతని విరథునిఁజేసి మరణమునకు మార్గ మేర్పరచిరి. ఈ కృత్యమునకు హేతువు ద్రోణుఁడు. అతఁడు పరిత్యక్తజీవుఁడైన తరువాత నాతని కంఠము ధృష్టద్యుమ్నుఁడు తెగనటికెను. ఆకృత్యము పలువురకు దారుణము నధర్మము ననిపించినది. అర్జునుఁడు ఆ క్రియను గర్హించుచు ద్రుపదాత్మజుని నిందింప ధర్మజుఁ డడ్డమువచ్చి ద్రోణుఁ డధర్మవర్తియనియు అతనినిఁజంపుట న్యాయమేననియు నిట్లు వాదించినాఁడు.

> "ఆ సభఁ బాంచాలి గాసిసేయఁగ నుపేక్షకుఁడయి చూచెఁ బెక్కంఁడ్రఁ గూర్చి
> కొని బాలు నభిమన్యుఁ గూల్చె, నించుకవడి యాగిన నర్జునుఁ డగ్నిఁ జొచ్చు
> ననువగ మనల నతనికిఁ దోడ్పడఁబోవ నీకాఁగె నమ్మెయి నిట్టి ధర్మ
> పరుఁడైన కలశసంభవునితోడ సరివచ్చు టుచితంబె...." —ద్రోణ. పంచ. 379.

ఇందలి కాకుస్వర మాతని హృదయమందున్న యక్కసు వెళ్లఁబోయుచున్నది. ద్రోణుని క్రౌర్యమునకును, ధర్మవిరహితత్వమునకును రోసినవాఁడు కావుననే 'అశ్వత్థామ యను కుంజరము హతమైన'దను వాక్యముఁ బల్కుటకు అంగీకరించుట.

పాండవ పక్షవర్తులగు వీరులందఱు ధర్మజుని ధర్మమార్గము నాశ్రయించిన వారగుటచే వారి యుత్సాహము లెన్నిప్రయోజనములతోఁ గూడి యున్నను తద్ధర్మవీరముననే అంతర్లీన మగుచుండును. ఉదా : అభిమన్యు రణవీరము: ద్రోణవిరచిత పద్మవ్యూహము పాండవులకు దుర్భేద్యమైనది. తద్భేదన కళాకోవిదులు కృష్ణార్జున ప్రద్యుమ్నాభిమన్యులు. వారిలో నప్పుడెదుట నున్నవాఁడు ఉత్సాహశౌర్యసంపద్దుర్నిరీక్ష్యుఁడైన యభిమన్యుకుమారుఁడు. ధర్మజుఁడు వ్యూహపు మొనఁ జించఁగా నాతనిఁ గోరెను. అంతటి పెద్దతండ్రి తన్నభ్యర్థింప నానాఁడాతనిజన్మ కొక పర్వదిన మైనది. గురునాజ్ఞ మీఱరాదను ధర్మబుద్ధి యాతని యుత్సాహముఁ బ్రేరేచినది.

> "దీని ముఖంబు భేదించు తెఱంగు నాకెఱిఁగించె మాతండ్రి యేనుదెఱపి
> సేయనేర్తునేఁ జొచ్చి చించి చెండాడెద; మూఁకలెల్లఁ జుట్టు ముట్టినపుడు
> వెడలునట్టి వెరవు విన; దానికేమి ; నాచొచ్చు నేర్పు బులుపు చూడు మధిప"
> —ద్రోణ. ద్వి. 5.

అని రాఁబోవు కీడును లెక్కసేయక - మోము చేటంత చేసికొని కొండంత మేనుపెంచి యుత్సహించినాఁడు. "వెడలునట్టి వెఱవు విన-దానికేమి" అనుటలో ప్రాణములపై నిర్లక్ష్యము, వయసున కుచితమైన మదము, మొండితనము, గుండె నిబ్బరము, 'మీకొఱకై నేను ముందు వెనుకల నాలోచించువాఁడనుగాను, ఎట్టి పరిస్థితులలో నెట్టి క్రియకైన సిద్ధమే, యనెడి త్యాగము, శక్తి ప్రస్ఫుటము లగుచున్నవి. ధర్మజుఁడడుగుటలో అభిమానమును రెచ్చఁగొట్టు మెలికమాటనుంచి పల్కినాఁడు- పార్థుండు మనల నుల్లసమాడకుండ నీలావు మెఱసి భేదించి మాకెల్లఁ బ్రియమొనర్పు కుమార!" అని. "మనల"నని సౌభద్రుని గూడఁ గల్పుకొని పల్కుటలో—పితృపరోక్షమున నతడు శత్రు విజ

యము సాధించినచో నది కీర్తిదాయకమను భావము కలదు. అది అభిమన్యుని యందు యశోకాంక్షకు దారితీసినది. అది స్పష్టముగా నభిమన్యుఁడు భీమునితో నాడిన పల్కులలో వ్యక్తమగుచున్నది.

"నను విను కీచకాంతక మనంబున ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చి య
మ్మొనఁ గలఁగింప కిట్లు కురుముఖ్యుఁడు ధర్మసుతుండు గారవిం
చిన జతనంబు నిష్ఫలము సేయుదునే నరుఁడున్ సుభద్రయుం
దనయునిఁగాంచి సంతసము దాల్చుట యంతయు రిత్తబుత్తునే"

"ఇదె యొక పిన్నవాఁ డదరి యెక్కుడు మూఁకల క్రందు దోలెడుం
గదుపుల వెల్చు గోపకుని కైవడి నంచు జనుల్ నుతింపఁ జే
సెద విని మామ ప్రీతి విలసిల్లఁగఁ దండ్రియు సంతసిల్ల బె
ట్టిదుఁడగు కౌరవేంద్రునకు దెప్పర మయ్యెడు భంగిఁ జేర్చెదన్"

—ద్రోణ. ద్వి. 10, 11.

ఈ పల్కులలో యశోఽనుప్రాణిత యుద్ధోత్సాహము ప్రకటిత మగుచున్నది. యుద్ధ విజయములకు యశ స్సానుషంగికమైనను ఇచ్చట యభిమన్యునిచే నది ప్రత్యేకముగా నతిశయముగాఁ గోరఁబడుటచే నుత్కటస్థితిఁ దాల్చుచున్నది.

అభిమన్యుఁడు స్వీయపరాక్రమముపై నెక్కుడు నమ్మకము కలవాఁడు. అందువలననే సాభిమానముగా తననుగూర్చి పల్కుకొనుచుండును. అధికారికి ఆత్మశ్లాఘనము అలంకారమగునుకదా! అది దురభిమానము కారాదు. అంతియ. యభిమన్యునికి యుద్ధానుభవము లేదనియు, ససురకర్కశు లైన కురువీరులతో బోరుటకది యదను కాదనియు సారథి అడ్డంకుసెప్ప:

"అనవుడు నల్ల నవ్వి యతఁడాతని కిట్లను దేవయుక్తుఁడై
యనికి బలారి వచ్చినఁ బురారిగణంబులుఁ దాను బన్నినం
గినిసి గడంగి క్రీడియును గృష్ణుఁడు దాఁకిన నే జయింతు మా
ర్కొని యనుచుండుదున్ సరకు గొందునె ద్రోణునితోడి యోధులన్"

—ద్రోణ. ద్వి. 15.

అని వీరాలాపములు వల్కినాఁడు. అతనినవ్వు శాత్రవబల నిర్లక్ష్యసూచకము, సూతాజ్ఞానావహేళనాత్మకము. అతనిపూనిక తనమాటను నిలువఁబెట్టుకొనుట కేనఁట! అదనుకు పరాక్రమముఁ జూపనిచో తన పూర్వప్రతిజ్ఞలు ప్రగల్భములై తాను నిందింపఁబడును. కావున నిందు మానవీరచ్ఛాయలు స్పష్టముగా గోచరించుచున్నవి. అభిమన్యునం దిన్నిభేదములచే గోచరించునుత్సాహము ధర్మజ

శాసనానువర్తన మగుటచే దానికంగముగా నిలువఁబడి అతని యుత్సాహమునే వ్యంగ్యముగాఁ బోషించుచున్నది.

ఒక వీరుఁడు శత్రువుతో డీకొనినపుడు స్మృతిరూపమున నాతఁడు చేసిన దుర్ణయముల స్వయముగా భావించి ద్విగుణీకృతోత్సాహుఁడై యుపాలంభనాయత్తచిత్తుఁడై శత్రుమర్దనమున కుత్సహించుట రణవీరస్ఫూర్తిని గల్గించును. అభిమన్యుఁడు పద్మవ్యూహాయుద్ధమున దుశ్శాసనునిపై లంఘించి—

"అనఘుని ధర్మనందనుని నాసభ నమ్మెయి నీవు నొవ్వఁ బ
ల్కిన ఫలమందఁజేసెదఁ జలింపక యుంచుకసేపు నిల్వుమీ
నిను లఘుచిత్తు గ్రూరు నవినీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెం
చిన గరువంపుఁ దండ్రులకుఁ జిత్తమెలర్ప ఋణంబుఁ దీర్చెదన్"

—ద్రోణ. ద్వి. 50.

అని తండ్రులఁ దూలనాడిన దుశ్శాసనుని ఉపాలంభించినాఁడు. పగవానిని పొరిగొనునంత పౌరుష మాతనియందు పొంగిపొరలినది.

శత్రువీరులలో నెవరైన విశేషపరాక్రమముఁ బ్రకటించి, నాయకునికిఁ దీరనినష్ట మేర్పఱిచినచో నాతఁడు గాని, ఆతని అనుయాయులు గాని వానిని సంహరించుటకై ప్రతిజ్ఞ గైకొన్నచో వారియందు వీరరసస్ఫూర్తి కలుగును. ఉదా : సుభద్రాతనయునకు ధర్మరాజాదులు సహాయము చేయజాలకుండునట్లు సైంధవుఁ డడ్డుపడినాఁడు. అది తెలిసిన సవ్యసాచి యిట్లు ఘోరప్రతిజ్ఞఁ జేసినాఁడు.

"వినుఁడీ నాదుప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీనాథులున్ సింధురా
జు నవశ్యంబును నెల్లిసంపుదు భయస్థుండై నినుం జొచ్చినన్
వనజాక్షున్ శరణంబు వేఁడినను గర్వంబేది నన్నుం దగం
గనినం బోరు దొఱంగిపోయిన నెఱుంగంగాని సత్యవ్రతా!"

"ఇట్లు సేయనైతినేని గురుద్రోహి గతికి బ్రహ్మఘాతి గతికి మద్య
పానరతుని గతికి మానాప్తజనపరివాది గతికిఁ బోవువాఁడ నధిప!"

"అనిమిషదైత్య కింపురుషులాదిగ నెవ్వరు వచ్చి కాచినం
దునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్త్రుఁడు గ్రుంకకుండము
న్న నరవరేణ్య యిత్తెఱఁగు నాకొనరింపఁగ రాకయున్న నే
ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁ జూడఁగ గాండివంబుతోన్."

—ద్రోణ. ద్వి. 281-283.

రాజఁ బెట్టిన కొలిమివలె తనలోతాను రోషానలజ్వాలలఁ బెంచుకొనుచు ప్రతీకారవాంఛాసంబంధ మగు నుత్కటోత్సాహముఁ దెల్పు నుష్ణంపు పల్కులీ శపథములు. ఈ ప్రతిజ్ఞ యే శ్రీకృష్ణునిముందు చెప్పబడుటచే మఱలఁ జర్వితమై (ద్రోణ. ద్వి. 307-313) అర్జునాశ్రయమైన యుద్ధవీరముఁ బుష్టినొందించుచున్నది. ఇట్లే వస్తునాయక సమాశ్రయముగా వీరరసము పెక్కుతీరుల ప్రస్ఫుటమై సరసులచే నాస్వాద్యమాన మగును. వానిని విజ్ఞులకు వదలుచున్నాను.

రసజ్ఞుఁడగు కవి తన కావ్యమునందు రసోచితమగు నాలంకారిక రచన మొనర్చి, రసోత్కర్షకుఁ బాటుపడుచుండును. 'కవిబ్రహ్మ' ఇట్టి కావ్యకళలో సిద్ధహస్తుఁడు. ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, నిదర్శనము, దృష్టాంతము, ఉల్లేఖము, అర్థాంతరన్యాసము మొ. సర్వజన పరిచితములగు నలంకారములను మాత్రమే యెన్నుకొని, మాఱుమూల లగు వానిని వదలి ఉపమానోపమేయ ధర్మవైరుధ్యము గాని, అతివ్యాప్త్యవ్యాప్తిదోషాదులు గాని లేక యౌచిత్య మెఱిఁగి అలంకారము ప్రయోగించు నేర్పు అతనికి వెన్నతో వచ్చిన విద్య. "ఆంధ్రావళి మోదముం బొరయ" రచింపఁ బూనినవాఁడు గాన పండిత పామర సుగ్రాహ్యమై యాలోచనామృతదాయకమగు నాలంకారిక రచనమునే అనుసరించినాఁడు తిక్కన.

యుద్ధవీరుని ప్రతాపము కన్నులకుఁ గట్టునట్లు వర్ణించుటకై యాతఁడు "అగ్గలిక దూఁది దరికొను నగ్గి తెఱంగున" (భీ. ద్వి. 163); "వెరవున గోపకుఁడు గదుపు వెలిచిన మాడ్కిన్" (భీ. ద్వి. 125) "ఘన శార్దూలంబు బాలమృగంబులం గని గవియు చందంబున నెదుర్కొని" (భీ. ద్వి. 236); వెరవుగల వనపాలకుండు తాళఫలంబులు దిగఁద్రోచు చందంబున మెఱుంగులడరు వెడంద వాతియమ్ముల నమ్మహీశుల తలలు డొల్లనేయుచు- (భీ. తృ. 63); బలుమానిసి చలిచీమలం గాలం జమరు చందంబు దోఁచె (భీ. తృ. 220); కార్చిచ్చు గవిసి మృగతతి నేర్చు కరణి (భీ. తృ. 278); నోరికండ నాఁచికొనిన మ్రోగు బెబ్బులి విశేషము దోఁపఁగ (ద్రో. ద్వి. 25); వట్టి యడవిముట్టి యేర్చు కార్చిచ్చు చందంబునం జతురంగ బలంబులం బారి సమరినం (ద్రో. ద్వి. 60); చిచ్చు మిడుతపిండు నేర్చు చెలువముఁదోచెన్ (ద్రో. ద్వి. 77); తేళ్ళగమింగనిన బెబ్బులియుబ్బు దోఁప (ద్రో. ద్వి. 78); పసుల నడుమ సొచ్చు పులిపోలె (ద్రో. పం. 126); గాడ్పుతోడుగల యగ్నిదేవుండును బోలెం దేజరిల్లె (ద్రో. చ. 294); వానపైఁ గురియ పంచిన మస్తక మొప్పఁ బోవుసుందర వృషభంబుపోలె (ద్రో. చ. 154)-

ఇటువంటి యుపమానములు రసోదంచితముగా ననుసంధించుచుండును. వీని వలన తిక్కనకున్న విపుల లోకానుభూతి గోచరమగును. దీనికిఁదో డాతని ప్రకృతి సౌందర్యావిష్కరణోత్సాహ మతని కవితలో అడుగడుగున ద్యోతకమగును. భీష్ముని చతుర్థదివస యుద్ధమున రంగమున నిలిచిన సైన్యద్వయము తిక్కన కన్నులకు—

"కారుకొని మేఘమాలాకారంబునఁ జాలనొప్పెఁ గౌరవసైన్యం
బారూఢ వీరరస విస్ఫారంబై యంతఁ దోఁచెఁ బాండవబలమున్."

—భీ. ద్వి. 169.

కౌరవ సైన్యము 'కారుమేఘమాలాకారంబున' నూహించిన కవిప్రతిభ అనన్యసామాన్యము. భావుకుని కనంత రసవృష్టి కురియు ఉపమ అది. పాండవ సైన్యము ఆరూఢ వీరరస విస్ఫారమట! కాలమేఘమందలి నైల్యము వర్ణ వ్యంగ్యమున భయానక బీభత్స రసములను ధ్వనించుచున్నది. వీరరసమను పదము పాండవసైన్య గౌరవర్ణచ్ఛాయను ధ్వనించుచున్నది. రసనామ ప్రయోగముచేత పాండవ సైన్యోత్సాహముత్కటమని వ్యంగ్యము. ఇట్టి శిల్పము తిక్కనలో ననంతములు. ఇంకను-మండలీకృత కోదండుడును, బటు సంధాన స్ఫురిత శర నికరుండునునగు నభిమన్యుని "బరివేషములోనం గిరణస్ఫురణ దుర్నిరీక్ష్యుండగు తపను ననుకరించె" ననుటయందును (భీ. ద్వి. 39); ప్రకృతి పరిశీలనా పాటవము, సమయసూచనము వ్యక్తమగుచున్నవి. నాయకు నేకైక వీరునిగా నిరూపించుట కనన్వయాలంకారమార్గము ననుసరించుచు—

"కృష్ణసారథ్యమున నొప్పు క్రీడి యిపుడు కౌరవానీకముల నెల్లఁ గసిమసంగి
కృష్ణ సారథ్యమున నొప్పు క్రీడియైన నెట్లు సేయంగవలయుఁ దానట్లుసేసె"

—భీ. ద్వి. 92.

నని మెప్పించుటలో తిక్కనకు తిక్కనయే సాటి.

ద్వంద్వయుద్ధము వర్ణించుపట్ల వీరద్వంద్వమును వర్ణించుటలో తుల్యబల నిరూపణములో తిక్కన పోయిన తీరు లొకటిరెండు గమనింపుఁడు.

1. భీష్ముఁ డర్జునునిపై బాణముల వెల్లువలు కురియింప—

"ఆ వెల్లువ శరజిహ్వాలఁ ద్రావి ధనంజయమహాగ్ని దరికొని కవియం
గా వెగడొందెడు కురుబల దావము శాంతనవుఁ డంబుదము క్రియఁ గాచెన్"

—భీ. ద్వి. 45.

విరుద్ధగుణములను తుల్యావస్థలోఁ బ్రకటించి యిరువుర బలముల నిరూపించు వైఖరి యిది. ఇట్లుగాక – వృషభంబులక్రియ నొండొరుల మార్కొలయుచు (ద్రో. చ. 191); కొఱవి గొఱవిం దాఁకిన విధమునం దలంపడి (ద్రో. చ. 154); మొ. సమానలక్షణముగల్గిన యుపమానములచే తుల్యబలముల నొక్కొక్కయెడ తిక్కన నిరూపించును. మఱియు ఉపమామాలను గైకొని రణక్రమము నిరూపించుటయు కలదు. కర్ణ భీములు—

"బలు డేగల కైవడి బెబ్బులుల పగిది మత్తకరులపోలిక దర్పో
జ్జ్వల సింహములచాడ్పున నలవుఁ జలము మెఱయఁ బెనఁగి రారథికవరుల్"

—ద్రో. చ. 181.

అని వర్ణించుటలో నొకచక్కని క్రమవికాసము కలదు. రెక్కలు విదుల్చు డేగలనుటలో బాహులప్పళించు భంగిమయు, బెబ్బులి యుపమానముతో కుప్పించి పైకెగురుటయు, గర్జించుటయు, మత్తకరుల పోలికతో బాహాబాహి, కచాకచి ఇత్యాది మల్లయుద్ధ విశేషములును, ఉజ్జ్వలసింహము లనుటచే పౌరుషామర్షోగ్రసమగ్రస్ఫూర్తియు ధ్వనితములయి రణక్రమవికాసమును ప్రకాశమొనర్చున్నవి. ఇట్టి మాలోపమలను సామాన్యముగా తిక్కన విశేష ఘట్టములందు మాత్రమే వాడును. రణనిహతుఁడైన అభిమన్యుని వర్ణనము దీనికి చక్కని యుదాహరణము.

"జగములన్నియును దేజంబున వెలిఁగించి యపరాద్రి సేరిన తపను మాడ్కిఁ
దఱచైన కానలు దరికొని నివుఱుగాఁ జేసి యారిన శిఖి విధమున
గగనంబుతో రాయు కరడులుగల జలం బివురఁ బారిన మహార్ణవము కరణి
నున్నతగతి సెడి యుర్విపైఁ గడు విన్ననై పడియున్న సుధాంశుభంగి
భీరమునఁ దమవారికిఁ బెం పొనర్చి
యరులసమయించి వసమఱి యనువుదప్పి
తెగియుఁ జూడ్కికిఁ జాల బ్రేఁగగుచుఁ బొలిచె
మహితమూర్తి శోభితుఁ డభిమన్యుఁ డధిప."

—ద్రో. ద్వి. 126.

అభిమన్యునిలో నంతకుపూర్వము వెలుగందిన దుర్నిరీక్ష్య తేజము, శత్రుభంజన సామర్థ్యము, అతిలోక గాంభీర్యము, మనోహర చారుత్వము, అఖండాభిమానము స్మృతిలో స్ఫురించునట్లుగ చించిన ఈసీసము తిక్కన రసావేశనివాసము.

కవితాశిల్పమునకు కాణాచియైన తిక్కయజ్వ యుద్ధపంచకమును వీర రసావతారముగాఁ దీర్చిదిద్ది కృతకృత్యుఁడైనాఁడు. తరువాతి కవులకు యుద్ధ వీరరచనా శిల్పము భిక్షపెట్టినాఁడు.

శాంత్యనుశాసనికాశ్వమేధపర్వము లందలి నాయక వృత్తమును వ్యాఖ్యానించుచు శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావుగారు సరసముగా నిట్లు నుడివినారు, "అమానుషమగు పాపమొనర్చిన దుర్యోధన దుశ్శాసనులను జంపుటచేఁ గ్రోధము శాంతించినది; తాత్కాలికమగు తృప్తికల్గినది. కాని, సకల హితబంధువర్గ నాశనముచేఁ గల్గిన శోకావేగ ముత్కటమై సత్పురుషుఁడగు ధర్మజుని మనస్సు వికలపఱచినది. ఇంతటి పాపమునకుఁ గారణమగు రాజ్యసంపదను బూర్తిగ విసర్జించుటయే తనకు కర్తవ్యమని ధర్మజుఁడు నిశ్చయించినాఁడు. పశ్చాత్తాపమున కిది ముఖ్యలక్షణము. ధర్మజుని మనోవైకల్యము పోపుటకును, మనస్సు ప్రశాంతత నొందుటకును గురూపదేశ మవసరము; అంతియగాక విశిష్ట జ్ఞానోపేతుఁడగు కర్మయోగిగ ధర్మజుఁడు పరివర్తన మొందవలసి యున్నది. ప్రజాపాలనకు జనకమహారాజులవంటి జీవన్ముక్తులే యర్హులని భారతీయుల యభిప్రాయముకనుక ప్రజాపాలనభారము నిర్వహింపఁ బోవు ధర్మజునకు సమగ్రమగు నైహికాముష్మిక జ్ఞానము మిక్కిలి యవసరమై యున్నది. ఇట్లు శాంత్యనుశాసనికపర్వ గతమగు విషయమంతయుఁ బ్రధానేతివృత్తముతో సమన్వయము చెందుచున్నది. జ్ఞానోపదేశమునం జేసి స్వధర్మోన్ముఖుఁడైన ధర్మరాజు రాజ్యభారము వహించి, వ్యాసబోధితుఁడై లోక హితార్థ మశ్వమేధమును వేదోక్తవిధమున నిర్వహించి, దేశమునందలి రాజుల నెల్లర నేకైక ధర్మశాసనబద్ధులం గావించినాఁడు. అంతియేగాక నిరాసక్తుఁడై వేదోక్తములగు కర్మల నాచరించుట వలనను, స్వధర్మమును శ్రద్ధతో నిర్వహించుట వలనను గృహస్థుఁడు భవబంధ విమోచనముం బడయఁగలఁడను విషయము ధర్మరాజు నశ్వమేధ వృత్తాంత మూలమున వ్యక్తీకరింపఁబడినది. ఈ పర్వమున వర్ణితమైన సక్తుప్రస్థుని వృత్తాంతము స్వధర్మ విశిష్టతను నిరూపించుచున్నది."[1]

అశ్వమేధ పర్వమున ధర్మజుని దయావీరమున కర్జునుని యుద్ధవీరమంగముగా నిలిచి పోషించినది. పవనాశ్వము ననుసరించు నర్జునుఁడు ధర్మరాజు తనతో పల్కిన పల్కులనే యెదురుపడిన ప్రతి రాజునకును తెల్పుచు దయాభావమును ప్రదర్శించినాఁడు. ఉదా :

"కవిసిన వానితో మఱియు గవ్వడి యిట్టులనున్ దయాధురా
ప్రవణుఁ డజాతశత్రుఁడు దురంగమ రక్షకు నంపునప్డు భూ

1. 'భారతము - తిక్కన'—పుట. 158-159.

పవితతి యెల్లనుం దెగియె భారత యుద్ధమునందు బాలురం
దివిరి వధింపఁగాదు కృప దిన్నదనం బెసఁగం జరింపుమా !"

"అవినయవృత్తినశ్వమున కడ్డము వచ్చిరయేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్కి యనిఁ దప్పఁగఁ ద్రోవుము గిన్కమాను"

—అశ్వ. చతు. 278.

మన్న కిరీటి మాటలు ధర్మజుని దయామయ హృదయభావస్పందనములు. అహింసాప్రధానమయిన ధర్మయజ్ఞము నాయకునిహృదయ శాలలో ప్రారంభమయి యుండుటచే నీ పుణ్యవాసనలు విరివిగా వ్యాపించినవి. వానిని గంధవాహునివలె యింద్ర తనూజుఁడు దిగంతముల వఱకు ప్రసరింపఁ జేసినాడు.

సవనాశ్వము నడ్డగించి పరాక్రమవంతులై త్రిగర్త దేశాధినాథులు తన్నెదిరించినను, ధర్మజప్రబోధముచే దయనుదాల్చిన యర్జునుఁడు సమయోచిత రణపాండిత్యముఁ బ్రకటింపఁ జాలక గాండీవమును జాఱవిడుచుకొనినాఁడు. అప్పుడు కొందఱు వీరులు :

"ఇంద్ర ధనువుచందమున నెనక మెసఁగు
గాండివము పాటుగంటిరే చండవిక్ర
మాభిరాముండు గాండీవి యన్నపలుకు (ధర్మజుని మాటలకు)
లకు మహోగ్రత సూపనొల్లండుగాక"

—అశ్వ. చతు. 14.

యని యర్జునుని మనస్తత్త్వమును వ్యాఖ్యానించినారు. శత్రువీరులు పంతమునకు యుద్ధమునకు దిగి యౌద్ధత్యము ప్రకటింప మానధనుఁడగు నాయకునకుఁ గ్రోధమువచ్చుట సహజము. కాని అందర్జునునికి క్రోధమురాలేదు; అతనియందు ధర్మజ ప్రేరితమైన దయాభావముచేఁ గ్రోధము సుప్తమైనదని భావము. అపై నిజముగా నర్జునకు కోపమువచ్చినది. దానికి కారణము గాండీవ పతనమువలని యవమానము, అవినయ ప్రధానమైన శాత్రవోద్ధతి. ఇచ్చటి విభావానుభావ వర్ణన మెంత రసోదంచితమో కాంచుడు :

"అటమున్న గాండివం బుత్కట రయమున నెత్తి కోపదహనుండత్యు
ద్భట మూర్తిఁ దాల్చెనన మిక్కుటమై కడగంటి పెంపుగొమరారంగన్"

ఆ భీభత్సుండు,

"పిడుగులువడిఁ బెక్కొక్కటఁ బడియెడుననఁ దొరఁగఁజేసె బటు విశిఖముల
ప్పుడు మేదిని దోఁపద చెప్పెడు కొలఁదియె రథికవరుల బీనుఁగుఁబెంటల్"

—అశ్వ. చతు. 16-18.

ధనువు రయమున నెత్తుట, కోపదహనుఁడగుట, కడకంటికెంపు కోపభావమున కనుభావములు. 'బీభత్సుండను' శబ్ద మర్థశక్తితో నర్జునుఁడు వైరి బలమును బీభత్సమొనర్ప నుత్సహించుచుండెనను భావముఁ గల్గించుచున్నది. అంతటి క్రోధముఁబొందిన యాతని కార్ముకనిర్ముక్తబాణవితానము పిడుగులదొంతర యనుటలో నలంకారధ్వని కలదు. ఒక్కొక్క విశిఖ మొక్కొక్క వజ్రాయుధము. ఇంద్రుని ఆయుధశక్తి యంతయు నొక్కబాణముతో తులంమీ యింద్రపుత్త్రుని యందు. 'రథికవరుల బీనుఁగుఁబెంటల్' అనుటచే మహారథికులను మాత్రమే ద్రుమందించి సైన్యమును జాలితో వదిలెనని యేర్పడుచున్నది. సింహము గజేంద్రమస్తిష్క మాంసఖాదనముచేయు వైఖరి యిది. ఇది యంతయు నర్జునునికి నొంటఁబుట్టిన కోపముకాదు. పాలపొంగువంటిది మాత్రమే. 'అన్నమాట'ను నిరాదరించిరని శత్రువులమీఁదఁగల్గిన తాత్కాలిక మానసోద్రేకమే గాని మఱొండుకాదు. క్షణములో నాతనికోపముత్కటమై గప్పని మండినది. పోయినవారుపోఁగా మిగిలినవారి బందుగులు శరణువేఁడ నాతని యుడుకప్రయత్నముగాఁ జల్లారినది.

"ఆయుగ్రోద్ధతిసూచి పెల్కుటి త్రిగర్తానీకముల్ నల్గడం
బాయంబాఱెఁ దదాప్తు లేము దగ నీపంపోపి సద్భక్తిమైఁ
జేయంగాఁ బనిగొమ్ము పేర్మిగ మముం జేకొమ్ము సమ్యగ్దయా
శ్రీయుక్తా యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారినెల్లం గృపన్."

వ. అట్లు వెనుకొనక నిలిచి యెలుంగెత్తి వారలతో మీరిట్లు ప్రాణంబులు గాచికొనుండు నాపంచినపని సేయంబూని బుద్ధికలిగి సుఖులరై యుండునని యయ్యశ్వంబు ననుసరించె —అశ్వ. చ. 19, 20.

ఇందు శరణువేడినవారినిఁ గాపాడునట్టి ధర్మముతోపాటు శత్రువీరులకుఁ దగిన బుద్ధిచెప్పి తరువాత వారిని దయతోఁగాపాడు భావముకూడ గోచరించుచున్నది. లేకపోయినచో నెలుఁగెత్తి రాజలోకమును పిలువవలసిన అవసరము లేదు. 'కృపన్' అను శబ్దభావమదియే - ఆ యర్థము :

"చంపకుమీ రాజుల ననుకంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెంపను కుసుమమునకు నాపంపొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ."
—అశ్వ. చతు. 34.

యను ధర్మజుని ఉపదేశముచే నాతని యెడందలో నాటినది. ఇట్టి ప్రవృత్తియే అశ్వమేధపర్వమునం దెల్లెడల గోచరించినది. ధర్మజుఁ డఖిలపృథ్వీస్వీయాయత్త

మైనట్లుగా నశ్వమేధయాగమును సలక్షణముగా నిర్వహించి, తత్సామ్రాజ్య మంతయు ఋత్విగర్చనముగా ధారవోసి నిష్కామమును, నిర్వ్యామోహమును ప్రకటించి, ధర్మబద్ధమగు దానవీరమును ప్రదర్శించెను.

ఇట్లు ధర్మజుని ధర్మసంస్థితి పెక్కు తీరుల ప్రదర్శింపఁ బడుటయేగాక శోధింపఁబడినది. సంభోగ శృంగారము విప్రలంభముచే నెట్లు నిగ్గుదేలునో అట్లే ధర్మోత్సాహము ధర్మసంకట పరిస్థితులలో నాయకుడు ప్రదర్శించు ధృతి నాశ్రయించి పుష్టిని, వికాస విస్తరములగాంచి సారవంతమగును. ధర్మజుని జీవితములో నిట్టి ఘట్టములెన్నియో భారతమునఁ గలవు.

ధర్మజుని కేర్పడిన ధర్మపరీక్షలు ప్రధానముగా రెండు విధములు. అవి: మానవ పరీక్షలు, దైవపరీక్షలునని. మానవ పరీక్షలలో భీమార్జునశక్తి యుక్తుల నుపయోగించి విజయము సాధించినాఁడు, దైవకృత ధర్మపరీక్షలందు స్వీయ మగు నాధ్యాత్మికశక్తిని, ధర్మదీక్షను ఉపయోగించి సర్వ స్వతంత్రుఁడై వ్యవహరించినాఁడు. దైవ పరీక్షలలో మకుటాయమానమీక్రింది చరమపరీక్ష. ఇందుఁబ్రదర్శింపఁబడు ధర్మస్థితికి 'దేవత్వ'మే ఫలము :

ధర్మజు నాశ్రయించివచ్చు సారమేయము స్వర్గ ప్రవేశమున కనర్హ్మమను నింద్రుని పల్కులు నాయకున కగ్ని పరీక్షవంటివి. శునకమునం దమేయదయా ప్రపూర్ణుఁడై యున్నవాఁడు ధర్మరాజు. అతని ధర్మబుద్ధి చలింపలేదు. ఇంద్రు నితో —

> "............................................ విను భక్తియుక్తుని విడువు బ్రహ్మ
> హత్యఁ బోలెడి పాపమని చెప్పుదురు పెద్దలట్లు గావున దీని నఖిల ధర్మ
> సారజ్ఞ ! విడుచుట సనదు దివ్యసుఖంబునకు గాఁగఁ బాపంబునకుఁ జొరంగఁ-జాల"
>
> —మహా. ప్ర. 55.

నని సర్వభూతదయావిశేషరూపధర్మమును ప్రతిపాదించినాఁడు. భక్తియుక్త మగు శునకమును వదలినచో బ్రహ్మహత్యాదోష మేర్పడు ననుటలో నాతని పుణ్యశీలము స్పష్టమగుచున్నది. 'విడుచుట సనదు' అనుటలో నాతని ధృతియు, పట్టుదలయు, ధర్మస్థితియు వ్యక్తమగుచున్నవి. 'దివ్యసుఖం..., జాల' ననుటలో నాతని వివేకసహితమైన జ్ఞానము, ధర్మముకొఱకై యెంతటి సుఖమునైన నవలీలగాఁ ద్యాగముజేయు బుద్ధి ధ్వనితము లగుచున్నవి.

మహేంద్రుఁడు శునకమునంటిన వారి సుకృతము నశించుననని ధర్మ రాజును బెదిరించెను. అది ధర్మజునికి బలమైన ప్రతిపక్షము. సురేంద్రుని పల్కు

గోరుచున్నాఁడు. వర మీయనిచో నింద్రునిగూర్చియే సమిద్ధతపంబు లొనర్తు నని పలుకులలో గడుసుదనము నొలికించి, యింద్రుని మనసు కదలించినాఁడు. ఇంద్రసుతాదుల వశపరచుకొను మంత్రమే యింద్రునియందు ప్రయోగించినాఁడు. అతని 'ధర్మనీతి'వర్తన మట్టిది. ధర్మవినయదయాదిగుణప్రకాశక మగు నీ వాక్యరచనావిధానము విషయనిరూపణ సమర్థ మగుటయేగాక విషయాతీతుఁడగు దైవము నార్ద్రిపఱిచినది. సారమేయరూపుఁడగు ధర్ముఁడు నిలువున పులకరించి నిజరూపముఁదాల్చి ధర్మజుని ధర్మస్థితిని వేనోళ్ళఁ గీర్తించినాఁడు.

ఇట్లు సర్వకాల సర్వావస్థలయందు ధర్మనిష్ఠను జన్మవ్రతముగా నుత్కటోత్సాహముతో సాధించి తదానుషంగికఫలమైన కీర్తిని, శాశ్వతఫలమైన స్వర్గమునుపొంది, యైహికాముష్మిక సుఖములందిన ధన్యాత్ముఁ డీ మహా కావ్య నాయకుఁడైన ధర్మరాజు. అనితరసాధ్యమగు నట్టిస్థితి అతని ధర్మప్రవర్తనము వలననే కలిగినది. లౌకికులగు ధర్మశూరుల కాదర్శవంతుఁడగు అలౌకిక ధర్మవీరుఁడు ధర్మరాజు.

ఇంద్రుఁడు "ఎల్లవారును విన సంపూర్ణస్వరంబున నిట్లనియె"

"దానములం దపంబులను దర్దయుఁ బేర్కల యట్టివారలన్
మానవనాథులన్ వినమె మాసెఁ దదీయ యశంబు లెల్లనీ
మానిత కీర్తి గిర్తులు సమస్త జగంబులయందుఁ బర్వుట
న్మేనులతోడ వారిటులు సేర్చిరె రానమరత్వ సిద్ధికిన్" —మహా. ప్ర. 68.

త్రిలోకాధిపతి పల్కులు కావ్యనాయక కీర్తి జయపతాకలు !!

ఇట్లు పైననిర్వహింపఁబడిన ధర్మరాజు ధర్మమయ జీవితమున శాంతరస మంగముగా గల్గిన వీరరసము సర్వాంశములలో వ్యాప్తమైనట్లు నిర్బాధముగాఁ జెప్పవచ్చును. ఆనందవర్ధనాదులగు నాలంకారికులు మహాభారతమును శాంతరస ప్రధానమగు కావ్యముగా నిర్దేశింతురుగాని, అదే యానందవర్ధనాచార్యులు "రసస్తుకథా నాయకాశ్రయః తద్విపక్షాశ్రయో వా"యనినిర్దేశించిన దానినిఁబట్టి కావ్యగతరసమునాయకాలంబనముగా భావించినట్లుస్పష్టమగుచున్నది. సామాజికులా నాయకాశ్రయములయిన భావములను తాదాత్మ్యముతో "యస్తుర్ణాతుష్టిమాయాతి..."అనుభరతోక్తిననుసరించి యనుభవింతురు. నాయకుఁడు వీరరసాశ్రయుఁడయినచో సామాజికుఁడు వీరరసానందమునే పొందును. శాంతరసాశ్రయుఁడైనచో శాంతమునే పొందును. ధర్మరాజు స్వర్గారోహణ పర్యాంతము వఱకుఁ గల తనజీవిత వృత్తమున మోక్షమును బొందినట్లు ప్రతిపాదింపఁబడక

అతని ప్రవృత్తి ధర్మాచరణమునకు ఫలరూపముగా స్వర్గప్రాప్తి నిబంధింపఁ బడినది. అందుచేత నాయకుఁడు స్వర్గఫలకమయిన ప్రవృత్తిధర్మాశ్రయము కలవాఁడని యేర్పడుచున్నది. అట్టి యతని ప్రవృత్తిధర్మము నివృత్తి ధర్మరూపమయిన మోక్షజ్ఞానముచేత మెఱుఁగులు పెట్టఁబడినప్పటికి అతఁడు కథావ్యాప్తి యందు ధర్మవీరుఁడే యగుచున్నాడు. అతని యందు గోచరించునట్టిది ధర్మవీర రసమే యను భావమున నిచ్చట రసచర్చ గావింపఁ బడినది.

ఒక వేళ కౌరవ వృష్ణి యాదవ వంశాది నాశనముచే సామాజికులకుఁ గల్గు నిర్వేదమునుఁబట్టి మహాభారతము నిర్వేద ప్రధానమనిగాని, అందుచే మోక్ష ఫలకమనిగాని చెప్పుటచాలదు. వారి కందుఁ గల్గు నిర్వేదభావము అచ్చటచ్చట జరిగిన మోక్షోపదేశములచే తొలఁగి విరిసిపోవుట సంభవించును. నాయకునందు నట్టి ప్రవృత్తియే గోచరించుచున్నది. అందుచేత సామాజికుల కును నిర్వేదమే మిగులుననుట సమంజసముకాదు. నిజముగా భారతమునందు ధర్మవిషయ ప్రశంస వచ్చినప్పుడెల్ల భీమాది పాండవులయొక్కయు, భీష్మాదులగు కురువృద్ధులయొక్కయు, ద్రుపదాది రాజులయొక్కయు, వ్యాసాది మహర్షులయొక్కయు దృష్టులు, ప్రశంసలు ధర్మజునియందే కేంద్రీకృతము లగుట సర్వత్ర కాననగును. మఱియు కథాంతమునఁ గూడ ఒక్క ధర్మజుఁడే స్వర్గారోహణాంతము వఱకు మిగుల్పఁబడుటనుబట్టి సామాజికుల చిత్తవృత్తి మొదటనుండియు ధర్మజునితోనే సహానుభూతి, తాదాత్మ్యమును పొందుచు కథాంతమువఱకును అట్లే అతని అనుభూతులనే చుట్టుకొని యుండుటలో విప్రతిపత్తిలేదు. అట్టిచో నాయకుడఁగు ధర్మజుని కథాశ్రవణముచే ధర్మరాజు వంటి ధర్మాధిష్ఠాతకును మానవజీవిత సహజములైన విఘాతములు గల్గుటయు నవి పెద్దల యుపదేశాదులచేఁ గల్గు స్థైర్యాదులచే పరిహారములగుటయు గుర్తించుచునే సహృదయులు ప్రవృత్తి ధర్మాచరణము నిష్ఫలముగాక ఉత్తరజన్మమున స్వర్గఫలప్రదమనియు, అధర్మాచరణము దుర్యోధనాదులకువలె నరక ప్రదమనియుఁ దెలిసికొని పాపవర్జన పూర్వకముగా స్వర్గాదిఫలమైన ధర్మాచరణమందుత్సాహులై ప్రవర్తించి ధర్మజునివలెనే ధర్మవీరులగుటకు మిక్కిలి యవకాశము గనఁబడుచున్నది. ఇట్లు నాయక దృష్టితోఁజూచినను, నాయక సామాజికుల దృక్పథములతో చూచినను మహాభారతమునందలి యంగిరసము శాంతరసముగాక ధర్మవీరమేయని నిశ్చయింపఁ దగుచున్నది.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తెలుఁగు భారతమున

శాంతరసము అంగిగా స్ఫురించుటలేదని సూచించియున్నారు. కాని వ్యాస భారతము శాంతరసప్రధానమని అంగీకరించియున్నారు. "(సంస్కృత) భారత మున్నది. భారత మహాకావ్యముయొక్క మహావాక్యార్థము శాంతరసము నందుఁ బర్యవసించుచున్నది. అది శాంతరస పర్యవసాయి యగుట వ్యాసో పజ్ఞకమైన విషయము. నన్నయచేసినచేత వేఱు, తిక్కకచేసిన చేత వేఱు, ఆయనదృష్టి వేఱు, ఈయనదృష్టి వేఱు. మహాకావ్యముయొక్క సమిష్టిమీఁద సంస్కృత భారతమునందు నిర్ణీతమైన శాంతరసము తెనుఁగు కావ్యమునందు కూడ సహజముగాఁ బర్యవసింపఁ జేసికొనవచ్చునుగాని యెచ్చట నీ శాంతరస మునకు నడ్డుతగులునో చెప్పలేము. ఆంధ్రమహాభారతము భిన్నకర్తృకమగుట చేత నా యిబ్బందికలుగదు. ఇది చాలా అగాధమైన విషయము" అని వ్రాకుచ్చి యున్నారు.[1] వారి యిట్టిదృష్టియు "భారతము ధర్మవీరప్రధానము" అను నాయూహకు ప్రోద్బలకముగనే యున్నది. శాంతరసప్రధానముగా, వ్యాసో పజ్ఞకముగ నిర్మింపఁబడిన సంస్కృతభారతముకంటె భిన్నమార్గమున నడపఁ బడిన ఆంధ్రమహాభారతమునందలిది శాంతరసము కానప్పుడు న్యాయముగ ధర్మవీరరసమునే అంగిరసముగ అంగీకరించుటకు వలనుపడుచున్నదికదా!

సాధారణముగా కావ్యరసమునకును కథానాయకాశ్రయ రసము నకును-నాయకుని చరిత్రయే కావ్యముగనుక - భేదముండరాదు. కాని కావ్య రసము అనినపుడు నాయకాశ్రయమైన అంగాంగి రసములతోపాటు, తదితర పాత్రాశ్రయములైన రసములు వ్యక్తములైనను నవి నాయకాశ్రయమైన అంగి రసమును మ్రింగివేయరాదు. ఆదృష్టితో చూచినను ఆంధ్ర మహాభారతమున భీమాదు లను నాయకులుగాఁ గలిగిన ప్రధాన నాయకుఁడగు ధర్మరాజు నాశ్ర యించినది వీరరసమనియే భావింపఁబడి ఈ చర్చారంభమునుండియు ప్రతి పాదింపఁబడినది.

కొందఱు భారతమున శ్రీకృష్ణుఁడు నాయకుఁడనియు, అందులకు ప్రోద్బలకముగ సంస్కృత భారతమునందలి 'నారాయణం నమస్కృత్య'అను ఉపక్రమమును, హరివంశముతో జరిగిన యుపసంహారమును, నడుమ నడుమ నిబంధింపఁబడిన శ్రీకృష్ణ మాహాత్మ్య సందర్భములను, భగవద్గీత, సనత్సు జాతీయము, మోక్షధర్మోపన్యాసములు మొ. గ్రంథాంశములను కలిపి చదివి వీనినే గ్రంథ తాత్పర్య నిర్ణాయకములైన లింగములుగా భావించి వీని పర్యా లోచనచే నది శాంతరస ప్రధానమనియు భావించుచున్నారు. ఇట్టి సందర్భము

1. జయంతి, 'నాచనసోముఁ డొకఁడు' వ్యా. ౧.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారనినట్లు సంస్కృత భారతమునకు సరిపెట్టు కొన్న సరిపోవచ్చునేమో గాని- ఈ విషయమునగూడ భిన్నమార్గమున నడచిన ఆంధ్ర భారతమునకు అట్లు కాదేమోనని నేనభిప్రాయపడు చున్నాను. దీని కుపస్మారకముగా వెనుక స్పృశింపఁబడని యొకటి రెండు కారణములను ఇచ్చట పొందుపఱుచు చున్నాను.

1. ఆంధ్ర మహాభారతమున నన్నయభట్టారకుఁడు 'నారాయణం నమస్కృత్య...' అను అర్థసందర్భము కలుగునట్లుగాక, నన్నయ "శ్రీ వాణీ గిరిజా... పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాః..." అని మూర్తిత్రయ స్మరణముతో గ్రంథోపక్రమమును గావించియున్నాఁడు. తిక్కన సోమయాజియు భారతమును సమగ్రముగా ముగింపఁదలఁచిన వాఁడయ్యు "హృదయాహ్లాది ... ఉద్యోగాదులం గూడగా బదినేనింటిఁ దెనుంగు భాష జనసంప్రార్థ్యంబు" గా రచింపఁదలచిన వాఁడగుటచే 'హరివంశ' రహితముగ తన గ్రంథోప సంహారమును జేయఁదలచినట్లు స్పష్టమగుచున్నది. పరమజ్ఞానియైన తిక్కనసోమయాజి వాసుదేవ తత్త్వ ప్రతిపాదకమైన హరివంశమును గూడ గ్రహించియున్నచో తద్గ్రంథ తాత్పర్యము వేఱుగా నిర్ణయింపవలసి యుండెడిదేమో! నడుమ భగవద్గీతాది మోక్ష ప్రతిపాదక గ్రంథాంశములను స్వకావ్య రసపోషణ దృష్టితో చాలవఱకు తగ్గించి రచించుటలోఁగూడ వాని శాంతరస తాత్పర్యమును ఆంధ్ర భారతమునందలి వీరరసమునకు అంగభూతముగాఁ జేయుటయే అయియుండవచ్చునని మనము సరళముగా నూహింపవచ్చును.

2. భగవానుఁడైన శ్రీకృష్ణుఁడు భారతమునఁ బ్రధాన నాయకుఁడై యున్న యెడల "వాసుదేవస్య మాహాత్మ్యం-పాండవానాంచ సత్యతాం-దుర్వృత్తం ధార్తరాష్ట్రాణాం" అను వ్యాసవచనమునకు తగినంత సార్థక్యము కలుగనేరదు. దీనినిఁ బట్టి పాండవుల సద్వృత్తము ధార్తరాష్ట్రుల దుర్వృత్తము తదనుగుణ్యముగ వాసుదేవుని మాహాత్మ్యరతమునందు ముఖ్య వ్యము భాప్రతి పాద్యములుగ నేర్పడుచున్నవి. మూఁడింట రెండంశములుగా నున్న పాండవ కౌరవుల సద్వృత్త దుర్వృత్తములు అన్వయ వ్యతిరేకములతో ధర్మాశ్రయము లనియు తత్పోషకముగ శ్రీకృష్ణమాహాత్మ్యము ప్రపంచితమైన దనియు మన మూహించుట సమంజసము. ఈ దృష్టితోకూడ శ్రీకృష్ణుని చరిత్రము వివిధ మహిమాస్పదమైనట్టిదై పాండవ ధర్మరక్షణ పరత్వముతోఁ గూడియున్నట్లు చిత్రింపఁబడుటచే ఆయన భారతమున ఉపనాయకుఁ డనియే చెప్పవచ్చును.

అట్లయినప్పుడు భగవన్మాహాత్మ్యము స్వాశ్రయరక్షణ తత్పరమగుటచే దాని గౌరవ మినుమడించుచున్నది. "నాయకం ప్రాగుపన్యస్య వంశవీర్యశ్రుతాదిభిః నతస్యైవ వధంబ్రూయాత్" (భామహాలంకారము) అను ఆలంకారికాదేశమును బట్టి కథా మధ్యమున నాయకవధ మరణములు నిబద్ధింపఁబడ రాదని యేర్పడును. దీనికి విరుద్ధముగా శ్రీకృష్ణనిర్యాణము కథా మధ్యముననే కూర్పఁబడుటచే అట్టిది సాంప్రదాయికము కామిచే శ్రీకృష్ణునికి కథా నాయకత్వము కల్పించుట పొసఁగదు. నాయక నిర్యాణమైన తరువాతఁ గూర్పఁబడిన హరి వంశము ఐతిహాసిక దృష్టితో తన్మహిమ ప్రతిపాదకముగ నిల్చుట కవకాశ ముండునేగాని కావ్యదృష్టితో నట్టిది పొసఁగదని సహృదయులు గుర్తింపక పోరు. ఇట్లు శ్రీకృష్ణుఁడు కథానాయకుఁడు కానప్పుడు పరిశేషన్యాయమున ధర్మజుఁడేకాక తప్పదు. "సమగ్రగుణః, కథావ్యాపీ నాయకః" అను లక్షణము ధర్మరాజునందు నూటికి నూరుపాళ్ళు ప్రసక్తించునని భారత పరిశీలకులకు గోచరించును. 'భారతము, జయము' అను కావ్యనామములు కూడ ధర్మరాజుయొక్క చరిత్రౌన్నత్యమును, 'నాయకో ధర్మవిజయీ-లోకోత్తర గుణోత్తరః" (విష్ణుధర్మోత్తర ఖండము) అను దృష్టినిబట్టి అతని ధర్మవిజయమును ప్రతిపాదించునట్టివిగా నుండి అతని నాయకత్వమునకు ఏకవాక్యత సంపాదించుచున్నవి.

భారత విమర్శకులలోఁ గొందఱు నాయకుఁడైన ధర్మరాజు పొందినది మోక్షమేననియు, తత్ఫలకమైన శాంతరసమే తదాశ్రయమైన ప్రధాన రసమనియు తెల్పుదురు కాని అదియును సత్యముకాదు. కావ్యశాస్త్రమున సుపరిష్కృతముగా శాంతరసము "నయత్ర దుఃఖం, నసుఖం నచింతా నద్వేష రాగౌ నచకాచి దిచ్ఛా, రసస్తు శాంతః" (నా. శాస్త్ర) అని వర్ణింపఁబడినది. అట్టి స్వరూపము ధర్మజునం దెచ్చటను కానరాదని మనము సరళముగా భావింపవచ్చును. 'నచకాచిదిచ్ఛా, న చింతా'-అనునది రాజ్యసంపాదనాసక్తుఁడగు నతనికిని, 'న యత్ర దుఃఖం' అనునది అరణ్యవాస - బంధుమరణ దుఃఖతుఁడు, సోదరమరణ దుఃఖతుఁడై చివఱవఱకు మెలిగిన అతనికి, 'నసుఖం' అనునది రాజ్యపాలనము ముప్పది యేండ్లు చేసిన నతనికి 'న ద్వేషరాగౌ' అనునది స్వర్గమునఁగూడ దుర్యోధనాదులను గూర్చి పాండవులను గూర్చి ద్వేష రాగములను ప్రకటించిన అతనికిని ఎట్లు వర్తించును? కావున శాంతరసము కానేరదు. అప్పుడు కావ్యాంతమున ధర్మరాజుపొందిన స్థితులు మూఁడుగా

గోచరించుచున్నవి : సశరీరముగా స్వర్గారోహణము ; మాయామూలకమైనను నరక దర్శనము, దేవలోక నివాసము ; యమధర్మరాజ రూపమున పూర్వరూపప్రాప్తి యనునవి. వీనిలో నేదియు మోక్షమని పేర్కొనుటకు వీలులేదు. 'ఆత్యంతిక దుఃఖనివృత్తిరూపమైన స్వరూపస్థితికి' మోక్షమని సంకేతము. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' (శ్రుతి) అన్నట్లు బ్రహ్మవేత్తయగు నాయకుఁడు బ్రహ్మరూపమున భాసిల్లవలయునుగాని యమరూపస్థితుఁడగుట ముఖ్యలక్షణముగాదు. "కుత్రచిత్ గమనం నాఽస్తి తస్య సంపూర్ణరూపిణః" (శ్రుతి) అన్నట్లు ముక్తునికి గమనాగమనములు నిషేధింపఁబడుటచేత స్వర్గారోహణము జరిపిన నాయకుఁడు ముక్తుఁడని మోక్షసాధనపరుఁడని చెప్పుటకు వీలులేదు. ముక్తి ద్వివిధము : జీవన్ముక్తి, విదేహముక్తి అని. స్వర్గమునందు కూడ శరీర ధర్మములైన రాగద్వేషములు విడువని నాయకుఁడు జీవన్ముక్తుఁ డనిగాని, ఆకాశగంగావగాహము పిదప మఱల దివ్యశరీరమును ధరించిన ధర్మజుఁడు విదేహముక్తుఁ డనిగాని చెప్పుట యెంతసమంజసమో భావుకులు చిత్తగింపఁగలరు ! ఇట్లు ముక్తిద్వయమునకు దూరమైన శాంతరసము ధర్మజుని యందు ప్రతిష్ఠించి మహాభారత తాత్పర్యరూపమును నిర్ణయించుట పాడికాదని నా మనవి ! నివృత్తి ధర్మరూపమైన మోక్షమునకు సోపానరూపమైన ప్రవృత్తి ధర్మము తక్కువదిగా భావించుకొని యిట్టి రసనిబంధన కావింపఁబడియుండును. నా దృష్టిలో మహాభారతము నెన్ని దృక్కోణములనుండి చూచినను ధర్మజుని ధార్మిక చరిత్రముతోపాటు తద్వ్యాప్తమైన ధర్మవీర రసమే అంగిరస మని స్ఫురించుచున్నది !

## 2. భాస్కర రామాయణము

రామాయణమొక సంపూర్ణ మానవుని రసవత్తర చరిత్రము. అదియే గీర్వాణమున నాది కావ్యస్రవంతియై ప్రవహించుచు భారతీయుల హృదయ క్షేత్రములందు సంస్కృతి సస్యములఁ బండించుచున్నది. తెలుఁగువారికి రామాయణమన్న విశేషప్రీతి. తెలుఁగునఁ గావ్యరచన ప్రారంభమైన నాఁటి నుండియు ప్రతి శతాబ్దమునందును కనీసము ఒక్కొక్క రామాయణమేదో రూపమున రచితమగుచు వచ్చుచునే యున్నది. ఇంతకాల మిన్నిసారు లిన్ని రూపములలో రామాయణ మేయితర భారత సాహిత్యములందును ప్రభవింప లేదు. హుళక్కి భాస్కరుఁడు శిష్యాదుల సాహాయ్యమునఁ దెనుఁగున విర

చించిన చంపూ కావ్యమగు రామాయణము ప్రాచీనాంధ్ర రామాయణము లలోఁ బ్రాశస్త్యముఁ గాంచినది. అది నలుగురు కవుల సమష్టి కృషి. అందు హుళక్కి భాస్కరుఁడు అరణ్యకాండమును, కిష్కింధ సుందర యుద్ధ కాండము లలో కొంతభాగమును, అతని పుత్త్రుఁడగు మల్లికార్జునభట్టు బాలకాండమును, కిష్కింధ సుందరకాండ శేషములను, భాస్కరుని మిత్రుడైన అయ్యలార్యుఁడు యుద్ధకాండ శేషమును, సాహిణిమారని కుమారుఁడును, భాస్కరుని శిష్యుఁ డును అగు కుమార రుద్రదేవుఁడు అయోధ్యకాండమును రచించి రామాయణ కావ్యమును పూర్తిచేసిరి.

గుణవంతుఁడు లోకమునఁ గీర్తింపఁబడును. 'గుణాః పూజాస్థానం గుణిషు నచలింగం నచవయః' అని భవభూతి. రాముఁడు సమగ్రగుణ సమన్వి తుఁడు. అతని చరిత్రముఁ గీర్తించుటచే రామాయణమున కెనలేని గుణ గౌర వము లభించుచున్నది. భరతమహర్షి కావ్యరస విమర్శన పద్ధతిని వ్యంగ్యముగా "విమృశ్య ప్రేక్షకైర్గ్రాహ్యం ... ప్రకృతయోరసాః" అనుటలో సూచించి యున్నాఁడు. ఇందు ప్రేక్షకులు — ప్రకృతులను, రసములను విమర్శించి యానందింపవలెనని యాతని భావము. అనఁగా విభావానుభావములను, వ్యభి చారి భావములను విమర్శించుట యని తాత్పర్యము. ప్రకృతుల కభిన్నముగా నుండి తత్ప్రకాశకములగు నవి గుణములు; వానిచే నుజ్జ్వలమైన ప్రకృతి తదను గుణములైన కర్మల నాశ్రయించును. గుణములవలన ననుపాలితములైన భావములు ఉత్కటావస్థను చెందినచో పఠితలచే రసములుగా నాస్వాదింపఁ బడును. గుణములకును ప్రకృతులకును పరస్పరాభేదమున్నది కావున రసముల నుదాత్తీకరించునవి గుణములని చెప్పవచ్చును. కావుననే లాక్షణికులు "ఉప శ్లోకస్య మాహాత్మ్య దుజ్జ్వలాః కావ్యసంపదః" (ప్రతా. రు) అని యని యున్నారు.

భాస్కరరామాయణము మహాకావ్యము. అం దుపశ్లోక్యుఁడగు నాయ కుఁడు శ్రీరాముఁడు, ఉపక్రమ కథాంశమున వాల్మీకి నారదమునీంద్రుఁ గను గొని "ఈ జగంబున నిప్పుడెవ్వఁడు గుణశాలి వీర్యవంతుఁడు ... పురుషవర్యుఁ" డని గుణసంపద్భరితు నొక్క పురుషశ్రేష్ఠుని నిరూపించి చెప్పుమని ప్రార్థించెను. ఇందు గుణశాలియందలి గుణశబ్దము సద్గుణములనే బోధించును; సద్గుణములు సత్త్వగుణజన్యములు; సత్త్వగుణము ధర్మస్వరూపము. అనఁగా సద్గుణము లెన్నటికిని ధార్మికములని యభిప్రాయము. దీనినిబట్టి గుణశాలియన ధార్మికుఁ

డని యర్థము. "వీర్యవంతుఁ" డన వీరుఁడని భావము. పై రెండు పదములను కలిపి అన్వయించినయెడల ధర్మవీరుఁడని నిష్కృష్టార్థము. తదితర గుణవర్ణన మంతయు నీ భావమునకే వ్యాఖ్యారూపమై గోచరించును. ఇట్లు !

"ఈ జగంబున నిప్పు డెవ్వఁడు గుణశాలి
వీర్యవంతుఁడు ధర్మవేది యెవఁడు ?
సూనృతవాక్యుండు సుకృతజ్ఞుఁ డెవ్వాఁడు
నుతచరిత్రుఁడు దృఢవ్రతుఁ డెవండు ?
ఆత్మవంతుఁడు కోపమణఁచు వాఁ డెవ్వాఁడు ?
ద్యుతిమంతుఁ డీర్ష్యాదిదూరుఁ డెవఁడు ?
సర్వభూతహితుండు సర్వజ్ఞుఁ డెవ్వాఁడు ?
దక్షుఁ డెవ్వఁడు దుష్టశిక్షుఁ డెవఁడు ?
ఎవని యలుకకు ననిలోన దివిజులైన
మొనకు నిలువంగ వెఱతురు మునివరేణ్య
యతని విభవంబు విన మాకుఁ గుతుక మొదవె
ఎఱిఁగి యుంటివె నీవిట్టి పురుషవర్యు."

వ. అని విన్నవించిన (నారదుండు వాల్మీకి కిట్లనియె.)

"ఏ గుణములఁ గీర్తించితి వేగుణములు దుర్లభంబు లెంచ నమితముల్
యోగీశ తెలిసి చెప్పెద నాగుణములు గల్గు నరుని నాకర్ణింపన్."

"ఇక్ష్వాకు కులజుఁడై యిలజనుల్ వినుతింప
శ్రీరాముఁ డనుపేరఁ జెలఁగువాఁడు,
నియతాత్ముఁ డురువీర్యనిలయుండు తేజస్వి
ధృతి నీతిశాలి జితేంద్రియుండు,
ధీమంతుఁ డరిహర్త శ్రీమంతుఁ డతివక్త
మహితాంశుఁ డురుసత్త్వ సహితభుజుఁడు,
ఆయత భుజమధ్యుఁ డతిమోహనతనుండు,
కంబుకంఠుఁడు మహాకార్ముకుండు,
గాఢనిర్జిత శత్రుండు గూఢజత్రుఁ డధికశోభనమస్తకుం డతివిశాల
ఫాలలసితుండు నాజానుబాహుయుగుఁ డుదారవిక్రముఁడుదగ్రప్రతాపఘనుడు"

"సమ విభక్తాంగుఁడు సజలాబ్దవర్ణుండు లక్ష్మీయుతుఁడు భద్రలక్షణుండు
ఆయతాబ్జ దళాక్షుఁ డతిపీనవక్షుండు సకల ధర్మసువేది సత్యవాది
ప్రజలకు హితకారి భవ్యయశోధారి విమతహృతివిధాత విశ్వదాత
కమలాసనసముండు కమలాధివాసుండు సాధుయోగకరుఁడు, బోధపరుఁడు,

పావనాత్ముండు వశి సర్వజీవలోకధర్మ నిజధర్మసజ్జనత్రాణపరుఁడు
వేదవేదాంగశాస్త్రార్థవిత్తముండు నతులకోదండ విద్యయం దభినుతుండు."

"ప్రతిభావంతుఁడు సర్వలోకహితుఁడు న్నవ్యక్షండ దీనాత్ముఁడున్
శ్రుతిమంతుండు విచక్షణుండు నదులున్ సింధుప్రియుంజేరు నా
గతి సద్వర్గముసేరు నార్యుఁడు సదాకర్మేష్టసందర్శనుం
డతిరాజద్గుణశాలి సర్వసముఁ డుద్యద్యోగిహృద్ధ్యేయుఁడున్."

"జలధిగభీరుఁ డద్రివరసన్నిభధీరుఁడు కాలకీలివ
జ్జ్వలిత మహోగ్రకోపుఁడును సత్యపరాక్రముఁడిందు మండలీ
సులలిత దర్శనాంచితుఁడు క్షోణిసహిష్ణుఁడు రాజరాజ పు
ష్కల ధనదాయియున్ బరమ ధర్ముఁడనంబడు సత్యసంపదన్"

—భాస్క. రా. సం. రా. వ. 11-17.

నారదుఁడు శ్రీరాముఁ డట్టి మహాపురుషుఁ డని పై పద్యభావముచే నిరూపించినాఁడు. పై పద్యములందు కొంత పునరుక్తి యున్నను రాముని కిడిన విశేషము లరువదికి మించియున్నవి. అవి యన్నియు నొక మహావీరుని స్వరూప స్వభావముల వర్ణించునవి. 'నియతాత్ముఁడు...ధీమంతుఁడు' అనునవి స్వభావమును, అట్లే 'అరిహర్త...బాహు యుగుఁడు' అనునవి స్వరూపమును, 'ఉదార విక్రమ... ఘనుఁడు' అనునవి స్వభావమును, 'సమవిభక్తాంఁగుడు...అతి పీన వక్షుఁడు' అనునవి స్వరూపమును, మిగిలిన వన్నియు స్వభావమును బోధించుచున్నవి. స్వరూపము శరీర గుణములను, స్వభావ మాత్మగుణములను తెల్పుచుండుటచే రాముని అంతర్బహిస్స్వరూపము మన కన్నులకుఁ గట్టినట్లు వర్ణితమైనది. ఇన్ని చెప్పి, నారదుఁడే చివఱకు "పరమధర్ము" డని తేల్చి సారభూతముగాఁ దెల్పియుండుట గమనార్హము. శరీరగుణములగు దార్ఢ్యాదులు కల్గి యుద్ధములందు వీరుఁడై, ఆత్మగుణములగు సత్యదయాహింసాది సద్గుణ సముదాయముతో దత్తదుచిత కార్యములందు ధార్మికోత్సాహమును బయల్పెట్టుచు, ధర్మాదులలో వీరుఁడయి రాముఁడు శోభించునని తాత్పర్యమగుచున్నది. ధర్మముచే ననుశాసితమయిన అర్థాదులను సాధించుట యీతని జీవితవృత్తమై యుండునని యేర్పడుచున్నది. "ధర్మయుద్ధ వీరప్రధానో ధీరోదాత్తః" అను లక్షణముచే శ్రీరాముఁడు ధీరోదాత్త నాయకుఁడగుచున్నాఁడు. కావ్యమందే యిది దశరథుని ముఖమున వ్యక్తపఱుపఁబడినది.

"ధీరోదారుఁడు నిర్వికారుఁడు జగద్వీరుండు సౌజన్య వి
స్తారుం డుత్తమశీలుఁ డర్కకుల విస్తారుండు శూరుండు గం

ధీరుం డిద్ధ విచారసారుఁ డగుటం బెంపార విశ్వంభరా
భారం బెల్ల భరింప రాఘవు మహాభాగ్యు నియోగించెదన్."

—భాస్క. రా. అయో. 5

అను దశరథుని పల్కులను, పై వర్ణనలను చూచినచో ధీరోదాత్తుని స్వభావ నిరూపణ సమర్థములైన గుణములే రామునియందు గలవని స్పష్టమగుచున్నది.

రామజననమునుండి పట్టాభిషేకాంతమువఱకుఁ గల గాథ యీ కావ్యేతి వృత్తము. ఇది ప్రధానముగా రెండు ఘట్టములుగాఁ గానుపించును. రాముని బాల్యమునుండి-మొదటిసారి పట్టాభిషేక ప్రయత్నమువఱ కొక ఘట్టము, అచ్చటినుండి పట్టాభిషేకమువఱ కొక ఘట్టము, మొదటిభాగమున రాముఁడు గుర్వాజ్ఞాపాలనాదులయందు వినయశౌర్యాదిగుణ ప్రధానుఁడై ఉత్తమ వీర లక్షణము లన్నిఁటిని సాధించి శివధనుర్భంగ పరశురామ గర్వభంగములతో వానిని నిరూపించుకొనెను. ఆపై నాతని వీరము త్యాగయుతమై, దయా మయమై యొకవైపు వర్థిల్లి, స్వీయజీవితలక్ష్యమగు రావణాది రాక్షస సంహా రములతో మఱియొకవైపు స్థిరత్వము పొందుచున్నది. అట్టిది స్థాలీపులాక న్యాయముగా నీ క్రింద పేర్కొనఁబడును.

వశిష్ఠప్రబోధితుఁడై దశరథుఁడు సవనరక్షణార్థమై విశ్వామిత్రునివెంట రామలక్ష్మణుల నంపుట కంగీకరించెను. మారీచాదుల నెదుర్కొను బలపరాక్ర మాదులు రామ లక్ష్మణులందు మూర్తిగట్టునట్లు వర్ణించి కవి వారి భావికార్య నిర్వహణ సామర్థ్యమును ధ్వనించియున్నాఁడు.

"అతులోత్సాహధురీణులై పటుతరజ్యాంతర్ధనుఃప్రాణులై
తత గోధాంచిత భర్మ నిర్మిత భుజత్రాణాంగుళీ త్రాణులై
యత బాణోన్నత తూణులై బిరుద కేయూరాఢ్యదోస్థాణులై
ప్రతతస్ఫీతకృపాణులై త్రిభువనత్రాణైక పారీణులై."

వ. ఆ రాజన్య కుమారులు మణిగణాలంకార శోభితాకారులై శివుని వెనుకం జను వినాయక కుమారుంబోలె నవ్విశ్వామిత్రు వెనుక సార్థయోజనంబరిగి.

—భాస్క. రా. బా. కాం. 221.

అని కవివర్ణనము. భావిరాక్షస సంహార మనితరసాధ్యమైన కార్యము. దానిని సాధించుటయందు నాయకుఁడు అపూర్వోత్సాహము వహించుచున్నాఁ డని 'అతులోత్సాహధురీణులై' యనుటలోఁ గల ఔచిత్యము. "పటుతర... కృపాణులై" యనుటలో రణవీరుని యాహార్యవర్ణన ముదాత్తముగాఁ జేయఁ

బడినది. 'త్రిభువనత్రాణైకపారీణత్వము' వారి గుణవిశేషము. స్వీయ పరాక్రమాదులచే ముజ్జగములనే రక్షించుటయందు పారీణత్వము వహించుచున్నారనుటలో వారి యపూర్వాఖండ ధర్మదీక్ష, దయాసంభృతత్వము, లోకహితత్వము వ్యంగ్యములు. "శివుని వెంటం...కుమారులుంబోలె" నను ఉపమానముచే సదాశివు నాశ్రయించియున్న వినాయకాదులందున్న అవిఘ్నతయు, గణనాథత్వము, దేవరక్షణోత్సాహము, రాక్షసకుల సంహార సామర్థ్యము వీరియందున్నవని భావము. ఇంతియగాక రచనాశిల్పమున గోచరించు గుణములివ్వి : మత్తేభవృత్తము గైకొనుటలో మదేభమునందలి బలోన్మత్తత నాయకునియందుఁ గలవనియు, తకారప్రాసయు, పరుషస్థిరాక్షరముల బహుళ ప్రయోగము, ప్ర, త్ర, త్రి మొదలగు సరళేతర సంయుక్తాక్షర ప్రయోగము రాజకుమారుల రణకర్కశత్వమును సూచించుచున్నవి. ఇట్లు శబ్దార్థములచే వ్యంజితమయిన శ్రీరామ లక్ష్మణుల అంతర బాహ్యస్వరూప విశేషము ఓజో గుణముతో దీపించి పఠిత కపూర్వ వీరసాక్షాత్కారముఁ గల్పించుచున్నది. భావికార్యసామర్థ్యమున కిది చక్కనిపునాది, సమర్థమగు విభావ నిరూపణము.

తండ్రియానతి శిరసావహించి విశ్వామిత్రుని వెనువెంట నరుగు దెంచెడి శ్రీరాముని మనఃప్రవృత్తి వినయోత్సాహములతోడను, స్థైర్యధైర్య భక్తి దయా ధర్మాదులచేతను నిర్భరమయి యుండెను. విశ్వామిత్రుఁడు తాటకా సంహారము చాతుర్వర్ణ్యరక్షణార్థ మగుటచే ధర్మబద్ధమనియు, స్త్రీ సంహారమని జంకవలదనియు, శౌరిపురందరాదులు జగద్విపత్కారకులగు స్త్రీలను సంహరించి యుండిరనియు, ప్రజారక్షణ క్షత్త్రియ ధర్మమనియు నిరూపించి చెప్పిన తరువాత విగత సంశయుఁడై, భక్తియుక్తులతో రాముఁ డిట్లనెను :

"అన విని కౌశికోక్తులకు నా రఘురాముఁడు సంతసించి మ
జ్జనకుని యట్ల నీవు మునిసత్తమ నా కటుగాన నెమ్మి నా
జనపతి పన్పు నీ పనుపు సమ్మతి జేసెద దుష్టతాటకా
హననముఁ జేసి, భూసురగవామర లోకహితంబు సేసెదన్"

—భాస్క. రా. బా. కాం. 256.

రాముని దృష్టిలో దశరథ విశ్వామిత్రులు గురుభావమున సమానులు. వారి పనుపు సేయుట ధర్మము; దానికిఁదోడి లోకహితరూపమైనది యాకార్యము. నాయకుఁడు సమర్థుఁడు. అతనికిఁ గౌశికుని పల్కులు విభావములు; తండ్రి పంపుద్దీపనము, స్థైర్యధైర్యవైశారద్యాదు లనుభావములు; భక్తివినయోత్సా

హేదులు సంచారిభావములు. ఇందు రచనాశిల్పమునఁ బెక్కువిశేషములు గలవు. 'దుష్టతాటకాహననము' 'లోకహితము' అను పల్కులు సాభిప్రాయములు. తాటక యిచ్చట ఆనుషంగికము, తదితరులయిన దుష్టప్రవృత్తు లెవ్వరైనను హననయోగ్యులని రాముని తలఁపు. అట్టిపని లోకహితరూపమై ధర్మరూపమగుచున్నది. "దుర్జనతా భంజనమున నగునది దోషమ్మనక ప్రజారక్షణ చేయ యది ధర్మమగున్" అను కౌశికోక్తి యిందు కాధారము. "చేసెదన్" అను తద్ధర్మార్థక క్రియ సాతత్యమును బోధించుచున్నది. కావున నిట్టి ధర్మము రాముఁడు త్రికాలాధిష్ఠితముగా ననుసరింప నున్నాఁడని భావము. దీనికి హేతువు పితృగురుజన నియోజనము. రాముఁడు దశరథుని జనకునిగను, జనపతిగను గౌరవించును; విశ్వామిత్రుని మునిసత్తముగాఁ బూజించును. కావున తండ్రియానతి సుతుఁడు వహించుట యొక (పుత్త్రీ) ధర్మదృష్టి. జనపతియైన రాజు సుజనరక్షణము, దుష్టశిక్షణము సేయవలసియుండ, తద్భారమును రామునిపైనుంచ తత్కార్యము రాజు నానతి ననుసరించి సేవాధర్మముగా నిర్వహించుట మఱియొక (ప్రజా) ధర్మము. దానివలన లౌకికాభ్యుదయమును, మునిసత్తముని పనుపుచేయుటచేఁ బారలౌకికాభ్యుదయమును, నాయకునియందుపలక్షితములని భావము. రామునికేర్పడిన యీ ప్రథమ పరీక్షాఘట్టముననే యాతని జీవితానుశాసితములగు ప్రధానధర్మములు రెండు(గుర్వాజ్ఞాపాలనము, లోకహితార్థమైన దుష్టశిక్షణము)ను రసోపస్కారకములుగాఁ బ్రతిపాదితమైనవి. ఒకటి ధర్మవీరమునకు, మఱియొకటి యుద్ధవీరమునకును హేతువులై రాముని ధర్మయుద్ధ ప్రధానుఁడగు ధీరోదాత్తునిగాఁ దీర్చిదిద్దుచున్నవి.

మారీచ సుబాహులను ఎదురించి కౌశికయాగరక్షణముఁజేయు ఘట్టమునఁ గూడ రాముని ధర్మోత్సాహమే యుత్కటమగునట్లును, అద్భుతావహముగను కవి వర్ణించినాఁడు. ఆశ్రమమునకుఁజేరి రామలక్ష్మణులు తమ కర్తవ్యమును గుర్తించి ప్రాంజలులగుచు

> "దీక్షవహింపుఁడు మీ మఖరక్ష యొనర్చెదము దుష్ట రాక్షసభటులన్
> శిక్షించెద మన నమ్ముని దీక్షితుఁడై నియతినుండె దృఢతరనిష్ఠన్"
>
> బాల. 295.

ఇందు శ్రీరామునియందు భక్తి, శ్రద్ధ, ధైర్యము, శౌర్యము, ఉత్సాహము మొ. నవి క్షత్రియోచితముగాఁ బ్రయుక్తమైనవి. "శిక్షించెదము, రక్షయొనర్చెదము" అను క్రియాపదములచే నాత్మ శక్తియందున్న దృఢవిశ్వాసము వ్యక్త

మగుచు, దుష్టశిక్షణ సామర్థ్యమును, ఆశ్రితజన రక్షణోత్సాహమును వ్యక్తమగు చున్నవి. పరుషోష్మాక్షరద్వయసంయుక్తమగు క్షకారము ప్రాసగానుండి తత్కార్య దుష్కరత్వము, రామలక్ష్మణులకు దత్సాధన సులభ మనుభావము వ్యక్తమొనర్చి నాయకుని లోకోత్తరకార్యసాధనత్వ నిరూపణసమర్థమగు చున్నది. ఇట్టిదే యీ క్రిందిపద్యమునందును గోచరించును. విశ్వామిత్రుఁడు "మీరిది మొదలుగా నాఱుదినంబులు సావధానులరై కాచియుండుండనిన" అగుంగాక యని

> "నేత్రము లెప్పుడు మొగుడక ధాత్రీశు లధిజ్య చాపధరులై విశ్వా
> మిత్రుని యాగము షడహోరాత్రము రక్షించి రతి ధురంధరులై."
>
> —బాల. 297.

ఇందిలి ప్రసాదగుణము, తరవర్ణ సంయుక్తాక్షరములతోడి ప్రాసయు, తవర్గచతు ర్థాక్షర ప్రయోగ బాహుళ్యము, అల్పసమాస రచనము అనునవి కఠినతరమైన కార్యము నవలీలగా దక్షతతో నిర్వహించుచుండి రనియెడి భావము వ్యంగ్యముగా బోధించుచున్నవి. నేత్రము లెప్పుడు 'మొగుడక' అనుటలో వారు రెప్పపాటునుగూడ నంతరముగా భావించి యాగము నప్రమత్తతతో రక్షించు చుండిరనియు, వారాసమయమున ననిమిషులుగా గోచరించు చుండిరనియు భావము. "అధిజ్యచాపధరులై" అనుటలో వారి యుద్ధ సంసిద్ధతయు, అహోరాత్రములనుటలో నిర్విరామతయు, 'అతిధురంధరు' లనుటలో సర్వయాగ రక్షా దక్షతయు వ్యంగ్యములు. అట్టి వీరులు మారీచ సుబాహులను అవలీలగా నాగ్నేయవాతూలాస్త్రప్రయోగమునఁ దూలనేసియు చంపియు విజయులై యాగరక్షణ మొనర్చి ఋషిపుంగవుని గాంచి:

> "మునివర మీ కింకరులము పను లేమిట మమ్ముఁ బంపు భవదాజ్ఞ జే
> కొని కావించెదము."
>
> —బాల. 308.

అని మోకరిల్లినారు. ఇందు రాజకుమారుల భక్తి వినయము లపూర్వములు. "కింకర" శబ్దము రాకుమారుల ముఖమునఁ జెప్పించుటచే వారి వినయమును తేటపరచుటయే గాక, 'కింకర్తవ్య'మ్మని అడిగించుటచే ప్రస్తుత కార్యసమాప్తియు, భావికార్య నిర్వహణోత్సాహమును కవివ్యక్తముఁ జేయుచున్నాఁడు. ఇట్లు వ్యంగ్యార్థ ప్రధాన రచనముతో విభావానుభావవ్యభిచారి భావములను పఠిత లూహించు కొనునట్లు చేయుటయందే కవిశక్తి యాధారపడియున్నది. ఆగ్నేయవాతూలాస్త్ర ప్రయోగము నాయకుని మహాస్త్రప్రయోగ లాఘవముఁ దెల్పుచు పఠితల కాశ్చర్యముఁ గొల్పుచున్నది.

శివధనుర్భంగ లీలాకథా ఘట్టమున కవితన వర్ణనా సామర్థ్యముచే శ్రీరాముని బలవీరమును స్ఫురింపఁజేసి యున్నాఁడు. కథాంగముల నీతఁడను సంధించిన వైఖరి కడు విచిత్రము, రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట జనకుని మందిరమున కేతెంచినారు. వారినిఁ జూడఁగనే రాజునకు గీర్వాణ ప్రతాపులనియు, లోకత్రాణ పారీణులనియు, ప్రవీణులనియుఁ దోఁచినది. (541. బాల.) కాని రాజకుమారులు కాలినడకల వచ్చినారేమని జనకుని యనుమానము. విశ్వామిత్రుఁడు మర్మజ్ఞుఁడై చాకచక్యముతో సమాధాన మొసఁగినాఁడు. "నా వెనుక సిద్ధాశ్రమం బేతెంచి, యచట నవక్రపరాక్రమం బడర—

"తాటకఁ ద్రుంచివైచి యతి దర్పితుఁడైన సుబాహు సాయకో
త్పాటితుఁ జేసి, గీటడఁచి ధర్మమెలర్ప నహల్యాశాపము
చ్చాటన మొందఁ జేసి కడు సమ్మదమారఁగ నీ గృహంబునం
జాటఁగనున్న శంకరుని చాపముఁ జూడఁగవచ్చి రేర్పడన్."

—బాలకాం. 543

అని సూత్రధారుఁడు సభకు నాయకునిఁ బరిచయముఁజేయు నట్లొనర్చినాఁడిచ్చట విశ్వామిత్రుఁడు. "త్రుంచివైచి" యనుటలో నవలీలగాఁ దాటకను సంహరించెనని భావము. అతిదర్పితుఁడని సుబాహునిఁ బేర్కొని యట్టివానిని సైతమొక్కబాణమునఁ జంపెనని జెప్పి, రాముని యపూర్వపరాక్రమ నిరూపణ మొనర్చెను. అహల్యాశాపవిమోచన మొనర్చుటలో నాతని మహత్త్వమును నిరూపించి, శాపానుగ్రహశక్తియుక్తుఁడని తేల్చిచెప్పెను. శంకరుని చాపముఁ జూడవచ్చె ననుటలో నట్టివాఁ డూఱక వ్యర్థప్రయత్న మొనర్పఁడనియు, పై పెచ్చాతఁ డాపనికి సమర్థుఁడనియు సూచించెను. "చూచు" అను క్రియా ప్రయోగము కడుప్రౌఢము. ఇన్నిటిని వరుసగాసాధించి రాముఁడు శివ ధనుస్సును గూడ "ఒకచూపు చూడ"వచ్చెనని ఋషి చమత్కరించెనని భావము. తెలుఁగుజాతికి చూపుచూచుట యనెడి పలుకుబడి సుపరిచితము. సంయమీంద్రుఁడైన విశ్వామిత్రుని మాటలలోని సంయమిత్వమును భావించి, జనకునితోఁ బాటు పతితయు నాయకుని భావిప్రతాప ప్రకటన సామర్థ్యము నూహించుకొనలేకపోఁడు. దానినే కవి యాలంకారిక మార్గమున (కావ్యలింగ) ప్రకృతి పరముగ వర్ణించి రచనాశిల్పమును వెలార్చినాఁడు.

"నా కులజుఁడైన రాముఁడు శ్రీకంఠుని విల్లు విఱిచి సీతం బ్రీతిం
గైకొను రేపని చెప్పఁగ నాకమునకు నరుగు విధమున నె రవి గ్రుంకెన్

—బాలకాం. 683.

ఇందు కావ్యలింగాలంకారముచే కథార్థమును వ్యంగ్యముగా సూచించుచున్నాఁడు. సుకుమారకావ్యకళాకుశలుఁడైన కవిగాని యిట్టి యలంకారధ్వనిఁ బ్రయోగింపఁడు!

ఆపైన శివధనుఃప్రాశస్త్యమును, తన్మహత్త్వమును ఉగ్గడింపఁబడి తద్భంగమూలమునఁ దరువాత శ్రీరాముని యతిలోక పరాక్రమము నిరూపింపఁబడును. దక్షయజ్ఞభాగంబులఁ గ్రొవ్విగైకొనుచున్న దేవతల జర్జరితాంగులఁ జేయుటలో మహేశుఁ డుపయోగించిన యాయుధ మదియట! దానిని జనకవంశజుఁడగు దేవరాతుఁ డను పూర్వ చక్రవర్తి చేతికి నీశ్వరుఁ డిల్లడ యిచ్చెనటఁ (బాల కాం. 686, 687). సకల భూపాలురును దానిని వంప యత్నించి విఫలులైరట! అట్టి విశిష్టచాపము నెక్కుబెట్టినచో సీత నిత్తునని జనకుని ప్రతిజ్ఞ! దానికిఁ దగినవాఁడు రాముఁ డను భావము పఠిత కిదివఱకే కల్పించినాఁడు కవి. తన్మూలమున నాయకునియందు సానుభూతియు, తాదాత్మ్య మనస్థితియు పఠిత పొందియుండును. అట్టిస్థితిలో శ్రీరామ వర్ణన మందలి రసస్ఫూర్తి సులభముగా కలుగ వీలుగల్గును. రసభావ రహస్య మెఱిఁగిన కవి పూర్వరంగమును రసోచితముగా దిద్ది విభావాదుల నూహించుటకుఁ పఠిత కనువైన వాతావరణముఁ గల్పించి వర్ణించును. ఇచ్చటను కవి తన్మార్గమునే యవలంబించియున్నాఁడు. ఉదాహరణమునకు :

"కలభం బాతత చండతుండమున వీఁకన్ శేషనాగేంద్రునిన్
బలిమిం బట్టినభంగి రామధరణీపాలుండు కోదండమున్
బలుముష్టిన్ వడిఁబట్టిఁ యెత్తి తెగ విస్ఫారంబుగాఁ జేసి ని
శ్చలుఁడై యల్లన లస్తకంబు వదలెం జాపంబు భగ్నంబుగన్"

బాలకాం. 701.

రాముఁడు శివధనుస్సు విఱుచుట నిట్లుపమాలంకారమున రసవత్తరముగాఁ గవి వర్ణించినాఁడు. ఇందు శ్రీరాముని బలోత్సాహము స్ఫురితము. అలంకార వ్యంగ్యముతో నది వికసితము. శ్రీరాముఁడు కలభముతోఁ బోల్పఁబడినాఁడు; వయోవర్ణ సామర్థ్యోత్సాహములందు సారూప్యము గలది కలభము. వయసునఁ జిన్నదైనను కలభము సర్వభూభార సమర్థుఁడగు నాదిశేషుని బట్టనుంకించుటలో నసాధారణ కార్యనిర్వహణోత్సాహముఁ జూపుచున్నదని ధ్వని. బలిమింబట్టుట యనుటలో నందుత్కటమైన ప్రయత్నము, బలము అవసరమని సూచితము. అట్లే కలభమున కుపమేయస్థానమైన రాముఁడు శివధనుస్సును

సప్రయత్నముగ సాధించును. తత్క్రమవిలాస మిది; పటుతరముష్టితో దానినిఁ బట్టుటయు, నాపై దానినిఁ బూనికతో నెత్తుటయు, నారి తెగునట్లు విల్లును విస్తారముగా నొంచుటయు, నిశ్చలుఁడై నారిని విరివిగా లాగి చాపమును విఱిచి మెల్లగా లక్ష్యకము వదలుటయు ననెడి క్రమవికాస రూపమున ధనుర్భంగ కార్యమును నిర్వహించుటచే విభావమునందలి యుత్సాహభావము విపులముగా నాస్వాద్యమగుచున్నది. దానికిఁ దోడు మత్తేభవృత్తము, ప్రసాదగుణము, ఉపమాలంకారము రసమున కుపస్కారములగుచు వన్నెఁ దెచ్చుచున్నవి. దీనినిఁ గాంచిన జనకునియందు వర్ణితమైన విస్మయము రామగత వీరరసమునకు గౌరవమాపాదించి, తద్విగుణీకృత స్ఫూర్తితో నాస్వాద్యమానమగుచున్నది! సన్నివేశములందు రసభావములను వర్ణనముతో నొప్పించి, కథాకథనమును బోషించు కావ్యశిల్పమున కిది చక్కని యుదాహరణము.

ప్రతినాయకాశ్రయమగు రౌద్రమును, దానిని విభావముగాగొని నాయకుని యందుద్భవించెడి యుత్కటోత్సాహమును సమానముగా వర్ణించి బలవీరము నొప్పించెడి విధానము పరశురాముని గర్వభంగ కథాభాగమునం దనుసరింపఁబడినది. పరశురాముఁడిందు ధీరోద్ధతుఁడు; రౌద్రమూర్తి; తనగురు వగు శివునియొక్క విల్లును రాముఁడు విఱిచినాఁడని క్రుద్ధుఁడైనవాఁడు. అతని యెదుటనున్న రాముఁడు వినయమూర్తి; నిశ్చల దృఢసత్త్వమూర్తి; సామాద్యుపాయ విశారదుఁడు; పరాక్రమవంతుఁడగు వీరుఁడు. ఇతనియందు ప్రతినాయక విజయాత్మకమగు నుత్సాహ మధికముగను, దాని కంగముగ రౌద్రమును గాననగును. రామునివీరము పరశురాముని రౌద్రము నణఁగార్చి, భక్తిఁరూపమునఁ బరిణమింపఁజేయునుగాన నిచ్చట రౌద్రము వీరమునకు మెఱుగులు దిద్దుచున్నది.

పరశురాముని రౌద్రస్ఫూర్తి అలంకారవ్యంగ్యము నాశ్రయించి యున్నది.

"ప్రళయాదిత్యుని కైవడిం ద్రిపురభిత్ఫాలాక్షు చందంబునన్
విలయ జ్వాలవిశాలకీలికరణిన్ వృత్రఘ్ననిర్ఘాత సం
కులదంభోళిధరాకృతిన్ లయకృతక్రూరాంతకప్రక్రియ
న్బలిబంధక్రమకృత్త్రివిక్రమగతి న్రౌద్రం బుదగ్రంబుగన్"

—బాలకాం. 748.

పరశురామునిగాంచి చూపఱులు భయాపహామంత్రము లుచ్చరించుచుండిరి!

రాముఁ డా రౌద్రమూర్తికి వినయపురస్సరముగా నమస్కరించెను. అంత నాతఁడు -

"ఫాలాక్షుని చాపము బాహాలఘుసత్త్వమున విఱిచి తని జనులెన్నం
బోల మహేంద్రాద్రిని విని వాలిన నీలావుచూడ వచ్చితి నిటకున్."
"స్ఫీతాక్షీణబలంబు పెంపెసఁగ నాచేనున్న యీచాపముం
జాతుర్యంబున నెక్కువెట్టి విపులజ్యావల్లి కర్ణాంచలా
న్వీతాకృష్టిఁ దనర్పఁజేసి శరమున్ నేర్పార సంధించినన్
నీతో ద్వంద్వరణంబు సేసెదఁ గడు న్వీరక్రియా నైపుణిన్"
—బాలకాం. 752. 753.

అని శపథము చేసినాఁడు. దానికి దశరథుఁడు భయపడి యాతని కాళ్లవ్రేళ్లఁ బడి ప్రాణభిక్షవేడి దైన్యభావము ప్రకటించినాఁడు. పరశురాముఁడు మఱింత పెచ్చుపెరిగి భక్తితో నమస్కరించు రామునితో "నీ విట్లు నాకు వినయమున మ్రొక్కులిడినను వదలువాఁడఁ గా"నని బెదరించి యాత్మశ్లాఘారూపముగు నహంకారము నొలకఁబోసినాఁడు. వానికి రాముఁ డాత్మగౌరవము చెడకుండ, పెద్దల హృదయము చివుక్కుమనకుండ, ధర్మముఁ దప్పక సమాధాన మిచ్చినాఁడు :

"మునిసుతుఁడవు బ్రాహ్మణుఁడవు ననఘ తపోనిధివి వృద్ధుఁడగు వాఁడవుఁగా
వున మ్రొక్కితిఁగాని రణంబునకున్ మది వెఱచికాదు మ్రొక్కుట యార్యా!"
—బాలకాం. 760.

ఈ పద్యమునఁ బరశురామునియందు నమస్కార యోగ్యతలు నాల్గు ఒకవరుసఁ బాటించి పేర్కొనఁబడి, యేకనిష్ఠము చేయఁబడుటచే నతని పూజ్యత్వమున కొక యున్నతి గల్పింపఁబడినది. అట్టి యున్నతిని స్వాభావికముగనే గుర్తించిన రాముని ధర్మదృష్ట్యున్నతి యిందు వ్యంగ్యమయి యున్నది. మఱియు నాయ కాశ్రయమగు మానవీరము గురుభక్తి ధర్మానుప్రాణితమై యొప్పుచున్నది.

ఈ పలుకులు పరశురామునకు ములుకులై దాఁకినవి. ఆతఁ 'డిదం బ్రాహ్మ్య మిదం క్షాత్త్రి' మ్మని యొకచేత జామదగ్న్యమును, మఱియొక చేతఁ గుఠారమునుంబట్టి క్షత్త్రలోకమును జంపివైచితినని గర్వోక్తులఁ బల్కెను. అవి శ్రీరామునకు గోపహేతువులైనవి. మాటలవలన ప్రయోజనము లేదని కార్యశూరుఁడై —

"ప్రళయతరోగ్రకోపమున రాముఁడు భార్గవరాము చాపమున్
బలువిడిఁ బట్టి రాఁదిగిచి, బాహుబలోద్ధతి నెక్కువెట్టె య

త్యలఘు శరంబమర్చి తెగ నా్రశవణాంతము నేసి నీపదం
బులు తెగనేసిపుచ్చెద నమోఘము నావిశిఖంబు నావుడున్''

బాలకాం. 771

ఇక్కడ నొక్క చమత్కారము కలదు. ఇట్టి ధనుర్భేదనక్రమమునే శివధనుర్భంగమును వర్ణించు నవసరమునఁ గూర్పఁబడెను. కాని యందలంకార మున్నది. ఇందు లేదు. ధనుర్భంగ యత్నక్రమ మించుమించు రెంట నొకటియే. కల్యాణప్రదమైన తద్ధనుర్భంగ మలంకారమున వర్ణిత మగుటయు, క్రోధ మాత్సర్య భావయుతమగు నీ ప్రయత్నము నిరలంకారముగాఁ జెప్పఁబడుటయు నర్హ్యమని కాబోలు సన్నివేశౌచిత్యము ననుసరించి వర్ణనాపద్ధతిని మార్పుఁ జేసినాఁడు కవి! పరశురాముఁడు శ్రీరాముని నాది విష్ణువుగా గుర్తించి కీర్తించెను. ఈ గుణకీర్తనము శ్రీరాముని "దివ్యాదివ్య" నాయకునిగా నిరూపించుచున్నది. పరశురాముని కార్ముకభంగముతో రాముని వీర ముజ్జ్వల కాంతిమంతమైనది

కైకేయినోట నశనిపాతమువంటి వనవాస గమనాజ్ఞను వినినప్పుడు శ్రీరాముని యందలి ధృతి య ప్రతిమానము; ఆ ఘట్టమున నాతని నాశ్రయించిన ధర్మవీరము, తత్పోషకములగు త్యాగభక్తి వీరములు ప్రశస్తములు

''జనకుని సత్యము నెరపెడు తనయుఁడ వయితేని నీవు తాపస వృత్తిన్
జను వనమున కన నగుఁగాకని మొగమునఁ దొంటి కంటెఁనను వొప్పారన్.''

వ. "రామచంద్రుం డిట్లనియె." —అయోధ్యకాం. 107, 108.

ఇందు కైకేయిమాటలు సూటిగాను, కట్టె విఱిచినట్లును, బాణము సంధించినట్లును ఉన్నవి. శ్రీరాముఁడు వనవాసమున కరుగుటవలన— నీమె మాటలను బట్టి— జనకుని సత్యవ్రతము నిల్చును; ఉత్తమ పుత్త్రుఁడని రాముఁడు కీర్తిఁ బొందును. ఈ రెంటిలో మొదటిది రెండవదానిపై నాధారపడి యుండుటచే తనయుని తెగువపైననే తండ్రి సత్యవ్రతము బ్రదుకుట! ఈ మాటలు వినిన శ్రీరామునికి మొగము పూర్వముకన్న నధికముగా నొప్పారినది, వికసించినది. ఇది సంతోషమునకు, ఉత్సాహమునకు, నైర్మల్యమునకు, భక్తికిని సూచితము. సామాన్యుఁడు గుండెలు పగులగొట్టుకొను తావున మోముదమ్మి వికసింపఁ జేసికొనిన శ్రీరాముని నిగ్రహము వర్ణనాతీతమిచ్చుట!

''జననివి నీవుఁ వేఁడు దఁటె సత్యము దండ్రికి నెక్కునట్టై, నా
యనుజుఁడు నేల యేలునటె, యక్కడ నన్నుని పాద పద్మవం

దనమశెు, కృత్య మిట్లగుట ధన్యుఁడ, నేఁగెదగాన నేను మీ
పనిచిన యట్ల వే భరతుఁ బట్టముగట్టు సవిత్రి ధాత్రికిన్."

—అయోధ్యాకాం. 109.

ఈ పల్కులలో రాముని యుత్సాహ మనన్య సామాన్యము. "మీ పనిచిన ... నేఁగెద" ననుటచే గుర్వాజ్ఞ పరిపాలనము, మునిపాద సేవనము శ్రీరాము నకును, సత్యనిర్వహణప్రాశస్త్యము తండ్రికిని, మనస్సంతృప్తి కైకకును, రాజ్య ప్రాప్తి భరతునకును లభించుచున్నవి. భరతునికిఁబట్టముగట్టు మనుటలో త్యాగ వీర స్ఫూర్తి కలదు. ఈ ధర్మోత్సాహము మఱికొన్ని ఘట్టములచే నిచ్చట బల పరుపఁబడినది. కౌసల్య శ్రీరామ వనగమనమునకు దురపిల్లుచుండ నామెను గాంచి—"అవ్వా! నాకుఁ బితృవాక్యపరిపాలనంబు సేయుట పరమధర్మంబు" అని తన ధర్మమార్గానువర్తనములో నుత్సాహ ముప్పొంగినట్లు నుడివినాఁడు; సౌమిత్రి కినుకఁబూని దశరథ కేకయాత్మజలఁ బరుషవాక్యములఁ దూలనాఁడి వారిఁజంప నుద్యమింప నాతని యావేశమును వారించుచు—

"దశరథేశ్వరుండు తండ్రి; కేకయ మహీపాల పుత్త్రి తల్లి; భరతుఁ డనుజుఁ
డిందులోన నితరులెవ్వరు వీరోక్తు లేలనాడువ? నుడుగు మీతలంపు.

వ. అదియునుంగాక నీవును నేను గౌసల్యా సుమిత్రలు దశరథు నాజ్ఞం జరి యించు వారముగాదె పితృవాక్యపాలనంబు సేయనివానికి గతిలేదు, యట్టితండ్రిం గూర్చి యిట్టి కఠినోక్తులు నీకుం బలుకం జెల్లునె." —అయో కాం, 143, 144.

అని బోధించెను. అధర్మబద్ధములగు పరుషోక్తులఁ బల్కు లక్ష్మణుని వారించు సాత్త్వికసంపదయు, ధర్మసంసక్త నిశ్చలమనఃస్థితియు రామునియం దీపల్కులు స్థిరీకరించుచున్నవి. వీనిచేతఁ బరిపుష్టమైన ధర్మవీరమునకు కౌసల్యపల్కులే సాక్షి!

"దశరథు వాక్యశాసనము తప్పుట తప్పని నిశ్చయించి యీ
దశను ధరించి లోకవిదితంబుగఁ గానలలో శరచ్చతు
ర్దశకముఁ బుచ్చి వచ్చి, రఘురాముఁడు నిర్మల కీర్తిచంద్రికల్
దశదిశలన్ వెలుంగ వసుధా పరిపాలన కేళి సల్పెడున్"

—అయో. కాం. 220.

శ్రీరాముఁ డరణ్యమునఁ గాలిడినదిమొదలు అడుగడుగునకు దుష్టశక్తు లగు రాక్షసుల నెదుర్కొనవలసి వచ్చినది. అందు ప్రతియొక్కఁడును మాయా విద్యావిశారదుఁడు, ప్రచండ పాశవికబలసమన్వితుఁడు. రాక్షసులు మూర్తి గట్టిన కామక్రోధాదులు. వీరి నందఱ జయించుట యన నరిషడ్వర్గ సంపదను

జయించుటయే. ఇట్టి ప్రయత్నమే శ్రీరాముఁ డరణ్యావాసమున నిర్వహించి లోకహితముఁ జేకూర్చి పూజనీయుఁడైనాఁడు.

శ్రీరాముఁ డరణ్యావాసమునఁ జంపిన రాక్షసులంద ఱొకయెత్తు; రావణుఁ డొక్కఁ డొకయెత్తు. రావణుఁడు రాక్షస రాజ్యమగు లంకానగరమున కధీశుఁడు, శివభక్తుఁడు, తపశ్శాలి, బలశాలి, వరగర్వి, అతని నొక్క పరదారాసక్తియే వేరుపురుగై తినివైచినది. అట్టి ప్రతినాయకునికిఁ బరాక్రమాదుల నన్నింటమించి ధీరుఁడై, ఏకపత్నీవ్రతుఁడై, ధర్మార్థసాధకుఁడై స్వశక్తిచే సహాయము సంపాదించి, దానిని సద్వినియోగపరిచి విజయము సాధించిన వీరుఁడు శ్రీరాముఁడు. ఇతని నాశ్రయించిన యుద్ధవీరమే అరణ్యకాండ మొదలుకొని యుద్ధకాండాంతమువఱకు వ్యాపించియున్నది. అచ్చటచ్చట క్షమామానబలవీరాదులు స్ఫురించినను యుద్ధవీరమున కవి యంగముగ నిలిచి నాయకోత్సాహము నినుమడించుచున్నవి.

ఇతివృత్త రచనమం దీరామాయణకర్తలు చాకచక్యముతో శ్రీరామునియందు యుద్ధవీరమును ఔచిత్యము చెడకుండ పోషించిరి.

అల్పులగు రాక్షస వీరులపై రాముఁడు విజయము సాధించిన ఘట్టములందు యుద్ధవర్ణన మధికముగాఁ జేయబడక నాకార్యములు క్షణములో నిర్వర్తితములయినట్లు అద్భుత ఫలకములుగా నిర్వహింపఁబడినవి. ఉదాహరణమునకు: శూర్పణఖ తనకు జరిగిన యవమానమును గూర్చి ఖరునిముందు మొఱవెట్టుకొనినది. ఖరుఁడు రామలక్ష్మణుల లెక్కసేయక వారిని జయించుటకు సమర్థులును, అంతకాకారులును అగు పదునలువురు రాక్షస వీరులఁ బంపెను. వారుద్ధతులై శ్రీరామాశ్రమ సమీపమున కరిగినారు. దవుదవ్వులనే వారినిగాంచి శాతవిశిఖములను, కోదండమునుఁ జేతికందికొనుచు, శ్రీరాముఁడు సౌమిత్రికి వారినిజూపి:

"........యిట్లను మీకుఁ బ్రాణముల్
గరముఁ బ్రియంబులేనిఁ దొలఁగం జనుఁడుద్ధతి మాని పూని సం
గరమున నిల్చినఁ బ్రదుకఁగా వశమే" —అరణ్యకాం. 163.

యని పల్కెను.

శ్రీరామునిపల్కులందు శత్రువీరులపై నాతనికున్న నిరాదరము విజయగర్వము స్ఫుటమగునట్లు-ప్రాణములు తీతునని బెదరించి, తప్పుకొనుట కవకాశమిచ్చి దయను ప్రదర్శించినాఁడు. మదాంధులగుటచే వారు రామ పరాక్రమ

మును గుర్తింపలేకపోయిరి. పై పెచ్చుతని మాటలనే అతనికి వడ్డించిరి; స్వీయ రాజభక్తిని వెలార్చిరి.

"రక్షోనాయకుఁ డగ్గలేని వళమే రా రామ! ప్రాణంబు లా
జిక్షోణిఁ మెయినిల్వ నీకనుచు నాక్షేపించుచుఁ శూలముల్
రూక్ష ప్రేక్షణుల న్నిశాట భటవీరుల్ వైచి రీరేడు వి
శ్వ క్షోభంబుగ నార్చుచుఁ సురవిపక్ష గ్రామణుల్ పెల్లుగఁ"
—ఆరణ్యకాం. ప్ర. 165.

రామునకు వారి యాక్షేపములు, రూక్షవీక్షణములు, ఆర్పులు, శూల ప్రయోగము లించుకంత కలంతఁ జేకూర్పలేదు. సింహముముందు లేడిపిల్లల కుప్పిగంతులవలె తోఁచిన వాతనికి. నిశ్చింతతో మూర్తిగట్టిన ధృతియై నిలిచినాఁడు రాముఁడు. రాక్షసు లవివేకులై శూలములు సంధించి—

"వైచుటయు నొక్కతెగఁ గత్తివాతియమ్ము
లతఁడు పదునాల్గు నిగిడించి యద్భుతముగఁ
దునిమెఁ బదునాల్గు శూలమ్ములను మహోగ్రు
లగుచు వారంతఁ బోకపై నడరుటయును"
—ఆరణ్యా. ప్ర. 166.

పదునల్గు రొక్కలక్ష్యమున శూలములు వేయ రాముఁ డొక్కఁడు పదునాల్గు లక్ష్యములతో బాణములు సంధించి వానిం దునుముట నిజముగఁ జూపఱ కాశ్చర్యజనకమే యగును.

"వెండియుఁ జండకాండములు వే పదునాల్గు సమగ్రశక్తిను
ద్దండ రయంబునం దొడిగి దైత్యులనేసినఁ దూలకూలి రా
ఖండలుఁడేచి ఱెక్కలు దెగఁ వడ వ్రేసిన నోలిఁగూలు పె
న్గొండలభంగి బాదహతిఁ గుంభిని గంపమునొంద దండడిఁ"
—ఆరణ్యా. ప్ర. 167.

అద్భుతావహమగు తన పరాక్రమమును గాంచియు వెనుదిరుగక నుద్ధతులై పైకురికిన రాక్షసులపై రామునికి దయతప్పినది. అది సహజమే. ఒక్కసారిగా పదునాల్గు బాణములఁ దొడిగి వారిని క్షణములో సంహరించెను. ఉపమాలంకారప్రయోగమునఁ గొండలవంటి యాకృతులుఁ గల్గిన రాక్షసుల స్వరూప స్వభావమును, ఇంద్రునిబోలు రామునియందు త్రిలోకాధిపత్యార్హతయు, దేవత్వమును, శత్రుభంజన దక్షతయు వ్యంగ్యముగా సాధింపఁబడి నాయకాశ్రయమైన వీరమునకు వన్నెఁ బెట్టఁబడినది. అల్పవీరుల సంహరించుటయందు, సమ

యోచిత వర్ణనాసామర్థ్యమున నాయకుని వీరము నుత్తమముగాఁ బోషించిన ఘట్టము లిట్టివి రామాయణమున బెక్కులు గలవు.

మధ్యమ (తరగతికిఁ జెందిన) వీరులు ససైన్యులై యుద్ధతితో నొక్కుమ్మడి దాడివెడలి తనను గబళింపఁజూడ వారి సమృద్ధిఁగాంచి యుత్సహించి యొడలువెంచి వారి యుక్కడగింప నుత్సహించెడి నాయకునియందు వీర మూపిరి నింపుకొనును. ఉదాహరణమునకు దండకారణ్యమునఁ గడు ప్రసిద్ధిఁ గాంచిన, ఖరదూషణాదులు శూర్పణఖచే ప్రేరితులై రామునిపై నొక్కుమ్మడి దాడివెడలినారు. మహోత్పాతములు గోచరించినను లెక్కసేయక ఖరుఁడు—

"అమరగణముగొల్వ నైరావతము నెక్కి వజ్ర మలుకఁ బూని వాసవుండు
వచ్చెనేనిఁ బోరఁ జచ్చు నాచే నన్న వెడఁగు నరులు పోరఁ దొడరువారె"
—అరణ్యా. ప్ర 186.

అని యవివేకియై ప్రగల్భైక వీరాలాపములఁ బల్కుచు రాము నెదుట ససైన్యుఁడై నిలువ-సౌమిత్రినిగాంచి రాముఁ డిట్లనియె :

"ఇదెచూడు మిడుఁగుఱు లీనుచున్నది విల్లు కీలిత బహురత్న కీలలెసఁగఁ
దూపులు దమయంతఁ దూణముల్ వెలువడి రాజుచున్నవి భీకరంబు లగుచుఁ
బొరిఁబొరి నపసవ్య భుజమును గుడికన్ను నదరుచున్నవిగాన కదన మిపుడ
సిద్ధించు, జయమును జేకుఱు నాకు నీ దైవసూచకము దద్దయును మేలు
మనసు దిరమయియున్నది మత్తులగుచు వరుస నిటుఁగూడి మనమీద వచ్చుచున్న
యిన్నిశాటుల నందఱ నేన పూని విశిఖముల పాలుసేసెద వివిధగతుల"
—అరణ్యా. ప్ర. 188.

ఈ పల్కులలో రాముని వీరము వ్యంగ్యముగా స్ఫురించుచున్నది. రత్నకీలిత కోదండము మిడుఁగుఱు లీనుట, తూణీరగత బాణవితతి తమంతట తాము వెలువడి రాజుకొనుట మొ. నవి బహి రనుభావములు. దానికి హేతువు శత్రు సందర్శనానంతర మేర్పడిన సంగరోత్సాహము. అపసవ్యభుజము, కుడికన్ను అదరుట దైవికమైన సాత్త్వికభావము. మనస్సు చలింపక యుండుటలో స్థైర్య లక్షణము, ధృతి యనెడి భావము, 'ఏన పూని... సేసెద' ననుటలో గర్వహర్షామర్షోత్సాహాది భావములు స్ఫురించుచుండుటచే శ్రీరామోత్సాహము యుద్ధ వీరముగాఁ బరిణమించుచున్నది. ఖరదూషణాదులతోడి రాముని యుద్ధమును వర్ణించుఘట్టమంతయు వీరరసాలవాలమై సర్వాంగ సౌందర్యమును సంతరించు కొనుచున్నది.

క్రియాపద ప్రయోగముచే నాశ్చర్యముగ్దుఁడగు సుగ్రీవున 'కేమియిచ్చును?' అను నాలోచనా కుతూహలములను గల్గించి - 'వానికి' అని కర్మపద వ్యవహితముగాఁ దెల్పి తత్కుతూహలముఁబెంచి, 'అయోధ్య' నని చివఱకుఁదెల్పి యతని నాశ్చర్యానందచకితునిఁ జేసినట్లు దోఁపఁగలదు! ఇందు రామునియం దెంతయో నిబ్బరము - త్యాగక్రియాసంబంధియైనది - తత్సంభృతోత్సాహ భావము, తదనుప్రాణితమైన వీరచర్యచే శత్రువునైనను లోఁగొను ప్రాభవ శక్తి, వాక్యలఘుత్వముచేఁ దదాచరణలఘుత్వమును వ్యంగ్యములై విలసిల్లు చున్నవో సహృదయ వేద్యము!

నాయకుని ధర్మచర్యను దూషింపఁజేసి విపులముగాఁ గవితఖండనను నాయకునిచేఁ జేయించి ధర్మనిరూపణమునం దాతని యుత్సాహముఁ బ్రకటింపఁ జేసినచో నదియు ధర్మవీరమే యగును. పతాక ప్రతినాయకుఁడగు వాలిని రాముఁడు సంహరింప నాతఁడు రాముఁడధర్మవర్తి యని నిందించును, (కిష్కింధ. 237-249; 309-313) నిరూపించును దానికి సమాధానముగా రాముఁడు - వాలి లౌకికధర్మవిరుద్ధముగా ననుజుని భార్యను బొందెననియు, తాను వాలిఁ జంపెదనని వానరసభలోఁ బ్రతిజ్ఞఁజేసెననియు, దుష్టనిగ్రహ శిష్ట ప్రతిపాలనములు రాజధర్మములనియు, భరతుఁడు తనను దురాచారులఁ బోరి గొనుమని బంపెననియు, తత్కారణములచేఁ దాను అనుజభార్యాపహారుఁడైన వాలిని సంహరించెననియుఁ జెప్పి (కిష్కిం. 316-319) తన వీరధర్మమును నిరూపించుకొనినాఁడు.

ప్రతినాయకుఁడగు రావణునిచే నపహరింపఁబడిన నాయికయగు సీతను గూర్చి పరితపించుచు నాయకుఁడు తత్సమాగయాకాంక్షియై తత్సాధనాత్మక మగు ప్రతినాయక సంహరణక్రియోత్సాహముఁ బ్రకటించెను.

"వననిధి బంధించి, చని, లంక భేదించి, రాక్షసాధము పెన్నురంబు రయము
మెఱయ నందంద క్రొమ్మెఱుఁగు నారసములఁ గ్రుచ్చి యచ్చెరువారఁ గులిశఘోర
భల్ల పరంపరల్ పరగించి ధనురాది సాధన ప్రకరంబు చక్కుచేసి
చేతులు ఖండించి శిరములు దునుమాడి వెస వాని శోణిత వృత్తిచేతఁ
బుత్రిదెసకుఁ బొగులు భూదేవి యుడుకార్చి తీవబోఁడి నెపుడు దెత్తునొక్కొ
చంద్రవదన వదనచంద్రిక నెన్నఁడు దృక్చకోర తృష్ణఁదీర్తు నొక్కొ!"

—యుద్ధ. 42.

ఇందు విప్రలంభానుప్రాణిత వీరరసము స్ఫురించుచున్నది. ఈ భావమే ప్రతి

నాయక సంహారానంతము వఱకు స్థాయిగా వ్యాపించి యుద్ధ వీరముగా నాయకునియందు శోభించుచున్నది.

ప్రతినాయకుఁడు నాయకు నెదుర్చుటకై మంత్రులతో సమాలోచనలు సల్పుచున్నపుడు కొందఱు మెప్పులకై ప్రగల్భము లాడుటయు కొందఱు వారిని మందలించి బలాబలనిరూపణ మొనర్చి నాయకునితో పోరు వలదని ప్రతినాయకునికి బోధించి తత్సహాయుల వీరమును హాస్యపుపాలు జేయుటయు— పరోక్షముగా నాయకుని ప్రాశస్త్యమునే ప్రతిపాదించును. వారిధి గట్టి లంకపై రానున్న రాము నెదుర్కొనువిధము నాలోచించుటకై నేర్పరచిన మంత్రాంగ సభలో ప్రహస్తాదులగు వీరులెందరో కొండంతలు ప్రతిజ్ఞలు చేసిరి. మచ్చునకుఁ గొందఱు రాక్షసు లిట్లనిరి :

"పెఱుకుదుమే ఫణీంద్రు విషభీషణ దంష్ట్రిలు నేలఁ గ్రుంగఁ జే
సఱతుమె నింగి మ్రింగుదుమె చండదిశాగజ దంతకాండము
ల్విఱుతుమె వారిధుల్ పుడసిలింతుమె మందరమంగుటంబునం
జిఱుముదుమే జగంబు లఱచేతికిఁ దెత్తుమె రాక్షసేశ్వరా!"

వీరిని మందలించుచు విభీషణుఁడు—

"మగమాటల్ మనకేల నాఁడల హనూమంతుండు లంకాపురం
బెగువంగాల్పఁగ నెందు బోయితిమి నేఁడెవ్వండు లజ్జింపఁడే
తగవుం జెప్పఁడు సీతఁ బుచ్చుమనఁ డా ధాత్రీశు నుల్కాసమా
శుగ వేగంబు దలంపఁ డింక నిదియుం జూడంగ నౌ నాజులన్"
—యుద్ధకాం. 60, 123.

అని పల్కినాఁడు. ఈ మాటలలో రాక్షసుల నవహేళనఁ జేయుట కలదు. హనుమంతుని కెదురునిలిచి పోరఁజాలని వీరులకీ యసాధ్య ప్రగల్భము లెందుల కని వారిని హాస్యఁపుపాలు జేసినాఁడు. రాముని బాణాహతిఁ గూలుదురని బెదిరించి రామ పరాక్రమాదులను వ్యంగ్యముగాఁ దెల్పినాఁడు. ఈ వ్యంగ్య మర్యాదచే కథకు, తన్నాయకునకు నెనలేని గౌరవ మేర్పడుచున్న దిచ్చట!

ప్రతినాయకుఁడు నాయకసైన్య రహస్యముల నరయఁ బంపిన గూఢ చారిని చారచక్షువై కనిపెట్టి బంధించి, వానికిఁ గలరూపెఱింగించి 'అల్పుఁడవు నిన్నుఁ జంపకూడ'దని వానిని వదలుచు వీరసందేశ మాతనితో శత్రువు కంపు నాయకునియందు రణధార్మిక ప్రక్రియ, తదుత్సాహము వ్యక్తమగు చుండును. రావణుఁడు రాముని స్కంధావారమునకు శుకసారణుల నొక సారియు, శార్దూలాదిచారుల నొకసారియు గూఢచారులుగా బంప, వారు

రామభటులచేఁ బట్టుపడి, రామునిచే క్షమింపఁబడి, యాతనిచే తమప్రభువున కొక సందేశముగైకొనిపోనాజ్ఞాపితులైరి. అందుదాహరణమునకు :

"క్షితిసుత నేలావునఁ దెచ్చితి నీవాలావు సకలసేనలతో నా
జి తటిం జూపుచు నాశరతతి కించుక సైఁపు మనుము దర్పమెలర్పన్"
—యుద్ధ 314.

ఇందాలంబన విభావము రావణుఁడు. సీతను బలిమినిగొనిపోయిన స్మృతి యుద్దీపనము. స్థైర్య ధైర్య శౌర్య వైశారద్యాధిక్షేపాదు లనుభావములు. గర్వామర్షోత్సాహధృత్యాదులు సంచారులు. వీని సంయోగమున యుద్ధ వీరము నాయకాశ్రయముగా నిష్పన్నమగుచున్నది.

ఇంతియగాక నాయకుఁడే స్వయముగాఁ బ్రతినాయకునికి సామోపాయము ననుసరించి రాయబారమంపవచ్చును. అందాత్మగౌరవమునకు హాని రానట్లు శత్రురాజుపై నీతినిబ్రయోగించి యుద్ధోత్సాహముఁ బ్రకటించును. ఉ. అంగదరాయబార మట్టిది.

"కడిమిం బోరికి శూరతం గడఁగి రా కాదేవి వైదేహినేఁ
గడవం దెచ్చితిఁ దప్పుగావుమని లంకారాజ్యమొప్పించి వె
ల్వడి ప్రాణంబులు గాచికొంచు దివిజుల్సంతోషముం బొంద నె
య్యెడ కైనం జనుమా విభీషణుఁడు రాజివ్వీటికిన్ రావణా !"

"కపటమువన్ని జానకి నకల్మషఁ దెచ్చిన యట్టి పాప క
ర్మపుఁ బొడువం దనూజ హితమంత్రి సమేతముగా దశాస్య మ
ద్విపుల శిలీముఖజ్వలన దీర్ఘతరార్చుల నేర్తు నిన్ను నీ
తపమున కట్లు మెచ్చిన విధాతృఁడువచ్చిన నెందుఁజొచ్చినన్"
—యుద్ధకాం. 502, 503

ధర్మబద్ధమగు యుద్ధమునే యాచరించువాఁడగుటచే రాముఁడు సామాద్యుపాయములఁ బ్రయోగించుచు శత్రువుపై దయఁజూపి ప్రాణరక్షణోపాయముఁ జూపినాఁడు. కాని తనప్రతినయు, ప్రతీకారదీక్షయుఁ బ్రతిబింబించునట్లు సందేశమంపి వీరరసపోషకముగా దానిని సంతరించినాఁడు.

ప్రతినాయకుఁడు యుద్ధమున నిరాయుధుఁడై పోవ నాతని దయఁదలచి వదలుటచే నాయకుని ధర్మోత్సాహమతిశయించును. రామరావణ ప్రథమ యుద్ధమున రావణుఁడు విరథుఁడు, నిరాయుధుఁడు నయ్యెను. అట్టివానిఁ గాంచి రాముఁడు

"ఇంతదాఁకఁ గయ్య మినసుతాదులతోఁడ జేసి యలసినట్లు చేష్టదక్కి
యున్నవాఁడ వగుట నిన్నింక నే నేయ డప్పిఁ దీర్చుకొని కడంగు మనిన"
"మీఱిన భయమున రామునిఁ దేఱి కనుంగొనఁగ నోడి ధృతి కడుఁ దూలన్
వేఱొకని తేరిపైఁ బడి పాఱి యతఁడు లంకసొచ్చెఁ బౌరులు బెదరన్."

—యుద్ధ. 853, 854.

రామునియందలిది దయానుప్రాణిత ధర్మయుద్ధవీరము. ప్రతినాయకుని భయము, ధృతిరాహిత్యము, పలాయనము మొ. నవి నాయకుని వీరపోషకములే, "ధృతి కడు తూలన్...పడి" అనుటలోని "తూలుట, పడుట" అను క్రియాపదములు సాభిప్రాయములు. "తేఱి...నోడి" అనుటలో లజ్జ స్ఫుటముగా గోచరించుచున్నది.

రణోన్ముఖులైన నాయకప్రతినాయకులయందు ప్రతినాయకుని వికత్థనునిగను, నాయకు నవికత్థనునిగను చిత్రించుట యొక యౌచిత్యము. రావణుఁడు రాముని మూఁడవసారి యెదుర్కొని పల్కిన మాటలలోఁ గొన్ని :

"మన్నామ మంత్రంబు మానుగా యమదూత చటుల భూతగ్రహోచ్చాటనంబు
మత్ప్రతాపప్రౌఢి మహిమ గంధర్వ యక్షాదిక గహన దావానలంబు
మద్భుజావనములు మహనీయ జయలక్ష్మి విహరించు నుద్యాన విపుల తరులు
మత్కోప వేగంబు మత్తారికుల శైల పక్షపాత నివాతపవివరంబు,
అట్టి నాలావు దలపోయు ననువులేక నిఖిల రక్షణ పరయగు నీతిలేక
ఘనతరంబగు సద్వివేకంబులేక పోరొనర్పంగ వచ్చితి బుద్ధి తప్పి."

—యుద్ధ. 2006

ధీరోద్ధతునివలె దశాస్యుఁ డెన్నియో యిట్లు గొప్పలు ప్రేలినాఁడు. అప్పటికే రెండుసారులు రణవిముఖుఁడై 'చావుదప్పి కన్ను లొట్టబోయిన' రావణుఁడీ పల్కులాడుటఁగాంచి పఠిత యతనిపై సానుభూతి కోల్పోవును; వితర్కముచే నాయకౌన్నత్యము గుర్తించి యాతనిలో తాదాత్మ్యముఁ బొందును. రాముఁడీ పల్కులువిని 'మచ్చరము, చలముదలిర్ప, నవ్వుగిన్కయుఁదోపఁగ' వానిఁ జూచి యిట్లనెను.

"భూమ నిజానుభావ పరిభూత సురాసుర ! నీవు సెప్పఁగా
నేమిటి కింతవాఁడవగు దిందనుమానము గల్గనేర్చునే
నీ మహనీయ శౌర్యమును నీ కమనీయ సమగ్ర ధైర్యమున్
నీ మహిమానుషంగమును నేఁ బరికించి యెఱుంగుదుం జుమీ !"

"వీరుండాకృత వీర్యసూనుఁడు భుజావిఖ్యాత శౌర్యంబునం
గారాగారమునందు మున్నెలమిమైఁ గాపుంచెనుద్దామ స
త్సారాసారుఁడు వాలి వాలి సుమహాసత్త్వుండు దుర్వారతం
బారావారములందు ముంచె నిను శుంభద్విక్రమారంభుఁడై"
—యుద్ధ. 2011, 2012.

"భూమ...సురాసుర" అనునది అధిక్షేపముఁ దెల్పుసంబుద్ధి! "ఇంతవాఁడవు" "మహనీయ శౌర్యము" "కమనీయ సమగ్రధైర్యము" "మహిమానుషంగము" అనెడి విశేషణములు వ్యతిరేక వ్యంగ్యార్థము నిచ్చుసామర్థ్యముతోఁ బ్రయుక్తములయినవి. వాలిచేత రావణుఁడు వడ్డ పరాభవము స్మృతికిఁ దెచ్చి వాలి సంహారియైన రాముఁ డాతని నవలీలగా సంహరించుచున్న భావము వ్యంగ్యముగా స్ఫురించునట్లొనర్పఁ బడినది. ఇది పరోక్షముగా నాయకుని పరాక్రమాతిశయాదులనే సమర్థించుచున్నది. నాయకుని పల్కులలోని వ్యంగ్య శక్తి ప్రతినాయక శబ్దవాచ్యమును వెక్కిరించుచున్నట్లున్నది. సంస్కారములలో నిరువురి తారతమ్యము వెల్లడి యగుచున్నది.

నాయకప్రతినాయకులు మహాస్త్రప్రయోగము లొనర్చుకొనునప్పుడు విస్మయ మంగముగా గల యుద్ధవీరము స్ఫురించును. రామరావణ యుద్ధమున వారుణసమీర వారణాపత్య నారసింహాది మహామంత్రపూరిత బాణప్రయోగ ఘట్టము ఇందుల కుదాహరణము. (యుద్ధ 2047-2061; 2187-2193). రసోచితమైన శయ్యాపాకములు, శబ్దార్థాలంకార ప్రయోగములు ఇందు సలక్షణముగాఁ గూర్పఁబడినవి.

నాయక కార్యసిద్ధికిఁ దోడ్పడిన యుపనాయకాదులగు సుగ్రీవ హనుమ ద్విభీషణాంగదాదులయందు గోచరించు నుత్సాహము, శ్రీరాముని కండయై నిలిచి యనునాయకుఁడై సర్వవిధముల నాయకునకు దీటైన లక్ష్మణుని ధర్మోత్సాహము, నాయికయగు సీతాదేవి భర్తృవ్రత దీక్షామతియై ప్రకటించు భక్తిశ్రద్ధోత్సాహము, శ్రీరాముని ధర్మనిర్వహణమున కంగములై నాయకాశ్రయమైన వీరరసమును పోషించుచున్నవి. అవి యన్నియు సహృదయ సులభవేద్యము లగుటచే నిచ్చట పేర్కొనుట లేదు.

రామాయణము వీరరసప్రధానమైన కావ్యమని ఇంతవఱకు ప్రతిపాదితమైనది. కాని యది కరుణరస ప్రధాన కావ్యమని ఆనందవర్ధనుని నాటినుండి ప్రచారములోనికి వచ్చినది. "రామాయణే హి కరుణోరసః స్వయ మాది

కవినా సూత్రితః 'శోకః శ్లోకత్వమాగతః' ఇత్యేవం వాదినా. నిర్వ్యూఢశ్చ స ఏవ సీతాత్యంత వియోగ పర్యంత మేవ స్వప్రబంధ ముపరచయితా" అని ధ్వన్యాలోకకర్త. (ధ్వన్యాలో. పు. 298) దీనినిఁబట్టి సంస్కృత రామాయణము కరుణరస కావ్యమని పండితలోకమున బహుళ ప్రచారమున నున్నది. ధ్వని ప్రస్థాన కర్తయగు ఆనందవర్ధనుఁడు "రసః కథానాయకాశ్రయోవా" అని నిబంధించినట్టివాఁడు రామాయణము కరుణరసాశ్రయమని చెప్పుటలో పాఠకులకు కొంత ఆశ్చర్యము కల్గింపక పోదు. ఇట్టి పరిస్థితియే వెనుక మహాభారతమునకుఁ బట్టినట్లు గమనించియున్నాము.

రామాయణమునందు రాముఁడు ధర్మవీరుఁడనియు, అది ధర్మపురుషార్థ ప్రధానమైన మహాకావ్యమనియు వెనుక నిరూపితమై యున్నది. ఆ దృష్టితో సహజముగా రామాయణము వీరరసకావ్యమనియే స్ఫురించును గాని తదన్యముగా నెట్లు భాసించునో దురూహమే! అది కరుణరస కావ్యమనుటకు ఆనందవర్ధనుఁడు రెండు ఉపపత్తులను చూపించియున్నాడు. 1. వాల్మీకి శోకము శ్లోకరూపము ధరించి అది రామాయణ కావ్యముగా పరిణతిచెందుట. 2. గ్రంథావసానమున రామునకు జరిగిన సీతాత్యంత వియోగదుఃఖము అనునవి. సంస్కృత రామాయణము బట్టియే అది కరుణరసప్రధాన కావ్యము కాక వీరరసప్రధానమనియే కావ్య కళాతత్త్వ ప్రకాశికలో నిరూపితమైనది. సామాన్యముగా షట్కాండ పరిమితమైన తెనుఁగు రామాయణములో—అందును నేను గ్రహించిన భాస్కర రామాయణములో—కథాంతము శ్రీరామ పట్టాభిషేకముతో ముగియుచున్నదికాని సీతాత్యంత వియోగదుఃఖముతో కాదు. అట్టిది తిక్కన, పాపరాజుల ప్రత్యేక కావ్యమగు ఉత్తర రామాయణమున ఉన్నను ఇది ఇచ్చట ఉపాదేయము కాదని నా మనవి. అందుచే ఈ రామాయణ కావ్యము దుఃఖపర్యవసితము కాజాలదు. గ్రంథాదిని బట్టి చూచినను, ప్రధాన రామాయణ కథ దశరథుఁని పరిపాలనతో ప్రారంభించును కనుక అచ్చట దుఃఖప్రసక్తి కవకాశము లేదు, శ్లోకరూపకావ్యముగా బరిణమించినది కనుక వాల్మీకి శోకమును గ్రహించినను ఆ కథ గ్రంథమున కుపోద్ఘాతమే కాని కథా శరీరమున జేరఁదగినది కాదు. అందువలన అతని శోకమువలన కావ్యమునకు కరుణరస ప్రాధాన్యత సంక్రమింపదు. ఔచిత్యదృష్టితో చూచినను, ధర్మవీరుఁ డగు నాయకుని మహాకావ్యమునకు కరుణరసము ప్రధానమగుట సమంజసముగా కన్పట్టదు - అందుచేత సాధింపఁదగినది యేమియు నుండదు కనుక. ఔపదేశిక

దృష్టితో చూచినను "ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ" అను భామహ వాక్యమును బట్టి ధర్మమునకు వీరరసము అనురూపరసముగా నిరూపింపఁబడినప్పుడు అట్టి ధర్మప్రధాన కావ్యమున తదనురూపమైన వీరము నిబంధింపఁబడుట సమంజసము కాని తద్విరూపముగా కరుణరసము కానేరదు. ఎటుచూచినను నా యభిప్రాయము రామాయణము వీరరస కావ్యమని చెప్పుటకే మ్రొగ్గుచూపుచున్నది.

మచ్చున కొక్క రామాయణ రస విమర్శన మొనర్చితిని. ఇట్లే రంగనాథ రామాయణము మొదలు రామాయణ కల్పవృక్షము వఱకుఁ గల తెలుఁగు రామాయణ కావ్యము లన్నింటిని సహృదయు లీ దృష్టితో నన్వయించుకొని రసవిమర్శన మొనర్చుకొందురని తలంచుచున్నాను!

## 3. ఆంధ్ర మహాభాగవతము

భగవత్తత్త్వమును, భగవదవతార లీలా విశేషములను, భగవద్భక్తుల భక్తిమయ జీవితగాథలను వర్ణించు గ్రంథము భాగవతము. ఇతివృత్త సంవిధాన మిట్లు ముప్పిధముగా ముడివడియున్నను భాగవతము భగవత్తత్త్వ నిరూపణమే ప్రధానముగా, తద్గుణ మాహాత్మ్యకీర్తనాత్మకముగా వరలుచున్నది. అవతార లీలాదులయం దద్భుతచర్యలు అధికముగా వర్ణితములగు చుండును. భాగవత జీవితములు భక్తిరసభరితములై భగవత్కృపా సంపాదనౌత్సుక్య సమన్విత ములై సాగి చివఱకు భగవదద్భుత ప్రసాదలాభ పర్యవసాయులయి యొప్పును. అందువలన నిం దంగిరసము వీరమగుటకు వీలులేదు.

ఒక్క సత్యమును ప్రతిపాదించుటకై పెక్కుపపత్తులు సంతరింపఁ బడి నట్లు భాగవతమున భగవత్తత్త్వ నిరూపణము కొఱకై అవతారగాథలును, భక్తి గాథలును, ఇతిహాసోచిత రాజవంశ చరిత్రములును, తత్త్వబోధలును ఒక్కచో గుది గూర్పఁబడి భాగవతమును వస్తుప్రధాన కావ్యముగా నొనరించు చున్నవి. ఈ గాథలన్నియు, విష్ణుపద సాగరసంగమ మొనర్చు మహా తరంగిణులే. వీనిలో నీద మొదలిడిన ప్రతిపఠితయు తత్పవిత్ర జలసేచనముచే పవిత్రీ కృతుఁడయి తత్సాగర గాంభీర్యమును గాంచి విస్మయాత్మకుఁడై తల్లీనమైపోక మానఁడు. పోతనగారి పల్కులలో :

"ఇంచుక మాయలేక మదినెప్పుడుఁ బాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరిదివ్య పదాంబుజ గంధరాశి సే

వించు; నతండెఱుంగు నరవింద భవాదులకైన దుర్లభో
దంచితమైన యాహరి యుదార మహాద్భుత కర్మమార్గముల్"

ప్ర. స్కం. 38.

ఇందు రసవిషయకములుగా గమనింపవలసిన విషయములు రెండు: ఒకటి: భక్తులు పాయని భక్తిఁగల్గి స్థైర్యాదిగుణ సమన్వితులై హరిదివ్య పదాంబుజ సేవయందు అనంతవ్రతోత్సాహముఁ బ్రకటింతురనియు; రెండు; హరి వారిపట్ల అద్భుతావహములగు వర, దానాదులచేఁ బ్రసన్నుఁడయి యౌదార్యమును బ్రకటించుననియు తాత్పర్యము తేలుచున్నది. ఇందు ప్రథమాంశమున భక్తి వీరమున కాస్పదము కొంతకలదు. రెండవ యంశమునందు వీరరస జనకమగు నద్భుతమున కవకాశము మెండుగానున్నది.[1] హరిచేయు నద్భుత కర్మమార్గములకు మూలము భక్తుల యుత్కటభక్తియే అవతార లీలలందును లీలా మానుష విగ్రహుఁడగు భగవంతుఁడు చాలవఱకు నరునివలెనే విక్రమోత్సాహాదులఁ బ్రకటించినను కొన్నియెడల దైవాంశమును బ్రకటించి యద్భుతములఁ బ్రదర్శించుటఁ గాంచుచున్నాము. అద్భుతావహములుగాక అపూర్వ కార్య సాధనోత్సాహాదు లెచ్చటనైన వారినాశ్రయించి పోషణఁగాంచినచో నచ్చట గూడ వీరరసస్ఫూర్తి గలుగు నవకాశము కలదు. ఇట్లెన్నివిధముల వీరము స్ఫురించినను అది అంగభూతమే యగునుగాని యంగి కాజాలదు. భాగవతమున నంగిరసము భక్తియనియే విమర్శకుల యభిప్రాయము.

"శ్రీమద్భాగవతము సాహిత్యశాస్త్రమున గొప్పవిప్లవముఁ దెచ్చి పెట్టెను. చాలకాలమువఱకును రసము లెనిమిదియే యను వాదముండెను. తర్వాత శాంతము రసముగా నంగీకరింపఁబడి రసములు తొమ్మిదియయ్యెను. భాగవతప్రచారానంతరము మఱిరెండు రసములుగా గ్రహింపఁబడినవి. వాత్సల్యభక్తులు రెండును రసములని వాదింపఁబడెను. కాని విశ్వనాథాదులు కొందఱు వీని నంగీకరింపలేదు. చైతన్యస్వామి శిష్యులలో ముఖ్యుఁడగు రూపగోపస్వామి యీ విషయమై చర్చించి వీనికి రసత్వము సిద్ధాంతీకరించుటయే గాక తాను రచించిన "ఉజ్జ్వల నీలమణి, భక్తరసామృతసింధువు" అను గ్రంథములందు శృంగార భక్తిరసములకు విభావానుభావ సాత్త్వక వ్యభిచారి భావములను సమన్వయించి, స్థిరీకరించినాఁడు. "......" పోతన భాగవతమున వ్రాసినంత శృంగారరసము నెవ్వరును రచయింపలేదు. కాని యావ

1. ......"ఏ విభులీల లద్భుతములు!" —ద్వి. స్కం. ప. 60.

ద్గ్రంథము పఠించినతరువాత పర్యవసించునది భక్తిరసము. శృంగార మంగము, భక్తి యంగి. దీనిని మధురభక్తి యందురు."[1] అని కీ. శే. కురుగంటి సీతారామయ్యగారు.

చతుర్వర్గములందు మోక్షార్థఫలద మీ భాగవతము. మోక్షసాధనకుత్తమసాధనము భక్తియని యిందు ప్రతిపాదితము. బ్రహ్మయే యట్లు నిశ్చయించెనని భాగవతము—

"విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు ముమ్మాఱు ధ
ర్మనయజ్ఞత్వముతోడ నెంతయుఁ బరామర్శించి, మోక్షంబు ద
క్కిన మార్గంబున వెంట లేదనుచు భక్తిం జింతసేసెꣿ జనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుఁడగుచుం దన్మార్గ నిర్ణేతయై."

—ద్వి. స్కం. 35.

మోక్షపురుషార్థము గమ్యమైనను ధర్మార్థ కామసాధన ప్రవృత్తులగు కొందఱు తత్సంపాదనాయత్త చిత్తులై హరిభక్తియుక్తిచే కృతార్థులగుటయు కలదు కావున తద్వివిధభక్తి త్రిపురుషార్థ సాధనోత్సాహము వీరమనుట కవకాశము కల్గుచున్నది. భాగవతమునఁ బ్రతిపాదితమైన భక్తి నవ విధములు. అవి :

"శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్."

ఇట్టి విభాగ ప్రతిపాదనము మొట్టమొదట భాగవతమునందే జరిగినది. తద్భక్తి నిరూపణమే భాగవత తాత్పర్యము.

వ్యాసభట్టారక విరచిత సంస్కృత మహాభాగవతమును బమ్మెరపోతరాజు ప్రధానముగాఁ తెనుఁగు చేసెను. వెలిగందలనారయ, ఏర్చూరిసింగయ, గంగయ అను ముగ్గురు కవులుగూడ భాగవత రచనమునఁ బాల్గొనిరి. ప్రతి కవియు తన వ్యక్తిత్వము ప్రతిబింబించు కవిత్వమిందు సంతరించినను, సంపూర్ణ కావ్య దృష్టితో నవి ఏకస్వరూపముగనే భాసించుచున్నవి. వీరిలో జన్మతః భక్తుడఁయి, కవనమును భక్తికి సాధనముగా మలచి, ఆరాధన విశేషముగా భావించి, గంగా ప్రవాహమువలె దానిని బ్రవహింపఁజేసి భక్తి రసాస్వాదనభాగ్యము తెలుఁగు బిడ్డల కందించిన యపర భగీరథుఁడు బమ్మెరపోతన స్వతః అనుభవించి, అందు జీవించి రచించిన భక్తికావ్యమగుటచే నాతని యావేశము ప్రత్యక్షరమునను

1. మహాభాగవతోపన్యాసములు పోతన అనువాద విధానము. —పుట. 25, 94.

మూర్తీభవించి పఠిత నాకట్టి వారికి నట్టి యపూర్వ భక్త్యావేశాదులఁ గల్గించి ముందుకుఁ ద్రోసికొనిపోవుచుండును, అగ్రంథమునంటి నాస్తికుఁడ నన్నవాఁడు నాస్తి!

భగవద్భక్తులలోఁ గడు చిన్నవాఁడును, గుణములఁ గడు పెద్దవాఁడు నైనవాఁడు ధ్రువుఁడు. భక్తాగ్రగణ్యుఁడగు నారదుఁ డాతనినిగూర్చి కీర్తించుచు నిట్లనినాఁడు.

"పతియె దైవంబుగా భావంబులోపల దలఁచు సునీతినందను తపః ప్ర
భావము క్రియ ధర్మ భవ్యనిష్ఠలఁ బొందఁజాలరు బ్రహ్మర్షి జనము లనిన
క్షత్రియకులు నెన్నఁగానేల యెవ్వఁడు పంచ సంవత్సర ప్రాయమునను
సురుచి దురుక్త్యుగ్ర శర భిన్నహృదయుఁడై మద్వాక్య హితబోధ మతిఁ దనర్చి
వనమునకు నేఁగి హరిభక్తి వశతనొంది యజితుఁడగు హరి దనవశుఁడై చరింపఁ
జేసి, వెస దత్పదంబును జెందె; నట్టి హరిపదంబును బొంద నెవ్వరికిఁ దరము?"
—చతు. 380.

ధ్రువచరిత్ర సారమును నారదుఁడు ప్రశస్తముగాఁ బ్రపంచించినాఁడు. ఐదేండ్ల వయస్సుగల పిన్నవాఁడు పినతల్లి మాటలవలన శరబాధితుని వోలె హృదయమున వ్యథచెంది పతివ్రతాతిలకమగు తల్లియొద్దకేగి విన్నవించుకొనినాఁడు. అభిమాన ధనుఁడగు ధ్రువుని హృదయము ప్రతీకారవాంఛతో నుడికిపోయినది. కార్యసాధనలోఁ దోడుపడు వానికొఱ కన్వేషించినాఁడు. "నీవధోక్షజు పద పద్మము లాశ్రయింపు పాయక!" యను పినతల్లి మాటలే మార్గదర్శకము లైనవి. కృతనిశ్చయుఁడై నిశ్చలబుద్ధితో తపోవనమున కరుగఁదొడఁగినాఁడు. ఆ విషయ మెఱిఁగిన నారదుఁ డాశ్చర్యపోయినాడు. "మానభంగమునకు సహింపని క్షత్రియుల ప్రభావం బద్భుతముకదా! బాలకుండయ్యుఁ బినతల్లి యాడిన దురుక్తులు చిత్తంబునం బెట్టిచను చున్నవాఁడ"ని తత్పరీక్షార్థము మాటల వైఖరి మార్చి "ఓ బాలకా! సకలసంపత్సమృద్ధంబగుమందిరంబు దెగడి యొంటి నెందునేగెద"వనుచు బాల్య క్రీడాదులయందాసక్తి కల్గునట్లు పల్కి, పరమేశ్వరానుగ్రహ సంపాదమందలి దుర్లభత్వమును దెలిపి యాతనిఁ గదలించినాఁడు. ధ్రువుఁడు చలింపక "సపత్నీ మాతృవాగిషు క్షతంబగు వ్రణంబు భగవద్ధ్యానయోగ రసాయనంబున మాపికొందు.... ఈశమంబు సుఖ దుఃఖహతాత్ములగు పురుషులకు దుర్గమంబని కృపాయత్తుండవైన నీచేత వినం బడె; నట్లయినం బరభయంకరంబగు క్షాత్రధర్మంబు నొందిన యవినీతుండనగు నేను సురుచి దురుక్తిబాణ నిర్భిన్న హృదయుండనగుట మదీయ చిత్తంబు

శాంతి నిలువదు; కావునం ద్రిభువనోత్కృష్టంబు, ననన్యాధిష్ఠితంబునగు పదంబు బొంద నిచ్ఛించిన నాకు సాధుమార్గంబు నెఱిగింపు"మని పల్కినాఁడు. ఇందు ధ్రువునియందు క్షత్రియోచితమానవీరము ప్రస్ఫుటముగా గోచరించుచున్నది. అపూర్వ కార్యసాధనోత్సాహ మాతని ప్రతిమాటలోను చిప్పిలుచున్నది. పెద్దల యందు భక్తి, సమయోచిత వచన రచనానైపుణ్యము, నిశ్చల ధైర్య శౌర్యములు, కులధర్మోచితములగు నహంకారాదులు, ధర్మప్రవణైకశీలము మొ. లగు ఉత్తమగుణము లాతని యుత్తమవీరునిగాఁ దీర్చిదిద్దుచున్నవి "ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింప" రను భర్తృహరిసూక్తి ధ్రువునియం దన్వర్థమైనది.

త్రిభువనోత్కృష్టస్థానమునుగోరి ధ్రువుడు ఘోరతపమొనరించినాఁడు. ఇది అర్థసాధనకై ధర్మప్రధానదృష్టితో నొనర్చిన యత్నము. కావున తపశ్చర్యోత్సాహము తపోవీర మనఁదగియున్నది. ధ్రువుని తపస్సు విభావాది పరిపుష్టితో పోతనగారిచే వర్ణితమై యున్నది. (చతుర్థ 270 - 271) నారాయణ కీర్తనారూపమగు భక్తి యాతని తపోవీరమున కంగము. తపఃఫలోదయానంతరము ధ్రువుఁడు -

> "(అనఘ) పినతల్లి దన్నుఁ బల్కిన దురుక్తి బాణవిద్ధాత్ముఁడగుచుఁ దద్భాషణములు
> చిత్తమందుఁ దలంచుటఁ జేసి ముక్తి గోరమికి నాత్మలో వగఁ గూరుచుండె."
>
> —చతుర్థ. 296.

ఆ వగయే జీవితాంతమువఱకును భగవద్భక్తి నాతని హృదయమునఁ జెదరక నిలిపినది. ఉత్తముఁడు హిమవంతమున నొక యక్షునిచేఁ జంపఁబడినపుడు ధ్రువుఁడు కోపామర్షశోక వ్యాకులచిత్తుఁడై గుహ్యకులపై జైత్రయాత్ర సాగించెను. అందవక్రపరాక్రమ మెంతయో ప్రకటించియు శత్రుమాయా జాలముల నెదుర్కొనలేక యుండఁగా మునిజ్ఞాపితమై నారాయణశాస్త్రమాతనికి స్ఫురణకు వచ్చుటచే వారినెల్ల నణఁపఁగల్గెను. ఇం దాతని యుద్ధవీరము కొంత స్ఫురించుచున్నది. అది యద్భుతమిశ్రితము. ధ్రువుఁడు భ్రాతృవధాభితప్తుడై కావించు యత్నమాతని పవిత్రభక్తి చరిత్రమునకుఁ దగినది కాదని స్వాయంభువమనువు ప్రబోధించి యాతనిని ధర్మమార్గైక ప్రవణునిగా నొనర్చి యావజ్జన్మాంతము భక్తివీరునిగనే బ్రతుకునట్లొనర్చెను. ధ్రువుని జీవిత ప్రథమ ఘట్టమున ధర్మార్థసాధనకు భక్తియంగమై నిలిచినది; ఆ పైన మోక్షసాధన

కంగమై నిలిచి పెంపెక్కినది. ఇట్లు చతుర్వర్గసాధనకు భక్తి నంగముగాఁగొన్న యాతని జీవితము వీరరసవిశ్రాంతము.

"ధర్మార్థ కామ మోక్షాఖ్యం య ఇచ్ఛే చ్ఛ్రేయ ఆత్మనః
ఏకం హ్యేవ హరే స్తత్ర కారణం పాదసేవనమ్."

అను నారదోక్తి ప్రహ్లాదుని జీవితాదర్శము. అతనిగాథఁ జదివిన పఠితలును దదాదర్శమునే అనుసరింతురు.

పరమభక్తాగ్రగణ్యుఁడు ప్రహ్లాదుఁడు. ఇతఁడు సహజ సంవర్ధమాన నిరంతర విష్ణుధ్యాన నిరతుఁడు. తనయందును సర్వభూతములందును సమ హితత్వము నెఱపువాఁడు; గురుజనసేవా పరతంత్రుఁడు; కామరోషవ్యసన గర్వాదులకును లోనుగాని మహితమూర్తి; పగవారిచేతను, తనవారిచేతను, సురేంద్రాదులచేతను కీర్తినందిన యశఃకాయుఁడు; ఆతఁడు మూర్తి కట్టిన ధ్యానము; పండిన విజ్ఞానము.

"పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారి సుతుఁ డేతద్విశ్వమున్...." —సప్త. 123.

ప్రహ్లాదుని భక్తి పరీక్షాయత్నములు—ఒక దృష్టితో — హిరణ్యకశిపునిచేఁ జేయఁబడినవి. నయమును, భయమును, హింసను ప్రయోగించి తండ్రి బాలుని హృదయము నన్యథా మరలింప యత్నించినాఁడు. ప్రతి ప్రయత్నము ప్రహ్లాదుని భక్తిని పటిష్ఠ మొనర్చినది. కాని దాని నావంత కదలింపలేక పోయినది. "ఈ దానవశ్రేణికిన్ వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్" అని కొమరుని గుండెలో విషభావములు నింప యత్నించినాఁడు కాని అతనియం దవి విపరీత ఫలమునిచ్చినవి.

"మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు బోవునే మదనములకు"
అని నిదర్శనములఁ జూపించుచు—ప్రహ్లాదుఁడు :

"అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు వినుతగుణశీల! మాటలు వేయునేల?"
—సప్త. 150.

అని యసమ్మోహాధ్యవసాయములతో స్థైర్యమును వెలార్చినాఁడు. తండ్రి తన విద్యాభ్యాసముఁ గూర్చి ప్రశ్నింపగా.

"చదివించిరి నను గురువులు చదివితి ధర్మార్థ ముఖ్యశాస్త్రంబులు; నే
జదివినవి గలవు పెక్కులు చదువులలో మర్మమెల్ల జదివితి తండ్రీ!"
—సప్త. 166.

అని కుమారుని సమాధానము. ఇందు విద్యావీరము ప్రస్ఫుటముగా గోచరించు చున్నది. ధర్మార్థ ప్రధానములగు శాస్త్రములను మాత్రమేగాక నసంఖ్యాకములగు చదువు లాతఁడు చదివి, వాని విమర్శనముల నన్నింటిని తెలిసికొంటి నని చెప్పుటలో తత్త్వరహస్య ప్రతిపాదమునందు వినయాతిశాయికాని యహంకారము గోచరించుచున్నది. వైశారద్యాది అనుభావములు, హర్షౌత్సుక్యాదులు సంచారి భావములు-వీనిచేఁ బుష్టమైన యుత్సాహ మిందు విద్యావీరముగా స్ఫురించుచున్నది.

ప్రహ్లాదుఁడు పగవానిని పొగడుట తండ్రికి నిప్పులు చెరిగినట్లైనది. ఉగ్రుఁడై యాతఁడు హింసాకాండకు దిగినాఁడు. పుత్త్రుని శూలములఁ బొడిపించినాఁడు, ఏనుఁగులచేఁ ద్రొక్కించినాఁడు; ఇట్లే పాముల గఱపించియు, మంటల వేఁయించియు, జలధిలోఁ ద్రోయించియు, విషముఁ బెట్టించియు, కొండలపైనుండి దొర్లించియు నిర్దయుఁడై శిక్షించినాఁడు. కాని అన్నిటి కా బాలుఁడు ధీరుఁడై నిలిచి—"మాటి మాటి"కి—

"పన్నగశాయి! యో దనుజ భంజన! యో జగదీశ! యో మహా
పన్న శరణ్య! యో నిఖిల పావన! యంచు నుతించుఁగాని, తాఁ
గన్నులనీరు దేఁడు; భయకంప సమేతుఁడుగాఁడు." —సప్త. 194.

దుస్సహమైన బాధలను ప్రహ్లాదుఁ డురుభక్తియుక్తుఁడై దేవుని నంతః ప్రసన్ను నొనర్చుకొని తన్మయత్వమున సహించెను. ఇచ్చట భక్తి కంగమైన సహన వీరము గోచరించుచున్నది, అది దుర్నిరీక్ష్యమై శత్రువులకు దుఃఖభాజనమైనది. హిరణ్యకశిపుఁడు-ప్రహ్లాదుఁడు మహా ప్రభావసంపన్నుఁడనియు, వాని కెందును భయములేదనియు, వానితోడి విరోధంబునఁ దనకు మృత్యువు సిద్ధించుననియు నిర్ణయించి, చిన్నవోయి ఖిన్నుఁడై విషణ్ణుడైనాఁడు (సప్త. 205). ఇట్టి విషాదము ప్రహ్లాదుని సహన వీరమును బోషించుచు తన్మాహాత్మ్యముఁ బ్రకటించుచున్నది.

గురువులు చెప్పు లౌకిక విద్యలయందు ప్రహ్లాదునికి మిథ్యాభావము కలదు కావున వానిని సరకుఁసేయఁడు. పైపెచ్చు తోడి విద్యార్థులఁ బిలిచి—

"గురువులు దమకును లోఁబడు తెరువులు సెప్పెదరు; విష్ణు దివ్యపదవికిం
దెరువులు సెప్పరు; చీకటిఁ బరువులు పెట్టంగనేల? బాలకులారా!"—సప్త. 246.

అని 'తమసో మా జ్యోతిర్గమయ' అను పాఠమును బోధించి,

"ఆడుదము మనము హరి రతిఁ బాడుద మేప్రొద్దు విష్ణు భద్రయశంబుల్
వీడుదము దనుజ సంగతిఁ గూడుదము ముకుంద భక్తకోటిన్ సూటిన్"
—సప్త. 248

అని భక్త్యుత్సాహ ముత్కటముగాఁ బ్రదర్శించియున్నాఁడు. ఇందు భక్తివీర స్ఫూర్తి సుస్పష్టము.

హిరణ్యకశిపుఁడు ప్రత్యర్థియై విష్ణువుకన్న తనకాధిక్యము గలదని ప్రహ్లాదుని ముందు వీరోక్తులు పల్కినాఁడు. దానికి తనయుఁడు వినయము వీడని యుత్సాహముతో సమాధానము నిచ్చి విష్ణుతత్త్వమును ప్రవచించినాఁడు. ఇం దాతని భక్తిజ్ఞానవీరము లనన్యసామాన్యములు. వారిరువురి సంభాషణ వైఖరిని గమనించినచో నిది తేటతెల్లమగును.

హిరణ్య :

"బలవంతుఁడ నే జగముల బలములతోఁ జనక, వీరభావమున మహా
బలుల జయించితి నెవ్వని బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడవై"

ప్రహ్లా :

"బలయుతులకు దుర్బలులకు బలమెవ్వఁడు? నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వడు? ప్రాణులకును బలమెవ్వం డట్టివిభుఁడు బల మసురేంద్రా!"
—సప్త. 262, 264.

హిరణ్యకశిపునియం దహంకార గర్వామర్షాదులు గూడుకట్టుకొని యుద్ధతిఁ బ్రదర్శించుచున్నవి. ప్రహ్లాదునియందు వినయ ప్రధానమగు భక్తిభావము, విష్ణు ప్రాశస్త్య ప్రతిపాదనోత్సాహము వ్యక్తములగుచున్నవి. హిరణ్యకశిపుని శక్తిప్రతాపాదులు విభావములు; అతని పల్కు లుద్దీపనములు; స్థైర్యధైర్యోత్సాహప్రభావాధిక్షేపాదు లనుభావములు; ధృత్యావేగౌత్సుక్యప్రబోధాదులు సంచారిభావములు—వీనిచేఁ బుష్టమయిన యుత్సాహము ప్రహ్లాదాశ్రితమై భక్తివీరముగాఁ బఠితకు స్ఫురించుచున్నది.

హిర :

"ఎక్కడఁగలఁ డే క్రియ నే చక్కటి వర్తించు నెట్టిజాడను వచ్చుం
జక్కడతు నిన్ను విష్ణునిఁ జెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని పగిదిన్."

ప్రహ్లా :

"ఇందుఁగలఁ డందులేడని సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన నందందే కలఁడు దానవాగ్రణి వింటే"
—సప్త. 272, 275.

హిర :

"డింభక ! సర్వస్థలముల నంభోరుహ నేత్రుఁ డుండుననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ స్తంభంబునఁ జూపఁగలవె చక్రిన్ గిక్రిన్"

ప్రహ్లా :

"అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణ పర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబుననుండు ప్రోడ విపుల స్తంభంబునం దుండడే
స్తంభాంతర్గతుఁడయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు; ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడు బ్రత్యక్ష స్వరూపంబునన్"

—సప్త. 279, 282.

పద్యములన్నియు వీరరసోచిత ప్రసాదగుణ సమన్వితములు. ఇందుఁ బ్రాసఁ గూర్చుటయందు చమత్కారము కలదు. మొదటి పద్యమున ద్విత్వమగు పరుషాక్షరము ప్రాసగానుండి హిరణ్యకశిపునిలోని కర్కశత్వము, క్రోధము, రోషము బయలువెట్టుచున్నది. రెండవ పద్యమునందలి బిందుపూర్వక సరళాక్షరప్రాసము ప్రహ్లాదునందలి వినయభక్తిభావములను ధ్వనించుచున్నది. చివటి రెండు పద్యములందును బిందుపూర్వక స్థిరాక్షర ప్రాసము వీరులయం దేర్పడిన సమానోత్సాహము వ్యక్తముచేయుచున్నది. 'చక్రి గిక్రి' యనుటలోఁ బ్రతినాయకుని అనాదరణము, ఆపై ప్రహ్లాదునియందు విష్ణుతత్త్వ ప్రతిపాదనోత్సాహము నుత్కటముగా గోచరించుచున్నది. ఇట్లు ప్రహ్లాదుని చరిత్రమునందు భక్తి హిరణ్యకశిపుని ప్రతీకారముచే ధ్రువపడి జ్ఞానవంతమై సువ్యాప్తమై రసస్థాయి నంది శోభిల్లు చున్నది.

ధ్రువ ప్రహ్లాదులవంటి భక్తుల జీవితములందేగాక వీరము భాగవతగత రాజచరిత్రము లందును వివిధ రూపములతో నాస్వాదిత మగుచున్నది.

అర్జునుఁడు పుత్రఘాతియైన అశ్వత్థామ నవమాన మొనరించి ద్రౌపదీ దుఃఖమును కొంత యుపశమింపఁజేసెను. ఆ ఘట్టమున నాతని నాశ్రయించిన యుద్ధోత్సాహము ప్రశంసావహము. పుత్రుల మరణవార్త విని, ద్రౌపది కంటికి కడవఁ గట్టినది. అర్జునుఁడామెను బుజ్జగించుచు తద్దుఃఖకారకుఁడైన యశ్వత్థామను గూర్చి పరుషోక్తులతో ప్రతిజ్ఞ నిట్లు పల్కెను.

"ధరణీశాత్మజ వీవు; నీవు వగవన్ ధర్మంబె ? యా ద్రోణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల; మద్గాండీవ నిర్ముక్త భీ
కర బాణంబుల నేఁడు వాని శిరమున్ ఖండించి నేఁ దెత్తుఁ; ద
చ్ఛిరముం ద్రొక్కి చలంబులాడు మిచటన్ శీతాంశు బింబాననా !"

—ప్రథ. 110.

పుత్త్రహంతకుని చావు చూచినచో భార్యకుఁగొంత దుఃఖభారము తీరునని యాతని యూహ. ఉద్రేకముతో నట్టిప్రతినఁ జేసినాఁడు గాని ధర్మాధర్మ విచక్షణ యచ్చట లేదు. ఆ క్షణమున నామెకుఁ గొంత మనశ్శాంతి ఏర్పడినది. కృతప్రతిజ్ఞా నిర్వహణోత్సుకుఁడై హరి సారథిగా ద్రౌణిపై రథము నడిపించెను. ఇందలి యర్జునుని రణవీరము సువ్యక్తము. దీని కంగముగా ద్రౌణిగతమగు భయపలాయనాదులు వర్ణితములు.

"తన్నుం జంపెదనంచు వచ్చు విజయున్ దర్శించి, తద్ద్రౌణి యా
పన్నుండై శిశుహంతగావున నిజప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్
మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింపనా
సన్నుండౌ హరుఁ జూచి పాఱు పగిదిన్ సర్వేంద్రియ భ్రాంతితో."
—ప్రథ. 112.

ఇందలి యుపమానము నాయకుని వీరమున కత్యంత శోభావహ మగుచున్నది. "హరి" శబ్దము నాయకవిజయ సూచకము. 'సర్వేంద్రియ భ్రాంతితోఁ'- ననుటలోఁ బ్రతినాయక భయాతిరేక ద్యోతకము. ఆపన్నుఁడు, శిశుహంతకుఁడు అయిన ద్రౌణి "విజయు" దర్శించెననుటలో నాయకుఁడు విజయార్థియై తత్సాధనోత్సాహము వ్యక్తపఱచుచున్నాఁడని స్పష్టపడుచున్నది. ఆ పైన నిరువురును దివ్యాస్త్రప్రయోగముతో నాశ్చర్యావహమగు యుద్ధమొనర్చిరి. అదియు నాయక రణవీరమున కంగమే.

అశ్వత్థామ విజయుని చేఁజిక్కెను. కృష్ణుఁడాతఁడు వధ్యుఁడని అర్జుననిఁ బురికొల్పెను. కాని యాతఁడు రెండుధర్మములమధ్య చిక్కుకొనినాఁడు. "బ్రాహ్మణో నహంతవ్యః" అనునదియొకటి, కృతప్రతిజ్ఞ నుల్లంఘింపఁగూడదని మఱియొకటి. ఇందు మొదటిదే బలీయమైనదని ఆతనికి స్ఫురించినది. వెంటనే పరుషమహాపాశ బద్ధపాణియగు ద్రౌణిని ద్రౌపది కట్టెదుట నుంచెను. అశ్వత్థామ బాలవధాపరాధజనితలజ్జాతిశయముచే గ్రుంగిపోయినాఁడు. దయామతియైన ద్రౌపది యాతనిని మెల్లనిమాటల మందలించి, ద్రోణుభార్య పుత్త్రశోకముచే గతించునేమోయని జాలిపడి కృష్ణార్జునులఁ గాంచి యిట్లనినది.

"ద్రోణునితో శిఖిం బడక ద్రోణకుటుంబిని యున్నదింట; న
క్షీణ తనూజ శోక వివశీకృతయై విలపించు భంగి నీ
ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంత పొక్కునో;
ప్రాణవిముక్తుఁడైన నతిపాపము; బ్రాహ్మణ హింస మానరే." —ప్రథ. 132.

పుత్త్రశోక మనుభవించిన మాతృమూర్తి ద్రౌపది. కావుననే ద్రౌణిమాత యనుభవించు దారుణ దుఃఖము నూహించి కరఁగిపోయినది. తనంత తానై అర్జునుని కాళ్ళవ్రేళ్ళ పడి బాపని చంపవలదని బ్రతిమిలాడినది. దానికి ధర్మ దృష్టిని జోడించి తన దయను పోషించుకొనినది. శత్త్రువీరుని దుష్కృత్యమును సహించి యున్న తౌదార్యమును, క్షమను ప్రదర్శించినది. ఆమెయం దప్పుడు దయావీరము తురంగలించినది.

ఇచ్చట అర్జునుని ప్రతిజ్ఞ పూర్తి కాలేదు. అది వీరునిపట్ల యధర్మమే యగును. అందువలన ధర్మస్వరూపుఁ డగు నారాయణుఁడు ధర్మసూక్ష్మమును ప్రతిపాదించెను. దాని ననుసరించి—

"విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు ఘోరాసిచే
నశ్వత్థామ శిరోజముల్ దఱిఁగి చూడాంతర్మహారత్నమున్
శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాత బంధంబులన్
విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసిపోన్" —పూర్వ. 139.

ప్రతినాయకున కీ యవమానము మరణమునకన్న హీనము. దానివలన నర్జునుని ప్రతిన తీరినట్లయినది. బ్రహ్మహత్యాపాపము కలుగలేదు. నాయకునియందు ధర్మ, యుద్ధ వీరములు పరిశుద్ధముగా స్ఫురించుటకు వీలు కల్గినది. ద్రౌపదీ దయావీరము దీనికంతటికి జీవతుల్యమై శోభించుచున్నది.

భాగవతోత్తముఁ డగు అంబరీషు నందు ధర్మవీరము ద్వాదశీవ్రత నిర్వహణమునందు గోచరించును. విష్ణువుఁ గూర్చి తప మొనర్చి చక్రము వడసి పరమభక్తుఁడై వ్రత మొనర్చుచున్న సమయమున దుర్వాసుఁ డతిథియైవచ్చెను. రా జాతనిని ద్వాదశిపారణ కాహ్వానించెను. దుర్వాసుఁ డంగీకరించి స్నానము సేయుట కరిగి కాళిందీ నదియందు ధ్యానమగ్నుఁడయ్యెను. ద్వాదశీతిథి పూర్తి కావచ్చినది. రాజునకుఁ బారణసేయని దోష మేర్పడునని యొక వైపునను, బ్రాహ్మణాతిక్రమ దోషము కల్గునని మఱియొక వైపునను హృదయమున ధర్మ సంఘర్షణ మేర్పడినది.

"ముని నీరుసొచ్చి వెడలఁడు చనియెడు ద్వాదశియు; నింత చనియె న్నీలో
నన పారణయున్ వలయును వినిపింపుం డర్హ ధర్మవిధ మెట్టిదియో"

—నవ. 97.

అని ధర్మైకాయత్తవృత్తితో ధర్మజ్ఞుల నడిగినాఁడు; వారి యాదేశముపైననే హరిస్మరణపూర్వకముగ జలపారణ మొనర్చినాఁడు. దానిని దుర్వాసుఁడు జ్ఞాన

దృష్టితో నెఱిఁగి కుపితుఁడై కృత్య నాతనిపైఁ బ్రయోగించినాఁడు. భక్తుని కేర్పడిన యాపద నెఱిఁగి హరి తన చక్రము నాఋషిపై ప్రయోగించినాఁడు. అది కృత్యను సంహరించి దుర్వాసుని తరుమ మొదలిడినది. అతఁడు భయవిహ్వలుఁడయి బ్రహ్మ శంకరాదులను శరణువేడి వారిచే విష్ణుపదముఁ బట్టునట్లు ప్రబోధితుఁడై హరిపదములంటినాఁడు. విష్ణు వంబరీషుఁడే రక్షణ సమర్థుఁడని తిరుగగొట్టెను. గతిలేక దుర్వాసుఁ డా రాజుకే తలవంచి నమస్కరించి ప్రార్థించెను. దయాధర్మోత్సాహ ప్రవృత్తిగల యా నృపశేఖరుఁడు చక్రముఁ బ్రార్థించి శాంతిపఁజేసెను. అప్పుఁ డాతఁడు పల్కిన మాటలివి :

"విహిత ధర్మమందు విహరింతు నేనియు నిష్టమైనద్రవ్య మిత్తునేని;
ధరణిసురుఁడు మాకు దైవతంబగునేని విప్రునకు శుభంబు వెలయుఁగాత!"
—నవ. 138.

ఇందు రాజు తన ధర్మప్రవర్తనమును, దానవ్రతమును, బ్రాహ్మణ భక్తిని ప్రస్తావించుకొనుచున్నాఁడు. తానీ మూఁడింటిని సక్రమముగా నిర్వహించుచున్నచోఁ జక్ర మా బాపని నేమి సేయకుండుఁగాక యని ప్రతిన. చక్రమును సూటిగాఁ బ్రార్థించి వినయమును ప్రకటించియు క్షత్రియోచితమైన కించి దహంకార పూరితోత్సాహమును, స్వీయ ధర్మ ప్రవణత్వ నిరూపణమునందు ప్రదర్శించి వీరము వ్యంగ్యముగా స్ఫురించు నట్లెంతయో యౌచిత్యము వెలార్చినాఁడు.

రంతిదేవుని దానోత్సాహము రవిచంద్రు లున్నంతవఱకు మాసిపోనిది. సర్వసంపదలు దీనులకై వెచ్చించి సకుటుంబముగా ధర్మముకొఱకై దైన్యముఁ బొంది త్యాగశీలుఁడైనాఁడు. పేదయైనను, దైన్యమొందినను ధైర్యము వీడక జన్మవ్రతము నెట్టిసమయమునందును వీడక వీరమును ప్రదర్శించి యశఃకాయుఁడయినాఁడు.

నలుబదియెనిమిది దినములు కూడునీరులేక సకుటుంబముగా బాధపడుచు నొకరోజున నెయ్యి, పాయసము, నీరు నెట్లోపొంది క్షుద్బాధచే రంతిదేవుఁడు దానిఁగుడువ నుత్సహించెను. భూసురుఁ డొక్కఁ డాకలిగొని యాతని నాహారము కోఱెను. "హరి సమర్పణమని"నోటికుందరి యన్నములో సగభాగము నాతఁడు సంతోషముతో నిచ్చెను. శూద్రుఁడొకఁ డాపై నశనార్థియై వచ్చి యాతని నాశ్రయింప నాతనికిని కొంతభాగము వెనుకాడక దానము చేసెను. మిగిలిన కబళముల నాస్వాదింపఁ జూచుచుండ కుక్కల గుంపొకటి యాకలితో నాక్రోశించుచు ముందు నిలిచినది. దానినిఁ జూచి రంతిదేవుని హృదయము

ద్రవించినది. ఆ యన్న శేషమా జంతువులకిచ్చి సంతుష్టి పరిచినాఁడు. ఇఁక మిగిలి నది జలమొక్కటియే. దానిఁ ద్రాగి కడుపు నింపుకొనఁబోవుచుండ చండాలుఁ డొక్కఁ డరుదెంచి దప్పిఁదీర్ప నర్థించెను. అతని దీనాలాపములకు గరుణించి రంతిదేవుఁడు—

"అన్నములేదు; కొన్ని మధురాంబువు లున్నవి; ద్రావుమన్న ! రా
వన్న ! శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె ? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడసుమ్ము పుల్కసా !"

అని పలికి,

"బలవంతంబగు నీరువట్టున నిజ ప్రాణాంతమై యున్నచో
నలయం డేమియు; వీని హృజ్జ్వరము, నాయాసంబు, ఖేదంబు నా
జలదానంబున నేఁడు మాను ననుచున్ సర్వేశ్వరాధీనుఁడై
జలముం బోసెను రంతిదేవుఁడు దయం జండాల పాత్రంబునన్"

—నవ. 647, 649.

ఇందలి రంతిదేవుని దయాదానగుణములు ప్రశస్తములు, 'అన్నములే'దనుటలో నెదుటివానికి సంతృప్తిఁ జేయఁజాలక పోయితినేయను విషాదము స్ఫురించు చున్నది. "మధురాంబువులున్నవి" యనుటలో నెదుటివానికిఁ దానిచ్చు వస్తువు నందుఁ బ్రీతిఁగల్పించు యత్నము గోచరించుచున్నది. "ద్రావుమన్న! రావన్న!" యనుటలో నాదరము, ప్రేమ, వాత్సల్యము ఉట్టిపడుచున్నవి. "శరీర ధారు లకు...మేలున్నదే" యనుటలో విషణ్ణుఁడగు చండాలుని హృదయమునకు హితవాక్యములతో నేదఁదేర్చు భావము, స్వీయధర్మమార్గానుసక్తిని ప్రదర్శించు భావము వ్యక్తములగుచున్నవి. 'నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడే' యనుటలో నతని కేర్పడిన నిస్సహాయతయు, నిరాహారతయు, దైవభక్తియు ధ్వనితములు. దప్పికచే ప్రాణము పోవుచున్నను అలయకుండుట అతని ధృతికి చిహ్నము. "వీని...మాను" మనుటలో రంతిదేవుని దయాభావము, త్యాగ భావము, దానోత్సాహము వ్యక్తమగుచున్నవి. ఇట్టి భావములచేఁ బరిపుష్ట ములై ఆతనియం దుత్సాహ మపూర్వదానవీరముగా రూపొందినవి.

వీరరసము రాజచరిత్రములందుకన్న అవతారకథలందు మనకు విపుల ముగా దొరుకును. భూభారకారకులగు దుష్టులను శిక్షించుటకై లీలామానుష విగ్రహుఁడై భూలోకమున నవతరించి, శిష్టుల రక్షించి తన జన్మను సార్థక

మొనర్చుకొను వెన్నునిలీలలు వర్ణించుగాథ లవతారగాథ లనఁబడును. భాగవతమునం దిరువదియొక్క యవతారములు పేర్కొనఁబడినవి. అందు విపులముగా వర్ణితమైననది కృష్ణావతారగాథ. ఇతరావతారములం దెందును సంహారింపని యధికసంఖ్యాకులగు వీరుల నీ యవతారమున సంహారించి విపుల లీలా మాహాత్మ్యమును విష్ణువు ప్రకటించినాఁడు అట్టివానిలో వీరప్రసక్తి యున్న వానినిఁ గొన్నింటిని మాత్రమిందు నాతి విపులముగా సూచింతును.

యశోదానందుల ముద్దుబిడ్డగా శ్రీకృష్ణుఁడు ప్రాచుర్యమొంది వ్రేపల్లెలో గోపబాలురతోఁగూడి క్రీడలాడుచు పెక్కద్భుతావహావములగు వీరకృత్యము లొనర్చినాఁడు. పూతన సంహారము, శకటాసుర నిరసనము, తృణావర్త వత్సాసుర బకాసుర ధేనుకాసుర భంజనము, గోవర్ధనోద్ధరణము, కాళిందీ మర్దనము, దావాగ్నిభక్షణము, విశ్వరూప ప్రదర్శనము మొ. కృత్యము లన్నియుఁ బఠితలకు ప్రధానముగా నాశ్చర్యమునే కల్గించును. బాలుఁడైన కృష్ణునియందు మానవాతీత శక్తిఁగాంచుటయే దీనికి కారణము. దుష్కర కార్యసాధనయందు నాయకుని ప్రయత్నవిశేషాదులు, తత్తత్సమయములం దాతని చిత్తవృత్తులు విపులముగా గ్రమపరిణామముగా వర్ణితమైనఁగాని పఠిత హృదయము వానియందు తాదాత్మ్యము జెందదు. కాని ఇచ్చట మానవాతీతునిగా, సర్వశక్తి సమన్వితునిగా బాలకృష్ణునిఁ జిత్రించుటచే నొక క్రమ వికాసము హృదయమునకు లేక స్థూలముగా నొక్క యాశ్చర్యముమాత్రమే స్ఫురించుట యగుచున్నది. తచ్చర్వణముచే భక్తునిలో భక్తి పటిష్ఠ మగును.

దివ్యాదివ్యులైన శ్రీకృష్ణాద్యవతారమూర్తు లొనర్చు క్రియలన్నియు సంపూర్ణముగా మానవసహజములుగా నుండుటయు జరుగదు. అయినను మానుషీవృత్తి అధికముగా గోచరించు ఘట్టములలో వీరస్ఫూర్తి కలుగునను టలో విప్రతిపత్తిలేదు. యుక్తవయస్కుఁడై వీరుఁడై గోపికాలోలుఁడై చరించు శ్రీకృష్ణుఁడు శంఖచూడుని, వృషభాసురుని సంహారించు ఘట్టము లందు బలవీరము స్ఫురించుచున్నది. కంససభయందు చాణూరునితో ముష్టి యుద్ధ మొనర్చునప్పుడు కృష్ణునియం దీవీరము చక్కగాఁ బోషింపఁబడినది.

కంసునకు కుడిభుజమైన చాణూరుఁడు కృష్ణునిఁగాంచి బలగర్వ ముట్టిపడ నిట్లనెను:

"స్థాణున్ మెచ్చఁడు; బ్రహ్మఁ గైకొనఁడు; విష్వక్సేను నవ్వున్; జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడుగాఁడని; మహాబాహాబల ప్రౌఢి న

క్షీణుం; డాజికి నెల్లి నేఁడనఁడు; వైచిత్రిన్ వినోదించు న
చ్చాణూరుం డొక గోపబాలు పనికిన్ శక్తుండు గాకుండునే."

—దశ. పూ. 1338.

చాణూరుఁడు 'పౌరలోక హృదయభల్లుఁడు', 'రోషాగ్ని ధూమప్రరోహంబు
కైవడి శిరమున సన్నపుశిఖ వెలుంగు'వాఁడు అట్టి భీకరమూర్తి ప్రగల్భోక్తులఁ
బల్కుచు కృష్ణునిపై నురికి మల్లయుద్ధమునకు గడఁగెను. కృష్ణుఁడు క్రియా
ప్రధానుఁడై తదుచిత మల్లవిద్యానైపుణ్యముఁ బ్రదర్శించి గెలుపు సాధించెను.
వీరి యుద్ధమును విపులముగా వర్ణించి బలవీరమును బోషించినాఁడు కావ్యఁ
కర్త (దశ. పూ. 1347-1348). చాణూరుఁడు పొడువ కృష్ణుఁడు 'సుమ
మాలాహత కరిభంగి' పరాక్రమించెనట! ఏనుఁగునకు పూదండ దెబ్బ ఈగ
వ్రాలినట్లుండును గాని బాధావహము కాఁజాలదు. వర్ణదార్ఢ్యములందు ఆ
గజోపమానము సమాన గుణములు కల్గి యుపమేయమునకు గౌరవము
నాపాదించుచున్నది.

చాణూర సంహారమునఁ బ్రతినాయ కౌద్ధత్యమును విపులముగా వర్ణించి
దానికి నాయకుఁ డపనయించినట్లు రచించి, కంససంహార ఘట్టమున నాయకుని
రణోత్సాహ ముత్కటముగా స్ఫురించి ప్రతినాయక బలహీనతను వ్యంగ్య
ముగా గోచరించునట్లు పోతన వర్ణించెను.

భుజద్వయమువంటి మల్లురు కూలిపోగా కంసుఁడు నిస్సారుఁడైనాఁడు.
ముసలియెద్దు అంకెలు వేసినట్లు కాఁకులఁటిచినాఁడు గాని విక్రమముఁ బ్రదర్శింప
లేకపోయినాఁడు (ప. 1370). ఆ సమయమున శ్రీకృష్ణుని పరాక్రమ వర్ణ
నము రసవత్తరముగా సాగినది. ఇట్లు :

"జంఘాలత్వముతో నగోపరిచరత్సారంగ హింసేచ్ఛ ను
ల్లంఘింపన్ గమకించు సింహము క్రియన్ లక్షించి, పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల, హరి కంస ప్రాణ హింసార్థియై
లంఘించెం దమగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లగన్."

"తమగమున కెగురు యదుసత్తమ గణ్యునిఁజూచి, ఖడ్గధరుఁడై యెదిరెం
దమగమి వారలు వీరోత్తమ గణవిభుఁడనఁగఁ గంస ధరణీపతియున్."

"పక్షీంద్రుండురగంబు బట్టు విధమొప్పం గేశబంధంబు లో
కక్షోభంబుగఁ బట్టి, మౌళి మణులాకల్పాంతవేళాపత

న్నతుత్రంబుల భంగిరాల, రణసంరంభంబు డిందించి, రం
గక్షోణిం బడద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసున్ నృపోత్తంసునిన్''
—దశ. పూర్వ. 1372 - 1374

ఇందు మూఁడవ పద్యము మకుటాయమానము. వెనుకఁ జాణూరునితోడి కృష్ణుని ముష్టియుద్ధమును అంతగ వర్ణించిన కవి కంసవధ ఘట్టమునఁ గృష్ణుని వీరచర్య నింతధ్వని ప్రధానముగ రెండు మూఁడు పద్యములలో రచించి, తత్సంహారమున కెట్లొక లీలాలక్షణము సమకూర్చెనో భావుకులు గుర్తింపఁ దగిన విషయము.

కంసుని 'కేశబంధము' 'ఉరగము'వలె నుండఁగా, దానిని బక్షీంద్రుఁడు పట్టినట్లు పట్టుకొన్నాఁడట! అనఁగా గంసుఁడు యుద్ధోద్యతుఁడై నిల్చిన వేళకు కేశబంధము ముడివీడి వ్రేలాడి యురగముఁ దలఁపించెననియు, నట్లది యూడి పోవుట చాణూరుని వధచే కృష్ణుని యతిమానుషత్వము గుర్తించి తజ్జన్యభయ కంపాదుల కనుభావరూపమై-ట్టి దనియుఁ జెప్పవచ్చును. శ్రీకృష్ణుఁడు 'పక్షీంద్రుఁ'డనుటచే నతఁడు తన రెండు బాహువులను రెక్కలవలె సాఁచి యతనిపై లంఘనలాఘవము నెఱపెననియు, దదుపమాన స్వారస్యముచే వ్యంగ్యమగుచున్నది. అప్పుడు శిరోధార్యములగు 'మౌళిమణులు' 'ఆకల్పాంత వేళాపతన్నక్షత్రంబుల'వలె జారిపడెననుటచే మౌళిమణులు కాంతిమంతములైన వనియు, నక్షత్రశబ్ద సారస్యముచే నతని కేశబంధము వ్యంగ్యోపమానమగు చీఁకటితోనుపమితమై తన్నైల్యమును తద్ద్వారమున కంసుని పూర్వవయస్క తయును ద్యోతకములగుచున్నవి. పైఁగా 'ఆకల్పాంతవేళా' యనుటచే నాతని కత్యాసన్న మృత్యువేళ సూచితమైనది! కృష్ణుఁడు 'వెసం గంసు న్నృపోత్తంసునిన్' బడ ద్రొబ్బెనఁట! "వెసన్...నృపోత్తంసునిన్" అను పదజాలములో నతని పతనక్రమము వ్యంగ్యముగాఁ బ్రదర్శింపఁబడినది. అది పద్యాంతమున విని వేశింపఁబడుటచే శ్రీకృష్ణుని వీరవిహారము తత్పతనాంతముగా ధ్వనిగంభీర ముగాఁ దెల్పఁబడినది. చాణూరుని విషయమున వాచ్యప్రక్రియను, కంసుని సందర్భమున వ్యంగ్య ప్రక్రియను వాడుకచేసి వర్ణనకొక వైవిధ్యము సంత రించి యున్నాఁడు కవి. ఇట్లే మొదటి పద్యమునందలి యుపమానాలంకార స్వారస్యమును సహృదయహృదయైక వేద్యమగుచున్నది.

రుక్మిణి భక్తిభావముతో తన హృదయమును కృష్ణార్పిత మొనర్చి తత్సన్నిధానమునకై వేయికన్నుల వేచియున్న భక్తివీర నిష్ఠురాలు. ఆమె

బ్రాహ్మణు రాయబారము కృష్ణున కంపినది. బావఁడు ఆ సందేశమును గోవిందున కౌచిత్యమెఱిఁగి విన్నవించి, యామెను రక్షింపవేడెను. దానికి భక్త వత్సలుఁ డుత్సహించి యిట్లనెను :

"కన్నియ మీఁద నాతలఁపు గాఢము; కూరుకు రాదు రేయి నా
కెన్నఁడు; నావివాహము సహింపక రుక్మిదలంచు కీడు; నే
మున్నె యెఱుంగుదుం; బరుల మూఁక వధించి. కుమారిఁ దెత్తు; వి
ద్వన్నుత! మ్రానుద్రచ్చి నవ వహ్నిశిఖన్ వడిఁదెచ్చు కైవడిన్"

"వచ్చెద విదర్భభూమికిఁ జొచ్చెద భీష్మకుని పురము; సురుచిర లీలం
దెచ్చెద బాలన్; ద్రేల్మిడి బ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చినఁబోరన్"

—దశ. పూ. 1714, 1715.

నాయకునియందు-నాయికాగతమగు గాఢానురాగము, అయోగవిప్రలంభము, ప్రతినాయకగత వైషమ్యము, నాయికను దెచ్చుటయందలి దృఢనిశ్చయము, శత్రుభంజనోత్సాహము వ్యక్తమయి శృంగారమంగముగాగల రణవీరస్ఫూర్తిని గల్గించుచున్నవి. రుక్మిణి వహ్నితో, బోల్పఁబడుటచే నామెయందు శుచిత్వము, ప్రభావము, ఔజ్జ్వల్యము వ్యంగ్యముగాఁ దెల్పఁబడినవి. రాక్షసవివాహధర్మము ననుసరించి కృష్ణుఁడు రుక్మిణిని గ్రహించి రథారూఢుఁడై ద్వారకకు వచ్చుచుండ రుక్మి వెనుఁదగిలి రోషమయ వాక్కులతో గోవిందుని ఢీకొన నాతని రథాద్యంగములన్నింటిని వికలమొనర్చి, రుక్మిణీప్రార్థనమున నాతని హింసింపక 'బావా' రమ్మని చిఱునగవుతో హేళనముచేయుచు 'గడ్డంబును, మీసంబును, దలయును రేవులు వాఱఁగొఱిగి' యవమానించెను. నాయికాగతమయిన రతి హేతువుగా నామె ప్రార్థనము నాయకునికి దయగల్గించి రణవీరమునకుఁ బ్రకాశముఁ గల్పించుచున్నది.

నరకాసుర వధాఘట్టమున నాయికాశ్రయమైన యుద్ధవీరము నాయకోత్సాహమునకు వన్నెఁ దెచ్చినది. సహజకోమలియైన సత్యభామ రణోత్సాహముఁ బ్రకటించినను సహజమైన ముగ్ధభావము వదలఁజాలదు. కావుననే

"పరుజూచున్ వరుఁజూచు నొంప నలరింపఁ రోష రాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారముఁ
బరగన్ గన్నులఁ గెంపుసొంపుఁబరగం జండాస్త్రసందోహమున్
జరసాలోక సమూహముఁ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిఁ"

—దశ. ఉ. 178.

ఇందు వీరశృంగారముల సుందర సమీకరణముఁ గాంచనగును. ఇందు వర్ణింపఁ బడిన రోషరాగోదయావిరతభ్రూకుటిమందహాసములు, కన్నుల కెంపు సొంపులు మొ. అనుభావములు వీరశృంగారముల వ్యక్తము చేయుచున్నవి. మఱియు—సత్యభామయందు శృంగార వీరములఁ గ్రమవికాసపద్ధతిలో వర్ణించిన యీ క్రింది పద్యము రసవత్తరము.

"రాకేందు బింబమై, రవి బింబమై యొప్పు నీరజాతేక్షణ నెమ్మొగంబు;
కందర్పకేతువై ఘనధూమకేతువై యలరుఁ బూఁబోఁడి చేలాంచలంబు;
భావజు పరిధియై ప్రళయార్క పరిధియై మెఱయు నాకృష్టమై మెలఁతిచాప
మమృత ప్రవాహమై యనల సందోహమై తనరారు నింతి సందర్శనంబు
హర్ష దాయియై మహారోషదాయియై పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార వీరరసములోలి విస్తరిల్లు."

—దశ. ఉ. 183.

ఈ పద్యమున సత్యభామ హరిని, అరినిజూచిన క్రమమున శృంగారవీరములు వర్ణితములైనవి. వెనుకఁ బేర్కొనిన పద్యము లందలి భావములే యిందుఁ దిరుగఁ ద్రిప్పి చెప్పఁబడినవి. నెమ్మొగము, చేలాంచలము, చాపము, సందర్శనము, బాణవృష్టి ఇవి యన్నియు విభావ పరిపుష్టికిఁ దోడ్పడి తదనుభావముల నవలీలగా స్ఫురింపఁ జేయుచున్నవి. అందు క్రమముగా హరిపై గల రతి, అరిపై గల క్రోధము పరిపుష్టములయి శృంగార వీరరసములయి శ్రీకృష్ణుని యుద్ధవీరమున కంగములై దాని నుత్తేజపరచుచున్నవి.

సత్యభామ శత్రుబలమును వికల మొనర్చెను. దానికి మెచ్చి కృష్ణుఁడామెనుండి చాపము గ్రహించి తాను రణరంగమున నిలచెను. నరకాసురుఁడు రణధర్మబద్ధమైన యుద్ధవీరమును ప్రదర్శించినాఁ డిచ్చట.

"మగువ మగవారి ముందఱ మగతనములు సూప రణము మానుట నీకున్
మగతనము గాదు; దనుజులు మగువలచెనఁ జనరు మగల మగలగుటహరీ !"

—దశ. ఉ. 189.

ప్రతినాయకుని యధిక్షేపవచనములు శ్రీకృష్ణునియందు రణోత్సాహము నినుమడింపఁ జేసినవి:

"నరకా ! ఖండించెద మత్కరకాండాసన విముక్త ఘన శరముల భీ
కరకాయు నిన్ను సురకిన్నరకాంతలు సూచి నేఁడు నందంబందఁగ"

—దశ. ఉ. 191.

అని ప్రతిజ్ఞ చేసి, శతఘ్ని మొదలుగాఁగల మహాస్త్రములచే వానిని బాధించి, చక్రాయుధమున సంహరించెను. నాయకాశ్రితమైన వీరమునకు ప్రతినాయకాశ్రయమైన వీరమిచ్చట అంగము.

శ్రీకృష్ణుఁడు బాణాసురునితోడను, పౌండ్రక వాసుదేవులతోడను, శిశుపాల దంతవక్త్రులతోడను జరిపిన యుద్ధములలో నాతని రణవీరము ప్రకృష్టముగా గోచరించుచున్నది. స్థలాభావమున వానిని విపులముగా చర్చింపక విడుచుచున్నాను.

అవతారగాథ లన్నియు దుష్టశిక్షైకలక్ష్యము లగుటచే నవి యన్నియు వీరగాథలేయగుటలో విప్రతిపత్తిలేదు. భక్తులయందలిదయ, భక్తుల హింసించు వారిపట్ల నిర్దాక్షిణ్యము పై వీరమునకు హేతువులగుచున్నవి.

> "బాంధవముననైన బగనైనఁ వగనైనఁ బ్రీతినైనఁ బ్రాణభీతినయిన
> భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు జనులు మోక్షమునకుఁ జనుదురధిప !"
> —దశ. పూ. 973.

అను ధర్మముచే శాపహతులైన పుణ్యులు తపస్సంపత్తితో వీరులై పుట్టి లోకహంతకులై దుష్కృతులాచరించుచు పురాకృత సుకృత విశేషమున భగవంతుని శత్రువుగనే భావించి నిరంతర స్మరణ ధ్యానాదులను తమకు తెలియకయే తాము చేయుచు హరినెదుర్కొని మరణించి యతనిలో లీనమగుటయు జరుగుచున్నది. ఈ దృష్టితో విచారించినచో ప్రతినాయకాశ్రితమగు వీరము కూడ భక్తి కంగముగా నిలిచి, కావ్యమునందుఁ బ్రతిపాదితమగుచున్నది. విష్ణుమాహాత్మ్యమును జాటుచున్నది.

ప్రతినాయకులలోను ధర్మైకచిత్తులగువారు పెక్కుఱు కలరు. బలిచక్రవర్తి వంటివారు ఇట్టివారు. దానవీరమునకు మూఁడవ అధ్యాయమున బలినాశ్రయించిన వీరము నుదాహరించి యుంటిని.

భాగవతమునఁ బ్రసంగవశముగాఁ జెప్పఁబడిన యుపాఖ్యానములలోను కొన్నింట వీరస్ఫూర్తి కలదు. ఉదా. ద్వాదశస్కంధమునందలి మార్కండేయోపాఖ్యానము. మార్కండేయుఁడు మృత్యువును ధిక్కరించి, పదివేల హాయనములు ఘోరతప మొనర్చుచుండ నింద్రుఁడు విఘ్నాపాదనాభిలాషుఁడయి సుందర దేవాంగనల గొందఱనంపి, తపోభంగ మొనర్పఁ బ్రయత్నించెను. ధృతిమంతుఁడగు నా సంయమి యచంచలుఁడయి అగ్నివలె భాసించుచుండ

దేవాంగనలు భగ్నమనోరథులై తిరిగిపోయిరి. ఈ కథాఘట్టమున నాతనినాశ్ర యించిన తపోవీరము కడుపటిష్ఠమై స్ఫురించి శాంతమునఁ బర్యవసించుచున్నది.

ఇట్లు భాగవతము విష్ణుభక్తిరసాయనమై, విష్ణుమాహాత్మ్య ప్రతిపాద కమై, భక్తికంగమగు వీరరసస్ఫూర్తితో నొప్పారుచున్నది. గోవిందకథాసుధా స్వాదనముచేఁ బతిత పాపనివృత్తినిబొంది ముక్తిఁ బొందునని భాగవత తాత్ప ర్యము. అవ్విధముగా నది మోక్షైకఫలదమగు పుణ్యగ్రంథమగుచున్నది.

"వేద కల్పవృక్ష విగళితమయి శుకముఖ సుధాద్రవమున మొనసియున్న
భాగవత పురాణఫల రసాస్వాదన పదవి గనుఁడు రసిక భావవిదులు"

(భాగవతము)

*

# 6. వస్తు కావ్యములు

కావ్యరచనయందు పాటింపఁబడు ప్రధానాంశములు మూఁడు. అవి: వస్తు నాయక రసములు. నాయకాశ్రయమైనది రసము. నాయకావస్థాదులు వర్ణింపబఁడునది వస్తువు. ఈ మూఁడును ధ్వని ప్రధానములై యున్నచో నా కావ్య ముత్తమమని కీర్తింపబడును. ఆనందవర్ధనుఁడు రసధ్వని, వస్తుధ్వని, అలంకారధ్వని అని మువ్విధములగు ధ్వనులను బేర్కొనగా నభినవగుప్తుఁడు "అలంకారవస్తుధ్వనీతు రసధ్వనిం ప్రతిపర్యవస్యేతే" అని వివరించియున్నాఁడు. దాని తాత్పర్యమిది: "ఉపమాదు(లగు నలంకారము)లు వాచ్యము నలంక రించును. పిమ్మట నా వాచ్యము వ్యంగ్యమును స్ఫురింపఁజేయును. ఇచ్చట నుపమాదులు వాచ్యము నలంకరించుటననేమి? వ్యంగ్య వ్యంజనమునకు గావల సిన సామర్థ్యమును వాచ్యమునం దొదవించుటయే! నిజమున కివియన్నియు నాత్మయగు రసమునే యలంకరించును. అవయవముల నలంకరించు చున్నటు లగుపడినను నిజమునకు గటకకుండలాదులచే నలంకరింపఁబడునది యాత్మయే కదా! శరీర మలంకార్యము కాగూడదా? యని ప్రశ్న. కాగూడదని సమా ధానము. ఏమందురా! నగలు తొడిగినను శవశరీరము బాగుండదు. ఏల? అలంకరణీయమగు నాత్మలేదు కావున. సన్యాసి శరీరమున గటక కుండలాదు లిడినను సొగ సొదవవు. ఏమి? ఆ యాత్మ కవి యనర్హములు కనుక! శరీరమే నగల కలంకరణీయమైనచో బై రెండు శరీరములందును ననౌచిత్యము గాని భేదముకాని యేమున్నది? కావున నౌచిత్యానౌచిత్యాదులన్నియు నాత్మకే! మఱియు నగలు తొడిగికొనిన వానికి 'నేనలంకరించుకొంటి' నను నాత్మ ప్రత్యయ ముత్పన్నమగుచున్నది. కావున నీయనుభవములన్నియు నాత్మయే యలంకరణీయమని తెల్పుచున్నవి. ఇట్లే శబ్దార్థోభయ రూపమగు కావ్య శరీర మున గూడ రసాది రూపమగు నాత్మయే యలంకార్యముకాని యితరము కాబోదు." "...రసవదాద్యలంకారముల నొక్కొక యెడ వస్తువుకూడ నలం కార్యమగును. అయినను నది రససామగ్రియగు విభావానుభావములలో నేదో యొకటిగా బరిణమించి తీరును. దాని చర్వణము చిత్తవృత్త్యాత్మకము కావున నచటఁగూడ బర్యవసానమున రసధ్వనియే కావ్య జీవితమైనది. విభావాను భావరూపమున బర్యవసానము నొందని వస్తు వెచటనైనను స్ఫురించినను నా

ధ్వనినిఁ గావ్యాత్మయనుట యౌచిత్యానుసారియే. అట్టి స్థలములందు రసవదాదుల కలంకారత యుండబోదని గ్రహింపఁదగు విశేషము." "ఇప్పటికి దేలిన సారాంశ మిది : వ్యంగ్యములగు వస్త్వలంకారములు రసభావాది పర్యవసానము నొందునపుడు సర్వత్ర రసభావాదులే కావ్యమున కాత్మలు. అట్లు పర్యవసించనపుడు వస్త్వలంకారధ్వనులే కావ్యాత్మలు. రసభావాదులు ముఖ్యముగా గావ్యాత్మలు. కడమవి యముఖ్యములు, కావున నెచటను వానికి విరోధము రాదు."[1] దీనినిఁబట్టి రసాత్మకములైన కావ్యములు, వస్త్వలంకార ధ్వన్యాత్మకమైన కావ్యములు నని రెండు విధములగు కావ్యము లేర్పడ వీలగు చున్నది.

ఈ దృష్టితో సారస్వతమునందలి కావ్యనిర్మాణములఁ బరిశీలించినచో ద్వైవిధ్యము గోచరించును. కావ్యశరీర మితివృత్తము; అది నాయక చరితను. కొన్నియెడల నది పంచసంధియుతము, సర్వత్ర కార్యారంభ ఫలాగమ పర్యంత పరివ్యాప్తము. కావ్యమున నంగినాయకుఁ డొకఁడే. ఫలసాధనమున నాతనికి సహాయులు పెక్కు ఉండవచ్చుచు. ప్రతినాయకులు నంతియ. ఇట్టిది రసవత్తరముగ నిర్వహింపఁబడినచో నది రసకావ్యమనబడును. దీనికి భిన్నమైన వన్నియు వస్త్వలంకార ధ్వనిప్రధానములే యనఁదగును. ధర్మప్రబోధాత్మకములును, మిత్రసమ్మితములునైన పురాణాదు లీ శాఖకువచ్చును. వేద ప్రతిపాదిత నిగూఢ ధర్మార్థములను ఉపాఖ్యానముల ద్వారమున వివరించుచు మిత్రునివలె ఆ కావ్యములు సామాజికునికి ధర్మప్రబోధ మొనర్చును. అందేక నాయక నియమములేదు; ఒకని గాథయే చెప్పఁబడదు. వ్యంగ్యప్రధానమగు రసభావములకన్న, విజ్ఞానదాయకములగు ధర్మార్థములకే అందు ప్రాధాన్యము హెచ్చు. కథ చెప్పుటలో పురాణ కవికి రసదృష్టికన్న వస్తుదృష్టియే యెక్కువ. వస్తు వెల్లను ఉపాఖ్యానముల కూర్పు. అవి యన్నియుఁ గలిసి యేదైన మహాధర్మమును గాని, మహాతత్త్వమునుగాని, మహాసత్యమును గాని, మహాప్రయోజనమును గాని వ్యంగ్యముగా బోధింపవచ్చును. లేక ఒక్కొక్క ఉపాఖ్యాన మొక్కొక్క విశిష్ట సత్యమును ప్రతిపాదించుచుండవచ్చును. అందు రసము గుణీభూతము. రసకావ్యములలో రసచర్చకు ప్రమాణము కావ్యేతివృత్తము. మొత్తము ధ్యేయము కావ్యాంగరసము. పురాణాదులలో ప్రమాణము ఉపాఖ్యానము లేక ఒక కథ; ధ్యేయము అందలి రసము లేక రసములు. పురా

1. ఆంధ్రధ్వన్యాలోకము - శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు. పుట. 188, 189, 47.

ణాదులలో కావ్యాంగాంగి రసచర్చ కుదరదు. అలంకారము లెల్ల కావ్యము లందును వస్తువు నాశ్రయించి రసము నలంకరించుచుండును. ఇట్లగుచో రస ప్రధానేతర కావ్యములు[1] వాచ్య-వ్యంగ్యరూపమున భాసించు వస్తువే ప్రధానముగాగల కావ్యము లనుటచే వానిని వస్తుకావ్యములని నేనిందు వ్యవహరింతును. ఈ వస్తుకావ్య విభాగము నన్నెచోడుని వస్తుకావ్యదృష్టితో నొనర్చినదికాదు.

పురాణములు, క్షేత్రమాహాత్మ్యములు, హారవిలాసాది 'విలాస' కావ్యములు, 'వంశకీర్తన' కావ్యములు, 'కథా' కావ్యములు, తాత్త్విక కావ్యములు, ద్వ్యర్థికావ్యములు వస్తుకావ్యములుగా గణింపఁబడును. అందు పురాణములు పంచలక్షణ సమన్వితములు. "పురాణం పఞ్చలక్షణమ్."

"సరవి సర్గంబు నాఁ బ్రతిసర్గ మనఁగ వరుసతో వంశవంశానుచరితములనఁ
గ్రమ పరిప్రాప్తి మన్వంతరములనంగ లలిఁ బురాణంబునకు నైదులక్షణములు"[2]
—శ్రీనాథుని కాశీఖండము. ప్ర. 74.

సర్గమనఁగా నధ్యాయమనియు, సృష్టియనియు నర్థములు గలవు. వానినిఁబట్టి పురాణములందు కొన్ని అధ్యాయములుండుననియు, నవవిధసృష్టిక్రమమును వర్ణించునట్టి కథాభాగములు కల్గియుండుననియు నేర్పడుచున్నది. ప్రతిసర్గ మనఁగా మన్వాది సృష్టి. తద్వర్ణనముకూడ పురాణాంశమే. వంశవంశానుచరితము లన: వివిధ రాజవంశముల ఉత్పత్తి వృద్ధి నాశాదులను వర్ణించుటయు, ఆయా వంశజులగు రాజుల గుణకీర్తనము చేయుటయు నగుచున్నది. మన్వంతరము లన మనుకాలమధ్యచరిత్రములు. ఈ పంచలక్షణములు కలవి పురాణములు. సంస్కృతపురాణములు సంఖ్యను పదునెనిమిది. అవియేగాక నాయా ప్రాంతీయ భాషలలోఁ బురాణములు పెక్కువెలిసినవి. తెలుగున బసవపురాణాదు లటువంటివి. వీనియందు పంచలక్షణములన్నియు లక్షణబద్ధముగాఁ గానఁబడక పోయినను అష్టాదశపురాణములలో గొన్నింటివలె నొకానొకదైవము

---

1. "అరయ వస్తు రసాలంకార ప్రాధాన్యవృత్తిఁ గబ్బంబులు పెం
పారుఁద్రివిధార్థ ఘటనల ధీరులు పరికించి వానిఁ దెలియగవలయున్."
—కావ్య. చూ. 4-45.

కావ్యాలం. చూ. కర్త యొనర్చిన అలంకార ప్రధాన కావ్యవిభాగమును నేను వస్తుకావ్యములందే అంతర్భవింపఁజేసి, ద్వివిధ కావ్యవిభేదములనే గ్రహించుచున్నాను. విజ్ఞులు మన్నింపఁగలరు.

2. "సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశానుచరితం చేతి లక్షణానాంతు పంచకమ్."

యొక్క (లేక ఒక మహాపురుషునియొక్క) మాహాత్మ్యము ప్రతిపాదింపఁబడు చుండును. ఇతివృత్తమంతయు నుపాఖ్యానములచే బహుముఖమైనను తన్మాహాత్మ్యమును వ్యంగ్యమర్యాద ననుసరించి యేకముఖముగా భాసింపఁ జేయుచుండును. కావున వస్తుకావ్యములని వీనినిఁ బిలువవచ్చును. పురాణ లక్షణములతో గూడిన వస్తువు 'ప్రతిపాద్య వస్తువు' అని మనము కావ్యభాషలోఁ జెప్పవచ్చును. కొన్ని యెడల నా ప్రతిపాద్యవస్తువులలోగూడ 'ముఖ్య ప్రతిపాద్య వస్తువు' లుండవచ్చును. ఈ యంశము లాయా స్థలములలోఁ బ్రదర్శింపఁబడును.

క్షేత్రమాహాత్మ్యములుకూడ నిట్టివే. తెలుఁగునఁ గానబడు నిట్టి కావ్యములన్నియు పురాణములనుండి గైకొని రచించినవే. ఇవి యొకవిధముగాఁ బురాణాంతర్గతములే యైనను, స్వీయ వ్యక్తిత్వముగల్గి తెలుఁగున భాసించుచున్నవి కాన వానినిఁ బ్రత్యేకముగా లెక్కింపవచ్చును. క్షేత్రతీర్థదేవభక్త మాహాత్మ్యములు ప్రధానముగా వర్ణితములగును గావున నివియు బహుళోపాఖ్యాన సమన్వితములై వస్తుప్రధానకావ్యము లగుచున్నవి.

'విలాస, కథా' కావ్యములు పైరెంటికన్న విలక్షణమయినవి. "హర విలాసము" వంటి కావ్యములం దొక నాయకుని పెక్కులీలలు, "దశకుమార చరిత్ర" వంటి కావ్యములలో బహునాయకుల వివిధ విలాసములు ఉపాఖ్యానముల రూపమున వర్ణితములయి యుండును. ఇవియు వస్తుకావ్య విశేషములే.

కవి యేదేని యొక వంశమును గైకొని దానిని విపులముగ వర్ణించినను, ఒక వంశములోని ప్రముఖులగు రాజుల కొందఱి చరిత్రములను విపులముగ వర్ణించినను అది వంశకీర్తనారూపమగు కావ్యమై వస్తుకావ్యమే యగుచున్నది.

తాత్త్వికార్థ ప్రతిపాదన ప్రధానములైన యుపాఖ్యానములతోఁగూర్పఁబడిన కావ్యములు తాత్త్వికకావ్యము లనఁబడును. ద్వ్యర్థి, త్ర్యర్థికావ్యాదులలో శబ్దార్థశ్లేషాశ్రయ ప్రధానముగా నిరువుఱు లేక ముగ్గురు నాయకుల యొక్క గాథ లేకసమయముననే సమాంతరముగాఁ బ్రతిపద్యమునందును సంధించి వ్రాయఁబడును. సామాన్యముగా నిందు రసప్రతీతికన్న వస్తుకథనమే అధికమయి శోభించుచుండును. కావున నివియు వస్తుకావ్యములే. తెలుఁగు సాహిత్యమున వెలసిన వస్తుకావ్యముల నన్నింటిని గైకొని రసచర్చ గావించుట దుస్తరము కావున ప్రతివిభాగమున కొకటి లేక రెంటిని యుదాహరణముగా గైకొని స్థాలీపులాకన్యాయమున విమర్శింతును.

## 1. పురాణములు

### ౧. మార్కండేయ పురాణము - మారనకవి :

ప్రాచీనాంధ్ర సాహిత్యమునందలి పురాణములలోఁ గడుంగడు ప్రసిద్ధి గాంచినది మారన కవికృత మార్కండేయ పురాణము. తత్ప్రాశస్త్యమును గూర్చి తెల్పుచు మారన :

"నిఖిల కల్మషపంక నిర్మోచనస్ఫూర్తి నమరసరిద్వారి ననుకరించి,
బహుళతరాజ్ఞానతుహిన నిర్వాపణ ప్రౌఢి నర్కప్రభాభాతిఁ దాల్చి,
వితత చతుర్వర్గ విపుల ఫలాలంకృతస్థితి మందార తరువుఁబోలి,
సారకథాసాంద్ర చంద్రికా సంపదఁ బూర్ణేందు మండల స్ఫురణనొంది
యఖిల విబుధ సభాపర్వమై జగజ్జనావళికిఁ గర్ణపర్వమై యధిక పుణ్య
యోగి హృచ్ఛాంతిపర్వమై యొప్పు దాని హరిగుణోజ్జ్వల మణినిధి యైనదాని"
—పీఠిక. 22.

నీఁబూని రచించితినని చెప్పుకొనెను. అతని దృష్టిలో నా పురాణము పుణ్య దాయకమనియు, నజ్ఞానతిమిరాంతకమనియు, చతుర్వర్గ ఫలప్రదమనియు, సారకథా ప్రపంచమనియు, పండితపామర యోగిజన హృదయ రంజకమనియు, పరమ పురుషకీర్తనాత్మకమనియుఁ బేర్కొనఁ బడుచున్నది. ఈ గుణములనే సర్వపురాణసామాన్యములుగా గ్రహింపవచ్చును.

"సారకథా...స్ఫురణనొంది" యనుటలో నీ పురాణేతివృత్త నిర్మాణ వైఖరి సూచితమగుచున్నది. జైమిని ధర్మపక్షులను బెక్కు సంశయములఁ గూర్చి ప్రశ్నించును. వానినన్నిటిని మిత్రసమ్మితముఁగా, నుపాఖ్యానోదాహరణ యుతముగా ప్రవచించి, ధర్మపక్షులు సందేహనివృత్తి యొనర్చును. ఆ ప్రశ్నల కన్నింటికి నొక సమన్వయ సూత్రముగాని పౌర్వాపర్యక్రమముగాని యుండదు. పురాణమంతట నొక్క అంగిరసము స్ఫురింపదు. కావున నా యుపాఖ్యానములం దెడనెడ గోచరించు వీరరస స్ఫూర్తియే యిచ్చట విచారణీయాంశ మగుచున్నది.

మార్కండేయ పురాణ ప్రథమాశ్వాసమున హరిశ్చంద్రోపాఖ్యానము గలదు. ఆ రాజచంద్రుని జీవితమంతయు విశ్వామిత్రపరీక్షాగ్ని తప్తమైనది; సత్యవ్రత దీక్షాముద్రితమైనది. అనవరత యాతనాఫలితముగా నాతఁడు సాధించినది సత్యవ్రతమగుటచే నా యుపాఖ్యానము సత్యవీర స్ఫోరకమనుటలో విప్రతిపత్తి లేదు.

దత్తాత్రేయోపాఖ్యానము తపోవీరమునకుఁ బ్రసిద్ధి. ఇదియొక విచిత్ర గాథ. అత్రిముని ధర్మపత్ని యగు ననసూయా గర్భమున బురుషోత్తమాంశ మున జన్మించిన మహాత్ముఁడు దత్తాత్రేయుఁడు అతఁ డధిక సత్త్వసంపన్నుఁడు, యోగిపుంగవుఁడు, దైత్యహరతేజుఁడు. ఆతని మాహాత్మ్యముఁగాంచి ముని కుమారు లెల్లరు నతనిఁ బరివేష్టించి విడువకఁ దిరుగ నారంభించిరి. కాని యాతఁడు నిస్సంగత్వనిరూఢిని గోరియున్నవాఁడగుటచే వారిపొత్తు సహింప లేక పోయెడివాఁడు. వారికి దూరమగుటకై ఒకసారి వనజాకరమున మునిఁ గెను; జగదేకరూపిణియగు దివ్యాంగన నొక దానిని కొలనునుండి సృజించు కొని దానితో రమించుచున్నట్లు యోగలీలఁ బ్రదర్శించెను.

"ఆ లలితాంగి నర్థిఁ దన యంకతలంబున నుంచి కామ లీ
లాలసభావుఁడై తగిలి యాసవ మాదటఁ దాను నింతియు
న్గ్రోలుచు నట్టె పాడుచును గూరిన భూరి మదంబు సొంపునం
దేలుచునున్నఁ జూచి మునిదేవకుమారులు రోసి గ్రక్కునన్."

మూఢులై వెడలిపోయిరి.

"అనిలుఁడు చండాల స్పర్శనమున విను మశుచిగాని చందంబున యో
గ నిపుణుఁ డస్పృశ్య స్పర్శనమునఁ దా నశుచిగాఁ డసంగుండగుటన్."
—ద్వి. 209, 211.

నిస్సంగ నిరూఢికై దత్తాత్రేయుఁడు ప్రదర్శించిన యోగ లీలలు తపస్సాధన కేర్పడిన అవరోధములఁ దొలఁగించుటకే యగుటచే నది తపస్సంబధమైన ఉత్క టోత్సాహమును వ్యక్తముఁ జేయుచున్నవి.

కువలయాశ్వోపాఖ్యానము వీరరస ప్రధానగాథ. గాలవ మహర్షి చేయు తపస్సు నొక రాక్షసుఁడు సింహ సింధుర శార్దూలాది వనచరాకారములు ధరించి విఘ్నమొనరించుచుండ నాతఁడు శత్రుజిత్తును శరణు వేఁడి తనయొద్ద నున్న కువలయమను మహామహిమాన్విత మగు నశ్వము నిచ్చి ప్రోత్సహించెను. శత్రుజిత్తనయుఁడగు ఋతుధ్వజుఁడు (కువలయాశ్వుఁడు) తండ్రి పక్షమున గాలవాశ్రమ రక్షణ భారము వహించెను. ఒకనాఁ డారాక్షసుఁ డుగ్ర వరాహరూపమున నాశ్రమమునఁ బ్రవేశింప నాతని నర్ధచంద్రబాణనిహ తునిగా నొనర్చుటకై హయారూఢుడై ఋతుధ్వజుఁడు వెన్నంటెను. ఆ రక్క సుఁడు సహస్ర యోజనములు సని యొక భూవివరమున బాతాళమున దిగఁబడి యంతర్ధానమయ్యెను. అతఁడును తద్బిలములనఁ బ్రవేశించి పాతా

శము( జేరి రాక్షసుని( గానక పాతాళకేతు నగరము( బ్రవేశించి మదాలసనుగాంచి వివాహ మాడెను. ఈ కథాఘట్టమున ఋతుధ్వజు( డాశ్రమ రక్షణమునందు( బ్రకటించిన యుత్సాహము ప్రశంసార్హము. అతడు మదాలసా ద్వితీయుడై బలము వెలువడ ప్రయత్నింపగా( బాతాళకేతు( డుగ్రుడై సేనా వాహినివెంట నడువ నుజ్జ్వలాస్త్రశస్త్రజాలముల గుప్పించుచు రాజకుమారుని డీకొనెను. శత్రుజిత్సుతు( డుత్సాహము మెఱయ రణాంగణమున నిల్చి :

"దైతేయ ప్రవిముక్త దారుణగదా దండాసి నానాయుధ
వ్రాతంబు ల్విలసద్గదాభరణ వర్మశ్రేణియు జూర్ణమై
పాతాళాంతనికేతనాంతరమునం బర్వంగ( జేసె న్వెసన్
జాతామర్షత నక్కుమారు(డు రణోత్సాహంబు దీపింప(గన్."

"చేసి సముల్లాస హాసభాసురతర వక్త్రు(డై యుజ్వల త్వాష్ట్రి బాణ
మసురవీరుల మీద నత(డేసె వేసిన( దజ్జాత దారుణ దహనశిఖల(
గాలి చర్మాస్థికపాలముల్ చటచట ధ్వనులతో నెంతయు వ్రస్సి తొర(గ(
కపిల మునీశ్వరు విపుల కోపాగ్ని సాగరులు రయంబున( గ్రాగినట్లు
దగ్ధులయిరి దానవులు పాతాళకేతు( డాదిగా నొక్క వ్రేల్మిడి నంత విజయ
లక్ష్మి(గైకొని యమ్మదాలసయు( దాను(దన పురంబునకరిగె ఋతుధ్వజుండు."

—ద్వి. 336, 337.

రణోత్సాహ మిచ్చట సర్వాంగముగా( బోషింపబడినది. ప్రతినాయకు(డు పాతాళకేతువు. ససైన్యు(డై దారుణ గదాసిదండాదినానాయుధ వ్రాతముల( బ్రయోగించుచు నాత(డు పరాక్రమము( బ్రదర్శించెను. అతనినిమించి విజయము సాధించినా(డు ఋతుధ్వజు(డు. శత్రువుల ఆయుధములనే గాక నాభరణములనుసైతము నుగ్గొనరించినా(డు. 'వెసన్' అని పేర్కొనుటలో నాతని చండవేగము, తైక్ష్ణ్యము, వాడిమి గోచరించుచున్నవి. ఉత్సాహామర్షాది సంచారి భావములు స్థాయిని పోషించుచున్నవి. శత్రువీరులు బలలువడుటచే నాతని యుత్సాహము ద్విగుణీకృతమైనది. సముల్లాసభాసురతరవక్త్రు(డయి నా(డు. ఉజ్జ్వలత్వాష్ట్రి బాణము ప్రయోగించి శత్రువులపై తనకున్న వైర సాంద్రత, మహాస్త్రప్రయోగలాఘవము, అనల్పరణవిద్యాకౌశలము, సమయోచిత రణవిజయవర్తనమును బ్రకటించెను. తద్బాణవహ్నిశిఖలచే శత్రువులు విషణ్ణులయి దగ్ధులగుట యాతని రణోత్సాహమును దీప్త మొనరించుచున్నది. "గపిల...గ్రాగినట్లు"అను ఉపమానముచే రాజునందు రాజర్షిత్వము వ్యంగ్యము.

కువలయాశ్వుని గురుజనసేవాదీక్ష అనన్యసామాన్యము. అతని కుటుంబములోని వారందఱు నా వ్రతమును జన్మవ్రతముగ సాధించిన పుణ్యాత్ములు. రాక్షస విజయానంతరముగూడ నతనికి నిశాచరులవలని బాధలు తప్పలేదు. పాతాళకేతుని తమ్ముఁడు తాళకేతుఁడను రాక్షసుఁడు మాయాతపస్వి వేషము ధరించి, యమునా నదీతీరమున నున్న తన కపటకుటీరమును రక్షింప ఋతుధ్వజుని ప్రార్థించెను. దక్షిణగా నాతని యాభరణము కోరి దానినిఁ గైకొని వైదిక వారుణవిధుల వరుణు నభిమంత్రించునని జలమున మునిఁగెను. గురుజన భక్తియుక్తుఁడగు ఋతుధ్వజుఁ డతని కభయమిచ్చుచు నన్న మాటలివి :

"కపటముని కతఁడు మ్రొక్కి కంఠభూషణం
బొసఁగి యేను భవదాశ్రమంబు పొంత
నుండగా విఘ్న మొనరింప నొక్కరునికి
రాదు విహితకృత్యము సల్పిరమ్ము పొమ్ము." —తృ. 10.

ఇందు బల, భక్త్యుత్సాహములు స్ఫురించుచున్నవి.

తాళకేతుఁడు మాయావియై కువలయాశ్వుఁడు మరణించెనని శత్రుజిత్తునకెరింగింప నాతఁడు విషాదమున మునిఁగెను. కువలయాశ్వజనని మాత్రము హర్షముఁదాల్చి ధైర్యవతియై వీరమాత యనిపించుకొనినది. భర్తను జూచి :

"మనమున భీతగోద్విజ సమాజముఁ గావఁగ బూని యాజి న
స్త్రనిచయదారితాంగులయి చచ్చు వినిర్మల ధర్మకర్మతుల్
మనుజులుగాక రోగముల మ్రంది గృహంబులయందు బంధులే
డ్వ నిలుగు కష్టులు న్నరులె వారల తల్లులు తల్లులే మహిన్ ?"

"ఉగ్రవైరి విజయియొండె మృతుం డొండె నాజిభూమి నెప్పుడగుఁ దనూజుఁ
డపుడు గర్భదుఃఖమతివకు సఫలతఁ బొందునని తలంతు భూపవర్య !"
—తృ. 32, 33.

అని పల్కినది. దుఃఖాగ్నిచే కుమిలిపోవలసిన యారాజమాత హృదయమందు క్షత్రియోచిత ధర్మవితర్కముచే నెనలేని ధృతియేర్పడి తనయుని వియోగ దుఃఖమును చిఱునగవుతో సహించెడున ట్లొనరించినవి "వారల తల్లులు తల్లులే మహిన్" "గర్భదుఃఖ మతివకు సఫలతఁ బొందునని తలంతు"నమటలో నౌర్వాగ్ని యెదదలో నిప్పులు చెరుగుచున్నను పైకి గంభీరాకృతిఁదాల్చు సముద్రమువలె గోచరించి వీరరస మూర్తియగుచున్నది యా మాతృదేవి.

నాగలోకవాసి యగు అశ్వతరుఁడు విచిత్రవ్యక్తి, మెత్తనివాఁడు. కృతజ్ఞతా యుతుఁడు, మదాలసను బ్రతికించుట పరమేశ్వరునికైనను శక్యము గాదని ఋతుధ్వజుఁడన్నట్లు తన కుమారులు వాక్రువ్వగా నాతఁడు మదాలసఁ దెచ్చి యిత్తునని పూనికఁ దాల్చినాఁడు.

"జనులు మున్న కై పెక్కు-యశక్యమని మనంబులోపల స్రుక్కి కార్యంబునందుఁ
బూని యుద్యోగమొనరింప రేని యెట్లు దాని సఫలతాఫలతలు దారు గంద్రు?"
"తన పౌరుషంబు వదలక మనుజుఁడు కార్యంబొనర్ప మానుగ దైవం
బున యందుఁ బౌరుషమునందును దత్ఫలసిద్ధి దోఁచుఁ దుల్యస్థితితోన్."
—తృ 47, 48.

అని యుత్తమవీరుని ప్రవృత్తిని ప్రవచించి, సరస్వతీదేవిం గూర్చి ఘోరతప మాచరించి వరముగా గానవిద్యను బొంది, కైలాసవాసుని దానిచే మెప్పించి మదాలసను తనకుఁ బుత్రికగాఁ బడసెను. కువలయాశ్వుని నాగలోకమునకు రప్పించి యాతని కామెను భార్యగా నొసంగెను. మాట వరుసగా వచ్చిన ప్రసక్తి నాధారముగాఁ గొని మిత్రునకు ప్రత్యుపకారమొనర్చు సుబుద్ధితో, దీక్షతో మదాలసకు పునర్జన్మము కల్పించి యిచ్చిన తపస్వి యశ్వతరుఁడు. కృతజ్ఞతాధర్మ బద్ధమగు తపోవీర మతని నాశ్రయించి రాణించినది.

మదాలస పరమయోగిని. నిజసుతుఁడైన విక్రాంతుని బుజ్జగించుచు నుగ్గుపాలతో తత్త్వోపదేశమొనర్చిన వీరమాత ! జ్ఞాన (ప్రబోధ) వీరము ఈమె యందు వెల్లువికి జాలువారినది. స్వీయప్రబోధముచే విక్రాంతునిఁ బరమయోగి గను, నిస్సంగునిగను, తరువాత జనించిన సుబాహు శత్రుమర్దనులను యోగ విద్యావిదగ్ధులుగను, కడపటివాఁడగు నలర్కుని కర్మమార్గానుష్ఠాతగను తీర్చి దిద్దిన మనీషి యా రాజమాత. క్షత్రియోచిత ధైర్యాది సంపత్తితోపాటు తాత్త్వికజ్ఞాన మామెయందు బంగారమునకుఁ దావియబ్బినట్లు శోభించినది. అలర్కుఁడు దత్తాత్రేయుని భజించి యోగ మభ్యసించి యోగవీరుఁ డయ్యెను. ఈవిధముగా కువలయాశ్వోపాఖ్యానమున నెల్లెడలను ప్రతిపాత్ర నాశ్రయించి వీరమే స్ఫురించుచుండుటచే నది వీరరసప్రధానోపాఖ్యాన మనఁబడుచున్నది.

రాజ్యవర్ధనుఁడు ప్రజారంజనుఁడైన భూపాలుఁడు. అతనిపై గల ప్రీతిచేఁ బ్రజలు పదివేల సంవత్సరము లాయు వతని కుండునట్లు ఆదిత్యునిఁ బ్రార్థించి కృతార్థులైరి. తనపై నంత యభిమానాదరములఁ బ్రకటించిన ప్రజాసమూహమునకుఁ గూడ తనవలె పదివేల సంవత్సరము లాయువు గల్గున ట్లాతఁడు

ప్రత్యుపకారబుద్ధియై తపముఁ జేసెను. అతని యుత్సాహ మిట్టిది: అతఁడు తన భార్యతో—

"కావున నిప్పుడ కదలి యే నమ్మహీధరమున కరిగి యత్యంత భక్తి
భానుని గుఱించి తపం బాచరింపఁగ నతఁడు ప్రసన్నుఁడై యరుగుదెంచి
మానిని! నీకును మన భృత్యతతికిఁ బౌరులకును బుత్త్ర పౌత్త్రులకుఁ గూడఁ
బదివేలు వర్షము ల్బ్రదుకంగ వరము నాకిచ్చిన యట్టుల నిచ్చెనేని
యింపు సొంపు మిగుల నింద ఱతోఁగూఁడ నిఖల రాజ్యసుఖము లనుభవింతు
నట్లుకాక యున్న నచ్చోన నిలిచి యయ్యుగ్ర కిరణుగొల్తు నుగ్రనియతి."

—స్వ. 173.

అని తపోవనమున కేగిన మహితమూర్తి యతఁడు! ఆ ప్రజల కాతనిపైనున్న మక్కువ యెంతయోగదా! కన్న తండ్రి వంటి యా రాజుయొక్క యెడద యెంత మెత్తన! ప్రజలన్న మేఘమువలె జలదరించునే! "ఉపకారికి నుపకారము" సేయు ధర్మమే రాజ్యర్ధనుని రూపుదాల్చినది. దాని కుత్సాహముత్సవ విగ్రహము.

మార్కండేయ పురాణము పెక్కు ప్రబంధములకు వస్తుభిక్ష పెట్టిన మహాపురాణము. ఆంధ్ర కవితా పితామహుఁడగు నల్లసాని పెద్దన రచించిన స్వారోచిష మనుసంభవమునకు మూల మిదియే. ఇట్లే హరిశ్చంద్ర, కువలయాశ్వ, మహిషాసురమర్దనోపాఖ్యానములన్నియు భావి కావ్య ప్రపంచమునకు మూలకందములైనవి.

## ౨. బసవపురాణము - పాలుకురికి సోమన :

తెలుఁగుసాహిత్యమున వెలసిన శైవపురాణములలో నుత్తమమైనదియు, విపుల ప్రచార మొందినదియు, ద్విపదలో స్వతంత్ర రచనమైనదియు, మహాచార్యుని జీవితచరిత్రయైనదియునైన బసవపురాణము భక్తివీరమున కాలవాలమైన యుద్గ్రంథము. కావ్యనాయకుఁడగు బసవేశ్వరుఁడు వీరశైవ మతస్థాపకుఁడు; అపరనందీశ్వరుఁడు.

"వడిఁబాఱు జలమున కొడలెల్ల కాళ్ళు వడిఁగాలు చిచ్చున కొడలెల్ల నోళ్ళు
వడివీఁచు గాడ్పున కొడలెల్లఁ దలలు వడిజేయు బసవన కొడలెల్ల భక్తి!

——బస. ప్ర.

భక్తిపారవశ్యమునకు పరాకాష్ఠ యనఁదగిన నాయకుని జీవితచరిత్ర రచించు

కవియైన పాల్కురికి సోమనాథుఁడు గూడ భక్తికవిత్వావేశమునఁ బసవని కేమాత్రము దీసిపోఁడు.

ఈ పురాణమునందు ప్రధానముగా బసవని జీవితమే వర్ణితమైనను, ప్రసంగవశమునఁ బెక్కు భక్తులగాథ లుపాఖ్యానములుగాఁ గూర్పబడినవి. సోమనాథుఁ డీ పురాణేతివృత్తమును గూర్చి :

"ఆతత బసవ పురాతన భక్త గీతార్థ సమితియే మాతృక గాఁగఁ
బూరితంబై యొప్పు పూసలలోన దారంబు క్రియఁ బురాతన భక్తవితతి
చరితలలోపల సంధిల్ల బసవ చరితమే వర్ణింతు సత్కృతియనగ."

—బస. ప్ర.

అని చెప్పుకొనుటచే నాతఁడు ప్రాచీన భక్తజీవిత గాథలను, బసవేశ్వర ప్రోక్త గేయాదులను మూలములుగాఁగైకొనియుండును. అంతేగాక మహారాష్ట్రాంధ్ర ద్రవిడ భక్తచరిత్రములు, పండితారాధ్యుని శివతత్త్వసారమునందు పేర్కొన బడిన శైవగాథలు మొ. నవి యీతని రచనకుఁ దోడ్పడియుండవచ్చును. ఎచ్చటి నుండి గాథలను గ్రహించినను స్వతః తనకున్న భక్తిసంపదచే వానిని రస సంపద్భరితము లొనర్చిపెట్టినాఁడు.

"ప్రస్తుతింపఁగ సద్భక్తి విస్ఫురణఁ బ్రస్తుతి కెక్కిన బసవనిచరిత." —బస. ప్ర.

అనుటచే నీ పురాణము భక్తిప్రధానమని తాత్పర్యము. అయినను ఇందు నవరసములకు యథోచితముగ దావొసగఁబడినది !

"నవరస రసికత భువిని బేర్కొన్న శివకవివరుల చిత్తంబు లలర." —బస. ప్ర.

వ్రాసినాడఁట కవి ! నవరసములు భక్తివీరమున కంగము లీ కావ్యమున. వీర శైవులు శివునకై యెట్టి త్యాగమునైనను అవలీలగాఁ జేయగల సమర్థులు. స్వీయ గాత్రములఁ గోసి కుప్పలు వెట్టుటకైనను వెనుదీయరు. మిండ జంగ ములనైనను లింగధారణ మాత్రమున సాక్షాత్సాంబశివునివలె భావించి సేవింతురు. అందు వారి భక్తి తన్మయత్వ మెంతయో, ఆవేశయుతమైన ఉత్సాహ మంత యిమిడియుండును. కాన బసవపురాణము భక్తి వీరస్ఫూర్తి అధికముగా గల పురాణమగుచున్నది. ఉపాఖ్యానములు, బసవని చరితలు, మతవైజ్ఞానిక చర్చలు, కర్మపద్ధతులు మొదలైన విషయము లన్నిటితోడను విషయ బాహుళ్యముగల ఈ పురాణమున వస్తువ్యంగ్యము నాశ్రయించి శివమాహాత్మ్యము ప్రబోధితమగుచున్నది. అందువలననే యిది వస్తుకావ్యములలో చేర్పబడినది.

బసవేశ్వరుఁడు వడుగువలదని తండ్రితో వాదించి సోదరి తనవెంట రాగా నిలువెడలి పోవుటయందును, శైవాచార నిరతియందును, జంగముఁ డొకఁడు తన్నభ్యర్థింపఁగా నాతనికి తన భార్యయొక్క చీరెలిప్పించుట యందును ప్రదర్శించిన వీరశైవ మతాచార సంబంధియగు భక్త్యుత్సాహ మనంతము. వడుగు చేయఁబూనిన తండ్రితో బసవఁడు :

"వడుగని యిదియేమి గడియించెదివు జడుఁడ వెట్లయితి వీశ్వరుని గొల్చియును
బరమాత్మ గురునిగాఁ బడసి దుర్నరుల గురులని దలచుట నరకంబు గాదె
ఈరీతిఁ బ్రాఁటికి దూరమైయున్న వీరమాహేశ్వరాచార దీక్షితుని
నిర్మితోభయ కర్మ నిర్మూలు నన్ను గర్మాబ్ధిముంచుట ధర్మమే నీకు ?....
అకులస్థుడైయున్న యభవుని భక్తునికి నేకులంబని నిర్ణయించెదవు ?
కావున నెన్ని మార్గములను వడుగు గావింపగారాదు కథలేమిచెప్ప ?"
—బస. ప్ర.

నని వాదించినాడు. పరమాత్మునే (శివునినే) గురువుగా నెంచుటయు, లింగధారి పూర్వజన్మ సంస్కారజ్ఞానియైన ట్లెంచుటయు, వీరమాహేశ్వర భక్తియే ముక్తికిమార్గనుని భావించుటయు, వీరశైవులు కర్మనిర్మూలులనుటయు, వారికి కులగోత్రాదులు లేవనుటయు మొదలగు వీరశైవ మతసూత్రముల విజ్ఞానమాతనియందు వెల్లివిరిసియున్నదని బోధపడి, తదాచరణోత్సాహము పఠితలను ముగ్ధుల నొనర్చుచున్నది. అతనిది మతావేశముతోకూడిన వీరశైవభక్తి.

బిజ్జలునియెద్ద దండనాయకపదవి స్వీకరించి భక్తసేవానిరతి బ్రదర్శించు గురుతర ప్రతిజ్ఞ నాతఁడుచేసెను. అతని పల్కులలో కొన్నింటి నిచ్చటఁ బొందుపరుతును :

"శివరాత్రి నిత్యంబు చెల్లించు బాస శివభక్తులెల్లను శివుఁడను బాస (1)
భక్తుల యెగ్గులు పట్టని బాస భక్తుల కులమెత్తి పలుకని బాస (2)
మృదునైన యొకమాటి యడుగని బాస అడిగిన యర్థంబు గడపనిబాస (3)
పరసతిపై దృష్టి పరపని బాస పరధనంబున కాసపడని బాస (4)
హరదూషణకుఁ జెవులాననిబాస హరుని గణార్పితం బంటని బాస (5)
విషయేంద్రియములకు వెన్నీని బాస విషమ షడ్వర్గంబు విరియించు బాస (6)
వేదోక్త భక్తి సంపాదించు బాస యాదిశివాచార మలరించు బాస." (7)
—బస. ద్వి.

బసవేశ్వరుఁ డొనరించెను ఇందు (1)లో వ్రతదీక్షయు, శైవులయం దధికభక్తియు, (2)లో భక్తులయం దుత్కట భక్తిశ్రద్ధలును, (3) లో మానదానో

త్సాహములును, (4)లో ధర్మోత్సాహమును, (5)లో దైవభక్తియు , (6)లో ఇంద్రియ నిగ్రహాత్మకమగు ధృతిసాధనమును, (7)లో వేదోక్తభక్తి-సాధనమును బసవనియందు ప్రద్యోతమానములగుచున్నవి.

వేశ్యాలోలుఁడగు మిండజంగముఁ డొకఁ డొకనాఁడు తన వేశ్యాంగన బసవేశ్వరుని భార్యయగు గంగాంబ కట్టుపుట్టముల నడుగుచున్న దని బసవని నాశ్రయించి విన్నవించుకొనెను.

"అనవుఁడు దనసతి నాస్థాన సదనమునకుఁ బిల్వగఁ బంచి ముద్దియఁ గదిసి
పుట్టు సావెఱుఁగని యట్టి మహాత్ముఁ డిట్టలంబుగ నీదు పుట్టమడ్గెనేని
పుట్టమీవేగ మీపుట్ట మిచ్చినను బుట్టము మన మనియట్టి చందమున
లజ్జయు సిగ్గు దలంపక బసవఁ డజ్జలజాక్షి వల్వలిముడిఁబట్టి
యొనరఁగ నొలువంగ నొక్కవస్త్రంబు దళితాంబుజానన మొలఁబాయకున్న !
నిక్కంబు బసవని నిజభక్తి మహిమ దక్కువ గాదయ్యెఁ దరుణిమానంబు
అని భక్తమండలి వినుతింపుచుండ వనిత యంతర్వాసమున కేగె నంత."

—బస. తృ.

ఇందద్భుతమైన దానవీరము బసవని నాశ్రయించి వ్యంగ్యంముగా నతని శైవ భక్త్యుత్సాహమును చాటుచున్నది. ఇట్టి ఘట్టము లీ మహామహుని జీవితమున గుప్పలు తిప్పలు. కాని మతస్థాపకుడైన నీతని జీవితము మతతత్త్వ నిరూపణార్థ ప్రధానమై, జ్ఞానప్రధానమై నడచినను, ఎడారిలో నొయాసిస్సువలె భక్త్యావేశముగల్గు ఘట్టములందు మాత్రము పఠితకు రసాస్వాదన భాగ్యముఁ గల్గించుచున్నది. అదియుఁ బెక్కుచోట్ల వస్తువ్యంగ్యప్రధానముగనే గోచరించును.

బసవపురాణమునందు వర్ణితమైన భక్తులగాథలు స్థూలముగా ముప్విధములు. అవి: 1. ముగ్ధభక్తుల గాథలు, 2. పురాతన భక్తులగాథలు, 3. బసవని సమకాలికులగు భక్తులగాథలు—నని. ఇందు ముగ్ధభక్తు లితరులవలె వీరమాహేశ్వర వ్రతపారీణులై యున్నను అధికముగా అమాయకులు, నిరాడంబరులు, స్నిగ్ధప్రవృత్తులుగలవారు. వారు స్వచ్ఛందమైన వాత్సల్యము, పారవశ్యముతోఁ గూడిన భక్తిభావము, వెన్నవంటి హృదయము, శివునిగాంచినంతనే ఆప్తులవలె, మిత్రునివలె, పుత్రునివలె ఉత్కట స్నేహముతో గూడిన ముగ్ధభావముతో గీర్తించి, సేవించి, లాలింపవలెననెడి సున్నిత మధురభక్తి మొ. గుణములుగల్గి శివునికొఱకై ప్రాణములనైనను త్యజింప సిద్ధమయి, త్యాగోత్సాహ భక్తివీరులై యొప్పువారు వీరు. ఉదాహరణమునకు ఉడుమూరి కన్నయ్యగాథఁ

గై కొందము. ముగ్ధభక్తుల కీత డాదర్శప్రాయుఁడు, తలమానికము. కవియొక పాత్రముఖమున :

"ఇట్టి ముగ్ధత్వంబు నిట్టి వీరత్వ మిట్టి మహత్త్వంబు నెందును కలదె."—బస. తృ.

అని పల్కించి కన్నప్ప ముగ్ధవీరుఁడని వ్యంగ్యముగా సూచించినాడు. అతని శివభక్తిస్మరణ పారవశ్యములు పూర్వజన్మ పుణ్యసంస్కార జనితములు :

"పారిమజ్జనోదకంబులకటమున్న పరముపై నానంద బాష్పముల్ దొరుగఁ
బూజించు నవపుష్పరాజికి మున్న రాజాంకుపై హృత్సరోజంబు విరియ
ధూపవాసనకుమున్ ధూర్జటి ప్రోల వ్యాపితాంతర్గత వాసన దనర
వెలుఁగు నీరాజనంబుల కటమున్న మలహరునంద యాత్మజ్యోతి ప్రబల
వినివేదిత పదార్థ వితతికి మున్న తన ప్రాణపద మీశ్వరుని కర్పితముగ
లింగార్చనముఁ దాను బొంగి చేయుచును సంగ చేష్టలకు నంతంత బాయుచును
సుభగలింగము జూచిచూచి క్రాలుచును నభవామృతం బాని యాని వ్రాలుచును
సురుచిరోక్తుల సోలినోలి పాడుచును స్థిరసుఖాంబుధిఁ దేలితేలియాడుచును
మంగళోన్నత బహిరంగంబు నంతరంగబుఁ దన ప్రాణలింగస్థమగుచు."
—బస. తృ.

నుండు నాతని యనుభావాదులు భక్తి పారవశ్యమును ప్రకటించుచు, "అడుగడుగునకు మాధవా !..." యను భాగవత పద్యమునందలి ప్రహ్లాద భక్తి మూర్తినిఁ దలపించుచున్నవి.

ఫాలాక్షుని కంటతడిని జూచి కన్నయ్య తబ్బిబ్బయినాఁడు. ముగ్ధత్వ ముట్టిపడ కరిగి జాలువారినాఁడు. జాలితో పరవళ్ళు ద్రొక్కినాఁడు :

"కటకటా ! యిదియేమిఁ గర్జంబువుట్టె నిటలాక్ష ! నీకంట నీరు కారెడిని
నీనింద విని గౌరి నీతైనసాఁడు దానించు కేనియుఁ దడికంట లేదు;
జనకుచేఁ దనయునిఁ దునిమించునపుఁడు కనికరంబునఁగంటఁ గ్రమ్మదు నీరు
నేఁడు నీకడకంట నిర్నిమిత్తంబ పోఁడిగా జలములు పూరించుటేమి ?....
చెప్పవే నాకని చేర్చుఁ గౌగిటను నప్పలించును 'నాయట్టి పుత్త్రుండు
గలుఁగ నీకేల యప్పులబ్రుంగ." —బస. తృ.

యని జగత్పితరునకు ధైర్యము సెప్పినాఁడు!"ఉమామాతా పితారుద్రః" అను పురాణోక్తిని భావమున నిలిపిన భక్తవరుఁడు గాన "నాయట్టి పుత్త్రుండు గలుగ"నని గుండె నిబ్బరముగా బలుకగలుగుట ! భక్తిపారవశ్యమున భావ తాదాత్మ్యము నొందగల్గెను గావుననే ఆ ముగ్ధభక్తునియందు ఆత్రము, అమాయ

కత ఆవేశము, స్వచ్ఛందత, సరళత్వము, పితృభావము, మౌగ్ధ్యము ముమ్మూర్తులఁ బ్రత్యక్షమై కానబడుచున్నవి !

కంటికి నీరుకారుట జబ్బని యెరిగిన కన్నయ్య హృదయములో తన్నివారణోత్సాహము పగులెత్తినది. తన కన్నులఁ బెరికి శివుని కర్పించు త్యాగము తురంగలించినది.

"ఒప్పని కన్నుతో నున్నట్లుగాఁగఁ గప్పెద నాలెస్సకంట నీకన్ను
నాకన్న చూ మందు నీకంటికనుచుఁ జేకొని శరమున ఛేదించి పుచ్చి
కఱకంఠు కంటిపైఁ గన్నప్పదేవుఁ డఱిమఱిఁ దననేత్ర మర్పింపఁదడవ
అక్కంటఁ దొరుగు ధారావళి యడఁగి గ్రక్కున డాపలికంట నుప్పొంగఁ
గించిత్ప్రహాస సంకీలితానన సమంచితాంభోజాతుఁడై తన నేత్ర
కమలంబు శివునేత్ర కమలమై యునికి కమితమహోత్సాహ మాత్మ దొలాకఁడఁ
గ్రేకంట లింగంబు డాకన్నుఁ జూచి యీకంటికిని ముందు నీకన్నె కాక
యనుమాన మింకేలయనుచు దన్నేత్రజనిత వినిర్మల జలధార దొరుగ
గందువ దనచెప్పుఁగాలి యంగుటము పొందించి డాకన్నువుచ్చఁగైకొనుఁడు."

—బస. తృ.

దైవ మాతని ననుగ్రహించినాఁడు. ఒప్పని కన్నుతో కన్నతండ్రిని జూడలేని జాలిగుండె, 'నాకన్న చూ మందు నీకంటి' కనెడి మాటలోని సూటిదనము, అమాయకత, సత్వరనివారణోన్ముఖత, శరముతో నేత్రము ఛేదించుకొనుటలో ననంతత్యాగోత్సాహము, భక్త్యాతిశయము, 'చెప్పుఁ గాలియంగుటము' గుర్తుంచుటలో నమాయకత, మౌగ్ధ్యము, సమయోచితకార్యనిర్వహణానైపుణ్యము, జానపద సహజ నిష్కల్మషహృదయము విభావోచితముగాఁ బరిపోషింపఁబడినవి. తన నేత్రకమలము శివనేత్రకమలమని భావించుటలో నాత్మార్పణరూపమై యుత్కట త్యాగోత్సాహము ద్యోతమానమగుచు, దాని నంగముగా గల్గి వ్యంగ్యముగా భాసించు భక్తివీరము చర్వితమగుచున్నది. ఏకలవ్యుఁడు, కర్ణుఁడు, శిబిచక్రవర్తి అందుకొనిన స్థాయిననున్న భక్తివీరుఁడు కన్నప్ప. కాని యితనిది ముగ్ధభక్తి. వారిది జ్ఞానవంతమగు (ప్రౌఢ) భక్తి. అంతియ భేదము.

ఇట్లే భక్తుల చరితములు పెక్కు బసవ పురాణమునందు భక్తి భావస్నిగ్ధములై యున్నవి. పురాతన భక్తి గాథలలో జంగమ భక్తితోఁ బుత్రుని జంపి వండి వడ్డించిన సిరియాళుని వంటి భక్తవరేణ్యుల గాథలు, సమకాలీన భక్తులలో మడివాలు మాచయ్యవంటి వీరమాహేశ్వరుల గాథలు, ఈ పురాణమునకు వన్నెఁ దెచ్చినవి. ఇవి యన్నియు రసపుష్టి గల్గియున్నవని జెప్పజాలము

గాని సామూహికముగా బరితయందు భక్తిభావము గల్పింప సమర్థము లగుచున్నవి.

బసవపురాణమునకు, ఇతరపురాణములకును ఒక విశిష్టమైన భేదము గానఁబడుచున్నది. బసవపురాణమంతట నొక రసము ప్రధానముగాఁ బోషిత మైనట్లు గాంచవచ్చును. అద్భుత ప్రధానములగు బసవ మాహాత్మ్యములు వర్ణితములగు చోటులందును, మతసిద్ధాంతము అర్థప్రధానముగా ప్రతిపాదిత మయిన చోటులందును రసస్ఫూర్తి జరుగుట కష్టమైనను, ప్రతిపాదిత వస్తువు నందలి పురాణ లక్షణములు గొన్ని గోచరించుచు, వస్తుతాత్పర్యభూతమును, ముఖ్యప్రతిపాద్య వస్తువునునైన బసవ మాహాత్మ్యము పఠితకుబోధితమై అతని యందు భక్తిభావ ముదయించుటకు హేతువులగుచున్నవి. మఱొక మాటలో నవియన్నియు జ్ఞానయుతమైన భక్తికి విభావతుల్యము లనవచ్చును. ఇందులకు కారణము భక్త్యావేశము గల కవి పురాణము రచించి యుండుటయు, మత కర్త నాయకుఁ డగుటయు నైయున్నది. మార్కండేయ పురాణాదులలో నిట్లు ప్రధానరస మొక్కటిగా ప్రతిపాదితము కాలేదు. కాని బసవపురాణ మందు వస్తు వంగ్య ప్రధానముగా భక్తివీరము స్ఫురించుచున్నది.

### ౩. పండితారాధ్య చరిత్ర - పాలుకురికి సోమనాథుఁడు :

బసవ పురాణమువలెనే ఏకానాయకమైనను ప్రధానకథ మునిగిపోవు నన్ని భక్తులగాథలతోఁబెంచి రచింపబడిన పురాణములలో సోమనాథుని రెండవ కృతి శ్రీమల్లికార్జున పండితారాధ్య చరిత్రము. బసవఁడు, పండితారాధ్యుఁడు- వీరిరువురు సాక్షాచ్ఛివాంశసంభూతులని యే కవిభావన :

> "హరుఁడు నిరాకారుడైనచో బసవఁ డరయంగ సాకారుఁడై చరియించు."
> —బసవ. పురా.

> "చిరత మోగుణపరిస్ఫీతుండు శివుఁడు వరసత్త్వగుణవికస్వరుఁడు పండితుఁడు
> అరయ నచరలింగ మా లింగమూర్తి యరయగాఁ జరలింగ మా పండితయ్య."
> —పండితా. చరిత్ర.

శివాంశసంభూతులగు నాయకుల చరిత్రము లిందు వర్ణితములగుటచేతనే వారి పేర్లపై నవి పురాణగౌరవముగాంచినవి.

శ్రీశైలమందు సమావేశమైన 'వీరమాహేశ్వరాచార వర్తనులయిన భక్తకోటి' పరిస్ఫుట వీరభక్తిరాజ్యైక మహిమాభిరతి సుఖించుచు శివానంద నిలయులైయుండి పాల్కురికి సోమనాథునిఁగాంచి :

> "బసవపురాణ ప్రబంధంబునందు ప్రథిత పురాతన భక్తగణాను
> కథనంబు లితిహాస ఘటనఁ గూర్చితివి; వర వీరభక్తి సవైదికంబుగను
> విరచించితివి 'చతుర్వేదసారము'న బసవన్న మహిమ శుంభద్భక్తి యుక్తిఁ....
> పరిశిష్ట పరిమిత ప్రాక్తనభక్త చరితంబు లితిహాస సంగతినొలయ
> సంధింపు పండిత చరితంబునందు." —పండి. ప్ర.

అని యాజ్ఞాపించిరి. వారి పల్కులనుబట్టి సోమన పండితారాధ్య చరిత్రము నందు బసవపురాణ చతుర్వేద సారములందు వర్ణింపగా మిగిలిన పురాతన భక్తవితతుల చరిత్రములఁ జెక్కింటిని జేర్చి ఒక గ్రంథముగాఁ గూర్చి రచించె నని తేలుచున్నది. అవియన్నియు 'వీరభక్తి' వ్రతుల గాథలని వ్యంగ్యముగా సూచించియున్నాడు. కవియు స్వతస్సిద్ధముగా 'వీరభక్తి' యుక్తుఁడని స్పష్టము. అతనివ్యక్తిత్వము కావ్యమున బింబించుట సహజము. అందులకు తార్కాణగా

> "భవదీయ కారుణ్య పాత్రుండనైతి భువినేన ధన్యుండ బుణ్యుండ నాదు
> వీరభక్తి స్థల విశ్రుతాచార సార వ్రతాదులు సఫలతనొందె." —పండి. ప్ర.

నని భక్తమండలికి నమస్సులిడుచు "వీరభక్తి ......... వ్రతుడు"అని తనను బేర్కొనినాఁడు. అంతియగాక :

> "శుద్ధ భక్తి స్థల శ్రుతి మతాచార సిద్ధ వీరవ్రత శీలాన్వితుండ." —పండి. ప్ర.

అని వాచ్యముగా జెప్పుకొనినాఁడు. భక్తి యనుచోట "వీరభక్తి" యను పదమే పండితారాధ్య చరిత్రలో వాడఁబడియుండుట చేతను, అందు వర్ణితము లైనట్టి భక్తచరితలు బసవపురాణాదులలో సైతము గ్రథితమై యుండుట వలనను, రెండు పురాణములందును "వీరభక్తి"యే ప్రధానమైన రసమని తేలు చున్నది. ద్విపదచ్ఛందముయొక్క ప్రాశస్త్యము గూర్చి :

> "అదియును గాకైహికాముష్మిక ద్విపదహేతువగుట ద్విపదనాఁబరగు."
> —పండి. ప్ర.

నని తెల్పి, కవిత్వమునకు బురుషార్థ చతుష్టయఫలము నాపాదించినాఁడు కవి.

పండితారాధ్యుఁడు శైవపండితత్రయములోఁ బ్రసిద్ధుఁడు. శైవమతము నకు మూలస్తంభములగు వారిలో నొక్కడైన యీతని జీవితమంతయు పర మతనిరసనమందును, స్వీయమత స్థాపనమునందునుఁ వెచ్చింపబడి వాద వీరము నకు, పాండిత్యవీరమునకు, జ్ఞానవీరమునకు (మతవీరమునకు) నిలయమై విరాజిల్లుచున్నది. వాదప్రకరణమంతయు దీని కుదాహరణమే. ఇఁక దీక్ష

పురాతన ప్రకరణములందు పురాణ శైవభక్తుల 'వీరభక్తి' గాథలు వర్ణితము లైనవి. ఇవి యన్నియు పండితారాధ్య చరిత్రమునకు, శైవమాహాత్మ్య ప్రతిపాదనమునకు అంగములై వరలుచు తత్పురాణ గౌరవ కారణములగు చున్నవి. పండితారాధ్య చరిత్రము పఠితకు రసానుభూతి కల్పించుదానికన్న మతావేశమును, మతజ్ఞానమును అధికముగా కల్పించి యూరకుండును. రస మిందు గుణీభూతము. వస్తువ్యంగ్యము నాశ్రయించి పఠితయందు భక్తిభావ ముదయించునని చెప్పుకొనవచ్చును. అందువలననే దీనిని వస్తుకావ్యమనుట !

## 2. క్షేత్ర మాహాత్మ్యములు

### ౧. కాశీఖండము — శ్రీనాథుఁడు :

క్షేత్రమాహాత్మ్యములలో దెలుఁగు సాహిత్యమున శ్రీనాథ మహాకవి ప్రణీతములైన భీమఖండ, కాశీఖండములు ప్రసిద్ధములు. స్కాందపురాణాంతర్గత ములగు గోదావరీఖండమును, కాశీఖండమును తెలుఁగున రసవత్తరముగ ననువదించినవాఁడు శ్రీనాథుఁడు. భీమఖండమునందు భీమేశ్వరునియొక్కయు, క్షేత్రముయొక్కయు మాహాత్మ్యములు వర్ణితములయి అద్భుత రసాతిశాయు లుగా గోచరించుచున్నవి. క్షీరసాగరమథనము, త్రిపురాసుర సంహారము మొ. ఘట్టములందు లోకరక్షాదక్షుఁడైన గరళకంఠుని మహిమ లతిశయముగా వర్ణిత ములయినవి. కాశీఖండమునందు కాశీపట్టణము, ఘట్టములు, భక్తుల చరిత్రములు వర్ణితములు. సామాన్యముగా క్షేత్రపురాణములందు క్షేత్రమాహాత్మ్యాదులఁ దెల్పుటలోనే కవి నిమగ్నుఁడై వివిధరసపోషణమం దంతశ్రద్ధ గైకొనఁడు. శ్రీనాథుఁ డట్లుగాక శృంగారాది రసములపట్ల శ్రద్ధవహించి ఆయాఘట్టము లందు రసదృష్టితో కథలను నడిపించియుండెను. కాని కావ్యము మొత్తము రసవత్తరమనుటకన్న వస్తు వ్యంగ్య ప్రధానమయిన వస్తుకావ్యమే' యనుట కుచితముగానున్నది. అట్లనుటలో శ్రీనాథుఁడు రసవత్కవి కాదని యనుట గాదు. అతఁడు స్వీకరించిన వస్తువటువంటిది. శృంగారనైషధాదులు వేఱు. అవి రసకావ్యములు. కావున కాశీఖండము నందెడ నెడ గోచరించు వీరరస మును గూర్చియించుక ప్రస్తావింతును.

అన్యరసప్రధానములగు నుపాఖ్యానములలో వీరరసప్రసక్తి వచ్చినచోట శ్రీనాథుఁడు శృంగారమువలె అభినివేశముతో గాకపోయినను తత్తదుచిత

రీతి పోషించి రసానురక్తిని వెల్లడించెను. ఉదాహరణమునకు (1) వైశ్వానరు నకు రెండవయేట గండ మున్నదని నారదుఁడు తెల్పగా శుచిష్మతీవిశ్వానరులు తమ కుమారున కేర్పడబోవు కీడును దలంచి దుఃఖితులైరి. అప్పుఁడు వైశ్వానరుఁడు తల్లిదండ్రుల కిట్లనెను :

"వినుడీ నాదుప్రతిజ్ఞ మీరు హృదయోద్వేగంబు వర్జించి యో
జనయిత్రీ జనకుల్ ! గురుల్ ! భవదనుజ్ఞాముద్ర చేపట్టి యేఁ
జని కాశీపతి విశ్వనాయకు శివుం జంద్రార్ధ చూడావతం
సుని మృత్యుంజయు నాశ్రయించి విగతాసున్ జేసెదన్." —చతు. 38.

అని మృత్యుంజయోత్సాహమును బ్రకటించెను. (2) తనను వలచి రాక్షసునితోఁ బోరి, ప్రాణములు కోల్పోయిన విద్యాధరుని భర్తగా భావించిన సుశీల అగ్నిప్రవేశము చేయుచు నన్నమాట లివి :

"ఏఁ బ్రభాతంబుల నీశానవాపిక ననిశంబు తీర్థమాడిన ఫలంబు
వివిధ భంగులనేను విశ్వేశ్వరస్వామి ముక్తిమంటపి నిద్ర ముగ్గుఫలము
ప్రతిచతుర్థిని డుంఠి భద్రేభ వక్త్రు నే నారాధనము సేసినట్టి ఫలము
నానంద కాననాభ్యంతర క్షేత్రంబు నందును జన్మించిన యట్టిఫలము
సర్వమునుకూడి మీదట జన్మవేళ నితని కే భార్యగా నన్ను నిచ్చుగాత !"
యనుచుహరిణాంకమూర్తి తీవ్రాంశుబోలెఁగొనర కగ్నిబ్రవేశించె కువలయాక్షి
—పంచ 170.

పై రెంటి యందును భక్తి వీరము ప్రస్ఫుటమగుచున్నది. ఇచ్చట భక్తి నుపకరణముగాఁ గొని పురుషార్థసాధనాయత్తు లగు వారి యుత్సాహముత్కటముగాఁ బ్రదర్శితమయినది కనుక భక్తి వీరమనవచ్చు ననుట ! కాశికా విశ్వేశ్వరుని గొల్చువారికి మృత్యుభయము దూరమగు నన్న ధృతియే వైశ్వానరు వీరమునకుఁ బోషకము; సుశీల భర్తృగత భక్తి విశేషముచే తన పుణ్యఫలమునంతయుఁ ద్యాగముచేసి మరుజన్మలోనైనను భర్తగా నాతని ప్రసాదింపుమని వేడుకొనినది. ఇచ్చట త్యాగము భక్తికి పోషకము.

కాశీఖండమునందు దివోదాసోపాఖ్యానము లక్షణబద్ధమైన యొక లఘు కావ్యముగా గోచరించుచున్నది. ప్రతినాయకుఁడు, స్వాయత్తుఁడు నగు దివోదాసు నాశ్రయించిన యోగవీరము, అతని నధర్మబద్ధముగా నొనరించి కాశీకాపట్టణ సింహాసనమును తిరిగి సంపాదించుకొనుటయందు నాయకుఁ డగు శివుఁడు ప్రకటించిన యుత్సాహము, సచివాయత్తసిద్ధుఁ డగు నాతనికి సహా

యము చేసిన నారాయణాదుల ప్రయత్న విశేషములు వీరరస స్ఫూర్తిని సర్వాంగముగా సంతరించి పెట్టుచున్నవి.

బ్రహ్మకల్పమున స్వాయంభువమనువు కాలములో నఱువదేండ్లు అనావృష్టియైన కారణముగా లోకము కడు నుపద్రవము నందెను. బ్రహ్మ దీనికి విచారించి నిఖిల క్షోణీచక్ర రక్షైక దీక్షా ధురంధరుఁడును, మనువంశజుఁడును, ఔదార్య శౌర్య ధైర్యాదిగుణ గరిష్ఠుఁడునునగు రిపుంజయుఁడనువానిఁ గాంచి ధరణీభారము వహించునట్లు పట్టాభిషిక్తు నొనరించెను. అతఁడే దివోదాసు. ఆ సమయమున దివోదాసు పద్మజుని కోరిన కోటిక యిది :

"నెట్టన నన్ను సత్కరుణ నీరధివేష్టితమైన ధాత్రికిం
బట్టము గట్టితేని నొకబాస పితామహ ! యాత్మ నెగ్గుగాఁ
బట్టక విన్ను భోగులు సుపర్వులు క్రిందట మీదట నుండగా
దొట్టవు సత్యమౌ ధరణి నొక్కరుఁ డున్ననుఁ జేయ రాజ్యమున్."—పం. 27.

అని. కాశీపతి యనుమతమున నాతని కోటిక మన్నించి బ్రహ్మ రాజ్య మాతనికిఁ గట్టపెట్టెను. మహేశ్వరునితోఁబాటు తక్కిన దేవతలందఱు కాశిని వీఁడి మేరువునకుఁదరలిపోయిరి. క్షుద్రదేవతలు రిపుంజయుని శాసనమునంగీకరించిరి. ధర్మమార్గైకవర్తియగు రాజునందు దోషముఁ గానఁ జాలక దేవతలు గటకట పడి కాశీ పట్టణ వియోగ బాధచే కుందుచుండిరి. బృహస్పతి సలహాపై పావకాదులు తమ తమ రూపముల నుపసంహరించుకొనిరి. ప్రజలా మహోత్పాతమునకు భయపడి రాజునకు విన్నవించిరి.

"అందఱ నాదరించి మిహిరాన్వయ ముఖ్యుఁడు వారి యాత్మ లా
నందముఁ బొంద నిట్లనియె నాకనివాసులు సేసినట్టి కీ
డొందునె నన్ను ! మీరు వెఱకుండుఁడు భూప్రజలార ! నేడ యా
నందవనంబు నందు దహనంబు ఘటించెద యోగసంపదన్."

"అనుమానింపక యా సురాధములు మాయా కల్పనా వంచనం
బున వైశ్వానరునిన్ హరించిరి యవుంబో ! యింత మాత్రంబులో
నన నా యోగమహానుభావమునకున్ భంగంబు వాటిల్లునే
సనెకల్దాచినఁ బెండ్లిమాను నొకొ ! దుశ్చారిత్రము ల్గంటిరే !"

"దహన స్వరూపంబుఁ దాల్చి యేఁ గైకొందు హవ్యకవ్యాహుతు లధ్వరములఁ
బర్జన్యమూర్తిఁ జేపట్టి యే వర్షింతు సలిలధారలు సస్యములు ఫలింప
శశిదివాకరుల వేషంబులుఁ దాల్చి యే ఖండింతు గాఢాంధకార పటలఁ
బవను నాకారంబు భరియించి యేను బ్రాణ్యంతర్బహిర్వ్యాప్తి నాచరింతు

వేల్పులందఱు నేనయై వివిధ గతుల విశ్వలోకంబు రక్షింతు వేయునేల ?
యింక నేదాని నిటనేన యేలువాఁడ నాగలోకంబు నాకంబు యోగశక్తి.
—పం. 310-312.

అని యుత్సహించి యోగవిద్యాబలమున సర్వదేవతామయుఁడై దివోదాసుఁడు రాజ్యముఁ జేసెను. దివోదాసునందు దేవతానిగ్రహ నిమిత్తమైన యోగోత్సాహ మిందు కొట్టవచ్చినట్లున్నది. దేవతలు సైతము ధర్మమార్గమునఁగాక కుతంత్రములు పన్ని దివోదాసుని మడియింపఁగల్గిరి గాని అతనిపై ప్రత్యక్ష విజయము సాధింపఁజాలకపోయిరి. పరమేశ్వరుని సైత మిట్టి క్లిష్టపరిస్థితులలోఁ బెట్టి ముప్పు త్రిప్పలుబెట్టి మూఁడు చెఱువులనీరు త్రావించిన దివోదాసుని యోఁగ వీరము అనన్య సామాన్య మనుటలో విప్రతిపత్తి లేదు. అది ధర్మరూపమై వరలుచున్నది.

## ౨. పాండురంగ మాహాత్మ్యము—తెనాలి రామకృష్ణుఁడు :

శ్రీనాథునకుఁ బూర్వము ప్రబంధపరమేశ్వరుఁ డగు ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహ పురాణమను క్షేత్ర మాహాత్మ్యమును రచించెను. కాని దానిని వస్తుకావ్యముగా కాక రసకావ్యముగా సంతరించి తన బిరుదమును సార్థకపరచుకొనినాఁడు. ఇఁక శ్రీనాథుని తర్వాత నిట్టి కావ్యరచనము జేసిన కవులలోఁ బేరెన్నికఁ గన్నవాఁడు తెనాలి రామకృష్ణుఁడు. అతఁడు రచించిన గ్రంథములలో ఘటికాచల మాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యము—అనునవి క్షేత్ర మాహాత్మ్యములు. ఇందు పాండురంగ మాహాత్మ్యమున కెనలేని ప్రశస్తిగలదు. దానికి పౌండరీక మాహాత్మ్యమనియు నామాంతరము గలదు.[1] పాండురంగ భక్తుఁడగు పుండరీకుని కారణముగా నా కావ్యమున కా పేరుపెట్టి యుండ వచ్చును.

క్షేత్ర మాహాత్మ్యములన్నిటియందు వలెనే యిందును క్షేత్ర—దైవత—తీర్థప్రభావ వర్ణన మొనర్పఁబడియున్నవి. ఈ కావ్యమున రామకృష్ణుఁడు భక్తుల చరిత్రములు వర్ణించుచు నందు తపోవీరమును కొంత విశేషించి సందర్భోచితముగాఁ బ్రపంచించినాఁడు. పుండరీకుఁడు, గోపిక, రాధ, అయుతుఁడు మొదలగు వారొనర్చిన ఘోర తపస్సు లిందుల కుదాహరణములు. సుశీలవంటి గుణ

---

1. అభ్యుదయ పరంపరాభివృద్ధిగాఁ నా యొనర్పం బూనిన పౌండరీక మాహాత్మ్యంబునకుం గథావిధానం బెట్టి దనిన. —పాండు. మా. ప్ర. 95.

శీలలు ప్రదర్శించు ధర్మశీల ప్రవృత్తులీ కావ్యమందు సహృదయుల మన్ననలఁ గాంచియున్నవి.

పుండరీకుని ఘోరతపమును రామకృష్ణుఁడు సామర్థ్యముతో నిర్వహించినాఁడు. పుండరీకుఁడు పాండురంగ క్షేత్రమునఁ దపమొనరించుచు యోగి కవసరమైన ఇంద్రియ నిగ్రహాదులు సాధించిన క్రమమును, వర్షాది ఋతువుల యందాతఁడు దేహాభిమానము వదలి చేసిన దుష్కర తపోవిధానమును వర్ణించి తపోవీరమును సర్వాంగ సమర్థముగాఁ బోషించినాఁడు.

"మొదలఁ గామక్రోధములు బరాబరిచేసి సత్యావాఙ్నియమంబు సంఘటించి
సాత్త్వికస్వల్పభోజనలబ్ధిఁ గ్రొవ్వాఁగి యష్టాంగకాసక్తి హావణుపఱచి
తరచి ముప్పదిరెండు తత్త్వంబు లూహించి మది సత్త్వసంపద మస్తరించి
తెలిసి ముద్రాసనంబుల మేనిపనిగొని పాపపూరుషు పటాపంచుఁజేసి
యతఁడు మూలాలవాల గహ్వర కరండ కుండలీస్థాన గోకర్ణకులకలాప
తత్త్వదర్శన వర్ణాధి దైవత దళ నిర్ణయంబెంత యంతయు నిజముఁగాంచి."
—ద్వి. 8.

పుండరీకుఁడు గ్రమముగా నరిషడ్వర్గముల నణచినాఁడు, మితభాషణముల నలవరచుకొనినాఁడు, సాత్త్వికాల్పభోజనముచే క్రొవ్వు శుష్కింపజేసినాఁడు, యమనియమ ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ మనన సమాధులను అష్టవిధయోగమునం దభిరతిని సమకూర్చినాఁడు. ప్రకృతిమహత్తు, అహంకారము, ఏకాదశేంద్రియములు, పంచభూతములు, పంచవిషయములు, జీవుఁడు పరమాత్మ, షట్చక్రములు అనెడి ముప్పదిరెండు తత్త్వములను స్వాధీనపఱచుకొనినాఁడు; మూలాధారమగు గుహారూపమగు బరిణియగు కుండలీస్థానమందలి శేషుని తత్త్వమునకు, విష్ణు తత్త్వమునకు మూలములగు బీజాక్షరములు, అధిదేవతలు, దళములు అనువాని తత్త్వమును బాగుగా నెఱింగి ఆపై హఠరాజ యోగములు సాధించి తపస్సాధనోత్సాహము నఖండముగాఁ బ్రదర్శించినాఁడు. అంతియగాక :

"మిసిమింతుఁడును గాక వసియించుఁ గుత్తుకబంటినీరను బుండువంటి చలిని
మోము దమ్మికిఁ దేఁటిమొత్తమై పొగపర్వ వ్రేలుఁగ్రిందలగాఁగ వృక్షశాఖ
వేరువెల్లఁకి కాయగూర పండని కోర కుదరాగ్ని గాడ్పుచే నుజ్జగించు
నేచి యీచెలిగాడు పాచెవిఁ బోవంగనుబ్బి లింగమువోలెఁ నుండు నెండ
నంతరాయాంధకారంబు లలమికొనిన నడఁచు నిజధైర్య సూర్యోదయంబుచేత
దానవారిని గుఱిచేసి తనకుఁబోదు నాకుఁ బోదని నమ్మి సుశ్లోకుఁడతఁడు."
—ద్వి. 29.

"పుండువంటిచలి" యను ఉపమానము రామకృష్ణునికే సాధ్యము! దేహాభిమానము వదలి, ఇంద్రియ విజయి యైన పుండరీకుఁడు చలికాలమున గుత్తుక బంటి నీటియందుండియు, వడగాలులు వీచు నెండవేళలఁ జలింపకయు, వృక్ష శాఖలకు దలక్రిందుగా వ్రేలాడియు, వాయుభక్షణమాత్రముననుండియు తపము చేయుచు, స్వీయధైర్యమనెడి సూర్యోదయముతో నంతరాయ తిమిరములను పటాపంచలొనర్చి తపము సేయక తనకు దప్పదనియు, విష్ణుదేవునిపై నమ్మిక గల్గి వ్రతాచరణ మొనర్చెను. దైవసాక్షాత్కారఫలమైన తపమునందు క్రమముగా నధికారమును సంపాదించుచు నాత్మవిజ్ఞాన విలసితమైన యోగము సాధించి పరమాత్ముని దర్శించు క్రమమిందు వర్ణితమగుటచే నాయకాశ్రయమైన సాధనోత్సాహము వీరమై ప్రకాశించుచున్నది. పై వర్ణనమునందు కవి యొక్క క్రమమును బాటించి విభావానుభావాదులను విశిష్టముగాఁ బ్రపంచీకరించెను కావున రసోత్పత్తి కాకరమై యింపుగూర్చుచున్నది. ఇట్లే రాధాదుల యందును కవి రసపోషణ విధానము ననుసరించి కృతార్థుఁడై నాఁడు.

## 3. విలాసకావ్యములు

### ౧. హరవిలాసము — శ్రీనాథుఁడు :

విలాస కావ్యములలో బ్రసిద్ధిఁ జెందినది హరవిలాసము. దీని ప్రాశస్త్యమును గూర్చి శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారిట్లు వ్రాసియున్నారు: "ఆంధ్ర కవుల పురాణేతిహాస భాషాంతరీకరణ ప్రవీణత కాలక్రమమున సన్నగిలుచు శ్రీనాథుని కాలమునకు ఖండకావ్య రచనములోనికి దిగి యాంధ్రకవిత్వమును వ్యక్తము చేయఁదొడంగినది. ఖండకావ్యములేయగు నాతని భీమఖండ, కాశీఖండాదులు స్వతంత్ర గ్రంథములుగనే బయలుదేరినను స్కాందపురాణాంతర్గత భాగముల భాషాంతరీకరణములను నపవాదము వానిని వదలలేదు. దీనిని గ్రహించి యాంధ్రగ్రంథములకు నీ యపవాదమును దొలగించుటకే శ్రీనాథుఁడు హరవిలాస రచనమును బూని మఱియొక యడుగు ముందునకు వేసెను. ఈ హరవిలాస మొక సంస్కృత గ్రంథమునకు భాషాంతరీకరణమని జెప్పవలను పడదు. అందలి కథలు పురాణాంతర్గతములుగాక అక్కడక్కడ కొన్ని భావములు సంస్కృత గ్రంథములనుండి గ్రహింపబడినవై యుండుగాక! కొన్ని ఘట్టములయం దేకాళిదాసు రచనలో భాషాంతరీకరింపఁబడి యుండుగాక! ఎట్లయినను హరవిలాసమనునది నైషధాదులవలెనే యొక సంస్కృత గ్రంథము

యొక్క యాంధ్రీకరణముకాదు. ఆయా గ్రంథములందును, వ్యవహారము నందును ప్రసిద్ధములై యున్న శివుని కథలను గొన్నింటి నేర్చితెచ్చి హారవిలాస మను పేర గుదిగుచ్చి నాఁడీతఁడు. ఇందలి కథలకు పరస్పర సంబంధము అనుక్రమణిక మొదలగునవి లేకపోవుగాక! కథలన్నియు శివునిగూర్చినవగుటయే యిందలి విశేషము! శివుడే ఈకథల కంతటి కేకత్వము సమకూర్చినాఁడనవల యును. ఏమైనను శ్రీనాథుని యీ రచన ఆంధ్రవాఙ్మయ చరిత్రమున నూతన యుగమును ప్రారంభించిన దనవచ్చును......స్వతంత్ర రచనకు నూతనమగు నీయూత దొరకగనే యాంధ్రకవులు భాషాంతరీకరణ పద్ధతిని వదలివేసి పురాణములనుండి తమకభిమానపాత్రము లగు కథలను గొన్నిటిని గ్రహించి వానినిఁ దమ స్వీయకల్పనలతోఁ బెంచి యేదోవిధమున గుదిగ్రుచ్చుట మొద లిడిరి. శ్రీనాథుఁడు చూపిన త్రోవనేపోయి కృష్ణదేవరాయ లాంధ్ర ప్రబంధ నిర్మాణమునకు శంకుస్థాపనము జేసినాఁడు.[1]

శృంగార వీరరసముల స్వరూపములను సాక్షాత్కరింపఁజేసికొని కావ్య మున ప్రవచించిన మహాకవులలో శ్రీనాథుఁ డొకఁడు. శ్రీనాథుని హారవిలా సమున నేడాశ్వాసములు గలవు. ప్రథమ ద్వితీయాశ్వాసములలో చిఱుతొండ నంబి చరిత్రము, తృతీయాశ్వాసమున మదనదాహగాథయు, చతుర్థాశ్వాసమున గౌరీకళ్యాణమును, పంచమాశ్వాసమున దారువనవిహారమును షష్ఠాశ్వాసమున సముద్రమథన గాథయు, సప్తమాశ్వాసమున కిరాతార్జునీయ గాథయు వర్ణి తములైనవి. వీనిలో చిఱుతొండ నంబియందు భక్తివీరము, సముద్ర మథన మందు శివుని దయావీరము, కిరాతార్జునీయమున నర్జునాశ్రిత తపోయుద్ధ వీరము స్ఫురించును.

విలాసకావ్యములలో సామాన్యముగా దైవలీలలు వర్ణింపవలసి వచ్చి నప్పుడు - అయాకథలందు దైవానుగ్రహమునకుగాని దైవాగ్రహమునకుగాని పాత్రుడైనవాఁడే నాయకుఁడుగా నభివర్ణింపబడుట గాంచుచుందుము. చిఱు తొండడు, అర్జునుఁడు దీనికుదాహరణము.

అట్లుగాక దైవమే నాయకుఁడుగానుండు గాథలుగూడ కానవచ్చు చున్నవి. ఉదా: గౌరీకళ్యాణము, దారువన విహారము, క్షీరసాగర మథనము అను గాథలందు నాయకుఁడీశ్వరుఁడే! కావున రెండువిధములగు కథా కథన విధానములను శ్రీనాథుఁడిందు జోడుచేసి కూర్చినాఁడు. ఏకథను విమర్శించు

1. విష్ణు మాయానాటక పీఠిక - పుట xvii, xviii (మ. యూ. ప్రచు)

నప్పుడా కథానాయకాశ్రయరసమును ప్రధానముగా నెంచవలసియుండును. మొత్తమున కన్నిగాథలును శివుని మాహాత్మ్యమును ముఖ్యప్రతిపాద్య వస్తువుగా గలవియై దానినే వ్యంగ్యముగా బోధించుచుండును.

**చిరుతొండనంబి కథ :**

చిఱుతొండ నంబి పరమ వీరమాహేశ్వరవ్రతుఁడు, నిరతాన్నదాత, మహాభక్తుఁడు. అతనిని వాసమగు కంచినగర మొకసారి ఇరువదియొక్క రోజులు పెనుతుపానునకు గురియయ్యెను. లోకమంతయు భీభత్సమగుచుండ నాతఁడు మాత్రము తన యన్నదానవ్రతము మానఁడయ్యెను.

"ఆ మున్నేడు దినంబులందు శివభక్త్యాచార సంపత్తికిన్
సీమాభూమియనం బ్రసిద్ధుఁడగు నా చిర్తొండ నంబీశ్వరుం
డేమీ కొంకక పెట్టు జంగములకున్ హేరాల మిష్టాన్నముల్
నేమం బొప్పఁగ రేలునుం బగళులున్ విశ్వాస పూర్వంబుగన్."

"వంట చెఱకులు లేకున్న ప్రాముఱైన వస్త్రములు తైలమునఁదోచి వహ్నిఁగూర్చి
వంటకంబులు వండి యవ్వారిగాఁగఁ బెట్టు శివభక్తతతికి నంబిప్రభుండు."
ద్వి. 29, 31.

ఇందాతని వ్రతనిష్ఠ, ధృతి, ఉత్సాహము, శైవభక్తి, త్యాగము, కష్టసహిష్ణుత, శిష్టాచార సంపత్తి, సత్కార్యానురక్తి, స్పష్టపడుచున్నవి. అతిథులేనాఁడు తన ముంగిట మసలరో ఆనాఁడాతనికి సంకటమే. ఒకనాఁడు పరీక్షార్థము శివుఁడు ఎట్టిజంగముని నాతని యింటికి రాకుండఁజేసెను. ఆనాఁడాతఁడు పడిన యారాట మింతంతకాదు.

"భ్రమసి తప్పిన పసరంబు నెమకినట్లు బెరసి చేఁదప్పి పడ్డ సొమ్మరసినట్లు
పురములో వాడవాడలఁ దిరుగఁ జొచ్చె జంగమాన్వేషణార్థియై శైవవరుఁడు.

"వచ్చిన వాడక వచ్చుం జొచ్చిన వాకిలియ చొచ్చుఁ జూచినచోటే
యచ్చుగఁ గ్రమ్మఱఁ జూచుం బచ్చు శివార్చనకు శంభుభక్తుల వెదకన్."
—ద్వి. 45, 46.

శివభక్తుల నన్నదానముతో సేవింప నాతఁడు పడు నాత్రము, ఎవ్వ రతిథులు గానఁ బడనిచో ప్రదర్శించు నుత్కంఠ, తొట్రుపాటు, ఆవేదన, అన్వేషణ, శ్రద్ధ, ఓపిక, భక్తి మొ. గుణము లమోఘములు. ఉపమాలంకార మిచ్చట సంతరించిన వ్యంగ్యసౌందర్యము సహృదయవేద్యము.

భక్తవశంకరుఁడగు శంకరుఁడు కపట జంగమవేషమున సాక్షాత్కరించి అమానుషమైన కోరిక కోరును.

"రోగశంకా విహీనుండు రూపసియును
వాని తల్లియుఁ దండ్రియు వడుగు సేసి
పాక మొనరించి వడ్డింప భవున కొసగి
కుడుతు నాబంతి నిలుచేఁడుఁ గొడుకుఁ గుడువ!

అని యడిగినను ఆ అచంల భక్తివీరుఁడు, ధీరుఁడు—

"భక్తుఁ డే వ్రతంబు పట్టెనావ్రతము పారంబుఁ బొందఁ జేయు వ్రతము నాది
యీ వ్రతంబు నాకు నెప్పుడొడం గూడ దప్పుడ తిరుబాస యనఘచరిత.
—ద్వి. 54, 56.

అని యపూర్వ ప్రతిజ్ఞ నొనర్చినాఁడు. ఇందాతఁడు ప్రకటించిన ధృత్యుత్సాహ త్యాగాములు దానోత్సాహమును పోషించుచుండ నది భక్తి కంగమగుటచే భక్తివీరముగా రూపొందుచున్నది.

ఇతని కుమారుఁడగు సిరియాళుఁడు తండ్రినిమించిన దిట్ట! శివుఁడు కపటజంగమవేషధారియై చిఱుతొండని కఠిన ప్రతిజ్ఞను పాఠశాలలో సిరియాళు నకు విన్పించి తల్లిదండ్రుల నిర్దాక్షిణ్యము నుపన్యసించెను. సిరియాళుఁ డాతని వారించి "పరార్థమై తనూధనము వ్యయింపఁగల్గుట కదా జననైకఫలం బెరింగి నన్" అని—

"ఎఱుక చాలని వాఁడందమే దధీచి నల్ప బుద్ధులె మేఘవాహనుఁడు శిబియు
ధర 'పరోపకారార్థ మిదం శరీర' మనెడు వాక్యంబు వినవె సంయమివరేణ్య!"
ద్వి. 79.

అని సమాధానము చెప్పి అభవునకు భవసార్థక్యము నిరూపించి చెప్పినాఁడు! జ్ఞానవృద్ధుడనిపించుకొనినాఁడు! తనకై దుఃఖించు తల్లిదండ్రుల యెదుట :

"సంసారభ్రమ మించుకేనియును మత్స్వాంతంబునన్ లేదు మీ
వంశంబీ పరిపాటిదే యుడుగుఁడీ వైక్లబ్య సంభావనల్
మాంసాహారము లయ్యెదన్ శివునకున్ మాయా మహాయోగికిన్
హింసాక్లేశము మానుఁడీ గురులు మీరే మిమ్ముఁ బ్రార్థించెదన్." —ద్వి. 81.

అని యుపన్యసించెను : గురులకు నీతులు సెప్పెడి పండిన బుద్ధి యాతనిది. సంసార విషయ వైముఖ్యముచే శమ మాతనియందు భక్తి కంగముగా గోచ

రించుచున్నది. శివునికి మాంసాహారమగు నాతఁడు చూపించు త్యాగవీరము భక్తికి మూలముగా నున్నది. అది జ్ఞానముతో ప్రకాశితమైనది. వీరమాహేశ్వర వ్రత నిష్ఠాపరుఁడైన తండ్రియొక్క భక్తి వీరమున కగ్ని కింధనమువలె నది ప్రజ్వలన హేతుభూత మగుచున్నది.

చిఱుతొండని భక్తి స్వార్థరహిత విశ్వకళ్యాణ రూపమైనది. పరమేశ్వరుఁడే సాక్షాత్కరించి కైవల్యము తనకిత్తునని కటాక్షింప కంచిలోని యేడు వాడల వారికిని మోక్షమీయ వేడిన విశాల హృదయుఁడాతఁడు. అతనియందుఁ బుట్టి యుత్కటమగు భక్త్యుత్సాహము సుక్షేత్రస్థాపిత రసాలభూరుహము.

**కిరాతార్జునీయము కథ :**

అర్జునుఁడు పాశుపతాస్త్రలాభము నుద్దేశించి ఇంద్రునిగూర్చి యొనర్చెడి తపమును వర్ణించుచు కవి తానే దానిని విమర్శించి చెప్పెను.

> "పతయాళు నిర్ఝరాంభః ప్రవాహంబుల నఘమర్షణస్నాన మాచరించుఁ
> గొండగోగుంబూల గుండవర్ధనముల నర్చించు శశలాంఛనార్ధమౌళి
> సట్ఫికాక్షమాలికా పాణిప్రవాళుఁడై జంభారి మంత్రంబు జపముచేయు
> నొంటికాల జపంబు నూర్ధ్వంబుగాఁ జూచి తడవుగా నిలుచుండి తపమొనర్చు
> శరభశార్దూల సింహాది సత్త్వచయము కెరలి తనమీఁద బిట్టు లంఘించినపుఁడు
> కడిమిఁ జెండాడు భుజదండ గాండివోగ్ర చండతరశాత నిర్ఘాత కాండవితతి."
>
> —సప్త. 9.

కథానుగుణముగాఁ బాత్రౌచిత్యమును పాటించుచు జేసిన వర్ణన మిది. అర్జునుఁడు క్షత్రియుఁడు, రణపండితుఁడు. యుద్ధము, పరాక్రమము వెన్నతో వచ్చిన విద్యలతనికి. ప్రస్తుతము పాశుపతాస్త్ర సంపాదనకై తపశ్చర్యలఁ బూనినాఁడు. కార్యసాధన కిప్పుఁడు శాంతమవసరము. అదియే చిత్తవృత్తిని ప్రధానముగా శాసించుచున్నది. కాని అస్త్రలాభము వీరునిపట్ల యోగ్యము. గాండీవము త్రుప్పుపట్టినచో తూపులుతొడుగు నేర్పు మందగించును అందువలననే అర్జునుఁడు శరభశార్దూలాదులను వేటాడుట ! ఇది ముందు కిరాతునితో జరుగబోవు యుద్ధమునకు నాందివలె నుండునుగూడ ! ఈ ఘట్టమున శాంతము ప్రధానమగుచు తపోవీర మందు కంగమగుచున్నది. శ్రీనాథుఁడే యీ విషయము వ్యాఖ్యానించినాఁడు.

> "వీరరసగర్భితంబయ్యు విస్తరిల్లె శాంతరసమెంతయును సవ్యసాచియందు
> మలయశైల నితంబ మండలమునందు సర్పవేష్టిత చందనక్ష్మాజమట్లు !

దృష్టాంతమున చందనవృక్షము సర్పవేష్టితమగుట వీరరసస్ఫూర్తికిని తత్ సహజసౌగంధ్య శీతలత్వములు శాంతమునకును రసస్ఫూర్తి కనువగునట్లు అలంకారము నలంకరించినాఁడు కవి.

ఇంద్ర ప్రేరితుఁడై శివునిగూర్చి తప మొనర్చునపుఁడు తపోవీరమున కంగముగా శాంతము నిలిచినది. అతఁడు తపోవీరుఁడు.

"తండ్రి చెప్పిన మాటతాఁ దప్పునాక యాదరించి ధనంజయుం డభవుకూర్చి
యింద్రకీలాచలంబుపై నేకనిష్ఠ ధీరుఁ డొనరించె నతిఘోర వీరతపము!
సప్త. 28.

నాయకాశ్రయమైనది "ఘోరవీరతప మని" సూచించినాఁడు కవి. దీనికి మాయాకిరాతునితోడి యుద్ధమంగము. (చూడు. సప్త. 29-36, 50-92) తపోవీర ఫలమే పాశుపతాస్త్రము.

ఇఁక శివుఁడే నాయకుఁడుగా నున్న గాథలలో క్షీరసాగరమథన ఘట్టమున లోకక్షయ హేతువగు హాలాహలమును మ్రింగి లోకముల రక్షించెడి దయావీరము ప్రదర్శించినాడు పరమేశ్వరుఁడు. దానికి రౌద్రాదులంగములు. క్షీరసాగరమథనములో హరిహరుల పాత్రలు సమానమగు ప్రాముఖ్యమును పొందియున్నవి. మందరనగ ముద్ధరించుటయందు కవ్వపుకుదురగు తాబేటి రూపునంది నిలుచునపుడు, కులవిరోధము మాన్పునపుడు విష్ణువునందును బల దయా వీరాదులు గోచరించును. ఒకవిధముగా నీ గాథ హరిహరాభేద నిరూపణ ప్రధానమనియుఁ దెల్పవచ్చును! పార్వతీకళ్యాణము శృంగారప్రధానము. అందు పార్వతి తపస్సు తపోవీరమనిపించుకొనును. దారుకావన విహారము నందలిది శృంగారాభాస.

## 4. కథాకావ్యములు

### ౧. దశకుమారచరిత్ర - మూలఘటిక కేతన :

తెలుఁగు సాహిత్యమున వెలసిన కథాకావ్యముల కాదియైనది కేతన విరచిత దశకుమార చరిత్రము. "ఆంధ్రులకు నన్నయ పురాణాభిరుచిని గల్గింపఁగ, నన్నెచోడుఁడు ప్రబంధరుచులను చవిచూపఁగ, కేతనకవి చిత్రకథాభిమానమును రేకెత్తించినాఁడు. సామాన్యముగ ప్రతి మానవునందు బాల్యము నుండి విచిత్రకథాశ్రవణమందు కుతూహల ముండునుగదా! అదియే పరిణతిఁ జెంది ప్రౌఢవయస్సున పద్యరూపమున కేతనచే ప్రతిపాదింపఁబడినది. ఈ

కాలముననే కవి భల్లటుఁడు భేతాళపంచవింశతిని, భాస్కరుని కేతన కాదంబరిని గూడ చంపూరూపమున నాంధ్రీకరించినారఁట! కాని దైవవశమున నవియిపుడు మనకు కానరావు. ఈ కాలమున కథాభిరుచి జనులందును, సారస్వతలోకము నందును విశేషముగ నున్నదని మంచన రచించిన కేయూరబాహు చరిత్రమునఁ బ్రవేశపెట్టిన వివిధ కథలనుండి కూడ నూహింపనగును. ఈ పద్యకథా రచనలే మధ్యకాలమున జక్కన విక్రమార్క చరిత్రమును, కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశతియు, అనంతుఁడు భోజరాజీయము, నారాయణకవి వెంకటనాథ కవులు పంచతంత్రాదులునుఁ దర్వాత అయ్యలరాజు నారాయణకవి హంస వింశతిని, కదరీపతి శుకసప్తతిని మఱియు పింగళి యెల్లన షోడశకుమార చరిత్రను, వెన్నెలకంటి అన్నయకవి షోడశరాజచరిత్రమును, మల్లారెడ్డి షట్చక్ర వర్తి చరిత్ర మొదలైనవానిని వ్రాయుటకుఁగూడ మార్గదర్శకములైనవి.[1]

కథాకావ్య సామాన్యలక్షణము లివి : 1. ఇవి వస్తు ప్రధానములైన కావ్యములు, 2. పెక్కుఱు నాయకులయొక్క చరితములు కథలుగా, గాథ లుగా నొకచోట గుదిగుచ్చిపెట్టుట యిందుఁ గాననగును. 3. కథలన్నియు నొకే రసమునుగాని, ఒకే నీతినిగాని, ఒకే తత్త్వమునుగాని, ప్రతిపాదింపవల సిన అవసరములేదు. కాని కవిప్రతిభచే నట్టి సమన్వయము నొక్కొకచోఁ బ్రదర్శింపఁబడవచ్చును. ఇట్లనుటలో వస్త్వైక్యముండదని భావింపరాదు. 4. రసవిమర్శ కిచ్చట కథయే ప్రమాణము. ప్రతికథయందు నొక్కొక యంగి రసము,కొన్నియంగములునుండవచ్చును. 5. సామాన్యముగా నీకావ్యములందలి పాత్రచిత్రణము గాని, ఉక్తివైచిత్రిగాని, సన్నివేశకల్పనముగాని కథావేగము నతిశయింపజేయ సమర్థములైనంతగా రసపోషణకుగావు. అనఁగా నీ కావ్యము లందు రసము గుణీభూతమని తాత్పర్యము. 6. కథలు సామాన్యముగా మాన వాతీతములగు కార్యసంఘటన కాలవాలములయి అద్భుతావహములయి యుండును. నాయకులు చాలవఱకిందర్థకామపురుషార్థ ప్రధానులు మాత్రమే. ధర్మసాధనము వారికి ఆనుషంగికము. అధర్మప్రవృత్తికి కొన్ని యెడల వారు వెనుదీయరు. వీరమున ధర్మబద్ధమదు కార్యోత్సాహము మాత్రమే గ్రాహ్యము. 8. పాత్రలు బహుసంఖ్యాకములగుటచే వాని క్రమవికాస పరిణత్యాదులు సామాన్యముగా గోచరింపవు. అందువలన విభావాదులు విపులముగా వర్ణితము కాకపోవచ్చును. 9. ఆలంకారిక వ్యంగ్యరచనము లిందు విశిష్టముగా గోచ

1. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము-శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు. షష్ఠ. ప్ర. పు. 461

రింపవు. అలంకారధ్వని రసధ్వనిగాఁ బర్యవసించుట యితర కావ్యములం దున్నంత వీనియందు గానరాదు.

ఇట్టి వస్తుకావ్యములకు తెలుఁగున దశకుమార చరిత్ర మార్గదర్శకము. పదిమంది వీరులు సాధించిన విజయములు తెల్పుగాథ ఈ కావ్యేతివృత్తము. వీరులందరిలో వసుమతీరాజహంసుల కుమారుఁడగు రాజవాహనుఁడు తారకలలో చంద్రునివలె శోభిల్లుచుండును. కేతన "చెప్పం బూనిన కథానికాయం బను (సుర) లతాజాలం బెట్టిదనినఁ దదీయ కందంబైన కుసుమపురంబున కధీశ్వరుండైన రాజహంస మహీవల్లభు వృత్తాంతంబును రాజవాహన ప్రముఖ దశకుమార జననక్రమంబును దివ్యవాగుపదేశ క్రమంబున వారలు దిగ్విజయార్థం బరుగుటయు వింధ్యాటవీ మధ్యంబున మాతంగకుండను సాధకునకుఁ గ్రియా సహాయత్వంబు ననుష్ఠింపంబూని రాజవాహనుండు చెలుల వంచించినటయుఁ దదన్వేషణార్థంబుగాఁ దక్కిన కుమారులు దిక్కులను బెక్కు ముఖంబులం బోవుటయు, దైవయోగంబున బిలంబు సాధించి వెలువడి వచ్చి పుష్పోద్భవ సోమదత్తుల గలిసి, రాజవాహనుం డుజ్జయినీ పురంబునకుం బోయి తత్పతియైన దర్పసారుని చెలియలి నవంతిసుందరియను కాంతారత్నంబుం గపటోపాయంబునం బరిణయంబగుటయుఁ గొండొక కాలంబునకుఁ జంపానగరంబునం గుమారులెల్లం గూడుటయుఁ దొలుతఁగూడిన యిరువుర చరితంబులు రాజవాహను వలన నెఱింగి తక్కిన కుమారులుం దమతమ చరితంబులు క్రమంబున నతనికి విన్నవించుటయు బదంపడి శాత్రవజయం బొనగ్చి రాజహంసుచేత రాజవాహనుం డభిషిక్తుం డగుటయు నతండు సముద్రముద్రితంబైన వసుధా చక్రంబు నిర్వక్రంబుగాఁ బాలించి, మిత్రగణసమేతంబుగా రాజ్యసుఖంబు లనుభవించుటయునై యొప్పును." (దశకు. చరిత్ర. ద్వి. 2)

దశకుమార చరిత్ర లన్నియు విస్మయావహములే. కొన్నిచోట్ల కవియే ఈ విషయమును సూచించియుండుట గాంచుచుందుము.

> "సవినయమున వారడుగఁగ నవనీనాయకుఁడు చెప్పె నాశ్చర్యకరం
> బవు తన చరితము పుష్పోద్భవు వృత్తాంతంబు సోమదత్తుని కథయున్."
>
> చతు. 126.

> "అని చెప్పిన విని విస్మయమును బ్రీతియుఁ దనదు చిత్తమున బెనఁగొనన
> మ్మనుజేంద్రుఁడు అతని సంభావనమున లజ్జావనమ్రవదనుం జేసెన్."
>
> షష్ఠా. 192.

అపహారవర్మ :

"అదటనా సమస్త విషయంబుల వారును వచ్చి నన్ను నా
ప్లోదము నద్భుతంబు హృదయంబుల నెక్కినఁ జూచి రేర్పడన్."—స ప్త. 156.

"వ. అనవుడుం బ్రియంబంది యతని యాపత్సహిష్ణుతయును, ఆశ్చర్యకర మనోరథలాభంబు సంభావించి." దశ. 191.

"వృత్తాంతంబంతయుఁ జెప్పితిన్ జనము లత్యాశ్చర్యమున్ బొందగన్."
దశ. 189.

వీరరస స్ఫూర్తి కావ్యమున నెడనెడ గోచరించుచున్నది. స్థాలీపులాక న్యాయమునఁ బేర్కొందును.

"తుది నే నిన్ను వివాహమయ్యెద మదాంధుం గ్రూరకర్మోన్ముఖుం
బ్రిదులం బోవఁగనీక చంపుటయ నా బీరంబు ధర్మంబు ని
ట్టిద కార్యస్థితి నిత్తెరంగునన నీ డెందంబునుంగన్న స
మ్మద పాత్రంబగు నంబుజాక్షి! యనియే మానంబు మానించితిన్."
—తృతీ. 75.

బాలచంద్రికను దారువర్మ బారినుండి తప్పించుటకయి పూనిన పుష్పోద్భవుని ఈ పల్కులందు దయాధర్మోత్సాహమును, లాటాధిపతియగు మత్తపాలునితో మానపాలునికి బాసటగా నిలిచి పోరిన సోమదత్తుని యందు :

"ఘపున బోరు సేనలకు నెల్లను మీఱి సముల్లసద్భుజా
టోపముమై నరాతులఁ బటు ప్రదరంబులఁ దూలదోలి యా
భూపతి యగ్గమైన రథమున్ రథమున్ గడియించి లంఘన
ప్రాపిత తద్రథుండనయి పట్టి వడిందెగఁ జూచి యార్చినన్."

అను వర్ణనలో స్ఫురించు రణవీరమును,

"వగవ మనుష్యమాత్రమున వారికి దుష్కరమైన యట్టి యా
మగతన మెవ్వ డిప్పుడు సమస్తజనస్తుతి కారణంబుగా
విగత భయాత్ముడై నెరపె వేగమె వాఁడిట యేగుదెంచి వే
మొగపడునేని నియ్యెడ సమృద్ధతిఁ గైకొని కాతు నాతనిన్."

అనెడి రాజవాహనుని పల్కులలో దయావీరమును,

"ధనమిత్రు గుణములా వనితచేఁ జెవులార వినివాని గనుగొను వేడ్కఁదగిలి
మును వసుపాలితు ధనము వెడ్డున గొన్నతరుణి మేడ్పెట్టెడు వెఱవుగొఱలి
ప్రాభవంబు నవర్థపతి యన్యభామిని నడిగిన వాని త్రుళ్ళడఁపఁ దలచి
కోరిక తుదముట్ట నీరజాననఁ దగు మగనితో నొడఁగూర్చి మనుపఁజూచి

వెఱవ వలవదు నీవని వెలది మనము భీతియంతయుఁ బెడబాపి ప్రియునికడకు
నడవ బనిచి పైచీరనత్తొడవులెల్ల ముడిచి "తానును" తోడన నడచునపుడు."
—పంచ. 88.

అతఁడు ప్రకటించిన దయావీరము,

"మానవుఁడైన నమర్త్యుం డైనను గంధర్వుఁడైన యక్షుండైనన్
మానిని! ఈ రూపంబున వానిం గొనివత్తు నీకు వలలేర్పడగన్."
—షష్ఠా. 178.

అనుటలో బలవీరమును,

"........మృదు మార్గంబున నీవు సహాయంబుగాగ నిర్జించెద నే
నీ వికటవర్మ నేలెద భూవలయం బస్మదీయ బుద్ధిబలమునన్" —సప్త. 32.

"రాజుచందంబు నంతఃపురంబు విధము నీ యెఱింగిన తెఱగెల్ల నెలత! నాకుఁ
దెలియజెప్పుము కార్యంబు దెగువఁగాంచి నిర్వహించెదనెంతయు నేర్పుమెఱయ"
—సప్త. 39.

అను ఉపహారవర్మయొక్క యుత్సాహోక్తులలో దయాబల వీరములును స్ఫురించుచున్నవి. కథా సందర్భములఁబట్టియు, రచనా విధానము బట్టియు, నుత్కట భావప్రకటనము ప్రస్ఫుటముగా నిందులేక పోయినను నీ కావ్యములో నిట్టివే మేలుబంతులు, ఎన్నిచోట్లనో వీరరసస్ఫూర్తి కవకాశమున్నను అచ్చట విభావాదులను కవి సమర్థముగా వర్ణింపక పోవుటచేతను, కథ చెప్పుటయే ప్రధాన లక్ష్యమైనట్లు వేగముగా రచన సాగించుటచేతను, ఈ సంగ్రహ రచనమునందు యే రసము రాణింపలేకపోయినది. తెలుఁగు కవులకు ప్రీతిపాత్రమగు శృంగార రసమునుగూడ ఎడనెడ నీతడు పోషింపక వదులుటయే దీనిని సమర్థించుచున్నది.

దీనికి తోడిందలి వీరులు ధర్మపురుషార్థ సాధకులు కారు. కామార్థ ప్రధాన ప్రవృత్తులు. తత్సాధనలో నెచ్చటనైన ధర్మ మంగముగా నిల్పి వారి దయాదిగుణములను ప్రకాశింపఁ జేయుచుండును. వస్తు వ్యంగ్యము నాశ్రయించి మిత్రస్నేహము వీరి యందుత్కటముగా గోచరింపఁగలదు. అద్భుత కథాశ్రవణోత్సుకుల కీ కావ్య ముపాసన యోగ్యమగుచున్నది.

## 5. 'వంశకీర్తన' కావ్యములు

### ౧. హరివంశము — ఎఱ్ఱాప్రగడ :

ప్రబంధపరమేశ్వరునిచే రచింపబడిన 'హరివంశము' వంశకీర్తన కావ్యములలో నగ్రగణ్యము. దీనికన్ని విధముల సరితూగి విశిష్టగౌరవము నందు

చున్నది. నాచనసోముని ఉత్తర హరివంశ కథాకావ్యము. విపులవర్ణనాత్మకములకు ప్రబంధబీజములు మొలకెత్తుటకు దోహదకారులయి వీరిరువురు దాదాపొక శతాబ్దముననే నివసించి హరివంశ కావ్యనిర్మాణమున నెవరికివారుగా గృషిచేసియుండిరి. ఎఱ్ఱనగారి హరివంశ రచనము పురాణపురంధ్రినూత్నమగు ప్రబంధాలంకారముల నలవరచుకొనుచున్నట్లును, నాచనసోముని రచనము నవోఢసహజ సౌందర్యమునకు వన్నెదెచ్చు ప్రబంధ సౌందర్యమును వెలార్చుచున్నట్లను గోచరించును ఒకటి శరత్కాల గంభీర నిర్మలతరంగిణి; మఱియొకటి నవజీవన చైతన్య స్రవంతి.

"నన్నయ అదిపర్వమున హరివంశ భవిష్యత్పర్వంబులతోఁ గలిపి మహాభారతమున నూఱు పర్వములు కలవని లెక్కించెను. ఎఱ్ఱయ తదనుగుణముగనే రెండుపర్వములకు బదులుగా హరివంశము పూర్వభాగమనియు ఉత్తర భాగమనియు విభజించెను."[1]

హరివంశము మూలానుసారిగా ననువదింపబడిన గ్రంథము. పూర్వభాగమున నాదిసృష్టిక్రమము, పృథు చక్రవర్తి చరిత్రము, కౌశికపుత్త్రుల గాథ, వైవస్వతమనవున కిక్ష్వాకాదులు జన్మించుట, కువలయాశ్వుని రాక్షస సంహారము, త్రిశంకు చరిత్రము మొదలగు నంశముల ప్రధానముగా విష్ణువంశ కథనము తెలుపఁబడ, తన్మూలమగు చంద్రవంశక్రమము వర్ణితమైనది. తారాచంద్రులకు బుధుఁ డుదయించుటతో మొదలిడి రజి, యయాతి, తుర్వసుఁడు, యదువు మొదలగు వారి చరిత్రలతో సాగిన చంద్రవంశక్రమము బేర్కొని, అంధకవంశక్రమము నుడివి, వరాహనృసింహ వామన పరశురామ రామావతార వృత్తాంతములను పరామర్శించి శ్రీకృష్ణావతార ఘట్టమువఱకు కవి సంగ్రహమైన రచనము సేయుచు కథాకథన ప్రధానముగా కావ్యనిర్మాణ మొనర్చెను.

ఎఱ్ఱన శ్రీకృష్ణావతార గాథను విపులముగా వర్ణించి పెంచెను. దాదాపు ఉత్తర భాగాంతము వఱకీయవతారలీలావర్ణనమే చేయఁబడినది. అందు ప్రధానముగా వీరరసాలంబనములైన గాథ లధికముగా నున్నను కొన్ని యద్భుతావహములగునవి కూడ కానఁబడుచున్నవి. దివ్యాదివ్యులగు నాయకుల చరిత్రములందిట్టి రసపోషణమే సామాన్యముగా జరుగుచుండును.

శ్రీకృష్ణునియందు విరివిగా యుద్ధవీరము వర్ణితమైనది. ఆ వీరము స్థూలముగా రెండుశాఖలుగా నిందు ప్రపంచితమైనది. అవి: 1. తమోగుణ

1. హరివంశము, పీఠిక. పుట XXV శ్రీ వేలూరి శివరామశాస్త్రి శతావధాని.

ప్రధానులగు వీరులతోడి యుద్ధములు, 2. సత్వరజోగుణ ప్రధానులగు వీరుల తోడి యుద్ధములు, వానియందలి విజయోత్సాహములు. కృష్ణుఁడు సత్త్వగుణ ప్రధానుఁడు. అతనికి ప్రత్యర్థులు రాక్షసులు, క్రూరులగు క్షత్రియులు. శత్రు భావము నతనియందు పచరించు భక్తులు, తపోగరిష్ఠులు, వరసంపన్నులు మొద లగువారు. అందు రాక్షసులు పశ్వాదికామరూపముల ధరించి మాయాయుద్ధ మొనర్ప కృష్ణుఁడు వారిని వధించిన తీరు - పాశవిక తమోగుణమును సత్త్వ గుణము నిర్జించిన తత్త్వమును వర్ణించుచున్నది. రజోగుణ ప్రధానులైన యితర ప్రతినాయకులను సత్త్వైక ప్రాధాన్యముతో సంహరించుటయందు రజోగుణముపై సాత్త్వికము సాధించిన విజయము ధ్వనించుచున్నది. ధర్మ బద్ధములు కాని అర్థకామములను ధర్మము శాసించి వానిని ధర్మబద్ధముచేయు కృషియే నాతని నాశ్రయించిన వీరరసప్రయోజనమని భావింపవచ్చును.

రాక్షసులతోడి శ్రీకృష్ణుని యుద్ధములు : ఉదాహరణమునకుఁ గొన్ని పేర్కొందును. ఒకసారి విషమయమగు కపిత్థ వృక్షరూపమునన్న కాలకలి యను రాక్షసుని— గోపాలురకు తీవ్రరోగములఁ గల్పించినవానిని— సంహరించి గోకులమును శ్రీకృష్ణ, బలరాములు రక్షించిరి. బలరాముఁడు శ్రీకృష్ణునకుఅను నాయకుఁడగుచున్నాఁడు.

రాక్షసబాధకుఁ దాళఁజాలక తనను శరణుఁజొచ్చిన బ్రాహ్మణవర్గముఁ గాంచి—

"అంభోధిం బ్రభవించి విశ్వమును సంహారంబు నొందింప సం
రంభోజ్జృంభితమైన యాద్యవిషమున్ రౌద్రప్రభావంబుతో
శంభుం డెట్లుపసంహరించె విషవృక్ష స్ఫూర్తియుం గీర్తి తా
రంభ ప్రౌఢత నట్లయే నుడిపెదన్ రాగిల్లుఁ డీరందఱున్"

—పూర్వ. ఆ ౬, ప. 74.

అని ప్రతిజ్ఞఁచేసెను. త్రిలోకభీకరమైన కాలకూటమును కంఠగతమొనర్చిన రుద్రునివలె తాను విషవృక్షోపసంహృతి నొనర్తు ననుటలో నలంకార వ్యంగ్యము వలన శంభుని జగద్రక్షణోత్సాహము స్ఫురితము. శివోత్సాహక్రమ చర్వణము వలన నాయకునియం దుత్సాహము పరిపుష్టమై రసరూపముఁ దాల్చుచున్నది.

విషవృక్షముఁ గూల్చిన తర్వాత 'నయ్యసుర కొడుకులు గోరూపులగు తల్లులకడనున్న పొగరు కోడెలు వేలసంఖ్యలు చెలంగి నలిరేగి ఖురశృంగవాల దంత ప్రహారణంబులై పొదివినం జెదరి నిలువనేర్వక గోపాలురు పలాయ

నంబు నొందిరి. నందగోపనందనుండు నగుచు వాని నొండొండ యొడిసి, కడ కాళ్ళువట్టి విసిరి యమ్మోని కొమ్ములనె తగిలిచి యొగిల్చియు వాని నిట్టునట్టు దిగిచిపడునట్లుగా వైచియు నొండొంటితో నడిచియు, నేలతో వ్రేసియు, బహుప్రకారంబులగు వధంబుల నిరవశేషంబు గావించె నమ్మాయారూపంబు లాత్మరూపంబులతోన పడియు దానవాకారంబులం కూలంబడియు నన్నేల యంతయు శవసంకీర్ణంబును, రుధిరపూర్ణంబును గావించె నివ్విధంబున'

> "పిశితాశనులని మునుగడు విశదంబుగ నాప్తఘటితి వినియున్కిగ్రియా
> కుశలుఁడు హరి తత్పశుగణ విశసన మఖిలమును వీరవృత్తి నొనర్చెన్."
>
> —పూర్వ. ఆ. ౬, 85, 86

అని ఎట్టన వర్ణించినాడు. శ్రీకృష్ణుడు వృషభకదంబరూప రాక్షసవర్గమును సమదించిన విధమును వచనమున విపులముగ వర్ణించి విభావాదుల పోషణ మొనర్చినాఁడు. ఇచట గమనింపవలసిన విషయ మొకటి: పశుగణము లను చిత విభావములగుటచే తత్కారణజన్యమైన యుత్సాహభావము రసాభాస స్ఫూర్తి గల్గించునా యను సంశయము గల్గవచ్చు నిచట. కవి యీ విషయ మును జాగరూకతగా గమనించియే పశువృషరూపములు రాక్షసకామరూపము లని నిష్కర్ష చేసినాఁడు. కావున పఠితకు వృషాది రూపాతిశాయులైన రాక్షసా కృతు లేతద్వర్ణనమున స్ఫురించి రసహేతువు లగుచుండును. పంచతంత్రాదుల లోని సంజీవక పింగళకులవంటి పాత్రలు వీనికిభిన్నము. వానియం దిట్టి భావ నకు తావులేదు. కామరూప రాక్షసవర్ణనము శ్రవ్యకావ్యములలోనే రక్తికట్ట కలదు. వృషాదులు దృశ్యకావ్యములలో ప్రదర్శన యోగ్యములు కావు. సూచ్యములు కావచ్చును. ఇప్పుడది శ్రవ్యకావ్యశిల్పముననే చేరుచున్నది. మాయావులగు రాక్షసుల కృత్యము లాశ్చర్యదాయకములు. అట్టివారి యొద్ధ త్యము గూఢముగా వర్ణించి, కృష్ణపరాక్రమము విపులముగా వర్ణించి స్వాభా వికతకు పాటుపడుటయేగాక పఠితలకు నాయకాదులయందు తాదాత్మ్యముతో కూడిన రసానుభూతికి నధికావకాశము గల్పించి రసకావ్యరచనారహస్యములఁ బ్రపంచించియున్నాఁ డిచ్చుట శంభుదాసుఁడు.

వీర శృంగారములను విశిష్ట సమ్మేళనమొనర్చి నీళా వివాహమున కవి ప్రదర్శించెను. కాలనేమి పుత్రులేడ్వురు కృష్ణునిపై పగ సాధింపనెంచి నీళా కన్య తండ్రియైన కుంభకునియింట మిధిలా నగరమున వృషభాకారులై పుట్టి పెరిగి మదోన్మత్తులై యుండిరి. శ్రీకృష్ణ బలరాములు కుంభకునియింటి కరు

దెంచిన తరుణమున రోసము నాపుకోనఁజాలక కట్లు త్రెంపుకొని వారా పట్టణమును బీభత్స మొనరింపసాగిరి. అది అసురమాయగా గుర్తించి శ్రీకృష్ణుఁడు వారిని సంహరింప నుత్సహించుచుండెను. కుంభకుఁడు తనను రక్షించి యా పశువుల శాసించువానికిఁ దన కుమార్తె నిత్తునని ప్రతిన యొనర్చెను. అది శ్రీకృష్ణుని మఱియు ప్రేరేచెను.

"అన్నయిుల్లేల సాహసంబనుచు నందగోపుఁడును యశోదయును సంక్షోభ మొందఁ
గుంభకుఁడు మెచ్చఁ దక్కిన గోపకోటి సంశయింప ససంభ్రమోత్సాహలీల."

కృష్ణుఁడు వారిపై విజృంభించెను.

"ఖలులార ! యింతకాలము గలఁచితిరి ధరిత్రిఁ బ్రాణి ఘస్మరులు పశు
చ్ఛలనాచ్ఛన్నవికారులు పొలసితి రిఁక మీకు నెందుఁ బోఁవగవచ్చున్."

"నాపిడికిటి కడిఁది పిడుగు నాపగిదియ డీనఁదగిలి యంతకుడైనన్
రూపు సెడకుండఁ జాలునె యీ పాపాత్మకుల మిమ్ము నేల సహింతున్."

"అని యావిష్కృత తీవ్రముష్టి యగుచున్ హాసోజ్జ్వలాస్యంబునం
గనులుప్పొంగఁ గడంగుఁ నవ్విభుఁ త్రిలోక క్షేమ నిర్వాహకుం
గని పూర్వంబగు వైరబంధమున నుగ్రక్రోధులై ధూర్త గో
దనుజుల్ మార్కొనిరొక్క యుమ్మడిన యుద్యద్గర్జతో నేడ్వురున్.

వ. అట్టి కోల్తలయందు

"పొదివిన నందంద మొదుకని యఱచేత
 వీఁకతో మోరలు వ్రేసి వ్రేసి,
పిఱువోవ నందంద తఱిమి కొమ్ములు పట్టి
 తొడరి నొండొంటిపైఁ ద్రోచి త్రోచి,
చెదరిన నవలీలఁ జెనసి యొక్కొక్కటి
 తెరలఁ దోఁకలపట్టి త్రిప్పి త్రిప్పి,
తిరిగినఁ బోనీక పరిగొని యన్నింటి
 నదరంటఁ బొదిలోన నాఁగి యాఁగి,
ముట్టి గండముల్ వడిఁ గత్తిపెట్టు వెట్టి
వీపులడచియుఁ దోకలు వీఁకఁ దాఁచి
వెన్నుఁ దక్కడి వారికి వెఱఁగుగాఁగఁ
గడిమి నాఁబోతు గమి బెట్టు గలఁచియాడె."

వ. ఇట్లు చూపఱ చూడ్కికి వేడ్కగాఁ గొంత తడవు వినోదించి,

"నీళాలోకనరోచు లాదర సమున్నిద్రంబులై సిగ్గునం
జాలన్ గ్రుక్కుచు నొయ్యనొయ్యఁ దను నాసంజెంది యానంద క
ల్లోలవ్యాహతిఁ దూలఁ దత్కుతుకములుప్పొంగింప నుద్యుక్తుఁడై
యాలోకప్రియుఁ డవ్విరోధులఁ బ్రచండాలోకుఁడై చూచుచున్."

"దిక్కరి హస్తదండ సముదీర్ణభుజుండు ప్రగాఢ ముష్టి నొ
క్కొక్కని మస్తకంబవియ నొక్కొక పోటు గొనంగఁ గన్నులన్
ముక్కున వాతనెత్తురు సముద్ధురమై చెదరంగ నోలితో
నొక్కొకరుండ కూలి రసు లొక్కట పోవఁగఁ గాలనేమిజుల్."

పూర్వ. ఆ. ౬. ప. 159, 161-168.

ఎఱ్ఱాప్రగడ యీ భాగమును గొప్ప శిల్పసౌందర్యముతోడను వీరశృంగార రస విస్ఫూర్తితోడను రచించెను. శ్రీకృష్ణుఁడు రాక్షససంహారమున కుద్యమించుటలో లోకహిత మెంత కారణమో, నీళావనితాకరగ్రహణముగూడ నంతే ముఖ్య మన్నట్లు కథ నడిచినది. తమ ప్రాణములకన్న నధికముగాఁ దనను ప్రేమించు తల్లిదండ్రులు, బలభద్రుఁడు, ఆ పోరునకు విముఖులు. గోపగణము కృష్ణవిజయముపై సంశయము వ్యక్తపరచినది. ఇట్టి పరిస్థితులలో గృష్ణునియందు ధృత్యుత్సాహములు వెల్లివిరియునట్లు ముందుకు దూకించినాఁడు కవి; శత్రువుల నవలీలగా గెల్తుననినట్లు "ఖలులార!...సహింతున్"అని అధిక్షేపపూర్వక వీర వచనములఁ బల్కించినాఁడు. అందు ధృత్యుత్సాహామర్షోగ్రభావములు సంచారులై స్థాయిని పోషించుచున్నవి. 'నాపిడికిలితో నంతకుఁడే రూపుసెడు'మీరనఁగా నెంతయనుమాటలో శత్రుతిరస్కారము, నాయకపరాక్రమౌన్నత్యము ప్రకటిత మగుచున్నవి; అసమ్మోహాధ్యవసాయ పరాక్రమ శక్తి ప్రతాపాదుల స్ఫూర్తిచే విభావపోషణము జరుగుచున్నది. "పిడికిలి" చూపించుట కథయం దాయువు పట్టు, శిల్పవిశేషము. చివఱకు వారు చనిపోవునది దానితోడనే. కృష్ణుఁడు మొదటనే ముష్టిఘాతముతో వారిని జంపియుండవచ్చును. అట్లు చేయుటలేదు. "అక్కడివారికి వెఱఁగుగాఁగఁ గడిమి నాబోతుగమి బెట్టుగలఁచి యాడె"ను, "చూపఱ చూడ్కికి వేడ్కగా" గొండ తడవువినోదించెను. అట్లు వర్ణించుటలో కావ్య ప్రయోజనములు కొన్నిగలవు. 1. నాయకుఁడు మహాబల సమన్వితుఁ డని నిరూపించుటకు శత్రువు నవలీలఁ జంపినట్లు వర్ణింపవచ్చును గాని, పఠితల మనస్సు క్రమ వికాసముఁ జెంది తద్భావ వైపుల్యమును గ్రహించి తాదాత్మ్యముతో రసాస్వాదనము చేయఁజాలరు. కావున విభావాదులను స్పష్టీకరించి, యుద్ధక్రియాది వర్ణనముఁ బెంపుచేసి వ్రాయవలసి వచ్చెను. 2. స్వీయ పరాక్ర

మనస్ఫూర్తి చూపఱకు భయము కొల్పునట్లు వృషభములతో బోరెననుటలో శ్రీకృష్ణునిపైఁగల నవ్యాజ ప్రేమ గౌరవాదులచే నాతనికేదేని యపాయము గల్గునేమో అను శంకతో జనించిన భయమొకటియు, శత్రు భీకరుఁడగు శ్రీకృష్ణుని రణోత్సాహమూర్తినిఁ జూచి కల్గెడి భయమొకటియు, గలిగిన వన్నమాట! ఈరెండు విధములైన భయములు కృష్ణుఁడవలీలగా శత్రువుల నిర్జించుచున్నప్పుఁడు వేడ్కగా మారు నవకాశము గలదు. కావున ప్రేక్షకులకు గల్గు భయము నాయకునిపట్ల సానుభూతిని, ఆదరమును గల్గించి, తద్విజయ సూచనలచే నిచ్చట హర్షముగా మారుచున్నది. అందువలననే నీళాకన్యయొక్క లోచనరుచులు ఆదరసమున్నిద్రములై సిగ్గునఁ జాలస్రుక్కుట; నొయ్యనొయ్యన నతనిఁ నాసఁజెంది ఆనంద కల్లోల వ్యాహతిఁ దూలుట! వీరుని సాహస కృత్యమునకు యువతీ హృదయము ద్రవించుట సహజము. అతనిఁ గూర్చిన భావి స్మృతులలో సిగ్గు, ఆనందము జనించుట స్వాభావికము. నీళయందలి అను భావములు రతిభావమును వ్యక్తము చేయుచున్నవి. ఆభావమే కృష్ణునకాస్పదమై ఉత్సాహ పోషకమై శత్రు సంహారమున కుపక్రమింపఁ జేసినది. నాయక నాయికాశ్రయ శృంగార రసస్ఫూర్తి కల్గించి వీరమునకుఁ దాని నందముగా జేయుట యిందలి మఱియొక ప్రయోజనము. శత్రువుల నాశ్రయించిన ఉగ్ర క్రోధభావము నాయకుని హాసోజ్వలాస్యరుచుల ముందు వెలవెల బోయినది.

వీరాద్భుత రసపోషణము గోవర్ధనోద్ధరణ కాళీయమర్దన ఘట్టములందు గానుపించును. ఇట్లు బలవీరము ధర్మమున కంగముగా సాగిన శ్రీకృష్ణుని రాక్షస సంహార లీలలు లెక్కకుఁ బెక్కులై భావుకుల హృదయరంజనములై రసానుకూలములై వరలుచున్నది.

మహాసత్త్వ సంపన్నులు, భక్తులు, వరప్రభావులునైన శత్రువుల జయించిన చోట్ల శ్రీకృష్ణుని యందు యుద్ధవీరము పుష్కలముగాఁ బోషింపబడినది. భూభారము తగ్గింప దుష్టశిక్షణమే వ్రతముగా జన్మమెత్తిన శ్రీకృష్ణునిజీవితములో నిట్టి సంఘటన లుండుటలో నాశ్చర్యములేదు. అట్టివానిలో జరాసంధ విజయ గాథ విపులముగా హరివంశమున వర్ణితము. దాని నుదాహరణముగాఁ గైకొందును.

జరాసంధుఁడు 'సింధుర వైరి శౌర్యుఁడు, ప్రసిద్ధయశః పథికావృతాష్ట దిక్సింధురవక్త్రుఁడు ఇద్ధరణ కృత్యుఁడు, అరాతిరాజపరిషత్పరిసేవిత బంధనుఁడు, గర్వాంధుఁడు, అవంధ్యరోషకుసుమాన్విత దర్పమహీరుహుఁడు; అతఁడు గర్వరోషదర్పాది గుణములచేతను, అవక్ర పరాక్రమముచేతను, ధీరోద్ధతుఁ

డగు నాయకుఁ డనఁదగుచున్నాఁడు. తన కుమార్తెలును, కంసుభార్యలును అగు అస్తి ప్రాప్తి నామధేయల వైధవ్యదుఃఖమును భరింపఁజాలక కృష్ణుపై నలిగి, భూతల రాజలోకములఁ బ్రోగుచేసి, ఇరువదియొక్క యక్షౌహిణీ సంఖ్యగల సైన్యముతో మధురను ముట్టడించి రాయబార మంపెను. రాయబారితో కృష్ణుని లెక్కసేయని వీరోక్తులఁ గొన్నిటిఁ జెప్పంపెను. అందులోఁ గొన్ని యివి :

"ఎదురై నిల్వఁగ నోపితేని సమరోదీర్ణస్ఫురద్బాహు సం
పద నొప్పారగ నన్నదమ్ముల మిముం బ్రాణంబులం బాపుదుం
బదిలంబేది తొలంగితేని దివియుఞ్ బాతాళమున్ లోనుగాఁ
దుది నీ చొచ్చినచోటఁ జొచ్చి కృతకృత్యున్ చేయుదుఞ్ మృత్యువుఞ్."
—ఉత్తర. భా. ఆ. ౧-11.

శత్రుసాధనలో ప్రతినాయకుని యందు పట్టుదల, పరాక్రమము, శక్తి, ప్రతాపము, మొ॥లగు గుణములుశోభించి విభావపోషణ మొనర్చుచున్నవి. ప్రతి నాయకుని మాటలు విభావములుగా నాయకునియందు వీరముదయించెను. అతఁడును సమాధానముగా :

"తనయల్లుం బొరిగొన్నవాఁడు నిటమీదఞ్ సైతునే యుక్కు నం
దను మర్దింపగ నేనరాఁగడఁగుచోఁ దావచ్చె మేలయ్యెఁ జ
య్యన రానిమ్ము సగర్వ దుర్విషహ బాహాశక్తి మున్ రాక్షసాం
గనచే నం దదుకైన యయ్యొడలు చెక్కల్ వాపెదం గ్రమ్మఱన్."
—ఉత్తర. భా. ఆ. ౧. ప. 15.

అని శత్రువున కేమిటను దీసిపోనట్లు వచించి తనవ్యక్తిత్వము నిలువఁబెట్టుకొనెను. వైరివీరుఁడు కయ్యమునకుఁ గాలుద్రువ్వఁ దా నూరకుండుట ఓడుటకన్న హీనమైనది. కావున నాతని నాతఁడెదిరింప నిశ్చయించెను.

కార్యసాధకుఁడు దేశకాలపాత్రముల నెంచి చరించుచు జీవితమున విజయము సాధించును. అట్లే శ్రీకృష్ణుఁడు జరాసంధునితో పోరుట కది సమయముకాదు, స్థలమునుకాదు అని నిశ్చయించుకొని వింధ్యాది పర్వతదుర్గముల కేగి చిత్రగహనాంతరములందు శత్రువును జిక్కులువెట్టఁ దలంచి-దానిని

"వినుము - విజయంబుగోరెడు మనుజ విభులు
తమకుఁ బ్రతివీరుఁడైన శాత్రవుఁడు దప్పి
చనిన నతనిన కాని తజ్జనులఁ దొడర
నొల్ల రఘలంపుఁ బెనఁకువ యొప్పకునికి." —ఉత్తర. భా. ఆ. ౧. 26.

అను నీత్యుపాయముచే దానిని సమర్థించుకొనెను. అట్లేచేసి పరశురామ సహితముగా బలరామకృష్ణులు గోమంతముఁ జేరి పర్వతదుర్గమున శత్రువు నెదిరించి నిలువబడిరి. జరాసంధుఁ డా పరత్వమును గాల్చెను. బలరామకృష్ణులు పర్వతాగ్రమునుండి శత్రుసేనామధ్యమున సింహకిశోరములవలె దుమికి— దైవదత్తంబు లగు నాయుధప్రకరములచే శత్రుసేనల గూల్చుచుండ వారి యత్యుత్సాహము చూపఱ కత్యాశ్చర్యముఁ గొల్పించినది. బలరాముఁడు :

"చీఁదఱ రేగినట్లు రిపుసేనల నెల్లను ముట్టి రోఁకట
నొ్మదుచు నాఁగటం దిగిచి నొంచుచుఁ గార్ముక ముక్తబాణముల్
పైఁ దొరగించి కూల్చుచును బాదహతి న్నలియంగ ద్రొక్కుచున్
లోఁ దళుకొత్తు వీరరస లోలత మోమలరం జరింపగన్."

"హరియున్ శార్ఙ్గ వినిర్గతాస్త్రహతి నుద్యచ్చక్రపాతంబులం
గరవార ప్రవిదారణంబుల మహా కౌమోదకీ ఘాత ని
ర్భరతం గ్రౌర్యము సూపఁగాఁ గరము సంత్రాసంబునం దూలె మో
హరముల్ రాజసమాజముల్ దిరిగె నత్యంతంబు సంభ్రాంతితోన్."

బలరామకృష్ణుల రణపాండిత్య ప్రకర్ష విభావానుభావముల్ ప్రతినాయకుని కుత్సాహస్ఫూర్తినిఁ గల్పించినవి. విచ్చిపోవు సేననుగాంచి పొంగారు రణోత్సాహముతో జరాసంధుఁ డిట్లనినాఁడు :

"వాహనము నెక్కి కైదువులను మిగులఁ బట్టి మొనతల నెంతయు భయరసంబు
గదిరి వర్తించు నృపులకుఁ గలుగు భ్రూణహత్యఁ బోలు పాపంబని రాదిమునులు"

"ఇంచుక నెమ్మనంబుల సహించి రణంబున నిల్చి నన్ను వీ
క్షించుచు నుండుఁ డేమియును గీడును బొందఁగ నీను, మిమ్ము నీ
క్రించుల యాదవాన్వయులఁ గేలియపోలె ధనుర్విముక్త ని
ర్వంచిత సాయకాగ్ని కనవద్య హవిస్సులు గా నొనర్చెదన్."

—ఉత్తరభా. ఆ ౧. 106-108

ఇందులోఁ బ్రతినాయకుని పునర్విజృంభణము గోచరించుచున్నది. రణ విముఖత్వము పాపహేతు వని ధర్మముఁ బ్రబోధించి, సైనికులకు దానే స్వయముగా విభావమై, తన చేష్టలే వారి కనుభావములై వరలి వారియం దుత్సాహస్ఫూర్తి కల్గునట్లొనర్చినాఁడు. తరువాత పోరు ఘోరమైనది. పెక్కువిధముల శత్రువును కృష్ణ బలరాములు నొప్పించిరి. ఒకసారి గదాఘాతమున జరాసంధుఁడు కృష్ణుని మూర్ఛవోనేసెను. వెంటనే బలరాముఁ డాతని హలాయుధముతో

మోది మూర్ఛఁబడనేసెను. కొంతవడికి జరాసంధుఁడు తేరికొని యొకశక్తిచే బలరాముని మూర్ఛనొందించెను. ఇంతలో జనార్దనుఁడు తేరికొని మఱియొక శక్తిని శత్రువుపై విసరెను. జరాసంధుఁడు మూర్ఛపోయి వెంటనే తెలివొంది పరిఘతో మురరిపుముట్టెను. అతఁడును వాడిబాణ మొకటి నిగుడింప జరాసంధుఁడు ధృతిదప్పి నిలిచెను. ఆపై బలరాముఁడును భద్రగజము ధరణీరుహము చెనఁగవియు చందమున డీకొని శ్రీకృష్ణునితోఁ గలిసి ఘోరయుద్ధ మొనర్చెను. వారి పరాక్రమమున కెదురు నిల్వఁజాలక మాగధుఁడు పరాజితుఁడై పలాయనము చిత్తగించెను; తాను పూర్వము బోధించిన రణనీతికి స్వస్తిచెప్పి రణధర్మ విముఖుఁడయ్యెను. అర్థప్రధానుఁడైన శత్రువీరునందు ఇట్టి రణధర్మ భగ్నమును ప్రదర్శించి కవి ధర్మయుద్ధప్రధానుఁడైన నాయకునందలి వీరమునకు మెఱుఁగులు దిద్దినాఁడు.

ధీరోదాత్త, ధీరోద్ధతులను నాయక ప్రతినాయకులుగా జిత్రించి నాయకుఁడగు జనార్దనునందు రణనీతి శాస్త్రసమ్మతముగాఁ బ్రదర్శించి యుత్తమవీరుని గను, బలరాము నతని కనునాయకునిగను చిత్రించి రసపోషణ మొనర్చినాఁ డెఱ్ఱన. ఇట్టిదే రుక్మిణీదేవిని రాక్షసవిధిని వివాహమాడుటకై నామెను దెచ్చుచు ప్రతివీరులతోఁ జేసిన యుద్ధఘట్టాదులయందు కాననగును. ఇఁక హరివంశోత్తర భాగమున జనమేజయ వంశక్రమమును వివరించు గాథలు, నారసింహ వామనావతార గాథలు మొదలగునవి వర్ణితములైనవి. పోతనగారి కవిత్వమునకు త్రోవలువేసిన ఎఱ్ఱనగారి కవిత్వ మిందు ప్రస్ఫుటముగా గోచరించుచున్నది.

## ౨. ఉత్తర హరివంశము—నాచన సోమఁడు :

నాచన సోముఁడు స్వతంత్రుఁడై సంస్కృత హరివంశమునందు తనకిచ్చవచ్చిన రసవద్గాథలను గైకొని, వానిని దన ప్రతిభాదులచే నపూర్వ కావ్యశిల్ప నిధానములుగా మలఁచి తెలుఁగున నిర్మించినాఁడు. అతఁడు సకల భాషాభూషణ సాహిత్య రసపోషణ, సంవిధాన చక్రవర్తి, సంపూర్ణకీర్తి, నవీనగుణ సనాథ' బిరుదాంచితుఁడు. ఉత్తర హరివంశ మారాశ్వాసముల కావ్యము. ఏకనాయకమైనను తల్లిలలు భిన్నభిన్నములైనవి యిందుఁ బ్రపంచితములగుటచే తత్తద్రస సంవలితమైన వస్తుకావ్యముగా దీనిని గైకొనుచున్నాను. ఇతడు పూర్వ హరివంశము రచించిన ట్లూహింపఁబడుచున్నది. కాని అది ప్రస్తుత మలభ్యము. పూర్వభాగ ముండియుండినచో నీతని కావ్యరచనాప్రణాళిక యింకను విశదమయ్యె

డిది. ఆ యదృష్టము లేదు. పోగా మిగిలిన ఉత్తరహరివంశమైనను మూలక్రమాను
వాదము గాదు అతఁడు వ్రాసికూర్చిన కథలనే ఉత్తర హరివంశమనినాఁడు.
తాను సంవిధాన చక్రవర్తి యని తెల్పుకొనినాఁడు. అతని కావ్య మొకవైపు-
అతని బిరుదము లొకవైపు శోభించుచున్నవి. అగుచో నా 'సంవిధానచక్రవర్తి'
యితివృత్త సంవిధానరహస్య మేమి? ఇది యే కావ్యశాఖకు చెందునది ?

గ్రంథనామమును బట్టి యీ కావ్యము వంశచరిత్ర వర్ణనా కావ్యమని
స్పష్టము. వంశచరిత్ర కావ్యములలోఁ బ్రధానముగా వంశవృక్షముల నా
మూలాగ్రముగా వర్ణించు కథాక్రమమే గోచరించుచున్నది. ఇందట్టి క్రమ
మేదియుఁ గానరాదు. ఇఁక నిది కథాకావ్య మగునా ? పేరును లక్షణములను
బట్టిఁ జూడ పూర్తిగా నదియునుగాదు. ఈ రెంటి తత్త్వములను జీర్ణించుకొని
వెలిసిన మఱియొక నవ్య కావ్యసృష్టి!

వంవకీర్తనమన నొక వంశ చరిత్రమని అర్థము. అది చరిత్ర విషయ ప్రధా
నము; కొన్ని ఇతిహాస సత్యములయొక్క ప్రతిపాదనా రూపము. అతఁడు
వంశకర్త; అతనివంశజులు వీరని వర్ణనాత్మకమైన యొక పట్టిక (Descriptive
Catalouge) వంటి దిట్టి కావ్యము. తద్రచనకు వస్తుదృష్టి, వాచ్యార్థశక్తి,
విషయవివేచనాత్మక మగు విపులీకరణయుక్తి యున్న చాలును. నాచన
సోముఁడు ఈ మూడింటిని మించిన రసదృష్టి, వ్యంగ్యార్థశక్తి, విషయార్థ
నిగూఢనాత్మక భావప్రతిపాదనశక్తి ఈ కావ్యమునఁ బ్రపంచించెను. అందు
వలననే వంశచరిత్రకు మూలహేతువగు నొకానొక నిగూఢసత్యమును
వ్యంగ్యముగా కథాసంధానమున నిరూపించినాఁడు. అది ఎట్టిదన: వంశ
మభివృద్ధి జెందుటకు మూలము సంతానము. దానినిఁ బొందుట ఎంత
అవసరమో, దానిని సన్మార్గమున బెట్టి ధర్మబద్ధముగాఁ బోషించుటయు
నంతే యవసరము. దానివలన నరకబాధలు దొలగిపోవునని శృతి. కుల
పాంసనులు, లోకకంటకులు, దుష్టులైన పుత్త్రిలఁ గనుటకన్న నిస్సంతులై
మనుటమేలు. పూర్వజన్మ కర్మవిశేషముచే నట్టి పుత్త్రిలు జన్మించినను,వర్ధిల్లి
నను, ధర్మవీరులచేత నిహతులయిపోవుట తథ్యము. అట్టి నిహనకార్యము
నకు నిమిత్తమాత్రుఁడు పరమాత్ముఁడు. పుత్త్రివాత్సల్యము ప్రతిప్రాణికిని
సహజము. దానిని ధర్మబద్ధ మొనరించుట చాల దుష్కరము. అదిసాధించిన
వంశము మూడుపూవు లారు కాయలై వర్ధిల్లును. లేనివంశము కూకటి
వ్రేళ్ళతో కూలును. ధర్మబద్ధముగాఁ బుత్త్రిలఁ గాంచుట, రక్షించుట, లోకా

హితులైనచో వారిని సంహరించుట అనునది ఉత్తమ వీరుని ధర్మము. పుత్రభావమెంత మధురమో, ఎంత మృదులమో, అధర్మపరుఁడైనను పుత్రుని మరణభావ మనునది అంత దుస్సహము. అయినను ధర్మశాసన మనుల్లంఘనీయము. ఈ నిత్యసత్యమును వ్యంగ్యముగాఁ బ్రపంచితమగునట్లు పుత్రసంబంధప్రసక్తి యుక్తములగు కథల నెన్నికొని ననుసంధించినాఁ డీ సంవిధాన చక్రవర్తి! లేకపోయినచో నరకాసుర వధానంతరము భూదేవి దుఃఖ మెందులకు? బ్రాహ్మణ శిశువును రక్షింప నరకాసుర హంతకుఁడు పూనుకొందులకు? పుత్రార్థియై అతఁడేచేయు ఘోరతప మెందుకు? కులపాంసనులకు హంసడిభకుల సంహార మెందులకు? సత్సుతుఁడగు జనార్దనుని సంరక్షణ మెందుకు? శివ కుమారుఁ డని భావింపఁబడిన బాణాసురునితో వంశాంకుర రక్షణార్థమై చేయు శ్రీకృష్ణునియుద్ధ మెందులకు? ఇవన్నియు నాయొక్క సత్యమును ప్రతిపాదించుటకే. అంతేకాక భట్టభాస్కరులు, విద్యారణ్యులు వీరశబ్దము పుత్రవాచక మని వ్యాఖ్యానించియున్నారని ఉమాకాంత పండితులు. (చూడు. ఈ గ్రంథమున ఉపసంహారము.) అది ఈ కావ్యము వీరప్రధానమను అంశమును సమర్థించుచున్నది.

ఇఁక రెండవ సంవిధాన నైపుణ్యము: వస్తుకావ్యములందు అంగిరస మనునది కావ్యవ్యాపిగా నుండక కథావ్యాపిగనే యుండునని వెనుక తెల్పఁబడినది. కావ్యరచనా సమర్థుఁడగు కవిచేతఁ బడుటచే నిందు ప్రతి కథయు వీరరసాత్మకమే యయి యున్నది. ఇది యొక రససంవిధాన శిల్పము. ఇతివృత్తములో లేని యైక్యత రసమునం దధికముగా గోచరింపఁ జేయునట్టి దిది. ఇది 'సంవిధాన చక్రవర్తి' కొక లక్షణమేమో! 'సాహిత్య రసపోషణ' సామర్థ్యమేమో!

పై సమన్వయములతోపా టీతని కావ్యమున హరిహరాద్వైతము అసుర ప్రవృత్తిపై సాత్త్విక ప్రవృత్తికిఁ గల్గిన విజయము అను నంశములుఁ గూడ పాటింపఁబడినవి. హరిహరాద్వైత భావము వీర రసానుగుణముగాఁ బ్రదర్శితమైనది.

"ఏమిరువురు నేకం బిది సామగ్ర్యజురాది తత్త్వసారము." —ద్వి. 214.

అని శివుఁడే నోరుతెరిచి చెప్పికొనినాఁడు. శివుఁడు భక్తసులభుఁడు. రాక్షసుల తపస్సులకు మెచ్చి లోకభీకరములైన వరములనైనను లెక్కింపక ఇచ్చివేయును. అర్థకామదృష్టియే ప్రధానముగాగల కొందఱు భక్తులు వరబలమును ధర్మనాశమునకై వినియోగింతురు. వారి నణఁచు శక్తి విష్ణువు. ధర్మ

ప్రధానుఁడగు నాతఁడు చివఱకు తన కుమారుఁడైనను శిక్షింపక వదలఁడు! ఇట్టి ప్రవృత్తియందు హరిహరా భేదశక్తి యెట్లు లోకహితము నుద్దేశించి పని చేయునో సూచించుటయే ఈ కావ్యకథాసంవిధానలక్ష్యము. ఇట్టి కావ్యనిర్మాణము చేయుటచేతనే అట్టిబిరుదు లన్వర్థములైనవి నాచనసోమునకు!

ఉత్తరహరివంశ ప్రథమాశ్వాసమునందలి నరకాసురవధా వృత్తాంతమున నాయకాశ్రయమగు యుద్ధవీరము వర్ణితము. అందు నాయకుఁడు శ్రీకృష్ణుఁడు. అతనికి యుద్ధములోఁ దోడ్పడినది సత్యభామ; ఆమె అనునాయక స్థానమున నిల్చినది. ఉపనాయకు లింద్రాదులు. ప్రతినాయకుఁడు నరకాసురుఁడు. అనునాయకోపనాయకులవీరము నాయక రసపోషకమయి యాతని నుభయాయత్తసిద్ధునిగా నొనర్చుచున్నది. ప్రతినాయకునియం దర్థకామప్రధాన వృత్తి వర్ణితమైనది. ఉదా:

"ధనదాంతఃపురతారహారములు యాదఃపాల బాలా ఘన
స్తన కాశ్మీరము ధర్మరాట్టులవధూసంవ్యాన కౌశేయమున్
దను జేంద్రారివరావరోధ దయితా ధమ్మిల్ల మాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁ జూచు జయలక్ష్మి నిత్య నైపథ్యమున్."

—ప్ర. 17.

అను నరకాసురుని యుత్సాహములో ధర్మముకన్న నర్థకామములే మిన్నగా గోచరించుచున్న వనుటలో విప్రతిపత్తి లేదు.

ఉపనాయకులగు దేవేంద్రాదుల యుత్సాహము:

"నిలు నిలుమంచు దానవుల నిర్జరనాథుఁ డదల్చి వింట మం
టలగతిఁ దూపులుం జటుల టంకృతులున్ నిగుడారఁ బోరన
క్కొలఁది నుదారసార రణకోవిద బాహులు లోకపాలకుల్
గలసిరి కారుచిచ్చునకు గాడ్పులు దోడగు చంద మొందగన్."

—ప్ర. ఆ. ప. 22.

దానవవీరుల నెదుర్కొను దేవేంద్రుని యందు ధృత్యౌత్సుక్య గర్వామర్ష వేగ భావములతోఁ బుష్టిచెందు నుత్సాహమునకు దిక్పాలకవర్గము అధికశోభను జేకూర్చుచున్నది. 'కారు...చంద మొందగన్' అను ఉపమానము శుష్కశత్రు వన వాటిని దహించెడి దవాగ్నియందువలె కాంతి, వ్యాపకత్వము, సర్వదమనత్వము, శత్రుబాధకత్వము, వేడి, దుర్నిరీక్షత మొదలగు గుణము లింద్రుని యందును, అతని నుత్తేజ పఱచు ప్రభంజనత్వము దిక్పాలకులయందును,

వ్యంగ్యముగాఁ బోషింపఁబడుటచే నది వీరరసపోషకముగా నిలచుచున్నది. ఇట్లే ఇంద్రుని రణస్థైర్యము వర్ణించుచు :

"మఱియు దానవసైన్యంబు మాఱులేక యొప్పి తప్పిన నిర్జర యోధవరులఁ
దోలి తొప్పఱవెట్ట నింద్రుండు నిలిచె బవరమున నొక్కరుఁడు నేఁదుపల్లువోలె."
—ప్ర. 43.

గాఢాంధకారమునఁ బ్రజ్వలించు దీపశిఖవోలె, రణరంగ విముఖులై విచ్చిన దేవసైన్యమధ్యమున - ధృతిమంతుఁడై నిల్చిన ఇంద్రుని స్వరూపగుణము లన్నియు "ఏఁదుపల్లు" తోడి యుపమానముతో వ్యంగ్యముగా సాధింపబడినవి. తెలుఁగుఁదనము, ప్రౌఢాలంకార ప్రయోగవైశారద్యము, కవి యిచ్చుట ప్రదర్శించి అలంకారవ్యంగ్యత నాశ్రయించిన వస్తువును సంతరించి రసపోషణ మొనర్చినాఁడు.

అధర్మప్రవృత్తి ప్రతి నాయకునియందును, అతని యనుయాయుల యందును వర్ణింపఁబడి పఠితలయొక్క సానుభూతిని వారియందు కలుగకుండ చూడబడినది. విజయగర్వులైన దైతేయులు అమరావతీ నగరమున - "మగలు దిగవిడిచిపోవుటయును మానంబుతోడన ప్రమంది మందిరంబుల నడంగియున్న మగువలఁదెగువతోడ వెడలందిగిచి తెచ్చి చక్కని వారి నేర్పఱిచియొక్క యెడం గూడఁబెట్టు ధూర్త దనుజులును, గడచిపోవచ్చిన నొడిచి, కచభరంబులు పట్టికొన్న నన్నన్న! నీ చెలియలనని విడిపించుకొని కన్నీరు దొరుగు మొగంబుల బయ్యెదలొత్తుకొని యేడ్చు సుదతుల నదలించు"చు ప్రజలను బాధించు వైఖరిఁ గాంచినచో తమోగుణప్రధానమగు నాసురీప్రవృత్తియొక్క విపుల వర్ణనముచేత ప్రతినాయక స్వభావముపై వ్యంగ్యముగా నేవగింపుగల్గించి నాయక ధర్మనిష్ఠపై నాదరము హెచ్చించు కథనవైఖరి గోచరించును. దీనికిఁ దోడు ప్రతినాయకుఁడు స్వయముగా ఋషులను హింసించుచు మఖాంశములఁ బలిమినిగొనెడి ధూర్తత్వము విపులముగా వర్ణితమైనది :

"పలికనొదు మఖాంశ శ్రీలకు; నొరుఁ దడవనేల? శిరసుండగ మోఁ
కాలను నేసలు వెట్టుట బేలుదనముగాక మీకుఁ బెద్దరికంబే." —ప్ర. 96.

అనునవి అతని మాటలలో కొన్ని, అతని భావతైక్ష్ణ్య మా మాటల సూటిదనములోను, సంగ్రహవచనములందును గోచరించును. "ఒరుఁ దడవనేల?" అనుటలో శత్రునామోచ్చారణ విముఖత్వములో నహంకారము గోచరించుచున్నది.

"మఖాంశశ్రీలకు" అనుటచే వ్యంగ్యముగా యజ్ఞపురుషుని లక్ష్మీనాథత్వము తనయం దారోపించుకొను గడుసుఁదనము గాననగును. ఇందు తెలుఁగుతీయం దన మందించెడి సామెత నొకదానినిఁ బ్రయోగించి యపూర్వరసపోషణ మొన ర్చినాఁడు. ఉత్తమాంగమగు శిరస్సుతో తనను పోల్చుటలో పూజార్హత్వమును పాత్రయందు ధ్వనించినాఁడు కవి. ఇదియొక నవీనగుణ మీతనియందు!

నాయకునకు బాసటగా నిల్చిన సత్యభామయందు 'విపులవీరరసము' వర్ణితము :

"ఊఁచినకత్తి వంపని పయోరుహలోచన మింటమంటలం
బూఁచిన బాణజాలమునఁ బూర్వసుపర్వ పురాణగర్వముఱ
వేఁచిన చందమున్ విపుల వీరరసంబున నాత్మచిత్తముం
దోఁచిన చిత్తముం దెలియఁ దోఁచిన నచ్చర లిచ్చమెచ్చరే." —ప్ర. 163

అను పద్యమునందలి 'విపులవీరరస' శబ్దము సాభిప్రాయము. శ్రీకృష్ణుఁడు సొమ్మసిల్లుచు శార్ఙ్గ'మింద'యని సమరార్థమై సత్యభామకిచ్చినది మొదలు అమె యందు విభావాదులు విపులముగా వర్ణితమైనవి కావున నది సార్థకమగు చున్నది. దానిని ప్రపంచించినఘట్ట మిది :

"ఇచ్చినఁ బొంగి యచ్చెలువ యింపును దెంపును లోన మానమున్
మచ్చరముం బెనంగ మురమర్దనుపై నరకాసురేంద్రుపై
నచ్చపుఁ జాయలం గువలయచ్ఛద గుచ్ఛవిపచ్ఛటావలిఱ
మెచ్చని వానిఁ గీల్కొలిపె మేలపుఁ జూపుల వాడి తూపులఱ."

"గనయంబున్ గొనయంబు నెన్నడుముతోఁ గర్ణావతంసంబుతో
జనుదోయిం గనుదోయి సాయకముతో సంధాన హస్తంబుతోఁ
బెనకం జేయుచు నేయుచుండె సతి లక్షీభూత దైతేయ త
ర్జన గర్జారవ జర్జరాంత రుధిరాపారంబు దోరంబుగన్."

"అరవింద నయన శరముల నరవిం దన యనువు చూపు జాపము గుదునై
పరివేషము గల చంద్రుని సరివేషముఁ దాల్చె మొగము జగము నుతింపన్."

"కమలముఖి కటాక్షకటకా ముఖపాణి నఖోపకారి వి
భ్రమ మణి పుంఖరింఖ దభిరామరుచుల్ గరమొప్పెఁ జెక్కులం
జెమటలఁ బత్త్రిభంగములు చిందఱవందఱలైనఁ దోన సం
భ్రమమున వీరలక్ష్మి సమరక్రమ రక్షకు వ్రాసెనో యనన్."

"సత్త్రాజిత్తనయా కరాంతర ధనుర్జ్యారావ మైరావతీ
సూత్రాతానర్గళ నిర్గళ స్తనితమై సుత్రామచాత ప్రభా

పాత్రభ్రూలతికా విలాసముల కొప్పుం గప్పు శార్ఙ్గంబుము
క్షత్రిక్రూర మహాశనుల్ దనుజరాడ్గాత్రంబు గోత్రంబుగన్.

"అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందంద మందారకే
సరమాలా మకరంద బిందు సలిల స్యందంబు లందంబులై
తొరుగం బయ్యెద కొంగొకింత తొలగం దోడ్తో శరాసారమున్
దరహాసామృత పూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్."

—ప్ర. ఆ. 156-160, 162

ఇందుఁ బ్రదర్శింపబడినది సత్యభామ యందలి వీరరసస్ఫూర్తి! ఇంతకుఁ బూర్వము, దీని తర్వాతను శ్రీకృష్ణునియందుఁ దోపఁజేయబడినది 'పౌరుష' మగు వీరరసము. ఇచ్చటిది-అనఁగా సత్యభామా నిష్ఠమైనది—యొక్క విచిత్ర విభావజన్యమై తత్స్వరూప నిర్ణయమున నలంకార శాస్త్రమునకే భిక్షపెట్టు స్వభావము గల్గినదై యున్నది! ఇది కొందఱన్నట్లు శృంగారరస మంగముగాఁ గల్గిన వీరరసము కాదు! స్వాభావికముగా శృంగారరస సర్వస్వముగా రూపొందియున్న సత్యభామ స్వరూపమును —అనఁగా తన్నిష్ఠ శృంగారరస వ్యక్తిని ఉద్భేదించుకొని యుబికి పొంగిన వీరరసమని చెప్పినయెడల నాచన సోముని రసపరిశ్రమను సరిగా గుర్తించినవార మయ్యెదమని నాభావము. ఇది "కలౌశక్తిర్గృహేగృహే"యన్నట్లు అర్థాంగి శక్తిరూపిణి కనుక తద్గత శృంగారము శక్తిజనకమై వీరరసముతో నంగాంగి భావమునఁగాక తుల్యస్థాయినిఁ గూర్చుపొంది, దానికొక మాధురీ ప్రదానము సేయుచు నొక విలక్షణ రూపము నొసఁగి ఆంధ్రకావ్య ప్రపంచమునఁ బ్రథమతః నొక విశిష్టమాత్రాకృతితో విరాజిల్లఁ జేసెననవచ్చును! ఇట్టి సత్యభామయొక్క శృంగారమాధురీకృతమగు వీరరసము తర్వాతి శ్రీకృష్ణుని రౌద్రానుప్రాణిత వీరరసమున కంగభూతమగు నట్లు చిత్రించుట నాచన సోమనాథుని 'సంవిధాన చక్రవర్తి'త్వమున కొక లోకోత్తరమైన యుదాహరణ మనవచ్చును! "ఇచ్చినఁ బొంగి" యను పద్యము నందు సత్యభామాశ్రితములగు హర్షము, ఔత్సుక్యము, సాభిలాష, అతిశయము అహంకారము, మాత్సర్యము, అభిమానము, పరిహాసము మొ. భావములు ద్యోతమానములగుచున్నవి. పరుషాక్షర ద్విత్వప్రాసము, ద్విత్వమగు చకారానుప్రాసము, బిందుపూర్వక పరుష సరళాక్షర ప్రయోగము, స్థిరాక్షర సంధాననైపుణ్యము, శబ్దాలంకార వైచిత్రి మొ. లగునవి సత్యభామయొక్క సహజకోమలత్వమును, రణకర్కశత్వమును బ్రతిపాదించుచున్నవి. అట్లే "కమలా

ముఖి" యను పద్యమున క,ఖ,ంఖ, త, ప, ఛ, ఱ మొదలగు కఠినాక్షరములు, గ. ంగ, బ. భ, ద, ంద మొదలగు సరళాక్షరములు మ, న, ణ మొదలగు అనునాసికాక్షరములు, ఇంకను "సత్రాజిత్తనయా" అను పద్యమున "త్రా" అను సంయుక్తాక్షరముతోఁ గూర్పఁబడిన దుష్కరప్రాసము, త్త, ర్జ్యా, గ్ర, ప్ర, భ్రూ, క్రూ మొదలగు కర్కశ సంయుక్తాక్షరములు, దీర్ఘసంస్కృత సమాసములు ఆమెయందలి యుత్సాహక్రోధాది భావములను, శరప్రయోగ కాఠిన్యము, భ్రూలతికాకౌటిల్యము, క్రూర రణపాండిత్యమును వ్యక్తము చేయుచున్నవి శరాపారము శత్రువుమీదను, దరహాసామృతపూరము కృష్ణుని మీఁదను ప్రసరితముచేసిన సత్యభామయొక్క అనుభావములు ఆమె వీరమును మాధురీకృత మొనరించుచున్నవి. పఠిత కీదృశ్య ముత్సాహారామణీయకము నను భూతికిఁ దెప్పించి పులకాదులలో ముంచివేయును. శ్లేషప్రసాదమాధుర్య సౌకుమార్యోదార్య కాంత్యోజస్సు లనెడి గుణములు, భారతీ సాత్త్వతీ వృత్తులు, వైదర్భిగౌడి పాంచాలీ శైలులు, కదళీద్రాక్షాపాకములు, పై పద్యములందాయా తావుల గోచరించుచుండుటచే రసపోషణము విపులముగా సర్వాంగ సుందరముగాఁ బోషితమగుచున్నది. కావ్యవ్యంజకములను రసోదంచితముగాఁ ననుసంధించిన కావ్యశిల్పమున కిది చక్కని యుదాహరణము!

నాయకాశ్రితమైన ధర్మయుద్ధవీరమును సమర్థించుచు కవి శ్రీకృష్ణుని నోటఁ బల్కించిన మాటల నిచ్చట నఱయవలెను. నరకాసురుని సంహరించిన శ్రీకృష్ణునితో భూదేవి :

"శత్రులకుఁ బుత్రులకు నొక్క సందమగుట
పెద్దలకు మంచి గుణమని పేరుకొనఁగ
సకలదానవ సంఘంబు జంపినట్లు
కొడుకుఁ జంపితి మునికోటి కోర్కి దీర్ప." —ప్ర. 185.

వరాహావతారమున భూదేవియం దాదివిష్ణువునకు జన్మించినవాఁడు నరకాసురుఁడు. విష్ణ్వంశసంభూతుఁడైన శ్రీకృష్ణుని కాతఁడు పుత్త్రుఁ డనుట యుచితమే. తండ్రిచేత నసువులువాసిన పుత్త్రుఁగాంచి చల్లనితల్లిగుండె బ్రద్దలయినది! దానికి సమాధానముగా శ్రీకృష్ణుఁడు: "దేవీ! నరకాసురునకు వగవం బనిలేదు. వాఁడు సురముని వర్గంబునకు నెగ్గుఁజేసెం గావున వధియింప వలసె. దుష్ట శిక్షణంబును, శిష్ట రక్షణంబును జేయనవతరించిన నాకుం బుత్త్రమిత్త్రాదు లని చూచుట ధర్మంబుకాదని" పల్కినాఁడు. అందాతని ధర్మైకప్రవణత్వము,

లోకహితకాంత స్పష్టమగుచున్నది. అందువలననే తదాశ్రయమైన యుత్సాహము వీరరస నామక మగుచున్నది.

ద్వితీయాశ్వాసమున బ్రాహ్మణపుత్త్రిని బ్రతికించుటయందును, పిశాచమున కింద్రపదవి నిచ్చుటయందును నాయకాశ్ర యైశ్వర్యవీరము, పుత్త్రార్థియై శివునిగూర్చి తప మాచరించుటయందు తపోవీరము స్ఫురించుచున్నవి. తృతీయాశ్వాసమునఁ బ్రతినాయకుఁడు పౌండ్రవాసుదేవుఁడు; సాత్యకి ఉపనాయకుఁడు; అందు శ్రీకృష్ణాశ్రయముగా బలైశ్వర్యయుద్ధములు గోచరించును. చతుర్థాశ్వాసమునఁ బ్రతినాయకులు హంస డిభకులు ; పంచమ షష్ఠాశ్వాసములందు బాణాసురుఁడు. బాణాసురుని బానటగా సాణాచ్ఛివుఁడే ఉపనాయకుఁడు, శ్రీకృష్ణున కనిరుద్ధుఁడు. శివకేశవు లిందు తమ తను సంతతులనురక్షించుకొనుటకై రణరంగమునఁ దారసిల్లుదురు. బాణాసురుఁడు శివునినే తండ్రిగా భావించినవాఁడు. (పంచ. 8 ప). ప్రధానపాత్రము లిట్లుండగా – ద్వితీయాశ్వాసమున పిశాచద్వయమున భక్తివీరము, దుర్వాసునియందు సహనవీరము (చ. అ) జనార్దను నందలి భక్తి ధర్మవీరములు (చ అ) ప్రధానరసమున కంగములుగా నిలిచి పోషించుచున్నవి. వాని నన్నిటిని సహృదయులు కావ్యపఠనావసరమున గమనింతురని స్థలాభావముచే వదలుచున్నాను.

## 6. తాత్త్విక కావ్యములు

### ౧. జ్ఞానవాసిష్ఠ రామాయణము – మడికి సింగన :

వేదాంతార్థ ప్రతిపాదన ప్రధానములైన కావ్యములు తాత్త్విక కావ్యములు. ఇందులకు విశిష్టమైన యుదాహరణము జ్ఞానవాసిష్ఠ రామాయణము. ఆ కావ్యవస్తు వనల్పమనియు, అఖిల పురాణశాస్త్ర మతములకు దర్పణము వంటిదనియు మడికిసింగన పేర్కొనెను (ప. 15) జ్ఞానవిషయము సామాన్యులకు సుబోధమగుట దుర్లభమగుటచే ముముక్షువులచే మాత్రము అట్టి కావ్యము లుపాస్యములగుచున్నవి. కాని సింగనకవి వంటి రసవత్కవులు :

"కఱకిది నీరసమని వేసర కల్లన వినుఁడు – తుద రసాయనమగు ; దాఁ
జెఱకుఁ దుదనుండి నమలిన తెఱఁగున మదికింపుఁ దనుపుఁ దీపున్ జూపున్."

ప్ర. 13.

అని శపథముచేసి మెప్పించిన వారలు కలరు. అట్టివారి కావ్యము లీ శాఖయందు గైకొనఁబడును.

వాసిష్ఠ రామాయణము తాత్త్వక కావ్యములలోఁ బ్రసిద్ధిపొందిన గ్రంథము. దానియందలి వస్తుతత్త్వమునుగూర్చి కవి యిట్లని నుడివియున్నాఁడు. "అందేని నిఖిల భూతాంతర్యామియు, నిగమార్థ గోచరుండును, నిత్యసత్య జ్ఞానానంద శుద్ధాంతరంగుండును, నిశ్చలానంద యోగీంద్రహృదయుండును నిశ్శ్రేయసానంద ఫలప్రదాయకుండును, నిర్మల చిదాభాసుండును, నిరాకారుండును, నిర్గుణ బ్రహ్మంబును నగు నారాయణుం డొక్కరుండు దక్క నన్యంబు లేదనియును, బ్రహ్మాదిచేతను లతని తేజఃకణంబులనియుము, దేహం బనిత్యంబనియు, దేహి నిత్యుండనియు, జీవుండు చిత్తంబనియు, చిత్తంబునంద జగత్తులు విస్తరిల్లుననియును, దత్సంకల్పంబ బంధంబు, తన్నిగసనంబ మోక్షంబనియును, చిత్తశాంతియ జీవన్ముక్తియనియు, బెక్కువిధంబుల నుపన్యసించునట్టి వాసిష్ఠ ప్రసంగ ప్రబంధం బాంధ్రభాష నఖిలలోకోపకారార్థంబుగా" రచించెనని నుడికి సింగన.

ఇందు వైరాగ్య ముము క్షూత్పత్తి స్థిత్యుపశమ నిర్వాణప్రకరణము లని ఆరు విభాగములు కలవు. వీని నన్నింటను గలిసి నలుబదికి మించిన యుపాఖ్యానములు కలవు. చెప్పఁదలచిన తాత్త్వక విషయము సూత్రప్రాయముగా ముందునుడివి తద్బోధనార్థ ముదాహరణముగా నుపాఖ్యానములను వసిష్ఠుఁడు శ్రీరామునకుఁ జెప్పి నిరూపించినట్లు సాగిన దీ రచన. ఇందు ఫలరూపముగా స్ఫురించునది శాంతరసమయ్యు నెడనెడ నాయా యుపాఖ్యానములందు వీర రసస్ఫూర్తి కల్గుట కవకాశమున్నది. మొత్తముమీద ఈ కావ్యము విషయ లేక వస్తుప్రధానమే కాని రసప్రధానము కాదు. కవిదృష్టి యెల్లప్పుడు లక్షీభూత తత్త్వ ప్రతిపాదనైకమార్గమున బాణమువలె ముందుకు దూసుకొని పోవు చుండునట్లే కానఁబడును గాని ఏ కథయందును నిలకడగా రసభావ వర్ణనాదులు విపులముగా వర్ణించుట కానరాదు. ఎత్తునుండి పల్లమునకు దుమికి కడు వేగముగాఁ బ్రవహించునది ప్రవాహమున నెడనెడ ఆవర్తములు గోచరించునట్లు ఈ కావ్యమునం దుపాఖ్యానములు ప్రవాహతుల్యములైనను ఎడనెడ విలక్షణముగా నాతివిపులముగా కొన్ని ద్యోతమానములగును. అట్టి యుపాఖ్యానములలోఁ నొకటైన ఉద్దాలకోపాఖ్యానమును గైకొని చర్చించినచో తత్కావ్య రూపపరిశీలనము కొంత చేసినట్లగును.

"రామచంద్రుఁడు–మునీంద్రా ! ఉద్దాలకుఁడెట్టి విధమున నాత్మావలోకనంబు జేసి చిత్తంబు గెలిచి పరమసిద్ధికిం జనియె? నవ్విధమానతిండని యడిగిన వసిష్ఠుఁడిట్లనియె :

"ఉద్దాలకుండను నొక మహాముని గంధమాదనంబున దపోమహిమ నిల్చి
మతిశూన్యతను డించి యతివివేకంబునఁ దనలోన నిట్లని తలఁపఁ జొచ్చె;
బూనియంతటికిఁ బ్రధానమై ప్రాప్యమై యెద్ది వెలుంగు? నే నెచట నుండి
యీ దుఃఖమణఁగింతు? నెప్పు డీ తలఁపునఁ బాసి పరబ్రహ్మపదమునొంది
మేరు శృంగంబుపైఁ బొల్చుమేఘమట్లు చిత్తవిశ్రాంతి నెన్నండు చెందఁగలుగు?
ననుచు సంకల్పములఁ ద్రుంచి హరిగుఱించి నిశ్చలధ్యానతత్పర నియతినొందె."
—చతు. 134.

అత్తెఱఁగునఁ దపము సేయగా నాతని చిత్తము నిల్వక అగచరగతితో తిరుగఁ జొచ్చెను. ఆత్మనిష్ఠ సడలెను. దాని కాతఁడు కడు చింతించి, మహాగిరి విపినంబులు పరిభ్రమించి, ఒక్కనాఁడొక యేకాంత స్థలమున నుపవిష్టుఁడై నిర్వికల్ప సమాధి నందుండి తన మనములో బెక్కువిధముల వితర్కించెను. అందుఁ గొన్ని పల్కులు :

"అక్కట కల్మిలేము లనునట్టి తలంపులఁ జిక్కి నిచ్చలుం
బొక్కెదు గాని శాంతరసమున్ వినఁ గ్రోలఁగఁ నొల్లవెన్నఁడున్
దక్కక యింద్రియాదులకు దాసుఁడవై పఱవంగ నెందు నీ
కెక్కడనేమి వచ్చె; నిటులేటికి నేఁచెదు నన్ను చిత్తమా!

"చిత్తమ! వాసనలన్నియు నత్తినబంధంబు కొఱకునగు; నేగతి నీ
వత్తెఱఁగు విడిచి శాంతము పొత్తయిన ననంత జయము పొందెదు సుమ్మీ!

"నిండిన యింద్రియ ధనముల భండారము నీవు; వానిఁ బట్టి యసత్తై
యుండి నినునీవ తెలిసి యఖండామల బోధవీథిఁ గైకొను మనసా!"

అట్లు మానసబోధ నొనర్చికొని క్రమముగా—

"ఆ విష్ణురూప సంయమి నిర్వికల్ప సమాధి కుద్యోగించి; యంతరంగ
మునఁ దోఁచు ప్రతిభాసముల మనంబునఁజేసి యసిధార నురులెట్టు లట్లుత్రుంచె
నావికల్పములెల్ల నణఁగిన హృదయాంబరంబున నర్కచంద్రములఁ గప్పు
కజ్జల పంకంబుగాఁ బర్వు చీఁకటి నడలించి మీఁది తేజంబు గాంచి
కొలను సొచ్చిన యేనిక కొదమభంగి నదియుఁ దునుమాడ, తేజోమయాంధకార
మోహ నిద్రలు దొఱఁగి యిమ్ముల వెలుంగు నట్టి విశ్రాంతిదశ నొందె నతని
మనము!"

"అంతట కొంతకాలమున కమ్మని ముఖ్యుఁడు యోగనిశ్చల
స్వాంత సమాధినొంది ఘనశాంతి వహించి యథేచ్ఛమై శరీ

రాంతమునం దొఱంగి నిరుపాధిక నిర్మల చిత్ప్రకాశుఁడై
యంతములేని యట్టి పరమాత్మ పదంబున నొందె రాఘవా!

—చతు. 143, 150, 158, 168, 175.

ఉద్దాలకమహర్షి గొప్పసంస్కారి, నియమవ్రతుఁడు. అట్టివాఁడే సమాహితచిత్తమును సాధించుటకు బహుప్రయత్నములు చేయవలసివచ్చినది. యోగసమాధియందుఁ గూర్చుండిన యింద్రియోల్బణమాతనిని కలఁతఁబెట్టినది. స్వయముగా జ్ఞాని యగుటచే వనపర్వతగమన ద్వారమున శరీరమును బాగుగా స్రుక్కింపఁజేసి చిత్తబోధ స్వయముగా నొనర్చికొనినాఁడు. స్థితప్రజ్ఞుఁడుకాని ఇట్టి సామర్థ్యమును బొందఁజాలఁడు. నిర్వికల్ప సమాహితయోగచిత్త సమాధికై ఆతఁడు చేసిన ప్రయత్నము, అతఁడు పడిన ఆరాటము, స్వయంప్రతిభను తన మేలు కొఱకే యుపయోగించుకొనిన వైశారద్యము అతని నాశ్రయించిన యుత్సాహోత్కట భావమును ప్రస్ఫుటముగాఁ జాటుచున్నవి. ఇందు యోగవీరము సర్వాంగముగాఁ బోషింపఁబడినది. ఇట్టివే పెక్కుగాథలు అందు తాత్త్వికార్థప్రతిపాదకములై వ్యంగ్యముగా మానవుని మోక్షపురుషార్థసాధనక్రమము నుపదేశించు చున్నవి. "నిండిన యింద్రియధనముల భండారము నీవు"అను కంద పద్యము, "ఆ విష్ణురూప సంయమి" యను సీసపద్యము—కఠినములగు వేదాంతార్థములనైతము నవనీతమువలె ప్రదర్శింపఁగల్గు సింగన కవితాశక్తిని పుడికి పుచ్చుకొనినవి.

## 7. ద్వ్యర్థికావ్యములు

ప్రకృతమైన అర్థములను రెండింటిని ప్రతిపాదించుచు శబ్దార్థశక్తితో రచింపఁబడు కావ్యము ద్వ్యర్థికావ్యము. రెండు కథావస్తువుల నేక కావ్యముగా రూపొందింపఁజేయఁబడినట్టి వస్తుకావ్యము ద్వ్యర్థిరచన. శ్లేషనాశ్రయించి యిట్టి కావ్యములు విభిన్న నాయక చరిత్రములను సమాంతరముగాఁ బ్రపంచించుచుండును. ఇవి సామాన్యముగా పండిత కవులచే రచితములై పండిత ప్రకాండులచే నర్థము చేసికొనఁబడి పాండిత్యైక ప్రకర్ష కాలవాలములై యుండును. ఇట్టి కావ్యరచనాశాఖయందు కృషిచేసిన పింగళి సూరన తద్రచన మెంత కష్టతరమో ఇట్లు నిరూపించినాఁడు :

"రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుం దద్గతి కావ్యమెల్ల నగునే నోహో! యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగు కబ్బం బద్భుతంబంద్రు."

—రాఘవ. పాండ. పీఠిక. ప. 10.

ద్వ్యర్థికావ్యరచనమునఁ గవి యెట్టి శ్లేషలనాశ్రయించునో పింగళి సూరనఁ జదివినచో స్పష్టపడఁగలదు. అతఁడు :

"ఆంధ్రభాషా సంస్కృతాభిభాషాశ్లేష యొక్కొకచోట ; నొక్కొక్కచోట నుచిత శబ్దశ్లేష ; యొక్కొక్కచోట నర్థశ్లేష ; యొక్కొక్క తఱిని ముఖ్య గౌణ వృత్తిశ్లేష ఘటన ; యొక్కొక తఱి నర్థాన్వయము వేఱెయగుచుననికి శబ్దాన్వయ విభేద సంగతి నొక్కొక్కతఱి ; నివి యొక్కొక్క తఱిని రెండు మూఁడు గూడుటయుమఱి,సముజ్జ్వలముగనాకుఁదోఁచినగతిఁజెక్కుపోకలమర రామభారత కథలు పర్యాయదృష్టిఁ జూచు సుమతుల కేర్పడ నాచరింతు."

—రా. పాం. పీఠిక. 17.

నని తెల్పియుండెను.

ద్వ్యర్థికావ్య రచనమున సామాన్యముగా రెండర్థములు వచ్చునట్లు పద్యరచనము చేయుటయందే కవికి కాలము బాగుగా వెచ్చింపఁబడును. సమాంతర సన్నివేశములు కొన్నిగల గాథల రెంటిని గైకొని కావ్యమునందు నిబంధించుచున్నను వానిని సక్రమముగా వెళ్ళదీయుసరికి కవికి తలప్రాణము తోకకు వచ్చును. అందు రసవత్కవిత్వము దొరుకుట అరుదు. ద్వ్యర్థి కావ్యా లలో కవి–సర్కసులో నిద్దఱు యజమానులు తనను శాసించుచుండ తన స్వేచ్ఛను, పౌరుషమును, శక్తిని గుప్తపఱచుకొని వినమ్రుడైనిలుచు సింహము వలె గోచరించును శ్లేషాదుల మధ్య కవి విచ్చలవిడిగా సంచరించలేఁడు, వ్యక్తి త్వము వీడనులేఁడు. అట్టి పరిస్థితులలో నాతని రచన వస్తువునే అధికముగా నాశ్రయించును; రసప్రతీతి గుణీభూతముగా సాగుచుండును. ఇట్లయినను తెలుఁగుకవులు కావ్యార్థద్వయ మొక్కటిగనే కుదిరినపుఁడును, అవకాశము కల్గిన యితర ఘట్టములందును రసపోషణకుఁ బాటుపడిరి. ఎంతయైనను వ్యంగ్యార్థప్రధానమగు కావ్యమునందున్న రసప్రతీతి యిందు గానరాదు ; అట్టి దనివార్యముకూడ !

వీరరసము ప్రపంచింపఁ దలఁచినపుడు కవి రెండు కథలలోను సమాంత రములైన విభావాదులఁ గల్పించి సంధించి తద్వర్ణనమునకుఁ గృషిచేయును. ఉదా. శ్రీరాముఁడు విశ్వామిత్రయాగ సంరక్షణ మొనర్చుచు మారీచ సుబాహులపై తన బలప్రయోగము నెఱపినట్లు రామాయణార్థమునను, జల క్రీడావసరమునఁ బాండవ కౌరవులకుఁ గలహమేర్పడ బలవంతుఁడగు భీముఁడు దుర్యోధనాదులపై తన బలప్రయోగము నెఱపునట్లు భారతార్థమునను రాఘవ పాండవీయకర్త సంధించెను.

"తోరపుటల్కనా రిపులు దొమ్మిగఁ బైపయిఁ గ్రమ్మ వారి లీ
లారణవృత్తిఁ గిట్టి కడు లావరి భీముఁడు రామభద్రుఁ డే
పారెడు వేడ్కతో నెఱపె నప్పుడు కాండపటుప్రహార దు
ర్వారవిధిన్ సుబాహుఁ డనువాఁ డిలసద్గతిగాంచి మించఁగన్".

—(రా. పాం. 2 ఆ, 21 ప.)

లఘుటీక : రామా : అరిభీముఁడు = శత్రుభయంకరుఁడు, రాముఁడు ; కిట్టి=డాసి ; భార : ఆ రిపులు=ఆ దుర్యోధనాదులు (ఆ శత్రువులు); లావరి= బలముగల ; రామభద్రుఁడు=మనోజ్ఞమగు అదృష్టముగలవాఁడు ; భీముఁడు ; సుబాహుఁడు+అను+వాఁడి+లసత్+గతి అని పదవిభాగము: కాండపటు ప్రహార=నీటితో బలముగాఁ గొట్టునట్టి.

ఇందు మారీచ దుర్యోధనాదులు క్రోధభావ సముజ్జ్వలులు. వారి నెదుర్కొను నాయకులు లీలారణ ప్రవృత్తులు. అనగా వారిది క్రీడామాత్ర యుద్ధమే. శత్రువిజయము వారికి మంచి నీటిప్రాయము. అంతటి బలసంపన్నులు వారని వ్యంగ్యము : అరి భీముఁడగు రాముఁడు శత్రుభయం కరుఁడనియు; లావరియు రామభద్రుఁడును నైన భీముఁడు మానుషదైవీ సంపత్తి గలవాఁడనియు, ద్యోతమానమగుచున్నది. 'ఏపారువేడ్క' వారియందలి యుత్సాహ సంతోష ముల వ్యక్తము చేయుచున్నది. సుబాహుని బలభుజములు పటుశరముల కొరిగిన వని తెల్పుట 'యందును, సుబాహుఁడగు భీముఁడు చేసిన జలప్రహారములు దుర్వారములైనవనుట యందును నాయక బలోత్సాహాతిశయము ధ్వనితము. మొత్తముమీద నాయకుల నాశ్రయించిన బలవీరము మాత్రము ప్రస్ఫుట ముగా గోచరింపఁజేసిన ద్వ్యర్థిరచనమిది.

ఇట్లే రాముని శివధనుర్భంగము, అర్జునుని మత్స్యయంత్ర భేదనము నొకే పద్యమున గూర్చి పెట్టినాఁడు సూరన.

"అనుపమ దివ్యవిక్రమ సమగ్రుఁడు రామ విభుండు జిష్ణుఁ డా
యనితర భేద్యరౌద్రధను వశ్రమ భంగిగ వంచి బాహులీ
ల నెఱపె నభ్రగానిమిష లక్ష హృదంబక వృత్తి నుర్వరా
జన హృదయాక్షి వర్తనముఁ జాలఁగ నద్భుతవార్ధి ముంచుచున్."

—రాఘ. పాం. 2 అ. 56. ప.

రామాయణార్థమున రౌద్రరసస్ఫూర్తి గల్గుచుండగా భారతార్థమున మున వీరరస స్ఫూర్తి గోచరించు నట్టిది రాఘవ పాండవీయమునుండి యుదాహరణము : పరశురాముఁడు ధీరోద్ధతుఁడై తన క్రోధ భావమును

గూర్చియు, తన పరాక్రమము గూర్చియు పొగడుకొనుచు రౌద్రరసము వెలార్చును. రామాయణార్థమున అదే పద్యమున భారతార్థమున నర్జునుఁడు బ్రాహ్మణ గోరక్షణార్థమై వేఱొండు మార్గము కానఁజాలక ఆయుధము గ్రహింపఁదలచి సమయభంగమైనను కులధర్మమును నిలువఁబెట్టుకొనుటకును, ధర్మరక్షణకును ఉత్సహించి ధర్మరాజుండు చోటున కరిగెననికలదు.

ఉత్సాహ. "అంతరహిత సమయవృత్తి నర్జునుండు ధర్మరా
జాంతికమున కరిగె దృఢ నిజాయుధగ్రహేచ్ఛ న
త్యంతముగురు ధేను దస్యుతాపితాతి మన్యు మ
త్స్వాంత బాడబప్రశాంతి సలుపనేర కొండుమైన్."
—రా. పాం. అ. 2 ; పద్య. 92.

ఒక అర్థమున నాయకాశ్రిత వీరము గోచరించుచుండ రెండవ యర్థమున నాయికాశ్రిత వీరము ద్యోతమాన మగుట కొన్నిచోటులందుఁ గానిపించును. ఉదా. విశ్వామిత్రుఁడు మాతంగ కన్యలఁ బెండ్లియాడుమని హరిశ్చంద్రు నాజ్ఞాపింపఁగా నాతఁడు "ధాత్రియైన వదలుదుగాని ధర్మమువీడి ఏకపత్నీవ్రతము నుజ్జగింపనని" పల్కుటలో ధర్మవీరము హరిశ్చంద్రోపాఖ్యానమునను, నలోపాఖ్యానమున దమయంతి నలుఁదక్క యితరులను తాను పెండ్లాడననియు, 'నలధర్మ పరిగ్రహాభావమిచ్ఛగించిన'దాన ననియు, తెల్పి అన్యదత్తయైన తాను దేవేంద్రాదుల వివాహమాడుట ధర్మవిరుద్ధమనియుఁ, బేరొక్కని అట్లుగానిచో ప్రాణములనే విడుతునని ధర్మోత్సాహముఁ బ్రకటించుటయు రామరాజ భూషణుఁడు సంధించెను :

"అనఘ ! వరప్రకర్షమునవా దమనూత్తమ సంతతిన్ సిరుల్
దనర జనించి యందు నల ధర్మపరిగ్రహాభావ మిచ్ఛగిం
చిన నను నీగతిన్ బలుకఁ జెల్లునె యీ బలితంపుఁ బూన్కి నే
మనమున మాన నెట్లయివ మానెదఁగాని ధరిత్రి నేనియున్."
—హరి. నలో. ద్వి. అ. ప. 98.

ఒక కావ్యార్థమున నాయకాశ్రయవీరము స్ఫురించుచుండ—ద్వితీయ కావ్యార్థమున వీరరసము స్ఫురింప దొక్కొకచోట. ఉదాహరణమునకు :

"అమరవరక్షమామరవరాంచితవృత్తులు వింగడించి నే
ర్పమరఁగ నాసురూప వినుతాఖిల సద్గుణపాత్రతానిధిన్

విమల సుగంధమాల్య వినివేశ విభూషితుఁ జేసి యాత్మభూ
సమధిక రాజ్యవైభవ మొసంగె నశేషముఁ దద్వశంబుగన్."

—హరి. నలో. ద్వి. ఆ. ప. 113.

ఇందు హరిశ్చంద్రుని దానవీరము స్ఫురించుచున్నది గాని — నలచరిత్రలో దమయంతి నలు నిపుష్పమాలాంకృతుఁ జేయు ఘట్టమగుటచే నచ్చట వీరరసస్ఫూర్తి లేదు.

ద్వ్యర్థికావ్యములలో రెండు కథలు సమాంతరముగా కుదురనప్పుడు ఆయా కథలలోఁ గొన్ని మార్పులు, చేర్పులుచేసి సమకూర్చుటఁ గాంచెదము. అట్టి మార్పొక్కొక్కసారి వీరరస పోషకమగు చుండును. ఉదా: నైషధ పారిజాతీయము గైకొందము. "కృష్ణాధ్వరి పై రెండు కథలందును నేకథను పూర్ణముగా మూలమునుండి గ్రహింపక రెండింటిని నిపుణముగా మేళవించెను. భాగవత కథయందలి యింద్రాదులు శ్రీకృష్ణునితో నరకుని దుష్కృత్యములు దెల్పుటయు, నాతఁడు నరకుని వధింపఁ బ్రతినవట్టుటయునను కథతో ప్రారంభించి, దానికిఁ దిమ్మన (పారిజాతాపహరణములోని) కథకు మాతృకయగు కథలోని నారదాగమనమును, అతఁడొసఁగిన పుష్పమును శ్రీకృష్ణుఁడు రుక్మిణి కిచ్చుటయు నందులకు సత్య యాగ్రహింప నామె కాతఁడు దేవలోకమునందలి పారిజాత వృక్షమునే తెచ్చియిచ్చుటకు బాసయిచ్చుటయు ననుకథ నతుకుపెట్టి యనంతరము నరకవధయు, నదితికుండలము లిచ్చుటకు స్వర్గమునకేగి మరలివచ్చునప్పుడు దేవపారిజాతమును హరించుటయు, షోడశసహస్ర రాజకన్యలఁ బరిణయ మగుటయు నను భాగవత కథాభాగముతో ముగించెను. ఈ కల్పనచే నారదుఁ డింద్రాది దిక్పాలకులకు దమయంతీ రూపగుణములు వర్ణించిచెప్ప వారామె పాణిగ్రహణమునకై విదర్భపురమునకేగఁ బ్రతిన సల్పిరను నైషధ కథ కనుకూల కథయేర్పడుటే కాక మిక్కిలి రసవంతమై భాగవత కథకు వన్నెఁ దెచ్చినది."[1] ఇందు తిమ్మన పారిజాతాపహరణాదులలో కానరాని నరకాసురవధ, అదితి కుండలములు మరల తిరిగియిచ్చు ఘట్టములు విపులముగా వర్ణితము లగుటచే నచ్చట శ్రీకృష్ణాశ్రిత వీరరసస్ఫూర్తి కల్గుచున్నది. ఇది కథలో అదనపు వీరరసలాభము.

ఇట్లే యాదవరాఘవ పాండవీయము వంటి త్ర్యర్థికావ్యములందును ఇట్టి వీరరస స్ఫూర్తిని సహృదయులు గమనింతురుగాక !

★

1. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము. శ్రీనిడుదవోలు వేంకటరావుగారు. పుట 80-81.

# 7. రసకావ్యములు

రసప్రధానమైన కావ్యము రసకావ్యము. ఇందులో నిబద్ధింపఁబడు వస్తువు, అలంకారములు రసప్రతీతి నుత్కట మొనర్చుచుండును. అనఁగా వస్త్వలంకారధ్వను లీ కావ్యమున రసధ్వనియందు పర్యవసించునని తాత్పర్యము. వస్తుకావ్యములందు వస్తు వెంత ప్రధానమో రసకావ్యములందు రసమంత ప్రధానము. వానియందు గుణీభూతముగానుండు రసము వీనియందుత్తేజితమై వ్యంజితమగుచుండును. ఒకవిధముగా—వస్తుకావ్యగత రసము గ్రీష్మకాలజీవతరంగిణివంటిది. ఒడ్డులుదిగి, తిన్నెలుదాటి, ఏటిగర్భము చేరినపుడు శీతలస్వాదుజలము లభించునట్లు – రసము వస్తువునం దతః ప్రవాహమై వస్తురంజన హేతువగుచున్నది. ఇఁక రసకావ్యమా శరత్కాల పూర్ణతరంగిణివంటిది. ఒడ్డుల నొఱసి ప్రవహించు నిర్మలజల మా నదిలో ననాయాసముగా లభించునట్లు – రసము వస్తువును ముంచి మించి పఠితకాస్వాదన నేకోన్ముఖముగాఁ గల్పించును. ఎండకాలములో నిసుకతిన్నెలపై నాడి యాడి సేఁదదీర జానుదఘ్నములైన యేటినీటిలో మునుకలిడిన కల్గు సౌఖ్యము వస్తుకావ్యములందును, వీరరసోచిత శరత్కాలావసరమున నొడలుపొంగి గంభీరతరంగిణిలో నీదులాఁడి, లోతులరసి వెన్నెల నారుబయళ్ళ విహరించు నెడకల్గు సంతోషము రసకావ్యములందును రసికుఁడు పొందుచుండును. జీవనదీజలములతో తడిసిన తెలుఁగుగడ్డపైఁ బుట్టిన ప్రతి ఆంధ్రుఁడు పై రెండు విధములగు కావ్యములను ఉత్తరోత్తర బలీయముగా సృజించి; అస్వాదించి తన రసికత్వమును, సహృదయత్వమును నిరూపించుకొనుచుండును.

ఆంధ్రసాహిత్యములో రసకావ్యము లసంఖ్యాకములు. అందు శృంగార రసకావ్యము లధికములు. వాని తరువాత వీరరసకావ్యములు, భక్తిరస కావ్యములు, శాంతరసకావ్యములు, కరుణరసకావ్యములు, రౌద్రబీభత్సాద్భుత రసకావ్యములు, హాస్యరసకావ్యములు చెప్పుకొనఁదగినవి. వీనిలో వీర రసకావ్యములఁ జర్చించుట యిచ్చట నాపని. స్థాలీపులాక న్యాయముగాఁ బ్రసిద్ధములగు కావ్యములఁ గొన్నింటిని వైవిధ్యదృష్టితో గైకొని యీ క్రింద పరామర్శింతును. అనంత సాహిత్యమున వెలసిన వీరరసకావ్యము లన్నిఁటి నెఱుంగుట 'నమలిన తారకాసముదయంబుల' నెన్నుటయే యగును.

## ౧. నిర్వచనోత్తరరామాయణము - తిక్కన :

మంత్రి తిక్కనచే రచింపఁబడిన నిర్వచనోత్తర రామాయణము వీరరస మంగిగా గల రసకావ్యములలో మొట్టమొదటిది. మహాభారత రచనలో మహామంత్రిగా, రాజకీయవేత్తగా, కవిబ్రహ్మగా, మహాయోగిగా గోచరించు తిక్కనగారి కవిత్వ మహన్మూర్తికి ఆవాహనము కల్పించినది నిర్వచనోత్తర రామాయణము. మొదటిసారిగా పొటమరించిన తిక్కనగారి కావ్యకుసుమము మహాభారత రచనానుకూల సంస్కార పరిమళము సహృదయులకుఁ బంచి పెట్టుచు నొప్పారుచున్నది.

ఈ కావ్యమునందలి యితివృత్త మొక విశిష్టశిల్పము నాశ్రయించినది. శ్రీరామపట్టాభిషేకమునుండి లవకుశ పట్టాభిషేకము వఱకుగల రాముని కథ యిందలి వస్తువు. ఇయ్యది వాల్మీకి ప్రోక్తము. దానిని దెలుఁగుచేసి తిక్కన కీర్తి నార్జించినాఁడు.

రామాయణమునకు నాయకుఁడు ధీరోదాత్తుఁడగు శ్రీరాముఁడు. ప్రతి నాయకుఁడు రావణుఁడు. ఇది రావణసంహారానంతరము జరిగిన కథ, కావున ప్రతినాయక ప్రసక్తియే లేదు. కాని జనకాదులు శ్రీరాముని కొల్వునకేతెంచి యతనిఁ గీర్తించినప్పుడు రావణాదుల గాథలు రాముఁడు వినఁగోరి "అమ్మనుజ భోజనుల జన్మమ్ములునుం దపముచేసిన తెఱఁగును శౌర్యమ్ములును చెప్పు"మని వేఁడుకొనెను. మునిగణ నాయకుఁడగు అగస్త్యుఁడు తద్వృత్తాంతములఁ జెప్పఁదొడఁగెను. రాముని కోర్కెనుబట్టి-రాక్షసవీరుల జన్మప్రకారము, వారు తపముచేసిన విధములు, శౌర్యపరాక్రమములు అగస్త్యుడు విపులీకరింపవలె నన్నమాట! ఇచ్చట పులస్త్యవంశజు లందఱి గాథలు ప్రస్తావితమగుచున్నవి. వారి తపస్సులు, విష్ణువుతోడి విరోధములు, విష్ణువుచేనైన పరాభవములు, అందు వర్ణనాంశములు. రావణుని గాథయందును నతఁడు ఇంద్రాది దిక్పాలకుల నోడించిన గాథలు, నివాతకవచాదుల మర్దించిన కథలు, కార్తవీరునిచేతను వాలిచేతను ఓడింపఁబడిన ప్రస్తావనలు మాత్రమే వర్ణితములైనవి గాని రామ రావణ యుద్ధప్రసక్తి మాత్రము లేదు. దీనికి ప్రయోజన మిది : విష్ణ్వంశ సంభూతుఁడని కావ్యమునందే కీర్తింపఁబడిన శ్రీరాముని కివి స్మృతిరూప ములుగానుండి వీరరసానుభూతి నొందుటకు తోడ్పడుచున్నవి. వస్తుతః ఇతి వృత్తమున ధర్మవీర మంగిగాను, విప్రలంభశృంగార, కరుణరసము లంగములు

గను అనుసంధింపఁబడినవి. ఈ గాథలు రసప్రతీతియందు శిల్పవైవిధ్యమును సంతరించుచు, నాయక మహాత్వమును చాటుచున్నవి. తద్వారమున వీరరస పోషణము

నిర్వచనోత్తర రామాయణము పది యాశ్వాసముల మహాకావ్యము. అందెనిమిదవ యాశ్వాసమునుండి ప్రధానేతి వృత్తము ప్రారంభమగు చున్నది. భద్రునివలన సీతాపవాదమును విని రాముఁడు అనంత విషాద భరితాంతఃకరణుఁడై ధర్మము వీడక తత్ఫలితమైన కీర్తి నాశించి, సీతను అరణ్యముల కంపినాఁడు. లక్ష్మణునితో రాముఁడన్నమాట లందులకు దార్కాణములు :

"రావణు నింటనుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చి సం
భావనసేఁత కష్టమని పల్కిరి చూచితె లక్ష్మణా మహా
దేవుఁడు బ్రహ్మయున్ మునులు దేవగణంబులు మెచ్చ నయ్యెడం
బావకుఁ డిచ్చె నాకు సతిఁ బాపపుమాటలు పుట్టె నియ్యెడన్.

"వేవురు నేల నేను పృథివీసుతచిత్తము పెంపెఱుంగనే
భూవలయంబు సంచలతఁ బొందిన వారిధి మేరఁ దప్పినన్
దేవనగంబు పాఁతగిలి త్రెళ్లిన నందొక కీడుఁ గల్గునే
యావనజాక్షి నిట్లు సెడనాడిన నక్కట నోరు ప్రువ్వదే?"

"ఐనను మీకు నొక్క తెఱఁ గస్ఖలితంబుగ నేను జెప్పెదన్
దానికిఁగాదు నాక భువనంబులకున్ నను శుద్ధఁ జేయుఁ డ
జ్జానకి నెల్లభంగుల నిజంబుగ నిప్డు పరిత్యజించినం
గాని యకీర్తి వాయ దటుగాదని నోళ్లను మూయవచ్చునే ?"

"జడమతులయిన జనంబుల వెడమాటలు మాన్ప నిదియె వెరవెబ్బంగిన్
నడి కంటె చావుమేలనియెడి పలుకుఁ దలంపవలదె యిలఁ బురుషులకున్".

"పూని జీవితంబులైన మిమ్మైనను వలయుచోట విడువ వచ్చుఁగాని
వర్తనంబు గారవం బొక యించుకయైన విడువ దుస్సహంబు నాకు".

—(అష్ట. 116-120).

రాముని సీతానురాగము, తద్వర్తనమునందలి విశ్వాసము, తద్వియోగజమగు విషాదము అచ్చొత్తినట్లు రచింపఁబడినవి మొదటి రెండు పద్యములు. ధరాసుత, పృథ్వీసుత అను విశేషణములు సీత అయోనిజ యనియు, క్షమా సమన్విత యనియు,పవిత్రశీలయనియు వ్యంగ్యముగాఁ దెల్పుచున్నవి.'అయ్యెడ','ఇయ్యెడ' అను పదములు ప్రయోగించుటచే పరోక్షముగా జరిగిన వృత్తాంతముపై ప్రజల

కేర్పడిన ప్రత్యక్ష శంకనుగూర్చి రాముని విచారము సువ్యక్తమగుచున్నది. లోకవృత్త మిట్టిదికదా! యని అతనిభావము. 'అందొక కీడు గల్గు నే' అనుటలో సీతాచరిత్రము నందెట్టి కళంకమును నోటఁ బల్కలేని విశేషానురాగము, 'అక్కట నోరుప్రువ్వదే' అనుటలో జాలి, పాపభీతి, 'నేను పృథివీసుత చిత్తము పెంపెరుంగ నే' అనుటలో సీతారాములమధ్య 'త్వమేవాహ' మ్మను రూపమున గల ప్రేమయు తేటతెల్లమగుచున్నవి. ఇఁక చివటి మూఁడు పద్యములందును యశో ధర్మనిర్వహణముపై అతనికిఁగల దృఢదీక్ష స్పష్టమగుచున్నది. "అస్ఖలితంబుగ" "నను శుద్ధుఁ జేయుఁడు" "నిజంబుగ నిప్డు పరిత్యజించినంగాని" "కాదని నోళ్ళనుమూయవచ్చునే" "సడికంటె చావుమేలు" "జీవితంబులైన మిమ్మైనను, వర్తనంబు గారవంబు — దుస్సహంబు" అను పదముల ప్రయోగము తత్పోషకములు, సీతాపరిత్యాగము శ్రీరాముని ధర్మబద్ధమైన యశః కాముకతకు ప్రతిఫలరూపము కాన తత్పోషకమగుచున్నది.

లవణవిజేతయైన శత్రుఘ్ను నాశ్రయించిన యుద్ధవీరము రాముని ధర్మవీరమున కంగము. రాముఁడు శూద్రతపస్విని సంహరించి బ్రాహ్మణ బాలకుని సంరక్షించుటయందును, రాజసూయ యాగాధ్వర దీక్షయందును, సతీవియోగానంతరముఁ బుత్త్రికుల నయోధ్యకుఁ గొంపోయి రాజవిద్యల నేర్పించుట యందును శ్రీరాముని ధర్మవీరము మూర్తికట్టినది.

కంకంటి పాపరాజు ఉత్తరరామాయణమును తిక్కన కన్నను విపులముగా ననువదించి యున్నాఁడు. అతఁడు శ్రీరామనిర్యాణముతో కావ్యమును ముగించియుండెను. తిక్కన "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణిప్రథంతే" అను నియమము ననుసరించి నాయక నిర్యాణమును పరిత్యజించెను. వీరిరువురిలో తిక్కన పండబారిన లోకానుభవము కలవాడు, గొప్ప తాత్త్వికవేత్త, వ్యవహారదక్షుఁడు. ఇతని పాత్రలన్నియు ఇట్టి లక్షణములనే ముద్రించుకొని కావ్యలోకమున సాక్షాత్కరించును. కంకంటి పాపరాజు రసార్ద్రహృదయుఁడు; అతిసరళుఁడు. ఇతని పాత్రలు అతనివలనే భావముల తాకిడి కాగఁజాలక కొలఁదిగా నావేశమును బొందుచుండును. సీతాపరిత్యాగ ఘట్టమును తుల్యపరిశీలనఁ జేసినచో నట్టిది తేటపడగలదు. తిక్కన కున్న నిగ్రహశక్తి, పట్టుబడిచేసి పదములను వాడు నేర్పు, సందర్భోచిత సంభాషణా నైపుణ్యము, భావవ్యక్తీకరణ దక్షత యితనియందు కొంత బిగువుపీడి కానఁబడును. తిక్కన కవిత శరత్పూర్ణిమాచంద్ర సాంద్రశీతల కిరణ సందో

హాముచలెనుండి పఠితల హృదయములను చంద్రకాంత శిలలనువలె జలదరింపఁ జేయును. పాపరాజు కవిత అగ్నిశిఖ వెన్నను కరిగించినట్లు పఠితహృదయము కరిగించును.

## ౨. పల్నాటి వీరచరిత్ర-శ్రీనాథుఁడు :

శ్రీనాథ మహాకవి విరచితమైన "పల్నాటి వీరచరిత్ర" మంజరీ ద్విపద కావ్యము. తెలుఁగునందలి పిల్లభారతమిది. అన్నదమ్ములగు కౌరవపాండవులు పరస్పరముఁబోరి కురుక్షేత్రమునఁ గులక్షయ మొనరించుకొనినట్లు అనుగురాజు పుత్రులగు మలదేవ నలగామరాజులు తమలో తాము పోరి యపార ప్రాణ నష్టమునొందిరి. ఇందు మలదేవుని మహామంత్రియైన బ్రహ్మనాయని వీరసుతుఁడు బాలవీరుఁడు అన్వర్థ నామధేయుఁడు. అతఁడు శత్రుభయంకరముగాఁ బోరి రణరంగమునకు బలియగుట ఈ కావ్యములోని విషాదాంత వీరఘట్టము. మహాభారతమునందలి యభిమన్యుని జ్ఞప్తికిఁదెచ్చి తెలుఁగువారి హృదయాలలో శాశ్వతస్థానము సంపాదించుకొనిన ఆ అమరజీవి వీరగాథ శ్రీనాథుని మధుర కవితా ప్రవంతికి ఎనలేని దేసి రుచులను దెచ్చిపెట్టినది.

ఇతివృత్తమునందు కవిదృష్టి బాలుని విక్రమముపైఁ గేంద్రీకరింపఁబడినది; తద్విపుల వర్ణనముచే కావ్యము వీరరసాప్లుత మయినది.

> "కార్యమపూడి శ్రీ కదనంబునందు, నరపాల చంద్రుండు నలగాముతాక
> పంపిన బాలుండు బాహు విక్రముఁడు, తోరంపు గజములు తురగచయంబు
> మన్నీలబలముల మహిత శౌర్యమున, చెదరి పాఱఁగ బొడ్చి చీకాకు సేసి
> నలగాము తమ్ముఁడు నరసింగు నెదిరి, మర్దించి రణమున మడిసిన విధము
> ప్రచురింతు వీనుల పండువు గాగ." —పు. 2, 3.

అని శ్రీనాథుఁడే తన కావ్య రచనాంశమును ప్రతిపాదించినాఁడు.

బాలచంద్రుని యందేగాక కథావశమునఁ బ్రసక్తములగు నితర పాత్రల యందును ఉచితమగునట్లు వీరరస మచ్చుపడునట్లు రచన మొనర్చినాఁడు శ్రీనాథుఁడు. మలిదేవరాజు నాస్థానమున సకల వీరచయ ముత్కటోత్సాహముతో మహామంత్రిముందు పల్కిన వీరాలాపములు రసాకరములు :

> "మముఁ జూడు నాయఁడా మాలావు కొలఁది,
> మముఁ జూడు బ్రహ్మన్న ! మా శౌర్యపటిమ
> సింధురములమీఁదఁ జెన్నుగా దుమికి
> కుంభస్థలంబులఁ గ్రుంగఁజేసెదము...............

గురిజాల నేలెడు కువలయేశ్వరుని
చలమున విడువక చంపఁగాఁ గలము.'' —పుట 5

ప్రభుభక్తిపరాయణులైన వీరవరులు శౌర్యప్రదర్శనావసరము దొఱికినదికదా యని తను యౌత్సుక్యమును వ్యక్తపరచినారు.

బ్రహ్మనాయు డర్ధరాత్రమున కార్యమపూడి రణరంగమును బరీక్షించుటకై పంపిన కన్నమనీని వర్ణనము విభావస్వరూపమును మూర్తుల ప్రత్యక్ష మొనర్చుచును రసోత్పత్తి హేతువగుచున్నది.

''వాసన పెల్లైన వనమాల గదల, కరముల గుజ్జరి కడియముల్ మెరయ
నీలైన పిడిఘంట నెమలి సోగలును, నల్లని దట్టిని నయమొప్ప గట్టి
అర్ధనారీ ఝుల్లకాదులు నమర, ఘోరభైరవ గద కోరమీసములు
ఎగు భుజంబులు మించు నెరజేరు గ్రుడ్లు, ఘనమైన దేహంబు కాలిపెండెరము
వెరపైన భీకర వేషంబుతోడ, కదలె కన్నమనీడు కదనభూమికిని
కాటుక కొండయై కదిసినయట్లు, గరిమతో చీకటి గ్రమ్మినయట్లు.''
—పు. 9.

వర్ణనమంత యొక యెత్తు; చివఱి యుపమాలంకార మొక యెత్తు. మణిహారమున నాయకమణివలె నింద్రనీలశోభల నీనుచు, కాటుకకొండ, చీకటి, అనెడి యుపమానములు అతని గంభీర వ్యాపకరూపమును తెల్పుచు, శ్రీనాథుని అనంత ప్రకృతి సంచలన ప్రభావము వెలార్చెడి యలంకార ప్రయోగనైపుణ్యమును సరళసుందరముగాఁ బ్రదర్శించుచున్నది.

భట్టు రాయబార ఘట్టమున ధర్మవీరమును, నలగామధిక్కారమున మానవీరమును, స్వీయబల నిరూపణములో నిరువురియందును బలవీరమును, నాయకురాలు భట్టుతోఁ బల్కిన మాటలలో మానబలవీరములును, నలగామ రాజు గజారూఢుఁడై నలగామ విచ్చేసి వివిధ రాజబృందములతో రణమున కాయత్తపడుటయందు రణోత్సాహమును, బ్రహ్మనాయని పక్షపు వీరులు యుద్ధమునకు త్వరపడుటలో యుద్ధవీరమును, రణనీతిని బోధించెడి బ్రహ్మనాయని యందు ధర్మవీరమును ప్రస్ఫుటముగాఁ బోషింపఁబడి కావ్యరసమునకు సర్వాంగసౌష్టవమును జేకూర్చి పెట్టుచున్నవి.

బాలవీరుఁ డెంత వీరుఁడో అంత పండితుఁడు, జ్ఞానవృద్ధుఁడైన ఆ బాలునికి వీర మబ్బుట బంగారమునకు తావి యబ్బినట్లైనది. మహాభారత వీరగాథలను వినిపించిన తల్లినిగాంచి :

"వినవమ్మ తల్లిరో విమలేందువదన ! ధర్మార్థకామ తత్త్వం బెఱుంగుదును
శాస్త్రజాలంబుల చాలగవింటి. మనమునఁ దెలిసిన మర్మంబు లెల్ల
ప్రకృత కౌమార చాపల్యంబు కతన, చిత్త విశ్రాంతికై చేరి యీవేళ
బొంగరాలాడగ బుద్ధి జనించె " —పు. 39.

మోక్ష పురుషార్థము తప్ప పురుషార్థత్రయతత్త్వమును, సర్వశాస్త్రములను యుక్తవయస్సుననే సాధించితినని చెప్పుటలోని యతని యహంకారమునందు విద్యావీరము తొంగిచూచుచున్నది. బాలచంద్రుఁడు తల్లికి వైరాగ్యము బోధించుటలో జ్ఞానవీరము ప్రదర్శించినాఁడు.

ఐతమ్మ యుద్ధవిముఖుని చేయుటకై యెంత ప్రయత్నించినను బాలచంద్రుఁడు యుద్ధము తన ధర్మమని పల్కినాఁడు.

"ఈ సమయంబున నే నేగ కున్న, అపకీర్తి పాలౌదు హానియు వచ్చు
తండ్రి కష్టంబును దప్పింపలేని, పుత్త్రిడుండిన నేమి పోయిన నేమి
జనకుడె పుత్రుడై జనియించు నంచు, గొల్లున వేదముల్ ఘోషించుచుండు....
తల్లిరో నా కసాధ్యం బిల లేదు, బ్రహ్మాండములబట్టి బంతులాడుదును
మృత్యుదేవతనైన మెదిపి వైచెదను, హరిహరుల్ మెచ్చఁగా ననిచేసి మించి
కామభూ విభునకుఁగల బలం బెల్ల, ఖండించివైచెద కలియుగమందు
వీరచరిత్రలు పెక్కు వెలయజేయుదును, తల్లి! పంపుము నన్ను తడయంగనేల?"
—పు. 50

"వీరచరిత్రలు...చేయుటననుట" శ్రీనాథుని చమత్కారము. వ్యంగ్యముగా నాతఁడక్షరరూపు డగునని ధ్వనించుచున్నాడు.

బాలచంద్రుఁడు స్వధర్మ నిరూపణ మొనర్చి, దుఃఖితయైన యైతమ్మకు ధైర్యముఁ జేకూర్చుటకై ప్రయత్నించుచు స్వర్ణాక్షరములలో లిఖింపఁదగిన యుదాత్తవచనము లిట్లు పల్కినాఁడు.

"జనులకు కష్టంబు సమకూరునపుడు, శ్రీవీర వీర్యంబు చెదరంగఁజేయు
దేశంబు పరనృపాధీనమౌనపుడు, శ్రీవీర సత్త్వంబు చిక్కంగఁబట్టు
సామ్రాజ్య తరువెండి చచ్చెడునపుడు, శ్రీవీర రక్తంబు చిగిరింపఁజేయు
రాజసేవకులకు రణమే సుఖంబు". —పు. 61.

ఈ మాటలలో శ్రీనాథుఁడు బాలుని శ్రీరామునంతటి వానిఁజేసి తెలుఁగువారి కిచ్చినాఁడు. యుగయుగాల చరిత్రలో ప్రతియుగకర్తయైన వీరుని చరిత్రయందు రక్తసిక్తాక్షరాలతో లిఖింపఁదగిన సందేశ మిదియే. కవోష్ణరుధిరమున

బాలచంద్రుని శరీరములో దానిని పారించి మనలఁ బులకరింపఁ జేసినాఁడు కవిరాజు.

భర్తను దీవించి వీరఖడ్గము చేతికందించి కదనరంగమున కంపు మాంచాల మూర్తి కట్టిన వీరరసము; ఘనీభవించిన ధృతి. పదునాల్గు వత్సరాల కానన వాసమునకు అశ్రుకణాలమధ్య తొణికిసలాడు చిఱునవ్వుతో భర్తనంపిన యూర్మిళాసతి కీమె గురుస్థానము. కాని మాంచాల యుత్తర నోచిన నోములే నోచినది. భర్తనుండి తొలివలపుతేనె నొక్కసారియైన నోచుకొనని యాపడఁతి భర్తను మృత్యువుపైకి దాడిపంపి త్యాగమూర్తి యైనది.

"నవ్వుచు దీవించె నలినాయతాక్షి, రతిరాజ సుందరా! రణరంగధీర!
కమలబాంధవ తేజ! కరుణాలవాల! వినతాత్మజుని లావు వెస నీకు గలుగు
సామీనికుండిన సాహసంబబ్బు, కృష్ణుని కీడుగా కీర్తి ఘటిల్లు
రతికాంతి యుతుడవై రంజిల్లుచుండి, అలరాజు పగ దీర్పు మనుజులతోడ
పటుతర విక్రమ వైభవం బలర, శ్రీగిరి లింగంబు చెన్నకేశవుడు
వరము లొసంగగ వర్తిల్లగలరు, శాత్రవ విజయంబు సమకూరు మీకు
ఈయాయుధము వడి నిచ్చును జయము,కలియుగంబున మీకు ఘనపూజలమరు"
—పు. 78.

ఇయ్యాదర్శవీరనారీమణికి పతియందుగల యనురాగము, దైవబల మాతని కేర్పడవలెననెడి కోర్కె, కృష్ణుఁడంతవాఁడుగా తనభర్త కావలయుననెడి యాశ, పతి పరాక్రమములపై దృఢ విశ్వాసము, జయము గల్గునన్న నిశ్చయము. చెన్నకేశవునిపైఁగల భక్తి ప్రకటితములయి వీరరస స్ఫోరకములగు చున్నవి. ఇట్లే ఐతాంబ పుత్రుని వీరమాత కుచితమైన రీతిగా దీవించి పంపి క్షత్రియవనితాధర్మమును పోషించినది.

నల్లగొండ శిఖరముపైనుండి బాలచంద్రుఁడు—

"వెనుకటి రాజులు విక్రమస్ఫూర్తి, గట్టున చెలరేగి కదనంబు సల్ప
వీరుల రక్తంబు విసువక త్రాగి, మత్తిల్లి యల్లన మలయుచునున్న."

నాగులేరును, కదరంగమును జూడగనే యతని యొడ లుప్పొంగి రక్త ముడు కెక్కినది. నల్లగొండ దిగఁబారి రాజదర్శనమునకు మత్తాశ్వములవలె వరువెత్తి నాడు. సభలో కన్నమదాసుకు తగిన ప్రత్యుత్తరరమిచ్చి నోరు మూయించి నాఁడు.

"చినవాడ నంటివి చెలగి యీాకలన, అలనాడు గురిజాల నయినట్టి పగకు
చేపట్టి యిల్లడ చేయగాలేదె అపుడు, బాలుడనౌదు నఖిలభూపతుల
కెదిరి యుద్ధముచేయ నేనిల్చినప్పు, డపకీర్తిమాటల నాడుట తగవె
వినగూడ దీమాట విడువుము చాలు." —పు. 93.

అని కన్నమనీని మాటలు త్రోచిపుచ్చి సభలోని వీరులను రోసముగల్గు పల్కు-లచే రెచ్చకొట్టినాడు.

"వదలక రాజును వంచించినపుడె, నాచేతి కత్తితో నాయకుల్ జూడ
తల తెగగొట్టుచు ధరణీశు నెదుట, సత్యంబు పల్కితి శంక నాకేల."
—పు. 95.

అని భీషణ ప్రతిజ్ఞఁజేసి ప్రభుభక్తి వెలార్చి సేవాధర్మమగు యుద్ధవీరమును ప్రదర్శించి రాజును సేవించినాఁడు. మహాభారతమునందలి భీమార్జునుల ప్రతిజ్ఞల నిది జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. మాడచి కార్యమపూడి శిబిరములో రక్తసిక్తమయిన జందెమును, బిరుదమును నీయగా వానినిగాంచుటతోఁడనే పెద్దగా బొబ్బరించి శత్రువీరుల సంహరింతునని ప్రతిజ్ఞచేసిన బాలవీరునియందు శత్రువులు ముందున్నారని భావించి గర్జించెడి భీమసేనుఁడు ప్రత్యక్షమగును.

రణమునకు వారించు తండ్రితో ననిన బాలచంద్రుని పల్కులు జలద గంభీరస్వనములు :

"పిడుగు చిన్నది కాదె భేదించుకొండ, చిన్న మిర్యమునందు చెడునె కారంబు
ఘన కపాలము కెక్కి కాక నొందించు, మానక నోరంత మందును లెస్స!
కాలదావాగ్నికి కారడవెదురె? హనుమాను డెగురు నా చౌటిపశెలు
వారిధి లంఘించి వడిదాటుగాక!" —పు. 106.

ఈ నిదర్శనములో నొక్కొక్కటి ఆ పిన్నవాని హృదయమునందు రాజుకొను వీరదావాగ్నియొక్క యొక్కొక్క శిఖ; వ్యంగ్యముగా నాతని పరాక్రమము దీపింపఁజేయు విద్యుద్దీప పరంపర. అలంకార వ్యంగ్య మిందు క్రమముగా రసవ్యంగ్యముగా మారి కావ్యాంగిరసపోషకమగుచున్నది.

బాలచంద్రుఁడు శత్రుసేనను నురుమాడునపుడు, వెంకుని యొక్కయు, నరసింహుని యొక్కయు శిరములఁ ద్రెంచునపుడు, వారితో ద్వంద్వయుద్ధములు సేయునపుడు ఒడలు తెలియని ఆవేశముతో రౌద్రమూర్తియై వీరభద్రునివలె గోచరించెను. తనను విమర్శించిన తండ్రితో నభిమాన ముట్టిపడ

గర్వాతిశయముతోఁ బల్కిన పల్కులు మానవీరమునకు చక్కని యుదాహరణ ములు :

"వెన్నిచ్చి వచ్చితి విమతుల కీవు, వెన్నిచ్చి వచ్చెడి వీరుడగాను
సుమ్మని పల్కిన శూరవాక్యములు, విదితమై తోచెను వీరుల కిప్పు
డల బాలచంద్రు డహంకారగరిమ, తెంపుచే కలనికి తిరిగి ధైర్యమున
రయమున నేతెంచి రణములో నిలిచె." —పు. 117.

ప్రళయకాల రుద్రనాట్యమువలెనున్న అతని చివరి యుద్ధము వర్ణింపశక్యము కాదని శ్రీనాథుఁడే :

"అప్పటి రణకర్మ మలవియే పొగడ, వాణీశు డైనను వర్ణింపలేడు." —పు. 117.

అని చేఁజారలు సాచినాఁడనఁగా- ఇక మనమాట యేమి? అదియే పెక్కు రీతుల బాలుని వీరము నతిశయింపజేసినది.

బాలచంద్రుని జీవితము - మంత్రసహితమగు హవిస్సుపై కొన గప్పుని దటికొన్న భీషణ యజ్ఞపావకజ్వాలవంటిది; పెనుతుపానులో పెచ్చుపెరిగి కలపాత్రములను సంక్షుభితపరచి దిగ్గున క్రుంగిపోవు పయోధితరంగమువంటిది. అదియొక విషాదాంత వీరగాథ. కనులముందు కలగా కరిగిపోయినను, పఠిత హృదయమున చెరగని ముద్రవేసెడి మహత్తు దానిది. ఆర్ద్రమయిన తెలుఁగు వానిగుండె. బాలచంద్రుఁడే స్వయముగా—

"పాండు భూవరునకు పౌత్రుడనగుచు, అభిమన్యుడనుపేర అవని జన్మించి
వీరధర్మము చూపి వెలసినవాఁడ, నాడు బాలుడగానె నాయకులార !" —పు. 105.

అని కథ చెప్పుచుండ విస్తుపోయి నమ్మి తీరుననుటలో నాశ్చర్యము లేదు.

## ౩. విక్రమార్కచరిత్ర - జక్కన :

జక్కనకవి విరచిత 'విక్రమార్కచరిత్ర'కు కృతిభర్త యగు సిద్ధనామాత్యుఁడు.

"..............................................సాహసక్రియా
కలిత వదాన్యతాది గుణగౌరవ రేఖల విక్రమార్క భూ
తలపతి యెక్కుడై నెగడెఁ దచ్చరితంబు ప్రబంధశయ్యగాఁ
దెలుఁగునఁ జెప్పి యాకృతిపతిత్వము మా కొడఁగూర్పు నేర్పునన్."

అని విక్రమార్కుఁడు నాయకుఁడుగా నొక తెలుఁగు ప్రబంధమును నిర్మింపుమని కోరినాఁడు. విక్రమార్కుఁడు వదాన్యాది గుణసంభరితుఁడు, పూజనీయుఁడు, అట్టి వదాన్యత సాహసక్రియాదులవలనఁ గల్గుచున్నది. కావ్యమునందు అతని సాహసక్రియలతో కూడిన కథలే వర్ణితమగునని యిందువలన స్పష్టమగుచున్నది.

అసాధ్యమైన కార్యమొకటి యెదుట నుండగా దానిని సాధించుటకై తత్ఫలితాదులను లెక్కసేయక ముందుకురుకు తెగువ సాహసమనఁబడును. అదియొకవిధముగా నపూర్వ సాధనోత్సాహభరితమే కావున వీరరసస్ఫూర్తి అట్టి కథలలో తప్పక గోచరించును.

సాహసగాథలు సామాన్యముగా రెండువిధములు 1. నాయకుఁడు ధీరోదాత్తాదిలక్షణ సమన్వితుఁడై పురుషకారము వెలార్చి, త్యాగము ప్రదర్శించి దైవబలము గడించి, ఒక కార్యమును-ఫలోన్ముఖమైన యుత్సాహ ప్రవృత్తితో సాధించెడిక్రమము వర్ణితమైనది. 2. అసాధ్యమైన యొక కార్యమును నాయకుఁడొక అద్భుతశక్తితో సాధించుట వర్ణితమైనది. వీనిలో మొదటి విధమందు వీరరసస్ఫూర్తి యధికము. రెండవదానియందు అద్భుత రసస్ఫూర్తి అమితము. జక్కన విక్రమార్క చరిత్రము రెండవతెగకు చెందవలెను.

సాహసగాథలలో నాయకుఁడు అసామాన్య శక్తియుక్తుఁడై యుండుట సహజము. విక్రమార్కుఁ డవతారపురుషునివలె గోచరించును. ఉజ్జయినీనగర దేవాలయ ప్రాంతమున నున్న "తెగని యుట్టి"ని త్రెంచి గౌరీమహాదేవిచే సాహసాంకుఁ డని బిరుదము పొందినాఁడు. ఆమె నతని నిట్లని ప్రశంసించినది:

"ఈ యిల ధర్మరక్ష వెలయింప జనించినయట్టి యాదినా
రాయణమూర్తి వీవు భవదంఘ్రిసరోరుహ సేవ నర్థిమైఁ
జేయఁగ నాత్మఁ గోరి సరసీరుహగర్భుఁడు పుట్టె భట్టియై
పాయక జోడుగూడి యిలఁ బాలనసేయుట మీకు నైజమౌ."

ఆమె మాటలలో నాతఁడు నారాయణాంశ సంభూతుఁడని స్పష్టపడినది. అతనికి స్వయంశక్తితోపాటు, ఆసురీశక్తి సమన్వితములగు దండము, పాదుకలు, పాత్రము అనునవి అతనికి ఉపస్కారకములైనవి. వీని ప్రయోజనము లివ్వి: దండముచే భూమిపై గీచినచో పట్టణములే వెలియును; పాదుకలు తొడిగి సంకల్పించినచో నెచటికైన నేగగల్గును; కోరిచచో పాత్రసరసాన్నము లిడును. ఈ మాటని కూర్చుటలో కవి చాకచక్యము ప్రదర్శించినాఁడు. అది యేమన:

నాయకుని యుత్సాహస్ఫూర్తికి అడ్డము రాని శక్తులీ మూఁడు. నగరనిర్మాణము, దూరగమనము, భోజనప్రాప్తి - ఈ మూడుఁను సాహసకార్యములలో నంత యుపయోగపడునవి కావు; ఇన్నియున్నను ధైర్యము, ఉత్సాహము లేనిచో వ్యర్థము. కావున నతని నుత్సాహమాశ్రయించియే యుండును. చక్రమువంటి యే శక్తియో అతఁడు కల్గియుండినచో శత్రుసంహారాదులగు కృత్యముల నవలీలగా నొనర్చి అద్భుత స్ఫూర్తియే కలిగించెడివాఁడు. అట్టిదిలేదు కావున నాతనియందు పురుషకారాదు లధికముగా స్ఫురించి, వాస్తవికతను సంతరించుకొని రసపోషకములగుట కవకాశము కల్గుచున్నది. అందువలననే కాబోఁలు కృతిభర్త కృతికర్తను—

"స్వాభావిక నవకవితా ప్రాభవముల నుభయభాష వక్కాణింపన్
భూభువనంబున సరిలే రాభారతి నీవుదక్క నన్నయజక్కా."

—(ప్ర. 24).

అని కీర్తించెను.

యుద్ధాది వీరఘట్టములందు జక్కన కవిత రసవంతముగా నుండును. విభావాదులను ఆలంకారిక రచనతో సమర్థముగా నొప్పించుశక్తి యితనియందు బాగుగా నున్నది. ఉ. నారదునిచే బ్రేరేచఁబడి విక్రమార్కుఁడు విదర్భ రాజ కన్యయగు ననంగవతిని బలిమిని గొంపోవనేతెంచు సిద్ధపురప్రభువగు శకమహీనాథునితో డీకొనెను. ఉభయ బలములు పోరిన క్రమము రసవంతము :

"అరుదృగ్గురుచులును నాయుధప్రభలును మార్తాండదీప్తితో మారుమలయ
హుంకారములు భేరిభాంకారములు వలయాద్రిని బ్రతి విరామముల నినుప
సింహనాదంబులు శింజినీధ్వనులు నాకాశకరి గుండె లదరఁజేయ
నట్టహాసంబులు హయహేషితంబులు గగనంబు తోరణ కట్టికొనఁగ
నుభయబలముల సుభటులు నుగ్రవీర రసవిజృంభణ మరుదుగా రహిఁ గడంగి
కదియు నప్పటి పటుపాదఘట్టనమున నుర్వి యంతంత నుత్ఘాత లూఁగదొడఁగె".

నాయకుఁడు వీరరణ మొనరించి లబ్ధవిజయుఁడై యుండ నాతనిని విజయ లక్ష్మీసమేతుఁడైన నారాయణు నట్లు వర్ణించి యౌచిత్యమును పోషించినాఁడు జక్కన :

"నవరత్నమయభూషణస్ఫార రణభూమి విలసిల్లు కల్యాణవేదిగాఁగ
దళితకుంజర కుంభకలిత మౌక్తికరాజి కమనీయ మంగళాక్షతలుగాఁగ
సమరసంక్రీడన సందర్శనాగత సురకోటి పెండిలి దొరలుగాఁగ
బహువిధ జయతూర్య పటునిస్స్వనంబులు రమ్యమంగళవాద్యరవములుగాఁగ

> నుచితకాలజ్ఞుఁ డగు భట్టి యొజ్జగాఁగఁ జటులమైన ప్రతాపాగ్ని సాక్షిగాఁగ
> విజయలక్ష్మి సముద్వాహ విలసనమున సాహసాంక మహీనాథ చంద్రుఁడొప్పె."

వీరశృంగారములను - మిత్రరసములను - రూపకాలంకారము నాశ్రయించి యొప్పించినాఁడు జక్కన. అనంగవతీ వివాహౌత్సుక్య సమన్వితుఁడయిన రణవీరుని నిట్లు వర్ణించుట ఎంతయో రసౌచిత్యము వెలార్చు కావ్యశిల్ప ప్రక్రియ.

ఈ కావ్యమున వీర మంగి; అద్భుతశృంగారాదు లంగములు. అద్భుత మంగి గాఁదగు నీ సాహసగాథలో వీర మంగిగా ననుసంధించుటయే జక్కన చేసిన విశేషము.

## ४. హరిశ్చంద్రోపాఖ్యానము (ద్విపద) - గౌరన :

దేవేంద్రున కొకసారి "పలికి బొంకని మహీపాలుండు గలఁడె" అను ప్రశ్న యుదయించెను. త్రికాలజ్ఞుఁడగు వసిష్ఠమహర్షి హరిశ్చంద్రుఁడు కలఁడని నిరూపించి చెప్పెను.

> "వినుము సురేంద్ర యీ విశ్వంబునందు, వినుతి కెక్కిన మహా విక్రమోన్నతుఁడు
> తనరు షోడశ మహా దాన వినోది, వినయ భూషణుఁడు వివేక సంపన్నుఁ
> డతుల సత్కీర్తి మహా భాగ్యశాలి........సత్యసంధుండు త్రిశంకునందనుఁడు
> నిరుపమ విజ్ఞాననిధి భానువంశ శరనిధి శశి హరిశ్చంద్రుఁడన్రాజు
> పోఁడిమి మదిఁ దలపోసి చూచినను, వాఁడెపో బొంకనివాఁడు దేవేంద్ర."
>
> —పూర్వ. 230-245.

సకలలోక కీర్తి సాంద్రుఁడు, సత్యవ్రతనిష్ఠుఁడు నగువాఁడు హరిశ్చంద్రుఁడు. నాయకగుణగణాదులు ధీరోదాత్తునిగాఁ జెప్పక చెప్పుచున్నవి. విశ్వామిత్రుఁడు వశిష్ఠునిపైఁ బంతముకట్టి హరిశ్చంద్రు నసత్యవాదిగా నిరూపింతునని ప్రతినఁబట్టి మత్సరుఁడై రాజును సాధించెను. గాలివానకు గురియైన వటవృక్షము వలె సత్యమనెడి మూలబలముచే పడిపోలేదు హరిశ్చంద్రుఁడు.

> "హరిహరబ్రహ్మాదు లచ్చెరువొంద, జరిపె సన్నుతి కెక్కు సత్యవ్రతంబు."
>
> —పూర్వ. 141-142.

ఏనుఁగుపై నెక్కి బలవంతుఁ డొకఁడు రత్న మెగురవేసినంత యెత్తుగల ధనరాశిని విశ్వామిత్రుఁ డడిగినప్పుడు కూడ తొణకని ధీరుఁ డా రాజచంద్రుఁడు. పైపెచ్చు-"కృతార్థుఁడనైతి నీ యిష్ట ధనమిత్తుకొ"మ్మనిన దానవీరుఁ డాతఁడు. కౌశిక సృష్టియగు వింతజంతువులు ప్రజల నీతిబాధలకు గురిసేయగా రాజు

ధర్మము సెడకుండ-"ఈపాటి పనికిగా నేలభీతిల్ల-రేపు మాన్పెద"ననుచు నవ లీలగా నివారించిన సత్త్వసంపన్నుఁడు. విశ్వామిత్ర ప్రయుక్తలగు మాతంగ కన్యలు తమ విలాసాదులచే రాజును భ్రమింపఁజేయఁ బూని దరికిఁజేరగా—

"విద్యావారని మిమ్ము విడనాడకున్న, మద్యపానమున మైమఱచి పల్కెదరు !
మిముఁజూడగారాదు మిముముట్టరాదు,మిముఁబొందుమన నెట్లుమీకునోరాడె,
గరుణమై నీతప్పుఁ గాచితి నింక, నరుగక దుర్భాష లాడితి రేని
వాలిన కిన్కమై వాలు నీవాఁడి, వాలున జిహ్వలు వాలుతు..."

—పూ. భా. 1033-1042.

నని బెదిరించి, ఆశ్రమధర్మమును నిలువఁబెట్టుకొనెను. స్త్రీలని ప్రథమదోషమును మన్నించిన దయామయుఁడాతఁడు. విశ్వామిత్రుఁడు బెదిరించినప్పుడు—

"వేయు చెప్పినఁ జెప్పు; విడువఁగులంబు, నాయేలు రాజ్యమైనను విడ్తుగాని."

—పూ. భా. 1385-1386.

అనిన దృఢవ్రతుఁడు. కౌశికుఁడు రాజ్యమడుగఁగా దానిని దానము జేసినాఁడు. అతనియందంత వితరణస్ఫూర్తి కల్గుటకు ధర్మపత్నియగు చంద్రమతి ముఖ్య కారణము. ఋషి వాక్యములకు నివ్వెరబోయిన భర్తనుగాంచి—

"ఎనయ నిద్ధర నెల్ల నేలిన నృపులు, గొనిపోయిరే నేలఁ గొంచెదెడంతైన?
నీ నిఖిలోర్వియు నిమ్మునీంద్రునకు, దానమిమ్మిచట సత్పాత్రంబు దొరికె."

—ప్ర భా. 1426-1429.

అని అతని చిత్తమునఁ దెగువకల్గుట కనుకూలయై పల్కిన ధీరురాలామె. భర్త జన్మవ్రతమును సంరక్షింప నిలిచిన దీక్షామతి ఆ చంద్రమతి! రాజ్య ప్రదానా నంతరము పూర్వపు టప్పు తీర్పుమని కౌశికుఁడు పట్టుపట్టినాఁడు. సర్వము త్యాగముచేసిన రాజు దయ నభ్యర్థించినాఁడు. నిర్దయుఁడగు ఋషి ధనమే కోరినాఁడు. సత్యముపీడని శుద్ధాత్ముఁడగు రాజు ఒక్క నెల గడువు కోరుకొనెను. కౌశికుఁడు చివఱ కంగీకరించియు నాతనిఁ బెక్కిడుమలఁ బాల్చేసెను. నక్షత్ర కుని వారికిఁ దగిలించెను. మాయాముని, రాత్రి, మాయావసిష్ఠుఁడు, సర్ప వృశ్చికాదులు, బేతాళవటము, పిశాచములు, బేతాళుఁడు, మహావృష్టి, సర్ప శరభాదిజంతుబాధలు, దావాగ్ని మొ. వానిని బ్రయోగించి బహుయాతనలఁ బెట్టియు నసత్యముఁ బల్కింపలేకపోయెను.

హరిశ్చంద్రుఁడు భార్యాపుత్త్రుల నమ్ముకొనియు, తనను తానమ్ము కొనియు సత్యమునకై హైన్యముగూడ ధర్మముగాఁ బ్రీతితో శ్రద్ధతో నిర్వ

హించి ధర్మవీరుఁ డయినాఁడు. చక్రవర్తి. చంద్రమతి కాలకౌశికుని సేవలలో పడరానియాతనల ననుభవించినది. హరిశ్చంద్రుఁడు వీరబాహునిఁ గొలిచి కాటి కాపరి యైనాఁడు.

మాయా విషసర్పముచే లోహితుఁడు మరణింప నగ్నిసంస్కారార్థ మాతని రుద్రభూమికిఁ దెచ్చిన చంద్రమతినిగాంచి యుద్యోగధర్మము వీడక :

"ముదిత! యీతగిన చొప్పున నీవుఁ దెచ్చి, యీకుమారుని కగ్గి యిమ్మిటు పొసఁగ
లేకున్నఁ గాల్చి పోలేవు, నన్నేలు నొడయుఁడు వీరబాహుని యడ్డులాన."
—ఉ. భా. 2152-2154.

యని నిష్కర్షించి చెప్పినాఁడు. వారు సతీసుతులని తెలిసిన తరువాతకూడ కన్నీరు వదలినాఁడు కాని సత్యధర్మవ్రతములు జారవిడువ లేదాధీరుఁడు. దుర దృష్టముచే హంతకురాలని నిరూపితురాలైన చంద్రమతిని వధించు బాధ్యతయు హరిశ్చంద్రుని పాలనేబడినది. అది వీరబాహుని యాజ్ఞ !

మొదట అతని కన్నులు చెమ్మగిల్లినవి. అది మానవత్వమునకు చిహ్నము! తన దీనస్థితికి తాను దురపిల్లినాఁడు. భార్య నాథునకు ధైర్యము చెప్పినది:

"ఇనకులాధీశ నీవెఱుఁగని యట్టి, వినుత ధర్మంబులు వేఱొండు గలవె?
మున్ను స్వామిద్రోహి మోవలేననుచుఁ, బన్నగతల్పుతోఁ బలికె భూదేవి"
—ఉ. భా. 2472-2475.

కావున స్వామిద్రోహివి కాక తనను చంపమని పురికొల్పినది. కులసతి "ధర్మార్థ కామసాధన కుపకరణంబు", "విమల చారిత్రశిక్ష కాచార్యకంబు", "సద్గతికి నూఁత", "ఉన్నతస్థిరగుణమణుల కాకరము" అనిన శకుంతలా వచనము లీమె యందన్వర్థములగుచున్నవి. అతని కది చివరిదైన దైవ పరీక్ష! దాని నధిగ మించినాఁడు—ధృతిమంతుఁడై హరిశ్చంద్రుడు :

"బహు సరిత్సాగర పర్వతద్వీప, మహిత మహామహీ మండలభార
మురుతర లీలఁ గేయూర విభాతి, భరియించు నపసవ్య బాహుదండమున
సకల విరోధి రాజన్య కోటీర, నికర కీలిత మణినికషణదీప్త
శాతధారాఖిల చటుల ఖడ్గంబు, భూతముల్ భీతిల్ల ముష్టి నమర్చి
చండ మార్తాండ దుస్సహ దుర్నిరీక్ష, మండల ప్రభలతో మార్కొని మండు
మెఱుఁగు లుగ్రంబుగా మిన్నులఁ బర్వ, నొఱవాయఁ బెఱికి మహోగ్రతఁబూని
జళిపించి, జీవితేశ్వరి మెడ మోపి, కలఁగక తెగవ్రేయ గమకించె నంత."
—ఉ. భా. 2463-2476.

దేవతలు పూలవానఁ గురిపించిరి. ఆ పుణ్యదంపతు లమరులై భారతీయుల హృదయములందు నిలిచిపోయిరి.

గౌరన యిట్టి సత్యవీరుని సుచరిత్రము చలువవెన్నెల జల్లువంటి సరళ సుందర కావ్యరచనా వైశారద్యముతో తెలుఁగువారికి సంతరించి పెట్టినాఁడు. ఇందు సత్యవీరమంగి, ధర్మయశోవీరములు తత్పోషకములు. రౌద్ర కరుణాద్భుత హాస్యాదులు అంగరసములు.

## ౫. జైమినిభారతము - పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి :

"అల్లన విచ్చు చెంగలువలందు రజంబను కప్పురంబు పైఁ
జల్లఁగ జల్లనై వలచు సౌరభముల్ వెదచల్లు భావముల్
పల్లవహస్త చన్నుఁగవ పయ్యెద జేబుగఁ దోచు భాతిగాఁ
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చుఁ గబ్బముల్."

అట్టి మహాకవి రచించిన జైమిని భారతమున మహాభారతాశ్వమేధ పర్వము నందలి యితివృత్తమే గైకొనఁబడినది. ధర్మజుఁ డశ్వమేధ యాగము చేయ యత్నించుట, భీముఁడు యజ్ఞాశ్వముఁ దెచ్చుట, అర్జునుఁడు యజ్ఞాశ్వమును రక్షించుట, సవనాశ్వము వెంట వెడలి—నీలధ్వజ హంసధ్వజ సుధన్వ సురథా భీషణ బభ్రువాహన నకులధ్వజ తామ్రకేశ తామ్రధ్వజ ప్రభృతులతో పోరి శ్రీకృష్ణాదుల సహాయముతో విజయముల సాధించుటయు నిందలి కథ. సందర్భోచితముగ నిందు ఉద్దాలకముని చరిత్రము, లవకుశోపాఖ్యానము, చంద్రహాసోపాఖ్యానము అనునవి ఉపాఖ్యానములుగాఁ గూర్పఁబడినవి. ఈ కథా సంవిధానమంతయు వీరరసోచితముగా నుండి "రమణీయవాగ్రీతి నవరస దర్పణం" బనఁబడుచున్నది.

మహాభారతమునందలి నాయక విభాగమే యిందును వర్తించును. కాన ఫలభోక్తయైన ధర్మరా జిందు నాయకుఁడు. భీమార్జున శ్రీకృష్ణు లనునాయకులు. వీరు ప్రదర్శించిన వీరమంతయు నాయకుని కార్యసాధనకుఁ దోడ్పడి ధర్మవీరమును బోషించుచున్నది.

వేదవ్యాస ప్రబోధితుఁడై ధర్మజుఁడు శోకముడిగి అశ్వమేధ యాగమును తలపెట్టి తన్నిర్వహణ సామర్థ్యమును గూర్చి చింతించుచుండ—భీముఁడు సవనాశ్వమును భద్రావతీ పురమునుండి తెత్తునని ఘోర ప్రతిజ్ఞచేసి అన్నకు బాసట నిలఁబడినాఁడు (౧ ఆ 84-86). భీముని బలవీరమున కంగముగా కర్ణుని

పుత్రుఁడగు వృషకేతుని యుత్సాహము (౧ ఆ. 95) ఘటోత్కచ తనయుఁడగు మేఘవర్ణుని యుత్సాహము (౧ ఆ. 101) సంధింపఁబడినవి. భద్రావతీ నగరమందు మేఘవర్ణుఁడు యౌవనాశ్వుని సైన్యముతోడను, వృషకేతుఁడు యౌవనాశ్వుని తోడను, భీమసేనుఁడు సువేగునితోడను చేసిన యుద్ధములందు యుద్ధవీరము విపులముగాఁ బోషింపఁబడినది. మచ్చున కొక్క పద్యము: సుబాహు భీమసేనుల ద్వంద్వయుద్ధ మతి స్వాభావికముగను, రమ్యతరముగను పినవీరభద్రుఁడు వర్ణించి యుద్ధకళారహస్యజ్ఞు డనిపించుకొనినాఁడు.

> "కనలి భీముఁడు సువేగుని లాగమునఁ జొచ్చి, పడవైచి చరణంబు లొడిసిపట్టి
> విసరి పల్మఱుఁ ద్రిప్పివేయ నమ్మేటియు, ధరఁబడి బంతిచందమున నెగసి
> పెనఁగి వాయుతనూభవుని నవ్విధమ్మునఁ, బడవేయ నవ్వడమడియుఁ గినిసి
> కరటిఘోటక శతాంగములచే నొప్పింపఁ, దప్పించి కదియ నిద్దఱును మఱియుఁ
> బార్ష్ణిపాదోరుపర్వ కూర్పర కరోరముష్టిహతులఁ బగిలిన మోములను దొరఁగు
> రక్తములఁ దొప్పదోఁగి మూర్ఛలను వ్రాలియుండి రావేళ.........."
>
> —2 ఆ. 85.

పిల్లలమఱ్ఱి పినవీరన యుద్ధవర్ణనములు సేయుటలో నీ కావ్యమున దొమ్మి యుద్ధములకన్న ద్వంద్వ యుద్ధములనే రసవత్తరముగా రచింపగల్గినట్లు కానన గుచున్నది.

అర్జునుని సవనాశ్వ రక్షణయాత్రా ఘట్టమును పరిశీలించినచో మహాభారతమునందు కన్న విలక్షణత యిందు గోచరించును. భారతమున నర్జునుఁడు ధర్మరాజప్రోక్తమైన అహింసాధర్మము ననుష్ఠించు యుద్ధవీరునివలె గోచరించును. కాని జైమినిభారతమున శత్రుంతపునివలె శుద్ధప్రతాపమూర్తియై గోచరించును. మహాభారతమున దయావీరమున కంగముగా యుద్ధవీరముండ - ఈ కావ్యమున యుద్ధవీరమే ప్రస్ఫుటముగాఁ బోషింపఁబడినది. ఈ మార్పుచే కవి సాధించినది యుద్ధవీరము విపులముగాఁ బోషించుటయే. కాని మహాభారతమునందలి ధర్మరాజుయొక్క పాత్రలోని గాంభీర్యముగాని, దయామయత్వముగాని యిందు బ్రదర్శితముగాక అతని మహితత్వము కొంత సంకుచిత మొనర్పఁబడినది.

## ౬. చిత్రభారతము - చరికొండ ధర్మన :

చిత్రభారతమను ప్రబంధమును రచించిన చరికొండ ధర్మన 'శతలేఖన్యవధాన పద్యరచనా సంధా సురత్రాణ' బిరుదాంచితుఁడట! అతని వాగ్విలా

సము 'లాసితకంఠోజ్వలజూటకోటరకుటీశీతాంశు రేఖాసుధాన్విత గంగాకనకాబ్జ నిర్భర రసావిర్భూత మాధుర్యము'లట. అతఁ డీ కావ్యమును 'విచిత్రగతి నలంకార సరణిమీద రసములు సిప్పిల మెచ్చులొలుకఁ' దెనుఁగు గావించినాఁడట!

తుల్యుఁ డను ఋషిచే శప్తయై అశ్వాకృతి నున్న రంభ నధిరోహించి చతుర్దనమహారాజాకాశ సంచార మొనర్చుచుండ కాళిందీ నదీపులిన తలమున సూర్యున కర్ఘ్యమిడుచున్న శ్రీకృష్ణుని దోసిలిలో నాయశ్వఫేనము పడెను. శ్రీకృష్ణుఁడు దానికిఁ గోపించి యారాజును నెలరోజులలోఁ జంపుదునని ప్రతిజ్ఞఁ జేసెను. చతుర్దనుఁడు భయభ్రాంతుఁడై అర్జునుని శరణు వేడెను. ఆర్త రక్షణవ్రతుఁడైన కిరీటి యసలుసంగతి తెలియకయే యతని రక్షించుటకు మాట యిచ్చెను. అపైఁ గృష్ణార్జునుల అభిమానములమధ్య పగలు పెరిగి, క్రమముగా—యాదవులకు కురుపాండవులకు యుద్ధము తారసిల్లెను. అందు ధర్మజుఁ డొక్కరుఁడు దప్ప పాండవపక్షమున నున్న వారందఱు సమసిపోయిరి. ఆగతిఁ జూచి విచారించు ధర్మజునిగాంచి కృష్ణుఁడు మృతవీరులలో నొక్కని ప్రాణము గోరు మిచ్చెదనని కరుణించెను. ధర్మమూర్తియగు నాతఁడు ఆశ్రితుఁడగు చతుర్దనుని బ్రతికింప వేడుకొనెను. కృష్ణుఁ డతని ధర్మవ్రతమునకు మెచ్చి వీరమరణ మొందిన వీరులనందఱిని బ్రతికించెను ఇది ప్రధానేతివృత్తము. శరణాగత రక్షణమను స్వీయధర్మమును రక్షించుకొనుటకై పాండవులు చేసిన అమోఘప్రయత్నము ఈ కథకు జీవము. అదియే వీరరసము.

చరికొండ ధర్మన తుల్యమహర్షి చరిత్రము రచించుచున్నప్పుడు కాళిదాస నన్నెచోడుల కుమారసంభవముల నాదర్శముగా గొనినట్లు అందలి వర్ణనలు, పాత్రసంభాషణలు చెప్పకచెప్పుచున్నవి. యాదవ పాండవవైరమునందు భక్తి సంగముగా గల్గిన మానధర్మవీరములు చమత్కారముగా ననుసంధింపఁబడినవి. తద్రచనమునం దీ కవి మహాభారతమును, ఉత్తర హరివంశమును ఆదర్శముగా గొనినట్లు గోచరించుచున్నది.

తుల్యమహర్షి యందు తపోవీరము విపులముగా వర్ణితము. ధర్మనకవి ప్రాచీనకవులవలె గ్రీష్మాది ఋతువులందు తపస్విచేయు ఘోరతపస్సు నుత్సాహ ప్రధానముగా వర్ణించి తన్నియమవ్రతాదుల విశదపరచినాఁడు.

శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ విని భయభ్రాంతుఁడైన చతుర్దనుఁడు పరువులెత్తి శశికళాధరుని కసలు సంగతిచెప్పి, శరణువేడినాఁడు. అతడు సమాధానముగా :

"తనకాంతామణి సత్యభామకు వినోదక్రీడకై దేవలో
కనివాసంబగు పారిజాతము సురౌఘంబెల్లఁ గాపున్నచోఁ
గొని కృష్ణుం డరుగంగ నేఁ దొడరి తద్ఘోరాజి బెండొంది వీఁ
గినవాఁడ న్వినుమా నరేంద్ర నిను రక్షింపంగ శక్తుండనే" —పంచ. 75.

అని యాత్రిపురారియే చేయి వెల్లికిల వేసినాఁడు. అతనికి పాశుపతాస్త్ర ధారియే శరణైనాఁడు. రాజీసారి జాగ్రత్తపడి తనగోడు ముందు చెప్పకయే తెలివి తేటలతో సరాసరి శరణు వేడినాఁడు. గాండీవియు—

"మనుజాధీశులఁ జెప్పనేల సకలామర్త్యాల్ దగన్ రేఁచి వ
చ్చిన శ్రీకృష్ణుని పాదమాన నిను రక్షింతున్ భయంబెద్ది న
మ్ము నరేంద్రా! విను మత్ప్రతిజ్ఞ భువనంబుల్ సాక్షిగాఁ గావకుం
డిన మన్మార్గము నాదు నిష్ఠురకృపాణిం ద్రెంచుకొందు న్వడిన్"
—పంచ. 191.

అని భీకరముగా ప్రతిజ్ఞ చేసినాఁడు. ఇందు 'మనుజా...చెప్పనేల' యనుటలో నహంకారము, 'శ్రీకృష్ణుని...అన' అనుటలో భక్తి, ప్రమాణబుద్ధి, 'నమ్ము' మనుటలో నిశ్చయము, 'మన్మార్గము...వడిన్' అనుటలో నభిమానము గోచరించుచు శరణాగత రక్షణోత్సాహము సర్వాంగముగాఁ బోషింపఁబడుచున్నది. 'శ్రీకృష్ణుని పాదమాన' అనుటలో కవి నరునికి ముందేర్పడు పరిస్థితులకు విరుద్ధముగా తుల్యబలవిరోధము (contrast) ప్రదర్శించుచు తత్పాత్రగత భావనిర్వేదమునకు బీజము నాటినాఁడు. శ్రీకృష్ణుఁడే తనకు ప్రత్యర్థియని తెలిసిన కిరీటి కుప్పకూలి—

"బ్రహ్మదేవుని వంటివాఁడును వనభూమి
మాయసేయఁగఁబోయి మాయఁ బడియె........
వాసవు నంతటివాఁడును సంగర
స్థలమున నెదిరించి చాలఁ దూలె
మఱియుఁ దక్కటి రిపువీర మండలంబు
పిలుకుమారె సరోజాక్షు పెంపుచేత
నరుఁడ నాకథ యెంత భండనమునందు
నిలువఁగలనే యటంచు—వెండియు నతండు.

వ. తన మనంబున వితర్కించె.

తన తనువు నిలుపుకంటెన్ దనమాట నిజంబుఁ జేయఁదగు ధీరులకున్
దనపలుకు నిలిపి సురలకుఁ దనువొసఁగి దధీచి కీర్తిధన్యుఁడు గాఁడే!

"కావున శరణాగతునిన్ భూవరుఁ గాచెదను సమరభూమిన్ హరిచేఁ
జావైన లెస్స యటుగాదా విజయంబైన మిగుల ధన్యతగాదే."
—పంచ. 203-205, 209.

శ్రీకృష్ణుని పరాక్రమాదులు కిరీటియం దపజయభీతినిఁ గల్గింపఁజేసినవి. కాని ధర్మరక్షణమందు ప్రాణత్యాగమైనను ఉచితమే యను ధర్మమువలనను, దధీచ్యాదుల స్మరణమువలనను శరణాగత రక్షణమే శరణ్యమని వితర్కానంతరము నిశ్చయించుకొనెను. హరితోడి యుద్ధ మైహికాముష్మిక ఫలప్రదము గనుక అర్జునునకు భయము తీరినది.

పాండవ పక్షమునందలి పాత్రలు చాల విచిత్రముగాఁ బోషింపఁబడినవి. ధర్మజునకు శ్రీకృష్ణునితోఁ బోరుట యిష్టములేదు. పరాజయ భీతి దానికి కారణము. ఇటు శరణార్థిని వీడుట కిచ్ఛగింపఁడు. ధర్మభీతి దానికి హేతువు. రెండింటి నడుమఁబడి నలిగిపోవు నాతఁడు శ్రీకృష్ణుని యొద్దనుండి దూతగా వచ్చిన అక్రూరునితో నెయ్యము తియ్యమగునట్లు వినమ్రుఁడై భక్తి భరితమగు సందేశమునే ధర్మజుఁడు పంపెను. వినయము సాధించునంత విజయమే యితర గుణము సాధింపఁజాలదని యాతని యభిమతము. మానవ సద్గుణసాధనలో పరాకాష్ఠ వినయము.

"కమలదళాక్ష ! మీ జనకు గాదిలి సోదరి మాకుఁ దల్లి భా
వమునఁ దలంచినన్ నెనరువారము వెండియు దేవరదుఁ గూ
రిమిగలయట్టి భక్తులము ప్రీతిమెయిం గరుణింపు సర్వభూ
రమణులలోన నెయ్యపు మఱందికి నీ చనవియ్యఁ జెల్లదే?"

"వలవరి మూపు గో దివిజ వల్లభునిం దెగఁ జూచి వైరులం
గెలువఁగఁజేసి శుభ్రతర కీర్తి దిశావళి నించి యింతగా
మెలపితి వీవ యిప్పు డొక మేదిని ఱేనికినై విరోధివై
నలఁచిన నవ్వరే సురగణంబులు మానవనాథకోటులన్." —షష్ఠా. 81, 82.

ఇందు ధర్మజుని నీతి యత్యంతాశ్చర్యదాయకము. 'కమలదళాక్ష!' అను సంబోధనలోనే వ్యంగ్యార్థమిట్లు బోధపడుచున్నది : 'స్వరూపముచేత నవి విశాలము లగుటచే విశాలదృష్టి కలవాఁడా! త్రికాల సర్వలోకావస్థా విలోకన సమర్థుఁడా! దయావీక్షణా ! నేను చెప్పబోవు విషయమును తేటపార చూడుము' అనియు వర్ణముచే నవికించి దరుణములై కోపభావమును వ్యక్తము చేయుచున్న వనియు తేటపడగలదు. ఆ కోపము చల్లారుటకై 'చంపకమాల' (వృత్తము)ను

పుష్పోపహారముగాఁ బంపుట! వృత్తౌచిత్యమిచ్చుట గమనార్హము. 'గాదిలి సోదరి', 'దేవరందు', 'కూరిమిఁగల', 'కరుణింపు', 'నెయ్యఁపు మఱందిని', 'చనవియ్యఁ జెల్లదే' అను పదప్రయోగమున బంధుత్వము గలియఁబోసికొనుట, దయకై అభ్యర్థించుట, కోపభావము పోవునట్లు చమత్కరించి పల్కుట మొదలగు ప్రయోజనములు సాధింపఁ బడుచున్నవి. రెండవ పద్యమున తన ధర్మమువీడక పరుల యుద్యమమును మాన్పఁ బ్రయత్నించుటలోఁ జూపు నేర్పు కాననగును. శ్రీకృష్ణుని పరాక్రమ మెంతయో పొగడి అట్టివాఁడు తమతోఁడి యుద్ధము చేసినచో లోకులు నవ్వరా! అని యనుట ధర్మరాజు యొక్క రాజనీతికి పరాకాష్ఠ.

ఇంత వినయము, ప్రకటించియు ధర్మరాజు అభిమానము, స్వీయధర్మము వచ్చినప్పుడు వెనుకంజ వేయలేదు. సహదేవ రాయబార మంపుచు తమ్మునితో నిట్లు బుద్ధులు సెప్పినాఁడు—

"సహదేవ! నీ వచనములకు హలాయుధ కృష్ణసాత్యకులుఁ బ్రద్యుమ్నా
ది హరి కుమారులు నతికుపితహృదయులై పల్కినను బెదరకుము తాల్మిన్."
—షష్ఠా. 98.

యాదవసభలో తమ మర్యాదలు సగౌరవముగా నిల్పుకొన ప్రయత్నించుటయే యీ మాటలకు హేతువు.

ధర్మజున కెందును తీసిపోఁడు ధనంజయుఁడు; అతఁడు పాడిన పాటనే తాళముమార్చి పాడుచుండును. ఇతని సందేశ మిది :

"విను మనఘాత్మ నన్ను నరవింద దళేక్షణుఁ డింతవానిగాఁ
బెనిచె నతైన నీన్నృపతి భీతిలి చేరినఁ గాచినాఁడ నీ
తని కయి చచ్చుటొండె రణధారుణిలో గెలుపొండె మేలుగా
కని వినిపింపు మీ కొలువునందు బలాదు లెఱుంగునట్లుగన్." —షష్ఠా. 87.

ధర్మరాజు మాటలు సత్త్వగుణ ప్రధానములైనవి. గాండీవి పల్కులు కించి ద్రజోగుణమిశ్రితములు. "చచ్చుటొండె...గెలుపొండె" "బలాదు లెఱుంగు నట్లుగాన్" అనుటలో నహంకారస్పర్శ కలదు. అదియే రజోగుణ లక్షణము. ధర్మయుద్ధవీరుని కది యలంకారము.

భీముఁడు గండ్రగొండివాఁడు. అటుబ్రేటు తెలియని పోటు మాటలు కోటలు దాటునట్లు అనఁగల డొక్కుమ్మడిగా. అతఁడు భయమన్నది ఎఱుఁగని ధీశాలి.

"వెఱపున ధర్మనందనుఁడు విన్నపమాడుట గాదు శాంధవం
బరగెడునో యటంచుఁ దెగనాడక యుండుట గాని యర్జునుం
డరిముఖిఁ గాచినట్టి మనుజాధిపుఁ బైకొని బ్రహ్మరుద్రులే
డ్డైఱఁ జనుదెంచిరేనియు వధింపఁగనోపుదురే తలంపఁగన్."

"కావున నీ కుండినపతిఁ గావు నయం బెసఁగ నట్లు గాదా నన్నున్
దేవేంద్రనందనుని వసుదేవ తనయ! చూచి యెఱుఁగుదే కద యనుమీ!"
—షష్ఠా. 84, 85.

భీముని మాటలలో నాలోచనకన్న ఆవేశ మెక్కువ! అణుకువకన్న అహంకార మెక్కువ! వివేకముకన్న వివాద మెక్కువ!

దుర్యోధనునికి భీముని లక్షణములన్ని యున్నను, వానికితోడు దురభిమానము, పరాధీనత మెండు. అతని మాటలలో 'అహం' తప్ప ఇహపరములు రెండును శూన్యములే. కృష్ణుని మర్దించుటకై పాండవపక్ష మవలంబించి అక్రూరునితో నిట్లు శ్రీకృష్ణు నధిక్షేపించుచు పల్కెను:

"ద్రోణాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు గర్ణుం డర్జునుండున్ జగ
త్ప్రాణాత్మోద్భవ ధర్మజుల్ గవలు నా హైడింబుఁడున్ ద్రౌణియున్
క్షోణీనాథులుఁ బోరనిల్వఁగ బిడౌజుండో యజుండో కడున్
వేణుధ్వానముఁజేసి గొల్లసతులన్ వేఁగూడుటో కయ్యముల్".
—షష్ఠా. 63.

ఈతఁడు తనవారందఱు తానుగా మాట్లాడును. ఇతని సఖుఁడు కర్ణుఁడు తానే తనవారందఱిని త్రోసిరాజని మాట్లాడును. (6-23).

సహదేవ రాయబారము మానవీరమునకు చక్కని యుదాహరణము. వినయప్రధానమైన ధర్మజుని నయసందేశము నించుకైనను చెడకుండ సహదేవుఁడు యాదవసభలో నుడివెను. అవి పాండవుల కపటవినయము లని యాదవులు మండిపడి వారిని గేలిచేసిరి. కవి ఈ ఘట్టమును సామర్థ్యముతో నిర్వహించెను.

"నీలాంబరుఁడు నవ్వె, గేలిఁ బెట్టె గదుండు
కృతవర్మ కన్నులు గీఱె; సాంబుఁ
డల్లన తలయూఁచె; నసమబాణుఁడు భుజం
బప్పళించెను; జేతులార్చె నుగ్ర
సేనుండు; చేవైచెఁ జేకితానుని పైని
ననిరుద్ధు; డక్రూరుఁ డదిమె బుషభుఁ

జారు దేష్ణుండు రోషమునఁ బండ్లుకొఱికె
సారణు డట్టహాసంబుఁ జేసెఁ
బెదవి విఱిచెను సాత్యకి; మదము మెరపి
చూచె దీప్తిమంతుండు; భోజులును యాద
వులును వార్ష్ణేయులును మది నలుకవొడమి
గుజగుజలువోయి వీరముల్ గొనిరి మిగులు" —షష్ఠా. 135.

ఈ చేష్టలు సహదేవుని మనసును కటకట పెట్టినవి. క్రమముగా పౌరుషముప్పొంగ నకులానుజుఁడు తమ బలము నుగ్గడించి, సామవాక్యములు లోకపు మెప్పు కొఱకేనని తేల్చి చెప్పినాఁడు. దానికిఁ గృష్ణుఁడెత్తిపొడిచి సున్నితముగా నవహేళనఁ జేసినాఁడు. పై పెచ్చు బలరామునితో గోపాలుఁ డిట్లనెను—

"నా సహాయంబు లేకున్న నరుఁడు నరుఁడు
నా సహాయంబు కలిగిన నరుఁడు హరుఁడు
ఇత్తెఱంగెల్ల భీష్మాదు లెఱిఁగి యెఱిఁగి
యేల చేసిరి యిప్పని బేలలగుచు." —షష్ఠా. 147.

సహజాభిమానియైన సహదేవునికి బుండుపైఁ గారముఁ జల్లినట్లయినది. అన్న గారికి ప్రతినిధిగా నిల్చి కొలువులో నాత్మ గౌరవము కాపాడుకొనుట కిట్లని ప్రత్యాఖ్యానించినాఁడు :

"ద్రోణుని పంపున ద్రుపదుఁ దెచ్చిన యప్పు డజ్ఞాతః నీ సహాయంబు గొనెనా
దారుణ మత్స్యయంత్రం బేయు నప్పుడు నజ్ఞాతః నీ సహాయంబు గొనెనా ?
పాంచాలికై మహీపతుల గెల్చిన యప్పు డజ్ఞాతః నీ సహాయంబు గొనెనా ?
సింధుదేశాధీశు సైంధవు గెల్చునాఁ డజ్ఞాతః నీ సహాయంబు గొనెనా ?
ఏల యీమాట లాడంగ నింద్రసూతి యొక సహాయంబుఁ గోరునే యుగ్రమైన
గాండివంబును గవదొనల్ పాండురాశ్వ విమలరథమును దేవదత్తమునుదక్క." —షష్ఠా. 149.

ఇట్లిద్దఱిలో మాటలు, మత్సరములు పెరిగినవి. చివఱకు శ్రీకృష్ణుఁడు —

"వినుఁడీ మున్నొక్కచతుర్దనుఁ జంపెదనంటి నిపుడు ధర్మతనయు నొ
క్కని డించి సంగరస్థలమున నందఱఁ ద్రుంతుఁ జక్రమునఁ జిత్రముగన్." —షష్ఠా. 189.

అని ఘోరప్రతిజ్ఞ చేయునంతవఱకు ముదిరినవి. ఇట్లారంభమైన వాగ్యుద్ధము రణముగా రూపొందినది. యాదవ కురువీరుల రౌద్రరసము యుద్ధఘట్టమున

విపులముగా వర్ణితమైనది. రసమున కనువైన శయ్యా సౌభాగ్యమును సంతరించి శబ్దాలంకారాదులు సంధించు నేర్పు, స్వాభావిక ముట్టిపడు పాత్రచిత్రణము సన్నివేశ వర్ణనా నైపుణ్యము ధర్మనయందు విపులముగా నగుపించును.
ఉదా: యాదవ గజసైన్యము నురుమాడు భీముఁడు—

"కుంభరక్తము చివుక్కున నెమ్మొగమ్ముపైఁ జిందగ గదచేతఁ జిదిమిచిదిమి
యొకటిఁ జేపట్టి యొండొక్కటిపై ద్రొబ్బి చరణాగ్రమున నేలఁ జమరిచమరి
తుండముల్ చుట్టి చేతులతీఁట వోవంగ ఘోరవిక్రమకేళి కట్టికొట్టి
కడకాళ్ళు వట్టి ఘీంకారంబు సేయంగ వీచి నల్గడఁ జాఱవైచివైచి
కింకిణీఘంటికా పతాకాంకుశ ప్రకరవరత్రశస్త్రాసిచామర నియంతృ
భీషణోదగ్రమత్త కుంభివ్రజంబు భీముఁ డవలీలఁ జంపె నాఖిలలీల"
—అష్ట. 38.

స్వపక్ష సర్వనాశనమును కన్నులారగాంచి గుండెబ్రద్దలగునట్లు పరితపించుచు ధర్మజుఁడు శ్రీకృష్ణుని పాదముల నాశ్రయించి—

"తమ్ములు రాజులుం దెగినదానికి నీ గతి నిల్వలేక శో
కమ్మున నుంటగాదు తనుఁగావు మటంచుఁ జతుర్థనుండు త్రా
సమ్మున నన్నుఁ జేరె మనుజప్రభుడంచును నిట్టివానిఁ జ
క్రమ్మున కప్పగించి తిఁక బ్రాణము లేటికి నాకు మాధవా!" —అష్ట. 114.

అని ప్రార్థించుటలో ధర్మనాశభీతి ప్రస్ఫుటమగుచున్నది. మృతులైనవారిలో నొక్కనిఁ గోరుకొమ్మని శ్రీకృష్ణుఁడు కరుణించి యడుగగా నతఁ డిట్లనెను—

"సకలరాజన్య చారుకిరీట ఘృష్ట పాదద్వంద్వుఁడగు సుయోధనునికంటె
మత్ప్రాణసములు భీమప్రతాపులునైన మరుదుద్భవాది సోదరులకంటె
పరమపుణ్యులు కృపావరులైన కర్ణగాంగేయ గురుద్రౌణి కృపులకంటె
బలవంతులగు మత్స్యపాంచాల కేకయ పాండ్యాది విశ్వభూపతులకంటె
నిష్టుఁడైనట్టి కుండినాధీశు నిమ్ము చాలు నిదియె సమస్తవిశ్వంభరాధి
పత్యమిచ్చుట యేటికిఁ బడయరాని బ్రహ్మపదము నొసంగుట పద్మనాభ!
—అష్ట. 115.

ధర్మజుని ధర్మవీరము గాంచిన విశ్వాత్మునిగుండె వెన్నవలె కఱఁగినది; పాలకడలి వలె నుత్సాహముతో నుప్పొంగిపోయినది, అమృతభాండము వలె తొణికిసలాడినది. అతని దయావీక్షణముచే మృతకాయులు లబ్ధజీవులైనారు. ఈ భారతము చిత్రముగా ముగిసినది.

౭. కృష్ణరాయ విజయము – కుమార ధూర్జటి :

'సాహితీ సమరాంగణ చక్రవర్తి' యగు శ్రీకృష్ణదేవరాయల జీవితములో గొన్ని రసవత్తర ఘట్టములు వర్ణించు చారిత్రాత్మకకావ్య మీ 'కృష్ణరాయ విజయము'. తత్కర్తయగు కుమార ధూర్జటి.

"ఒక్కొక వింతహోర నిజయుక్తుల సూరిజనుల్ నుతించఁగాఁ
జక్కని మాటలెంతయు రసస్థితి ముందఱ జారుదీఱగాఁ
జక్కెర లొల్కఁ దేనియలు సారెకుఁ జిల్కగ భవ్యకావ్యముల్
గ్రక్కునఁ జెప్ప...వినఁగా గడు వేడుకయ్యెడిన్." —పీఠిక. 28.

ఈతఁడు రసార్థగూఢరూఢవాగ్జటి, సారరచనా ధురీణుఁడు, విద్యాశీలి, కవితా రసజ్ఞుఁడు, సహృదయుఁడు.

వాస్తవవస్తు ప్రతిపాదన ప్రధానమైన చారిత్రకకావ్యమును రసవత్తరముగా నిర్మించుట కష్టము. ప్రబంధయుగమున నివసించిన ఈకవి ఆ యుగ సంస్కారములతో నీ కావ్యమును విపులవర్ణనాత్మకముగా, ప్రబంధముగా రచించి వీరరస మంగిగాను, శృంగార మంగముగను బోషించెను.

విద్యానగర వర్ణనమున ప్రబంధోచితముగ నగరమునందలి చాతుర్వర్ణ్యాదులను వర్ణించుచు వీరరసాలంబనులగు రాట్కుమారులఁ గూర్చి యిట్లు పల్కినాఁడు—

"గురుకర్ణహరణ దుష్కర మహోధర్ముఁడై మును పేఁడి యనిపించుకొనకయున్న
నొక శిఖండికి చాల నొద్దికయై బ్రహ్మచర్యవ్రతునిఁ జంపఁ జనకయున్న
నాయుధంబులు మాని ప్రాయోపవిష్టుఁడౌ పుణ్యాత్ము కరమేయఁ బూనకున్న
బురములో నొక గొల్లదొర సహాయుడుగాక కలకాలము స్వశక్తి కలిగియున్న
మెచ్చవచ్చును విచ్చు హెచ్చుగాఁగ ననుచు బ్రహసించు రథిక బలైక రణజి
తారి వీరులు నసహాయ శూరులైన రాట్కుమారులు తత్పురీ రత్నముననుం."
—ప్రథ. 48.

ఇం దతిశయోక్త్యలంకారముచే వ్యంగ్యముగా వీరము ప్రపోషితము. మహాభారత వీరుఁడగు విచ్చునందు ధర్మేతర వీరగుణములఁ గొన్నింటి జేర్కొని అవి తమయందు లేకపోవుటచే నాతనిగాంచి ప్రహసించి, మెచ్చరైరి. అందు వారియొక్క ధర్మైకాగ్రబుద్ధి, అసహాయశూరత్వము ప్రస్ఫుటమగుచున్నది. తత్కాలమును, సంఘమును వర్ణించి, ఇట్టివీరులు పుట్టినగడ్డపై దేవగణములు జన్మించెనని వ్యంగ్యముగా నాయకుని వీరత్వమును సమర్థించినాఁడు.

తండ్రికిఁ దగిన కుమారుఁడని నిరూపించుటకై నృసింహరాయలను ధీరోదాత్తునిగా వర్ణించినాఁడు.

"శ్రీరమణీమనోరమణ సేవన తత్పరుఁ డబ్జసంభవ
శ్రీ రమణీయకీర్తినిధి చిత్తజ సన్నిభమూర్తి, విద్విష
ద్వీర భయంకర ప్రకట విశ్రుత శౌర్య ధురంధరుండునౌ
వీర నృసింహరాయ పృథివీపతి వొల్చు నఖండ సంపదన్."          —ప్ర. 57.

ఇందు వీరనృసింహరాయలను విష్ణుభక్తునిగను, అమలకీర్తిధామునిగను, మనోజ్ఞ సుందరునిగను, శత్రువీరభయంకరునిగను శౌర్యధురంధరునిగను వర్ణించి కవి వీరరసోచిత నాయకునివలె తీర్చిదిద్దినాడు.

ఇఁక నాయకుఁడు నివసించెడి స్థలమా వీరక్షేత్రము.

"తత్ప్రదేశంబునందు నెంతయును వింత మీఱఁగా నొక కుందేలు సారమేయ
మును మహోద్ధతిఁ" దఱిమెను.          —ద్వి. 32.

రాయలు స్వయముగా ప్రతాపవంతుఁడు. ప్రతిపక్షవేదండ సింహస్వప్నము. కర్ణాటసామ్రాజ్యమును ఏకచ్ఛత్రముక్రిందకుఁ దెచ్చియేలి యాచంద్రతారార్కముఁ గీర్తినిలుపుకొనిన తెలుఁగురాయఁడు. అతఁడు విజయనగరమున గద్దె నెక్కినవాఁడు.

"అన్నన్న యతఁడు సింహాసనం బెక్కిన నిభరాజు తాకొండ లెక్కదొడఁగె
నయ్యారె యాతఁడు పట్టాభిషిక్తుండైన సింధురాణ్నేత్రముల్ చెమ్మగిల్లె
హైసరే యతని పేరనిన మాత్రముననే కురుదేశ మేల్రాజు గుండె లదరె
నోహో యతఁడు ఖడ్గ మొక్కింత ముట్టిన సకలారి సంఘము ల్సంచలించె."
—ద్వి. 44.

కృష్ణరాయలు గద్దె నెక్కుట, పట్టాభిషిక్తుఁ డగుట, మూరురాయరగండాది బిరుదములు దాల్చుట, రాజ్యరక్షణైక వ్రతమున ఖడ్గమును ధరించుట యనునవి క్రమముగా నైరావతమునకును, సింధు కురుదేశాధిపతులకును, సకలారి సంఘములకును ప్రాణసంకటములైనవి. శత్రుంతప సామర్థ్యము వీరలక్షణమై యుండుట ప్రసిద్ధము!

రాయలు ప్రజారక్షణార్థము, ప్రజాధర్మరక్షణార్థము దివారాత్రములు కృషిచేసిన కార్యశూరుఁడు. మారువేషములలో ప్రజలమధ్య దిరిగి ప్రజా ధర్మాచరణాదులు గమనించి దుష్టశిక్షణము శిష్టరక్షణము నొనర్చి ధర్మమును నిలువఁబెట్ట యత్నించెను.

"ధీరత నర్ధరాత్రమునఁ ద్రిమ్మరు నప్పురవీథులందు నె
వ్వారలు వింతరీతిగల వాక్కులు బల్కెడురో యటంచు వి
స్తారత మోదశ్రద్ధుచిర జాగ్రదుదగ్ర భుజాగ్రఖడ్గుఁడై
తోరఁపు వేడ్కతో నతనితో సరిరాఁగలరే ధరాధిపుల్" —ద్వి. 64.

చారచక్షువుగా శ్రీరాముని కెందును తీసిపోని అతనియందు తన ప్రజల స్థితి గతులను స్వయముగ గాంచు నప్రమత్తత, శ్రద్ధ, అనురాగము, స్వార్థరాహిత్యము, త్యాగము అను గుణములు గోచరించుచు ఆదర్శప్రభువుగా దీర్చిదిద్దు చున్నది.

అతఁడు శత్రు దుర్గముల నాక్రమించు వైఖరి యతి విచిత్రము; నిశిత పరాక్రమ నైపుణ్య విలసితము; దంభోళి సదృశము.

"రటిత దిక్తట నట త్పెటపెటార్భటులతో ఘోరమైన తుపాకి గుండ్లచేత
దవ్వుదవ్వున వచ్చి రివ్వురివ్వున వచ్చి ప్రసరించు రాచూరి బాణములను
పెల్లుగా వెసఁ జిత్తజల్లుగా వెదజల్లు పెంపరుల్ బెంపారు నంపగముల
ఘాటీగతి నటింప మాటికి నూటిగా నాటుకొన్ బల్లెంపు టీటెగములు
నఱిమి తఱిమిన భయమున విఱిగి జరిగి నిజబలంబుల ఢాకకు నిల్వలేక
శరణుఁ జొచ్చిన వారలఁ గరుణఁ జూచి యచటి దుర్గస్థలంబుల నాక్రమించి"
—తృ. 5.

శబ్దానుకరణములైన అనుప్రాసాదులను శబ్దాలంకారములు ప్రయోగించి, రసము గొప్పించిన శిల్పసౌందర్యమే సీసపద్యమునఁ గలదు. తుపాకిగుండ్ల టుమటమాత్కారమున కనువైన టకారానుప్రాసము, రివ్వున నెగిరి రాబందు వలె ముందుకు దూసికొనిపోవుచు హవాయిజువ్వలవలె శబ్దముచేయు బాణముల కనువైన ద్విరుక్తవకారానుప్రాసము, తొలకరివానవలె వర్షించి మనస్సును జిల్లనిపించునట్లున్న అంపగముల జల్లులు తెల్పుటకై ద్విరుక్తలకారానుప్రాసము, గుండెలో గాటముగా నాటిన బల్లెపు పోటుల దెల్పుటకై టకారానుప్రాసమును, భయమున ధృతిఁబాసి నఱిమిఱికి గుఱియైన భటుల యవస్థఁ దెల్పుటకు ఱకారానుప్రాసమును, ఇందు రసప్రతీతి కెంతయు ననువుగా గూర్పఁబడి కవియొక్క శబ్దప్రయోగ చాతుర్యమును, భావప్రకటన సామర్థ్యమును వేనోళ్ళఁ జాటుచున్నవి.

వీరరసస్ఫూర్తిఁ గల్పించుటకై 'పంచచామర' మను వృత్తము నధికముగా వాడుట ఈ కవియొక్క ప్రత్యేకత. ఒక్కసారిగా దురుష్కులదండు ధానుష్కకౌశలమలరఁ జనుదెంచు రయమునుగాంచి సంరంభపడిన పెమ్మసాని

రామలింగ నృపాలు నోట విభావానుగుణమైన వాచికమును భావస్ఫూర్తి కనువుగా గల్పించి రసపోషణ మొనరించినాఁడు.

పంచచామరము : "పరాకు రాకురాకు మంచుఁ బారసీక భూపతుల్
చిరాకుమీఱ దట్టమైన సింగణీలకోరులన్
జిరాగుజాలవేసి డాసి చిల్లుపొల్లుచేయుచున్
నిరాకరించి మించివచ్చు నేర్పుఁ జూచితే నృపా!" —కృ. 30.

ఇందు దీర్ఘాఽదీర్ఘ గురులఘ్వక్షర సమాహార నైపుణ్యము, ఛందస్సులోని నడక అశ్వసైన్యము కదను ద్రొక్కుచు ముందుకు దూకుచు సమీపించు భావమును కన్నులకుఁ గట్టుచున్నవి.

రాయలు చితాపుఖానును జయించి గజపతిపై దాడి వెడలునప్పుడు ప్రకటించు నుత్సాహమును పంచచామర వృత్తమునఁ గవి నిబద్ధించినాఁడు.

పంచచామరము : "చితాపుఖానుఁడం గడింది చిచ్చు నార్పనేర్చి వ
చ్చితిం గదా! ముదంబుమీఱ శీఘ్రు మీ గజాధిపున్
నితాంతకీర్తి ధాత్రిలోన నిండ గెల్చెదన్ ఘన
ప్రతాప దీధితిం దిగంతభాగముల్ విరాజిలన్" —కృ. 73.

రాయలయందు నవనవోన్మేషోత్సాహ భావము, నిస్తంద్రత, చురుకుతనము తరళసుందర ప్రతాపము, నిరర్గళధాటి, అవిశ్రాంత కార్యసాధనేచ్ఛ, ధృతి, శౌర్యము, అసమ్మోహాదులు, కదన పాండిత్యము, కీర్తికాంక్ష మొ. నవి యీ పద్యమునందు సుస్పష్టముగా గోచరించుచు నతని రణోత్సాహము నుద్దీపిత మొనర్చుచున్నవి.

వీరమున కంగముగా శత్రువీరుల భయావస్థలు వర్ణించి కావ్యరస పోషణము చేయుట యిందు సమర్థవంతముగా జరిగినది. కృష్ణరాయల నెదుర్కొనిన శత్రువులగు తురుష్కులు—

"తురకవేషము మాని తోరమౌ కర్ణాట
కపు వేషములు వేసి కదలువారు,
దండి దరికివచ్చెఁ జెండె నీతఁడు మించి
పొండి యనుచుఁ జాటిపోవువారు,
వేగు జూచెదమంచు వెగవెగఁ జనుదెంచి
దూరమేగుచుఁ బొదల్ దూరువారు,
వెనువెంటఁ దగిలెడు వీఁడెవీఁడె యటంచు
గొబ్బునఁ బఱచుచుఁ గూలువారు,

సారెసారెకుఁ గర్తాలు దూఱువారు
నై కలంగి యథాయథ లగుచుఁ జనిరి
మదహయగజంబు లటుబెట్టి మొదటిదొరలు
ఒక్కవిధమున నదిదాఁటి యుఱికి రపుడు" —తృ. 46

పఠితల కిందుఁ గొంత హాస్యరసస్ఫూర్తియుఁ గల్గును.

గజపతిని క్షమించి రక్షించినపుడు రాయలయందు క్షమావీరమును, దయావీరమును, తుఖ్ఖాకన్యను వివాహమాడుటయందు శృంగారమును పోషింపఁబడి కావ్యరసమున కంగములుగా సంధింపఁబడినవి. చారిత్రక కావ్యములలో నింత చిన్నకావ్యమునం దింత గొప్ప మహాత్తును కల్పించి రచించిన కవు లరుదు. "కవితాచమత్కార ధూర్జటిపౌత్ర" అను బిరుదు ఈ కావ్యకర్త కక్షరశః వర్తించునని తత్కావ్యమే నిరూపించుచున్నది.

౮. వాల్మీకి చరిత్రము - రఘునాథ భూపాలుఁడు :

శ్రీరామచంద్ర సాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వత విశేషణనిరర్గళ వాగ్వైభవాశేష సరససాహిత్య కళాభోజుఁడును, తంజాపురాంధ్ర నాయక రాజశిరోమణియు నగు శ్రీ రఘునాథ భూపాలుఁడు 'వాల్మీకి చరిత్రం బను మహాప్రబంధంబును' ముచ్చటగా మూఁడాశ్వాసములలోఁ గూర్చెను. అతని కవిత్వము మృదుమధుర పదసంఘటితమై, ధారాశుద్ధిగలిగి, ప్రసన్న గంభీరమై యొప్పుచుండును. అతని కవిత్వాదర్శ మిట్టిది :

"చెప్పవలె కప్పురంబులు కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపై
గుప్పిన క్రియ విరిపొట్లము విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్."

"చెవులకుఁ జవులై చల్లఁగఁ గవులకుఁ దవులై సమస్త కావ్యకళా బం
ధువులై రససింధువులై యవురాయని కవిత లవని నలరఁగ వలదా !

కవితామతల్లిని ప్రప్రథమమున భువిపై వెలయించిన ఆదికవి యగు వాల్మీకిచరిత్రము సంస్కృతమున ధర్మఖండము, వాసిష్ఠరామాయణము, భక్త విజయము అను గ్రంథములందును గానవగుచున్నది. ధర్మఖండములోని కథను రఘునాథ భూపాలుఁ డనుసరించెను. అందు వాల్మీకి కిరాతుఁడై దోపిడి వృత్తిచే జీవించుచు, సప్తర్షి దర్శనకటాక్షాదులచే హృదయముమారి, రామ మంత్రోపదేశమును పొంది మహర్షియై విలసిల్లెనని కలదు.

సప్తర్షు లొకసారి భూమిపైఁ గల పుణ్యతీర్థములన్నిటిని సేవించుచు గ్రీష్మకాలమున తమసానిమ్నగ యొడ్డున నొక కీకారణ్యమునఁ జనుచు దుర్గంధ

ఘూయిష్టమయిన నొక్క కిరాత వాటిని దాటిపోవుచున్న తఱి మేఘుఁపుబిల్లవోలె బోయనాయకుఁడు వారి కెదురువడి ధనాపేక్షచే నాయుధములచే వారినిఁ బీడింప నుంకించి తనశక్తి వమ్మయిపోగా కటకటపడి వారిని ముష్టిఘాతముల నొడళ్లు నలుగఁగొట్టియు నెట్టిగాని పైకము పొందమి విన్నవోయి యుసురు మనెను. వానిఁ గాంచి మునులు జాలిపడి తత్త్వోపదేశ మిట్లు చేసిరి.

"ప్రాయము జలకల్లోల ప్రాయము కాయంబు నస్థిరం బందులకై
రోయక దురితమె తపమని పాయక చేసెదవు నింద పరఁగఁ బుళిందా !"

దానికి సమాధానముగా నా కిరాతుఁడిట్లనెను.

"బేల తపసులార ! యాలుబిడ్డలకుఁగాఁ గాక నావటించఁ గాన విడిసి
విల్లు నంపకోల వెల్లను గైకొని యున్న నాకుఁ బాప మొదవు నెట్లు."

ఆ మాటలు సామాన్య కిరాతుఁ డనలేఁడు. ప్రాక్తన జన్మకర్మల వలన అజ్ఞానావృతములగు సంస్కారము లతనిలో బీజభూతమగు మహాతేజమువలె వెలుగుచుండుట ఋషులు గమనించినారు; చమత్కారముగా నాతని హృదయములోని అజ్ఞానపటమును తొలగించినారు. సతీపుత్రులు నీ పాపములందు భాగస్వాములా ? తెలిసికొమ్మని ప్రశ్నించిరి. కిరాతుఁ డమాయకముగా నింటి కేగి భార్యాపుత్రులను తన పాపము పంచుకొనఁ గోరెను. వారు నిరాకరించిరి. రావిపుల్ల విరిగినట్లు, హృదయము సంసారముపై విరిగినది. "ఎవ్వరెవ్వారలే యూరి కేది త్రోవ" అనెడి సత్యమును తెలిసికొనఁ గల్గినాఁడు.

"దోసమునకుఁ బని లేదఁట నాసొమ్ములు వీరికిం దినం బనిగలదే ?
రోసితి సంసారముఁ దెగఁ గోసితి మొదలంట బంధుగుల తగు లెల్లన్."

అని యాటవిక మూఢప్రవృత్తి, మూటిదనము, పెళుసుదనము, ధృతి యొప్పునట్లుగాఁ బల్కి నిస్సంగుఁ డైనాఁడు; సన్యాసియై ఋషిపుంగవుల కృపాకటాక్షములకు పాత్రుఁడై పవిత్రరామనామము గ్రహించి జపించుచు మునివృత్తిని వనమునఁ గడప నారంభించినాఁడు. గ్రామస్థులు భార్యాసుతులు స్వాయశక్తుల నాతని నింటికిఁ గొనిపోవ యత్నించిరి. కాని యతఁడు—

"సతు లెవ్వరు సుతు లెవ్వరు హితు లెవ్వా రేటివరద నెందేనొకచో
జతఁగూడిన కాష్ఠంబుల గతినించుకఁ గూడి విచ్చి కదలుదు రవలన్."

అని విషయలంపటసన్యస్తహృదయుఁడై రామనామజపముచే రామ సాక్షాత్కార మాత్మలోఁ బొంది సమాధియం దచంచల నిష్ఠాగరిష్ఠుఁ డయ్యెను.

వాల్మీకి తపోగ్ని లోకభీకరమై వర్తిల్లగా దేవేంద్రుఁడు రంభోర్వశులకు బిరుదుల పంపకమునం దైన పోరును వారించి, వారి విద్యాసై పుణ్యమునకు బరీక్ష యను మిషతో వాల్మీకి తపోభంగ మొనర్పఁ బంపెను. కాని వారు తమ హావభావ చేష్టితముల కా ముని చలింపమి విఫలమనోరథులై తిరిగిపోయిరి. ఆపై జనసంచార మాప్రాంతమున లేకపోవుటచే వాల్మీకి శరీరముపై పుట్టలు పెరిగి చెట్లుతీగలు మొ.నవి మొలచినవి. వాల్మీకి యపుఁడు :

"పార్థివ కళేబరంబు లోపల వెలుంగు నంతరాత్మయుఁ బలె నతఁ డందు నుండె." నఁట! అది తపోవీరఫలము ! దానికి శమము అంగము.

సప్తర్షులు యాత్రలు ముగించుకొని తిరిగివచ్చుతఱి యతనిఁగాంచి ఆశ్చర్య పడిరి. అతఁడు వల్మీకమువోలెనై యందుండి వెడలుటచే వాల్మీకి యయ్యెను. అపుడు శ్రీరాముఁడు ప్రత్యక్షమై తన జీవితమును మహాకావ్యముగా సంత రించిపెట్టుమని యడిగెను. వాల్మీకి యట్లే రామాయణమును 'సుధాబిందు బంధుర తరంగ రింగణాధార ధౌరంధర విదుషీణీ మృదులపదసందర్భ రసగర్భి తార్థ చమత్కార పారాయణంబుగా' సకలలోక ప్రసిద్ధం బగునట్లు వక్కా ణించి యశఃకాయుఁ డయ్యెను.

కవితావతార ప్రథమతీర్థమగు వాల్మీకి చరిత్రము 'నవోద్యమ నవ్యార్థ చమత్కార భవ్యంబుగను సకలవిద్వత్కవి శ్రావ్యముగను జేయఁబడిన ప్రబంధ రత్నము !

పేరు వినఁగనే "వాల్మీకి సంపూర్ణజీవితచరిత్ర" యను భ్రాంతిని కల్పించి, ఆపైఁ జదివినచో కొన్ని రసవత్తరఘట్టములతో గూర్చిన రసవత్కావ్యముగా నీ ప్రబంధము స్ఫురించును. వాల్మీకిని రామాయణరచనకు ప్రోత్సహించినది నారదమహర్షి యని వాల్మీకి రామాయణమునఁ గలదు. కాని యిందు శ్రీరా ముఁడే స్వయముగా తనకథను వినిర్మింపుమని యాజ్ఞాపించినట్లున్నది. మార్గ ములు, హేతువులు వేఱుగాని ఫల మొక్కటియే.

## ౯. శతకంఠరామాయణము – మర్దనకవి :

దాదాపు పదునేఁడవ శతాబ్దములో నివసించిన మర్దనకవి రచించిన నాలుగాశ్వాసముల ప్రబంధము శతకంఠరామాయణము. దీనికి సీతా విజయ మను నామాంతరము కలదు. ఈ కావ్యమును లింగకవి గంగకవియను ఇరువురు

కవులు రచించినట్లు కీ. శే. వీరేశలింగముగారు పేర్కొనియున్నారు. లిఖిత ప్రతులు మూఁడింటిలో 'మర్దనకవి' యని యున్నదని కీ. శే. వావిళ్ల రామశాస్త్రిులవారు.

అశ్రముఁడను రక్కసుని పుత్త్రుఁడు శతకంఠుఁడు. ఇతనికి నూరు తలలు, రెండునూర్లు చేతులు. బ్రహ్మవలన వరములఁ బెక్కు పొందినవాఁడు. పట్టాభిషిక్తుడైన రామునిపై నతనికి కోపముగలదు. దానికి కారణము రావణ సంహారము. అతఁడు ఋషులను బాధింప వారు రామునితో మొఱలిడిరి. వారికభయ హస్తమునిచ్చి, ముగ్గురు తమ్ములు, విభీషణాది స్నేహితులు, హనుమదాది భక్తులుకూడి వచ్చుచుండ రాముఁడు యుద్ధమునకు వెడలెను. విశేషమేమన : ఈ యుద్ధమునకు సీతయు రామునివెంట వెడలినది. పోరు ఘోరమయినది. రాముఁడు రాక్షసునితో మహాస్త్రయుద్ధము చేయుచు సొమ్మసిల్లి పడిపోయెను. లక్ష్మణాదులు, మిత్రభృత్యవర్గము లెల్లఱు ఓడినారు. అప్పుడు సీత ధనుర్ధారియై రంగమున నిలిచి రాక్షసుని పరాభవించెను. మరునాఁడు రాముఁడు నారదోపదేశముచే బ్రహ్మాస్త్రమున శతకంఠుని జంపి లోక కల్యాణ మొనర్చెను. ఇది ఆ కావ్యమునందలి కథాసారాంశము. ఇందు రామాశ్రిత యుద్ధవీరము అంగి. సీత యతని యర్ధాంగి యని నిరూపించుకొనిన వీరనారి. నరకాసుర సంహారమున శ్రీకృష్ణావతారములో సత్యభామ సహాయము లభించెననెడి పురాణ ప్రసిద్ధగాథ నాధారముగఁ జేసికొని కల్పించిన కథయై యుండవచ్చును. నరకాసుర వధాఘట్టములు ఎఱ్ఱన, నాచనసోమన, పోతన మొ॥ కవులు రచించిన విధము పూర్వాధ్యాయములలో పేర్కొనఁబడినది. వానితో పోల్చిచూచినచో నీ ఘట్టమంతటి రసగౌరవమందక పోయినను, మొత్తముమీద రచన రసపోషకముగనే యున్నది. సీతాపరాక్రమముఁ జదివిన పఠిత — నాయకునివలెనే—

"పుష్పంబు లఱచేతఁ బూననేరని చెలి యిషుపరంపర బూన నెట్లు నేర్చెఁ
జిల్కపల్కులకు బిట్టులుక్కకోమలి యిల యెల్ల భీతిల నార్వనెట్లు నేర్చె
నేఁదక్క నన్యుల నీక్షింప నేరని యింతి సేనలఁ గూల్ప నెట్లు నేర్చె
వినవిన నడువంగ నసియాడు కొమ్మ నేఁ డెడసి యుద్ధము సేయ నెట్లు నేర్చె."

—చతుర్థ. ఆ. ప. 99.

అని ఆశ్చర్యపోవును. సీతాదేవి రణరంగమునందు నిలిచి వీరరస మొలికించు ఘట్టము తెలుఁగున నీ కావ్యమునందే కలదు. అది విశేషము.

౧౦. సమీరకుమార విజయము – పుష్పగిరి తిమ్మన :

'తిమ్మన సత్కవీ! సరసార్థగౌరవ భారవీ!' అని కీర్తిఁగాంచిన పుష్పగిరి తిమ్మన తాను కవిత్వతత్త్వముల నేర్పరియౌట నవి సత్ఫలమగునట్లు తనకు సద్గురువు నభీష్టదైవమునైన హనుమంతుని చరిత్ర రచింపనెంచి ఈ కావ్యము రచించెను. తన రసవత్కవిత్వ మిట్లుండునని తిమ్మకవి యనినమాటలు :

"జలకాంతు నెమక నమృతపుఁ జెలమఁదెలిపి నటులు; తృణము జెనయఁగ సంజీ
వలతఁ గలిగించి నటువలెఁ జెలఁగెన్ హనుమకథ బోధ సేయుట లనుచున్."
—పీఠిక. ప. 19.

బేర్కొనినాఁడు.

శ్రీరాముని నమ్మినబంటుగాఁ గీర్తిఁగన్న హనుమంతుని చరిత్ర రామాయణ ప్రసిద్ధము. సీతాన్వేషణము నందును, రామరావణ యుద్ధమునందును శ్రీరామున కాతఁడు చేసిన సహాయ మనితర సాధ్యము. తిమ్మకవి కపిపుంగవుని వృత్తాంతము రామాయణ భారతాదులనుండి గ్రహించి గ్రథించి రచించినాఁడు. శ్రీరామభక్తియే జీవితముగా బ్రతికిన అసమాన వీరుఁడు, జ్ఞాని, మారుతి. ప్రభువుకొఱకై మేనుముక్కలు చేసికొనుటకైనను సిద్ధమైన త్యాగమూర్తి. అంజనాదేవియొక్క నిశ్చల నిర్మల తపస్సునకు లభించిన పుణ్యైకఫలము, శివాంశవిలసితుఁడు.

అంజనాదేవి భర్త యాజ్ఞచే వాయువుఁ గూర్చి చేసిన ఘోరతప మిందు తపోవీరమున కాలవాలము. గ్రీష్మవర్షశిశిర ఋతువులలో బ్రకృతి విరుద్ధముగా నామె యొనరించిన నిష్ఠావ్రతము వాయుదేవునిఁ గరఁగించినది. ఋతు వర్ణనమునకు, పాత్రమునకు సమన్వయించి చెప్పుచోట రసము సాంద్రముగా స్ఫురించుచున్నది. ఉదా : "వర్షర్తువం" దయ్యంజన :

"తాదృశ దుర్దినంబుల నుదగ్ర శిలాస్థలి బట్టబైటనే
పాదుగ నిల్చి పై నశనిపాతము లొందునొ! వర్షధారలన్
ఖేదము వొందునో! యన నకృత్రిమ భక్తి ఘదిన్ సమీరు శ్రీ
పాదము లుంచి యాఘనతపస్విని నిశ్చల నిష్ఠ నున్నెడన్." —ద్వి. ప. 99.

ఇంద్రియనిగ్రహము, దేహాభిమానరాహిత్యము ఆమె తపోవీరమునఁ బ్రకాశించుచున్నవి. అట్టి తపమునకు ఫలము హనూమంతుఁడు.

హనుమంతుని శైశవలీలావర్ణనమందు శ్లేషకవితానైపుణ్యముతో పదార్థసంధాన మొనర్చి రసమొప్పించినాఁడు తిమ్మన. ఉదా :

"అమితాగమారూఢి నాయాయిశాఖల ననుకూల సంచార మాచరించుఁ
బటుశాస్త్రగరిమ చొప్పడి నఖర ప్రౌఢి యమరకృత్యాచ్ఛాదనములడంచు
సవన వర్తనలీల సరిమీఱి కుశలతా వర్ధనోదార భావము వహించుఁ
గనిన యజ్ఞాన సంతతి ధర్మవేది ఛాయని నేతి యుక్తి మాయను హరించు
గానఁ బడుఁగానఁ బడ కొక్కకడఁ జరించు నతులగతులను గురులీల లతిశయించు
………… ………ప్రబల మతిమీఱి వానర బ్రహ్మచారి." —ద్వి. ఆ. ప. 191

ఇందు విద్యావీర, బలవీరములు శ్లేషానుప్రాణితములుగా ననుసంధించుట విశేషము. ఇట్టి ప్రక్రియ ననుసరించియే మఱియొకచోట—సూర్యునియొద్ద సంగీత విద్య నేర్చుకొను వాయుసుతుని నిట్లు వర్ణించెను.

"పాడి పదక్రమ ప్రౌఢి నేర్చియుఁ దొల్తఁ జాడి పదక్రమ ప్రౌఢి నేర్చెఁ
బ్రాఖాకరోన్ముఖ భావస్థుఁడయ్యును బ్రాఖాకరోన్ముఖ భావమొందె
నియతిఁ బ్రత్యాహార నిపుణుఁడయ్యును శబ్ద నియతిఁ బ్రత్యాహారనిపుణుఁడయ్యె
స్మృతిపురాణార్థసంగతు లెఱింగియు బహు స్మృతిపురాణార్థ సంగతు లెఱింగె
నిరత సంగీతరత గళోద్ధురతఁ గనియు నిరత సంగీత రతగళోద్ధురతఁ గనియె
విమల విద్యాధికుండయ్యె విద్య లెల్లఁ జదివె సామీరి లోకైక సంగ్రహేచ్ఛ.
—ద్వి. ఆ. ప. 225.

ధూర్జటి విరచిత "కానకఁగన్న సంతానంబు" అను సీసమున కిది యనుకృతి వలె గోచరించుచున్నది.

సీతాన్వేషణ కుత్సహించు మరుత్సుతునియందు గోచరించు నుత్సాహము బలవీరోదాహరణము.

"అన నుప్పొంగి మరుత్సుతుండు కపులారా! దుస్తరంబైన తో
యనిధిం దాఁటెద లంకమీఱెదఁ దృణప్రాయంబుగా జానకిం
గని వేవచ్చెదఁ గానకున్న జలధుల్ గాలింతు భూలోక మె
ల్లను దూలింతు నుడు ప్రకాండ మిలవ్రాలన్ వంతునాకాశమున్."
—తృ. ఆ. ప. 47.

అతిశయోక్తులు అతిమానుష వీరులయందు స్వభావోక్తు లగుచుండును గదా!

ఇట్లే, సముద్రలంఘనము, రావణ సంభాషణము, ధూమ్రాక్షాది రాక్షస సంహారము, మకరిశాప విమోచనము, మైరావణు వధ, గంధమాదనుని సత్య లోకమునుండి మఱలఁ దెచ్చుట, శతముఖ సహస్రకోటిమర్దనము, అమృతముఁ

దెచ్చి భరతశత్రుఘ్నుల బ్రతికించుట, స్వీయవాల విక్షేపమున గరుడుని వాయు సన్నిధిని పడవేయుట, తన గానపటిమచే రాలను గరిఁగించి నారద, తుంబుర గర్వభంగ మొనర్చుట, అర్జున శరసేతుభంగము, భీమగర్వభంగము, మొ. లగు ఘట్టములు సమీరకుమారు నాశ్రయించిన బలయుద్ధగాన ధర్మైశ్వర్య దయా వీరాదు లాయా స్థలములంధు స్ఫురింపఁజేయుచు-కావ్యమును వీరరస కావ్య ముగాఁ దీర్చిదిద్దుచున్నవి.

హనుమదాశ్రిత వీరరసమే అంగిరసముగా గల కావ్యములలో కాచన విరచితమగు మైరావణచరిత్ర యను ద్విపదకావ్యము ప్రసిద్ధిచెందియున్నది. శ్రీరామ పట్టాభిషేక సమయమున రామునకు సాయఁబడిన వీరులకు సన్మాన ములు జరుగగా హనుమంతుని పరాక్రమమును రాముఁడు వర్ణించెను. వసి ష్ఠులవారు మధ్యలో నందుకొని మైరావణుని మాయనిద్రలోనున్న రామ లక్ష్మణులను వాయుసుతుఁడు రక్షించి బ్రతికించిన వీరగాథను విపులముగాఁ దెల్పెను. రావణప్రేరితుఁడై మైరావణుఁడు మాయావిభీషణ వేషధారియై వాలఁపుకోటలో సుఖనిద్రులైయున్న రామలక్ష్మణుల నపహరించుట, హను మంతుఁడు తనతప్పు తెలిసికొని పాతాళలంక కేఁగి మైరావణుని వధించి రామ లక్ష్మణులను విడిపించి తెచ్చుట యిందలి యితివృత్తము. ఈ కవి మొత్తము మీద రసపోషణలో నంత సిద్ధహస్తుఁడు కాకపోయినను నాయకుఁడగు హను మంతునియందు మాత్ర మెడనెడ సందర్భోచితరసస్ఫూర్తి కల్గునట్లు ద్విపదలో కావ్యరచన మొనర్చినాఁడు. ఇందు యుద్ధవీర మంగి, ధర్మ భక్త్యైశ్వర్య వీర ములు, రౌద్రము అంగములు.

## ౧౧. రంగరాయ చరిత్రము - దిట్టకవి నారాయణకవి :

పల్నాటి యుద్ధమువలె తెలుఁగువారు తమదిగా జెప్పుకొనుటకు వీల యిన వీరగాథ బొబ్బిలి యుద్ధము. దాని నితివృత్తముగాఁ గైకొని దిట్టకవి నారాయణకవి రంగరాయ చరిత్రమను మూఁడాశ్వాసముల కావ్యమును వీరరస ప్రధానముగ రచించినాఁడు. ఫ్రెంచివారు భారతదేశమునకు వ్యాపార నిమిత్తమై వచ్చి, దేశ రాజకీయములలోఁ గ్రమముగఁ బాల్గొని కొంతరాజ్యము సంపాదించిరి. క్రీ. శ. 1754 నాటికి ఫ్రెంచివారు తెలుఁగునాట గుండ్లకమ్మ మొదలుకొని శ్రీ జగన్నాథమువఱకు గల దేశమును పాలించుచుండిరి. డూప్లే తరువాత వచ్చిన లాలీ యనుమతి గైకొని బుస్సీదొర హైదరుజంగు సాహెబును

మంత్రిగా నీ దేశముపై సర్వాధికారము చలాయించుచుండెను. కళింగ సామంతుల యొద్ద పన్నులు వసూలు కాకపోటవుచే బుస్సీ కప్పములు నివ్వవలసినదని వారికి ఫర్మానాలను వ్రాయించి వానిని వారల కంద జేయవలసినదిగా విజయనగర ప్రభువగు విజయరామరాజునకుఁ బంపెను. విజయరామరాజు బొబ్బిలి ప్రభువైన విజయరంగరాయని పరాక్రమైశ్వర్యాదులఁగాంచి యీసుఁజెంది కలహించి యున్నవాఁడు కావున వారి నణపఁ గుతంత్రము పన్ని బుస్సీరాకను వారికిఁ దెల్పక తానితర సామంతులతో గూడి పుష్పగిరి కెదురేఁగిఁ హైదరునకు లంచమిచ్చి అతనిమైత్రిని సాధించి, రంగరాయఁడు పన్నియక ప్రతిఘటించెనని బుస్సీకి నమ్మకము కల్పింపజేసి పగనురాజఁబెట్టి దాడి వెడలునట్లు చేసెను. బొబ్బిలిలో 1757 సం. జనవరి 24 వ తేదీ ఉదయ మూరుగంటలు మొదలు రాత్రి 11 గంటలవఱ కిరువురికి మధ్య ఘోర యుద్ధము జరిగినది. అందులో మానధనుఁడైన రంగరాయఁ డస్తమించెను. తాండ్రపాపారాయఁడుద్దండుఁడై విజయరామరాజును నఱికివేసెను. చివఱకు రామరాయని మోసము బుస్సీ తెలిసికొని, పశ్చాత్తప్తుఁడై రంగరాయ పుత్రుఁడగు చిన వేంకటరావునకుఁ బట్టముకట్టి, కానుకలిచ్చి వెనుదిరిగి పోయెను.

విషాదాంతమైన వీరరస కావ్యమిది. కావ్యాంగిరస ప్రసక్తి కృతిభర్త నోటఁ బల్కించినాఁడు కవి. "భారత యుద్ధమట్టు లతిభాసురతం గనుపట్టుచున్మహా వీరరస ప్రధానమయి వేడుక నింపెడు రావువారి దుర్వారరణ ప్రసంగమతి రమ్యతరంబని"యు, దానిని కావ్యముగాఁ దెల్పమనియు కృతిభర్త కృతికర్త నడిగినాఁడు. ఇందు యుద్ధవీర మంగియని పై పల్కులవలన తేలుచున్నది. మోసపోయిన అభిమానులు రంగరాయాదులు. అభిమాన సంరక్షణకే ఆ యుద్ధము, ప్రాణత్యాగము! కావున నీ కావ్యము మానవీరమునకు ప్రసిద్ధోదాహరణము.

నారదుఁడు మహేంద్రునితో అనినట్లు—

"ధరణీభాగమునం దపూర్వమగు యుద్ధంబయ్యె బీభత్స రౌ
ద్రరసాలంబనమై మహాద్భుత తమద్రాఘిష్ఠ దోశ్శౌర్య భీ
కరమై పర్వుచుఁ బద్మనాయకులకున్ క్షత్రాళికిం దద్రణో
ర్వర మేను ల్విడనాడి............రా శూరులు". —ప్ర. ఆ. ప. 83.

దీనినిఁబట్టి అంగియగు వీరమునకు బీభత్సరౌద్రాద్భుతము లంగములని తేలుచున్నది.

ఇందు నాయకుఁడు రంగరాయఁడు—

"ఖండనభీముఁ డార్తజనబంధు సముద్రుఁడు భాగ్యవైభవా
ఖండలతుల్యుఁ డర్థిజనకల్పమహీజము భూపలోక మా
ర్తాండుఁడు వైరివీర భటదర్పవిదారణ బాహువిక్రమో
ద్దండుఁడు రావు రంగవసుధావరుఁ డాతని నెన్నశక్యమే!"—ద్వి. ఆ. ప. 21.

ధీరోదాత్త నాయకలక్షణ సమన్వితుఁడైన రాయఁడు ధర్మయుద్ధవీరములందు కాంతిమంతుఁడై యొప్పారుననుట నిర్వివాదాంశము.

కోటను విడిపొమ్మనిన పగవారిమాటలను, భీతిగొన్న స్వజనములఁ బల్కులు వినిన రంగరాయుఁడు—

"వేపిఁ జేపట్టి గజరాజు విడిచినట్లు
గత్వరములైన ప్రాణముల్ గాచికొనుట
కామృగాంకార్కతారాగ్రహంబుగాఁగ
వెలయు సత్కీర్తి గోల్పోవు వెట్టిగలఁడె!" —ద్వి. ఆ. ప. 190.

అని మృగేంద్రమువలె ముందుకురికి, తెలుఁగు పౌరుషము వెలార్చి, వీరమరణమును బొందిన మానవీరుఁడాతఁడు. అతని చరిత్ర ధర్మబద్ధమగు మానయుద్ధవీరముల కాలంబనమై వీరరసము నంగిగాఁగల్గి యొప్పుచున్నది.[1]

౧౨. బుద్ధచరితము – తిరుపతి వేంకటకవులు :

దయాసముద్రుఁ డగు సర్వార్థసిద్ధుఁడు ప్రాణికోటి వార్ధకరుజామరణాదులతో బాధనొందుచు జీవితయాత్ర దుర్భరముగ గడపుటఁగాంచి జాలిచెంది, తత్తరుణోపాయమునుగూర్చి, చింతించుచుసన్యస్తుఁడై, సాధకుఁడై, ధ్యానియై, బుద్ధుఁడై, ప్రబోధకుఁడై లోకకల్యాణమును సాధించిన మహామహుఁడు. అతని జీవితము జ్ఞానసాధనాత్మకోత్సాహ ప్రవృత్తికి, సిద్ధిచెంది జ్ఞానమును లోకులకు ప్రబోధించివారినిఁ దరింపఁజేయుటలోని అనంతోత్సాహమునకు ఆలవాలమయి అతనిని జ్ఞానవీరునిగ భాసింపఁజేసినవి. వానివెనుక అతనియందు జన్మతః భాసించెడి అపార దయాగుణము దయావీరునిగను తీర్చిదిద్దుచున్నది. అందువలననే కావ్యకర్తలు :

"బుద్ధునికుఁగల యెక్కుండు భూతదయను
గూర్చి మానేర్చుగతి నిట్లు గొంతదనుక వ్రాసినారము" —షష్ఠాం. 102

అని వినయముతో జెప్పుకొనినారు.

---

1. "బొబ్బిలి యుద్ధ" నాటకమున నీ కథ మఱల విపులముగా విమర్శితము.

బుద్ధభగవానుని పవిత్రసందేశము ఖండఖండాంతరములకు వ్యాపించి, భరతఖండమున కొకవిధముగా నాసియాలో గురుపీఠమును సంతరించి పెట్టినది. నాటికి నేటికి శాంత్యహింసా సందేశములను భారతీయులు ప్రపంచమునకు ప్రబోధించుచునే యున్నారు. మహాత్మాగాంధీ బుద్ధుని కారుణ్యభావమును భారతీయులలో మఱల పునరుద్ధరింపఁజేసినాఁడు. అతనికి సమకాలీనులైన తిరుపతి వేంకటకవులు ప్రాచీన భారతవీరుని గాథను కావ్యముగాఁ గూర్చి దేశీయులకు తమ ప్రాచీన విజ్ఞాననిధిని త్రవ్వి యిచ్చినారు. అశ్వఘోషుని బుద్ధ చరితమును మూలముగా నీ కావ్యమును రెనింగించినారు. ఇందు దయావీర మంగి. జ్ఞానవీర మందులకు పోషకము. శృంగారశాంతాదు లంగములు.

కపిలవస్తుపురాధీశుఁడగు శుద్ధోదనుని పట్టమహిషి దైవసంకల్పమున గాంచిన స్వప్నము బుద్ధభగవానుని యవతారమునకు నాంది నాలపించినది. స్వాప్నికఫలదర్శకులు తదర్థ వివరణము సేయుచు, ఇట్లు ప్రాక్రుచ్చిరి :

"ఆ పుణ్యాత్ముఁడు సార్వభౌమ పదవిం బ్రాపించి సామంత భూ
మీపాలు ర్దనుఁ గొల్వ నెల్లరును మేల్మేలంచు శ్లాఘింప నా
శాపాలేశుని భంగి యీ భువనము న్పాలించుఁ గాదేని వి
ద్యాపూర్ణుండయి సర్వలోకులకు నిత్యానంద మిచ్చున్ గృపన్." —ప్ర. 70.

అం దెట్టివాఁడైనను సిద్ధార్థుఁడు ప్రసిద్ధుఁడే యగును. మహారాజు, ప్రజలు సమ్రాట్టు కావలెనని ఆశించిరి; దేవతలు, తపస్వులాతఁడు జ్ఞాని కావలెనని వాంఛించిరి. మహాయోగియగు అసితుఁడు బుద్ధుని జన్మము విని కపిలవస్తు పురమునకు వచ్చి బాలుని దర్శించి—

"బుద్ధుఁడవై జగముల కవిరుద్ధంబగు జ్ఞానమిచ్చి ప్రోచుచు నసం
బద్ధపు మతములఁ ద్రుంచుచు నిద్ధచరిత! నెగడఁ బుట్టితీవు మహాత్మా!"
—ప్ర. 108.

అని అతని జన్మహేతువును నిరూపించి తెల్పినాఁడు.

సిద్ధార్థునకు పుట్టుకతోడనే సూక్ష్మమైన బుద్ధి, నిశితపరిశీలనా పాటవము, లోకాద్యవేక్షణము, దయామయత్వము నైజముగా నుదయించినవి; సర్వ విద్యా విశారదుఁడయి సర్వజీవదయామయుఁడై చరించినాఁడు. మహారాజు నకు గారాబుబిడ్డఁ డగుటచే కష్టమనునది లేశమైన నెఱుఁగఁడు.

"శోకము బాధయుఁ గన్నీరాఁకలి యను శబ్దములన యతఁ డెఱుఁగుం; ద
ద్వ్యాకులత యించుకేనియు నా కరుణాకరున కెఱుక యనఁదగ దొకటన్."
—ప్ర. 144.

సిద్ధార్థుఁ డొకనాఁడు మిత్రులగు దేవదత్తాదులతో హిమవత్పర్వత పాదమున విహరించుచుండెను. ఆకసమున నంచలబారులు రమ్యముగా ధవళతోరణములవలె నొప్పారుచు నెగురుచుండెను. దేవదత్తుఁ డొక యంచను బాణమునఁ గొట్టెను. అది విలవిలఁ దన్నికొనుచు సిద్ధార్థునిముందు పడెను. దానిని గాంచినతోడనే అతని హృదయములో వాసనాయుతముగా నున్న దయ మేల్కాంచినది.

"గిలగిలఁ గొట్టికొనఁగ నయ్యాలఘుం డిది యేల యిట్టు లార్తింగను ? న
మ్ములికిం బుచ్చితిఁగాదే కలిగెనె వేఱద్దియేనిఁ గారణమనుచున్"
"తన కాయమునం దయ్యాలుఁగును గ్రుచ్చియుఁ బుచ్చియును బుగుల్కొను నార్తిన్
దనలో నెఱింగి యనుభవమునకుం దెచ్చుకొని మిగుల మొనసిన కరుణన్."
—ప్ర. 151, 152.

అరటి పూరేకులవంటి ఆ యంచ రెక్కలను నేర్పుతో నిమురుచు, వనౌషధులఁ బూసి దానిబాధను కొంత యుపశమింపఁజేసెను. లౌకిక విషయములఁగాంచిన తోడనే తాదాత్మ్యవస్థ నొంది ద్రవీభూతుఁడగు సిద్ధార్థుఁ డసమాన దయామయుఁడు, రసార్ద్ర హృదయుఁడు, ఉత్తమసంస్కారి.

దేవదత్తుఁడు కర్కశుఁడై పక్కి నడిగినాఁడు; తనదని వాదించినాఁడు. దానికి సిద్ధార్థుఁడు "మృగయావినోదంబునం బాణహతంబగు ప్రాణియే దేనియుఁ బ్రాణియున్నంత దనుక నాహతకునిది కా" దను న్యాయముచే నాతని వాదమును ఖండించుచు :

"దైవవిహితమైన దయకల్మి నాకు నీయంచ బ్రతుకఁజేయు నంతపాటి
యవసరంబుగల్గె, నక్కారణమున నా యదియె యిద్ది యొరుల దగుట యెట్లు ?"

అని దయావీరమును బ్రకటించెను. న్యాయాధినేతయు నట్టి ధర్మమే నిర్ణయించి ప్రపంచించినాఁడు. ఇది సిద్ధార్థుని జీవితములో లోతైన అనుభవమును దెచ్చిపెట్టి జీవకారుణ్యము నందలి గంభీరమును అతనియందు సంతరించిపెట్టినది.

తండ్రి పంపున పట్టణదర్శనార్థ మేగిన సిద్ధార్థునకు ప్రకృతిలోని హింసాత్మక ప్రవృత్తి గోచరించినది. అది యతనిలోని అహింసాతత్వమును ప్రబోధించి పటిష్ఠమొనర్చినది. అతనికి విభావములయిన దృశ్యములు :

"అఱితికాయలు గాయ నవని దున్నుచుఁ గష్టపడుచుండు కాసరద్వయము నొకటఁ
జెన్నుగా దున్నిన చేలలో విత్తుల వైచుచుండెడు కాఁపువాండ్ర నొకట

ఫలపుష్పవితతులఁ దులఁదూఁగి నేలకు నంటుచున్నట్టి వృక్షాళి నొకట
వాని ఫలంబుల భక్షించి సుఖయించు కీరాదిక పతత్రివార మొకటఁ
బట్టి చీమల మ్రింగెడి బల్లిని, మఱి దాని మ్రింగెడు పాము, నద్దాని మ్రింగు
వైనతేయుని, జిన్నచేఁపలను మ్రింగు పెద్దచేఁపలఁ దిను పక్షిబృంద మొకట
వానిఁబట్టి భక్షించెడి శ్యేనములను
నొకట వేఱొక్కయెడ మనుష్యులను దిను న
ఘోరులను........"
—ప్ర. 195, 196.

జూచుటచే నాతనికి లోకమంతయు హింసాప్రవృత్తి ప్రధానమనియే స్ఫురించినది. దయాహృదయమున నిర్వేదము జనించినది. అది జ్ఞానమార్గము నావిష్కరించినది. వెంటనే తీవ్ర విచారముద్రను వహించి ప్రక్కనున్న నేరెడుచెట్టు క్రింద కూర్చుండి ధ్యాననిశ్చలుఁ డయ్యెను. ధ్యానవిఘ్నము నాపాదింప యత్నించు మిత్రులఁ గాంచి అంబరవాణి:

"ఈతఁడు పరసంరక్షణకై తా జన్మంబు నెత్తి నట్టిఁడు సుగుణా
న్వితుఁడు మహానుభావుఁడు చేతమ్మునఁ గరుణఁ దక్కఁ జేర్పఁ డితరమున్."
—ప్ర. 200.

అని అతనియందు సంపూర్ణదశ నొందిన దయాభావమును నిరూపించి చెప్పినది. అది యతనికి పైమెట్టున కధికారము సంతరించినది. హృదయము తత్త్వజ్ఞానార్జన కున్ముఖమైనది. కన్యాబహుమానప్రదానోత్సవమునకుఁ బ్రబోధించు పురోహితసుతునితో—

"పరిణయ మొల్లక నే నస్థిరమగు సంసార మనెడు తెరువునఁ బడ కాం
తరమగు తత్త్వజ్ఞానాంతరమునఁ జరియింతు," నని పల్కినాఁడు. —ద్వి. 24.

సిద్ధార్థుఁడు ప్రకృతి విద్యార్థి. అతఁడు జీవితములోఁ బొందిన అనుభూతులన్నిఁటిని నొక్క జ్ఞానమునుదప్ప-ప్రకృతినుండియే గ్రహించినాఁడు. జీవితము నాత్మోన్నత్యమునకు పరహితార్థమునకు నెట్లు త్యాగము చేయవలెనో స్వయముగా జ్ఞానవంతుఁడై నిశ్చయించుకొని అట్లే నడచి చూపి లోకమున కాదర్శవంతుఁడైనాఁడు.

అతని బ్రతుకుబాటను వెలుఁగుబాటకుఁ ద్రిప్పిన నిశితానుభూతులు మఱియు మూఁడు కలవు. అవి యాతఁడు కపిలవస్తు నగరమున నొంటిగా రథారూఢుఁడై వెడలుచుఁ గాంచిన వృద్ధరోగశవ దర్శనములు. అని యతని హృదయమును వికలపఱిచి విరక్తిపథమును బట్టించినవి. దానికిఁదోడు ఘురునాఁ

డాతఁడు వేటకు వెడలి యొక కొండగుహలో నొక సన్యాసినిఁ గాంచి అతని వలన—

"అవని మోక్షేచ్ఛ గల వా రఖిల బంధు పుత్ర మిత్ర కళత్రంబు పూరితమగు
సంసరణ వార్ధిఁ బడక యే చనఁగవలయు నుగ్రకాంతారములవంక కూరు విడిచి"

అని ప్రబోధము వడయుటచే జ్ఞానేచ్ఛాగ్నికి సన్యాసమారుతము తోడైన దైనది. సతీవిలాసవిషయాసక్తము లగు తన యింద్రియముల నిగ్రహించి వెనుకకు మరలించినాఁడు. అంతరముగా దైవప్రబోధము రింగున చెవులలో మ్రోగినది. యశోధరకు వచ్చిన కల అతని మార్గమును స్థిరీకరించినది. కాలమాసన్నమైనది. మోహపాశంబులఁ ద్రెంచి, భార్యను వదలి చెన్నునికిఁ దన యాశయముఁ దెల్పి, కంటకమునెక్కి నిష్కంటకముగా తపోవనముఁ జేరినాఁడు. రాజగృహనగర ప్రాంతములో సన్యాసివేషమున సత్యజిజ్ఞాసలో మునిఁగి భైక్షుకవృత్తితో సన్యాసివేషమున జీవించినాఁడు. అతని నిష్ఠనుగాంచి జనులు సర్వసిద్ధుఁడని భావించిరి. కాని తానొక సాధకుఁడని వినయములోఁ బ్రతివారితోడను తెల్పెడివాఁడు సిద్ధార్థుఁడు. పుత్త్రశోకార్తయగు నొక తల్లికి దుఃఖావృతమగు లోక తత్త్వమును నిదర్శనాత్మకముగా నిరూపించి చెప్పి—

"మరణంబు సర్వ సామాన్యంబు దుఃఖంబు గాంచని వారు లోకమున లేరు
నిజ మిదియనుమాట నీయంత నీకు గోచరముగా నీయుక్తి నలిపినాఁడ
నీదృశ దారుణ ఖేదమ్ములకుఁ గత మెద్దియో తెలియఁగ నెంచి వేను
దిరుగుచున్నాఁడఁ దెలియుటకై ప్రాణమైనను విడుచు సాహసము కలదు."
—చతు. 28.

అని తన జ్ఞానసాధనౌత్సుక్యమును బ్రదర్శించినాఁడు. జ్ఞానదీక్షను బూని సాధకునిగా ప్రాణత్యాగమునకైన నుత్సహించు సిద్ధార్థుఁడు జ్ఞానదయావీరుఁడు.

యజ్ఞపశువులు సవనములలో హననము చేయఁబడుట మొదటిసారి చూచిన అతని యెడంద యేరై పోయినది. బింబిసారనృపతి చేయు యజ్ఞమును గాంచిన గౌతముడు ఋత్విజులతో—

"ప్రాణహననంబు గడు సులభంబుగాని ప్రాణ మిచ్చుట మనకు సాధ్యంబు కాదు.
ప్రాణరక్షణకై పాటుపడనివారు, ప్రాణిపైఁ బ్రేమలేని వారలును గలరె."

"జీవముల యాత్ర సంపూర్తి చేయకుండఁ జంపువారికిఁ బాపంబు సంభవించు
జీవహింస యొనర్చెడి చేతసేయు వారలకుఁ బాపముక్తి చేకూరదెపుడు."
—చతు. 51, 52.

అని ప్రబోధించి జంతుసంహారము మాన్పించి అహింసను స్థాపించెను. బింబి

సారునికి తన జ్ఞానపిపాసను గూర్చి తెల్పినాఁడు సిద్ధార్థుఁడు. అతనితో నరాడుఁడను మునిం జేరి మోక్షమార్గముఁ దెలిసికొనినాఁడు. ఆత్మ సాక్షాత్కారసాధనోత్సాహముతో ప్రయాగ క్షేత్రమునకు నడచి వెళ్ళినాఁడు. నిత్యోపవాసాదులతో దేహముఁ గృశింపఁ జేసినాఁడు; జ్ఞానసాధనలోఁ దీవ్ర తపస్సునకుఁ గడఁగినాఁడు. శుష్కదేహము జ్ఞానసాధన పటువుకాలేదు. ఈ సత్యమాతఁడు వారాంగనా వాక్యము వలన గ్రహించినాఁడు.

"బిగువుగ సారించితివేఁ దెగుఁదంత్రులు, వదలు చేసితేనిన్ సరిగాఁ
దగదు శ్రుతిగానసమముగఁ దగుగతి సారింపు మీ చితారు లతాంగీ."
—చతు. 114.

అనునవి ఆమె పల్కులు. అవి సిద్ధార్థుని చెవులఁబడినవి. జ్ఞానవాసనలు కల్గిన అతని హృదయము నీరసములైన అప్పలుకులనుండి మహత్తర గంభీరార్థమును సారవంతముగా నూహింపఁ గల్గినది.

"నీచుల నుండియుం దగిన నీతులు కొన్ని గ్రహింప వచ్చుఁ దం
త్రీచయముల్ బిగించి తెగఁ దీసినచో శ్రుతిపోవు భంగిఁ గా
ర్శ్యాచరణంబు దేహమున కబ్బినవేళలఁ దత్త్వచింతయుం
దోఁచునె? యే నెఱుంగ కిటు తోరముగా మెయిఁ జిక్కఁజేసితిన్"
—చతు. 117.

అని వితర్కించి సుజాత దైవదత్తముగాఁ దనకిచ్చిన క్షీరాదులను గ్రహించి తనువును జ్ఞానసాధన పటువుగా నొనర్చుకొనెను. సుజాత యిచ్చిన క్షీరసారము నుండి అతఁడు నేర్చుకొనిన పాఠమిది :

"క్రమముగా నైక జంతు సారంబు కతన నీ పదార్థంబు రుచ్యమై యొసఁగినట్లు
నైక జన్మంబు లెత్తి యనంతరంబ జీవుఁడును ముక్తియను ఘన స్థితికి వచ్చు."
—చతు. 139.

నని. అతని కంటఁ గానఁబడిన ప్రతి లౌకిక సన్నివేశము జ్ఞాన ప్రవృత్తికి విభావములై లోని సంస్కారములను బలీయ మొనర్చినవి; అతని భావోత్కర్షస్థితి జ్ఞానోదయాధికారమందుకొని పండి నిలిచినది.

బుద్ధగయలో బోధివృక్షమునీడ సిద్ధార్థుఁడు బుద్ధుఁడైనాఁడు. తాను పొందిన జ్ఞానానుభూతిని బింబిసారాది ప్రముఖుల కమృతోపన్యాసములతోఁ బ్రబోధించినాఁడు. శిష్యు లసంఖ్యాకులైరి. చివఱకు తన భార్యాదులు కూడ శిష్యరికము స్వీకరించినారు. అతఁడమరజీవియు, జ్ఞానపీరజ్యోతియు నయి భరత

ఖండమును వెలుఁగులనింపి విషయ దుఃఖితుల కఖండానంద మార్గమును జూపించినాఁడు!

తిరుపతి వేంకటకవుల యడుగు జాడలలో బుద్ధ చరిత్రను తీర్చిదిద్దిన వారిలో జంధ్యాలపాపయ్యశాస్త్రిగారు శ్రేష్ఠులు. వారి కరుణశ్రీ బుద్ధదేవుని కరుణామయ స్వరూపమున కెత్తిన కీర్తిపతాక! బుద్ధ జీవితములోని ఘట్టముల గైకొని చిత్రించిన కావ్యములలో 'సౌందర నందము' సుందరతరము! ఇంతియ గాక దోరసానయ్యగారి గౌతమబుద్ధ చరిత్ర-చిలకమర్తివారి సిద్ధార్థ చరిత్ర, పానుగంటివారి బుద్ధబోధసుధ-సన్నిధానము వారి జాతక కథా గుచ్ఛము— దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి బుద్ధ పురాణము మొ నవి ఈ శాఖకు చెందినవి.

నవ్యులలో వీరరసమహాకావ్యములను నిర్మించి ప్రసిద్ధులయినవారిలో శ్రీయుతులు డి. రాజశేఖర శతావధాని, గడియారం వేంకటశేషశాస్త్రి గారలు ముఖ్యులు. ఆంగ్లేయ భాషాసాహిత్యములతో బరిచయము గల్గిన భారతీయుని యందు స్వాతంత్ర్యము, వ్యక్తి గౌరవము, భాషాభిమానము, దేశగౌరవము మొదలగు నుదాత్త గుణములు ప్రబోధితములై ప్రబలరూపముఁ దాల్చి, స్వాతంత్ర్య సమరమునకు దారితీసినవి. కవు లీ సమయమున స్వరాజ్య సాధనోత్సాహముతో తమజాతిని మెలుకొల్పుచు ప్రాచీన చరిత్రమును నూతన దృక్పథముతో నవ్వయించుచు తమవారిని స్వాతంత్ర్య వీరులుగా తయారు చేసిరి. చరిత్రకారులచే క్రీ.శ. 1857 నాటి జాతీయ విప్లవము సిపాయి పితూరిగా వర్ణితమై యుండ దానిని స్వాతంత్ర్య పోరాటముగా - నిజస్వరూపము బోధపడునట్లు - ప్రబోధించిరి. ఈ యుగమునందే మహాకావ్య రచనము సాగించిన పై యిరువురు కవులు - హైందవజాతి స్వాతంత్ర్యమునకై కృషిచేసి ధర్మరక్షణార్థము స్వతంత్ర రాజ్యమును స్థాపించి హిందువుల నేకోన్ముఖముగ విజయపథమున నడిపింప యత్నించిన రాణాప్రతాపసింహ, శివాజీల జీవితగాథల నితివృత్తముగా గైకొనినారు. ఈ కావ్యములకు స్వాతంత్ర్య మత ధర్మరక్షణోత్సాహమే ప్రాణము. అది యానాఁడు కవులందును, ప్రజలందును వ్యాపించి యుండుటచే నట్టి తత్త్వమే కల్గిన నాయకుల చరిత్రములు సర్వజన మనోరంజనములై వరలినవి.

ఒకనాఁడు హైందవ ధర్మారణ్యమున త్రోవలు మూతలు పడునంతగా ముండ్లపొదలు ముసురుకొని మొలచినవి. బాటసారుల రాకపోక లతి బాధావహములై అసలు ప్రయాణములే మానునంతవఱకు వచ్చినది. కొందఱు

పొదలను వీరదండములతో చేతికందినంతవఱకు విరుగగొట్ట యత్నించిరి కాని పెచ్చు పెరిగిపోయెడి వాని పోకడల నెదురొడ్డఁజాలక పోయిరి. అట్టి సంకట సమయమున నా యరణ్యమునఁ గొన్ని శమీవృక్షములు అగ్నిగర్భములై మొలిచినవి. ఝాటసారుల కడగండ్లు వాని హృదయము లందలి అగ్నిని ప్రేరేచగా తమలో తాము దగ్ధమైనను ధర్మారణ్య మార్గగతములైన ముండ్ల పొదలను సమూలముగా దగ్ధమొనర్చి చక్కని రాచబాట కవకాశముఁ గల్పించినవి. ఇట్టిది యుగయుగాలుగా వచ్చుచున్న హైందవభూమియందు తఱచుగా జరిగెడి జాతివృత్తమే. అందు శమీవృక్షసన్నిభులు, త్యాగమూర్తులు, ధర్మ రక్షకులు నయిన మహావీరులే ప్రతాపసింహ, అమరసింహ, శివాజీ ప్రభృతులు. వారు ధీరోదాత్తులు.

నవ్యాని కావ్యాస్వాదన దృక్పథమును శ్రీ గడియారము వేంకటశేష శాస్త్రిగారు తమ కావ్యప్రస్తావనలో చమత్కారముగా వ్యాఖ్యానించినారు.

"ఈ — నవయుగమందు గ్రంథరచనన్ బలుదారులు దోఁచుఁ గైతలోఁ
జవి, యనుభూతి, లక్ష్యమును శైలి తమంతయి కట్టులేదగున్,"

"ఇంతయుఁ దేర్చికొన్న నితివృత్తము తేలదు పూర్వగాథ సా
యంతన పద్మమై పలితమైనది; కల్పితగాథ బూటకం
బంతరసారమై, విలువకందనిదైనది ఖండగీతి ఛా
వాంతర లక్ష్యమై జగమునంట దుదాసిత నాయకోన్నతిన్."

ఇవి ఇట్లుండఁగా దేశచరిత్రను మాత్రము తరుగని యుత్సాహముతో పఠించెడి వారు ప్రజలు. ఆ కాలపు పరిస్థితులు నభిరుచులు నట్టివి. అందువలననే ఈ కవులు చరిత్రప్రసిద్ధికెక్కిన వీరులనే నాయకులుగా నిబంధించి, కావ్యములను రచించిరి.

## ౧౩. రాణాప్రతాపసింహ చరిత్ర – శ్రీ డి. రాజశేఖర శతావధానిగారు:

"భారతము పూర్వకాలము కథనే చెప్పును. అందులోనున్న ధర్మము మాత్రమే మనజాతిది. ఆ విషయము ద్వాపరయుగము నాటిది. మన పరిస్థితు లతో సంబంధము లేనిది. ప్రతాపసింహ చరిత్ర మన ధర్మమునే గాక మన పరిస్థితులను గూడ చెప్పును. అగ్బరు చక్రవర్తితో పాతికయేండ్లు హోరాహోరి పోరి — స్వదేశమునందలి — కొండలలో గుట్టలలో నివసించి, తిండిలేక గడ్డి రొట్టెలు తిని దైవవశమున మఱల స్వాతంత్ర్యము సంపాదించిన మహాపురు షుఁడు రాణాప్రతాపుఁడు! ఆయనకన్న ధర్మరాజాదు లేమియు నెక్కువవారు

కారు. వస్తురమ్యతకుఁగాని, కథారచనకుఁగాని, ఇందలి భిన్న పాత్రల భిన్నతా విశిష్టతకుఁగాని భారతమున కీ గ్రంథము తీసిపోదు"

"ఈ గ్రంథము అస్వతంత్ర జాతి కొక స్మృతిగ్రంథము వంటిది. రాణా ప్రతాపుని భద్రాకరణ ప్రతిజ్ఞ — చదివినచో పారతంత్ర్య జాతికి ఇది స్మృతి గ్రంథమన్నమాట కర్థము తెలియును. రాణాప్రతాపునకును మహాత్మునకును గల సామ్యము — భారతజాతికి గల యస్వతంత్రత; మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపు పోరు. ప్రతాపునిది కత్తిగల సాత్త్వికపు పోరు. ప్రతాపసింహుఁడు అక్బరును జయింపవలెనిన యుద్ధము చేయలేదు. పౌరుషశక్తితో గెలువలేనని యాయనకు తెలియును. కాని వట్టి ధర్మముకోసము యుద్ధముచేసెను. భారత జాతీయ ధర్మము పరులకు లొంగిపోదు—చచ్చిపోదు. అని రుజువు చేయుటకే యుద్ధము చేసెను."

"కాన విజయంబు ముఖ్యంబు గాదు మనకు !
ధర్మ నిర్వహణంబు కర్తవ్య మిపుఁడు !"

"ఇది ప్రతాపుని యూహ. నేటి సత్యాగ్రహమునకు ఆనాటి ప్రతాపుని యుద్ధ ధర్మమునకును భేదమేలేదు."

"ప్రతాపుఁడు గాంధివంటివాఁడు, ఏసుక్రీస్తువంటివాఁడు, చివఱ కిట్లనెను: 'నా రాజ్య మరణ్యము, మేము సన్యాసులము. మీ యగ్బరునకు మమ్ము గెలువవలెనని పట్టుదల యేమి? అప్రతిహతముగా నక్బ రొక్కఁడే క్షితిని దేవుఁడు సృష్టిచేయ లేదు. ప్రజ లతనిచేఁ జంపఁబడుటకుఁ బుట్టలేదు. రాజ కన్యక లతని భోగపరత కుద్దేశింపఁబడలేదు. అతని రాజ్యతృష్ణముందు సర్వ జగత్తు పారతంత్ర్యమున మునుఁగుచెల్ల పాడిగా దనుచు నక్బ రెంత యెటిఁ గిన జగమున కంత మేలు !"

"చివఱకు తనబిడ్డ మోలుగడ్డితో చేసిన రొట్టెలను తినుచుండ నడవిపిల్లి వచ్చి దానిని గిరి రొట్టె నెత్తుకొనిపోయెను. ప్రతాపుఁడు చక్రవర్తి నాలుగునెలలు గడువడిగెను. ఉత్తరమిచ్చి భిల్లుని పంపెను. ఆ యుత్తరము చూచి యక్బరు పొందిన సంతోషమునకు మితిలేదు. అక్బరు సభలో పృథ్వీసింహుఁడు ఆ యుత్త రము ప్రతాపసింహుఁడు వ్రాయలేదనెను. వారును వీరును వివాదపడిరి. ఆ యుత్తరము తెచ్చిన భిల్లునితో పృథ్వీసింహుఁడు భార్యయు నిట్లనిరి.

"చెప్పుము చిత్తమిచ్చి యిదె శ్రీ నృపలోక జగద్గురుండు మా
యప్ప ప్రతాపదేవుని ముఖాంబురుహంబున జంద్రబింబమం

దొప్పెడి వెన్నెలట్లలరు నుత్తమమౌ దరహాసరేఖ తా
నెప్పటియట్ల పాయక రహించుచునున్న దె ఖిల్లశేఖరా !"

"(శ్రీ)...ప్రతాపదేవు"—ఇందు రసధ్వని వేయిమూర్తుల రూపుగట్టుచున్నది. హృదయమునుండి వచ్చిన భాషయనఁగా నిది. వట్టియక్షరములుగా మాటలుగా గనిపించును గాని ప్రతాపుఁడుగా మూర్తిగట్టిన పృథ్వీసింహుని స్వాతంత్ర్యాభిలాష యంతయు ధర్మవీరరసమంతయు ఆ మాటలలో నున్నది. ఇట్టి రచన మహాకవులే చేయఁగలరు." ఈ వాక్యములు కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణగారివి. రాణాప్రతాప చరిత్ర పీఠికనుండి కృతజ్ఞతతో గైకొంటిని.

రాణాప్రతాపుఁ డపూర్వ స్వాతంత్ర్యవీరుఁడు. అతని చరిత్రమున నంగి స్వాతంత్ర్యవీరము. నాయకుని చరిత్రము నారంభింపక పూర్వము వీరరసో దంచితగాథలను పూర్వరంగముగా సంతరించినాఁడు కవి; ఈభాగమునఁ బ్రధానముగా చరిత్రను చెప్పుచున్నను వీరరసఘట్టములందు మాత్రము సమరోచితముగా రసమును పోషించి రచించి యున్నాఁడు. అందులో—పృథ్వీరాజు సంయుక్తను రాక్షస వివాహ విధిని గొంపోవుచు శత్రువులఁ జెండాడిన విధము నందును, పద్మినిఁ జూడవచ్చి మోసగించిన అల్లాయుద్దీనుతో రసపుత్రులు తెగించిచేసిన ఘోరయుద్ధమునందును, బేబరు సంగ్రామసింహులమధ్యఁ గల్గిన రణము వర్ణించుటయందును, హుమయూను తాను కోల్పోయిన రాజ్యమును తిరిగి సంపాదించుకొనుట యందును రణధర్మవీరము లుదాత్తములుగాఁ బోషింపఁబడినవి. అక్బరు దిగ్విజయము వీరరసావలంబము. పుత్త్రయుద్ధములో జయమల్లుని ప్రతాపము శత్రుదుర్నిరీక్ష్యమై అక్బరంతవానికి :

"అకట నాభాగ్యమున సూర్యు డస్తమించి
యాగె రణ, మీతనికి గంట వ్యవధియున్న
సేన సర్వసంహారంబు చేసి యుండు." —ప్ర. అ. ప. 236.

ననెడి భయముకల్పించినది. ఇట్టి ప్రతాపచరిత్రము లన్నియు రాణాప్రతాపుని చరిత్రకు పూర్వరంగములు. ఉద్దీపన విభావములు.

రాణాప్రతాపుఁడు మేవాడు దుర్గాధిపతియగు ఉదయసింహుని పుత్త్రి రత్నము. తండ్రిచే నియుక్తుఁడు కాకపోయినను సర్వసామంత మంత్రిమండలి అభ్యర్థనముపై గద్దెనెక్కిన యశోవీరుఁడు.

ప్రజాహృదయముఁ జూరగొనిన ప్రతాపుని గాంచి తమ్ముఁడగు సాగరుఁ డోర్వఁజాలక పగపట్టిన పామువలె నిండుసభలో విషముఁ గ్రక్కినాఁడు. అన్న

రాజ్యమునకు వచ్చుట తండ్రిగారి యభిమతమునకు విరుద్ధమని వాదించినాఁడు. ధర్మైకాయత్త చిత్తుఁడగు ప్రతాపుఁడు—

"అతిపూజ్యుఁ డుదయ సింహాఖ్య నరోత్తంసు కొడుకులలోఁ బెద్దకొడుక నౌట!
మారట తండ్రి సన్మాన్యుఁడీ కృష్ణభూజాని యానతి మీఱరాని దగుట!
సామంత మండలేశముఖు లేకగ్రీవ ముగను సింహాసనంబునకుఁ గోరఁ
బ్రస్తుతస్థితిని నీపాలన లేకున్నఁ జెడుదు మంచని పౌరు లడలుచుండ
ఎన్నికష్టసుఖంబుల నెంచి యెంచి విముఖమై యున్న మనసును వెనుకఁద్రిప్పి
యన్న! నేఁబట్ట భద్రుఁడ నైతిఁ గాని కోరి భారంబుఁ దలను గైకొనఁగలేదు."
—ప్ర. అ. ప. 353

అని సౌమ్యముగా చిత్తరంజకముగాఁ దెల్పెను. అతని తమ్ముఁడు ఉదయ సింహుని పల్కులలో "మూర్ఖులలో ప్రథముఁడు, 'హానికి నాల్క వేడి', యేనా డయినన్ రణమున్ గొని తెచ్చిపెట్టు—'కొఱవి.'" కావుననే హితుల పల్కులు తలకెక్క లేదు. క్రూరుఁడగు నాతని దేశబహిష్కృతు నొనర్చి రాజు శిక్షించెను. అది యతనిలోని పగను లెస్సగా రెచ్చగొట్టినది. ప్రకటముగా రాజుపై జిచ్చు మిసి అక్బరుతోఁ జేయికలిపి, మేవాడు కదలింప యత్నించినాఁడు సాగర సింహుఁడు. అసలే భరతభూమియందు నాల్గుచెఱగుల నల్లుకొనుచున్న తురుష్క దండయాత్రా దవాగ్నికి సాగరసింహుఁడు ప్రభంజనుఁడై తోడునిలిచినాఁడు.

ప్రతాపుఁ డొక విషయమున చాల దురదృష్టవంతుఁడు. మనసిచ్చి ప్రేమించిన ఇద్దఱుతమ్ము లాతనికిఁ దీరని ద్రోహముఁ జేసి కృతఘ్నులైనారు. సాగరసింహుఁడు వెడలిపోయిన తరువాత అతని వియోగముచే గాయపడిన హృదయమును తేర్చుకొనుటకై కృష్ణసింహుని కుమారుఁడగు సూక్తసింహుని తనయొద్దకుఁ జేర్చికొని ఏకోదరునివలె ప్రేమించినాఁడు. ప్రాణముకన్న ఎక్కువగా నాతనిఁ జూచుకొనినాఁడు. కాని అతఁ డల్పుఁడు, చండకోపి, అనృత వాది, కృతఘ్నుఁడు. వేటలో నొక పందికొఱ కొక పచ్చియబద్ధమాడి అన్నతో పంతమునకు దిగెను. ప్రతాపుఁడు—

"పనికిమాలిన పందికై యనృతమాడె దిలయుఁ గ్రుంగెనె! యంభోధు లింకిచనెనె
వెలఁగలుగు వస్తువేమైన వెనుకఁబడెనె! కోటి యనృతములేని బల్కుటకుగాని."
—ద్వి. ఆ. ప. 39.

అని మెల్లగా తమ్ముని మందలించినాఁడు. మాట పట్టింపులు పెరిగినవి. రోసములు హెచ్చినవి. సూక్తుఁడు గర్వాంధుఁడై మత్సరముతో సాగరునివలెనే

అన్నను తూలనాడి యుద్ధమునకుఁ గాలుదువ్వెను. సాలుంబ్రాకృష్ణుఁడు "ధర్మ మును బూదిఁ గలుపుచున్నావని హెచ్చరించినను ఆగక అన్నపైఁ గత్తి యెత్తి నాఁడు. అన్నదమ్ముల పోరును గాంచలేక, హరిభట్టు వారిని నివారించుట కన్య మార్గముతోఁచక ఆత్మహత్య నొనర్చుకొని ప్రాణములఁ ద్యజించెను. అతని పవిత్ర రుధిరధారలు వేడెక్కిన అన్నదమ్ములను రణవిముఖులఁ జేసినవి. ప్రతా పుఁడు గురువియోగమునకుఁ బరితపించినాఁడు. దానికి కారకుఁడగు తమ్ముని నిందించినాఁడు:

"గురు రుధిరంబు దాటఁగను గూడదు; కావున నేను నేడు సం
గరమును మానుటన్ బ్రతుక గల్గితి! వీవిఁక నాదురాజ్యమున్
ద్వరగఁ ద్యజించి యిష్టమగు తావునకుం జను మాలసించినన్
శిరము నిమేషమాత్ర ధరణిన్ బడు." —ద్వి. అ. ప. 86.

ననుచు గద్దించి, తరిమినాఁడు. సూక్తుఁడు సాగరు నడుగుజాడలలో నడచి పోయినాఁడు. ఇట్లు జ్ఞాతులవైరము అతని కష్టసహిష్ణుతను పరీక్షించి వన్నెఁ బెట్టినది. క్షమను పదనుపెట్టినది. ప్రేమను, అనురాగమును బంధువులపైనుండి దేశముపైకిఁ ద్రిప్పఁగల్గినది.

ప్రతాపుఁడు రాజ్యమునకు వచ్చునాటికి అక్బరు దిగ్విజయ యాత్రలు కొన్నిచేసి, భారతదేశ మంతటను ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికిఁ దీసికొనిరాఁ బ్రయత్నించుచుండెను. అతని ప్రతాపమునకు జడిసి, అంతఃకలహములతో గుమిలిపోవుచు—

"సేతుశీతనగాంతర సీమఁగలుగు మనుజపతులెల్ల మతిచెడి కనులుతిరిగి
విడని పేరాస నక్బరు విజయరథము కాడిమోసిరి స్వాతంత్ర్యఘనత మఱచి."

రాజపుత్రులే యెందఱో అక్బరుతో సంబంధములు కలిపికొని అతని మన్న నలకుఁ బాత్రులై యుండిరి. ఇట్టి పడుపుకూటి వృత్తి ప్రతాపునికి సహింపరాని దయ్యెను. మేవాడును స్వాతంత్ర్యలక్ష్మికి గర్భాలయముచేయ తలపెట్టి సామం తుల సభ యేర్పాటు కావించినాఁడు. నిజముగా నా కార్యము సముద్ర మాపోసనఁ బట్టునట్టిదే. అయినను మేవాడు రాజభవనములో రసపుత్రసింహాము లరిభయంకరముగ స్వాతంత్ర్యగర్జనలు దిగంతముల మారుమ్రోగించినవి.

అందు ప్రధానుఁడు ప్రతాపుఁడు శ్రావణమేఘమువలె నురిమినాఁడు.

"క్ష్మా గోళమును ముంచు గాఢాంధ తమసంబుఁ
గరదివ్వెతో నార్పఁ గడఁగునట్టు

అత్యగాధము సాగరానంత జలముల
కేతమ్ము వేయ నూహించునట్లు
వసుధ బొగ్గుగఁ గాల్చు ప్రళయాగ్నిహోత్రంబు
గన్నీటిచే నార్పనున్న యట్లు
క్షయకాలమున రేఁగు సప్తమారుతధాటిఁ
దేటి రెక్కల నాపఁ దివురునట్లు
లని జగము నన్నుఁ బరిహాస మాడుగాక
యెక్కటిని నిల్చి బలమెల్ల నెదురుపెట్టి
విధికి మాఱొడ్డి స్వాతంత్ర్య విజయలక్ష్మి
యడుగులకు నిత్తు ముత్యాల హారతులను.

ఎట్టి బ్రహ్మ యత్నంబును నేనిఁజేసి యుదయపుర లక్ష్మికి గిరీట ముంతుఁదలను
గాక దైవోపహతుఁడనై కడిమిచెడి నరకతతింగూర్తు రతనాల రావిరేఁక!
—ద్వి. ఆ. ప. 118, 119.

సాలుంబ్రాకృష్ణవిభుఁ డాతనిని మెచ్చుకొని అండ నిలిచినాఁడు:

"ఇవియున్ వీరరసాబ్ధి వీచికలుగానీ మాటలుంగావు; హైం
దవ మందెందును సత్యధర్మములు సంస్థాపింప మేవాడ భా
గ్య విశేషంబునఁ బుట్టువుంగనిన సాక్షాద్విశ్వనాథుండ వే
దువు; మర్త్యుండవుగావు నిన్గొలుచు టెంతో మాకు శ్రేయంబగున్."
—ద్వి. ఆ. ప. 122.

భానుసింహుఁడుప్రాణములను స్వాతంత్ర్యమున కర్పింతుననినాఁడు.

"కంఠమునఁ బ్రాణవాయువుల్ గలుగు దాక!
ముందునకె గాని వెనుకవైపునకు జూఁడ!
మరుల కరవాలములు పూలసరము లట్లు
కంఠములు కౌఁగిలించిన కాలమందు."

మనస్సింహుఁడు స్వాతంత్ర్యలక్ష్మి నందుకొనుటకు తాను సోపాన మయ్యెద ననినాఁడు.

"దస్యు శతకోటిపైన మద్భటులు నేను దనువులను వాల్చి నీవు స్వాతంత్ర్యలక్ష్మి
కలవరచు రత్నదేవాలయమ్ముఁ జేర పరచఁగలమయ్య కనక సోపానపంక్తి."
ద్వి. ఆ. ప. 186.

ఇట్లే శ్యామసింహుఁడు, తేజసింహుఁడు, వృద్ధుఁడగు రామచంద్ర దేవుఁడు మొ. లగు వీరులు ఆత్మార్పణకు సిద్ధమైరి. 'వీరరసవార్ధియో' యనఁదగు

భిల్లనాయకుఁడు భీమచందు బెబ్బులివలె కర్మవీరుఁడై ముందుకు దుమికినాఁడు.

"పారతంత్ర్య మదల్చి స్వాతంత్ర్యమును నిల్పు బవరమ్ము వచ్చె సంవత్సరాది
పండువు వోలె నీ భారతఁ ప్రజ కెల్ల సమభాగమైన యుత్సాహావేశ
యందఱు మొక మొగంబై నిల్చి యరుల గెల్చితిమేని స్వాతంత్ర్యసిద్ధి యొదవు
ననిలోనఁ బడిన కల్పాంతంబువఱకు శాశ్వత నాకలోకవాసంబు కల్గు
రెంట నేదిగల్గినఁ గృతకృత్యులగుదు మింతకన్నను చిరపుణ్య మేది కలదు
మీనమేషంబులకుఁ బ్రొద్దు మించకుండ నిపుడె ప్రస్థానభేరి మ్రోయింపవయ్య!
—ద్వి. ఆ. ప. 170.

అనంతోత్సాహ సమన్వితు లండ నిలువ అమలస్వాతంత్ర్య రథమును ముందుకు నడిపినవాఁడు ప్రతాపుఁడు. ఇది విశృంఖల ప్రధానావేశయుద్ధము గాదు. సత్యధర్మాచరణము, సుహితక్లేశానుభూతులు ప్రధానమగు వ్రతదీక్ష! ఈశ్వర భక్త్యాది నియమసహిత మిద్ది (ద్వి. ఆ. 180-186). మేవాడనువదలి పోరావళీ పర్వతవాసము దానికి ప్రథమ సోపానము. ఇది యొక విచిత్రమైన సత్యాగ్రహము.

అక్బరునకు మేవాడ స్వాతంత్ర్యోద్యమము హృదయశల్యమైనది. ఇద్దఱు స్వతంత్రు లొక్క రాజ్యమున నుండజాలరని తలంచి సామాదులచే మేవాడను కబళింప యత్నించెను. మానసింహుని రాయబారము విఫలమైనవి. దానికి హేతువులు—

"స్వాతంత్ర్య లక్ష్మి విశాల సేవలకు జీవితమును నేఁ దీసి పెట్టినాఁడ;
బ్రహ్మాండమంత విపత్తు వచ్చిన నోర్తు నించుక యేని చింతింపఁబోను;
మఱి యెందుగాని నిర్మాణమునకు ముందు విధ్వంసనము ముఖ్యవిధిగనుండుఁ
బరతంత్ర గతినొందు వైభవంబునకన్న స్వాతంత్ర్యమున వచ్చు చావుమేలు
మాశిశోదియా వంశ సంభవులు బ్రతికి స్వేచ్ఛమై నుండవలె; లేనియెడలఁజచ్చి
స్వర్గముననైన నుండఁగా వలయుఁగాని మధ్య వేఱొండుమార్గంబు మాకు లేదు"
—ద్వి. ఆ. ప. 289.

అను ప్రతాపుని స్వాతంత్ర్య దీక్ష,

"విమతుల ఖడ్గము హృదయాబ్జముఁ జొచ్చును గాక యచటి స్వాతంత్ర్యపుబీ
జముఁ జంపుట మాత్ర మసాధ్యము; నెఱవేరదు జగంబు తలక్రిందైనన్."
—ద్వి. ఆ. 296.

అనెడి ప్రతాపసింహుని సమాధానము.

అక్బరుకు కన్ను లెఱ్ఱవారినవి. మేవాడపై "ఢిల్లీపురి జనశూన్యమై తేవఁ దనరు"నంత సైన్యమును పంపెను. కున్వార్ మానసింహుఁడు, సలీము,

తోరమల్లు, సూక్తుఁడు, సాగరుఁడు మొ॥గాగల యోధులెల్లరు లక్షలాదిబలము లతో కదలివచ్చిరి హాళీఘాట్ కనుమయొద్ద యుద్ధము ఘోరముగా జరిగినది. ప్రతాపాది స్వాతంత్ర్యవీరులు ప్రాణములు తెగించి, యవనులను డీకొని పోరిరి. ఆ యుద్ధఘట్టములలో తేజసింహుఁడు, భానుసింహుఁడు, రామచంద్రదేవుఁడు, ఖిల్లనాయకుఁడు, అమరసింహుఁడు, సలుంబ్రాకృష్ణుఁడు మొదలగువారి యుద్ధ పరాక్రములు అప్రతిమానములు. కవిగారి వ్యుత్పత్తి ఈ ఘట్టములం దమోఘము! ఉదా॥ ఒక ఉపమాలంకారము :

"సునిశాతస్థిర వీర విక్రమయుతుల్ చోండావతుల్ వారి ప్ర
క్కన రాఠోడులు బాహుశక్తి యలరంగా నా 'సహారా' యెడా
రిని నిప్పుల్ దిను కోడిపుంజులటు లుద్వృత్తిన్ శతఘ్నీ చయం
బును ప్రయ్యల్ పడ మోదసాగిరి గదాఘూరి ప్రఘాతంబులన్."

—తృ. ఆ. ప. 188

ప్రతాపసింహుని యుద్ధము వీరరసము కాయువుపట్టు. ఉదా :

"పొదివైయె తాఁకెడు రాజపుత్రుల బలంబుల్ పుష్కలావర్త నీ
రదముల్ గాగఁ బ్రతాపభూవరుఁడు పర్జన్యుండుగాఁగన్ బ్రభా
స్పద వర్మంబులు చంచలాతతిగ చుంబత్ఖడ్గతీవ్రాశనుల్
గుదులై రాల్ప దురుష్క సైన్యములు నుగ్గున్ నూచమై సోలినన్."

—తృ. ఆ. ప. 120

కాలమెదురై వికటింప రణరంగమువీడుమని కృష్ణసింహాదులు ప్రతాపునిఁ బురికొల్పినప్పు డాతఁడు :

"అనఁ దండ్రీ! ననునమ్మి కొల్వఁగల సేనాధీశ్వరుల్ వ్రాలి కూ
లిన నీచీకఁటిఁద్రోసి నేనెటుల హాల్దిఘాటు వీడంగ నే
ర్తును మేవాడ్భటశౌర్యలక్ష్మి రణమందున్ దుమ్ముపాలయ్యోనే
నని గావించెద శత్రులం దునిమెదన్ బ్రాణంబు లర్పించెదన్."

—తృతీ. ఆ. ప. 328.

అని త్యాగ ధర్మవీరములఁ బ్రదర్శించినాఁడు.

సూక్తసింహుఁడు పశ్చాత్తప్తుఁడై మజల అన్నను కలిసెను. రెండవ సంవత్సరము యుద్ధము సాగించి యవనుల నెదిరించినాఁడు ప్రతాపుఁడు. కుంభల్‌మియరు యుద్ధమునఁ బ్రతాపుఁడు, చంద్రభట్టారకుఁడు, భీమసింహుఁడు చూపించిన ప్రతాపములు కీర్తనీయములైనను మానసింహాదుల కెదురునిల్వఁ జాలక పోయినవి. చివఱకు ప్రతాపుఁడు రణరంగము వీడి శైలగుహాలఁ దలఁ

దాచుకొనినాఁడు. చేయునదిలేక ఆఱునెలలు గడువిమ్మని ఖిల్లనాథునితో నొక లేఖ నక్బరు కంపినాఁడు. ఖిన్నుఁడై యిల్లు సేరినాడు. రణవిముఖుఁడయిన భర్తనుగాంచి వీరసాధ్విపాలేశ్వరి :

"గతి చెడి యఖిల భారత లక్ష్మి యవనులపాలయి కడగండ్లఁ బడుచు నుండ
కన్నసంతానంబు కన్నమిన్నుఁగ నెంచు ప్రజదాపులేక చేడ్పడుచునుండ
కల్యాణనిలయ దుర్గము లెన్నియో కూలి పడి బీడువడి కాడుపడుచునుండ
హైందవాచార మార్యస్త్రీల పావిత్ర్య మడుగంటి మంటిపాలగుచునుండ
భారతీయ స్వతంత్రత పట్టుఁదప్పి వీఁగి నానాటి కుత్పాత లూగుచుండ
తన కుటుంబముపై నాస ననిఁ దొలంగ నోపునే వీరరాణాప్రతాప మూర్తి"

"అధిప ! యొక శంకయుండు మిమ్మడిగి తెలియ
వలయునని యుంటి యక్కఱ కలిగె నేఁడు
పరమ కృపతోడ నానతీవలయు భార్య
యెక్కుడగునో భారతదేశ మెక్కు డగునో ?"

"మనకుఁ గల్గిన బిడ్డలందున గడపటి
నిసువు గళమునఁ గొన యూపిరెసఁగి యుండ
దైవసముఁడ వీ విడిన స్వాతంత్ర్య సమర
మజహరాదు లెదిర్చిన నాగరాదు." —చతుర్థ. ఆ. ప. 159, 160, 165.

"పాలేశ్వరి మాటలు వినునప్పుడు పాలేశ్వరీ ప్రతాపులలో నెవరు వీర రసమును నెక్కుడుగాఁ బంచుకొనినారా యని ప్రతి సహృదయునకు శంకఁగల్గక మానదు ఆమె సకల విధముల భర్తకుఁ దీసిపోవునది గాదు. సాక్షాన్మహిషాసుర మర్దని. ప్రత్యక్ష రణదుర్గ. 'భార్య యెక్కుడా ? భారతదేశ మెక్కుడా? అని యడిగినధీరహృదయ. ఈ వాక్యములో బ్రహ్మాండమంత అర్థమిమిడియున్నది."[1]

"ఘనదుర్గంబులు వాహినీపతులు భాగ్యశ్రేణులన్ బట్టి యె
ప్డును దేశోన్నతి నెన్నరాదు గుణసంపూర్ణత్వమున్ నిగ్రహం
బును ధర్మాచరణంబు సత్యము యశంబున్ త్యాగమున్ గల్గు న
య్యనఘస్వాంతుల సంఖ్యఁబట్టి యెపుడా యౌన్నత్య మేపారెడున్."
—రాజశేఖరశతావధాని.

## ౧౪. అమరసింహ చరిత్ర - శ్రీ డి. రాజశేఖర శతావధానిగారు :

శ్రీ. డి. రాజశేఖర శతావధాని ద్వితీయ వీరసస కావ్యము 'అమర సింహ చరిత్రము.' కవికి వస్తుతః వీరరస కావ్య రచనమునందున్న ప్రతిభా

1. శ్రీ. జె. టి. కృష్ణశాస్త్రిగారు, అభిప్రాయము. రాణా. ప్ర. సిం. చరిత్రము.

సామర్థ్యములను గమనించియే పెక్కు బిరుదులతో ప్రముఖులు సంభావించినట్లీ కావ్యావతారిక చెప్పుచున్నది. అట్టివానిలో "చారిత్రక కవితాచార్య, వీరరస రత్నాకర, వీరగాథా విధాత, రసవత్కవిశ్రేష్ఠ, వీరకవితా మహావీర, అపర తిక్కన, అపరటాడ్డు, మహాకవి రవి, కావ్యకళానిధి మొనవి కవికున్న వీరరస కావ్య రచనాభినివేశమును వేనోళ్ళఁ బొగుడుచున్నవి. వీరికన్న ముందే అమర సింహ చరిత్రము శ్రీయుతులు బాలకవి వేంకటసుబ్బారెడ్డి, శ్రీధర తిరుపతి శాస్త్రి కవులచే విరచితమై యుండెను. ఈ ముగ్గురిలో ప్రశస్తి శతావధాని గారికే అధికముగాఁ గలదు. వీరి కావ్యములకు మూలము కర్నల్ జేమ్సు టాడ్డుదొర సేకరించిన 'రాజపుత్ర సంస్థాన చరితములు'. వానినిఁ జదివి రసాను భూతిని బొందిన కవివతంసుఁడు కావుననే ఈ కావ్యమున తదనుభూతిని నొడియవట్టఁ గలిగినాఁడు.

"రాజపుత్రస్థాన రవివంశ నరపాలకుల మాట మది ననుకొనినయంత
నేహేతువోకాని దేహం బెఱుఁగకుండ రసవదుద్రేక భారమ్ముదోఁచు!
భావముల్ శరపరంపరగాఁగఁ దోచి యా నందబాష్పములు దొంతరలు గట్టు."
—అవతారిక. 44.

నట ఈ కవిరాజునకు. అట్టిభావ తాదాత్మ్యమే పటిమకు గల్గునట్లు కావ్యమును సంతరించి శతావధాని కృతకృత్యుఁడైనాఁడు.

కావ్య రసాశ్రయుఁడైన నాయకుఁ డుదాత్తుఁడైనచో కావ్యమింపు వహించునుగదా! అమర సింహుఁడు పుంభావమొందిన స్వాతంత్ర్యముగు రాణా ప్రతాపుని పుత్రరత్నము. తండ్రి యడుగు జాడలలో నడచిన ధీరుఁడు.

ఇతని చరిత్రము నందొక విశేషము ఇది: మూర్ధాభిషిక్తుఁడైన రాజు విషయలోలుఁడై రాజకార్యములు నిర్వహింపక ధర్మచ్యుతుఁ డగుచుండ హితుల ప్రబోధమాతని కన్ను దెరిచి సన్మార్గానువర్తినిగా నొనరించుట ఇతని జీవితమునఁ గానఁబడుచున్నది. దీనినిఁబట్టి ఉత్తముఁడయ్యు నుత్తమ గుణములఁ గోల్పోయిన నాయకునియందు లుప్తమయిన ఉత్తమత్వము సాధింపఁబడినట్టి గాథ యిదియని తాత్పర్యమగుచున్నది. ఉత్తమత్వ సాధనోత్సాహము వీరమని "వీరరస వివేకము"న నిరూపించియుంటిని. దానికిది చక్కని యుదాహార ణము. ప్రతాపుఁడు పర్ణశాలలో వ్యాఘ్రచర్మాసనమున నుండి సమస్త రాజ్య చక్రము నవక్రముగ నడపించిన ధీరుఁడు. సామంత్ర మిత్ర శత్రుగణముల కందటికతఁడు అపరశివావతారమూర్తి! అమరసింహుని రాజ్యకాలారంభము

నాటికి భారతదేశ మక్బరు పాలనముక్రింద కొన్ని సంవత్సరము లఖండశాంతి ననుభవించుచుండెను. ప్రతాపుని కాలమున 25 యేండ్లు దండయాత్ర సాగించిన మేవాడు వీరులు విశ్రాంతిఁ గనుచుండిరి. రాజగు నమరసింహుఁడు రమ్యహర్మ్యాభ్యంతరములందు రమణీ విలాస పిపాసామత్తుఁడై యుండెను. ప్రభుదర్శనార్థము సామంతులు మొగము వాయ వేచి విసుగుఁజెంది చెవులూచికొనుచు నిస్పృహతో నిండ్ల కరుగుచుండిరి. తొమ్మిదేండ్లు గడిచినవి. రాజదర్శనము లేదు నవమ పట్టాభిషేక మహోత్సవమునాఁడు సామంతులు సభాభవమున రాజదర్శనమునకై మంకు పట్టుపట్టి కూర్చుండిరి. సింహారావు సూచనపై సలుంబ్రాధీశునిచే రాజునకీ వృత్తాంత మెఱుకపరచిరి. కాని రాజు వారి కోర్కె నిరాకరించుటయే గాక నోటికి వచ్చినట్లు తిట్టి అతనిని వెనుకకుఁ బంపివేసెను. సభ విషణ్ణమైనది.

సలుంబ్రాకృష్ణప్రభువు మేవాడుయోధులలో వృద్ధుఁడు; ప్రతాపరాణా కుడిభుజమై వర్తించినవాఁడు; అమరసింహునిఁ గద్దియపై కూర్చుండఁబెట్టి రక్షించుచున్నవాఁడు. అతఁ డా పరిస్థితి విషమించినదని గుర్తించినాఁడు. కామము ధర్మమును శాసించుట నోర్చుకొనలేక బెబ్బులివలె గర్జించుచు, హుటాహుటి రాజాంతఃపురమునకు నడచినాఁడు. ప్రతాపుని కై మోడ్పుల నందుకొనిన వీరరసమూర్తియగు కృష్ణప్రభునిసైతము అమరసింహుఁడు— కామము కన్నుల కెగదట్టియుండుటచే— తృణీకరించినాఁడు. పాపముపండి 'ద్రోహి' యని పిడుగువంటి నిందను విసరినాఁడు. కృష్ణుఁడు కటకటపడి సామ ముట్టిపడ ధర్మాధర్మముల నిరూపించి, ద్రోహి రాజనియే నిరూపించి పరుషమార్గ మవలంబించి—

> "చేతము లాగనేర్చు జిగిచిన్నెలవన్నెల గోవుతోడి సం
> గాతము పేర్మి దానివెనుకన్ దిరుగాడుచు అంకె వేయఁ నా
> బోతుని గాంచి పైఁ బడఁగ బోయెడు నుగ్రమృగేంద్ర మట్లు భూ
> నేతను కృష్ణసింహపతి నిల్పుచు గంఠము నూనిపట్టుచుҁ."

—సంబోధము. ప. 72.

'అర్ధచంద్రప్రయోగ మొనర్చుచు', 'దండనాథుఁడు దుర్బలుఁడౌ దోషిని పట్టితెచ్చు కరణి' సభాభవనమునకుఁ ద్రోసికొనుచు వచ్చినాఁడు. అందరు విన:

> "రాజులకు ప్రజాప్రేమ శ్రీరామరక్ష! ప్రజల విశ్వాసమందని రాజు రాజె?
> ప్రజల సేవించెడి యధికారంబె కాని ప్రజలపై రాజున కధికారంబు సున్న.

—సంబోధము. 87

అని ప్రకటించి, తన కార్యమును సమర్థించుకొని, రాజధర్మమును నిర్వహించు, విధానముఁ దెల్పి, అమరసింహుని ప్రబోధించినాఁడు.

అమరసింహునికి దిమ్మతిరిగి దారినఁబడినది. పరితాపజ్యోతి యెడఁదలోఁ గ్రమ్మిన చిమ్మచీఁకటులఁ జిమ్మివైచినది. సలుంబాకృష్ణుని పాదములంటి యతని హృదయము కరుగునట్లు దుఃఖించినాఁడు. విషయవాంఛా కాలుష్యమును కడిగికొనినాఁడు. పులుకడిగిన రత్నమై వరలినాఁడు.

ఈ కావ్యమున ప్రతినాయకుఁడు ఢిల్లీచక్రవర్తి యగు అక్బరుపాదుషా కుమారుఁడగు జహాంగీరు (సలీము). ఇతఁడు తానుబట్టిన కుందేలుకు మూఁడే కాళ్లనువాఁడు. అక్బ రిరువదియైదు సంవత్సరములు పోరి విజయమును సాధింపజాలని మేవాడును సాధింపవలెనని యితని కోరిక ! దేశకాలానుగుణముగ నది సమర్థనీయము కాదని వంగదేశాధిపతియగు మానసింగ్వాదుల అభిప్రాయము. శాంతి కామియగు మానసింగు దేశము నశాంతికి గుఱిచేయ వలదని పెక్కుసారులు ప్రబోధించినాఁడు. ఇంకను—

"బాలక ! ప్రతాప పతి యొక్క భంగివాఁడు
తనయుఁ డటుగాదు సుంతసోకినను ఘోర
నక్రరాజంబు వలె నిన్ను నక్కబఁట్టి
పొగరు సెడ లోతు నీళ్ళలో ముంపఁగలఁడు !" —సంప్రార్థన. ప. 93.

అని ఆరాజ మత్తేభమును బెదరించినాఁడు. "అరయుము రాజ్యవృద్ధిని ప్రజాభ్యుదయంబును శాంతి సౌఖ్యముల్ వఱలఁగఁ జేయుమీ! ప్రజల భక్తియె రాజుల కూత కఱ్ఱ! ఎవ్వ రదియుఁ గోలుపోయెదరో వారికె రాజ్యము సున్న" అని ప్రజాపాలకుల స్వరూపమును నిరూపించి చెప్పినాఁడు. సాయశక్తుల పోరు మాన్ప యత్నించినాఁడు. కాని దుర్యోధనునివలె దురభిమానియై తన చక్రవర్తిత్వాహంకారముతో

"మానసింహుఁడు రాకున్న మాత్రమిపుడు
నేను మేవాడ రణయాత్ర మానుకొనను."

అని యుద్ధము నాసించి బలమును నడపినాఁడు.

యువరాజు లిరువురు మత్తకిశోరములు. ఇందులో నమర సింహుఁడు యుభయాయత్త సిద్ధుఁడు. షాజహాను పరాయత్త సిద్ధుఁడు. రాణా కామాధీనుఁడైనను కృష్ణప్రభు ప్రబోధముతో ప్రబుద్ధుఁడయిన సంస్కారి. జహాంగీరు

హితుల మాటలు పెడచెవులఁ బెట్టి స్వీయకామ సాధనైకచిత్తుఁడయిన అహంకారి. రాణా మొదట ధర్మభ్రష్టుఁడై ఉత్తమేతర ప్రవృత్తియయి యున్నను పరితాపముచే సన్మార్గుఁడై ధర్మప్రవృత్తుఁడై స్వాతంత్ర్య సాధన కొఱకు పూనుకొనెను గావున అతని యుత్సాహము వీరనామార్హమగుచున్నది.

యవనేంద్రుని రాజ్యకాంక్షతోఁ బదునెనిమిది సంవత్సరములు యవనులకు, మేవాడు వీరులకు సంతత యుద్ధములు కొనసాగినవి.

"మేవాడ నిలుచునేనియు మావాడ నశింపవలయు మఱిరెండు మనం
గా వెరవు గలుగఁ దొక్కటి పోవనెవలె............"

ననెడి యతని మొండిపట్టే రక్తపాతమునకు దారితీసినది. రాణావై పొక్కొక్క వీరుఁడు స్వాతంత్ర్యము కొఱకు ఆత్మార్పణము చేయు త్యాగవీరమూర్తి. దేవదూడా సింహుఁడు, భీమసింహుఁడు, చతుర్భానుఁడు, బలుఁడు, విక్రమసింహుఁడు, దివాకరుఁడు, యోధ సింహుఁడు, కేసరి సింహుఁడు, సలుంబ్రా భ్రాతలు, మనోహర సింగు, చోండావదన్వయులు, సురరాజమల్లుఁడు, అశ్వకర్ణుఁడు, సాంద్రిభూపతి, హరికేశవుఁడు, నారాయణుఁడు మొ. వీరు లందఱు రాణా కండ నిలచిన రసపుత్రయోధులు; వీరందఱి ప్రతాపము లింధనములుగ స్వాతంత్ర్యాగ్ని ప్రకాశవంతముగ మేవాడులో ప్రజ్వలించినది. రాణా వీరందఱిలో నగ్రగామి. మహోదధివలె ముంచుకొని వచ్చు యవనసైన్యమును గాంచి—

"ఈదేశ మీకొండ లీసూర్యుఁ డీతరు లీవాయు వీ యెండ యిన్ని మావి,
పరులసొత్తున కాసపడి వచ్చితిమికదా సిగ్గులేక యటంచుఁ జింతవడక
నోరున్నదని వచ్చి కాఱులాడుచునుంటె పరులసొమ్మున కాశపడఁగఁబోము
మాసొత్తు పరులకు వీసమైన నొసంగ మింక వాదంబున కేది తావు
మాటలను బెంప నిదియు సమయముగాదు! రోసమున్నను రణమున నేసరేఁగి
గెలుచుకొనిపొండు మమ్మిట గెలువకున్నఁ జేసితిమితప్పని సలాముచేసిపొండు."
—సంబంధము. ప. 81.

అని యెదురొడ్డు మేవాడు దేశాధిపతి ఆజాదు హిందు ఫౌజు నడిపెడి సుభాసు చంద్రబోసువలె, 'క్విట్ ఇండియా' అని యరచు గాంధీమహాత్ముని యాధ్యాత్మిక స్వాతంత్ర్య శక్తివలె శోభించుచున్నాఁడు.

యవనసైన్య సాగరగర్భమునఁ దూకి మందరమువలె కలఁచివైచినాఁడు

అమరసింహుఁడు. మృత్యుజాఖాను, షేకలీఖాను, దిలేరుఖాను, అతనిచుట్టు నొక్కుమ్మడి పొట్టేళ్ళ గుంపువలె మూగుకొనిరి; మొగమెదుట పోరలేక వెనుకగా వచ్చి రాణా గుఱ్ఱపు వెనుకకాళ్ళు బంధించినారు. అమరసింహుఁడు భూమిపై దుమికినాఁడు; సమయముగాంచి షాకులీఖాను కృపాణముఁ బట్టి పీకివైచెను. మృత్యుజాఖాను సూర్యధ్వజమును గుంజుకొనెను. షేకలీ మొలఁగల చిక్కటూరిఁ దొలఁగదీసెను. ఖాన్ అజీం సర్దారు, ఖాన్ దిలేర్ఖాను ప్రభు మౌళిపై వ్రాలి పట్టుకొని బంధించిరి. రాజు శత్రుల చేజిక్కెనని కలవర మేర్పడినది. మేవాడు సైన్యము చీకాకుపడినది. ప్రభుభక్తి మూర్తికట్టిన వీరులు—బలుఁడు మొ. లగు సేనానులు ఉద్ధృతియై శత్రువుల నోడించిఁ రాజును విడిపించిరి. అందు ప్రతివాఁడును "శిరమట్టె కోసి నీ చరణములందు నుంతు నిది సత్యము! నీ చరణంబు సాక్షిగన్" అని శపథము చేసినవాఁడు కావున రాజు నిశ్చింతుఁడై విజయముఁ గాంచఁగల్గినాఁడు.

అచలసింహ దేవీసింహులకు మధ్యవచ్చిన కలతను మాపి సామరస్యమును సాధించిన అమరసింహుని అసమాన శాంతమూర్తి వారి యెదుట రూపుగట్టిన తత్త్వమూర్తిగా గోచరించినది. దేవసింగు—

"అసమ సుఖదుఃఖములు విరాగానురాగ
ములు గెలిచిన ద్వంద్వాతీతమూర్తి వగుదు!
వట్టి నినుగొల్వఁ బరమభాగ్యంబు గాదె
మాకు నీ పాదసేవ బ్రహ్మత్వ మిచ్చు." —సంత్యాగము. ప. 1

అచలసింహుఁడు—

"జ్ఞాన నిశ్రేణి దాఁటు ప్రాజ్ఞమణి వీవు!
తొట్టతొలి తాపసుండు మందులము మేము
దినకరునకును బెనుగ్రుడ్డి దివ్వియలకు
నెగడు భేదమున్నది దేవ! నీకు మాకు! —సంత్యాగము. ప. 5

దేహబలముతోపాటు నట్టి ఆధ్యాత్మికబలమును సాధించిన సాత్త్వికవీరుఁ డగుటచే తనే స్వాతంత్ర్య వీరుఁడై ధర్మరథము నడుపనేర్చినాఁడు అమరసింహుఁడు.

ప్రతాపునితో వైరముసాధించి యవనులచే చిత్తూరు దుర్గమును పొందిన సాగరసింహుఁడు అడుగడుగునకుఁ బూర్వరాణాల చారిత్రము, చరిత్రము చర్వణమగుచుండగా తానుచేసిన దేశద్రోహమును, గురుద్రోహమును తలఁచి

కుమిలి అర్ధరాత్రమున అమరసింహుని శిరమున చిత్తూరు సింహాసనాధికార కిరీటమునుండి ఢిల్లీకేఁగి అమరసింహుని మహత్త్వముఁ జాటినాఁడు.

యవనప్రభువునకు మేవాడు స్వాతంత్ర్యలక్ష్మిని పెకలింప శక్యము కాలేదు. రెండుతరము లట్లే గడచినవి. ప్రతినాయకుఁడు నిండుకొలువులో:

"సకల ప్రపంచాతిశయ శౌర్యుఁ డక్బరీశ్వరుఁ డిర్వదై దేండ్లు సకలబలము
లెదురొడ్డి పోరి జయింపలేని యసాధ్య కార్యమేనును వివేకంబులేక
తలపై చుకొని యిట్లు తనుకు లాడుచునుంటి భద్రగజంబు మోవంగలేని
బరువున కెగఁబడి బడుగు నక్క శిరంబు పై వైచుకొనినట్టి భంగియయ్యె!
శౌర్యనష్టంబు సుభట నష్టంబు కీర్తి నష్టము ధననష్టము, శాంతినష్ట, మిట్టు
లష్టనష్ట కష్టములకే నగ్గమైతిఁ! ద్రుటి మనశ్శాంతి లేదు! తీరుబడి లేదు!
—సంభావన. ప. 96.

అని వాపోవుట నాయక ప్రతాపాతిశాయియే యగుచున్నది. సత్యము వివేకించి తెలిసికొనియు, దానియందు మనస్థైర్యమును నిలుపలేని బలహీనుఁ డా జహాంగీరు ఇంద్రియోల్బణమునకు గురియై ఆత్మధర్మమును మఱల మఱల విస్మరించినాఁడు; దేశము నశాంతిపాలఁబడవేసినాఁడు. ఆత్మశాంతిలేని రాజు ప్రజలకు మృత్యువు వంటివాఁడు

"నాలుకనుగోసి దూఁకి పైనఁబడునట్టి భీకర విషోగ్రకాల దర్వీకరమటు
హృదయమందు మేవాడపై రేఁగునీర్ష్య విడక నను఼ గాల్చి పీలిచి పిప్పిసేయు."
—సంభావన. ప. 98.

"మేవాడ జయించిన నే జీవింతును లేనియెడల జీవింపను! నే
జీవింపఁగఁ గోరిన నా మేవాడను, గెలువవలయు....." —సంభావన. ప. 100

నని సేనానులఁ బురికొల్పి ఈర్ష్యాదులగు నంతశ్శత్రువులకు వారి పశుబలమును బలివేసినాఁడు. సర్వము తెలిసియు కామమోహితుఁడు, ఈర్ష్యాదగ్ధుఁడు నయినవాఁడు యవనరాజు.

అమరసింహుని రాష్ట్రము కడుచిన్నది. అప్పటికే అతనికాలమునఁ బదునేను యుద్ధములుచేసి అకుంఠిత విజయములు సాధించినది. ఒక్కొక్క యుద్ధమున పెక్కురు స్వాతంత్ర్యవీరులు భారతభూమిపై నాత్మబలిదాన మొనర్చియుండిరి. జనసంఖ్య క్రమముగా సన్నగిల్లుచుండెను. అమరసింహుని హృదయమున నాస్థితి నిర్వేదమును గల్గించినది. స్వాతంత్ర్యవీరమున స్ఫురించిన ఈనిర్వేదము శాంతము నంగముగా సంతరించుచున్నది.

దేహబలము తగ్గినకొలఁది ఆత్మబలము మేవాడు వీరులలో వెల్లివిరిసినది. స్వాతంత్ర్యవాంఛ వారిని ముందుకు నడపించినది. దేశభక్తి వారికి సత్త్వము నిచ్చినది. దేశమాత వారికన్నులలో నిల్చినది. వారుప్పొంగి,

"ఇది మనదేశమాత! సహియింపగరాని విపద్విశీర్ణమై
కుదికిలఁబడ్డ డీయమ వెగుల్ దొలఁగించుచుగొంత కోల్కొనం
గ దెరువు చూపు టిప్డు మనకర్జము కావున నాదు బోధమున్
హృదయములందు నిల్పుచు తదీప్సితమున్ నెరవేర్పఁగాఁ దగున్."

"విడువక వచ్చి పైనబడు వీరతురుష్క చమూత్కరంబు దం
దడుల శరీరమంతయును నజ్జగనై ధృతిగోలుపోయి డీ
ల్పడి కడకన్నుఁ గోనలను ప్రాణము నిల్పిన దేశమాతకా
నిడుమ దొలంపకున్న మనమిందు జనించి ఫలంబు గల్గునే?"

"తల్లి పదసేవ సేయుచు తనువు విడుచు దాని కన్నను శ్రేయము ధరణిఁ గలదె,"
—సంధ్య. ప. 17, 18, 22.

అని దేశభక్తి కాలంబనులై స్వాతంత్ర్యసమరమును ప్రాణమునకుఁ దెగించి సాగించినారు.

అమరసింహుని కుమారుఁడు కర్ణుఁడు, అపర బాలచంద్రుఁడు.

"జనకునకు తద్రిపులకైన సమరములఁదె గించి నగపాలు కష్టంబుఁ బంచుకొనని
తనయువలనను ఫలమేమి తత్ప్రభవమువలన భూదేవితలకొక్క బరువుగాక!"
—సంధ్య. ప. 30.

తండ్రిని శిబిరమునందుంచి తానే రణరంగమున కుఱికినాఁ డా యువవీరశిఖామణి. దైవవశమున ఖూరుము, కర్ణుఁడు స్వీయ శౌర్యప్రకటనముతో పరస్పరము పరిచయులైనారు. సంకుల ఘోరరణమధ్యమున స్నేహముప్పొంగ శాంతిని కాంక్షించుచు కౌఁగిలించికొనినారు. వారిరువురు శాంతివీరులు. కాని పరిస్థితులు వారిని రణరంగమునఁ ద్రోసినవి.

"శాశ్వత కృపాంబురాశి సర్వేశ్వరుండు కనుఁ దెఱచెనేని నిరువురమును బవిత్ర
హృదయ మిత్రులమై చరించెదముగాక!" —సంధ్య. ప. 68.

అని పవిత్రశపథము చేసికొనినారు. ఢిల్లీపురీశ్వరుల పుత్త్రుఁడు సంక్షుభితసాగర మధ్యమున జన్మించిన అమృతకిరణుఁడు. ప్రళయములలో శాంతిమార్గము నాశించిన సత్త్వమూర్తి.

దైవ దుర్విపాకముచే సమరసింహునిఁ బరాజయము వరించినది. అట్టి యెడ నాతఁడు పరితపించినది పరాజయమునకు గాదు, పారతంత్ర్యమునకు.

"భటులు వోయిన నెట్లో భరియింపఁగావచ్చు, సైన్యముల్ సమసిన సైపవచ్చు,
ఘనచమూపతులు వోయిన నోర్వఁగావచ్చు, ధనమువోయినఁదాళుకొనఁగవచ్చు,
గ్రామముల్ పోయినఁ గలఁగకుండఁగవచ్చుఁ, గోటలువోవఁ గోల్కొనఁగవచ్చుఁ,
నంగముల్ తెగిన ధైర్యము వహింపఁగవచ్చు, గృహములువోవ సైరింపవచ్చు,
భావనాత్మ స్వతంత్రత పోవునేని జన్మమెత్తిన ఫలమేమి శౌర్యమకట !
కాల్పనే పశువులును మృగములకన్న హీనమై జీవితముఁ దీర్చుటేమిఘనము !"
—సంధ్యా. ప. 105.

అని ప్రతాపుని యావేదన !

దేహబలమున మేవాడ వీరులు మొక్కవోయినను, లౌకిక విజయము యవనులు సాధించినను, ఆధ్యాత్మిక విజయము అమరసింహునిదే యని యొప్పు కొను ఖూరములో వివేకవిజ్ఞానము వెల్లివిరిసినది. అతఁడుపంపినవార్త యిది :

"దేవ ! జయంబు లేదని మదిం దురపిల్లకు మర్త్య దృష్టికిన్
మీ విటతాట మిప్పుడొక మేరను న్యూనముగాఁగఁ దోఁచినన్
దైవతదృష్టిలో జయము తథ్యము మీయదె మీ యుదాత్తతే
జో విభవంబు దేవతలు చూచి భజించిరి కోటిభంగులన్."—సంధ్యా. ప. 123.

అమరసింహగాథ—సామ్రాజ్య విస్తీర్ణ పిపాసకును స్వాతంత్ర్య దీక్షకును జరిగిన సంఘర్షణము, ఐశ్వర్యమునకు త్యాగమునకు నేర్పడిన పోరు, దేశమును విలాసినిగా భావించిన విషయలోలురకు, దేశమును మాతగా భజించిన భక్తులకు జరిగిన యుద్ధము, ఇంద్రియోల్బణమునకు శమదమములకు ఏర్పడిన కలఁత, పారతంత్ర్యము నండగాఁ గొనిన సామ్రాజ్యవాదమునకు, స్వాతంత్ర్యమును ప్రాణముగా భావించిన స్వామిభక్తులకును ఏర్పడిన సంగ్రామము, విజయము వైరిమార్గమునకే యైనను అదే జయముగా లెక్కఁబెట్టలేదు వివేకి. నాయకున కపజయము నొప్పుకొనరు మన లాక్షణికులు. అట్లు చిత్రించినచో లాక్షణిక విరుద్ధము. మరి చరిత్ర లక్షణశాస్త్రము ననుసరించి జరుగలేదు. కాని యున్న దున్నట్లు చిత్రించుటలోఁ గూడ యీ యౌచిత్యము కానఁబడుచున్నది. ధర్మము లౌకిక సహాయములేక ఒకానొకచో పీడింపఁబడి పరాభూతమైనను విజ్ఞులుదానిని సింహమువలలోఁ జిక్కినట్టిదనియే భావింతురు. ఎందువల ననఁగా ధర్మము శాశ్వతమైనది. అధర్మ మశాశ్వతమైనది. శాశ్వత మొకసారి అశాశ్వతము

నణఁగఁద్రొక్కినదా మఱల దానికి గతిలేదు. అశాశ్వతము శాశ్వతమును అణగఁద్రొక్కఁజాలదు; కొంతకాలము కప్పియుంచఁగలదు, లేక అడ్డగింపఁ గలదు. ఇట్టి తాత్పర్యమే ఈ కావ్యము బోధించినది! ఇట్టి చిత్రణము సాహిత్యమున అసాధారణ ప్రక్రియ!

౧౩. శివభారతము – శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రిగారు :

"సనాతన ధర్మ పునరుద్ధరణకు కంకణముఁగట్టి పరిశ్రమించిన వారిలో రాజపుత్రులు – తరువాత మహారాష్ట్రులు ముఖ్యులు. ఇద్దఱును భారత చరిత్రలో మహాఖ్యాతిఁ బొందినవారు. కాని ఒకరు కృతకృత్యులు కాలేదు; కాలక్రమమున శత్రువులకు వశులై పర రాజ్యాభివృద్ధికి పట్టుకొమ్మలైనారు. శత్రువులను ధిక్కరించి శౌర్యసాహసములను వెలయించి అంతరించిన వారంత రించగా మిగిలిన యోధులు పరుల సింహాసనముల మ్రోల మోకరించి తల వంచినారు. భారతనారీ ధర్మమును నిలుపుటకై అగ్నియందుఁ బ్రవేశించిన వీర పతివ్రతలు గతింపగా కొందఱు రాజపుత్రస్త్రీలు మొగలుజనానాలో బ్రవేశించి నారు. అది కాలమహిమ. దానికి 'మొండి తెగువ' కారణము."

"మహారాష్ట్రులట్టి వారుకారు. వారు రాజపుత్రులవలె కాక 'సమయ మోర్చు ఘనులు! వారికిఁ 'మోటు తెగువ' లేదు. 'అడఁగుఁగాక, పేడి యగుఁ గాక, పెనుపీఁకనాలఁ ద్రిప్పువాడె యర్జునుండు'. పరాపహృతమైన భారత భూధేనువును త్రిప్పి శివాజీ అర్జునుండై. నాటి భారతోదంతము నవిచ్ఛిన్న ముగ సాగించినాఁడు, కృత కృత్యుఁడైనాఁడు. ఒక్కొక్క మహారాష్ట్రుఁడు ఒక్కొక్క భారతీయుఁడు తన యంతటి వాఁడగుటకు వలయు దీక్షాబీజము లను వెదజల్లి నిష్క్రమించినాఁడు."

"శివుని హృదయకోశము చిన్ననాటనే విరిసి వాసనలు విరజిమ్మినది.

"ధీరహృదయంబు హృదయముల్ దెలిచి చూపు
పలుకు పొందిక, పొందిక పఱచు తెలివి
ధర్మభంగాసహిష్ణు వర్తనము బెరయ
విరిసి, యెల్లర మదులఁ బుష్టించె శివుఁడు." —ద్వి. 124.

శివునికి యవనులపై నసూయలేదు, భారతభూమి సకల ప్రపంచమునకు ఆతిథ్య మీయఁగలదు. కాని, అతఁడు 'నా' 'నీ' అను భేదముల మూలమున ఒకతెగ కన్యాయము జరుగుట సహించలేదు.

"యవనుల్ హైందవులన్న భిన్నత నసూయం జూపఁగా లేదు తా
మెవ రీ రాజ్యము నేలినన్ తగవు లేనేలేదు, నీ నా యటం
చవకాశమ్మును బట్టి యొక్క తెగ కన్యాయంబు గావింప నౌ
నవునం చూరక 'వంత పాట పని' సేయంజాలఁ." —ద్వి. 133

డాఁతడు. ఈ వంతపాట పని జరుగునప్పుడు సంఘర్షణము, అగ్గి, కార్చిచ్చు కలుగుతూ ఉంటవి. భారతావనీ పాలకు లెవ్వరైనా ఇట్టి విపరీత పరిణామము కలుగకుండా చేయడమే నీతి".[1]

"అసాధారణమగు తమ శీలసిద్ధులచే కవులకు కావ్యరచనోత్సాహము గల్గించు మహాపురుషులు మన హిందూదేశ చరిత్రలో పలువు రున్నారు. ఆ యుద్రేకమునకు లోఁగి యెందఱోకవులు ఖండాఖండ కావ్యములను రచించి నారు గూడ. కాని, ప్రాయికముగ వారి కావ్యములందలి వ్యక్తులకు జీవకళ మందము. వ్యక్తులు కథాసూత్రములను నడుపుదురుగాని యందలి బ్రదుకు తాము బ్రదికినట్లుగాఁ దోపదు. మఱియు నిట్టి రచనలలో గ్రంథకర్తలకు కథా నాయకులందు భక్తిగౌరవములు, వారి శత్రువులయెడ ద్వేషాసూయలును కృతి నిర్మాణమునకు మూలసాధనములుగా నుండును. పై భావము లెంత న్యాయములైనను వాని యుద్రేకమును చాలవఱకు హద్దులో నుంచని యెడల అవి, కవికి కావ్యనిర్మాణమున ముఖ్యముగా వలసిన ప్రశాంతచిత్తమునకు, దాని ఫలమగు ప్రతిభావికాసమునకును అడ్డుగాఁ బరిణమించి పని చెఱచును. 'నా నృషిః కురు తే కావ్యమ్' అను వ్యతిరేక విధి కిదే భావమని నా తలఁపు. శాంతిసిద్ధి కలవాఁడే ఋషి; అది కలవాలందరును కావ్యకర్తలు కాలేరు కాని కావ్యకర్తకు మాత్రము ఋషిత్వసిద్ధి లేనిది వానిచేతి నిర్మాణమునకు మహా కావ్యమను పేరు రాదనుట సత్యము"[2] ఈ కావ్య మొక మహాకావ్యము, కవి ఋషికల్పుఁడు.

లోకమున మానవ మానసప్రవృత్తి ముఖ్యముగ దేశకాలపాత్రములపై నాధారపడియుండును. మానసప్రవృత్తిపై రసభావము లాధారపడియుండును. మానస ప్రవృత్తియే రసభావముల జన్మస్థానము. కాలాదుల ప్రభావములు, పాత్రల మనఃప్రవృత్తుల సంఘర్షణ, వైవిధ్యములు ఏకావ్యమునందు బలీయ ముగా నుండునో అందు రసస్ఫూర్తి కెక్కువ తావేర్పడుననుట నిర్వివాదాం

1. డా॥ చిలుకూరి నారాయణరావు (శివభారతోపోద్ఘాతము).
2. శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ ( ,, ).

శము. శివాజీ యపూర్వ స్వాతంత్ర్యవీరుఁ డగుటకు అతని జీవితమునం దేర్ప డిన సంఘర్షణలు, వానియం దచంచలధైర్యమును బ్రదర్శించుట కేర్పడిన మనశ్శిక్షణమునకు మూలమగు హేతువులు, తద్దేతువుల ప్రభావవమాహాత్మ్యా దులు ఎంతయో బలీయములై యుండవలెను. వానికిఁ బరిపుష్టతఁ జేకూర్ప నిచో నాయకాశ్రయమైన వీరము నిస్సారమగు క్షేత్రమున మొలకెత్తిన చూత వృక్షమువలె దుర్బలమై ఫలవంతముగాదు. శివభారతేతివృత్తమునన్ నాయక మనఃప్రవృత్తి రసోచితముగా, విపులముగా, బుష్టితరముగా వర్ణింపఁబడి, దానికి హేతువులైన దేశకాలాదులును సమర్థవంతములుగాఁ జేయఁబడినవి. వస్తు గౌరవమునకు మూలమగు నీ విభాగమే కవి సామర్థ్యమున కెనలేని కీర్తిని కావ్యము తెచ్చిపెట్టినది.

నాయ కాశ్రయమైన వీరమునకు విభావములు వర్ణితమైన వైఖరిని ముందు వివరింతును. శివాజీ వంశము విద్యా ధర్మ శౌర్య త్యాగ భక్తి శాంతములకు నిలయమైనది. తండ్రియైన షాహాజీ బిజాపూరు సుల్తానును సేవించిన సరదారు. మూర్తి కట్టిన ప్రభుభక్తి యాతఁడు. కాని అంతరాంత రములందు స్వాతంత్ర్య జ్యోతి అమావాస్య నిశియందు నక్షత్రకాంతివలె నిగూఢ నిర్భర కాంతిమత్త్వమును వెలార్చుచుండెడిది. ఈ రెంటిని సమన్వయ పరచికొని జీవితమును సార్థకపరచుకొనవలెనని యతని పరమార్థము.

"లోకము మెచ్చిన ధర్మముఁ గైకొనఁదగు; రాజనీతిగాఁ దంత్రంబున్
వాకొందు; రదియునదియు వివేకార్హం, బొండొకంట విఱుగని కలిమిన్."

—ప్ర. 42.

అని ధర్మమును నీతిని జతకలిపి ప్రయోగించిన సవ్యసాచి షాహాజీ.

శివాజీ తల్లి జిజియాబాయి స్వాతంత్ర్య వాయువులచే స్వీయ హృదయ గంధమును లోకమునకుఁ బంచిపెట్టుటకై, భారతీయ సంస్కృతీ కాసారమున జనించి వికసించిన శతదళపత్ర సుందరి. ఈమెతో సంబంధముండుటచేతనే తండ్రికి, భర్తకు, పుత్త్రునకు ఎనలేని యోగ్యత కల్గుచున్నది. నిశితములై పిడుగులవంటి మాటలచేత కొండబండవంటి తండ్రి హృదయమును కరగించి వైచినదామె. తేనెలొల్కు మాటలలోఁ బౌరుషము రంగరించి భర్త మనమును రంజించి అతని వీరజీవితమునకు తాను దిక్సూచియైనది; ఇఁక కుమారుని కుగ్గుతో భారతవీరుల ధర్మజీవితసారమునే కలపి పోసినది. తాను లక్షించిన వీరరసస్వరూపమును పుత్త్రునిలో సాక్షాత్కరింపఁజేసికొనినది. ఈమె పాత్ర

కవి మేధావిలసితమైన అపూర్వసృష్టి; ద్రౌపదిని, సత్యభామను, సావిత్రిని, అరుంధతిని కలిపి చేసిన బంగారు బొమ్మ యీమె

"ప్రకృతి సాధనముల బటుసత్త్వ మెనయించి తపముఁ జేసి దేశదాస్య మోక్ష
సిద్ధిఁగనుఁడు ; మీకు సిద్ధింపదా భగీరథుఁడు గంగఁ దేర బ్రభవ మందు."
—ప్ర. 76.

అని ఈమె ప్రబోధము; ఈమెయందు స్వాతంత్ర్య కాంక్ష ప్రతి రక్తనాళ మందును అట్టులు సాచి ప్రవహించినది; మహారాష్ట్రి యువతిలో నైజముగా నుండు ఆత్మాభిమానము "జిజియాబాయి తొంటి సత్యభామ నిజము" అను మాటలలో ధ్వనితము. దానికి స్వాతంత్ర్య వీరముతోడైనది. ప్రకృతి సిద్ధములగు సాధనముల సమన్వయ సంధాన రహస్యమెరిగి యొక్కటిగాఁ గూర్చి, ప్రయోగించినచో కార్యసిద్ధి సులభమని ఆమె దృక్పథము. సుశిక్షితయైన వీరాంగన గాని యిట్లు మాట్లాడదు ! అదియొక తపస్సని ఆమె నమ్మకము; సంయమాదులతోఁ గూడిన సాత్త్వికగుణ ప్రాభవమే ఆతపమున కాయువుపట్టు. క్షమ, దయ, త్యాగము, సమాహితము, పౌరుషము ఇవియన్నియు ధర్మమున కంగభూతములై సాత్త్విక సంశోభితము కావలెను. అప్పుడే దుష్టశక్తులను నిర్వీర్యుల నొనర్చి "దేశదాస్య మోక్షసిద్ధిని" భారతీయుఁడు పొందఁగలఁడను ప్రబల సత్యమును ప్రతిపాదించిన సాధ్వి ఈ 'వీరవధూవతంసంబు.' వీరిరువుర పున్నెముల పంట శివాజీ ప్రభువు.

మొగలు రాజుల కసాయికత్తుల కఱకు నాలుకల చప్పరింతలకు మేనులు బలులువెట్టుచున్న ప్రజానీకము దిక్కులేని యానపాత్రవలె క్లేశవారిధి గర్భమున నిలిచిన సమయమున వీర శివాజీ హైందవ ప్రజారక్షణోద్యోగియై యవతరించెను అతఁడు నిలిచి చూచు నాటికి....

"...............తరముల్ బడి హైం
దవుల మనంబులందవిలి తాఁకినచోఁ బొగరాఁజి మంటలన్
గవియుచు, నందునందు సుడిగాడ్పులఁ దేలుచు, మానసవ్యథా
దవదహనంబు నద్దెసలఁ దట్టె మరాటుల నాట నాఁటికిన్."

"పసుల కాపరి గుడిసెలోఁ, బంటకాపు
మనసులో, వీరయోధు గన్గొనలయందు
నల మరాటా కుటుంబమం దన్ని యెడలఁ
బ్రాఁకి స్వమతాభిమానంబు పాదుకొనియె."

"అదనఁపు టెండలన్ బఱియలై తొలికారునఁ బొంగి నాగటన్
మెదుగుచు, నెర్వులన్ బలిసి, మిక్కిలి మొక్కలువాసి, వానలన్
బదునయి, విత్తనంబు గొలుపన్దగి దక్షిణభూమి నేఁటి క
భ్యుదయము వేచియుండె మనసొగ్గి మహాపురుషావతారమున్."
—ద్వి. 43-45.

యవనుల దుండగములకు దేశము నల్గడల నెఱ్ఱఁబడినది. మనో కుంజరాలతో నెడనెడ దవశిఖ నాల్కలను జాచుచున్నది. ప్రభంజనుఁడు తోడైనచో ప్రతిపక్షమును స్వాహాచేయుటకు పావకుఁడు కాచుకొని కూర్చుండినాఁడు. ఆ దాహకుఁడు విజృంభించెనా సర్వము మసి. చివఱకు మిగులునది శూన్యము. ఈ యగ్ని ననుశాసించి క్రమముగ నిర్మాణాత్మకముగ ధర్మబద్ధముగ నడిపించు శక్తి అవసరము. అట్టి శక్తిఁగల నాయకుని కొఱకు దేశము ప్రతీక్షించినది.

"మెఱుపులవంటి చూపు, నులమీసల బుగ్గలనంటు గడ్డపుం
బురుఁజులు, ముళ్ళకన్బొమలు పర్వఁగఁ జేగురు గొన్న మోముతో
దురఁగము నెక్కి నల్గడల దూఁకు మహారథు ధర్మరక్షణా
తురతకుఁ బూర్వరంగమగు త్రోవలు పెక్కులుదోఁచె నీగతిన్." —ద్వి. 46.

దేశకాలపాత్రములు శివాజీ యవతారమునకు అనువుగా సిద్ధమయి, అతని జీవిత మార్గమును నిర్దేశించి పెట్టినవి. అతని యుత్సాహమున కాలంబన విభావములైనవి.

జిజియా పెంపక మాతని గంభీరపరాక్రమమూర్తికి ఉద్దీపనము. ఆమె యుదీర్ణదేవగిరి యాదవరాజ మహాన్వయంబునఁ బుట్టి, శిశోదియాంక రసపుత్ర కులీనుని భోన్సలే విభునిఁబట్టిన వీరయోష; దురుపప్లవ ఘూర్ణితచిత్త. కావున సైజముగా నామె మూర్తికట్టిన ధర్మవీరము. తాను కనిన కలలు పుత్రరూపమున ఫలరూపమందినవి. తాను భావించిన యుత్తమ ధర్మమును ఆపుత్త్రునిలో పాదుకొల్పి పోషింపఁదలచినది. దానికిఁ దగినట్లాతని హృదయ క్షేత్రమును సిద్ధముచేసినది; పులిపాల మగంటిమి నుగ్గువెట్టినది :

"పూలపొత్తిలిఁ దొట్లలోఁ బుత్రుమనిచి పోరుమాన్పించి, నిద్దుర పుచ్చునపుడు
విరివిఁగన్న మహారాష్ట్ర వీరచరిత లాలపించుచు జీజియ జోలఁబాడు."
—ద్వి. 51.

నడువనేర్చిన బాలుఁడు "హాని యొదవించెడు ప్రాణి యదెట్టిదైన ననున్ బొడువఁగ నేర్చునచో" తల్లి యుబ్బి తబ్బిబ్బయ్యెడిది. బాల్యక్రీడలందు :

"తానొకరాజు, మేటి సరదారులు కొందఱు, కొంద అన్యరా
ష్ట్రసేనలుగాఁగ బాలురను జేరిచి, వ్యూహము లొడ్డి, దుర్గ సం
తానము లెక్కి, భేదన విధానములున్ విజయేందిరానుసం
ధానములాటలాడె బిననాఁడె శివాజి భవిష్యదర్థముల్." —ద్వి. 55.

పుట్టుకతోడనే సుగంధమును వెదజల్లు ఆ పుష్పసంస్కారమునకు తల్లి మురిసి పోయి, ఔత్సుక్యమును దాల్చినది. ఎడఁదలో గూడుకట్టిన దేశస్వాతంత్ర్యకాంక్షను కుమారునికి నూరిపోసినది. దేశాభిమానమును రేకెత్తించు 'వీరచరితములు' చిన్నిగాథలుగా చవులూరునట్లు చెప్పినది.

"చనవారఁగ దొడఁజేర్చి మైనిమిరి జీజాపుత్త్రి నగ్గించి ప్రా
క్తన గాథల్ వినిపించునప్పు డతఁ డుత్సాహంబునంబొంగి దు
ర్జన శిక్షాపర వీరవిక్రమ కథా సంక్రాంతదుర్దాంత వ
ర్తనుఁడై మైమఱపందుఁ గాళియ ఫణాగ్రవ్యగ్ర నాట్యంబులన్." —ద్వి. 59.

విభావములచే వ్యక్తమై యుద్దీపితమైన యుత్సాహమును పుత్త్రునియందుఁ దోచి వీరరసరూపము నందుటగాంచి భావి లోకకల్యాణమునకు పచ్చతోరణము గట్టిన దా మహనీయసాధ్వి!

ఆమె కరపల్లవములలో చేవఁదేరిన యువకుఁడు శివాజీ. అతఁడు మాతృహృదయముఁగాంచి, దేశదౌర్భాగ్యము నెంచి, భవానీభక్తి మదినుంచి - వీరమాత సంతసింప నిట్లని శపథముచేసి, మాతృదేవి పదపద్మములముందు తన వీరగాథకు నాంది నాలపించినాఁడు.

"కార్తవీర్యుఁడుగొన్న కపిల ధేనువుఁదేర రణభీము భార్గవ రామునట్లు;
లేకచక్రపురంబు నెరియించు బకుగెల్వ ద్విరదాయుత స్థేము భీమునట్లు;
లాదితేయులగెల్చి యమృత కుంభముఁ దేరఁదతవిపక్ష దిధక్షు దార్క్ష్యునట్లు,
లమర సామ్రాజ్యాపహర్తయౌ బలిఁద్రొక్క మాయావతార వామనునియట్లు
వనుపుమీ నన్ను; సంశయపడకు తల్లి! యమృతవాక్కులదీవించు, మదియచాలుఁ;
జలముబలమును శక్తియుక్తులనుజూపి జయము గొనివత్తు; నీ మనశ్శరముబుత్తు
—ద్వి. 79.

భార్గవరామునందు శత్రు కృతాపరాధముచే జనించిన రణోత్సాహము, భీమునందు లోక హింసాత్మకుఁడగు శత్రువును సాధించుటకై కలిగిన రణోత్సాహము, దాస్య విముక్తికై అమృతము సాధించు వైనతేయుని స్వాతంత్ర్యవీరమును, స్వరాజ్యాపహర్తలగు ధూర్తల నడంచువామనుని ధర్మవీరమును

తనయందు నిమిడ్చికొని యేకోన్ముఖముగా శివాజీ ప్రయోగింపఁ బ్రయత్నించు చున్నాఁడని పై పద్యభావమువలనఁ దేలుచున్నది

వీరాశ్రితమయిన అతని హృదయమును యవనుల యధర్మపాలనము క్షుభిత మొనర్చినది. సానఁబెట్టిన రత్నము వాడిచేయఁబడి వజ్రమైనది. ఆత్మధర్మ మగు స్వాతంత్ర్యము దాని కాధారమయినది దాని కనుభావములైన ఆత్మాభిమానము అధర్మనిరసనము మొ. అతనియందలి భావపుంజమును వ్యక్తము జేసినవి; సుల్తాను దర్బారునకు తనతోరమ్మని కోరిన తండ్రినిగాంచి శివాజీ:

"కులధర్మంబుల కార్యవృత్తముల కెగ్గుల్ వాపి ప్రాపుంట, దు
ర్బలులన్ దాఁగయికొంట, ధూర్తజనులన్ బంధించి న్యాయమ్ము నా
ర్తులకున్ బంచుట. నొప్పు తప్పులకు గ్రిందున్ మీఁదు గాకుంట, రా
జులకున్ ధర్మము; లన్నిటిన్ విడు మహీశున్ గొల్వ మేలున్న దే?"

—ద్వి. 128.

అని యభిమాన స్ఫోరకమైన స్వాతంత్ర్యవీరముబ్బ మాట్లాడినాఁడు.

"జనకా! నా మతమున్ వచించెద హరిశ్చంద్రాది రాజన్యు లే
లిన యీ భారతభూమి గోహనన మాలిన్యంబునన్ బాసి, ప్రా
క్తన జాతీయత నందగింపవలె; సుల్తానైన నీనాఁటి పా
లన సూత్రమ్ములు మార్చివేయవలెఁ; గల్యాణంబు ప్రోయన్ వలెన్."

—ద్వి. 132.

అని తన హృదయమును విప్పి చెప్పినాఁడు. ఇందులో 'గోహనన' హింసాదగ్ధ మానసము ధ్వనించుచున్నది. అదియే తరువాత దయావీరముగా జాలువారినది. (చూ. ఉ. దయావీరము).

ఉత్సాహమును సన్మార్గమునఁ బెట్టుకొనుటకు విజ్ఞాన మవసరము. జ్ఞానములేని వీరము సరంగులేని సముద్రయానపాత్రము. దాదోజీయొద్ద విద్య నభ్యసించిన శివాజీ రాజ్యాంగ విద్యయందుఁ బరిపూర్ణత సాధించి విద్యావీరమును బ్రకటించెను. ప్రకృతివర్గసంతరణము, సప్తరాజ్యాంగ రక్షణము, షాడ్గుణ్యవివేకము, పంచేంద్రియావేగ బంధనము, చతురుపాయ ప్రౌఢ సమ్యక్ప్రయోగము, శక్తిత్రయారూఢ చతురసరణి, ద్వంద్వోపతాప నిష్పంద భావ స్థితి, ధర్మమార్గైకసంధాననిరతి, వ్యూహరచనము, సమర సన్నాహపాటవము, ఆయుధ విశేషప్రయోగ కౌశలము మొదలుగాగల చతుష్షష్టి విద్యలయందు నేర్పును గడించుటయేగాక, భారతాది ప్రాచీనసాహిత్యమును నవ్యసాహిత్య మర్యాదలను సవిమర్శముగా నుపాసించెను. ఇంకను—

"అవులించిన మాత్రఁ బ్రేవు లెంచఁగ నేర్చి, నీటిలో జాడలు నెమక నేర్చి,
పాలు నీరును వేరుపఱచు నాణెము నేర్చి, కనుపాప నీడలఁ గాంచ నేర్చి,
బాలెంత జెబ్బులిపాలు పిండఁగ నేర్చి, దళము లంటక తేనెఁ ద్రావ నేర్చి,
యెండసోఁకుల దప్పి నెడలింపఁగా నేర్చి, శిలలకు గిలిగింతఁ గొలుప నేర్చి
పొత్తమునఁగాక ప్రకృతిలోఁ బుటలువిప్పి పదములనుగాక భావముల్ పట్టి తరిచి,
యన్వయవ్యతిరేక దృష్టాంతగతుల నరసి, భావపండితుండయ్యె శివుఁడు."

—ద్వి. 217.

విద్యాసూక్ష్మముల తత్త్వ మెఱిఁగిన శివాజీ శాస్త్రములను జీవితరంగమున ననుభవమునఁ బెట్ట యత్నించి స్వాతంత్ర్యోత్సాహము వెల్లివిరియఁగా దాదోజీ యొద్ద అనితరసాధ్యమైన ప్రతినఁ గైకొనినాఁడు :

"వేయితరమ్ము లిట్లొదిఁగి వేఁగిన లోఁగినఁ, గొల్వుకాంద్రమై
దోయిలి వట్టినన్, గరుణతోడ నవాబులు తుల్యగౌరవ
శ్రీయిడఁ బోరు; వారి నెదరించుటఁ గాదిది దేశరక్షణో
ధ్యాయము; దీనఁ దప్పు గలదా? కలదా పెరదారి ముక్తికిన్?"

"ఒకని పదమ్ములంటి, సమయోచితరీతి మతమ్ము మార్చి, గొం
కకయ సలాము లిచ్చి, యధికారపుఁ బెంటలు మోసి, పాప జీ
వికఁ నడుపంగఁ జాలఁ; బితృవిత్తమెయైన బరాధికార వా
చకమగు జాగిరున్ మనుపఁజాల; స్వతంత్రత నూదినిల్పెదన్."

—ద్వి. 292,. 301.

శివాజీ స్వాతంత్ర్యపు పోరాటమున కిదియే శ్రీకారము. దీనికి దాదోజీ ప్రోత్సాహము లభించినది, మాతృదేవి ప్రబోధముతోడు పడినది. మాళవ వీరుల సహకారముతో విజయతోరణచిహ్నమైన తోరణదుర్గ విజయమునకై ముందుకు నడచు వీరావతారమగు శివాజీనిఁ గని జిజయాబాయినోట సరస్వతి లాస్య మాడినది.

అక్షరమ్ముల సర్వార్థ మమరినట్లు ప్రకృతిలో సర్వ శక్తిసంపదలు కలవు
అనువుగా నేర్చి కూర్చి, కావ్యమునుబోలె గార్యమును దీర్చి యొక సృష్టికర్త
వగుము."

—ద్వి. 312.

అని యమృతాశీర్వాద మొనర్చినది. ఆయాశీర్బలముతో తోరణ, చాకణు, సుపా, సింహగడము, పురందర్, కోటలను చతురుపాయములను చాతుర్య ముతోఁ బ్రయోగించుచు సాధించియు, సాధించినవి బలపరచియు, బలపరచిన

వానిని నిత్యకళ్యాణము పచ్చతోరణముగఁ బోషించియు శివాజీ ప్రజాహృదయ రంజనుఁడయ్యెను.

శివాజీ చర్యల శంకించి బిజాపూరు సుల్తానులు షాజీని నిర్బంధమునఁ గొనిరి. జిజియాబాయి ఆజ్యముపోసిన అగ్నియైనది; అభిమానముతోఁ బుత్రుని ప్రేరేచినది. మాతృదేశమునే మాతృమూర్తిగా భావించెడి శివాజీకి దేశమే కంటతడి పెట్టినట్లైనది. మాతృనేత్ర మలములనుండి జారిన యొక అశ్రుకణము శివాజీ హృదయమును చేయివెట్టి కలఁచినది. శివాజీకి శివమెత్తినది. ఆర్ద్రమైన కన్నులతో పౌరుషము పొంగారగా నిట్లనినాఁడు :

"కనలకు తల్లి ! నీమది నొకంటఁ దిరం బొనరింపకున్న నా
మనసులు ప్రీలిపోవె ? యది మాన్పఁగ వచ్చునె ? దైవమెప్డు క
న్గొన లఱమోడ్చునే ? మెఱుఁగుఁగోఅలు డుల్లఁగ మృత్యుదేవతా
నన మఱకాలఁదన్ని భువనమ్ముల నోమ శివుండు చాలఁడే ?" —చతు. 49.

అనుచు "సాత్త్విక వీరభూమికా నృత్యంబు నటింతునని" తాండవశివ మూర్తియై, కదనరంగమున వీరనాట్య మొనరించినాఁడు. శత్రువుల గుండెలలో పిడుగులు వర్షించినవి. శివాజీ చరిత్రలో శరచ్చంద్రికలు విరిసినవి. రెండు దండయాత్రలు నిరాఘాటముగ సాగినవి. శివుని పోకకు తిరుగులేదు; శివుని చేత కెదురు లేదు.

శివాజీ నెదుర్కొనుట బిజాపూరు సుల్తానులకు మృత్యువు నెదుర్కొనినట్లైనది. పంచాననమును బంధింప వన్యమృగములు కూడినట్లు సుల్తానులు తలలు కూర్చుకొని యాలోచించినారు. రాజమాత వారిని తలవాయ చీవాట్లు పెట్టి, పౌరుషహీనులని నిందించినది. అభిమానియై అఫజుల్ ఖాన్ రొమ్ము వెంచి—

"బొఱియదాపునఁ దల నిక్కబొడిచి యెగురు
'కొండయెలుక'కై తమకింత కుదిలికేల ?
యుక్కుబోనుగా నాబాహు లొడ్డివాని
బొదిలి మెదుపుచు, నేలపై నుదికివిడనె !" —పంచ. 18.

అని కొండను గుండ్రాయియని మ్రింగనుంకించి కుప్పించినాఁడు. రాజమాత ధర్మహాని యైనను రాజనీతికే ప్రాధాన్యమీయమని ప్రబోధించుచు ఖానుతో నిట్లనినది :

"దేహబలముకంటె గడుఁదీవ్రము బుద్ధిబలంబు; ధర్మ సం
దేహముఁ బొందువానిఁ దెగఁదీయు నొకప్పుడు కార్యవాది; వి
ద్రోహము కూడదైనఁ బగతున్ బరిమార్చుట రాజనీతి; యు
త్సాహమ లక్ష్మి యింత మదితప్పకు, మేగుము, గెల్పు గాంచుమీ."

—పంచ. 27.

ఖానామె సలహాపై కుటిలబుద్ధికి మేతవేసి, కుతంత్రములచే శివాజీని చంప యత్నించినాఁడు. కాపట్యపు కౌఁగిలిలో ధర్మము చిక్కినను అదినృసింహరూపముఁ దాల్చునని తెలిసికొనలేకపోయినాఁడు. అట్లే కౌఁగిటఁజేర్చి శివాజీని చంపఁ జూచిన ఖానుని శివాజీ రుద్రుఁడై పులిగోళ్ళతో చీల్చి ధర్మదేవత హృదయ తాపముఁదీర రక్తాభిషేకము చేసినాఁడు; ఆ వేడితో—మాతృమూర్తి ధర్మాశీస్సులతో తృతీయదండయాత్రా విజయముసాధించి త్రిపురారివలె శోభించినాఁడు.

బిజాపూరు సులతానుల తోడి పోరు లొకయెత్తు; మొగలుల దండయాత్రల నెదుర్కొనుట మఱియొక యెత్తు అయినది శివాజీకి. సయిస్తాఖానుపై విజృంభించి, సూరతుముట్టడించి విజయములబొంది, సముద్రాధిపత్యమును గూడ సాధించినాఁడు. ఔరంగజేబు జయసింగును శివాజీపై కంపెను. గోముఖ వ్యాఘ్రమువలె వర్తించి ఘాతఁడు శివాజీని చెరసాలఁ బెట్టించెను. ఆ గండర గండని నినుపతలుపులు నిలువరింపఁ జాలక పోయినవి. "విపత్తులకున్ వెనుకాడి సాహసశ్రీ విడువాఁడు లోహితసిద్ధిఁ దృణంబుఁ గదల్ప నేర్వఁజాలఁడు! కాని కార్యవాదియైన శివాజీ భరతఖండము నల్లల్లాడించివైచుటలో నాశ్చర్యములేదు. చల్లనితల్లి యడుగులసేవలు చేయుచు, మాతృభూమిని సురక్షిత మొనర్చి, బంగారము పండించి స్వతంత్రసస్యముల నిండించినాఁడు. తల్లి కోర్కెపై నరుణోదయ మగుసరికి తానాజీ పౌరుష మెఱుగాఁబెట్టి సింహగడమును సాధించిపెట్టినాఁడు. రాయగడమున సర్వరాజ్యచిహ్నములతో మంగళ సింహాసనము నెక్కి హైందవ ధర్మమునకు కనకాభిషేకము నొనర్చి తరించినాఁడు శివాజీప్రభువు. దాన, దయా, శమ, ధర్మవీర వర్తనుఁడు ప్రబంధ నాయకపదమ్మున కబ్బినాఁడు!

"ధీరాగ్రేసరమూర్తి, హైందవధరిత్రీ భాగ్య సత్యావన
ప్రారంభుండు, దయాగుణాంబుధి, మహారాష్ట్రాన్వయోత్తంసుఁడా
వీరక్షత్రియమౌళి భవ్య భరతోర్వీ ధర్మరక్షార్పిత
శ్రీరమ్యుండు, భవాని భక్తుఁడు, శివాజీరాజు సామాన్యుఁడే."

ప్రతాపుఁడు, శివాజీ—వీరిరువురును స్వాతంత్ర్యము సాధించిన వీరులై నను వీరి దృక్పథములలో నొక సూక్ష్మభేదము గానవచ్చుచున్నది. దానిని శ్రీ దేవులపల్లి రామానుజరావుగా రిట్లనినారు: "పవిత్రమగు నాదర్శమును పవిత్రమగు సాధన సహాయమునఁ బొందగోరువాఁడు ప్రతాపుఁడు. కార్యార్థియై, లక్ష్యసిద్ధికై సాధనశుద్ధి నంతగా సరకుసేయనివాఁడు శివుఁడు."

౧౬. శంకరవిజయము – శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు:

శంకరుఁడు కారణ జన్ముఁడు. పుట్టిననాటి నుండియు పూవులో వాసనలు వలె బ్రహ్మ విజ్ఞాన మాతని యందు వెల్లివిరిసినది. విద్యాభ్యాసము అతనికొక నిమిత్తమాత్రమే యైనది. పూర్వ సంస్కారములే అతనిలో బ్రబుద్ధములై జ్ఞానమును సంతరించిపెట్టినవి. పిన్ననాటనే మహిమలు చూపనేర్చిన మహాత్ముఁ డాతఁడు. తల్లియొద్ద నుండి సన్యాసము గైకొనుటకై ఆమె నాతఁడు సేవించిన విధము నందును, సన్యసించిన విధము నందును నుత్కటమైన బ్రహ్మజిజ్ఞాస సాధనోన్ముఖమైన యుత్సాహము వ్యక్తమగును.

గోవిందయతి యొద్ద బ్రహ్మోపదేశముఁ బొంది శంకరుఁడు యత్యాశ్రమము గ్రహించి అష్టవిభూతి సిద్ధిని వహించి, సిద్ధపురుషుఁడు, జ్ఞానియైనాఁడు. ఆపై నాతఁడు మతప్రచారకుఁడై హిందూదేశమంతటను తిరిగి ప్రతివాద భంజన మొనర్చి, స్వీయమతస్థాపన మొనర్చుచు నప్రతిమానుఁడై సంచరించెను.

కుమారిలభట్టాది మహాపండితులతో వాదించునప్పుడు పాండిత్యవీర మిందు ప్రధానముగా స్ఫురించును. కుమారిలభట్టు, మండనభట్టు, ఉభయ భారతి మొదలగువారితోడ వాదించి జయించిన ఘట్టములందును, అష్టమనవ మాశ్వాసములందును షష్ఠ సప్త మాశ్వాసములందును పాండిత్య వీరము ప్రధానమై వరలుచున్నది. అతని జీవితమును సంగ్రహముగాఁ జెప్పవలెనన్న—

> "బ్రహ్మాండ గోళముల్ పట్టని విజ్ఞాన మైదేండ్ల యీడున నవధరించి,
> వ్యాసతాత్పర్య సర్వస్వమ్మునకు నర్థములుగ భాష్యత్రయమ్మును రచించి,
> యాసేతు శీతాద్రి నద్వైత గుప్తి యాపాదిల్లఁ బీఠముల్ పాదుకొలిపి
> ద్వైత సిద్ధాంత జల్పాక పాషండ వైతండిక మండమ్ము గండడంచి
> మహిత పారమహంస్య సామ్రాజ్య పట్టభద్రుఁడై జగమ్మున ధర్మపాలనమ్ము
> చేసిన శివావతార ప్రసిద్ధి నాది శంకరాచార్యుఁ గొలుతు సాష్టాంగ నతుల.
>
> —అవతారిక. ప. 7.

నను పద్యము చాలును. ఇందు క్రమముగా విద్యావీరము, కవిత్వవీరము, పాండిత్యవీరము, ధర్మవీరము అనునవి ఈ కావ్యములో స్ఫురించునని ఈ సీసపద్యము సూచించుచున్నది. మొత్తమునకు వానిలో విపులమగు పాండిత్య వీరమే అంగిగాఁ జేర్కొన వీలుపడుచున్నది. స్థలాభావముతో నుదాహరణ ములచేఁ బెంచి వ్రాయలేదు. సహృదయు లా కావ్యమునుండి గ్రహించుట చాల సుకరమని వదలుచున్నాను.

తెలుఁగు సారస్వతమున నున్న వీరరసకావ్యము లన్నిటిని యిచ్చట విమర్శించుట సాధ్యము కానిపని. అప్పటికిని వైవిధ్యమును గమనించుచు కావ్యముల నెన్నుకొని సాయశక్తుల నుచిత రీతిని విమర్శించితిని. సవరము చిననారాయణ నాయకుఁడు రచించిన కువలయాశ్వ చరిత్రమువంటివి ఇతః పూర్వమే వస్తుకావ్యములలో 'మార్కండేయ పురాణ' విమర్శనమున విపుల ముగాఁ జర్చించియుంటిని కావున చర్విత చర్వణమగునని తలఁచి విడిచినాను. అంతియగాక కొన్ని నా దృష్టికందకయు పోవచ్చును, కొన్నిటిపట్ల నా శక్తి చాలకయుండి యుండవచ్చును. అట్టివానిపట్ల సహృదయులు నన్ను మన్నింతు రని భావించుచున్నాను.

## వీరరసము - అంగరసము

తెలుఁగు సారస్వతమున శృంగారరసకావ్యము లధికసంఖ్యాకములు. అది సంస్కృత సాహిత్యమునుండి యబ్బిన యొకానొక విశేషగుణము. ఆ తరు వాత క్రమముగా వీరము, భక్తి, శాంతము, కరుణము, హాస్యము అను రసములు పూర్వోత్తరానుదాత్తములుగా తెలుఁగునఁ గానఁబడును. కావ్యములం దంగి రసములుగాఁ బ్రయుక్తము లగుటకు లాక్షణికానుమతము గలిగిన రసములు శృంగార, వీరరసములు. శృంగార మంగిరసములైన కావ్యములలో వీర మెచ్చటనైన గోచరించినచో దాని నంగముగా గైకొనవలసి వచ్చును. పురుషార్థ సాధనాత్మకమైన యుక్తటోత్సాహము మాత్రమే అందు వీరముగాఁ బరిగణింపఁబడునవి వెనుకనే విశదపఱుపఁబడినది. ఉదాహరణమున కొకటి రెంటిని గైకొందును.

ప్రబంధయుగము శృంగార రసప్రధానమగు ప్రబంధములు పెక్కులు వెలసిన కాలము. ఆ యుగమునం దుండిన 'పారిజాతాపహరణ'మను ప్రబంధ మును రచించిన నందితిమ్మయ్య తన కావ్యమున శ్రీకృష్ణుఁడు పారిజాత

వృత్రుని హరించి, ఇంద్రునితో చేసిన యుద్ధఘట్టమున యుద్ధవీరమును చక్కగాఁ బోషించినాఁడు.

"వినుఁడు సురేశ్వరువనపాలకులు ! వార్థిఁ
బొడమిన యీ దివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వఁడు
తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక
తెకతేర యిదియేమి యొకరిసొమ్ము
యిదే నాదు విభునిచే నీవదాన్యనగంబు
నొడియించుకొని యేగుచున్న దానఁ
బలుకు లేటికిఁ దా వీరపత్నియేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవు నిటఁబంపి సత్యభామా విధేయు
వలన మరలంగ గొనుటెపో వాసితనము."
—పారి. చతు. ప. 59.

శ్రీకృష్ణుని వీరమునకు హేతువు సత్యభామ కోపనివృత్తికై యతఁ డొనర్చిన ప్రతిజ్ఞయే. ఈ యుద్ధమువలన సాధింపఁబడినది సత్యభామా మనః ప్రీతి. అందువలన నాతని యుద్ధవీరము కామపురుషార్థ సాధకమై, ధర్మబద్ధమై వరలుచున్నది. ఇట్లే రామరాజభూషణ విరచిత వసుచరిత్రమున శృంగారమున కంగమగు బలవీరము — వసురాజు కోలాహలుని గోట మీటుటయందు వర్ణింపఁబడినది :

"అంత నవంత వేగ భుజగాంతకుఁ డమ్మహికాంతుఁ డాశ్రిత
స్వాంతము సంతసిల్ల సురచారణ సన్నుతి పర్వ నవ్వనా
భ్యంతర రోధకంబగు మహాద్రి నఖంబున మీటె నభ్ర వి
భ్రాంతముగాఁగ దుందుభికబంధము మీటిన రాము కైవడిన్."

ఇందలి యుపమాలంకార మాతని మహత్త్వమున కెత్తిన దివ్వె. రాఘవుని వంటి ధీరోదాత్తుఁడగు వసురాజు నాశ్రయించిన తద్బలవీరము సార్థకము. ఇట్లే శృంగార కావ్యములందు అంగమగు వీరమును సహృదయులు గమనింతురుగాక ! శృంగారరసమునకే గాక భక్తి శాంతాది రసముల కంగముగానున్న వీరరసము వస్తుకావ్యాదులఁ జర్చించుపట్ల ప్రకరణోచితముగాఁ జేర్కొనఁబడినది.

## ముక్తక కావ్యములు

కవులు తమ కావ్యావతారికలోఁ గృతిభర్తల గీర్తించుచుఁ వారి దానదయాయుద్ధధర్మవీరములను గీర్తించుచుందురు. రసగుళికవలెనుండు యొక్కొక పద్యము వ్యంగ్యార్థప్రధానమై రసస్ఫూర్తిని గల్గించుచుండును. ఉదాహరణమున కొకటి రెండు పేర్కొందును.

1. నంది తిమ్మయ్య తన కృతిభర్త పరాక్రమమును వర్ణించుచు యుద్ధవీర ముట్టిపడ యిట్లు వర్ణించెను :

"ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె
 వినుకొండ మాటమాత్రన హరించెఁ
గూటము ల్పెదరంగఁ గొండవీ డగలించె
 బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
దేవరకొండ యుద్వృత్తి భంగము సేసె
 జల్లిపల్లె సమగ్రశక్తి డులిచెఁ
గినుకమీఱ ననంతగిరి క్రిందుపడఁజేసెఁ
 గంబంబుమెట్టు గ్రక్కునఁ గదల్చె
బల నికాయము కాలిమట్టులనె యడఁచుఁ
గటకమును నింకననుచు నుత్కల మహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు." —పారి. పీ. ప. 23.

ఉదయాద్రి మొదలగు దుర్గముల సాధించుటయందలి రాయల యుత్సాహాతిశయ మిందు వ్యంగ్యము. అది యుద్ధవీరముగ నాస్వాదిత మగుచున్నది.

2. భట్టుమూర్తి శ్రీరంగరాయల దానవీరముఁ దెల్పుచు నిట్లనెను :

"జలధిన్ దానవయోధు నీ ఝురులచేఁ జంద్రుణ్ యశోలక్ష్మిచే
జలద వ్రాతము నాత్మకారిత మహా సత్రాగ్ని ధూమంబుచేఁ
జెలువొప్ప న్వెలయింపఁజాలు భళిరే శ్రీరంగరాయక్షమా
లలనా వల్లభుఁ డెల్ల దాతలకు నెల్లన్ దాత యూహింపఁగన్"

కావ్యలింగాకారముఁ బ్రయోగించి అలంకారధ్వనితో దానవీరము ధ్వనించె ఈ పద్యమున. ఇతనికి పూర్వుఁడైన శ్రీనాథునిచే రచితమై వీరభద్రయొక్క దానవీరమును వ్యంగ్యముగాఁ దెలుపు సీసము నిరుపమానము.

"ధరియింప నేర్చిరి దర్భవెట్టెడు వ్రేళ్ళ లీలమాణిక్యాంగుళీయకములు;
కల్పింప నేర్చిరి గంగమట్టియ మీఁదఁ గస్తూరికా పుండ్రకములు నొసల;

సవరింప నేర్చిరి జన్నిదంబుల ప్రోలఁ దారహారములు ముత్యాల సరులు;
చేర్పంగ నేర్చిరి శిఖల నెన్నడుములఁ గమ్మని క్రొత్త చెంగల్వ విరుల;
ధావముల వెండియును బైఁడి దడఁబడంగ, బ్రాహ్మణోత్తములగ్రహారములలోన
వేమభూపాలుఁ డనుజన్మ వీరభద్రు ధాత్రియేలింప గౌతమీతటమునందు."
—భీమే పు. ప్ర. 41.

బ్రాహ్మణుల వైభవము రెడ్డి దానవీరమును ధ్వనించుచున్నది.

కవులు దైవప్రార్థనము చేయుచు వారి వీరకృత్యములఁ గీర్తించి తదాశ్రిత వీరరసమును బోషించుచుండెదరు. అల్లసాని పెద్దన మనుచరిత్రావతారికలో శివుని దయావీరమును ఇట్లు ప్రపంచించినాఁడు.

"ఉల్లమునందు నక్కటిక మూనుట మీకులమందుఁ గంటి మం
చల్లన మేలమాడు నచలాత్మజ మాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపత దివ్యశరాఢ్యునిఁ జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల కభీష్ట శుభప్రతిపాది గావుతన్."    —మను. ప్ర.

పరమేశ్వరాశ్రిత దయావీర మిందు ధ్వనితము.

కవులు వినూత్న విశేషకావ్యప్రక్రియలను ఆవిష్కరించునప్పుడును, విశేషలక్షణసమన్వితములైన కావ్యనిర్మాణము లొనర్చినను, ఆత్మగుణములఁ జెప్పొనుచు కావ్య రచనోత్సాహముఁ బ్రకటించి, కవిత్వ పాండిత్యవీరములఁ బ్రదర్శింతురు. ఉ॥ శ్రీనాథుఁడు తన కావ్యకళనుగూర్చి యిట్లనినాడు—

"వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండ లీల నొక్కొక్క మాటు;
భాషింతు నన్నయభట్టు మార్గంబున, నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసాభ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని శేవ సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు."
—కాశీఖం. 13.

ఇందు శ్రీనాథుఁడు తన కావ్య విశేషలక్షణములఁ బేర్కొనుచు తత్సాధనాత్మకమైన యుత్సాహము బ్రకటించుచు కవిత్వవీరముఁ బ్రదర్శించినాఁడు.

ముక్తక కావ్యములలో శతకము మిన్నయైనది. తెలుఁగునందలి శతకములు ప్రధానముగా భక్తి శతకములు, వేదాంత శతకములు, నీతి శతకములు, వ్యాజస్తుతి శతకములని విభజింపవచ్చును. దైవ పరములై యున్న శతకములలో భక్తులయందలి భక్తి వీరము, దైవము యొక్క పరాక్రమవర్ణనాదులలో యుద్ధాదివీరములు, పలిత కొక్కొక్కచోట యుత్సాహస్ఫూర్తిని గల్పింప

వచ్చును. నీతి శతకములు ప్రధానముగా ధర్మప్రబోధరూపములు. సామాన్యముగా శతకములు భక్తిరస ప్రధానములై శాంతమునఁ బర్యవసించుచుండును. అయినను నెడనెడ భక్త్యుత్సాహము వీరస్ఫూర్తిఁ గల్గించుట కలదు. ఉదా. రామదాసు భక్తివీరము:

"ఖండనభీము డార్తజనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణకో
దండకళాప్రచండ భుజతాండవ కీర్తికి రామమూర్తికిన్
రెండవ సాటిదైవ మిఁక లేఁడనుచున్ గడగట్టి భేరి కా
డాండడ డాండ డాండ నినదంబు లజాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ!"

—రామదాసు దాశరథీశతకము.

శతకములు కవినాయకములనియు, దైవనాయకములనియు రెండు విధములు. వీనియందు క్రమముగా కవి నాశ్రయించినట్టియు, దైవము నాశ్రయించినట్టియు రసభావములు విమర్శితము లగుచుండును.

చాటువులు :

రాజాస్థానములందు గౌరవము లొందిన కవులు, రాజులపాలన పరాక్రమాదుల కుప్పొంగిపోయిన కవులు ఆశువుగా వారినిఁ గీర్తించిన చాటువులయందును వీరరసస్ఫూర్తి గోచరించును. ఉదా. వెలుగోటివారి వంశావళి వర్ణించు చాటువులు, శ్రీనాథుని చాటుధార, వేమన ఆశుకవిత్వము, తిరుపతి వేంకటేశ్వరుల అవధాన కవితలు మొ. ఇటువంటివి. శబ్దాలంకారములలో వీరరసము నొప్పించిన యొకచాటువు :

"అగ్రేయాహవశౌరి సింగయ సుతుం డాయన్నవోతున్ రణ
వ్యగ్ర ప్రాగ్రహ నిగ్రహాగ్రహ భరప్రాప్త ప్రతిప్రశ్రయా
త్యుగ్ర ప్రాగ్రహ విగ్రహ గ్రహణ రాహూదగ్ర దోర్మండలా
గ్రాగ్రద్యోతుని వీరవిగ్రహుని డాయన్ వచ్చునే యాజులన్"

సమస్యాపూరణమున నాయకుని దానవీరమును పోషించిన శ్రీనాథునిఁ చాటువు :

"తక్కక రావుసింగ వసుధావరుఁ డర్థుల కిచ్చుచున్నచో
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రాఁకుఁ బెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుల నెన్నెదు భట్ట దిట్టవై
కుక్కవో నక్కవో ఫణివో క్రోతివో పిల్లివో బూతపిల్లివో !"

ఉపమాన దృష్టాంత పరంపరలతో వీరరసస్ఫూర్తిఁ గల్గించిన చాటువు :

"ఆలోల కీలాకరాగ్రమై దావాగ్ని ఘోరాటవుల ముట్టుకొన్న యట్లు
చిత్రభ్రమణ లెగసిల్ల మంథానాద్రి కలశాబ్ధి నురవడిఁ గలచినట్లు
విలయ కాలాఖిల విపరీత వాయువు ధారాధరంబులఁ దఱిమినట్లు
గంభీర నిర్ఘోష కంఠీరవము రేఁగి హరిణవర్గము గంతులడఁచినట్లు
నీవు రణమండలంబున నిలిచి వీర కేళిఁజూపినఁ బరమహీపాల బలము
సమయుఁ జీకాకువడుఁ బారు జలదరించు నౌర కస్తూరిరంగ సాహసతరంగ!"

ఇట్టి చాటువులు మన సాహిత్యమునఁ గుప్పలుతిప్పలు. ప్రత్యేకమైన విమర్శ గ్రంథము వ్రాయదగినంత విషయమిందుఁ గలదు. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య" మ్మనియు, "రసాత్మకం వాక్యం కావ్య" మ్మనియు శబ్దవాక్యము లందే కావ్యత్వమును, రసస్వరూపమును వ్యంగ్య గౌరవముతోఁ బ్రత్యక్షీక రించుకొనిన మన లాక్షణికుల విశాలదృష్టిలో నిట్టి చాటువు లొక్కొక్కటి యొక్కొక రససామ్రాజ్య మనుటలో నాశ్చర్యము లేదు.



# 8. నవ్యసాహిత్య స్రవంతులు

## నవ్యసాహిత్య యుగోదయము

పందొమ్మిదవ శతాబ్దపుటుత్తరార్థములో కందుకూరి వీరేశలింగం పంతులుగారు సాహిత్యరంగమునఁ బ్రవేశించుటతో నవ్యాంధ్ర సాహిత్యయుగమునకు అరుణోదయమైనట్లైనది. అతఁడొక మహాసంస్థవంటివాఁడు. సంఘసంస్కారమును. సాహిత్యనిర్మాణమును ఒకేసారి సామర్థ్యముతో నిర్వహించి విజయము సాధించిన సవ్యసాచి అప్పటి సంఘములో మూఢవిశ్వాసములుగాఁ బాతుకొనిపోయిన బాల్య వివాహము, వృద్ధ వివాహము, వేశ్యాసమస్య మొదలగు విషయములపై తీవ్రములైన విమర్శాత్మక వాఙ్మయాస్త్రముల సంధించి వానినిఁ బ్రహసనముల పాల్చేసి ప్రజలయందు వానిపై వైముఖ్యము గల్గునట్లొనర్చెను. ఆకాలమున నాతని కార్యశూరత్వమున కుప్పొంగి యతనికై కైమోడ్పు లొసంగని ఆంధ్రయువకుఁడు లేడు. అట్టి యువవీరుల నాధారముగాఁ గొని భావిసంఘమును, సాహిత్యమును తీర్చిదిద్ద యత్నించిన సాంఘిక సాహిత్య వీరుఁ డాతఁడు. సంఘమును తనవెంట నడిపించుటకు వాఙ్మయమును సమర్థోపకరణముగా నుపయోగించిన ప్రజ్ఞాశాలి యతఁడు. అతఁడొక యుగకర్త.

కీ. శే. కురుగంటి సీతారామ భట్టాచార్యులవారి మాటలలో వీరేశలింగము "పంతులుగారి సేవవలన భాషకు జరిగిన ముఖ్య మహోపకారములు మూఁడన వచ్చును. 1. భాషాసౌలభ్యము. 2. వివిధ సారస్వతవ్యాప్తి. 3 పరభాషా వాఙ్మయానువాదము"[1] తనకు పూర్వ వచనరచనమందలి యోజోగుణమును సడలించిమాధుర్యము. సారళ్యము, సూటిదనము మొదలగు గుణములు ప్రధానముగా గల్గి సర్వజన గ్రాహ్యముగా నుండు చక్కని చిక్కని గద్యరచనకీతఁడు మార్గదర్శియై 'గద్య తిక్కన' బిరుదాంచితుఁడైనాడు. ఆంగ్లసారస్వత పరిచయఫలితముగా వ్యక్తిస్వాతంత్ర్యము, దేశస్వాతంత్ర్యము, బహుముఖ సారస్వతశాఖా నిర్మాణోత్కంఠ, విప్లవాత్మకోత్సాహశక్తి, నవ్యతపై మక్కువ, ప్రాచీన మూఢాచార నిరసనము, జాగృతి, భారతీయు లలవఱచుకొనిరి. అట్టి వారిలో వంగీయులు ప్రథములు. వారి ననుసరించి సర్వవిధముల ననంతో

---

1. నవ్యాంధ్ర సాహిత్యవీథులు I vol. పుట. 21

త్సాహముఁ బ్రకటించినవా రాంధ్రులు. దానికి ఫలితముగా తెలుఁగునందు వెలసిన వివిధసారస్వత శాఖలలో పెక్కులు పంతులుగారిచే నావిష్కృతము లైనవి. పంతులుగారు తమ జీవిత చరిత్రలో నొక్కచోట "తెనుఁగులో వచన ప్రబంధమును (Novel) నేనే చేసితిని, మొదటి నాటకమును నేనే తెనింగించితిని, మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే రచించితిని, మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని, మొదటి చరిత్రమును నేనే రచించితిని, స్త్రీలకై మొదటి చరిత్రను నేనే కావించితి"నని తెల్పినారు. ఇంతేగాక శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధమును శబ్దాలంకార ప్రధానమగు కావ్యమును, తెలుఁగు కవుల చరిత్రమును, స్వీయచరిత్రమును (Autobiography) సాహిత్య విమర్శన వ్యాసములు పెక్కులును, సత్యరాజా పూర్వదేశ యాత్రలవంటి యాత్రాకావ్యములును, నీతిశతకముల గొన్నింటిని రచించి బహువిధ నవ్యసాహిత్యస్రవంతులకు జన్మస్థానమై గురుపూజల నందుకొనినారు.

సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్యములలో నిష్ణాతుఁ డగుటచే సంస్కృతాంగ్ల వాఙ్మయ వార్నిధులలోని రత్నరాసులను గుర్తించి వానిలోఁ గొన్నింటినిఁ దెచ్చి దేశీయులకు వాని విలువలఁగట్టి ప్రదర్శించెను. అట్టి ప్రయత్నఫలముగా Shakespeare's Comedy of Errors ను చమత్కార రత్నావళిగా, Merchant of Venice ను వినీసువర్తకుని చరిత్రగా, Sheridan's Duema ను రాగమంజరిగా Sheridan's Rivalsను కళ్యాణకల్పవల్లిగా, Cowper's John Gilpin ను దుర్మార్గ చరిత్రముగా, Goldsmith's Vicar of Wakefield ను రాజశేఖర చరిత్రగా తెలుఁగులో నవతరించినవి. ఆంగ్లేయుల భౌతికశాస్త్రము, సంస్కృత తర్కశాస్త్రము, జ్యోతిష శారీర శాస్త్రములు, వీరి కాలమున దెనుఁగు తేటదనమును రుచిచూచినవి. సంస్కృత సాహిత్యమునం దాణిముత్యములవంటి నాటకరాజములు ఈతనిచే నాంధ్రీకృతములైనవి. కాళిదాసుని మాళవికాగ్నిమిత్రము, అభిజ్ఞానశాకుంతలము, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయము, తీయందనములూరు తేటతెల్గు గద్యపద్యాత్మక రూపకములై హిమవచ్ఛృంగమున మంచుకరఁగి పొంగి పాఱు సెలయేళ్ళవలె తెలుఁగు సాహిత్యక్షేత్రమునఁ బారి క్రొత్తపంటలఁ బండించినవి.

అతని జీవితచరిత్ర యొక జాతివీరుని వీరగాథ; జాతిని, సాహిత్యమును పెక్కుశ్రేయోమార్గముల నడిపించినట్టి నాయకునిపొందిన ఆంధ్ర సాహిత్యము ధన్యము! అతఁడొక సచేతనమైన మహాపరిషత్తు. అతనిచే రచింపఁబడిన సత్య

హరిశ్చంద్ర నాటకములోని నాయకునివలె పంతులుగారును తాను నమ్మిన సత్యమును, తాను నడచు ధర్మపథమును, ఎట్టి దుర్భర దుర్వార క్లిష్టపరిస్థితు లందును త్యజింపక, ధృతితఋగని యుత్సాహమూర్తియై దీక్షాపరుఁడై, కార్యదక్షుఁడై స్వార్థత్యాగియై, స్వతంత్రుఁడైన కర్మయోగియై వీరరసాత్మక మయిన జీవితమును నడిపి తనబ్రతుకొక కావ్యముగా సంతరించుకొనిన మహాంధ్ర నాయకుఁడు – మనీషి. అతని సాహిత్యోత్సాహమే నవ్య సాహిత్య మునకు శ్రీకార భిక్ష; శ్రీరామరక్ష.

వీరేశలింగం పంతులుగారి తరువాత సాహిత్యరంగములో నత్యధిక సంచలనముఁ దీసికొనివచ్చినవారు తిరుపతి వేంకటకవులు. గద్యసారళ్యమునకు పంతులుగారు కృషిచేయగా నీజంటకవులు పండితైక సభలలో నుపాస్యమగు నాంధ్రభారతీ వైభవమును దెలుఁగు ప్రజానీకమునకుఁ బ్రత్యక్షమగునట్లు తెలుగు రథ్యలం దవధాన స్యందనమున నూరేగించిరి. "ఈ జంటకవులుచేసినపని దాదాపు వీరేశలింగముగారు చేసినంతా ఉన్నది. వీరు స్థావరమేర్పరచుకో డానికి పూర్వము శతావధాన సంచారముతో ఆంధ్రదేశములో నన్ని సంస్థా నాలు పరిచయము చేసికొని బహుమతులను పొందినారు. ఏనుగులమీద నూరేగినారు. రాజులమీద పద్యాలు చెప్పినారు. అడ్డువచ్చిన పండితులనూ, కవులనూ డీకొన్నారు. చర్చల్లో పాల్గొన్నారు. కవితా దిగ్విజయము పొంది నారు. ఎదిరించిన శిష్యులపైన గ్రంథాలువ్రాసి శిక్షించినారు"[1]

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు వీరి యవధాన కవితా సంపత్తిని ప్రశంసించుచు నిట్లు నుడివియున్నారు. "తిరుపతికవుల జీవితమొక మహాభారతము. ఇం దేపర్వమునుఁ బరిశీలించిననుఁ బ్రతిజ్ఞలు సేయుట, మీస ములు దువ్వుట, ప్రతిపక్షులనుఁ బరిహసించుట, పద్మవ్యూహములు పన్నుట వానిని భేదించుట, యెదిరి యెట్టివాఁడైన సాహసించి మీఁదికురుకుట యివి చూతుము. ఈ భారతమునఁ గూడ రాయబారములు, రభసలు, శతఘ్నుల చప్పుడులు, పాశుపత ప్రయోగములు, అట్టహాసములు, తాలుకుట్టనములు కలవు. పాండవోద్యోగ విజయములు పాండవాశ్వమేధము మున్నైనవి దీని లోనివే. గిరతముకూడ నీ భారతములోనిదే. ఈ భారత సంగరమునకు 'గుంటూరుసీమ' కురుక్షేత్రము.

1. నవ్యాంధ్ర సాహిత్య వీథులు I vol పుట 88

వాగ్యుద్ధములవలనఁ దిరుపతి కవులకీర్తి చంద్రికలు నలుమూలల విరిసి తెలుఁగులతల బూయించినవి. తిరుపతి శాస్త్రిగారు వెలనాఁటివారు. వేంకట శాస్త్రిగా రారామద్రావిడులు నైనను నేకోదరులవలె మెలంగుచుఁ బరస్పర సహకారముతో నవధానములు, ఆశుకవితలు, ఆకాశపురాణములు, ప్రదర్శించుటచే వీరిపేరు త్వరలో ప్రశస్తికెక్కినది. అవధానకళకు గౌరవము దెచ్చిన వారు తిరుపతి కవులే. చులకదనము కల్పించినవారును తిరుపతి కవులే. వీరికి ముందు శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులుగారును, నంతకు మిక్కిలి ముందు రామరాజభూషణుఁడు (భట్టుమూర్తి) మున్నగువారు శతలేఖినీ గ్రంథ సంధానచాతురిగలవా రున్నను వారెవ్వరునుఁ దిరుపతి వేంకటకవులవలె జంట కవులుగా నుండి యవధానములు చేసినవారుకారు. పిఠాపుర సంస్థానకవులైన దేవులపల్లి సోదరులును, వేంకటరామకృష్ణులు అత్యద్భుత అవధానాశుకవితా ప్రదర్శనము లొనరించియున్నను దిరుపతి వేంకటకవులవలె నవధాన విద్యను జగద్విఖ్యాత మొనరించినవారు కారు. రాయలవారి కాలమున నందిమల్లయ్య, ఘంట సింగయ్య యను జంటకవులు ప్రబంధరచనముఁ గావించిరి. కాని వారవ ధానముల నొనర్చి యుండిరో లేదో చెప్పుటకుఁ జరిత్రాధారములు లేవు. 'జగదాశ్చర్యకరావధాన కవితా సంపత్తి తిరుపతి వేంకటకవి యుగళమునకే దక్కినది.'[1]

నవ్యాంధ్ర సాహిత్యమున వచన రచనమునఁ బంతులుగా రెంత సేవ చేసి యున్నారో వీరు పద్యరచనమున కంత సేవచేసియున్నారు. సుదీర్ఘసంస్కృత జటిల సమాసాదులతోఁగాక సరళ సుందర పదసముదాయముతో వ్యాకరణ దోషములులేని చక్కని వ్యావహారికమునకు దగ్గరి భాషలో కావ్యరచన మొనర్చి రసభావార్థసౌలభ్యములను సాహిత్యమునకు గల్పించి నూతన రుచులను కవితకు కల్పించినారు. వీరి కవిత ప్రాచీన కవితకు భరతవాక్యమనియు, నవీనకవిత్వమునకు నాందీవాక్యమనియు గీర్తిగాంచినది. వీరికి కింకవీంద్రఘటా పంచానన, విద్వత్కవి, బాలకలానిధి, బాలసరస్వతి, శతావధాని ఇత్యాది బిరుదములు వారి గుణగౌరవమున కుచితముగా శోభించుచుండెడివి. వీరు నాటకములు, కల్పిత ప్రసిద్ధ ప్రబంధములు, గీరతమువంటి అధిక్షేప (Satirical) కావ్యములు, చాటుపద్యములు, వ్యాసములు మొదలగు వివిధసాహిత్యశాలలో విపుల కావ్యప్రపంచమును సృజించి యాంధ్రావళి హృదయసీమలలో రస

1. ఆంధ్రరచయితలు – పుటలు. 228-230.

వృష్టికురిసి కవితాభిమానముల మొలకెత్తించిన శ్రావణమంగళ (మేఘ) ఘన ద్వయ మీ కవులజంట !

"శతఘంట కవనమ్ము సల్పు సంగతి యన్నఁ గరతలామలకమ్ము గాదె మాకు
అష్టావధాన కష్టావలంబన మన్న నంబికొండయ దండనంబు మాకు
ఆశుధారా కవిత్వాడంబరం బన్న నల్లేరుపై బండి నడక మాకు
సత్కావ్యనిర్మాణ చాకచక్యంబన్న షడ్రసోపేత భోజనము మాకు
వ్యర్థమగు వాదము లొనర్చు నట్టి వారి డంబమూఁగించు టాపోశనంబు మాకు."

అని బింకముగాఁ జెప్పగల్గిన వారి శక్తిమాత్ర మతిశయోక్తి కాదు. ఇట్టి మహత్తునిచ్చి ప్రచండపాండిత్యము నిచ్చి ప్రతిభాస్ఫూర్తి కల్గించి వారినిఁ గాపాడిన సరస్వతి విద్వజ్జనకల్పవల్లి భారతికి వారిచ్చిన కైమోడ్పులివి.

"ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములం గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులందుఁ బేరుఁ గొనినారము నీవలనన్ సరస్వతీ.

సత్త్వరజోగుణప్రధానమయిన వీరి జీవనప్రవృత్తి కవిత్వవీరమున కత్యంత విమలోదాహరణము. వీరి శిష్యులయి యశస్సు సంపాదించిన పండితకవులలో నొకరగు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వేంకటకవిఁ గూర్చి వ్రాసిన పద్యము :

"తన యెద యెల్లమెత్తన కృతప్రతిపద్యము నంతకంటె మె
త్తన తన శిష్యు లన్న నెడదంగల ప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రుపర్వత శతారము సత్కవి చెళ్ళపిళ్ళ వేం
కన గురువంచు చెప్పికొనఁగా నది గొప్ప తెలుంగునాఁడునన్."

వీరేశలింగంపంతులుగారి తరువాత నుపన్యాసశాఖను తెలుఁగునఁ బ్రతిష్ఠించి పోషించి పండించినవాఁడు కీ. శే. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. వారి నాటకాదుల నటుంచినచో 'సాక్షి' సంపుటములే ఆంధ్రప్రజానీకమున కధికాదరపాత్రములైనవి. గద్య ప్రబంధములవలె రసవత్తరములై వ్యంగ్యముగా సాంఘిక మత సాహిత్యరంగము లందలి లోపములనుండి వారిని దూరస్థుల నొనర్చుచున్నవి. ఇంగ్లండున "స్పెక్టేటర్" చేసిన సేవ తెలుఁగున నీ యుపన్యాసములు చేసినవి. ఇవన్నియు హాస్యరస ప్రధానములైయుండి చిరునవ్వులలో మహార్థములను వ్యంగ్యముగా బోధించుచుండును. జాతి సువ్యవస్థనొంది

పురోగమించుట కితని యుత్సాహాత్మకోపన్యాసములు ఎంతయు తోడ్పడు చున్నవి.

ఆంగ్లసాహిత్య ప్రభావఫలితముగా తెలుఁగు సాహిత్యములో నవ్యసాహిత్యమనఁబడు 'భావకవిత్వమును' మొదటిసారి ప్రవేశపెట్టినవారు శ్రీ రాయప్రోలుసుబ్బారావుగారు; కీ.శే. గురిజాడ అప్పారావుగారు. ఒకరు ప్రధానముగా ఛందోబద్ధమైన కవితయందు కృషిచేయగా మఱియొకరు మాత్రాబద్ధమగు ఛందస్సునఁ గృషిచేసినారు. భావకవిత్వమనఁగా "గానయోగ్యము. ఆత్మనాయకము, వ్యంగ్యప్రధానము, ఏకభావాశ్రయమునగు లఘురచన" యని శ్రీ పాడిబండ మాధవశర్మగారి నిర్వచనము. వీనికన్న పెద్దవియు, మహాకావ్యములకన్న చిన్నవియునయి వస్తు, నాయకరసాత్మకములైనట్టివి లఘుకావ్యము లనఁబడు చున్నవి. గురజాడ 'ముత్యాల సరాలు' అను నూతనమాత్రా ఛందస్సును సృజించుకొని అందు కొన్ని ఖండకావ్యముల రచించినారు. వీరి కన్యాశుల్కమును కళ కళకొరకే యను సిద్ధాంతమున కుదాహరణముగా వ్యావహారిక భాషా ప్రచారానుకూలముగా రచియించిన హాస్యరస ప్రధానమైన రూపకము. రాయప్రోలు అమలిన శృంగార ప్రతిపాదకములగు లఘుకావ్యములను మార్గదేశి వృత్తములలో లక్షణశుద్ధముగా రచించెను. వీరిరువురు ఇంతేగాక ప్రబోధ సాహిత్యమును విలక్షణముగా స్థాపించి ఘోషించిరి. దేశ, రాష్ట్ర వ్యక్తి స్వాతంత్ర్యమును ప్రబోధించి నిద్రాణమైన జాతిని చైతన్యవంత మొనర్పు వైతాళికులైరి.

రెండవప్రపంచ యుద్ధానంతరము ప్రపంచ మశాంతికిగు ఱియై సామ్రాజ్య సామ్యవాదముల యలజడి ప్రబలి, ఆర్థికాభివృద్ధి సడలి లోకమంత శోకమయమై స్వార్థపూరితమై ఏహ్యమైయుండగా కవి భావనాలోకమున శాశ్వత సౌఖ్యావహమైన మరోప్రపంచమును సృజించి, దాని నుపలక్షించుచు తనతో రమ్మని యెలుగెత్తి కేకవేయుచు దళితప్రజానీకమున కున్నతస్థాయిని కల్పింప నడుముకట్టి మహాప్రస్థానముచేసిన శ్రీ శ్రీ అభ్యుదయ కవిత్వమునకు గురుస్థానము. ఇతఁడు ప్రతిభా సమన్వితుఁడై తాను ముందాశ్రయించిన గణబద్ధమైన కవిత్వమును త్యజించి 'ఫ్రీవర్సు'ను గైకొని తనకవనమును సాగించుచున్నాఁడు. ఇతనిది ఖండకావ్య రచనము.

మహావృక్షము శాఖోపశాఖలుగా నెట్లు విపులమగునో అట్లే నవ్యసాహిత్యము పెక్కుదారుల నడచుచు వైశాల్యము నందుచున్నది. నవ్యయుగమున

మహాకావ్యములు, లఘుకావ్యములు, ఖండకావ్యములని కావ్యభేదములు. నవల, చిన్నకథ, స్కెచ్, గల్పిక, కార్డుకథ మొదలగు నవలా భేదములు, నాటకము, నాటిక, ఏకాంకిక మొదలగు రూపక భేదములు అనునవి ప్రధానముగా గోచరించుచున్నవి. వీనిలో రసప్రతీతి స్పష్టముగా కావ్యములందు గోచరించును. మఱియు నవలలలోను, కథానికలలోను వస్తుప్రాధాన్యము హెచ్చు. వీనియందును రసప్రతీతికి పాటుపడిన రచయితలుకూడ లేకపోలేదు. కావున నిచ్చట రసప్రధానములైన వాని నెన్నుకొని శాఖ కొక్కటి చొప్పున నుదాహరింతును.

## లఘుకావ్యములు

### ౧. ఝాన్సీరాణి – శ్రీ విశ్వనాథ సత్యనారాయణ :

నాల్గుపదముల భావగీతము మొదలు నవరసముల మహాకావ్యమువఱకు నవ్యసాహిత్య ప్రక్రియ లన్నిఁటినిఁ జేపట్టి, పట్టినదంతయు బంగార మొనర్చి ప్రతి సాహిత్యశాఖయందును ఆణిముత్యములవంటి కావ్యముల వెలయించి ప్రాచీన భారత సంస్కృతి సంపదను గనులనుండి త్రవ్వి గంపలకెత్తి తెలుఁగు బిడ్డల కందించిన ధర్మవీరులు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. వీరరసప్రధానములైన లఘుకావ్యములందు స్వాతంత్ర్య వీరకావ్యము వీరి 'ఝాన్సీరాణి'. 1857 నాటి జాతీయ విప్లవమును పాశ్చాత్య చరిత్రకారులు సిపాయి పితూరిగా నన్వయము చెప్పి సత్యమును కప్పిపుచ్చి భారతీయులలో స్వాతంత్ర్య బీజములు ప్రబుద్ధములైన తరువాత తమ చరిత్ర నా దృక్పథముతో చదివి స్వాతంత్ర్య వీరరణరూపమగు నా విప్లవగాథ యందలి సత్యమును ప్రపంచమునకుఁ జాట మొదలిడిరి.

అఖిలభారతమున నాంగ్లేయులపైఁ బెచ్చు పెరిగిన ద్వేషము భారతీయుల యందు స్వాతంత్ర్యేచ్ఛను ప్రేరేచి యొక్కసారిగా కార్చిచ్చువలె ప్రజ్జ్వలించినది. అందొక ప్రచండ దావానల శిఖ ఝాన్సీ లక్ష్మీబాయి. భారతీయులు పవిత్రాశయముతో ప్రయత్న మారంభించినను కాలము కలిసిరాక పోయినది. అయినను ధృతివీడక కాలప్రవాహమున కెదు రీది యా విప్లవకారులు అంత్యశ్వాసయాడు నంతవఱకు స్వాతంత్ర్యధ్వజ మొరిగిపోకుండ నిలువబెట్టిరి. లౌకిక విజయ మాంగ్లేయులదైనను ఆధ్యాత్మికవిజయము భారతీయులదే. అదే రగిలి రగిలి ఇంధ

నములఁ గూర్చుకొని ప్రళయాగ్నివలెఁ బ్రకోపించి విదేశీయ పాలకులకు భయము కల్గించి వారిని పాఱఁద్రోలి క్రీ. శ. 1947 లో స్వాతంత్ర్యముఁ దెప్పించినది.

భారతీయుల స్వాతంత్ర్యేచ్ఛ ధర్మప్రధానమైనది. అది ప్రకోపించినది కాని కాలము కలిసిరాక తొలుత తగ్గుముఖమైనది.

"మృతిభయము లేదు ధర్మాని ; కితరమునకు
మృతిభయము తక్క వేఱులే దెంతయైన
సాహసము చేయు ధర్మంబు సమయ మొకఁడు
తన కనుకూలమౌటచేఁ దగ్గుకాని." —ఝాన్సీరాణి. పు. 6.

స్వాతంత్ర్యధర్మముకై సాహసముచేసిన 1857 విప్లవవీరులలో ఝాన్సీరాణి నాయకమణివంటిది. ఆమె తన జాతిధర్మమును నిలువఁబెట్ట యత్నించిన వీరనారి. జాతికొఱకు ద్రోహులైన శత్రువుల డీకొనినది.

"శత్రుజనునివలనఁ జావదెప్పుడుగాని యొక్క జాతిధర్మ మొర్వియందు
మనుజపశు వొకండు తన ధర్మము త్యజించి శత్రుఁజేరినపుడు చచ్చినట్లు."

"తనదేశము తన ధర్మము తన విద్యయు వదలి యెవఁడు తాఁజేరుఁ బరా
వని విద్య ధర్మము లా జనుఁ డొక్కఁడు చచ్చు రెండు చావులు ధరణిన్."

అట్లగుచుండ స్వజాతిధర్మమునకై ప్రాణమువీడిన వీరవరులు మరణించియు జీవించినవారును ఓడినను జయించినవారును అగుచున్నారు.

ఝాన్సీరాణి పౌరుషప్రధానమగు పెద్దయాఁడుపులి. కవి భావనలో నామె దుర్వారరాక్షస ప్రధ్వంసినియైన భద్రకాళి. సింహవాహనము యొక్క అపరావతారము. పూవు పుట్టగనే వాసనలు విరఁజిమ్మినది.

"అన్నప్రాశనవేళ లక్ష్మియట రత్నానేకముల్ శాశసం
పన్నంబుల్ బహుగ్రంథముల్ వదలి యాపై నున్న ఖడ్గంబు గై
కొన్నన్ భూసుర యోధుఁ డీ శిశువు నాకుం గీర్తి తెచ్చున్ధరా
సన్నావత్తతి చీల్చునంచుఁ దలఁచెన్ సంతోషరేఖాస్యుఁడై "

ఆంగ్లేయుల అధికారపాదఘాతములకు భారతీయుల కళాకుసుమవిలాసములు తుమురుతుమురులైనవి. భయము ప్రతివాని గుండియలలో గూడుకట్టుకొనినది. తెల్లవాఁడనిన సింహస్వప్నమైనది.

"భయమొక చిత్రమైన యది పై ముసుఁగయ్యది యొక్కరుండు ని
ర్భయుఁ డరుదెంచి తానిలిచి పాపముతోడ నెదిర్చినన్ జనుల్
భయమఱిమూఁగి వచ్చెదరు పాపము నిల్వనులేద యప్పుడా
భయమును సిగ్గువంటి దది పాయదు సంస్కృతి లేని జీవునిన్.

అట్టి దురవస్థలో ధైర్యముచేసి, ముందడుగువేసి, తెల్లవారి నెదిరించి నిలిచి దేశీయుల నావరించిన భయావగుంఠనములను పటాపంచ లొనరించిన పౌరుష వంతురాలు లక్ష్మీబాయి.

గర్వాంధుఁడగు నాంగ్లేయు నొక్కని నెదిరించిన పౌరుషమే ఝాన్సీ రాణిని గంగాధరునకు పట్టమహిషి నొనర్చినది. నోములపంట యైన పుత్రుఁడు, ప్రాణాధారమైన నాథుఁడు రాణిపై సర్వసామ్రాజ్యభారము క్రమముగా మోపుచు దివంగతులగుటచే నామె తెరచాపలేని యోడయైనది. దత్తపుత్రుని గద్దె కెక్కింప దొరలద్దాని కంగీకరింపక దుర్గము నాక్రమింప నుచ్చులు పన్ను చుండిరి. క్రుద్ధయైన యాఁడుపులివలె మండిపడుచు లక్ష్మీబాయి యిట్లు గర్జించినది.

"ఈ నేలంతయు మాది కాదనుటకిం దెవ్వాఁడు చోరుండు కాఁ
డేనిం జోరుఁడు నేఁడు కానియెడ రేపేన్ బద్ధుఁడున్ వధ్యుఁడౌ
నేనున్ నీవును నెట్లో వ్యక్తులము నట్లై జాతులున్ క్రూరమా
ర్గానన్ సత్పథమందు నేగుట యహో కాలంబు సౌఖ్యంబుగాన్."

"ఆనిత్యమయిన సౌఖ్యమె యీనేలఁ బురాణములుగ నెలరారు మహో
జ్ఞానస్థానములై యాజ్ఞానము నీవంటి తెలివి చాల దెఱుంగన్."
"ఈ కోటనేను వదలను నాకోటమి గలుగునేని నాకు గలుగనీ!
నాకుం బ్రాణము లుండిన దాఁకన్ బోరాడెదనది ధర్మము నాకున్."

అని ధర్మవీరమును ప్రదర్శించినది.

ఆంగ్లేయుల దుర్నయములు దుర్భరములైనవి. వారు భారతీయుల ప్రాణములతో విలాసముగ నాటలాడినారు; పశువులకంటె గడ్డిపోచలకంటె హీనులుగాఁ జూచినారు.

"తనవంక నిర్భయంబునఁ జూచెనని యెంచి
యొకఁ డొక్క భారతీయుని వధించె
క్రొత్తతుపాకి మ్రోఁగునో లేదో యని చూడ
నొకఁ డొక్క భారతీయుని వధించె
నొక్కండు భారతీయునిఁ జంపె దారిలో
నున్న కుక్కనుఁ గాలఁ దన్నినట్లు
నొక్కండు భారతీయునిఁ జంపె భారతీ
యునియందుఁ దేలిక దనముఁ జూప

అదివఱకు జంపి యెఱుఁగని యాతఁ డొకఁడు
చంపు కెట్టుండునో చూడఁ జంపె నొకని
వార లొక్కొక్కఁడును యమభటులు రాణి
రాజ్య కార్యంబులం జూడ రాకమున్ను."

వారి యమానుషకృత్యంబులకు రాణి కడుపుమండినది. కాలముకొఱకు ప్రతీ క్షించలేదు. ముందువెనుకలు చూడక కదనరంగమున దూఁకినది.

"తులువల్ కాలము మూఱుచుండు ననుచున్ దుర్బుద్ధి మీసాల బు
గ్గలు మార్జాల విలోచనంబులు ధరాక్రాంతుల్ మహాధర్మము
జ్జ్వలమున్ జంపెదరంచు రాణిరణదీక్షా చండతావ్యగ్ర ని
శ్చల నేత్రంబుల వైరిగుండెలు చలించన్ ఛేరివేయించినన్."

పోరు ఘోరమైనది అశీతితులగు స్వాతంత్ర్య వీరులు మరఫిరంగుల అగ్నిజ్వాలల కాహుతి కాఁజొచ్చిరి. ఆ ఘోరముఁజూచి సహింపఁజాలక లక్ష్మీబాయి కోట తలుపులు తీయించి శత్రువులమధ్య కురికినది. విచిత్రగతులతో మెఱుపుతీగఁవలె రణరంగమున వీరవిహార మొనరించినది.

"కరవాలముంబట్టి కంఠముల్ తఱుగుచో నెడనీటి బొండంబు లెగచినట్లు
బల్లెమ్ముతో గుండె పగిలించినప్పుడు ధృతిగట్టునకు గడ్డ తీసినట్లు
గుఱ్ఱమ్ము దూఁకించి కూలించి నప్పుడు నడవిచెట్లనుఁ బడనడచినట్లు
తలపైన డాలుతోఁ దాడించినప్పుడు జ్ఞాతన్వి పారతో సర్దినట్లు
కెలఁకులనుఁ జిత్రముగను లంఘించునపుడు తూఁగు నడకల నేతాము ద్రొక్కినట్లు
విజయలక్ష్మి విధంబున వెలిఁగె రాణి పంటలక్ష్మి విధంబునఁ బ్రబలె రాణి."

తనస్వాతంత్ర్య దీక్షయొక మహాయజ్ఞముగ భావించి నిర్వహించిన కర్మవీరు రాలా ఝూన్సీలక్ష్మీబాయి. దేశమునకై తన జీవితమొక కర్పూర నీరాజన ముగ నర్పించిన త్యాగవీర యాసాధ్వి. ఆమె దృక్పథములో స్వాతంత్ర్యసమర మిట్టిది !

"...స్వతంత్ర భావమహిమ క్రతు వియ్యది యీ మహాగ్నిలో
నుఱికినవాఁడు దీనమతియున్ హుతమౌటయె వెన్క కేగుటన్
సరణియె లేద యిందుఁ బడిజచ్చిన దుఃఖము తప్పిపోవున
బ్బురమును తే దకాలమయ పూరుష పౌరుష వహ్ని వేదికన్."

సఫలముగాని స్వాతంత్ర్యసమరమును కాలమహిమగా చిత్రించి ఋతువర్ణ నాదులతో దానిని సమన్వయించి గ్రంథనిర్వహణమున నపూర్వశిల్పసౌకు

మార్గ్యముఁ బ్రదర్శించిన "విశ్వనాథ" వీరరస కావ్యశిల్పియైనాఁడు. వీరివలెనే 1857 జాతీయ విప్లవము నితివృత్తముగా గొని లఘుకావ్య సంతరణమొనర్చిన వారిలో ప్రసిద్ధులు 'సిపాయి పితూరి' కావ్యకర్త శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు.

> "మహితంబైన స్వతంత్రభారతము నిర్మాణంబు సేయంగ దు
> స్సహ కష్టంబులకోర్చి వీరులయి స్వచ్ఛందంబుగాఁ బోరిశ
> త్రుహత ప్రాణులుగా ధరంబడిన నిత్యుల్ నాకు సాక్షాత్కరిం
> త్రు హితాశీస్సులు నింత్రుగాక భవమందున్ భావలోకంబులన్.[1]"

అని చెప్పుకొనినారా రచయిత. అతని భావావేశమే యొక వీరరస కావ్యముగా రూపొందినది.

## ౨. "విజయశ్రీ" - శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి :

ఇతిహాస ప్రసిద్ధమైన గాథను గైకొని రచించిన కావ్యములలో శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'విజయశ్రీ' ప్రముఖమైనది. "ఈ కావ్యము వీరరసప్రధానమైనది. అసలు కావ్యరచనకు తీసికొన్నఘట్టమే అటువంటిది. సంధికార్యము విఫలమైనది. పాండునందనులలో ఒక ధర్మరాజుతక్క మిగిలిన వారందరు కౌరవులమీఁద కారాలు మిరియాలు నూరుచున్నారు. సంధి విఫలమైనా అసలు సామంచేతనే కార్యంసాధించాలనే యత్నంలోవున్న ధర్మరాజు మాత్రం గురుజన బంధుజన సంహారానికి విముఖుఁడు కాఁడు. కాని పరాభవానల దందహ్యమాన మానస పాంచాలి తన పతులను ఉపాలంభించి యుద్ధానికి పురికొల్పుతుంది. కౌరవుల రాజ్యమదాంధత, తృష్ణ బాగా తెలిసివచ్చిన కృష్ణుఁడు కూడా ఒక దండోపాయందక్క కార్యసాధనానికి వేరే ఉపాయంలేదనే నిశ్చయంలో వున్నాఁడు. చివటి కందఱు యుద్ధం చేయడానికే నిశ్చయించి అందుకు తగిన సన్నాహంచేస్తారు. ఈ మంత్రాలోచనఘట్టం రసవంతములైన పద్యాలతో హృద్యంగావుంది."[2] ఇతివృత్తము పౌరాణికమైనను, సమకాలీన పరిస్థితులు ధ్వనించునట్లు-శ్రీకృష్ణార్జునుల నిమిత్తముగాజేసి జాతిని ప్రబోధించినారు కవి. అందు వీరరస మింపుగొలుపుచున్నది. ఉదా.

---

1. సిపాయిపితూరి. పుట 5
2. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ-పీఠిక. విజయశ్రీ, పుట 12

కృష్ణుఁడు :

"నిద్రాణమ్మగు జాతికిన్ నవనవోన్మేషమ్ము చేకూర్చి ని
ర్నిద్ర స్ఫూర్తి స్వతంత్రభారతపునర్నిర్మాణముం జేయుచే
భద్రా! భద్రము క్షాత్రనందనుల ; కీభంగిన్ నిరుత్సాహివై
యుద్రేకమ్ము దొరంగి చల్లఁబడి నిట్టూర్పంగ నీ కొప్పునే."

అర్జునుఁడు :

"ఒత్తుము పాంచజన్యము! ముహుర్ముహు రాకులితారి సైన్యమే
నొత్తెద దేవదత్తము మహోదయ! నీదయ కల్మి నీ మదో
న్మత్తుల ద్రుంచి ఈ దురభిమాన నితాంత నిరంకుశత్వ సం
పత్తికి స్వస్తిచెప్పి "నవభారత వీరపతాక" నెత్తెదన్."

భారతముపైనున్న గౌరముతో కావ్యపఠన కుపక్రమించిన పఠితకు ప్రస్తుత భారతీయున కనువగు ప్రబోధము నందించెడి వీరకావ్య మిది. ప్రాఁత నీటిలో క్రొత్తరుచులు పంచిపెట్టు రసస్వరూప మిది.

౩. నేతాజీ - శ్రీ జి. జాషువ :

జాతీయనాయకుల జీవితములలో స్వాతంత్ర్య సాధనోన్ముఖమైన రసవ ద్ఘట్టములఁ జిత్రించిన ఖండకావ్యములలో శ్రీ జాషువా కృతమగు 'నేతాజీ' రసవత్తరము.

భారత స్వాతంత్ర్యయోధులలో కత్తిబట్టి విజయముసాధింప యత్నించిన మేటివీరుఁడు నేతాజీ. గాంధీ పద్ధతికి విరుద్ధమార్గ మాతనిది.

"కత్తుల్ బట్టక స్వేచ్ఛరా దెపుడు చర్చా పద్ధతుల్ పూర్తిగా
చిత్తైపోవు నటంచు గాంధిమునితో సిద్ధాంతముఁ జేసి భూ
భృత్తుల్ దెల్లని చక్రవర్తులు భయాప్తిన్ గ్రుంగి కంగారుగా
నెత్తించెఁ యవరెస్టు నెత్తములపై హిందూరణస్తంభముఁ."

విద్యుత్తువంటి తన యుత్తేజమును జాతియందుఁ బ్రేరేపించినాఁడు 'నేతాజీ' దేశమంతయు నాజాదుహిందుఫౌజు కమ్మని ప్రబోధించినాడు.

"పల్కు పల్కున నిప్పులొలికి రక్తము పొంగు పౌరుషాంశంబు లుపన్యసించి
అడుగు జాడలలోన నడచి చెప్పినచోట నిలచి పోరాడు సైనికులఁగూర్చి
దరిదాపులేని దుర్భరదాస్యమునఁ గుందు తల్లి కన్నీరు ప్రత్యక్ష పఱిచి
విస్మృతమైన గంభీర భారత బాహుపాండిత్యపటిమ జ్ఞాపకముచేసి

స్వీయసంస్థదిశలఁ జెలఁగీ ప్రోజ్జ్వలముగా పల్లెపల్లియలకు పర్యటించి
............వంగసింగంబు వీరరసము నోలి నూఱిపోసె."

పరదేశీయుల శృంఖలములందు చిక్కి శోకించు భారతమాత కన్నీరు అతని యెడద నుడుకెత్తించినది. ఆమెమాటలతనిలో సుప్తిఁగొన్న స్వాతంత్ర్యకాంక్ష నుబ్బెత్తుగా రెచ్చగొట్టినది.

"అర్ధచంద్ర ప్రయోగాంతంబునం గాని తొలఁగిపోదీ తెల్లదొరతనంబు
త్యాగవీరుల రక్తదానంబునం గాని దర్శనం బిడదు స్వాతంత్ర్య సంధ్య
నెనరింతలేని శాసన శస్త్రమునగాని తగ్గదీకుల విభేదాల కణితి
కులము కత్తిలేని కలముపోటున గాని చావదీ యజ్ఞాన సర్పఘాటి
మేలి ఖద్దరు పగటివేషాలు చూచి బెదర దెన్నఁడు పగవాని పెత్తనంబు
బహుమతాంతర చంచలాశ్వములమీఁద సాగునే స్వరాజ్యానంద స్వర్ణరథము."

అని భారతీయులకు స్వాతంత్ర్యపుబాటనుఁ జూపినాఁడు. వారిని బ్రిటిషువారి కెదురునడిపినాఁడు. కాని కాలము కలిసిరాక పరదేశవాసియైనాఁడు. భారత దేశమునకు శాంతి యనునదైన ట్లితరమార్గము లతుకవేమో! కాని పరదాస్య పీడనచే బాధపడిన భారతీయుని యభిమానహృదయము స్పందించి వీరగీతము లాలపించిన మధురస్మృతి నేతాజీ వీరరసైక జీవితము. జాషువగారి తేనె లూరు చెలమవంటి కలమునఁబడి, యది మఱియు మధురతరమై తెలుఁగు వారల కమృతలహరి యైనది.

## ౪. విశ్వనాథనాయఁడు - శ్రీ సి. నారాయణరెడ్డి:

మాత్రాబద్ధమైన గేయ ఛందస్సుగైకొని కావ్యరచనము సాగించుచున్న శ్రీ నారాయణరెడ్డి గారి 'విశ్వనాథ నాయఁడు' వీరరస ప్రధానమైన చారిత్రక (లఘు) కావ్యములలో నెన్నఁదగినది. రెడ్డిగారు యువకవులలో ప్రతిభా సమన్వితులు. ఎంతనీరసమైన వస్తువైనను గైకొని తన కలములో దానికి జీవముఁ గల్పించి రసాప్లుతము చేయగల సమర్థుఁ డాతఁడు. శృంగార వీరరస ములలో వీరికభినివేశము హెచ్చు. గేయకావ్యములు వ్రాసి మెప్పించుటలో నవ్యసాహిత్యమున శివశంకర స్వాములవారి తరువాత వీరికొక ప్రత్యేకస్థాన మేర్పడుచున్నది. వీరి నాగార్జున సాగరమువంటి రసహృదయమునుండి పొంగి పొరలి జలపాతాలుగా విశ్వగీతులెన్నో యింకను స్రవించి తెలుఁగుసీమను రసార్ద్రము చేయవలసియున్నది.

ఈ కవి గుండెల తలుపులు తెఱచి తెలివెలి లోకమునుగాంచిన యజ్ఞాత ప్రప్రథమ చరిత్రవీరుఁడు విశ్వనాథనాయఁడు. దయామయుఁడు, ధర్మమూర్తి, తెలుగు రాయఁడు, సాహితీ సమరాంగణ సార్వభౌముఁడయిన కృష్ణరాయల ధర్మచరిత్ర చ్ఛాయలలో జీవిత క్షేత్రమున బంగారుపంట పండించుకొనినవాఁడు నాగమనాయకుఁడు; రాయలమనసునకెక్కినజోదు. విశ్వనాథుని దయాకిరణము వలన తపఃఫలముగా మల్లికాంబా నాగమ నాయకుల కుదయించిన పుణ్యముల పంట విశ్వనాథ నాయఁడు. దైవప్రసాదుఁడగు నీతఁడు పుట్టుకతోడనే ధీరోదాత్తుఁడైనాఁడు. జీవితమొక ధర్మజ్యోతిగా ప్రభుభక్తికి నీరాజన మిచ్చినాఁడు. స్వార్థము, కృతఘ్నత. ఆశ, అధర్మము, మాత్సర్యము, అన్న శత్రువుల జయించిన వీరమూర్తి అతఁడు. ధర్మఘాతకుఁడు తండ్రియైనను లెక్కింపక శిక్షించెడి యమల దృఢవ్రతుఁడు. ఇతఁడు పుట్టిపెరిగిన గడ్డ అటువంటిది. అచట

"ద్విజకోటి నిఖిల శ్రుతి హితమ్ముగా పాడిచాలు నిజధర్మ నిష్ఠాగరిష్ఠత్వమ్ము"

మాతృదేవి మల్లికాంబ – శిశువైన విశ్వనాథునికి ధర్మవీరము నుగ్గుపెట్టినది. అది యతని జీవనాళములలో కరిగి ప్రవహించి తేజమును పెంచినది. పట్టుపొత్తిళ్ళలో బంగారు మొలకవలెనున్న విశ్వనాథ బాలమూర్తి:

"కాళ్ళేతు లిట్టట్టు కదిలించు చిట్టెమ్ము గట్టిన అధర్మమును నెట్టివేసిన యట్లు
కేరింతలిడుచు పిడికిళ్లు పట్టును భవిష్యద్వైరి లక్ష్మీహస్తగ్రహణసూచనగ."

పాలబుగ్గల బాలుఁడై "జనని కౌఁగిట ఆకుచాటు పిందియవోలె" గడిపిననాళ్లలో

"కఱ్ఱనొక్కటి బట్టి కత్తివలె ఝళిపించు
కుఱ్ఱనొక్కనిఁ బిల్చి గుఱ్ఱమని అదలించు
ఇంక కొందరిని రప్పించి మొగ్గరములను
పన్ని 'కో' యని యార్చి పైబడి చెదఱగొట్టు
హుమ్మంచు మెట్లపైనుండి క్రిందికి దూకు
కోటకొమ్మలనుండి కుప్పించెనో యనఁగ."

అతఁడు తెలుఁగింటి యభిమన్యుఁడైనాఁడు. బాలచంద్రుని యపరావతారమైనాఁడు.

"మహత స్తేజసో బీజం బాలో௨యం ప్రతిభాతిమే
స్ఫులింగావస్థ యా వహ్ని రేధపేక్ష ఇవ స్థితః"

అన్న కాళిదాస శాకుంతల సప్తమాంకమునందలి భరతకుమారవర్ణన మితనియం దన్వర్థము.

విశ్వనాథనాయఁడు ప్రావృధులయొద్ద గంభీర యౌవనారూఢుఁడై నాఁడు. అతని మంగళమూర్తినిగన్న "రాయల కేవో క్రొత్తయాశాసిరులు చేదికొన్నట్లనిపించెను". తన సేనానిగా నాతనిని గౌరవించినాఁ డా ప్రభువు. ఇంతలో నాక్రాంతనిజరాజ్యుఁడును, హతాశుఁడును, చోళరాజును అగు చంద్రశేఖర పాండ్యుఁడు రాయల శరణువేడెను.

> "పాండ్య భూపతికోర్కె ధర్మ నిబద్ధమైనదిగానచోళుని
> ఉక్కణంచెద నంచు అభయమ్మొసగె దీనావనుఁడు రాయలు."

రణనీతిలో తలపండిన నాగమనాయకునియం దా భారము నుంచెను. అతడు సామర్థ్యముతో రాచకార్యముఁదీర్చెను. స్వీయబాహుబలమున నుద్ధరింపఁ బడిన తంజాపుర రాజ్యలక్ష్మి వైభవముగాంచిన నాయని యెడందలో కొన్ని దశాబ్దాలనుండి గుట్టువెట్టిన స్వార్థము మోసులెత్తినది. తనకుమారున కా రాజ్యము స్వాతంత్ర్యముతో నంటఁగట్టవలె నని మనసుపుట్టినది. వెంటవచ్చిన పాండ్యుని పాఱఁద్రోలి గద్దియ తనదని యెక్కి కూర్చుండినాఁడు. రాయలకన్ను కొలఁకులతో రక్తిమ యుదయించినది. కొమరుని గుండియలో కొఱవులు రగుల్కొనినవి.

> "మోహమేదో క్రమ్మి రాజద్రోహమునకై కాలుద్రవ్విన
> వాఁడు మన కాప్తుండెయైనను వధ్యుఁడే - ఇది ధర్మమార్గము
> నాయఁడింతకు ప్రభుద్రోహమొనర్చె; అతని రెండు రెక్కలు
> గట్టితీసుక వచ్చి యిట నిలబెట్టుజెట్టి యెవండొ తెల్పుఁడు."

అని రాజసింహము గర్జించినది. "అధర్మభీతాంతరుం డయిన" విశ్వనాథనాయఁడు ముందుకుఱికి తండ్రిని బంధింతునని భీకరప్రతిజ్ఞ చేసినాఁడు. తండ్రి కొడుకుల మమకారము ధర్మాగ్నిలో భస్మమైనది.

> "కన్నతండ్రి యటన్న నెవ్వఁడు కరిగిపోవడు ? కాని స్వామీ !
> ధర్మదండము పూనినప్పుడు తండ్రి యెవ్వఁడు ? తనయుఁ డెవ్వఁడు ?"

> "ఫలాసక్తిని వీడి ఋజు కర్మలనుఁ జేయుట శిష్టమార్గము
> వెలిగిపోవుటలోనె బ్రతుకును వెచ్చపెట్టిన దీపమట్టుల "

"స్తుతులకో సమ్మతులకో యీ ప్రతినబూనగ లేదు ధర్మ
క్షతినిఁ జూడగలేక ధ్వజ మెత్తితిని నను దీవింపుము ప్రభూ."

అని విశ్వనాథునిలో ధర్మవీరము ధారాధరమువలె వర్షించినది.

"ఎంతగా ప్రభుభక్తి యున్నను ఇంత సాహస కార్య మన్నది
చరితలో క్వాచిత్కమే! నీ చర్య జగతికి క్రొత్తపాఠము."

పితృప్రేమ, ధర్మభీతి విశ్వనాథుని గుండెలో యుద్ధము చేసినవి. చిట్ట చివరకు గీతామృతము నూని విల్లుచేఁబూనిన గాండీవియైనాఁడు నాయఁడు.

"ఘూర్ణిల్లి పోవు హృదయార్ణవములో నెటులో
దాటింప నెంచె నిజధర్మ దీక్షా నౌక!"

మనస్వి యగుటచే నతడట్టిస్థితికి గుఱియైనాఁడు. మనీషియగుటచే దానిని తరించినాఁడు. తలిదండ్రుల కన్నీట తడిసిన గుండెతో తంజాపుర కోటలో—

"ఒక్కమాట మరలమరల నొక్కి చెప్ప సాహసింతు
స్వామిద్రోహము చేసిన జనకుఁడైన శిక్షార్హుఁడు."

అని హుంకరించి ప్రతాపము వెలయించి యినుపగొలుసులతోఁ దండ్రిని బంధించి విజయనగర ప్రభువు కొలువు కూటమున నిల్పి—

"ధర్మవీరమునకు జయపతాకమైన విశ్వనాథ
మూర్తినిఁ గని గవుల డెందములు కావ్యములై వెలసెను."

ఇంతటి యావీరమూర్తి—

"యుగయుగాలనుండి వెల్గుచుండిన ధర్మాగ్ని కుండ
మున నేనొక గరిటెడు నేయిని బోసితి."

నని తన నిరహంకార సత్యశీలముఁ బ్రకటించి అవికత్థనుడైనాఁడు. విశ్వనాథుని ప్రభుభక్తి యతని వినయాతిశయమునకు పరాకాష్ఠ. అతఁడెంత పండితుఁడో అంత వినయవంతుఁడు. ఎంత ధర్మజ్ఞానియో అంత కర్మశూరుఁడు.

"అతని చరిత్రము ధర్మవ్రత పృతనాధిప కోటి
రత్రేణికి కల్కి వచ్చల తురాయిని కై సేసెను."

## ౫. ముసలమ్మ మరణము – కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారు.

సాంఘిక లఘుకావ్యములలో జానపద జీవితేతివృత్తమును గైకొని త్యాగధర్మవీరములు ప్రధానముగా రచించి ప్రసిద్ధ నవ్యమార్గము నావిష్క

రించిన వారు, కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారు (1880-1951). వారు రచించిన "ముసలమ్మ మరణము" వారి కాకీర్తి తెచ్చినది. "విషాదాంతమైన ఈ కావ్యము వీరరస ప్రధానమై ఒక వీరనారి నిస్స్వార్థత్యాగమును నిత్య విలసితముగాఁ జేసినది. అంతవఱకు వచ్చిన కవితాసంప్రదాయములను వర్ణన విధానములను, కవి సమయములను పూర్తిగామార్చి ఒక విప్లవమునకు అంకురార్పణము చేసినది......ఈ కావ్యరచన అనేకవిధముల నూతనపథములను త్రొక్కి రానున్నతరములవారికి మార్గదర్శకమైనది. అందుచేత రెండు శతాబ్దుల మధ్యయుగ సంధివర్షమున నిది యుదయించుట ఎంతయును దైవికముగా నున్నది. అంతవఱకు తెలుఁగులో వచ్చిన కావ్యములన్నియు ఒకేరీతి, ఒకే త్రోవ; పాడినదే పాడరా యనునట్లు ప్రాతపురాణములను పాడినవి; లేక ప్రబంధకావ్యములలో నేలవిడిచి సాముచేసినది. ఈ సాహిత్యమును పరికించుచో అవి ఆంధ్రదేశముననేకాదు అవి యెక్కడనైనను జరుగవచ్చుననిపించినవి. అట్టి కాలమున ఈ నూతనభావములతో నొక మనోహరపథమును ప్రదర్శించిన గౌరవము కట్టమంచివారికి దక్కినది."[1]

కుంభవృష్టికి బుక్కరాయసముద్ర ముప్పొంగిపోయినది. రైతులడరి పోలేరమ్మకు పొంగళ్ళుపెట్టి జాతరలుచేసిరి. అసలు కారణ మాకాశవాణి పేర్కొనినది.

> "బసిరెడ్డికి గడ కోడలు ముసలమ్మ యనంగ నొప్పు పుణ్యాంగన తా
> వెస బలిగా బోయిన మీ కిసుమంతయు కష్టమెన్న డేలా కలుగున్."

అని. ముసలమ్మలో త్యాగము మోసులెత్తినది. ప్రాణికోటి రక్షించు పవిత్రాశయమున కసువులు బలిగాజేయుట కామెయెడంద తురంగలించినది. చిఱునవ్వుతో, ఆనందబాష్పములతో సముద్రమంత గాంభీర్యముతో భర్తకుఁ దన నిశ్చయముఁ దెల్పినది. భార్యయే పంచప్రాణములుగా బ్రతుకు నాతఁడామె కనుమతి నీయజాలక నిరాకరించినాఁడు. బెబ్బులి గోవుపై కుఱుకఁబోవుట చూచి బిట్టఱచు వృషభేంద్రుఁడైనాఁడు. ముసలమ్మయు నాతనికి ధైర్యము చెప్పి యొప్పించినది. ఆమె కన్నులలో వెలిఁగెడు దివ్యకాంతులఁ గాంచి యతఁడు నిశ్చేష్టుఁడైనాఁడు, నిరుత్తరుఁడైనాఁడు. అట్లే యాసాధ్వి అత్తమామలయొద్ద ననుమతిఁ గొని ప్రళయపయోధివలె నున్న బుక్కరాయ సముద్రమున లక్ష్మివలె దూఁకి చల్లని నీటియొడిలో శాశ్వతముగా నిద్రించినది; అఖండ

1. ఉషఃకిరణాలు - 'శ్రీవాత్సవ' - పుట 203-205

కీర్తి నార్జించినది. గ్రామదేవతగా పూజల నందుకొన్నది. ఆమె నీటఁ బడిన వైనమిది :

"కన్నెఱ్ఱవారిన ఖరకరోదయకాల మల్లనగ్రమింగు జాబిల్లి యనఁగ
జ్వలదగ్ని శిఖలపై నెలనవ్వుతో బోవు ధాత్రీమహాదేవి తనయ యనఁగ
కెందామరల బారు సుందరమగు లీల నల్లనల్లనఁ జొచ్చు నంచ యనఁగ
కాలమహాస్వర్ణకారకుండాగ్నిలో కరఁగించు బంగారు కణిక యనఁగ
ప్రళయ కాలానల ప్రభాభాసురోగ్ర రంగదుత్తుంగ భంగ సంఘాతములకు
గలకనొందక దరహాసమలర, మందమందగతిబోయి జొచ్చె నమ్మగువ నీట."

బుక్కసముద్రమునకు బడబాగ్నియైన దీ వీరనారి త్యాగాగ్ని. "ఈ చిన్న పొత్తము ముఖ్యముగా స్త్రీలకుగా జేయబడినది. వారి కుపయుక్తముగా నొప్పినయెడల నా ప్రయాస సఫలత నొందినట్లే" యన్న రెడ్డిగారి యాశయము సాఫల్యము నొందినది.

రామలింగారెడ్డిగారి మార్గము ననుసరించిన వారిలో బ్రసిద్ధులు రాయప్రోలు, దువ్వూరి రామిరెడ్డి ప్రభృతులు. 'కాకమ్మకథ'వంటి జానపద గేయ కర్తవంటివారుగూడ అజ్ఞాతముగ నీతనిబాటనే సమర్థించుచున్నారు.

## ఉ. నలజారమ్మ మరణము – కీ. శే. దువ్వూరి రామిరెడ్డిగారు :

దువ్వూరి రామిరెడ్డిగారి 'నలజారమ్మ' ముసలమ్మ కనుఁగు చెల్లెలా యను భ్రాంతిఁగొల్పించును. ఆమె నీట మునిఁగినది. ఈమె చితికెక్కినది. గూడూరు వాసియై వాసికెక్కిన పెంచెలరెడ్డి కుమార్తె వెంకటరెడ్డి భార్య సాధ్వి నలజారమ్మ. ఆమె సోయగము గంగయమున నదులు కలిసి పాటినరీతి శోభిల్లును. ఆమెకు దైవభక్తి, పతిభక్తి పుట్టుకతోవచ్చిన సహజ గుణములు. దయాగుణము ఆమె స్నేహప్రవృత్తికి జ్యోతివలె వన్నెఁదెచ్చినది.

"ఇంటికి నమ్మ! భిక్షమని యెవ్వరు వచ్చినఁ బొమ్ము పొమ్ము నీ
వంటిరు చాలమంది యని వాదులు సల్పక పప్పొ బియ్యమో
వంటకమో తగుంగొలఁది వచ్చిన యర్థుల కిచ్చి పంపు వా
ల్గంటి ప్రమోద చిత్తయయి కల్గిన దిద్దియె యంచు చెప్పుచున్."

వేయి నోముల పంటగా నొక్కమొలక నలజారమ్మను తొలి బాలింత నొనర్చినది. పంటచేనిని కాపు కాచుటకై వెడలిన వెంకటరెడ్డి రాత్రిళ్లు జొన్న చేలు పాడుచేయు చున్నలను పందులను తోలితోలి స్రుక్కి నిదురపోయి లేచి

యా మత్తులో నొక మాదిగవాని చేనిలో గంకులు కోసెను. అదిగని మాదిగ వాఁ డూరిపెద్దయైన పెంచెలరెడ్డికి పిర్యాదు పెట్టెను. అల్లుని దొంగతనమునకు శిక్ష నారెడ్డి కూతురు నడిగెను. ఆమె "ఒక మానిసి చౌర్యము సల్పఁ గోర్తయే దవిలిన శిక్షయంచు" పూర్వ ప్రసిద్ధ ధర్మసూత్రమునుఁ బ్రవచించెను. వెంకట రెడ్డి చేసిన పని ప్రమాదవశమని యెఱింగిన మామ అతనిని "ప్రమాదో ధీమ తామపి" యన్న న్యాయమున శిక్షనుండి తప్పింప యత్నించెను. కాని తన తండ్రి కీర్తి కది కళంకమగునని భావించి నలజారమ్మ దానిని వారించెను. "వెలుంగు నిప్పుకల్ గనకయ త్రొక్కినం బదము గాలక యుండునె ? ధర్మ మార్గమున్ తొలంగినన్ బరులు మాన్యతఁ జూతురె ? నింద తప్పునే?" యని తన వాదము బలపఱచుకొనినది.

ధర్మభీతుఁడగు భర్తనుఁగాంచి యా వీరనారి—

"విను హృదయేశ నా పలుకు వీరుల వంశమునందుఁ బుట్టి యీ
దినమున నిట్టి దుర్యశముఁ దెచ్చిన యల్లుని శిక్షసేయకే
తనయనుఁ జూచియేమొ నిజధర్మము పెంచెలరెడ్డి దప్పెనం
చను నపకీర్తిరాని విధియారసి యట్లు చరింపఁ జెంపగున్."

"సతము శరీరమందుఁ బెలుచం దలపోయుటెకాని వృంత సం
చ్యుత కుసుమంబు రీతి నెటనో యొకచోటను నేఁడొ రేపొ యె
వ్వితముననైన నేలఁబడు; విశ్వమునందు యశంబె నిత్యమై
పతి విలసిల్లు దిఙ్ముఖ విభాసితమై సుజన ప్రపూజ్యమై."

అని యుద్బోధించినది. సతి పల్కులలోని గంభీర సత్యమును గమనించిన భర్త మాఱు పల్కలేక తద్వియోగదుఃఖమునఁ గ్రుంగిపోయినాఁడు. తానును వెంట వత్తుననియు, అది పతివ్రతాధర్మమనియు నలజారమ్మ యుత్సహించినది. చెంగట నున్న పసిపాపను మనసార చివరిసారిగా ముద్దిడినది.

"జాలువా బంగారు డాలుజిలగజాలు హారిద్ర చేలంబు నంటఁగట్టి
పసుపు నిగ్గులుదేరు ఫాలభాగంబున సిందూర తిలకంబు పొందుపఱచి
కన్నుగల్వలు కొంత వన్నె మీఱఁగ గ్రొత్త కాటుక రేఖలు నీటు పఱచి
గుబగుబ నెత్తావి గుల్కెడు జవ్వాది కలపంబు బాహులఁ గలయ నలఁది
సన్నజాజులు మల్లెల సరులు కీలు గంటునకుఁ జుట్టి."

సహగమనమున కేగునా ముత్తైదువ భర్తవెంట నిలిచినది. పతివెంట నగ్నిగుండ మునఁ బడబోవు నలజారమ్మను ఆమె తల్లిదండ్రులు ఆర్ద్రిముగా వారించినారు. అచంచల దీక్షామతియైన యాతన్వి,

"నాకొఱకు గాదె నా పతి వీఁకనుఁ బ్రాణంబు విడిచి విశ్వమునందుం
బ్రాకట యశమును పొందెను నాకును నట్టిదియ సూవె న్యాయము తల్లీ."

అనుచు—

"మందహాసము సెలవులఁ గ్రందుకొనగ నగ్నిగర్భంబు సొచ్చె నయ్యతివమిన్న"

"సాంధ్యరాగచ్ఛటా సంఛాదితాస్తాద్రి కటక సంచర దభ్రఖండమనఁగ
జలజరాగపరాగ కలితోర్మి మాలికా డోలికా చంచన్మరాళ మనఁగ
బల్లవితాశోక పాదపాశ్రయనవప్రసవ భారానత వల్లి యనఁగ
గైరిక సింధూర కలిత పూర్వాచల పీఠస్థ పూర్ణేందు బింబ మనఁగ
సతి రహించెను గుండానఁ జటుల వహ్నిశిఖలు నల్గడ వ్యాపించి చిటపటోగ్ర
శబ్ద భీమంబులై ధూమచయము గ్రక్కఁ బ్రేక్షకావళి గుండెలు పెటిలిపోవ."

## ఖండకావ్యములు - ప్రబోధకవిత్వము

నవ్యసాహిత్య ప్రక్రియలో ఖండకావ్యరచన అగ్రతాంబూలమందినది. ఖండకావ్యములు కవినాయకములై, భావప్రధానములై, ప్రకృత్యుపాసన, మధుర భావన, విమల శృంగారపోషణ, ప్రబోధము అను ప్రయోజనములతో ప్రధానముగా వెలసినది. వీనిలో జాతి చైతన్యము నభిలషించి కవులు దేశభక్తి నుద్బోధించు ప్రబోధగీతము లాలపించిన ప్రబోధకవిత్వశాఖ వీరరసాలంబన మగుచున్నది. స్వాతంత్ర్యోత్సాహము నుత్కటముగా కవిత్వరూపమునఁ బ్రదర్శించుచున్న కవిని విభావముగా పఠితలు గ్రహించి యతనియందు తాదాత్మ్యమును పొంది స్వాతంత్ర్యవీరులై సమరమున దూఁకినారు. దేశనాయకులతో పాటు కవులును ముందునిలువఁబడి ప్రజల కాధ్యాత్మికశక్తి నందించి వారిను త్తేజపఱచినారు. ప్రబోధము దేశ స్వాతంత్ర్యైక లక్ష్య లక్షితమైనను, వారి దృక్పథములనుబట్టి ప్రబోధకవులు ముత్తెఱఁగులు. 1. ప్రపంచాభిమానముతో మానవజాతి నుద్దేశించి ప్రబోధ మొనర్చినవారు 2 ఆంధ్రప్రజానీకము నుద్దేశించి రాష్ట్రాభిమానము పెంచువారు 3. ఒక్క రాష్ట్రాభిమానముతోడనే ఆగక కాలానుగుణ్యములైన దేశహితమును బోధించువారు. వీరు ప్రాచీనదేశ వైభవముల గీర్తించి యట్టి జాతిగౌరవము నిలువబెట్టుడని యొక్కొక్కసారి, ప్రస్తుతస్థితినిఁ దెల్పి దానినుద్ధరించుడని యొక్కొక్కసారి భావి ఉజ్జ్వల భవిష్యత్తును జూపించి దానిని సాధింపనుత్సహింపు డని యొక్కొక్కసారి జాతిని ప్రబోధించి, యాత్మగుణదోష చర్చలు చేసియు, జాతివీరుల గాథలు తెల్పియు

పరప్రభుత్వపు దురహంకారమును, దురాచారమును, దుష్కర్మలను ఏకరువు పెట్టి నిందించియు ప్రజలలో స్వాతంత్ర్య చైతన్యముఁ గల్గించిరి.

"జాతీయతా భావమును ప్రబోధము చేసిన మొదటివ్యక్తి గురజాడ అప్పారావు దేశభక్తి గీతములనబడు—

"దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్ గట్టిమేల్ తలపెట్టవోయ్
దేశాభిమానం నాకు కద్దని వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూనియేదైనాను వొకమేల్ కూర్చి జనులకు చూపవోయ్.

* * *

స్వంతలాభము కొంత మానుకు పొరుగు వాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్."

ఇటువంటివి పదునాల్గున్నవి. ఇందు కొన్ని కేవలము సూక్తులవలె నిలిచిపోవు నన్నను—ఇవన్నియు స్వతంత్రతా సంబంధి యుద్యమమున కున్ముఖులుగా ప్రజను బోధించినను వీనియందొక పరమోత్కృష్టమైన జాతీయతా ప్రబోధ మున్నది. కనుక నీ గేయము సామాన్యములైన—

దేశమాత సేవచేయండీ - జనులార మీరలు - దేశదాస్యము తొలగ ద్రోయండీ.

ఇత్యాదులవలె తాత్కాలిక ప్రయోజనమును సాధించి నశించునదిగాదు. ఇందు కవి దేశమును ప్రేమించుమనుచున్నాడు. ఆ ప్రేమశబ్దము బహువిచిత్రమైనది. అర్థమయినట్లే యుండును. కాని యర్థముగాని శబ్దములలో నిదియొకటి. మొదటిది—ఈ ప్రేమయన్నది సాధారణముగా స్త్రీ పురుష సంబంధముగా లోకమున తెలియఁబడినది. ఈ యర్థము దానికి లేకపోలేదు. గాని దాని యర్థ మిది మాత్రముగాదు. ప్రేమశబ్దమున కసలైన యర్థము ఆత్మోన్నతి యని. ఈ యర్థము నేను కల్పించినది కాదు. యాజ్ఞవల్క్యుడు చెప్పిన యర్థమిది. ఆయన తన భార్యయైన మైత్రేయితో భార్యభర్తను—భర్త భార్యను— సంతానము తల్లిదండ్రులను తల్లిదండ్రులు సంతానమును ప్రేమించుట యెదుటి వారికొఱకుగాక తమ ఆత్మోన్నతికేనని చెప్పినట్టు బృహదారణ్యకము చూపు చున్నది. ఉపనిషత్తులలో బృహదారణ్యకమునకున్న వైశిష్ట్యమును చెప్పుటకు నాకు శక్తిచాలదు. గాని అది శ్రీశంకర భగవత్పాదులవారి దృష్టి నాకర్షించి నది. ఆయన ప్రత్యేకము దానికి వ్యాఖ్యానము వ్రాసెను. సకలభూతములలోను

నీ ప్రేమ యెందుకున్నదనగా ఆత్మోన్నతి కనియే సమాధానము. ప్రేమించు
మని యనఁగా నర్థ మాత్మోన్నతిని పెంచుకోమని.

అప్పారావుగారు దేశమనియే చెప్పిరిగాని హిందూదేశమనిగాని భారత
దేశమనిగాని చెప్పలేదు. దేశమన్నదానికున్న విశాలార్థము విశ్వమని. అందు
కనే ఆయన దేశమనఁగా మట్టికాదనియు, మనుష్యులనియు స్పష్టముచేసినాడు.
ఫలానా దేశమనగా ఫలానా ఫలానా యెల్లలకు లోపలి భూభాగమని యర్థము.
దేశమన్నది జాతివాచిగాదు. మనుష్యుఁడన్నది జాతివాచి కనుకనే దేశమును
ప్రేమింపు మనగనే మనదేశపుటెల్లలు చూచుకొందుమేమోనని కొన్ని యెల్లల
లోపలి మట్టిని నేను దేశమనుటలేదు, మనుష్యుల నుద్దేశించి చెప్పుచున్నానని
ఆయన చెప్పెను. ఈ అభిప్రాయముననే "పొరుగువారికి తోడుపడు"మనుటలో
నిమిడ్చినాడు. ఈ అభిప్రాయముయొక్క విస్తృతియే—

"చెట్టపట్టాల్ పట్టుకొని దేశస్థులంతా నడువవలెనోయ్
అన్నదమ్ముల వలెను జాతులు మతములన్నీ మెలగవలెనోయ్
మతం వేరైతేను యేమోయ్ మనసులొకటై మనుషులుంటే
దేశమనియెడు దొడ్డవృక్షం ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం ధనం పంటలు పండవలెనోయ్.

ఈ గేయములం దున్నది, ఆయన దేశమునవలెనే మనుష్యులు నరులు
అనినాఁడుగాని ఫలానా అని నిర్దేశింపలేదు. ఇది భారతదేశమున కెంతగా
నన్వయించునో ప్రపంచము నందలి మిగిలిన దేశస్థులకును నంతగానే అన్వ
యించును. మనుష్యజాతి మనినంతవరకీ గేయము సజీవముగ నుండనే
యుండును. ప్రేమశబ్దము దాని యసలైన యర్థమున వాడినది అప్పారావుగా
రనియే నా యూహ. ఈ శబ్దప్రయోగ విషయమున ఆయన మహాకవిఁ జేసి
నంతపని చేసినాఁడు.[1]

గురుజాడ తరువాత భారతదేశము పైనను ఆంధ్రదేశము పైనను భక్తి
భావమును ప్రబోధించి ప్రాచీన వైభవముల నుట్టంకించిచెప్పి స్వాతంత్ర్యమును
సాధింపుఁడని తెలుఁగుబిడ్డలను కేక వేసినాఁడు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు.

"శ్రీలు పొంగిన జీవగడ్డయి పాలు పాఱిన భాగ్యసీమయి
వ్రాలినది ఈ భరతఖండము భక్తిపాడర తమ్ముడా!

అని యెఱుకచెప్పి—

1. ప్రబోధకవిత్వము, వ్యాసము, డా. కేతవరపు రామకోటిశాస్త్రి.

"ఏ దేశ మేగినా ఎందుకాలిడినా ఏ పీఠమెక్కినా యెవ్వరెదురయిన
పొగడరా నీతల్లి భూమి భారతిని నిలుపరా నీజాతి నిండు గర్వమ్ము.
లేదురా యిటువంటి భూదేవి యెందు లేరురా మనవంటి పౌరులింకెందు."

అని తెలుఁగు వారలను భారత స్వాతంత్ర్యవీరులఁ గమ్మని ప్రబోధించినాఁడు! వీరు రచించిన ఖండకావ్యములలో ప్రబోధము, ఆంధ్రమాత, తమ్ముడా, ఆంధ్ర, తెనుగుతల్లి, ఆచారము, తెలుగు మాన్యము, అనునవి ప్రబోధ సాహిత్యములో చెటిగిపోనివి.

"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాఁడు"

అన్న ప్రబోధ ఖండకావ్యము దేశము నలుమూలల కవి కుమారులలో ననంత చైతన్యమును గల్గింపజేసినది. వీరి బాటలో పెక్కురు కవులు నడచి ప్రబోధ సాహిత్యమును వెలయించిరి రాయప్రోలువారి పద్యాలు పెక్కులు ఆనాఁటి తెలుగుబిడ్డల కంఠస్వరములలో నెల్లప్పుడు గాన మాధురి నాస్వాదించినవి. వానిలో నిక్కడ కొన్నిటిని పొందుపఱుతును.

"జాఱిన దేశగర్వమును చక్కనదిద్ది మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగ పాలనచేసి సమాన రాష్ట్రముల్
కూరిమి నాసజేయ తెనుగుంబుడమిన్ గఝుసేయరయ్యా దీ
ఝాంత నాంధ్రపుత్రులు! జగజ్జన ధర్మమె దృష్టి నిల్పుచున్."

"విఱిగి వచ్చిన ప్రాణ విభునకు పసుపిచ్చి వేడినీళ్ళనుతోడె కోడ లొకతె
కత్తుల తిరునాళ్ళ గవయవచ్చిననాథు గొఱకచ్చు నుడి దోలె కూతురొకతె
కులకత్తుల కృశించి కూలనున్న విశాల రాజ్య చక్రము త్రిప్పె రాణియొర్తు
కవికోకిల మృదూక్తి నవదరించెను తేనె నుడికారమున ఆడబడుచొకర్తు
విమల సాహస సౌకుమార్యములు వెలయ దిఙ్నితంబంబులందు, చిత్రించినాఁ
తమ చరిత్ర విచిత్ర పత్రముల నాడు తలప వెట్టుల జాతి చైతన్యమాంధ్ర!"

గడ్డపాఱలు గోగుకాడలవలె ముళ్ళు వేసినారట కొండవీటి రెడ్లు
తెలివెన్న రాసుల తీరున నల్లకొండలు చీల్చినారు పల్నాటి గండ్లు
శివుఁడు గంగను బోలె చెరువు గండి ప్రవాహ మాపినా రద్దంకి కాపుమగలు
ఒ-రెడేసి శిలాకవాటముల్ గ్రుద్దుల గడిపినారట తెలంగాణభటులు
అట్టి బలభద్రుల భూమి బుట్టినారు విజయకన్యక వీరగోరజము బూయ
పులికడుపు చలిచీమల పుట్టయియ్యె చూడవోయి ప్రాల్మాలికల్ వీడి యాంధ్ర"

"పినుజడల్ విరబోసికొని తాండవంబాడు ఈర్ష్యాపిశాచి నట్టింటిలోన
నవతిబిడ్డ విధాన నవయు తల్లి తనుంగు విశ్వవిద్యాలయ వీథులందు

దోషశల్యమ్ము లె తోచు నుత్సాహసంపన్నవ్య సాహిత్యపాలనమున
పిన్నలూర్ధ్వ ముఖంబు పెద్దలధోదృష్టి ఉభయ భాగోప్యపాస్తి నుత్తచూపు;
ఈయభావ వేదాంత మేమియగలదు చావు బ్రతుకులు తేలు నీ సంధియందు,
నాదు జాతి-నా దేశము నాదుభాష అను అహంకార దర్శనమందు మాంధ్ర!"

"జాటిన" అన్నపద్యము తెలుఁగు వారిలో రాష్ట్రాభిమానమును రేకెత్తించె డిది. "విఱిగిన, గడ్డపాలు" అను పద్యాలు తెలుఁగు యువతీ యువకులలో ప్రాచీనాంధ్రవీరుల పరాక్రమ విశేషచర్వణ ఫలితమైన నుత్సాహము నుబ్బింపఁ జేయునవి: "పెనుజడల్" అన్నపద్యము తెలుఁగునాట పిన్న పెద్దల దోషముల నిరూపించి జాతీయ, దేశ, భాషా స్వాతంత్ర్యసాధన కుద్యమింపఁ జేయునది.

రాయప్రోలు తర్వాత ప్రసిద్ధ రాష్ట్రప్రబోధ కవిత్వనిర్మాణ మొనర్చిన వారు విశ్వనాథ. ఈయన రచించిన యాంధ్రపౌరుషము; ఆంధ్రప్రశస్తి మున్నగు ఖండకావ్యములు తెలుగుజాతిని ఉత్సాహములో ముంచెత్తినవి. ఈ కవిసమ్రాట్టు "హృదయ స్నిగ్ధార్ద్ర సద్భావనాఖిల చైతన్యుఁడై", "పురా విదిత వేంగీపూజ్యసామ్రాజ్యగాథల యోచించుచు"—

"అస్మదజ్ఞాత పూర్వ దివ్యత్వ మొప్పు నీ పునీతావనీ ఖండ మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నా యాంధ్రశక్తి నన్నుఁ గుదింపఁ జేయుచున్న దిభృశమ్ము"

అని తన పారతంత్ర్య జీవితమును స్మరించి యుద్విగ్నుఁడైనాఁడు. ఆనాఁ డాతనిలో నాతఁ డొకఁడే కాదు, ఆతని జాతియంతయు మూర్తీభవించినది.

"వేఁగిరాజ్యపు బల్లెవీథుల చెడుగుళ్ళ రిపులఁ గవ్వించు నేరుపుల తెలిసి
ఎగురు గోడీళ్ళ సొగసులో రిపు శిరస్సుల బంతులాడు శిశులకు డాసి
చెఱ్ఱాడి యుప్పుతెచ్చిననాఁడె శాత్రవ వ్యూహముల్ పగిలించు వొఱవుగఱచి
కోతికొమ్మచ్చిలో కోటగోడల రెగప్రాకి లంఘించు చంక్రమణ మెఱిఁగి
తెనుఁగు లంతప్డె యవి నేర్చుకొనియయుందు రెన్నగా దెల్గుతల్లులు మున్ను శౌర్య
రస మొడిచి యుగ్గుపాలతో రంగరించి బొడ్డుకోయని కూనకే పోయుదురఁట!"

ఇట్టి పద్యము లానాటి యాంధ్రప్రజకు వీరరసాయనములై క్రొత్తచేవలు కల్పించినవి. తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి రాష్ట్రగానమానాడు తెలుఁగువారి బృందగానమైనది. చౌదరిగారు తెలుఁగు తల్లికిచ్చిన జోహారులు తెలుఁగువారికిచ్చిన హెచ్చరికలు ప్రసిద్ధములు. అతని-కైవారము, ప్రశస్తి, అను తాపము, ప్రబోధము, సంస్కరణము, పశ్చిమాంధ్రులు, మాతృభాష. తెనుఁగు దనము ప్రమాదము, అరవగోడు, ఆహ్వానము, పట్టాభికి జై, శతోత్సవము

ఆశీస్సు అనెడి ఖండకావ్యము లేకోన్ముఖముగాఁ నాంధ్రరాష్ట్ర సాధనోత్సుక తను దేశీయులలోఁ బొంగింపజేసినవి. తెలుఁగుబిడ్డని దైన్యస్థితిగాంచి తెనుఁగు తల్లిముందు తన కర్తవ్యమును వ్యక్తపఱచినాఁ డార్ద్రమగు కన్నులలో నీ కవి పీరుఁడు; ఉద్ధరింపుమని కై మోడ్పు చేసినాఁడు.

> "పరవేష భాషా సపర్యాతారకమౌట నాంధ్రత్వమే సగం బడఁగిపోయె
> పరఖడ్గమునకు లోఁబడి జోహారులు పెట్ట స్వాతంత్ర్య సమపేక్ష జారిపోయె
> కుల తత్త్వములు చుట్టి బలునీర్ష్యలకుదింప నైకమత్యము సర్వ మాఱిపోయె
> అసమర్థతాపంకమందు గ్రుంగుటఁ జేసి మెట్టవేదాంతముల్ మీఱిపోయె
> నలిగి పోయిన యీనాటి తెలుఁగు బిడ్డ కేమి సందేశమిత్తు తల్లీ! తమస్సు
> విడుచుచున్నది యిప్పుడిప్పుడె రవంత ఉద్ధరింపుము వీని సద్బుద్ధి లొసఁగి.

తమస్సువీడి కనువిప్పిన యాంధ్రులకు కవి యిచ్చిన ప్రబోధము ఈ క్రింది రాష్ట్రగానము:

> "తమిళ కర్ణాట బంధము బాడ్చి తెల్గుసీమను స్వతంత్రమ్ముగా మార్చువఱకు
> రాష్ట్ర నిర్మాణకార్యము నివార్య మటంచు చెప్పువారికి బుద్ధి సెప్పు వఱకు
> ఒడ్డె మాగాణమం దొదిఁగి పేర్వాసిన తెలుగు ఖండము నెల్లఁ దెచ్చువఱకు
> బళ్ళారిలో నాంధ్రభాగమంతయుఁ జీల్చి తెలుఁగు రాజ్యమ్ములోఁ గలుపువఱకు
> నిదియు నదియని లెక్కింపనేల యావదాంధ్ర విషయమ్ము నొక్కరాజ్యమ్ము జేసి
> పట్టి జయభేరిపై దెబ్బ కొట్టువఱకు తెలుఁగు పసిపాపకైన నిద్రింపఁ దగునె."

ఈ గానమే తెలుగునాయకుల ధర్మగీతమైనది.

> "ఆంధ్రకేసరి 'సైమ' నదరిపోవఁదుపాకి కెదురుగా నిలిచి ఱొమ్మిచ్చునాఁడు.
> నీలు విగ్రహము నిర్మూలించుకొఱకు నాంధ్రులు కుఠారంబులు నూఱునాఁడు
> రంగయ్యనాయ డారంభించిన శాసన ధిక్కార శరము సంధించునాఁడు
> దుర్గ చందాన మా దుర్గమ్మ చెలరేగి శాంతి సంగ్రామంబు జరుపునాఁడు."

ఈ గీతమే తెలుఁగునాట ప్రతి తెలుఁగువానినోట ప్రతిధ్వనించినది.

ఈ విధముగా రాష్ట్రోద్యమునకై ప్రజలను ప్రబోధించిన కవులు పెక్కురున్నారు. శ్రీయుతులు గుఱ్ఱము జాషువ, అడవి బాపిరాజు, బసవరాజు అప్పారావు, దామరాజు పుండరీకాక్షుఁడు, మంగిపూడి శర్మ, గరిమెళ్ళ సత్యనారాయణ, బలిజేపల్లి మొ॥వారందులో నెన్నదగినవారు. వారి ప్రబోధము లన్నియు నిచ్చట తడవినచో గ్రంథభాగము పెరుగునని భయముతో వదలుచు మచ్చునకు జాషువగారి ప్రబోధము నొకదాని నిచ్చట ఉదాహరించుచున్నాను.

"మెఱయింపవలె తెల్ల దొరసాని మొగసాల ఆంధ్రరాష్ట్రింపు సింహధ్వజంబు
పట్టింపవలె ఆంధ్రపౌరుష లక్ష్మికి కుచ్చుల నీలాల గుబ్బ గొడుగు
సవరింపవలె నాంధ్ర సాహిత్య కన్యకు కడచన్న తొంటి బంగారు భిక్ష
కావింపవలె ఆంధ్ర గాన కల్యాణికి త్యాగరాజన్యుని దర్శనంబు
అరులనదలించి బ్రహ్మనాయకుని కోడి పలికి పోయిన ధైర్య సంపద్విభూతి
పెంపు నెత్తావివలె గుబాళింపవలయు కలసిరావోయి రాష్ట్రదీక్షాతపస్వి !

## తెలంగాణ విముక్తి - దాశరథి :

తెలంగాణ విముక్తికై తెలుఁగుజాతిని ప్రబోధించి నిజాము నెదిరించిన కవికేసరులలో నగ్రగణ్యుఁడు దాశరథి. ఇతని జీవిత మొక వీరగాథ, ఇతని గళ మొక జాతి కంఠము, ఇతని పలుకొక మానవతాగీతము. అతని పేరు ప్రజాకోటి యట! పిశాచపు ముళ్ళపాదాలక్రింద నలిగి చెక్కలైన తెలంగాణా రైతును చూచి యాక్రోశించి 'యాకాశ మంతెత్తు అరచినాడు.' తెలంగాణా నిగళాలఁ దెగద్రొబ్బినాఁడు. తన రాష్ట్రము స్వతంత్రమైనది. అటు మీద – ముప్పేటగాఁ జీలిపోయిన తెలుఁగు వారి నొక్క వేణిగా సంధింప సామ యత్నముచేయ సాహసించినాఁడు. అదియు సఫలమైనది. ఇప్పుడు భారత స్వాతంత్ర్యపతాక నీడలో సొంతకాపురము పెట్టి జగమంతయు తనదిగా మానవకోటి యంతయు తానుగా విశ్వగీతుల నాలపించుచున్నాఁడు. కోటి రత్నాల వీణపై నీతఁడు మీటు మంజీర గాంధర్వ గీతాలు పునర్నవములై జలపాతాలుగా నీతని కావ్యాల నమృతాభిషేకము చేయుచున్నవి. వానిలో నక్షరమూర్తిగా దాశరథి వీరరసమూర్తియై మనకు గోచరించు చున్నాఁడు. ఇతనిపై ప్రబోధ కవిత్వము, భావకవిత్వము, అభ్యుదయ కవిత్వము చెఱగని ముద్రలు వేసినవి. కొంతకాలము మహాకవి గురుజాడ అడుగుజాడలలో— కొంతకాలము అభ్యుదయకవి చక్రవర్తి శ్రీ శ్రీ ఛాయలలో—నడచి నిశితాను భూతిని సంపాదించి వ్యక్తిత్వమును సాధించుకొనినాఁడు దాశరథి. ఇతని కలమునుండ ప్రబోధ కవిత్వము, అభ్యుదయ కవిత్వము, అధివాస్తవిక కవిత్వము, పద్యగేయ కవిత్వము, మొదలైన పెక్కు వైవిధ్యములతో కవితా స్రవంతి మంజీర నాదాలతో వెలువడినది. అతని కవిత పెక్కు పుణ్యస్నాన ఘట్టములుగల ఆంధ్రజీవనగంగ. ఆతఁడు తెలంగాణా జాతీయ వీరుఁడు, మహాంధ్ర వైతాళికుఁడు, ప్రపంచ శాంతిదూత, ఇంతింతై, మఱినింతయై మఱియుఁ దానింతై భూనభోంతరముల వ్యాపించిన అపరవామన మూర్తి.

"అవి తెలంగాణలోన దావాగ్ని లేచి చుట్టుముట్టిన భీకరాశుభదినాలు....
నాడు మానవతా నవనాగరకత తన్నుతిన్నది రాక్షసత్వమ్ముతోడ."

కవి కుమారుని కరకమలాలు ఇనుపసంకెళ్ళ రాపిడిలో నలిగిపోయినవి. బందీఖానా బ్రతుకులో వాడిపోయినవి. బడుగు రైతును పిప్పిచేసి యతని ఫలమును ఫలహారము చేసెడి క్రూర ప్రభుత్వ పిశాచమును గన్నులారఁ గాంచి దాశరథి శివమెత్తి, యెలుఁగెత్తి నల్గురు విన నిట్లరచినాడు.

"ఓ నిజాము పిశాచమా! కానరాడు నిన్బోఁ బోలిన రాజు మా కెన్నఁడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు నా తెలంగాణ కోటిరత్నాల వీణ."

దేశము నలుమూలల అగ్ని యంటుకున్నది. నిజాము విషము గుప్పించినాఁడు; ప్రజల నొప్పించినాఁడు, బంగారు గద్దెలో మూల్గుచున్న కళ్మలము, దానిలో పేరుకొన్న స్వార్థము క్రుళ్ళి దుర్వాసనల విరజిమ్మినది. దానిని భరింపలేక దాశరథి "మా నిజాం నవాబు జన్మజన్మాల బూజు" అని చీదరించుకొనినాఁడు.

"తమ మంత్రం పారదింక ఉచ్చుఁ తెంచుకొనెను జింక
ఇఁక స్వేచ్ఛా ప్రయాణము ఇదే తెలంగాణము."

అనుచు స్వాతంత్ర్యభేరి మ్రోగించినాడు. దేశము తనవెంట నడచి లక్ష్యము సాధించినది.

తెలంగాణా విముక్తితో నాగలే దతని ప్రస్థానము. చారుమీనారంత యెత్తున చూచి నాఁ డతడు నల్వంకల. ముక్కలుగా పడియున్న తెలుగు నేల యాతని గుండె బ్రద్దలుచేసినది.

"ముక్కలైన మాతృమూర్తి గేహమ్మును కూర్చి కట్టుడోయి కుమారులారా
మనము మనము కలహమున మునింగిన యెడ మన మహాంధ్రలక్ష్మి మనకురాదు"

అని యనుచు "పటుబాహాబలురైన ఆంధ్రుల గత ప్రాశస్త్యముల్ వల్లెవేయుటలో కొన్నితరాలు దాటినవి, పూర్వోదంతముల్ నేటి సంకటముల్ తీర్పవు గాక! నాటి జ్వలితాంగారమ్ము లీనాఁటి కుంపటిలో బూడిద కప్పుకొన్నవి రగుల్పన్ లెమ్ము వీరాంధ్రుడా!" అని మహాంధ్రోదయ ప్రబోధము త్రిలింగ క్షేత్రము మాఱుమ్రోగునట్లు రంకె లిడినాడు.

భారత స్వాతంత్ర్యము, మహాంధ్రోదయము సిద్ధించుటతో దాశరథి ద్వితీయలక్ష్యము ఫలవంతమైనది. చార్ మీనా రాకృతినుండి హిమవచ్ఛృంగ సన్నిభుడైనాఁడు. ప్రపంచమహాకోటి మహాపరిషత్తువలె నతనికి గోచరించినది

అంతఃకలములు, విషమంత్రములు, అవినీతి, స్వార్థము, జానిసతనము, మొ॥ పెనుభూతములు ప్రజాకోటిని ఆవరించుకొని అదిమివేయుచున్నవి. వానిని గాంచి ఆవేశముతో—

తెలంగాణాలోని కోటి ధీరుల గళధ్వనియొగాక
ఇలాగోళమం దుండెడి ఎల్లరి శబ్దాన్ని నేను.
నా పేరు ప్రజాకోటి నా వూరు ప్రజావాణి
ఎవడైనా మానవుఁడే ఎందుకు ద్వేషించడాలు
రాక్షసినైనా మైత్రికి రానిత్తును భయంలేదు....
జాంబులలో బలం చచ్చి పాములలో విషం చచ్చి
ప్రేమములో బలం హెచ్చి స్నేహములో శక్తిహెచ్చి
చిన్నపాటి యంకుశమున గున్నయేనుగును వంచే
క్రొత్తరకం పద్ధతి కనుగొన్నానండో రండో!

తటస్థ విధానముతో సర్వజాతి సహజీవనము సంధింప నభిలషించు శాంతికాముకుఁడు. అతఁడు భారతీయుఁడు, దాశరథి గొంతుకలో గూడుకట్టుకొనినాడు.

"కత్తిపట్టి గెలిచినట్టి ఘనుఁడగు వీరుం డెవ్వడు?
మెత్తని హృదయం ధాటికి తుత్తునియలు కాని దెవఁడు?
అజ్ఞానపు అడుసు కడిగి అసలు విషయ మెరుంగుడీ!
ఘర్షణలో ఏనాఁటికి హర్షం లభియింపబోదు."

అన్న శాంతి వచనము భరతజాతి స్వాతంత్ర్య సంపాదనానంతరము ప్రపంచమునకు చాటి చెప్పిన పరమసత్యము. ప్రజాకోటియం దది ప్రతిధ్వనించినది.

గౌతమబుద్ధుని వలె దాశరథి లోకమును జూచి జీవిత గుణపాఠము నేర్చికొనినాఁడు. ప్రతిప్రకృతి వైచిత్రినిచూచి దానిలోని అంతరార్థము నూహించి దానితో భావతాదాత్మ్యము నొంది, తద్వైశిష్ట్యమునకు మురిసిపోయినాఁడు. కర్కశత్వమునుగాంచి క్షుభితుఁడయి పోయెడివాఁడు. లోకము నుండి నేర్చికొనిన పాఠముగా మానవత్వమును వరించి రాక్షసత్వమును ధిక్కరించిన వీరుఁడు దాశరథి.

"కంటికి కనుపించిన దంతా కైతగా రాస్తున్నాను."

అని ప్రతిజ్ఞచేసిన దాశరథికి ముష్టివాడి శిరస్సును తన్నే అష్టైశ్వర్య సంపన్నుఁడు, అనాథుని కడుపులోని అంగారము, ఆరాటము, కళ్ళలోని అశ్రువులు, అడవి

నాగజెముడుపూలు, అణుబాంబుల డొక్కలలో ధనము దాచుకొను గిడ్డంగులు గోచరించినవి. అతని "ఎక్స్-కిరణాల కళ్ళతో" వానిని ఎక్స్పోజ్ చేసినాడు. హృదయముతో రుద్రవీణ తీగెలు స్పందించినవి. అతని హృదయములో నేవో తెలియని గాయములు నోళ్ళువిచ్చి మంటల తీపులు తీసినవి. ఆ తీపులే అతని నవీనకావ్యఖండికలు. నాకవాసుల శ్రవణపుటముల చేరువఱ కూది పల్కినాఁడు.

> "వీణియ తీగపై పదను పెట్టిన నా కరవాల ధారతో
> గానము నాలపింతు కవికంఠము నుత్తరణం బొనర్చి స్వ
> ర్గానకు భూమినుండి రసగంగలు చిమ్మెద ; పీడితప్రజా
> వాణికి 'మైక్' అమర్చి అథవాదులకున్ వినిపింప జేసెదన్."

అని పీడిత ప్రజాకోటి గొంతుకల సమైక్యకంఠమై ఖండకావ్యగానముఁ జేసినాడు దేవులపల్లి రామానుజరావుగారి మాటలలో "బ్రతుకు విలువలు నశించి పాడుపడిన యీ స్వార్థప్రపంచములో విప్లవాగ్నుల తుఫానును లేపుచున్నది నిజముగా ఈయన కవిత్వము...పీడిత ప్రజల సమస్యలకు ప్రాధాన్యత యిచ్చి గొంతెత్తి చెప్పగలిగిన కవివాణి; దౌర్జన్యము, అన్యాయము, అక్రమములమీఁద తిరుగుబాటే ఒకమాటలో దాశరథి కవిత్వము. అతని పలుకొకొక్కటి యొక్కొక్క వాగ్వజ్రము; దేవేంద్రుఁడు పర్వతపు రెక్కలు విఱిచిన చప్పుడాతని పద్యములలో గోచరించును.

> "నరజాతిఁ జీల్చి చెండాడలేచిన చేయి తెగినేలఁ బడును నా సొగసు పద్దెపు బడికి
> పొగరెక్కి కోట్లడబ్బును కిరీటమ్ముగా తగిలించుకొన్న గర్వికి భయము నాసడికి"

> "యజ్ఞఫలం దొంగిలించ నరుదెందే వారినొంచ
> జాగరూకులై చూడుడు స్వాతంత్ర్యం కాపాడుడు"

అన్న ఇతని ప్రబోధము. పెనుపిశాచపు రుధిరహస్తము స్వచ్ఛహిమాలయ శృంగమును మైలపఱిచిననాఁడు చల్లని భారతీయుని హృదయగహ్వరములో దవాగ్ని రగుల్కొల్పు వీరజ్వాల.

నవ్యాంధ్ర సాహిత్యవీథులలో ఇదివరకే ఈ నవ్యకవి ప్రతిభను చాటిన కురుగంటివారి మాటలతో నితని ప్రశంస ముగింతును.

"తెలంగాణములో ధీరహృదయముతో, నిశితవాక్కుతో, గొప్ప తిరుగుబాటును సాధించిన యువనాయకుడు దాశరథి. ఈతడ నేకులవలె ఒడ్డునకూర్చుని శ్రీరంగనీతులు బోధించినవాఁడు కాఁడు. సాక్షాత్తుగా తెలంగాణా ప్రజాసమర

ములో దుమికి శ్రీకృష్ణజన్మస్థానాన్ని దర్శించివచ్చిన సైనికుడు. కౌగలించు కొనడం వల్లగాక ఇతనికి దేశభక్తి కడుపులోనుంచే వచ్చినది. అందుకనే హృదయంలో జ్వలించిన భావానలాన్ని భాషానిలంతో స్వయంగా చెరిగిన విప్లవ బ్రహ్మకాగలిగాడు. ఈతని ఆవేశము, ఆవేదనా (శ్రీ శ్రీ పైవలె రష్యాప్రభావం లేక) సహజమూ, జాతీయము అయినవి. దీనినిబట్టే దాశరథి అభ్యుదయ కవులలో ప్రముఖస్థానాన్ని చూరగొన్నాడనవలెను"

తెలంగాణా వైతాళికులగు కవులలోఁ బేర్కొనదగినవారు. కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి, కాళోజీ, బూర్గుల, దేవులపల్లి, వానమామలై, భాగి నారాయణమూర్తి ప్రభృతులు.

## అభ్యుదయకవిత్వము - శ్రీశ్రీ :

దాశరథివంటి అభ్యుదయకవుల కందఱకును గురుస్థానము శ్రీరంగం శ్రీనివాసరావు. "అభ్యుదయ కవిత్వము ప్రబోధ భావ కవిత్వములకన్న భిన్నము. ఇది అధివాస్తవిక ధోరణికి సంబంధించినది. శ్రీశ్రీ కవితా సమితిలో (విశాఖపట్నం) సాధకుఁడుగ బయలుదేరినట్లు సలక్షణ భాషతో, అలంకారిక సమ్మతమైన కవితను చెప్పినట్లు 1928 లో ఈయన ప్రచురించిన "ప్రభవ" అను ఖండకావ్య సంపుటివలన వ్యక్తమైనది. ఈతడు సంస్కృతాంధ్రాంగ్ల కవితామార్గాల నన్నిటిని కలయజూచిన ప్రతిభావంతుడు. మొదట్లో భావకవిగా ప్రకృత్యారాధనము, ప్రేమతపస్సు చేసినవాఁడే. ఉత్తమ భావుకుఁడైన అంతర్ముఖుఁ డీతఁడు. తన ప్రథమ రచనలలో ఈయన పలాయనవాదిగా ప్రారంభమై వాస్తవిక ధోరణులలో 'ఎక్స్పెరిమెంట్లు' చేసి చివరకు అభ్యుదయవాదిగా పరివర్తనలు పొందినాఁడు. ఈతని గుండెలలో ఆవేదన, ఆవేశం హెచ్చు. వాస్తవిక లోకంపైన దృష్టి మరల్చిన కవిధీరుఁ డితడు "మరో ప్రపంచం" ద్రష్టగా నితని పేర్కొనితీరవలె."

"ఈ అభ్యుదయ కవిత్వానికి శ్రీరంగం శ్రీనివాసరావుగారిదే పెట్టింది పేరు. ఈయన అందరికన్నముందే, రష్యా విప్లవాన్ని అర్థం చేసుకొన్నాఁడు. అంతకుముందున్న మార్గాలలోనూ 'ఎక్స్పెరిమెంట్లు' చేసి ఈ మార్గానికి గూడా శ్రీకారం చుట్టినాడు. ఈ మార్గవర్తులందరికి రష్యా వ్యామోహం సమాన దర్శనం, అఁదరివీ దూకుడు రచనలే. తామే సంఘనాయకులమైన కవులమనే

'అహంకారము' అందరికి సమానమే. శ్రామికులమీద అవ్యాజానురాగము, అధికారం నెరపుతున్న అందరిపైనా ఉక్రోశమూ వీరి రచనలలో గోచరిస్తవి. యువరచయితలంతా కళ్ళు చెదిరే "అగ్నికిరీటపు ధగధగలను" "ఎఱ్ఱబావుటా నిగనిగలను" చూచి "మరో ప్రపంచం"లోకి ఈయనతో ప్రవేశించినారు. 'పతితులపైన, భ్రష్టులపైన, బాధాసర్పదష్టులపైన - 'దగాపడిన తమ్ములపైన'- జాలితో దృష్టుల నిగిడ్చి ఆయనతోపాటు "జగన్నాథుని రథచక్రాలు" వచ్చేసి ప్రజారాజ్యం స్థాపిస్తవని ఊరడించడం నేర్చుకున్నారు. అయితే ఏం లాభం ? శ్రీ శ్రీ రచనలకున్న విశిష్టత మరి వేటికి లేదనవలెను. ఈతడు సహజకవి. ఏ ధోరణిలో వ్రాసినా అతని ధోరణి ఎక్కడికి పోతుంది ? అందుకనే హృదయం ఎల్లా కంపిస్తే ఆ కంపనకి మాటల రూపాన్ని ఇవ్వడం అతనికే తెలుసు. మాటల్ని కత్తులూ, యీటెలూ, మంటలుగా మార్చడం అతనికే తెలుసు. ఇతడు ధ్వంసం చేసిన పాత ఛందస్సుల్లోనుంచి పాత మూలుగులూ Serenadings, మూర్ఛలూ, వేదాంతాలు, మత్తులూ పోయి దేశాలకీ, ఉత్సాహాలకీ కదలిపోయే యువక సేనలకి నూతనయుగ నిర్మాతలకు Back-ground Music క్రింద Marching Band క్రింద క్రొత్త రక్తాన్ని కదను త్రొక్కించే సంగీతము (చలం) ఇతని గీతాలలోనే వినిపిస్తుంది. కవిత్వ మితని కొక తీరని దాహం. 'అలజడి మా జీవితం. ఆందోళన మా వూపిరి. తిరుగుబాటు మా వేదాంతము' అంటాడీతడు. ఇతని పద బంధాలు, ఉక్తివైచిత్రీ అనుకరిద్దామనినా మరెవ్వరికీ చేతకానంత వైలక్షణ్యాము కలిగినవి."[1]

శ్రీ శ్రీ వంటి అభ్యుదయకవుల లక్ష్యమును వివరించుచు నారాయణబాబు అనిన మాటలివి : "మా కవిత్వములో ఉండగూడని వస్తువు, వాడకూడని భాష లేనేలేదు. చాకలాడు, సంతబయలు కుక్క, గాడిద కుళ్ళుకాలవ ఫేక్టరి కూత, మరఫిరంగి మందుగుండు, బీదవాడు భిక్షు వర్షీయసి అన్నీ—అవేమిటి, యివేమిటి లోకములో వున్నవన్ని ! పలాయనత్వము పనికిరాదు, నల్లమందు నిషా పనికిరాదు, జీవితం ఎంత సహారా ఎడారియైనా మేము మాత్రము ఉష్ట్రపక్షులమై సంచరించలేము. యథార్థముగ జీవితాన్ని దర్శిస్తాము. జీవితం మాలిన్య భూయిష్ఠమని ఒప్పుకుంటాము. వేలెత్తి చూపిస్తాము. జీవితంలో మాలిన్యాన్ని గాలించి క్షాళితము చేస్తాము."

1. కురుగంటి సీతారామయ్యగారి నవ్యాంధ్ర సాహిత్యవీథులు, 4 వ భాగము.

"నాటినుండి నేటివరకు శ్రీ శ్రీ నవ్యకవిత్వము కోసం అనేక అవతారాలు ఎత్తేడు. ఎన్నెన్నో మార్గాల నన్వేషించాడు ఎన్ని మార్గాలనుండి వెళ్ళినా కొసకు మానవాభ్యుదయం విశ్వశ్రేయస్సు కవి కోరుతాడు. ఇప్పటికి, ఎప్పటికీ, జాతి పురోగమనానికి సాంఘిక చైతన్యము వాంఛనీయమని ఏకైక మానవ కుటుంబముగా మానవులు వర్ధిల్లి ఈ కాళ్యపిని భూతలస్వర్గం చేసుకుందామని కవికి సామాన్య మానవునికి ఏకైకలక్ష్యము."[1]

ఈ లక్షణముతో సాఁగి శ్రీశ్రీ—

"నేను సైతం-ప్రపంచాగ్నికి-సమిధ నొక్కటి ఆహుతిచ్చాను!
నేను సైతం-విశ్వసృష్టికి-అశ్రు వొక్కటి ధారపోశాను!
నేను సైతం-భువనఘోషకు-వెర్రి గొంతుక విచ్చి మ్రోశాను!"

అని తన త్యాగయత్నాలను నిరూపించుకొనుచూ—

"నేను సైతం-ప్రపంచాబ్జపు-తెల్లరేకై పల్లవిస్తాను
నేను సైతం-విశ్వవీణకు-తంత్రినై మూర్ఛనలు పోతాను!
నేను సైతం-భువన భవనపు-బావుటానై పైకిలేస్తాను!"

అని తన యుదాత్తాశయమును లోకమునకు గొంతెత్తి చెప్పినాఁడు. సహజమైన కవిత్వధారను తానూహించిన మార్గములో ప్రవహింపఁజేయఁ ప్రతిజ్ఞ పూనినాఁడు.

"నాలో కదిలే నవ్యకవిత్వం కార్మికలోకపు కల్యాణానికి
శ్రామికలోకపు సౌభాగ్యానికి సమర్పణంగా సమర్చనంగా
త్రిలోకాలలో-శ్రమైక జీవన సౌందర్యానికి-సమానమైనది లేనేలేదని
కష్టజీవులకు-కర్మవీరులకు-నిత్యమంగళం నిర్దేశిస్తూ
స్వస్తి వాక్యములు సంధానిస్తూ స్వర్ణవాద్యములు సంరావిస్తూ
వ్యథార్త జీవిత యథార్థ దృశ్యం పునాదిగా యిక జనింపబోయే
భావివేదముల జీవనాదములు జగత్తుకంతా చవులిస్తానోయి."

అని ముందడుగు వేయుచు కవిత్వవీరము ప్రదర్శించినాఁడు.

"కార్మికధీరుల కన్నులనిండా-కణకణ మండే-గలగల తొణకే
విలాపాగ్నులకు విషాదాశ్రులకు ఖరీదుకట్టే షరాబు లేడోయి."

అని లోకమును వెక్కిరించి తన వైలక్షణ్యమును, వైశిష్ట్యమును చాటుకొని

1. ప్రవర-నారాయణబాబు.

నాఁడు. పతితులు, భ్రష్టులు అయిన ప్రజానీకమునుద్దేశించి వీపుతట్టుచు శాంతి ఫలము లభించునని ధైర్యము చెప్పినాడు.

> "స్వాతంత్ర్యం-సమభావం-సౌభ్రాత్రం-సౌహార్దం
> పునాదులై ఇళ్ళులేచి-జనావళి-శుభంపూచి-శాంతి, శాంతి, శాంతి, శాంతి
> జగమంతా జయిస్తుంది-ఈ స్వప్నం నిజమౌతుంది-ఈ స్వర్గం రుజువవుతుంది."

అతఁడొక ప్రజానాయకుఁడు. అతని ప్రయత్నా లగమ్యములు. అతని సాధన లనంతములు; అతని సోదరు లసాధ్యులు, అతని సహాయు లమేయులు. అతని మార్గము దుర్గమము. అతని దీక్షయొక కంచుదుర్గము. అతఁ డుబ్బెత్తుగాలేచిన విప్లవోత్సాహ ధర్మవీరుఁడు. జలపాతమువంటి అతని కవితలో నుద్బుద్ధమైన విద్యుత్తు లోకమునకొక వింతయైన వెలుఁగుబాట! అతఁడు——

> "గిరులు-సాగరులు కంకేళికా మంజరులు-ఝరులు నా సోదరులు
> నేనొక దుర్గము-నాదొక స్వర్గం-అనర్గళం అనితరసాధ్యం, నా మార్గం."

అని గర్జించినపుడు మనము విస్తుపోయి తలలూపవలసినవారమే.

## నాటకములు

నాటకరచన తెలుఁగు సాహిత్యములో నడుగుబెట్టి యొకశతాబ్దమైనది. పదిశతాబ్దుల సాహిత్యచరిత్రలో నిది చాల ఆలస్యముగనే ప్రారంభమైనదని చెప్పవచ్చును. దానికి హేతువుజూపుట నాపనికాదు. క్రీ. శ. 1860 సం. న కోరాడ రామచంద్రశాస్త్రిగారు వ్రాసిన "మంజరీ మధుకరీయము" అను నాటకము ఈ సాహిత్యశాఖకు తెలుఁగున శ్రీకారము. నాటినుండియు నాటక రచన తెలుఁగుదేశమున ప్రోత్సాహకరముగనే యున్నది. కాని యుత్తమ నాటకములుగా నేకొద్దియో లెక్కింపఁబడుచున్నవి. నాటకరచనా ప్రక్రియ ప్రధానముగా రంగాభ్యుదయముపై నాధారపడియుండును. మనదేశమున నింకను ఆ విషయమునఁ జెప్పుకొనఁదగినంత యభివృద్ధి కాలేదు. అందువలన వస్తువులలో వైవిధ్యము, అపూర్వ సన్నివేశకల్పనలతో గూడిన నూతన ప్రక్రియలు వేదికపై ప్రదర్శించుటకు వీలులేకుండ పోవుచున్నవి. దేశమీ విషయమును గుర్తించి తదభ్యుదయమునకై కృషిచేయుచున్నది. త్వరలో నుజ్వల భవిష్యత్తు నాశింతము! ఇట్లనుటలో నింతవఱకు వెలసిన నాటకము లుత్తమ కళాఖండములు కావని నాయుద్దేశముకాదు. ఇతన్నియు నొక మహాభవన

నిర్మాణముకై వేసిన గట్టిపునాదులు; నాటిన మూలస్తంభములు ! వాని కెన లేని గౌరవముండనేయున్నది. లేదన్నచో మూలవిచ్ఛేదమంత్రము పఠించినట్లే!

తెనుఁగు నాటకములలో వీరరసమను విషయము ప్రత్యేకగ్రంథముగా వ్రాయదగినంత విస్తృతి కలిగినది. నేనీగ్రంథమున నంత విషయము ప్రస్తావించుట తేలనిపని, దుస్సాధము ! కావున మచ్చునకై దారు నాటకములను మాత్రము ప్రస్తావించి వదలుదును. రూపకసాహిత్యమున నేఁడు 'నాటకము, నాటిక, ఏకాంకిక' అనునవి ప్రసిద్ధములైన ప్రక్రియలు.

నాటకేతివృత్తమును ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము నని ముద్విధము. ఆ విభాగమునననుసరించి యిచ్చట యుదాహరణముల నెన్నుకొంటిని. వీనిలో పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు అనియు నాటకప్రక్రియనుబట్టి విభజింపవచ్చును. ఇంకను అనువాదములు, స్వతంత్రము లనియు, పద్యగద్య చంపూ గేయనాటకములనియు భేదములను పాటింప వచ్చును.

౧. పాండవోద్యోగము - తిరుపతి వేంకటకవులు :

భారతము నంతయు తెలుఁగున రూపకసముదాయముగా సంతరించి దిగంత యశము సంపాదించినవారిలో తిరుపతి వేంకటేశ్వరులు అగ్రగణ్యులు. ఆ నాటకశ్రేణిలో నత్యున్నత కీర్తి నార్జించి నేటికిని నాటక సమాజములకును, తెలుఁగు ప్రజానీకమునకును, భుక్తిని, రక్తిని ఇచ్చుచున్న నాటకము "పాండవోద్యోగము". దీనినే పాండవ విజయము నందలి అభిమన్యు వధాది ఘట్టములతోఁ గలిపి 'కురుక్షేత్ర' మని తెలుఁగు నాటఁ బ్రదర్శించుచుందురు.

పాండవోద్యోగము వీరరస ప్రధానమగు నాఅంకముల లక్షణబద్ధమైన నాటకము. ప్రస్తావనలో శరదృతువు వర్ణితమగుటయే దానికి లక్షణబద్ధమైన సూచన ! ఇందు ప్రథమాంకమున ముఖసంధియు, ద్వితీయాంకమునఁ బ్రతిముఖసంధియు, తృతీయాంకము, చతుర్థాంకములందు గర్భసంధియు, పంచమాంకమునందును, షష్ఠాంకమున నర్జున విషాదవృత్తాంతము వఱకు నవమర్శ సంధియు, షష్ఠాంక శేషమున నిర్వహణ సంధియుఁ గాననగును. వీనినన్నిఁటి యందును వీరరసమే యుత్కటముగా నిబద్ధమైయున్నది.

ఇందు నాయకుఁడు ధర్మరాజు. మహాభారత విభాగమే యిందు వర్తించును. ఐనఁగా పాండవులందఱి దొకటేమాట ! అది ధర్మరాజాంకితము.

ఈ నాటకము నందలి యుద్యోగము (ప్రయత్నము) యుద్ధప్రయత్నము. నాటకము ప్రారంభించుటలోనే అర్జునుఁడా విషయము స్పష్టపఱిచినాడు.

"ద్రుపదుని పంపునన్ జనెఁ బురోహితుఁ డాధృతరాష్ట్రసూతి బల్
కపటి వినండు సంధిచెడఁగా గమకించెడుఁగాని. తప్ప దా
లపుఁబని ; సర్వమున్ గడపు లావు గలండు యశోదపట్టి ; యా
రిపుజన కాలుఁ దోడుగ వరించెద సర్వము నిర్వహించెదన్."

ఇందు ప్రారంభావస్థ కలదు. భావిభారత యుద్ధసన్నాహోత్సాహ మిందు సువ్యక్తము. పాండవ నౌకకు కర్ణధారునిగాఁ గృష్ణుని వరించుటకై అర్జునుఁడు ద్వారక కేతెంచినాఁడు నాటకవిస్తృతి కంతటకును మూలహేతువగు శ్రీకృష్ణ సారథ్యమున కిచ్చట బీజావాపము జరిగినది దానిని సాధించి గోపాలుని 'విజయసారథి'గాఁ బొందుటలో ముఖసంధి స్వయంసమృద్ధమగుచున్నది.

రణనీతియందు యుద్ధము దండోపాయము. ఈ నాటకము యుద్ధప్రద ర్శన ప్రధానమైనది కాదు యుద్ధోన్ముఖవశయే, ఫలముగగల్గినది. అనగా నిందు యుద్ధయత్నము సామాద్యుపాయ విశిష్టమై ప్రపంచిత మగుచున్నదన్నమాట! సామదానభేదోపాయము లీనాటకమున ధర్మజ గోవిందులచేఁ బ్రపంచితమైనవి. ఏ యుపాయము ప్రయుక్తమగునపు డద్దాని కనువగు ప్రవృత్తి పాండవు లందఱి యందును గోచరింపవలెను. లేకపోయినచో ధర్మరాజు ప్రయత్నము సాగదు.

"ఆలును బిడ్డ లేడ్వ నృపులాలములోఁ గడతేర కెల్ల చు
ట్టాలును రూపుమాయ కకటా! యిలదక్కునె! దక్కనిత్తురే?
చాలును రాజ్యభారము ; ప్రజల్ సుఖయించిన నాకుఁ జాలు ; నేఁ
జాలకఁ గాదు చూవె ; తినఁజాలను నెత్తురుకూడు మాధవా!"

అనుటలో ధర్మజుఁడు చల్లగా సామోపాయమును ప్రతిపాదించినాఁడు. పూర్వాపరనాయక ప్రవృత్తి నెఱిఁగినఁగాని ఈ యంశము బోధపడదు. దాని నెఱుగుట కీ క్రింది పద్యము చక్కని కీలకము.

"ఇంతకు సంధిమాట వినసీ వినకుండగనీ మనమ్ము ని
శ్చింత మగున్ జనంబు మనసేమమె కోరుదు రెల్లవారు నిం
దింతురు వారి నిశ్చయము, నిన్ను నుతింతురు, మాకుఁ గీర్తి ; సా
మంత నృపాలు రందఱకు మా వ్యవసాయము తేటతెల్లమౌ."

సంధి సామదానోపాయ ప్రతిరూపమని ఈ పద్యము చెప్పక చెప్పుచున్నది. సంధి కార్యమున కొడఁబడు కృష్ణునిపై భీముఁ డభిమానియై యల్గుట, అతనిఁ దూల

నాడుట, మొ॥ వానిచే బీజము (అవాంతరకారణముచే) మఱుగుపడి తత్కోప శాంతితో నది సుస్పష్టమగుచున్నది. ద్వితీయాంకమునఁ బ్రతిముఖసంధి పరి పుష్టి నొందినది. ధర్మజుని సంధి ప్రయత్నము, యుద్ధమునకుఁ బురికొల్పు కృష్ణుని పల్కులు ప్రయోజన విచ్ఛేదముగాకుండ బిందువను అర్థప్రకృతిని సంతరించి పెట్టుచున్నవి.

తృతీయ చతుర్థాంకములలో శ్రీకృష్ణ రాయబారఘట్టము వర్ణితము. కృష్ణుఁడు పాండవ దూత. ఇరువురకుఁ గావలసిన బంధువు. అందువలన స్వాతంత్ర్యముతో మెలఁగినాఁడు. నయమున భయమునఁ జెప్పి చూచినాఁడు. అతని మాటలు విని భీష్మాది కురువృద్ధులు, ద్రోణాది గురుజనులు, నారదాది ఋషిపుంగవులు, ధర్మరాజును బలపరచిరి. కర్ణాదులు తద్విరుద్ధముగా రారాజును బలపఱిచిరి. ఇరుపక్షములవారు వాదనలకు దిగుటతో బీజము స్ఫుష్టాస్పష్టముగా గోచరించును. అది నాల్గవ అంకమున ప్రాప్త్యాశకు దారితీసి, సాంగముగా గర్భసంధి ప్రయుక్తమగుటకుఁ దోడ్పడినది. కురుసభను రణరంగ మొనర్చినప్పుడును, కర్ణుని పాండవపక్షపాతిగా నొనర్ప యత్నించినప్పుడును శ్రీకృష్ణుడు ప్రదర్శించిన భేదోపాయము అత్యద్భుతము! శత్రుమర్మముల నెఱిఁగి, ధర్మజుశీలమును కురుసభలోఁ జాటి యుపప్లావ్యముఁ జేరిన కృష్ణుని రాయబారము సంధియత్నమున విఫలమైనను యుద్ధోన్ముఖమై సఫలమే యైనది. నాటకలక్ష్యమే అది!......

పంచమాంకమున విమర్శసంధి కలదు. బీజార్థము పాండవులయందు క్రోధ వ్యసనాదులు నిందు ప్రదర్శితము లైనవి. కర్ణు నర్ధరథుఁ జేసి భీష్ముఁడు తన నవమానముచేసినాఁడని గాండీవి ఖిన్నుఁడగుట, కురునాథుని యులూక రాయబారమునకుఁ బాండవులు క్రుద్ధులగుట, షష్ఠాంకారంభమున అర్జునుఁడు బంధుహింస నుద్దేశించి దుఃఖించుట మొ. అవమర్శసంధి బంధములే.

ధర్మజుడు తన 'యుద్యోగమును' షష్ఠాంకమున సాంగముగా ప్రదర్శిం చెను. సంధి రాయబారముచే స్నిగ్ధమైయున్న భీష్మాదుల హృదయములను స్తుతులచే తనకనుకూలపఱుచుకొని విజయమార్గము సిద్ధపఱుచుట, యుయుత్సా దులు తనవైపువచ్చు నవకాశముఁ గల్పించుట అనునవి యుద్ధసన్నాహము యొక్క చివరిదశలు. వానిని నిర్వహించుటలో నద్భుతము ననుసంధించి కవులాయంకమును సలక్షణముగా నిర్మించియుండిరి.

లక్షణభాగమటుంచి పాత్రల మనఃప్రవృత్తులఁ గాంచినను ఈ నాటకమున వీరరసస్ఫూర్తి గాంచని యుత్తమపాత్ర లేదు. అనఁగా స్త్రీ, బ్రాహ్మణ భటాదులీ యుత్తమపాత్రలందు రారని నా తాత్పర్యము. ధర్మరాజు 'మెత్తని పులి' వలె యుద్ధయత్నము సాగించినాఁడు. భీముఁడుద్ధతుఁడైనను ధర్మరాజు ననుకరించినాఁడు. అర్జునాదులు వ్యక్తిత్వముతో వ్యవహరించుచు అన్నకు బలము చేకూర్చినారు.

"ధర్మతనయుండు నడచిన దారిఁగాక మాఱుత్రోవను జనుట మా మతముగాదు" అని వారిమతము.

"అంబుధు లింకుగాక...పాండవులన్న మాటకున్"

అనెడి భీముని భీషణవచనములందును,

"సారథియంట....సంగరమం దెవఁ డాగ జాలెడిన్."

అనెడి గాండీవి భక్త్యుత్సాహాతిరేకములగు పల్కులందును,

"పోరికి సిద్ధమై యడుగ బోయినవారము గాన....
కరవాలమునం బడు యోగ ముండినన్."

అను నకుల వీరోక్తులందును,

"దొర యొక్కండన నేటిమాట....మంచి క్షత్రియుల కింతే యొండు లేదెచ్చటన్"

అను సహదేవుని పౌరుషోక్తులందును వీరరసస్ఫూర్తి విపులముగా నగుచున్నది.

కృష్ణుడు కురుసభలో పల్కిన పల్కులు :

"జెండాపై కపిరాజు ముందు సితవాజిశ్రేణియుం గూర్చి నే
దండంబున్ గొనితోలు స్యందనము మీదన్నారి సారించుచుం
గాండీవమ్ము ధరించి ఫల్గునుఁడు మూఁకం జెండు చున్నప్పు డొ
క్కండు న్నీ మొఱలాలకింపడు కురుక్ష్మానాథ సంధింపఁగన్."

అనునవి - తెలుఁగుసాహిత్యము నిల్చినన్నాళ్ళు రాలిపోవు. కర్ణుఁడు "కదనము చేయ వచ్చిరని కంది...శాత్రవ శూన్యము సేయకుండగన్" "కూడుం గుడ్డ యొసంగి...వీడున్నాడు సిద్ధంబుగాన్" అని తన సేవాధర్మము సూతధర్మము నిరూపించుకొనినాఁడు. ప్రతినాయకుఁ డగు రారాజు మదాంధుఁడు. "పాండవులైన నుండవలె భారతవంశము నిల్ప, లేక మేముండవలెం" అని భీష్మీకరించుకొనిన అభిమాని! "రారాజు బిరుదమునకై నిండువంశమును బలిపెట్టిన అవివేకి, భువిపై నవతరించిన కలి. అట్టివానిని ధర్మవీరుఁడగు ధర్మజుఁడు ధర్మమార్గమున

ఢీకొని జయముగాంచ యత్నించినాడు. అందువలననే దైవ మాతనిపక్షమైనాఁడు." కర్ణుఁడు కృష్ణునితో నన్నది సత్యము.

"నిత్య సత్యవ్రతుండన నెగడు ధర్మతనయుఁడే నేల నేలంగ దగినవాఁడు
కురుపతిని గెల్తురే నెఱుంగుదును నిక్కముగ నీ దయచేతనే పాండుసుతులు"

౨. బొబ్బిలియుద్ధము-కీ. శే. శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు :

"వీరరస ప్రధానమయి విశ్రుతి కెక్కిన నాటకంబులం
బేరు వహించి రౌద్రమును బీరముఁ బెచ్చుపెఱింగి యేరికిన్
భూరిభయానకం బనెడు బుద్ధిని బుట్టగఁ జేయు నిట్టిచో
నారసవంతమైన కృతినాడి బహూకృతినందు మీ విటన్."

ఇవి కీ. శే. శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు తమ బొబ్బిలి నాటకమున ప్రస్తావనలో సూత్రధారుని ముఖమునఁ బల్కించిన పల్కులు. వీనినిబట్టి ఈ నాటకమున అంగిరసము వీరమనియు, అంగరసములు రౌద్రభయానకము లనియు స్పష్టపడుచున్నది. నాయకుఁడగు రంగారాయనియందు ధర్మవీరము, యుద్ధవీరము, మానవీరము ప్రధానముగా గోచరించుచున్నవి. ఎడనెడ రౌద్రస్ఫూర్తి గోచరించినను అది ధర్మముచేత సంయమితమగుచునే యుండును.

"ధైర్యస్థైర్య హిమాద్రు లీ వెలమ సద్వంశ ప్రభూత ప్రభుల్
శౌర్యౌదార్య గరిష్ఠులందుఁ బ్రబలుల్ మారావువా రట్టి నే
వీర్యంబేగ నధైర్యముం బడుదునే వీంద్రా త్రిలోకంబు తా
దార్యోగ్ర ప్రభ నెత్తి వచ్చినను దోర్దర్పస్థితిన్ జూపనే."

అని శత్రువులపై హుంకరించియు, "అది అట్లైనను మునుమున్న మనమే దండోపాయంబునకుం గడంగుట రాజనీతి పథంబుగాదు. కావున సామదానాదుల మనమా పరాసుల జేనిం బరమాప్తునిగాఁ జేసికొనుటయే పాడి" అని రణనీతిని పాటించిన ధర్మమూర్తి.

శత్రువులు దండువిడిసి కోటముట్టి యున్నను సామోపాయమును మఱల మఱల ప్రయోగించి శాంతియుతమైన పరిష్కారమునకే ప్రయత్నించెను గాని అతనికి దైవయత్నము కూడిరాలేదు. బుస్సీ సహజముగా దయామయుడు ధర్మజ్ఞుఁడు, వివేకి. కాని ధనపిశాచమాతని లొంగఁదీసినది. ఒక్కసారి తప్పుటడుగు వేసినాఁడు. విజయరామురా జిచ్చిన లంచముఁ దినినాఁడు; దానిని సమర్థించు కొనుటకై పెక్కు తప్పుటడుగులు వేసినాఁడు. కావలయునని సంధి

అతఁడే కుదురనీయలేదు. అట్టివారితో రంగారావు వేగలేక గత్యంతరము లేక యుద్ధమునకు దిగినాఁడు. దానికి ముఖ్యహేతువు బుస్సీ "మీ రాజేంద్రుఁడు విజయరామ రాజేంద్రునికిఁ బాదాక్రాంతుఁడై సంధిచేసికొనుటయో లేక సకుటుంబముగా బిరుదు నిశానీలతోఁ గోట విడిచిపోవుటయో చేయఁడేని మహా యుద్ధంబు సిద్ధించు" నని బెదరించుటచే ఆత్మాభిమానియైన రంగారాయనికి పల్కులు రక్తముడుకెక్కించినవి. తన యభిమాన రక్షణము కొఱకు ఘోర ముగాఁ బోరి సింహమువలె రణనిహతుఁడైనాఁడు. వైరియగు బుస్సీ సహితము అతని మరణవార్త విని, "హా! హా! రంగరాయ మహారాజ! భూమండలా ఖండలుండవన నొప్పు నిన్ను మూర్ఖుండనై నిధనంబు నొందించితినికదా. నేనెంత పాపాత్ముఁడను! నీవెంత పుణ్యాత్ముఁడవు! మమ్మీ తుచ్ఛలోకంబునం బడవైచి నీవు వీరస్వర్గమనుభవింప నేగుచుంటివా!" అని వాపోయినాడు!

ధర్మబద్ధమగు నహంకారమునకు, స్వార్థపూరిత కౌటిల్యమునకు జరిగిన పోరాటము బొబ్బిలియుద్ధము. పై—అహంకారమునకు తాండ్రపాపయ అనెడి ఆవేశము తోడైనది. అహంకారావేశచ్ఛన్నమైన ధర్మ మొక్కయెడ శోభించి నను, మఱియొకచోట విషపరిణామమునకు దారితీయును. సమయోచితముగా వానిని సంధించు నేర్పుండినగాని జీవితము విజయవంతముకాదు! రంగా రాయనికీ మూఁటిని సంఘటించుటకు కాలము చాలలేదు. ఒకటిపై నొకటిగా పరిస్థితులు పెరిగి తనముందే విషమించి, చేతికి మించిపోయినవి. పాపమాతఁడు కాలమునకు వశుఁడై పోయినాఁడు. స్వార్థము, కౌటిల్యము అర్థబలముచేత అహంకారమును దెబ్బకొట్టవచ్చును. ఆవేశమును అణగార్చివేయ వచ్చును. కాని ధర్మము స్వచ్ఛము, అకుంఠితము కావున అహంకారావృతమైన దేహము రాలిపోయినను ఆత్మ నాశ్రయించిన ధర్మమునకు విచ్ఛిత్తిలేదు. ధర్మవిరహిత మైన ఆవేశము సర్వనాశనమునకు ఈర్ష్యాది సాధనకు మాత్రమే యుపక రించును. దానివలన చెడుగు చెఱుపఁబడినను దానితో మంచియు నాశనమగును. వరుగుతో దాగరయును పోవును. తాండ్రపాపరాయని చివరి యుద్ధమున కిదియే ఫలము. ఇట్టి సత్యముఁ బ్రతిపాదించుచు ధర్మబద్ధమగు మానవీరము నంగిగా కల్గి యీ నాటకము శోభించుచున్నది.

ఇఁక అంగములగు రౌద్రము నరసారాయుఁడు, వెంగళరాయుఁడు, ధర్మారాయుఁడు, తాండ్ర పాపారాయఁడు మొ॥ వారియం దడుగడుగునను స్ఫురించుచున్నది. తాండ్రపాపని నిశాయుద్ధము పఠితకు భయానకస్ఫూర్తినిఁ

గల్పించును. ఈరెండును నాయక సేవా నీరాజనములయి మానపోషణార్థ మగుటచే నంగికి పోషకములగుచున్నవి.

చారిత్రక ప్రఖ్యాతేతివృత్తమును గైకొని, వీరరసప్రధానముగాఁ జిత్రించిన నాటకములలో బొబ్బిలియుద్ధము తెలుఁగు వెలమప్రభువుల వీరభారతము.

౩. ప్రతిమానాటకము - భాసమహాకవి :

(అనువాదము : కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు)

మిశ్రేతివృత్తముఁగల్గి తెలుఁగున ననువాద రూపముననున్న నాటకములలో కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ప్రతిమానాటకానువాదము కడుప్రసిద్ధము. సంస్కృతమున నిది భాసమహాకవి విరచితము. కవికుల గురువుచే వందనముల గొనిన పుణ్యమూర్తి భాసుఁడు. అతని నాటకములలో రామాయణ సంబంధులగు వానియందిది శ్రేష్ఠము.

ప్రతిమా నాటకమునకు మూలము రామాయణమే. రామారణ్యవాసారంభమునుండి పట్టాభిషేకాంతము వఱకుఁ గల యితివృత్త మిందు సంధింపబడి యున్నది. ప్రఖ్యాతేతి వృత్తముగైకొని స్వీయప్రతిభచే రసోచితములగు కల్పనలనందుఁ బొందుపఱచి ధర్మవీరప్రధానమగు నాటకమును భాసుడు సంతరించినాడు. ప్రథమాంకమున వల్కలకల్పనము, తృతీయాంకమున దశరథ ప్రతిమాకల్పనము, పంచమాంకమున దశరథ శ్రాద్ధకల్పనము, ఇందు నూతనముగా కల్పించిన అంశములు. వీనివలన వస్తువు మిశ్రమనఁబడున్నది. సంస్కృతాంగ్లాది వివిధ భాషలనుండి తెనుఁగున నిట్టి యనువాదములు పెక్కులు వెలయుచున్నవి. గాని సంస్కృతరూపకములు తెలుఁగును సమీపించినంతగా నవి రాఁజాలక పోవుచున్నవి. కావున వానిలోనే ఒక ప్రసిద్ధనాటకము నెన్నుకొనుట జరిగిన దిచ్చట :

ధీరోదాత్తుఁడగు రాముఁడు నాంద్యంతమున సూత్రధారుని పల్కులలోనే ప్రత్యక్షమగును.

"సీతచెలికాఁడు లక్ష్మణాశ్రితుడు భరత
హితుఁడు సుగ్రీవరాముఁ డప్రతిమమతి సు
మంత్రనుతుఁడు విభీషణాత్మకుఁడు రావ
ణారి యగు శౌరి మీఁకు శ్రేయము లొసఁగుగాక."

సీత చెలికాఁడుగా నాదర్శదాంపత్య ధర్మమును, లక్ష్మణాశ్రితుఁడుగా నాదర్శ

భ్రాతృ ధర్మమును, భరతహితుఁడయి ఆదర్శ క్షత్రియధర్మమును, సుగ్రీవ రాముఁడయి మిత్రరక్షణ ధర్మమును, సుమంత్రనుతుఁడయి ప్రభుధర్మమును, రావణారియై వీరధర్మమును శౌరియై యుద్ధధర్మమును పాటించి లోకశ్రేయో రూపమైన జీవితచరిత్ర నడిపిన ధర్మవీరుఁడని ఇందు ధ్వన్యమాన మగుచున్నది.

కాంచుకేయుడు-కైకేయి మచ్చరముతో రాముని నడవి కేగుమనినదని తెల్పఁగా "నార్యా! నీవు మా మీద పక్షపాతముచే నిజము గుర్తింపకున్నావు.

శుల్కమందు ముందు పల్కంబడిన రాజ్యమడిగెనేమొ! యామె కొడుకు కొఱకు
మత్సరంబు నెంతు విచ్చోట; తమ్ముల సిరి హరించు నన్ను నరయవు గద!"

అని వ్యాఖ్యానించినాఁడు. ఇందు - రాముని పరమగుణగణపారీణత యపారము. సహన మనితరసాధ్యము.

రామునికి రాజ్య మబ్బలేదని క్రుద్ధుఁడయి కత్తిదూసిన సౌమిత్రిని రాముఁడు——

"నాకొ లేక భరతునకొ రాజ్యమబ్బె, నిందెవరి కబ్బెనేమి యేకమకద!
భూ బలంబు నెఱపి ప్రజఁ బోవఁ జక్క సహాయపడుము భరతుఁడగును రాజు"

అని వారించెను. అంతకును మాటవినక తనను ప్రేరేచు నాతనిని హేతువాదముచే ధర్మబద్ధు నొనర్చెను.

"జనకున్ సత్యరతున్ వధించుటకుకై చాపంబు సంధింతునా?
తన సొమ్మున్ గొనఁజూచు తల్లిపయి నస్త్రంబుల్ ప్రయోగింతునా
అనుజున్ నిష్కలుషాత్మకున్ భరతు సంహరింతునా? నీ మనం
బునకున్ నచ్చిన దేది పాతకము లీ మూఁడింటిలో తమ్ముఁడా!"

రాముని ధర్మప్రవృత్తి సంస్కార సంజనిత విశేషమే. అతని విషయవివేచనాత్మకమైన శక్తి, సత్వరనిర్ణయ సామర్థ్యము, ధర్మప్రవణత మెచ్చుకొనఁదగినవి. సీతతో నాతఁ డిట్లనెను. "ఓహో నాయనగా రిందువలన మూర్చిల్లిరి. ఇసీ! ఆ ప్రభుత్వమును ప్రకటించిరిగదా వారు! మైథిలీ!

ఇపుడు నీ కవదాతిక యిచ్చినట్టి నారచీరలు గొనితెమ్ము నాకుఁగూడ
నేనిదే యన్య భూపతుల్ పూననిదియు నాచరింపనిదియు ధర్మ మాచరింతు."

అని అపూర్వ ధర్మాచరణోత్సుకుఁడైనాఁడు! నారచీర లిదివరకే అవదాతికచేఁ దెప్పించుట భాసుని కల్పన. వల్కల మనఁ రాము దృష్టిలో; ఇంద్రియకంభాణములకు కళ్లెము, తప మను సంగరమున నంగరక్ష; నియమ మనెడి హస్తి

కంకుశము; ధర్మపథంపు సారథియని. అట్టివానిని రాముఁడు కోరెను. సీత రాము ననుసరించినది. సౌమిత్రి వానిని ధరించి రాముని సేవకు జీవితము నంకితముఁ జేసెను. అతడు భ్రాతృభక్తికి పరాకాష్ఠ; సీతాపతి గురుభక్తికి ఖని, ధర్మముకొఱకై రాజ్యము నవలీలఁ ద్రోచివైచిన త్యాగమూర్తి !

భరతుఁడు పరమధార్మికుఁడు. భ్రాతృభక్తుఁడు. ఆకృతి విశేషమున రాము నికి దీటైనవాఁడు. ఆ కారణమున సీతకు రాముఁడను భ్రాంతి కల్పించువాఁడు. గుణములందును నంతియ. అన్న నడవికిఁబంపె తనకై రాజ్యము శుల్కముగాఁ గోఱిన తల్లిని కాదని, అరణ్యమునకేఁగి రాముని సన్నిధాన మభ్యర్థించి, అతనిచే ప్రబోధితుఁడయి—

"అన్న నీపాదపద్మము లనుభవించు పాదుకలనిమ్ము తలతోడఁ బ్రణతు లివిగొ
మఱల నీవచ్చునందాకఁ బురిని వీనికిని విధేయుఁడనై నేను బనులొనర్తు."

ననుటలో భరతుని గురుభక్తివీరము ధ్వన్యమానము. అది రాముని ధర్మవీర పోషకము.

పితృదేవతా. కార్యములందలి ప్రీతి రాముని ధర్మ ప్రవృత్తిని దీపింపఁ జేయుచున్నది.

"అందుదురు తృప్తి వారెట్టు లయినఁగాని నాదశను వారెఱింగి యున్నారకాదె
ఐన యత్నించుచుంటి నాయనకు నాకు నర్హ మగురీతి నేఁబూజ నాచరింప !"

అర్హమగురీతి ననుటలో నాతని లోఁతునందని వ్యక్తిత్వ మిమిడియున్నది. యత్నము చేయుటలో నాతని భక్త్యుత్సాహములు వ్యక్తములు. రావణుఁడు శ్రాద్ధకర్మోపకరణములు ప్రభావ సంపాద్యములని తెల్పినప్పుడు—

"ఉభయమును సన్నిధానమై యున్న; దందు నేది దీనిని సాధింపఁగాఁ దగినదొ;
తపను చాలని దైనను ధనువు కలదు ధనువు చాలని దైనను తపసు కలదు."

అని తన తపోయుద్ధపారమ్యము నెఱుకచెప్పెను. దానిచే నతని కపూర్వకార్య సాధన మనునది కరతలామలకమను విషయము స్పష్టపడుచున్నది.

ప్రతినాయకుఁ డగు రావణుఁడు ధీరోద్ధతుఁడు. సీతముందు "పురు హూతుం బరిభూతుఁ జేసితిని......" అని ప్రగల్భములు పల్కి ఆత్మస్తుతిఁ జేసి కొనినాఁడు. జటాయువు రామమిత్రుఁడు. సీతను హరించి కొంపోవు రావ ణుని డీకొని రెక్కలు కోల్పోయినాఁడు. "ఱెక్కలు ఱిక్కించి ప్రత్యర్థిని నెదు రెదురై ......" జేసిన యుద్ధము పౌరుషోచితము.

రాముఁడు వాలిని సంహరించి సుగ్రీవునకుఁ గిష్కింధలో పట్టాభిషేకముఁ జేసిన వృత్తాంతము, రావణునితోడి యుద్ధమునకు రాముఁడు సన్నద్ధుఁడగు వృత్తము; సుమంతులవారినోటఁ గవి షష్ఠాంకమునఁ జెప్పించి రాముని బలవీరమును పోషించెను. భరతుఁడు రామునకు సాయముచేయఁ బూని సైన్యసమేతుఁడై యెదురేగి భ్రాతృభక్తిని ప్రకటించినాఁడు.

సప్తమాంకమున రాముఁడు పల్కిన :

"జ్వలిత బలప్రతాపుఁడగు వైశ్రవణున్ బరిమార్చి సద్గుణో
జ్జ్వలను విశుద్ధజీవనను జానకిఁ దోడ్కొని తప్పకుండగా
జలువఁగఁ బూనినట్టి గురుశాసనమున్ గడముట్టఁ జల్పినేఁ
గలయఁగఁ జొచ్చితిన్ మఱలఁ గానన మౌని నివాసదేశముల్."

అనెడి వాక్యములలో స్మృతిరూపమగు రాముని యుద్ధవీరము, ధర్మవీరము ద్యోతమానమగుచున్నవి. శత్రుసంహారమున యుద్ధము, భార్యారక్షణమున ధర్మము నిచ్చట ప్రవర్తిల్లినవి.

ఇట్లు భాసవిరచిత ప్రతిమానాటకము రాముని ధర్మవీరప్రతిపాదితమై మిశ్రేతివృత్తము కలిగినదై రసవంతమై వరలుచున్నది.

## ౪. ప్రతాపరుద్రీయము - కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు :

చారిత్రక సత్యము నొకదానిని గైకొని దానినిచ్చవచ్చినరీతిని మలఁచి యపూర్వసంఘటనలు జతచేర్చి సాక్షాత్కల్పిత నాటకమువలె రచింపఁబడిన తెలుఁగు నాటకము వేదమువారి 'ప్రతాపరుద్రీయము' తెలుఁగులో వెలసిన నాటకము లన్నిఁటిలోఁ దలమానికము. సార్వకాలికమైన నాటకమిది యనుటలో నతిశయోక్తి లేదు !

ఇది వీరరసప్రధానమైన మహానాటకము. ప్రస్తావనలో నటిచే శరదృతుకీర్తనము సేయఁబడినది. నాయకుఁడు ప్రతాపుఁడు. అది నాటకనామముననే ధ్వనితము. అతడు సచివాత్తసిద్ధుఁడుగ నిందు గానబడుచున్నాఁడు. కొందఱు యుగంధరుఁడు నాయకుడందురు. వత్సరాజు నాయకుఁడుగాగల నాటకములలో యౌగంధరాయణుఁడెట్లుకాఁడో ఇందు యౌగంధరుఁడట్లుకాదు. సమర్థులైన మంత్రులఁ గల్గియున్నరాజు అకస్మాత్తుగా నపాయమునకు గుఱికాఁగా నాతని రక్షించుటకు చేయశక్తుల కృషిచేసి సఫలమునొంది ప్రజను రాజును సంతోషపెట్టిన మంత్రియుగంధరుడు. రాజును రక్షించుట అతని

ధర్మము. కావున నతని వీరము నాయకుని సుస్థిరు నొనర్చుటకై లక్షితమై ధన్యాత్మమైనది. సచివాయత్తసిద్ధుఁడగు రాజు చరిత్రము వర్ణితమగు కావ్య శిల్ప మివ్విధముగనే యుండును. అందు రాజుకన్న మంత్రికే ప్రాముఖ్యము హెచ్చు. ఫలభోక్త రాజే. ఇదియొక విలక్షణమైన ధర్మపద్ధతి.

వేఁటనొనర్చి యలసి నిద్రించుచున్న రాజును వలీఖాను సబలుఁడై బంధించి గోదావరి దాటించి ఢిల్లీకిఁ గొంపోయెను. జనార్ధనుని నీతిపాటవము యుగంధరుఁడు తీర్థయాత్రలనుండి తిరిగి వచ్చువఱకు సామ్రాజ్యమును రక్షించినది. యుగంధరుఁడు మోసగించినవారికి ప్రతిగా మోసమే ప్రయత్నము కావలె ననెడి రాజనీతి సూత్రము నాధారముగా మంత్రము సాగించినాఁడు. ముమ్మడమ్మ యెదుట—

"కొనిపోయెనమ్మ నీ పట్టిని యవనుఁడు దైవఘటన ఢిల్లీపురికిన్
వనరకు మేడు నెలల పది దినములలోఁ దెచ్చియిత్తు దేవీ నీకున్."

అని ప్రతిజ్ఞఁచేసి మాఱువేషముతో పిచ్చివానివలె ఢిల్లీ బజారులో దిరుగుచు, అన్న పానీయాదులను లెక్కచేయక నీతిమార్గము నేమఱక చెకుముకి శాస్త్రి సహాయమున వలీఖానును చంపించి, ఢిల్లీ సుల్తానును బంధించి, రాజును చెఱ నుండి విడిపించినాఁడు. దుష్కర కార్యసాధనమున తాను జూపించిన ప్రజ్ఞచే 'యుగంధర నీతి' యనెడి జాతీయమును వాఙ్మయమున నిల్పినాఁడు. సుల్తానును చంపక రాజునకు నతనికి సంధినొడఁ గూర్చి వదిలివేసినాఁడు.

"మయశంబరులకుఁ బలె నన్వయ పారంపరిగ సఖ్యమమరుత మీకున్
నయముగ నొండొరులకు రిపు భయదాహములఁ దోడుపడుదురు గాతన్."

అని ఇరువురి చేతులుకలిపి ద్వేషాగ్నిని చల్లార్చి శాంతిని స్థాపించినాఁడు. ప్రతాపుని గద్దె నెక్కించి అతనిచే "మహానుభావా!

"ఢిల్లీనాథుని మిత్రుఁ జేసితివి ; ధాటీ ధర్మ బాహ్యాత్ముఁడౌ
వల్లీఖాను శిరంబుఁ దెచ్చితి, ద్విషద్బందీకృతున్ మత్ప్రజన్
ఇల్లొందించితి చాకినేని, గజరాజేగెన్ యముగ్నానగా
నల్లాపింపుము ఇంకనుం గలుగునే, సర్వజ్ఞ యాశాస్యముల్."

అను మన్ననల వడసి ధన్యాత్ముఁడైనాఁడు.

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు ఇందంగిరసము 'మంత్రవీర' మని పేర్కొనిరఁట! వివేకముతోఁ గూడిన స్వాతంత్ర్యముతో ననినమాట మంత్రమున

నుండు విశేషమిది : శత్రువులు మోసము చేసినప్పుడు నాయకపక్షమువారు మోసమేచేసి, అది ధర్మబద్ధమైనదని నిరూపింతురు. అది న్యాయమేనని పఠిత కనుపించునంత బలీయముగా చాకచక్యముగా నిర్వహింపఁబడును. ప్రేక్షకులను మంత్రముగ్ధుల నొనర్చుచు చివర కది రాజ్యరక్షణరూప ధర్మాంతర్గతమై, లోక హితరూపమై ధర్మవీరమున కవతారమగుచున్నది.

ఈ నాటకమునందు రా జసమర్థుఁడు కాఁడు. దురదృష్టవంతుడు, కాని మహామేధావిని మంత్రిగాఁ బొందిన అదృష్టవంతుఁడు! రాజు చారచక్షువై లోకము నెట్లు గమనించునో అమాత్యరక్షితుడై విజయము నట్లే సాధించును. అట్టి సత్యముపై నాధారపడి రచింపఁబడిన తెలుఁగురాయని చరిత్ర మియ్యది. ఆచంద్రార్కము నిలుచు అపూర్వ కళాఖండము! స్వామిభక్తికి రత్నో దాహరణము.

## ౫. వరవిక్రయము - కీ. శే. కాళ్ళకూరి నారాయణరావుగారు :

సంఘమున నేటికిని పెనుభూతమువలె విజృంభించి ఆడుఁపిల్లల తండ్రులను పీల్చిపిప్పిచేయుచున్న సమస్య "వరకట్నము". దీనిని వస్తువుగాఁ గొని సంఘ సంస్కరణోద్యోగమున రచింపఁబడిన మహత్తర సాంఘికనాటకము కాళ్లకూరి నారాయణరావుగారి "వరవిక్రయము". ఇతివృత్త మెంతబలమైనదో, కవిగారి నాటక నిర్వహణదక్షతయు నంత పటిష్ఠమైనది. ఈ రెండును కలిసి యపూర్వ తను నాటకమున కాపాదించుచున్నవి. ఇది యొక సాంఘిక విప్లవబీజము.

రసచర్చ చేయవలసి వచ్చినపుడు ఈ నాటకమున విచిత్రమైన పరిస్థితి యేర్పడును. నాటకముపేరు "వర విక్రయము" అనగా వరునియొక్క అమ్మకము. అమ్మెడి వస్తువుపై కొనెడి వాని దధికారము. కొనెడి వాని కమ్మువాఁడు లోఁకువ. అగుచో నిందు లింగరాజు వరవిక్రేత; బసవరాజు వరుఁడు. కొనువాఁడు పురుషోత్తమరావు; పెండ్లికుమార్తెల తండ్రి వరున కీయదలచిన కన్య లిరువురు కాళింది, కమల. వీరక్క చెల్లెండ్రు ఇందు కొను వాఁడు నాయకుఁ డందుమా భోక్త అతఁడుకాదు. తండ్రి కూతుండ్రకొఱకు వరుని కొనుచున్నాఁడు. లోకమున నొకరు కొనియిచ్చిన వస్తువు రెండవవాని సొత్తగుట గాంచుచున్నాముకదా! కావున నిచ్చట వరునిపై నధికారము గల్గినది వధువు. వరుఁడు వధువుచే సంపాదితమైన వస్తువు. ఈ తర్కము నాటక మునకు మూలాధారము.

నాటక నిర్వహణమునందు నారాయణరావుగారు కడు సామర్థ్యమును జూపించినారు. వరకట్న విరోధి పురుషోత్తమరావు. అట్టి యుద్యమున కొక విధముగా నాయకుఁడు. కాని తన కూతుంద్రకు పెండ్లి సేయవచ్చునప్పటికి పరిస్థితు ల్లాతని నొత్తివైచినవి. వయసువచ్చిన కన్నెలు, లోకాపనింద, వర కట్నము, పిల్లలతల్లి యాత్రము, పెండ్లిళ్ళ పేరయ్యగారి యనుభవములు, పేదరికము—ఇవి యన్నియు నతని దికమక పెట్టినవి. తన సిద్ధాంతమును వీడి సంఘమునకు తలయొగ్గినాఁడు. కాని అతని కూతుంద్రు తండ్రిగారి భావములను రక్తమున జీర్ణించుకొనినవారు, చదువుకొనినవారు, వివేకవంతులు. అందుచే తండ్రినిజూచి జాలిపడినారు, ఇట్టి వివాహ మెందుల కని ప్రశ్నించినారు. బ్రహ్మచారులై మగబిడ్డలవలె పుట్టింటనే యుండిపోయెదమనినారు. కాళిందీ, కమలల వ్యక్తిత్వములలో ముఖ్యమైన భేదమొండుగలదు. కాళింది యుద్రేక ప్రవృత్తి కల్గినది. ఏ చిన్న విషయమునైనను హృదయమువఱకుఁ దీసికొని తీవ్రముగా నాలోచించి బాధపడెడి సున్నితమయిన ప్రవృత్తికలది. అందువలననే తండ్రి వివాహోత్పూర్వమే కట్నము చెల్లించినాడని విని భరించలేక, తన తండ్రి తనకు నూరిపోసిన సిద్ధాంతమును వీడఁజాలక పరిస్థితులను దాటలేక, కింకర్తవ్యతా విమూఢురాలై, ఆవేశమున 'నోరుగంటియువతి' పోయిన మార్గముననే నడచి బావిలోపడి చనిపోయినది. తరువాత కమలను ఆ బసవరాజునకే యిచ్చుటకు నిశ్చయించినారు. ఈమెయందు సమయోచితమగు ధైర్యసంపద మెండుగా నున్నది. కట్నముఁగొనిన వారికి వివాహానంతరము శాశ్వతముగా బుద్ధివచ్చునట్లు, వారి మనఃప్రవృత్తులు మాఱునట్లు గుణపాఠము నేర్పనెంచినది. సాహసించి నిర్మాణ కార్యక్రమమునకుఁ బూనుకొని తనప్రయత్నమున జయించినది. వరునిఁ దానుకొనినానని న్యాయస్థానమున నిరూపించినది. అనఁగా జయము కమలదే.

నాటకలక్ష్యము వరకట్నములు గైకొనిన వారికి వ్యంగ్యముగా బుద్ధి చెప్పుట. ఈ కార్యము సాధించినది కమల. కమలకు పూర్వ మిరువురు వ్యక్తులా మార్గమునఁ గృషిచేసి విఫలలయిరి. ఇట్లు చిత్రించుటలో చక్కని శిల్ప సౌందర్యమున్నది. ధర్మమెప్పుడైనను సమర్థుఁడైన వ్యక్తిచే సాధితమైనచో నది యప్రతిహతముగా నిలుచునను సత్యము నది చాటుచున్నది. తండ్రి నిందకు వెఱచి సిద్ధాంతమును వీడినాఁడు. అతఁ డసమర్థుఁడు. కాని కుమార్తెలకట్టి ధైర్యసంపత్తిని ప్రసాదించిన గురుమూర్తి యాతఁడే. ఆయనచే వైఫల్యము

నొందిన కార్యము కుమార్తెచే సాధింపఁబడినదనుటలో తన్త్రాపాశస్త్య మినుమడించుచున్నది. కాళింది యొక్క ఆవేశము కార్యమును సాధింపక ఆత్మహత్యకు దారితీసినది. ఆమెకు విభావ మోరుగంటిపడఁతి. అనఁగా కార్యము సాధించుటకు తాత్కాలికావేశము చాలదనియు, అది యొక్కొక్కప్పుడు కీడునకు దారితీయుననియు నా పాత్ర బోధించుచున్నది. అక్కా తండ్రులు కమలకు విభావములు. వారు విఫలులైన ప్రయోగమును చేపట్టినది, సాధించినది. వీరు ముగ్గురు 'కట్న నిషేధోద్యమమునఁ జేసిన యనంత యత్నమునందలి యుత్సాహము వీరమునకు స్థాయిభావము వైవిధ్యముగల మూఁడుపాత్రల యందది వ్యాపించి ఉత్తరోత్తరబలీయమై చివరివ్యక్తియం దుత్కటరూపము దాల్చి ఫలోన్ముఖమైనది. ఇది ఈ శిల్పరహస్యము.

—తండ్రి ప్రబోధము నరనరములకుఁ బట్టిన పుత్రికలు మాట్లాడు వైఖరిఁ గాంచుఁడు :

"వెండినాణెంబె పెనిమిటి వేశ్య, కటులె కట్నములె భార్యలిప్పటి కర్కశులకు
వేశ్య వెలయాలనంబడె వెల గ్రహించి కట్నములచేత వెలమగల్ కారె వీరు."

కాళింది : కాకేమి. కాని మన మిపుడు కావింపఁదగిన దేమియులేదా?

కమల : లేకేమి?

"తనువు లశాశ్వతంబులుగదా ? క్షణ భంగుర జీవితార్థమై
ధనమిడి భర్తలం బడసి దాస్య మొనర్చుట కంటె ; బెండ్లియే
యనువుగ మానిపించుకొని హాయిగ రాట్నము త్రిప్పుకొంచు యో
గినులగతి న్మెలంగిన సుఖంపమె తీఱదె తండ్రి దీక్షయున్ !"

కాళింది : సెబాసు చెల్లీ! వయసుకు చిన్నదానవైనను వరహాల కెత్తుకెత్తయిన మాట్లాడితివి ! ఇదిగో !

"నాదు ప్రతినను వినుము ప్రాణములనైన విడిచెదంగాని యడిగిన విత్తమిచ్చి
వరునిగొని తెచ్చినట్టి వివాహమునకు సమ్మతింప నారాట్నము సాక్షిగాను."

—కాళింది తన ప్రజ్ఞ నిలుపుకొనుటకై తండ్రితో సైత మిట్లు వాదించినది.

కాళింది :

"కట్నమే కోరివచ్చిన ఖరము తోడ తగుదునని కాపురము సేయు దానికంటె
బెండ్లియే మానుకొని మగబిడ్డ వలెనె తల్లిదండ్రులకడనుంట తప్పిదంబె."

"త్రాగువారుంటచేతనే తాళ్ళ గీత కొనెడివారుంటచేతనే గోవులవధ
పోవువారుంట చేతనే భోగవృత్తి అట్లె ప్రోత్సాహమే హేతు వన్నిటికిని."

అని తమ ప్రోత్సాహమే కట్నములను బలవత్తరమొనర్చు చున్నదనియు, తన్నిరాకరణమే తరణోపాయమనియు నామె సూచించినది. ఆమె యుత్సాహవచనములు నడుమువిఱిగిన పురుషోత్తమరావునకు పుట్టెఁడంత సంతోషము నిచ్చినవి :

పురు : (చటాలున కౌగిలించుకొని) నా తల్లి ! నా తల్లి ! నా కడుపునఁ బుట్టి నాకు బుద్ధిచెప్పగల దానవైనందులకు నా యాయువుకూడఁ బోసికొని బ్రతుకుము.

"సొరిదిగ హెచ్చుచున్న వరశుల్క విపద్దశ మాన్పఁబూని బి
ట్టఱచితి వేదికాస్థలుల నాడితి పెక్కు సభాంతరంబులన్
బఱబఱ వ్యాసముల్ బరికి పత్రికలన్ బ్రచురింపఁ బంపితిన్
హరహర ! నీదుపాటి తెగువైనను లేక భ్రమించితిన్ తుదన్."

అని యామెను మెచ్చుకొనినాఁడు. అంతకన్న కాళిందీ జీవితమునకు చరితార్థత లేదు !

అక్కకు నిర్ణయించిన వరుఁడే తనకు దిక్కైనప్పుడు కమలలో ధర్మసంఘర్షణ రేగినది. చివఱ కామె యొకనిర్ణయమునకు వచ్చినది.

కమల : (తనలో) ఇప్పుడు నా కర్తవ్యమేమిటి ? అక్క సిద్ధాంతమునే యనసరింపఁ దగునా? అందులకు భిన్నముగావించి తల్లిదండ్రులకు తాత్కాలిక మనశ్శాంతిని గల్గింపఁదగునా ? అక్కచెప్పిన వాక్యములన్నియు నా కెముత్తెపు కోవలు. కట్నాలరాయలచేఁ గళ్యాణసూత్రములం గట్టించుకొనుటకంటె గతిమాలిన పని మఱిలేదనుట నిశ్చయము ! అట్టి వివాహము నాకును నంగీకారము లేకున్నచో తలిదండ్రులు నన్ను బలవంతపెట్టరనుట నిశ్చయమేకాని. దానివల్లఁ దేలు పర్యవసానమేమి ? ఐదువేల ఐదువందలు నా దుర్మార్గుని పొట్టనుబెట్టించుట తప్ప మఱేమియు లేదు. అందువల్ల నాదారి విడిచిపెట్టి యా సంబంధమునే యంగీకరించి, పరిణయమునకుందగిన ప్రాయశ్చిత్తము చేయగల్గినచో వీరిచ్చిన ద్రవ్యము వినియోగములోనికిఁ దెచ్చినదాననగుటయేకాక అక్క కసితీర్పఁగల్గిన దానవై ప్రపంచమున కొక పాఠమునేర్పిన దాననుగూడ నగుదును.

—అని నిశ్చయించినది. ఈమె ప్రయత్నము న్యాయస్థానమునఁ బరిపక్వదశకు వచ్చినది. న్యాయాధికారిముందు :

కమల : కట్నమునకు క్రయధనమునకు కాసింతయు భేదములేదు. ఉన్నదన్నను కట్నములు వివాహకాలమున నిచ్చుటకలదు గాని వేలము, బజానా, అగ్రిమెంటు, ముందుచెల్లించుట ఇట్టియాచార మెక్కడలేదు. అందువల్ల నిది క్రయధనమనుట కాక్షేపమేమియు లేదు. అది యటుండనిండు. శుభలేఖలలో సర్వత్ర 'వారి కుమారునకు వీరి కుమార్తెనిచ్చి' అని కదా యుండును. వీనిని చిత్తగింపుడు ... ("నాకుమార్తె చి. సౌ. కమలకు బ్రహ్మశ్రీ లింగరాజుగారి కుమారుఁడు బసవరాజు నిచ్చి" అని యుండును) అయ్యా!...నాకుగల హక్కును బట్టియు, న్యాయమును బట్టియు నేనే యీ విధముగా మార్చినాను. అందులకు వారప్పుడేమియు నభ్యంతరము చెప్పియుండలేదు. తా మీసందర్భము లన్నియుఁ జక్కగా నాలోచించి నాపై నా భర్తకే యధికారము కలదో, నా భర్తపై నాకే యధికారము గలదో నిర్ణయింపుడు.

—అని ప్రశ్నించినది. దానికి 'వరకట్నమును' వడ్డీ వ్యాపారముగా బెట్టుకొనినవా రేమందురోగాని – ఆమె భర్త బసవరాజు మాత్రము తనపై నామెకే యధికారమున్నదని యొప్పుకొనినాఁడు !

"వరకట్న నిషేధ శాసనము" చేసికొనిన తెలుఁగువారు తెరవెనుక కట్నాలమూట లందించుకొనినన్నాళ్ళు ఈ నాటకమునకు సార్థక్యము నిలిచియే యుండును. దైవానుగ్రహమువలన అట్టి దంతరించిననాఁడు ఈ నాటకము తెలుఁగుజాతి మ్యూజియంలో నొక ప్రాచీనశిల్ప కళాఖండమగును! అది యుదాత్తము! నిర్మల వీరాదర్శము!

## ౬. విశ్వశాంతి - శ్రీ 'ఆత్రేయ' :

"సమస్త ప్రపంచం ఈనాడు క్రమక్రమంగా రెండే రెండు శిబిరాలుగా ఘనీభవిస్తోంది. కామందులకు లాభంచేర్చే యుద్ధం, సామాన్యులకి క్షేమం కూర్చే శాంతి. ఈ రెండూ ఒక త్రాసుని ఇరువైపులా లాగుతున్నాయి. తెలిసి కొందరూ తెలియక కొందరూ మొత్తంమీద అందరూ ఏదో ఒక పక్కకి ధృవపడుతున్నారు. ప్రాణవాయువు జీవితానికి వలె మానవజాతి సమిష్టి క్షేమానికి శాంతి అత్యవసరమని గుర్తించగల్గిన వాళ్ళంతా తమ యావచ్ఛక్తులతో మోహరించి నిలిస్తే అసలు యుద్ధమనేదే లేకపోవచ్చును" (శ్రీ శ్రీ). అను సందేశమును దేశమున కందించు మహత్తర సాంఘిక నాటకము ఆత్రేయ

గారి విశ్వశాంతి. అభ్యుదయ మార్గమున వీరిరచన చాల శక్తిమంతమైనది. నిత్యజీవితములో మనమధ్య నిస్సారముగా నలిగిపోవు మాటలెన్నియో వీరి రచనలో శక్తిమంతములై గంభీర భావములను వెలార్చినవి.

విశ్వశాంతిలో నాయకుఁడు విశ్వం. రెండవ ప్రపంచ యుద్ధానంతరము ప్రపంచ మెదుర్కొనిన భీకర పరిస్థితులను కన్నులార గాంచి విశ్వమంతయు శాంతిమందిరముగా మాఱవలెనని మనసార నమ్మి కృషిచేసిన శాంతివీరుఁడు విశ్వం. ఇతనిలో నంత మహత్తర విప్లవజ్యోతిని వెలిగించిన దాతని తల్లి భూదేవి. ఈ నాటకరచన కడు విచిత్రమైనది. నాటకములోని పాత్రలన్నియు సజీవ ముగా చైతన్యవంతములై నాటకమును రసవాహినిగాఁ దీర్చిదిద్దుచున్నవి. వ్యంగ్యముగా నిం దొక్కొక్కపాత్ర యొక్కొక్క సిద్ధాంతము. వాని మధ్య జరిగెడి సంఘర్షణము వస్తువు. ధర్మాధర్మ చర్చలు, యుద్ధములవలన గలుగు భీకర ఫలితముల గూర్చిన ప్రబోధము అంగములు. శాంతివిజయము ఫలము. కాని యెచ్చటను స్వాభావికతకు లోపము రాకుండ సరసముగా కృత్రిమము కాని సన్నివేశములతో నాటకము సర్వాంగసుందరమగు శిల్పఖండముగ గోచ రించుచున్నది.

భూదేవి సాక్షాద్విశ్వంభర. పెద్దవాఁడు, చిన్నవాఁడు (విశ్వం) ఆమె పుత్త్రులు. పెద్దవాఁడు ధనమదాంధుఁడు, కఠినుఁడు. విశ్వం విశ్వకళ్యాణ సాధనకై బద్ధకంకణుఁడు. అన్ని భారీ పరిశ్రమలు, విదేశపు పెట్టుబడులు, దేశాభ్యున్నతికి మూలహేతువులని నమ్మెడివాఁడు; చిన్నవా డధికాహారోత్పత్తి, నిరుద్యోగ నిర్మూలనము, కార్మికాభ్యుదయము ముఖ్యహేతువులని నమ్మువాఁడు రెండూ రెండు ధృవాలు. 'నా యింట్లో దేశం వుంది' అంటా డన్నయ్య. 'దేశంలో మన యిల్లుందంటాడు' తమ్ముఁడు. పెద్దవానికి శాస్త్రి (సైంటిస్టు) కుడిభుజము. తగినంత పెట్టుబడి తనకు దొరికినచో తన మేధాసంపత్తినంతయు విశ్వవిధ్వంసకములగు మారణాస్త్రములను సృజించి దారుణమైన యుద్ధ ప్రవృత్తిని రెచ్చగొట్టు ప్రవృత్తిగలవాఁ డతఁడు. "ఆకలి-ఆశ యివి రెండే మానవజీవితాన్ని నడుపుతున్న శక్తులు. ఈ ముక్కుత్రాళ్ళకు ఎంతటివాళ్లైనా లొంగుతారు" అని నమ్మినవాఁడు శాస్త్రి. పెద్దవానిచే పింగాణి ఫ్యాక్టరీ పెట్టించి ఆయుధాల కర్మాగారముగ దానిని మార్పించినవాఁ డీతఁడు. చివఱకు భాగములు కుదురకపోగా సర్వనాశనము చేసిన దీతఁడే. అమరయ్య (సిపాయి తాత) స్వయముగా రెండు ప్రపంచయుద్ధములలోఁ బాల్గొని ప్రపంచము దిరిగి

వచ్చినవాఁడు; శాంతిని కాంక్షించు మాజీ సిపాయి. సమత విశ్వం చెల్లెలు. సమానత్వము, శాంతి నభిలషించు బాలిక. శాంతి శాస్త్రి కుమార్తె. శాంతిని త్రికరణశుద్ధిగా నమ్మిన శాంతి శూరురాలు. విశ్వమును ప్రేమించి అతని హృదయములోని అనురాగముతో పాటు ఆదర్శమును సమముగఁ బంచుకొనిన యువతి.

అనాదినుండియు మానవ హృదయములోఁ బుట్టి వర్ధిల్లిన యుద్ధ వాంఛయు, దానికి ధర్మకవచముఁ దొడిగిన విధము భూదేవికి నచ్చనివి :

"ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం ?
నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం."

అని నమ్మిన వ్యక్తి. అనాదినుండి యుద్ధధర్మమును మానవుఁ డెట్లారాధించెనో ఆమె యిట్లు వ్యాఖ్యానించినది "పెళ్లాంకోసం ఏమి జోక్యంలేని కొన్ని వేల మంది అమాయకుల్ని బలిచేసిన రాముఁడు, ఒక్క ఆడదానికోసం, తన ప్రజల్ని నాశనంచేసిన రావణుఁడు శూరులు ; ఇంటిగోడవలేవో పెంచుకొని ఏ జోలీ శొంఠీ ఎరుగని జనాన్ని యుద్ధం పేరిట, ధర్మం పేరిట కురుక్షేత్రంలో బలిపెట్టిన పాండవులూ, కౌరవులూ మనకు వీరాధివీరులు. కీర్తికోసం రాజ్యాలను జయిస్తూ అందువల్ల ఏ లాభమూపొందని జనాన్ని లక్షలు లక్షలుగా మారణ హోమంచేసిన సీజరు, అలెగ్జాండరు, గాజ్నవీ అందరూ మనకు పూజ్యులు, వాళ్ళని ఆ నరహంతకులని కన్నవాళ్లందరూ వీరమాతలు, దేశానికి దివ్యమణులు. రాజభక్తి, దేశభక్తి, దైవభక్తి ఇవన్నీ మనకుండాల్సిన గొప్ప గుణాలు. ఆ గొప్పగుణాలతోనే మనం యుద్ధాలుచేశాం. రక్తనదులు పారించాం. భూమాతను నెత్తురుతో అభిషేకం చేసాం మొదట—మొదట అవినీతికి నీతిని, అక్రమానికి కొంత క్రమాన్ని అధర్మానికి కొంత ధర్మాన్ని ఏర్పరచుకొన్నాం. కుళ్ళిన పుండుకు సెంటుపూసుకున్నట్లు యుద్ధాలకు కొన్ని నియమాలను నియ మించుకొన్నాం. పిల్లల్నీ ఆడవాళ్ళని ముసలీ ముతకనీ చంపగూడదన్నాం. రాత్రిపూట యుద్ధం కూడదన్నాం. ముందుగా చెప్పికాని పైబడకూడదన్నాం. అంతా పోయింది......లీగ్ ఆఫ్ నేషన్సు అన్నాం. భద్రతా సంఘం...... యు ఎన్. ఒ. అన్నాం. అంతర్జాతీయ యుద్ధసూత్రాలన్నాం. పోయింది... ...సివిలయన్సును చంపగూడదన్నాం. తప్పాం. ఆటంబాంబు వేయకూడ దంటున్నాం...వేసేస్తాం...మనం యిప్పుడు కేవలం బోనులోపడ్డ ఎలుకలం.

మృత్యువు ఏ రూపంలో ఎప్పుడు వస్తుందో ఎరగం! మనం మనుష్యులం!... నాగరికులం...మనం ముందుకు పోతున్నాం..." ఇది భూదేవి హృదయము. అంతేకాదు హిరోషిమాలో మానవుని భస్మము చేసిన మారణాస్త్రము ప్రసాదించిన మృత్యుధూళిలో బ్రదుకుచున్న సామాన్య మానవుని ఆక్రందనము! పొలికేక! ఆధునిక మానవునికి యుద్ధము సింహస్వప్నము. అదే యేర్పడినచో సర్వము భస్మమని అతని భయము. అందువలన శాంతికొఱకు ఏకైకయుద్యమమును సాగించుచున్నాఁడు! సమకాలీన మానవప్రముఖ సమస్యను కన్నులకు గట్టినట్లు ప్రదర్శించి దానికి తరణోపాయముగా శాంతిని ప్రబోధించిన నాటకమిది!

నాయకుఁడగు విశ్వం - ఆకలిమంటలతో శాంతి లభింపదని నమ్మి కొందరుమానవులు పశువులకన్న హీనులై తమకడుపులు నిండిన తరువాతనైన తమతోడి మానవుల కింతపెట్టవలెననెడి జాలియు లేదనియు, వారికి తగినపాఠము చెప్పవలెననియు, భూమిపై నధికారము సాగుచేయువానికే యుండవలెననియు, రైతులకు కర్షకులకు నాయకుఁడై అన్నగారికెదురు నడిపించిన వీరుఁడితఁడు.

ఆనకట్ట, రిజర్వాయరు కట్టుటకుద్దేశింపఁబడిన ప్రదేశమునందు పెద్దవాఁడు పింగాణీ ఫ్యాక్టరీకట్ట నిశ్చయించి, గ్రామాధికారము స్వీయదత్తమై యుండుటచే ధాన్యముఁగొంత తగులఁబెట్టించి, ధాన్యపురవాణా స్తంభింపఁజేసి, ధరలనుపెంచి, మంచినీటి సౌకర్యములు తొలగించి, ప్రజల హింసించి తన యధికారదండము క్రిందకు తెప్పించినాఁడు. భూదేవి, విశ్వం, శాంతి, సమత మొ. వారు ఆకలిదప్పులకోర్చి గ్రామస్థుల కండయై అరువదిమైళ్ళనుండి కూడ నీటిని లారీలపైఁ దెప్పించి ప్రజలకిప్పించినారు. మధ్యలో ప్రజలు పెద్దవానికి లొంగిపోవుటయు, పింగాణీ ఫ్యాక్టరీ మారణాస్త్ర నిర్మాణ కర్మాగారమగుటయు గాంచి దేశక్షేమము నభిలషించి శాస్త్రిని పరిత్యజించివచ్చిన శాంతి సహాయముతో 'యుద్ధం' అను నాటకమును ప్రదర్శించి అసలు సత్యమును ప్రజల కర్థమగునట్లొనర్చి వారిలో విప్లవము లేవదీసి కర్మాగారమును కూలద్రోయించి ఆనకట్టను కట్టించిన కర్మవీరుఁడు విశ్వం. సమత, శాంతి అనునవి అతని నినాదములు; లక్ష్యములు. తన గ్రామములో వానిని సాధించి విశ్వమున కాదర్శమైనాఁడు విశ్వం.

ప్రాచీన యుద్ధవీరమును నిరసించి, విశ్వశాంతి ప్రధానమగు ధర్మవీర మునే నవ్యుఁడాశించుచున్నాఁడు. అదియే స్వార్థపరుల బాంబుల వర్షమువలన భూదేవి బ్రద్దలుకాకుండ నిలుచు ఏకైకమార్గము ! దానిని చాటినదీ నాటకము.

## ఏకాంకికలు

"ఏకాంకిక పెద్దదిగా నుండకూడదు. అందులో ప్రధానవిషయమొక్కటే ఉండవలెను. పాత్రలు ఎంత తక్కువ ఉంటే అంత సౌలభ్యము. పాశ్చాత్యుల ఏకాంకిక ప్రదర్శనలో సామాన్యముగా 20 నిమిషాలకు తగ్గకుండా 45 నిమిష ములకు దాటకుండా ఉంటుంది. పావుగంట మొదలు గంటవఱకు ఉన్నా రక్తి కట్టుతుంది.

వస్తువేదయినా కావచ్చు సర్వసాధారణముగా ప్రేమ—సంయోగ వియోగములు, కరుణరస ప్రధానమైన ఘట్టములు, ఆశ్చర్యజనకమైన సన్ని వేశాలు,నర్మగర్భముగాకాని నగ్నముగాకాని నవ్వుతెప్పించే విచిత్రవిషయాలు— వస్తువు. కొందరు రచయితలు అతిసామాన్య విషయాన్నికూడా కల్పనా విశేషముచేత అద్భుతావహము చేస్తారు. ఎలాగైనా విరోధముండి సంఘర్షణ పుట్టి సమాప్తమైతేకాని వస్తువు రసవంతము కాకపోతుంది

కొన్ని ఏకాంకికలు సంభాషణ సామర్థ్యమువల్లనే సజీవముగా ఉంటవి. కొన్నింటిలో పాత్రోన్మీలనమే ప్రధానము. మరికొన్నింటిలో విపర్యాసమువల్ల వైచిత్రి సంభవిస్తుంది. కొన్నిటిలో భాషా చమత్కారమువల్లనే ప్రమోదము కల్గుతుంది. రసపర్యవసన్నము అయిన ఏకాంకికే రమణీయము కావడము నిర్వివాదము."[1]

సంస్కృతభాషలో ప్రప్రథమముగా నేకాంకికలు వ్రాసినవాఁడు భాసుఁడు. అంతకుపూర్వము ఋగ్వేదము, పాణినికృత అష్టాధ్యాయి, పతంజలి యోగభాష్యము మొ॥ గ్రంథములందు సంవాదాత్మకములైన కొన్ని ఘట్టములు గోచరించును. అవి ముడిపదార్థము దానిలో తయారుచేసిన శిల్ప కళాఖండికలు భాసునివి ! కర్ణభారము, దూతఘటోత్కచ, మధ్యమవ్యాయో గము, ఊరుభంగము మొదలగునవి ఆతని ఏకాంకికలు. విషాదాంతములగు రూపకములు చిత్రించిన గౌరవముకూడ నతనికే దక్కినది.

తెలుఁగున సాహితీసమితి కృషి ఫలితముగా నేకాంకికలకు ప్రోత్సా హము లభించినది. ప్రస్తుతము పెక్కురు రచయిత లీ శాఖయందు కృషిచేయు

1. శ్రీ శివశంకరశాస్త్రిగారు—"ఏకాంకికలు" పీఠిక. (సంకలనము) పుట 21-22.

చున్నారు. రంగస్థలములపైనను, రేడియోలోను ఈ యేకాంకికాప్రదర్శన ప్రసారములు జరుగుచున్నవి. అందువలన నిందు రంగస్థలనాటికలు, రేడియో నాటికలు అను భేదమేర్పడుచున్నది.

౧. కర్ణభారము – భాసమహాకవి :

(అనువాదము : కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు)

కర్ణభారము వీరరస ప్రధానమైన ఏకాంకిక. శల్యసారథ్యము సమకూరగా రథారూఢుఁడై కర్ణుఁడు రణరంగమున కీ క్రింది ప్రతిజ్ఞఁ బల్కుచు ప్రథమ దర్శనమిచ్చును.

"క్షితినాథుల్ నిలువంగ రాదిపుడు లక్షీభూతులై యస్మదు
ద్ధత బాణాగ్నికి; నిల్చిరేనియును జెందన్ లేర ప్రాణంబులేన్
ప్రతి వివ్వచ్చుఁడు వచ్చెనేని నెదురై పంతంబు దీర్పన్ వలెన్
దత యుద్ధక్షితి ధార్తరాష్ట్ర సమితిన్ సంతోషపెట్టన్ వలెన్."

ప్రభుభక్తి పారీణుఁడై కర్ణునియందు యుద్ధవీరము తొణికిసలాడిపోయినది. రణరంగమున దిగుటతోడనే యాతనికి దివ్యాస్త్ర సంబంధియు, బ్రాహ్మణ, శాపసంబంధియునైన పూర్వస్మృతి కల్గి దానిని దాచుకొనలేక శల్యునికి జాలి కల్గునట్లు చెప్పివేయును. శల్యుఁడు 'అక్కటా! కష్టగదాయిది"అని వాపోవును. కర్ణుఁడు ధైర్యముతో, "శల్యరాజ ! వలదు వలదు విషాదము !"

"చచ్చిన స్వర్గము వచ్చును బ్రచ్చి జయించినను యశ మవశ్యమ కల్గున్
మెచ్చు గలదేది పొసఁగిన గచ్చియలో రిత్తపాటు గలుగదు చూవే!"

అని యుత్తమ వీరుని రణధర్మ ముట్టిపడునట్లు పల్కి రణోత్సాహముఁ బ్రకటించి ముందుకు సాగినాఁడు. బడబాగ్నిని గుండెలో దాచికొనిన మహాజలధి గంభీరమూర్తి కర్ణుఁడు !

ఇంద్రుఁడు కపట బ్రాహ్మణవేషమున మహత్తరమైన భిక్ష వేడుచున్నాఁనని యెదురువడును. మూలమున నీ ఘట్టమిచ్చుట లేదు, భాసుఁడిచ్చుట దానిని సంధించి విశేషము సాధించినాఁడు. కర్ణుఁడు నమస్కరింప నింద్రుఁడు బుద్ధిపూర్వకముగా "దీర్ఘాయుష్మంతుఁడ వగుమని యనక అఖండయశఃప్రాప్తి గల్గునట్లాశీర్వదించెను. కర్ణుఁడు దానిని గమనించియు బొల్ల యొడలికై విచారింపక ధర్మమును భావించెను.

"ధర్మమెల్లని సాధింపఁ దలపవలయు, ద్రాచు నాల్కలవంటివి రాచసిరులు;
ప్రజల బ్రోవను ధర్మసంపత్తి దక్కఁ గళ్ళలంబగు నొడలికిఁ గలదె గుణము."

అని ధర్మైకబుద్ధిని, దేహాభిమానరాహిత్యమును ప్రకటించినాఁడు.

ఇంద్రుఁడు మహత్తర భిక్ష యనుటలో కర్ణుని కాత్రము కలిగి క్రమముగా గోసహస్రములు, అశ్వసహస్రములు, గజయూధములు, సకల పృథ్వి, అగ్నిష్టోమఫలము, శిరస్సు మొదలగునవి ఈయ సిద్ధమాయెను. అవి యాతఁడాశింపఁడు. అప్పుడు కర్ణుఁడు :

"సహసంజాతము నన్యదుర్లభము నస్మద్దేహసంరక్ష దు
స్సహతేజంబు, సురాసురాస్త్రనిచయాసంభేద్య మస్మన్మహా
మహయాఁ గాక! సకుండలంబయిన మై మర్వేని నీఁ జాలెదన్
మహి దేవోత్తమ! యుష్మదీప్సితమ యేన్ సంతోషపూర్వంబుగన్."

అని ప్రాణసదృశమైన కవచదానమునకు సిద్ధమయినాఁడు. అంతకన్న దానోత్సాహమునకు పరాకాష్ఠ లేదు! దానివలన నీతని కేర్పడు కీర్తి యాచంద్రార్కము చెదరదు.

"సంతర్పించెద రట్టి యాహుతులచే సత్రంబులన్ భూసురుల్
సంతానంబటు లర్జునుండు ఫలభుక్సంఘుంబు మాయించు దు
ద్దాంతుం డింతకు నాకతంబున గృతార్థత్వంబు గాంచెంగదా!

అని ఆధ్యాత్మిక సంతృప్తినొందిన కర్ణుని యంతరాత్మ యమరము! దానిని తెలుఁగువారి కందించిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ధన్యులు!

## ౨. ఎవరు దొంగ ? - శ్రీ 'ఆత్రేయ'

సంఘములో పెట్టుబడిదారుల వలన కళవేర్పడగా బీదలు జఠరాగ్నిలో భస్మమయి పోవుచుండుటయు, ధర్మ రక్షకులగు నుద్యోగు లధర్మపరులై లంచగొండితనమును మరిగి ప్రజాక్షేమమును పాటింపకపోవుటయు గాంచి దాని నెట్టి పరిస్థితులలోనైన నెదుర్కొనవలెనని ప్రయత్నించిన దయావీరుఁడు సబ్ ఇన్స్పెక్టరు. "యత్నే కృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః" అన్న సూక్తికి చక్కని యుదాహరణ 'యెవరు దొంగ'లోని నాయకుఁడు.

బీదవాఁ డొకఁడు భార్యాపుత్త్రు లాకటితో మలమల మాడుచుండగా నావేశముతో హోటలులోఁబడి, బుక్కెఁడన్నమును దొంగిలించినాఁడు. అతఁడు

తిరిగివచ్చు లోపలనే అతని భార్య ముగ్గురుబిడ్డలతో పోలీసు స్టేషను బావిలోపడి చనిపోయినది. ఈ విషాద సంఘటనను కన్నులార కాంచిన ఇన్‌స్పెక్టరు సంఘ పరిస్థితికి విచారించి ధర్మముకొఱ కన్వేషింప ప్రయత్నించినాఁడు.

మఱియొకవైపు D. S. O. వంటి బాధ్యతాయుతుఁడైన ప్రభుత్వోద్యోగి చౌదరితో చేయికలిపి బియ్యములో రాళ్ళుకలుపుటలో భాగస్థుఁడై లంచము గొనినట్లు చెవులార వినినాఁడు. ఎవరుదొంగయో నాతఁడు నిర్ణయింపఁజాలక పోయినాఁడు. సత్యము నన్వేషింపఁబూనినాఁడు. అధికారుల యండ గల్గియున్న చౌదరి సమయమున కాతనికి బదిలీ చేయించినాఁడు. అప్పటి లక్ష్యము నాతఁడు సాధింపలేక పోయినను......ఆతనియందు వెలిఁగెడి ధర్మజ్యోతి మాత్రము ఆరిపోయెడిది కాదు. ఉదాహరణమునకు కొన్నిసంభాషణ లీక్రింద పొందుపఱుచుచున్నాను.

స. ఇ: ఒక తల్లీ ముగ్గురు బిడ్డలూ, అబ్బ! ప్రాణాలంటే ఎంత చులకనై పోయింది!

డాక్టరు: (S. I వీపుతట్టి) నువ్వు పోలీసు ఉద్యోగంలో ఉండతగ్గవాడివి కావు. నీకేదో కాస్త హృదయం ఉన్నట్లున్నది...తొంభై మంచిగింజల్లో ఒక్క పుచ్చుగింజ ఎంతో, తొంభై పుచ్చుల్లో ఒక మంచున్నా అంతే. నువ్వొక్కడివి ఏంచేయగలవు? లంచగొండితనము, బ్లాక్‌మార్కెట్ అధికారం చలాయిస్తున్న రోజుల్లో నీ ఆవేదనంతా నిరుపయోగం.

స. ఇ: అయితే నేనూ ఈ ప్రవాహంలో కొట్టుకపోవలసిందేనా! ఏంచెయ్యలే నంటారా?

డాక్టరు: చేయగలవు కాని నీకు ప్రమోషన్లు రావు. నిమ్న ఏ యెడారిలోకో బదిలీ చేస్తారు. ఇంకా ఇలాంటి ఇబ్బంది లెన్నో వస్తాయి.

స. ఇ: ఎన్నొచ్చినా సరే యీ నిండుప్రాణాలు తిండిలేకుండా మాడిపోయే దౌర్భాగ్యాన్ని ఆపాలి.

డాక్టరు: సరే. ప్రయత్నించు. 'విష్ యు సక్సెస్'

### ३. మానవత్వం – జి. వి. సుబ్రహ్మణ్యం:

ఉత్కటమైన కామవాంఛను తీర్చుకొనుటకు ప్రాణాలను బలిపెట్టి, లోకమును బెదిరించి, ధనమదముచే నమాయకుల హింసించి విలయతాండవము

చేయు నుద్ధతులు సంఘములోఁ జీడపురుగులు, వారి నెదుర్కొనుటకై దయా ధర్మ వీరధ్వజమెత్తి శాంతిమార్గముననే, బుద్ధిబలమున వారిని మఱలించిన దయావీరుఁడు దయానందుఁడు. అతనిగాథ మానవత్వము.

ధర్మారావునకు కుసుమలత యను చక్కని కన్యకుమార్తె. ఆ ధర్మారావు భుజంగరావు కంపెనీలో గుమస్తా. వృద్ధుడు భుజంగరావు ఆ కన్యను వాంఛించెను. తండ్రి దానిని కనిపెట్టి తగు జాగ్రత్తలోనుండెను. ఒకసారి ధర్మారావు భుజంగరావు కలకత్తాకు కంపెనీ పనిపై నేగిరి. వచ్చునప్పుడు భుజంగరావు వృద్ధుని రైలునుండి అర్ధరాత్రివేళ త్రోసెను. అతఁడు హఠాన్మరణము నొందినాఁడని కుమార్తెకుతెల్పి, సంతాపసభ నేర్పాటుచేసి, సానుభూతిని ప్రకటించి కుసుమలతను మోసగించి వివాహ మాడెదనని దరికిఁ జేరదీసి. గర్భవతియగు నంతవఱకు మన్నించి యాపై నామెను వెడలఁగొట్టినాఁడు. దయానందుఁ డీ విషయమును గమనించి దయామయుఁడై దరికిఁజేర్చి సోదరివలె గౌరవించి రక్షించినాఁడు. ఇంతలో ధర్మారావు ఆ యూరు వచ్చినట్లు పసిగట్టిన భుజంగరావు రౌడీలతో నాతనిని చావమోదించెను. కాని యాతరుణమున దయానందుఁడచ్చట తారసిల్లి వృద్ధుని చావునుండి తప్పించెను. అతనికి పరిచర్యలొనర్చి విషయమంతయు గమనించి భుజంగరావును రంగమునకీడ్చి అతని విషదంష్ట్రల నూడబెరికించినాఁడు. ఇందు దయానందుఁడు చేసిన ప్రయత్నము ప్రశంసావహము. పశ్చాత్తప్తుఁడైన భుజంగరావును క్షమించు నాతఁడు దయావీరుఁడనుట కెట్టి సంకోచము లేదు. మచ్చునకు కొన్ని సంభాషణలు.

[భుజంగరావు - పుల్లయ్య - పెంటుసాహెబు ప్రవేశం]

దయా : ఓ ! భుజంగరావుగారా ! దయచేయండి.

భుజం : దయానంద్ ! ఈ ముసలి తొత్తుకొరకు మమ్మల్ని రమ్మన్నావెందుకు?

దయా : మీ తొత్తుగా ఉన్న ఈ బడుగు దేహం మాసొత్తు అయినదిగనక.

భుజం : దళారి అమ్మిందాకా వస్తువు నాలాగే అంటాడు.

దయా : మిష్టర్ భుజంగ్ ... గౌరవాన్ని ఇచ్చిపుచ్చుకోండి.

భుజం : (నవ్వి) ఎందుకు మనకీ వివాదం. మాసొమ్ముకు తగిన విలువ నిచ్చేయండి ... వెళ్లిపోతాము.

దయా : విలువ ... ప్రాణాలకు విలువ ! ఈ విలువ నే లెక్కతో కట్టారు భుజంగ్ ?

భుజం : అమాయకుడ! వడ్డీలెక్కలు నేర్పమంటావా? గణితశాస్త్రం చదువు...

దయా : మాకు దాంతోపనిలేదు ... హృదయశాస్త్రం చదివితేచాలు.

భుజం : అందుకే విలువలేని వాడవైనావు.

దయా : కావచ్చు. కాని విలువలెరిగిన మహాత్ములుగదా మీరు. ఈ పటానికి విలువ ఎంతకట్టుతారు ? (కుసుమ ఫొటో చూపుతాడు)

భుజం : (అవుడుకరచి) ఓరి! అదా నీ భావం ... అర్థమయింది ... కావాలంటే మరో పదివేలు తీసుకో.

దయా : పదివేలు ... పట్టుమని తింటే పదిపూటలురావు నీ పదివేలు (పిల్లవాని ఫొటోచూపి) నిండు జీవితం నిర్వహించవలసిన ఈ పసికూన కేం సమాధానం చెప్పుతారు ...

భుజం : అదంతా అనవసరం. చెట్టునుండిరాలిన ప్రతికాయకు మానవుడు బాధ్యుడు కాలేడు.

దయా : గురిచూచి రాయివిసరినప్పుడున్న కాయ రాలేటప్పు డుండదా ?

భుజం : తాను వేసిన రాయికే ఆకాయ పడిందని నమ్మకం ?

దయా : రాతిగుర్తులు ముమ్మూర్తులా హత్తుకొని వచ్చింది భుజంగరావు !

భుజం : (ప్లేటుమార్చి) దయానంద్! మనమిద్దరం స్నేహితులము. ఈ చీమ కొరకు చీకాకుపడకు. సిద్ధాన్నాన్ని ధ్వంసంచేసుకోకు...నీ సేవలు దేశం నిరీక్షిస్తున్నది. రేపీపాటికి నిన్నొక మంత్రిని చేస్తా...వచ్చే యీ నాటికి నిన్నొక జమీందారును చేస్తా...

దయా : అదే దేశసేవైతే నాకా సేవా వద్దూ—నాకా పదవీ వద్దు...

భుజం : రత్నమొచ్చి కాలికి తలిగితే రాయని త్రోచివేస్తున్నావు నిర్భాగ్యుడా!

దయా : నేనుకాదు...నీవు ఆపని చేస్తున్నది.

భుజం : అధర్మంగా నామీద నిందారోపణం చేస్తున్నావు.

దయా : ధర్మం...అధర్మ...భుజంగ్! నీకీ ధర్మచింత ఎన్నాళ్ళనుండి ? (ధర్మారావువైపు చూపి) నీ కామదాహానికి అడ్డువస్తాడని అర్ధరాత్రిలో ఈ అమాయక జీవిని అగాధమైన మృత్యుముఖంలో త్రోసినప్పుడు లేదూ ధర్మచింత ... (కుసుమ ఫొటో చూపుతూ) అవ్యక్త మధురమైన ఈ జీవిత కుసుమాన్ని తొలిసారి బలవంతాన రుద్దినపుడు లేదూ నీకీ ధర్మచింత ... ఆఘ్రాత కుసుమమని ఆదరించకుండా నలిపి దూరంగా పారవేసినప్పుడు లేదూ నీకీ ధర్మచింత ...! (పాపఫొటో చూపుతూ) నీ నీడ నీదికాదని వాదించేటప్పుడు లేదూ ఈ ధర్మచింత...

## నవలలు

### ౧. రుద్రమదేవి - శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు

నవ్యసాహిత్య గద్యశాఖలలో ప్రసిద్ధమయినది నవలా రచనము. వీరేశలింగం పంతులుగారు దీనిని మొదట గద్యప్రబంధమనిరి. వారి రాజశేఖర చరిత్రకు పూర్వము గద్య ప్రబంధములు లేకపోలేదు. కాని అవి పురాణగాథ విలసితములై పురాణప్రాయములై యొప్పుచున్నవి. ఆంగ్ల సాహిత్యమున 'Novel' అనఁబడు సాహిత్యప్రక్రియ నాధారముగాఁ గొని తెలుఁగున వెలసిన రచనాప్రక్రియ నవల. "A Novel may be judged by the two fold canon of truth and beauty; by its closeness to life, its depth of insight, its range of life, its breadth of treatment, its reduction of experience to a pattern."[1] ఈ సమీక్షకు నిలిచినది. నవలయని పాశ్చాత్యుల దృక్పథము.

నవలలో ఇతివృత్తమునుబట్టి చారిత్రక నవలలు (Historical Novels) సాంఘిక నవలలు (Sociological Novels), మనస్తత్త్వ ప్రధానమయిన నవలలు (Psychological Novels), అపరాధ పరిశోధక నవలలు (Detective Novels), జ్ఞానప్రధానమైన నవలలు (Sentimental Novels) అని వానిని విభజింపవచ్చును. నవలా నిర్మాణమునుబట్టి వానిని రెండు విధములుగాఁ జేర్కొందురు. అవి Panoramic Novels అనియు, Dramatic Novels అనియు పిలువబడును. "The Panoramic Novel is loose in plot and does not enter in a single issue......The Panoramic plot is not so fateful, logical and tragic as the dramatic. The characters are numerous, typical rather than individual, with a single person less of ten monopolizing the attention. The Dramatic Novel is focussed in a single issue that is resolved logically from the premises i. e. the initial situation and the nature of the actors."[2]

తెలుఁగు సాహిత్యమున వెలసిన నవలాప్రక్రియ లన్నిటియందుకన్న చారిత్రక నవలలో వీరమధికముగా గోచరించుచున్నది. సామాన్యముగా నిందు రసదృష్టికన్న వస్తుదృష్టియే అధికము. అయినను రసవత్తర రచన లందును చేసిన నవలారచయితలు తెలుఁగునఁ బెక్కురుగలరు. వారిలోఁ బ్రసిద్ధులు అడవి

1, 2—Dictionary of World Literature. Ed. J. T. Shipley, p. 407, 408.

బాపిరాజుగారు, నోరి నరసింహశాస్త్రిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు. నవలలో సామాన్యముగా సంఘర్షణమే వస్తువునకు వెన్నెముక. అది యంత ర్బహిర్భేదముచే ద్వివిధము. అది ధర్మపరమైనచో వీరము. అట్టివస్తువులు కల్గిన నవలలో నుదాహరణముగా నోరివారి 'రుద్రమదేవి' ని గైకొనుచున్నాను.

రుద్రమదేవిలో నంతర్బహిస్సంఘర్షణలు సామర్థ్యముతోఁ జిత్రింపఁ బడినవి. సంస్కారులగు పండితులకు అంతస్సంఘర్షణాత్మకమైన యితివృత్త ములు నచ్చును. నారాయణభట్టు, నారాయణరావు, అటువంటివి. సర్వజనైక వేద్యము బహిస్సంఘర్షణము. ఇందు మనఃప్రవృత్తి క్రియాత్మగా వ్యక్తమై సులభగ్రాహ్యమగును.

తెలుఁగు బిడ్డల నందఱి నొక్క తెల్లగొడుగునీడలోనిల్పి తల్లివలె పోషించిన ఆంధ్రసామ్రాజ్ఞి రుద్రమదేవి. వైరి వీరసింహస్వప్నమగు కాకతి గణపతిదేవుని యేకైకపుత్రికయామె. చాళుక్య వీరభద్రేశ్వరు లామె భర్త. తం|డితరువాత విశ్వేశ్వరశంభుదేశికుల యాదేశానుసారము నోరుగంటిలో తెలుఁగు గద్దె నెక్కినది. ఆమెతరువాత వారసుఁడుగా నామెమనుమఁడగు ప్రతాపరుద్రుఁడు నిశ్చయింపఁబడినాఁడు. అది వీరభద్రేశ్వరునికి గిట్టలేదు. తన కన్యకశత్రమునఁ బుట్టిన హరిహరదేవుఁడు వారసుఁడు కావలెనని అతనివాంఛ. అది ధర్మబద్ధముకాదని రాజగురువు. వానితో రవరవలు ప్రారంభమైనవి. దానికితోడు సామంత పురుషసింహములలోఁ గొందఱకు స్త్రీపాలనము గిట్ట లేదు. తెలుఁగుచరిత్ర కానాఁడు కాలమేదో క్రొత్తపాఠము వల్లెవేయించిన ట్లనిపించెను.

రుద్రమ హృదయములో సహజమగు స్త్రీత్వమునకు, తెచ్చిపెట్టుకొనిన పౌరుషమునకు, గార్హస్థ్యధర్మమునకును, రాజధర్మమునకును సంఘర్షణ మేర్పడినది. వీరభద్రేశ్వరులను విడిచి తాను రాజ్యముపాలించుట. అతనితో విరోధము సాధించుట అనునవి యామె కశాంతిని చేకూర్చినవి. కాని ధర్మము నకు శరణొందినది. గురుశాసనమునకు వ్యతిరేకింపలేక పోయినది. పాకాల స్కంధావారముఁ జేరుచున్నపుడు భర్త తన్నెదిరింపగా నాతనితోపోరి యతని కరముఁ దెగగొట్టుటతో నామె ధర్మవీరము పరాకాష్ఠ నందుకొనినది. రాజ ధర్మమున కంకితమైన యామెకరవాలము రాజద్రోహియగు భర్తను శిక్షించు టలో సార్థకతఁ జెందినది.

రాణి హృదయము ఇట్లుండ రాజధానీనగరము మఱియొక రీతిగ నున్నది. ఆమె పరిపాలనకు విరుద్ధముగా జైను లంతశ్శత్రువులై రాజ్యము గూలద్రోయ యత్నించుచుండిరి. జైనాశ్రమమున విప్లవములేపియు, కరణములచే సమ్మె జేయించియు, వారు పరిపాలనము స్తంభింపజేయ యత్నించిరి. వారి నాయకుడు కాలాచారి. కాలసర్పమువంటి యాతని కుతంత్రములను అన్నమంత్రివంటి సమర్థులగు మంత్రులచే నిరోధించినది రాణి. నగరమున వలెనే దేశమునగూడ రాణికి శత్రువులతోఁ బోరు నవసర మేర్పడినది. 'ఆంధ్ర రాజ్యము సరిహద్దులం దెల్లెడల శత్రుదండయాత్రలు చెలరేగినవి. నాలుగైదు సంవత్సరముల క్రిందటనే పరాభూతుడైన పల్లవకొప్పెరుంజింగడు మఱల తల యెత్తెను. జటావర్మపాండ్యుడు కంచినుండి నెల్లూరువఱకు ఆక్రమించి రాజ్య మేర్పఱిచెను. ఉత్తరమునుండి కళింగులు పిఠాపురమువరకు చొచ్చుకొని వచ్చి, దక్షిణమునుండి వచ్చుచున్న కొప్పెరుంజింగనితో కలిసికొన నుంకించుచుండిరి. గుంటూరువిభుఁ డగు నాగదేవుడు శత్రువులరాక యాధార మొనర్చుకొని కాకతిరాజుల ధిక్కరించుటయే గాక మండలమునం దెల్లెడల నరాజకము చేయుచుండెను. ఇక అలజడి లేకుండినది పశ్చిమభాగముననే. అందు దక్షిణ భాగమున హొయిసలులును ఉత్తరభాగమున యాదవులును రాణికి పరమ శత్రువులు. అచ్చటినుండి మహాప్రళయ మెప్పటికైన రావచ్చును. వారి కెక్కుడు బలములున్నవి. నివురుగప్పిన నిప్పువలెనున్న వారిపట్ల నిర్లక్ష్యము పనికిరాదు'. ఇన్ని చిక్కులలో గద్దె నెక్కిన రుద్రమ అన్ని చిక్కులను నీతి సూత్రములు తెగకుండ విడదీసి దేశము నొక్క వేణిగా నల్లి వేసినది.

ఆంధ్రసేనానులు ప్రభుభక్తి పరాయణులు. వారి సాయముతో నా యాంధ్రరాజ్ఞి శత్రువిజయము నారునెలలలో సాధించి సుస్థిర సామ్రాజ్యమును స్థాపించినది. త్రిపురాంతకుడు సిద్దయదేవచోడుని, అంబదేవుడు, ఎఱువమల్లి చోడ, కేశవదేవ, సోమిదేవ, అల్లుగంగు, మల్లికార్జున దామోదర, నాగదేవాదులను, వ్యాకరణబ్రహ్మ యగు కాలనిరుద్రుడు, కళింగరాజ, మురారిదేవులను, అన్నమంత్రి హరిహరదేవుని, జన్నిగదేవుడు, కొప్పెరుంజింగ సుందర పాండ్యులను చంపుటకు నవరాత్ర్యుత్సవములందు శపథముల గావించి వానిని సాధించి ప్రభుభక్తిని ప్రకటించినారు. రుద్రదేవమహారాజులను పేరుతో గద్దె నెక్కిన రుద్రమదేవి స్వయముగా చాళుక్యవీరభద్రేశ్వరులను, మహారాష్ట్ర మహాదేవులను చక్కఁబెట్టుభారము గైకొనినది; నిర్వహించినది.

ఈ విధముగా బహిస్సంఘర్షణలయందు ఉత్కటోత్సాహము స్థాయిగా యుద్ధవీరము వ్యక్తముచేయు ఘట్టములు రమ్యతరములుగా వర్ణితములైనవి. త్రిపురాంతకుఁ డర్దంకి మీఁదుగా దండుతో నడచి మోటుపల్లి పట్టిన ఘట్టము, జన్నిగదేవుఁడు కొప్పెరుంజింగని డీకొని చేసిన గజయుద్ధము రసవత్తరముగా వర్ణితములు. మనుమసిద్ది కొప్పెరుంజింగనిఁ బట్టిన విధము, రాజ్ఞి యోడబలముల నడపి విజయము చేపట్టిన క్రమము, కళింగవిజయ ఘట్టము, గుంటూరు నాక్ర మించుట కడు చాకచక్యముతో నిర్వహింపఁబడినవి. రాణి ముఖ్యనగరమున లేనప్పుడు జైనులు మహాదండనాథాదులను మోసగించి చీకటి కూపమునఁ ద్రోసి రాచనగరును కబళింప యత్నింపగా నన్నమంత్రి తిక్కనామాత్యుని సాయముతో, కరణముల సాయముతో జైనులఁ జుట్టుముట్టి బంధించి నగర మును గాపాడెను. మహారాష్ట్రులు విజృంభించి కోటను ముట్టడించి రాతి కోటను దాటి రాజమందిరము ముట్టడించినప్పుడు అన్నమంత్రి రుద్రునివలె రేగి హరిహరుని వధించి, శత్రువుల పీచమడఁచెను. ఇందాతనికి తిక్కచమూపతి, గోనగన్నారెడ్డి, రుయ్యమ, గోవిందశర్మ తోడ్పడిరి. ఇట్లు రాణికి పురుషకా రము సిద్ధపరచినది సేనానులు. దైవసాహాయ్యమును సంతరించి, ఆధ్యాత్మిక ప్రబోధ మొనర్చినది విశ్వేశ్వర శంభుదేశికులు, తిక్కన సోమయాజులు. తిక్కనా మాత్యుని మహాభారత కావ్యగానసారము రుద్రమకు ధర్మవీరమును బోధిం చినది. తత్సంస్కారముతో రుద్రమ ధర్మబద్ధమగు తెలుఁగు పౌరుషము వెలార్చి దేశచరిత్రయందు విమలకీర్తిపతాకలు ప్రతిష్ఠించినది.

౨. రాగమంజరి – జి. వి. సుబ్రహ్మణ్యం :

ప్రభుభక్తి, అచంచలదీక్ష, మిత్రవాత్సల్యము, దేశభక్తి కలసి రూపొందిన యొకానొక ధర్మవీరమునకును స్వార్థము, క్రౌర్యము, రణనీతి, కాపట్యము, పాశవికబలము కలిగిన యుత్కటమైన సామ్రాజ్య కాంక్షకును జరిగిన సంఘర్ష ణము తోపూరుయుద్ధము, తాళికోట యుద్ధానంతరము విజయనగర రాజ్యము మఱింత నేలమట్టమగుటకు కారణమైన ఆ యుద్ధము చరిత్ర ప్రసిద్ధము (క్రీ.శ. 1616 సం. జూన్ 25). దాని నితివృత్తముగాఁ గొని వ్రాయఁబడిన నవల 'రాగమంజరి'.

చంద్రగిరి రాజధానిగా నేలుచున్న వృద్ధనృపతి వేంకటపతి రాయలకు సంతానము లేదు. అతని బావమఱఁదియు, సేనాధ్యక్షుఁడునునగు జగ్గరాయలు

కపటియై రాయలభార్య లగు కాండాంబా బాయాంబలను కూడగట్టుకొని, బ్రాహ్మణపుత్రుని రాజపుత్రునిగాఁ బ్రకటించి రాజ్య మాతనికిఁ గట్టపెట్టి యాపై తాను కాజేయఁ జూచెను. అమాయకుఁడైన వృద్ధనృపతి మొదట యా తంతు తెలిసికొనక నా బాలుని పుత్రుఁడని నమ్మి ఆపై సత్యము తెలిసి లోలోనఁ గుమిలిపోయెను. రాజభక్తి సంపన్నుఁడు యాచమనాయని కీ విషయముఁ దెల్పి శ్రీరంగరాయలకుఁ బట్టముకట్టి తత్ప్రోషకార్థము తంజావూరు రఘునాథ రాయల సహాయము నభ్యర్థించెను. కాని అనతికాలములోనే వెంకటపతి చని పోయెను. జగ్గరాయలు కుట్రపన్ని శ్రీరంగరాయలను ఘోరముగా హత్యఁ జేసెను. శ్రీరంగరాయల కుమారుఁడు రామదేవరాయలు దైవవశమున దప్పింపఁబడి యాచమనాయని యొద్దకుఁ జేర్పఁబడెను. రాగమంజరి యాతనిఁ బెంచి పెద్దవానిఁ జేసెను.

యాచమనాయఁడు వెల్లూరుకోట నాక్రమించి అందు రామదేవ రాయలఁ బ్రతిష్ఠించి జగ్గరాయల నెదిరింప నెంచెను. దేశభక్త కూటమిని స్థాపించెను. స్వీయధర్మ నిర్వహణముపై భక్తిగలవారందరు అందులో సభ్యు లుగా చేరిరి. వెల్లూరులో దేశభక్త సైన్యము సర్వ సంసిద్ధమైనది. ఆ సైన్యము నకు సర్వసేనాని దామర్ల చెన్నయ్య. అతఁడు రెండు వేల సైన్యముతోఁ జెంజిని ముట్టడించుటకు నైఋతి దిక్కుగా వెడలెను. యాచమనాయఁడు మఱి రెండు వేల సైన్యముతో జగ్గరాయలను తూర్పు కనుమలలో డీకొనుటకు వాయువ్య ముగా వెడలెను. చంద్రగిరిఁ బట్టుటకు రామప, అయ్యప లేఁగిరి. వెల్లూరుకోట రామదేవరాయల నాయకత్వమున నైదువేల సైన్యముతో పరిరక్షితమగు చుండెను. కావేరీనదిని దాటి మధుర సేన లుత్తరమునకు రాకుండ తంజావూరు రఘునాథరాయలు అడ్డగించెను. చెంజి, చంద్రగిరి, గొబ్బూరివారి దుర్గములు యాచమనాయని క్రిందకు వచ్చెను. రామదేవరాయలు చక్రవర్తియని ప్రక టింపఁబడెను.

జగ్గరాయలు ఓడి మధురకు పారిపోయి మఱల సేనలఁ బ్రోగుచేసి పోరు నకు సిద్ధమగుచుండెను. యాచమనాయఁడు దేశభక్త మండలిని గూర్చుకొని రఘునాథరాయలతో కలిసి రాయలే నాయకుఁడుగా తోపూరు సమీపమున జగ్గరాయలతోఁ దలపడెను. చరిత్ర ప్రసిద్ధమైన ఆ యుద్ధము కురుక్షేత్ర యుద్ధమువోలె ప్రవర్తిల్లి జగ్గరాయలు రఘునాథరాయల కత్తివాతఁ బడుటతో నది యంతమైనది. కల్యాణీ రామదేవరాయల వివాహ పట్టాభిషేకములతో

రఘునాథరాయలకు వేంకటపతిరాయలయం దున్న స్నేహాతిశయము, యాచమనాయనికి ప్రభువుపైఁగల భక్తివిశేషము పూచి, ఫలించినవి. అచంచల రాజభక్తి కృతఘ్నతపై సాధించిన విజయము తోపూరుయుద్ధ వీరగాథ!

ఈ నవల చారిత్రకమైనను రసపోషణకొఱకై కొన్నిమార్పు లొనర్చిన యితివృత్తము గలిగి విజయనగరప్రభువులకు భక్తినీరాజనమై వరలుచున్నది.

## కథానికలు

నవ్యులు రచించుచున్న కథలు "ఆఖ్యాయిక (A connected story), ఆఖ్యానము (A Tale, especially a legend or a narrative), ఆఖ్యానము (An episode, a short legend), ఖండకథ (A short tale or Sketch), కథానకము, కథానిక (A Story)" అని విభజించుకొనవచ్చును అని శ్రీ శివశంకరశాస్త్రిగారు. "కావ్యానికి వలెనే కథకూ శరీరము ఆత్మ విడతీసి వివేచించాలి. శరీరమన్నప్పుడు భాష, వాక్యనిర్మాణము, వాక్యసందోహము, ప్రకరణ విభాగము, కథానామము, నాయికానాయకాదుల నామధేయములు, గమనవిధానములు, మొదలయినవి గమనించాలి. ఆపైన శరీరానికి లావణ్యము వలె కథకు శైలి కమనీయంగా ఉండేట్టు రచించవలె. కథాత్మలో వస్తువు, తద్విశేషాలు, భావాలు, భావపర్యవసన్నత, రసప్రతీతి, ఇవి లక్ష్యములో ఉండాలి. రచయితల రసికతనుబట్టి హృదయంగమత్వముగాని, ధీప్రతీతిగాని ఉద్దీప్తమై ఉంటుంది. కేవల బుద్ధివైశద్యవిస్ఫూర్తికంటె హృదయాకర్షకమైన భావతత్పరత్వమే రమ్యతరమైనదని రసిక జనసమ్మతి."[1]

కథావాఙ్మయమున తెలుఁగులో ప్రసిద్ధిచెందిన గ్రంథము—కాశీమజిలీ కథలు. సాహసప్రధానమయిన కథ లిందు పెక్కులు కలవు. కాదంబరికథకూడ యిందు సంఘటితము. వీరాద్భుతముల కీ కథలన్నియు కాణాచులు. "రాజాస్థాన కథావళి" వీరరసాత్మక కథలసంపుటి. వానికన్న విలక్షణమైనవై శిల్పవైశిష్ట్యము, మానసిక వివరణము, సన్నివేశౌచిత్యము, పాత్రపోషణము, రసప్రతీతి, ప్రధానమైన శిల్పవిస్తరము కలిగిన కథానిక యిప్పుడు తెలుఁగున బహుళ ప్రచారమున నున్నది. ఉదాహరణముగా శ్రీ బుచ్చిబాబు రచించిన "నిరంతరత్రయం" తీసికొనఁబడుచున్నది.

---

1. ఆంధ్ర కథామంజూష. సం. స్వామిశివశంకరశాస్త్రి. పీఠిక. పుట 11.

౧. నిరంతరత్రయం - శ్రీ 'బుచ్చిబాబు'గారు :

విశ్వసాహిత్యముతో చక్కని పరిచయము గలిగి మనస్తత్త్వ సిద్ధాంతములకును, మానవ నిత్యజీవితమునకు సమన్వయ మన్వేషించు ప్రయోగములు వీరికథలు. కథ నొక కళగా నుపాసించు సాహిత్యోపాసి శ్రీ బుచ్చిబాబు. సంప్రదాయములకును, నైతికపువిలువలకును దూరముగాక వానితో సంబంధము గల్గిన మానవుని జీవితమహోదధిలో నేర్పడు సుడిగుండాలను, వెల్లువికే మహాతరంగాలను పఠితకు ప్రత్యక్షీకరించెడు కళాస్రష్ట బుచ్చిబాబుగారు. తమ కథా రచనా ప్రక్రియ నీక్రింది విధముగా వారు వ్యాఖ్యానించినారు. "ప్రేమకథ మాత్రం వ్రాయకూడదని. రాజకీయచైతన్యం ప్రబలిపోయిన ఈరోజుల్లో ప్రేమ కథలప్రచారంతగ్గింది. అవన్నీ దగాఅనీ, అవి రాసేవాళ్లు సమాజానికి శత్రువులనీ, పాఠకులలో వొక అభిప్రాయం స్థిరపడుతోందని నాకనిపించింది. ఇప్పుడు సంఘాన్ని, సంస్థలని, తెగలని, కూటాలని విమర్శించి, భూస్వామితత్వాన్నుండి బైలుదేరిన విలువల్ని హేళనచేసే కథలకే ఎక్కువ పలుకుబడి. సంఘంలోని అన్యాయానికీ అక్రమానికీ అధర్మానికీ కారణం 'దేవుఁడు' 'కర్మ' కాదు, ఆర్థిక పరిస్థితులేననీ, వాటిని నలుగురం కూడబలుక్కొని సరిదిద్దొచ్చుననీ జనానికి తెలిసిపోయింది. పాత్రలు, తరగతులకు చెందేవారవాలిగాని, వ్యక్తిత్వం 'ప్రత్యేకత' గలవారు కాకూడదు. ధనికులపై ద్వేషం, బీదలపై సానుభూతి, పురికొల్పాలి. మిల్లుయజమానుల్ని నిర్మూలించడం యీనాటి సాహిత్యంలో 'ఫాషన్'."

"ప్రేమ కథ వ్రాయకూడదన్న నిశ్చయానికి రాగలిగినా, సామాజిక నిర్మాణాన్ని చిత్రించే కథలని గురించి అనుమానాలు రాసాగాయి. వ్యక్తులు రాజకీయ ఆర్థిక పరిస్థితులకు లొంగిపోయి, కీలుబొమ్మలైన పక్షంలో వారి ప్రవర్తనకి వారు బాధ్యులు కారు; సమాజం అవుతుంది. అట్లాంటప్పుడు మంచి చెడ్డలకు, నైతిక విలువలకు స్థానమే వుండదు. బాహ్యప్రపంచంలో శక్తులకు లొంగిపోకుండా, వాతావరణానికి అతీతం కాగల్గినప్పుడే, వ్యక్తిగతమైన నీతి ప్రస్తావనకి తావుంది. ఇల్లా అనుకోడం గూడా భూస్వామితత్వపు నాగరికత లక్షణమేనంటే నేనేం చేసేది? ఈ రకం ఆలోచనలోపడి— ప్రేమకథా సాహిత్యానికీ సామాజిక కథా సాహిత్యాకీ గల తారతమ్యానికి నే కట్టిన విలువల ఔచిత్యం పాఠకులే పోల్చుకుంటారన్న ఆశతో యీ రచన సాగిస్తున్నా—"నని బుచ్చిబాబుగారు తెల్పినారు.

ఆధునిక కథలలో, కథానికలలో — కావ్యాలలో కనపడే — ధర్మయుద్ధ వీరాలు స్వచ్ఛముగా దొరకవు. అట్టి ప్రవృత్తి సంఘమున ప్రస్తుతము లేదు కావున దానికి ప్రతిబింబరూపముగా దీర్చిదిద్దు ఈ రచనలలో నట్టి ఆదర్శభావము లుండుట కష్టము. అయినను సంఘమున నుత్తములులేరని నా భావముకాదు. వారు నవ్యసమాజము ప్రసాదించుచున్న క్లిష్టపరిస్థితులలో వాని నెదిర్చి సంపూర్ణమానవులుగా మాత్రము కన్పడుటకష్టము. మానవ మనస్తత్వశాస్త్రముల మథించి 'Conscious and subconscious' స్థితులను పరిశోధించుచు సంఘము నీ వినూత్న నిశితదృక్పథముతో చూచు నేటి రచయితకు రాముని వంటి సంపూర్ణమానవుఁడు దొరుకఁడు. అందువలననే బుచ్చిబాబుగారు "కేవలం మంచివాళ్లు కేవలం చెడ్డవాళ్లు వుండడం అసహజం. ప్రతివారిలోనూ కాస్త మంచి, కాస్త చెడ్డ కలిసుంటాయి. ఆయా పరిస్థితులను బట్టే ఆయాశక్తులూ వంపులూ బైటపడుతుంటాయి. చాలాభాగం మంచిగా చెలామణి అవుతున్నది. దొరికిపోని చెడ్డతనం అంటే అతిశయోక్తి కావచ్చు కాని సత్యదూరం కాదు" అని యనినారు. ఇట్టిదృష్టితో చిత్రింపఁబడు కథానికా పాత్రలు లోకవృత్తము నాధారముగా గొని పైకిలేచి భావప్రధానమైన మానసిక జీవితమును నడపి పఠితయొక్క అంతరాంతరములకు సన్నిహితులై సానుభూతి నందెదరు. ఇట్టి ధ్యేయముతో కొందఱు కథానికారచనలు చేసి నైతికపు విలువలు పోషింపలేక తప్పటడుగు వేసినారు. బుచ్చిబాబుగారు మాత్రము ఎట్టి యుద్రేక పరిస్థితులందు కూడ ఆత్మసంయమనమును వీడక పాత్రలను తీర్చిదిద్ది, వారిని నొక రీతికి, ఒక సంస్కృతికి కట్టుబడిన వారివలె చిత్రించినారు. అట్లు చిత్రితమైన పాత్రలలో 'కరుణాకరం' తెలుఁగువారి హృదయాలలో చెరిగిపోఁడు.

"సూర్యరశ్మి నీళ్ళు లేనిదే ఏ మొక్కా జీవించనట్లు అనుకూలవాతావరణం, వ్యక్తి ఉన్నప్పుడే ప్రేమ నిలుస్తుంది." అట్టి ప్రేమ శాశ్వతము కాదు. మనస్తత్త్వవేత్తలనుబట్టి ఇట్టి ప్రేమయే లోకమున బహుళముగాఁ గాననగుచున్నది. కాని దాని కెదురీత ఈది అశాశ్వతమునుండి శాశ్వతమునకు పురోగమించు చిత్తవృత్తితో నుత్సాహముఁ బ్రకటించెడి ధీరుఁడు కరుణాకరము.

మిత్రుఁడు కామేశము క్షయాసుపత్రిలో నుండ అతని భార్యయగు సుగుణకు కరుణాకరమునకు నేకాంతము దొరికినది. ఆమెహృదయమునకు కావలసినదిదయ, ఆదరణ. దానిని భర్త నిమ్మని కోరగా దానిని కామముగా భావించి కామేశము తృణీకరించెడివాఁడు. ఆమె హృదయము దెబ్బతినినది. భర్త

యొద్ద పొందజాలని యా అనుభూతిని కరుణాకరమునుండి పొందఁగోరినది. ఇది సంస్కృతికి విరుద్ధమే. చావుబ్రతుకుల మధ్యనున్న భర్తపై నిర్దయచూపుట, చాటుగా నన్యపురుషుని కోరుట, అతని నుత్తేజపరచుట అనునవి ధర్మవిరుద్ధములే. కాని నవ్యుఁడూహించు 'ప్రేమ'కు సజీవకల్పన మామె. కరుణాకరము రెండు ధర్మము లమధ్య నలిగిపోయినాఁడు. మిత్రునికొఱ్ఱకై నతనికి సాయము చేయుటకై నిలిచి సేవచేయుచున్నవాఁ డతఁడు. అతని యునికి మిత్రునికి సంతోషహేతువు కాని, సుగుణతోడి సాన్నిహిత్య మతనిని అధఃపతితునిగా నొనర్పఁగలదు. కాని ఆమె హృదంతరాలను సానుభూతితో నర్థము చేసికొనిన అతఁ డామె మనస్సును నొప్పిపెట్ట వెరచినాఁడు. శిరీష కుసుమపేశలమైన ఆమె హృదయ మిదివఱకే గాయపడియున్నది ఒక విధముగా నా భార్యాభర్త లిరువురు రోగులే. వారిరువురి రుగ్మత మాపుటయు, తానధః పతితుఁడు గాక నడచుటయు నతనికి అసిధారావ్రతమైనది. ఆమె వలపును కాదని నోటితో ననలేదు. మిత్రుఁ డారోగ్యవంతుఁడైన చూతమనుచు నామె మనస్సు తననుండి అతనిపై బాగుగా ప్రసరించునట్లు వ్యవహరించినాఁడు. అతఁ డిరువదవ శతాబ్దపు ప్రవరాఖ్యుఁడేమో !

కామేశమునకు దేహ మారోగ్యము బొందినది. సుగుణాకామేశములు కలిసి నివసించుచున్నారు, కరుణాకరము వారినుండి వైదొలిగినాఁడు. ఆరోగ్యముఁ బొందిన భర్తపై సానుభూతిని సుగుణ సాధించునని యతఁడు భావించినాఁడు. అంతలో తనకే టి. బి. వచ్చినది. కామేశము సకుటుంబముగా తనకు సేవలుచేయ మొదలిడినాఁడు కాని సుగుణ అతనిని బలపరచలేదు. దానిని గమనించి 'కరుణాకరం' కుమిలిపోయినాఁడు. తాను చేసిన ప్రయోగముఁ దలపోసికొనుచు, అనంతయాత్రకు సిద్ధమయినాఁడు. తన గంభీర హృదయమును దాచుకొనుటకు చాలినంత విశాలలోకమునకు వెడలిపోయినాఁడు.

"ఆ రోజులలో ఆమెకి ప్రేమ, ఆదరణ, కావాలి. నేను వాటి నివ్వటానికి యత్నంచేసాను. అతనికి ఉపకారం చేసినట్లే, ఆతని శరీరంలో వ్యాధి — ఆమె హృదయంలో గాయం రెంటినీ మాన్పటానికి నా యత్నం. ఎవరి కర్థమౌతుంది! హృదయం క్షణంక్షణం జీవిస్తుంది; ఆశిస్తుంది, అనుభవిస్తుంది; అంతే శాశ్వతత్వాన్ని ఆదేశించదు. మనం శాసిస్తాం" అనెడి 'కరుణాకరం' లోని సంయమము కరుణ అతని నొక దయావీరునిగా దీర్చిదిద్దినది.

## స్వీయచరిత్రలు

### ౧. బాపూజీ ఆత్మకథ - శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

బాపూజీ తనజీవితమున సత్యాన్వేషణములో నొనరించిన ప్రయోగము లను స్వీయచరిత్రగా రచించి లోకమునకు సత్యాహింసలనెడి వెలుఁగులతో నిండిన యుజ్జ్వల మార్గమునుచూపిన మహాత్ముఁడు, జాతిపిత, భారతస్వాతంత్ర్య సమరనేత, ప్రపంచ శాంతిజ్యోతి. బాపూజీ స్వీయచరితను 'ఆత్మకథ' గా నభినవ తిక్కన బిరుదాంచితులైన తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు రచించిరి. గాంధీగారి చరిత్రమనఁగాఁ బరదాస్య శృంఖలములను శాంతసమరమనెడి సాధనముచే తెగత్రెంచిన భారతీయులగాథయే. రంగము దక్షిణాఫ్రికా కావచ్చును. హిందూదేశము కావచ్చును. ఒకదానికొకటి పోషకము కావచ్చును!

గాంధీజీ యొక మహాకర్మయోగి. జ్ఞానమును, కర్మను మేలుపాళ్లలో కలిపి జీవితమునఁ బ్రకటించిన మహాసత్త్వుఁడు. విజ్ఞానమునకు మీరిన వినయము, సహనము అతనికి వన్నె తెచ్చినవి. జీవితమంతయు కర్పూరఖండముగా సత్యారాధన మొనర్చిన త్యాగవీరుఁ డాతఁడు. ధర్మముతప్పని ధర్మవీరుఁడు. వెన్నవంటి హృదయముగల్గిన దయావీరుఁడాతఁడు. పతితులనుద్ధరించిన ధర్మషరుఁడు.

"నా రచింపఁగఁబోవు గ్రంథమ్ములందు నెచటనే నహంతాగంధ మించుకంత
సోఁకు నట్టులైన మత్పరిశోధనమున వెలితి కలదంచుఁ జదువరి తెలియుఁగాఁక!"

అని సూటిగా తెల్పిన నిరహంకారి, సాత్త్వికగుణసంపన్నుఁడు గాంధీజీ.

దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమము, భారతీయ స్వాతంత్ర్యోద్యమము, టాల్‌స్టాయ్ ఆశ్రమమున సంయమముతోడి స్వాతంత్ర్య వీరవ్రతము, కాంగ్రెసు స్థాపనము, రౌండుటేబులు కాన్ఫరెన్సు, ఖాదీ యుద్యమము, సహాయనిరాకరణోద్యమము, హరిజనోద్ధరణము మొదలైనవి అతని చరిత్రలో స్వాతంత్ర్య వీరస్ఫూర్తిని గల్పించుచున్నవి. భారతజాతి బ్రతికియున్నన్నినాళ్లు అతని 'యాత్మకథ' అవతారచరితమై విలసిల్లుననుటలో విప్రతిపత్తిలేదు. గాంధీజీ వలె దేశభక్తితో స్వాతంత్ర్యోద్యమమున కృషిచేసిన వీరులెందరో తమ స్వీయచరిత్రలు వ్రాసికొనిరిగాని, గాంధీగారి యాత్మకథ వానియందెల్లె శలను 'తలమానికము. తెలుఁగువారిలో కీ. శే. టంగుటూరి ప్రకాశముపంతులు - ఆంధ్రకేసరి', కీ. శే. పట్టాభి, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగార్ల ఆత్మచరిత్రలు ప్రసిద్ధములు, దేశభక్త్యుత్సాహ ప్రబోధకములు.

స్వీయచరిత్రల తరువాతఁ బేర్కొనఁదగిన సాహిత్యశాఖ—జీవితచరిత్ర (Biograpry). నెహూౄ, తిలక్కులవంటి అఖిలభారత నాయకుల యొక్కయు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యవంటి రాష్ట్ర నాయకులయొక్కయు, చిన్నయ సూరి, వేదం వేంకటరాయశాస్త్రి మొ॥ పండితులయొక్కయు జీవిత చరిత్రలు కొన్ని గద్యములందును, కొన్ని పద్యములందును రచింపఁబడినవి. ఒక విశిష్టుని యొక్క జీవిత చరిత్రయే ఈ శాఖయందు నిర్వహింపఁబడు ఇతివృత్త భాగ మైనచో మహాకావ్యములన్నియు, ఇట్టివే యగుచున్నవి. అందువలన వీనికి నంత ప్రాముఖ్యము కలదని తలఁచుచున్నాను.

## చరిత్రకావ్యములు

వ్యక్తిచరిత్ర తరువాత దేశచరిత్ర ముఖ్యమైనది, "హైదరాబాదులో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి అనే పేరుగల ఒక విద్యత్కవి యున్నాఁడు. ఆయన స్వగ్రామము కృష్ణాజిల్లా కలవపాముల. ఆయన "సహస్రావధానమనే" ఒక ఫక్కిని కనిపెట్టినాఁడు. ఇదిఒక అద్భుత కార్యము! ఈయన "ఆంధ్రుల చరిత్రము" అని పద్యకావ్యముగా రచించడానికి ప్రారంభించినాఁడు. చాలా హృదయంగమముగా నున్నది. ఈయన గద్వాలసంస్థానములో ఒక ఆస్థానకవి" అని కీ. శే కురుగంటి సీతారామభట్టాచార్యులవారు వ్రాసియున్నారు.[1]

ఇట్టి మార్గముననే ఆంధ్ర చరిత్రలోని కొన్ని రసవత్తర ఘట్టములను వర్ణించు లక్ష్యముతో రచింపఁబడినది శ్రీ మధునాపంతుల సత్యనారాయ శాస్త్రిగారి "ఆంధ్ర పురాణము". సాతవాహన చాళుక్య కాకతీయ పర్వము లుగా నీ కావ్యము ప్రాచీనాంధ్ర చారిత్ర ఘట్టములను ప్రదర్శించుచున్నది.

"కవి ప్రతిభ ద్విధాభూతము. కథారచనా సంబంధమైనది ఒకటి. అంశ భూతములైన వర్ణనాదిక సంబంధమైనది రెండు. ఇందులో మొదటిది లోకో త్తర శక్తిచేత సంపాదింపఁ దగినది. రెండవది సమృద్ధియైన కవితాశక్తి యున్నచో చేయఁదగినది. ఈ రెండవశక్తి పూర్వ శక్తిమంతులకంటె నెక్కువ సంఖ్యగల వారియొద్ద నుండును. ఆ సంఖ్యతోఁ బోల్చినచో నీసంఖ్య చాల పెద్దది. మఱల లోకపుదృష్టితో చూచినచో నీసంఖ్య చాల చిన్నది. ఆంధ్ర పురాణమునందు ద్విధాభూతమైన యీ ప్రతిభలో రెండవ రకపు ప్రతి భకే వెసులుబాటున్నది గాని మొదటి రకపు దానికిది స్థానములేదు. శాత

1. నవ్య. ఆం. సా. వీ. పు. 88.

వాహనులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్లు, విజయనగర రాజులు పరం పరగాఁ దీసికొన్నచో నుత్తరోత్తరము బలీయము ఒకఖండముకంటె మఱి యొక ఖండమునందు నధిక చరిత్రాంశములు లబ్ధమగుచున్నవి. చరిత్రాంశము లధికముగా లభ్యమైనకొలది కవికవిగా గాక పద్యరచయితగా మిగిలిపోవును. వట్టి పద్యరచనా శక్తియే యొకనిని మహాకవినిగాఁ జేసినచో నష్టములేదు కాని అధిక జిజ్ఞాసువులపట్ల నది యల్పశక్తి మాత్రమే యగును"... "కవితా శక్తి యనఁగా ననంతముఖములు కలది. అది యొక విషయము నాశ్రయించి యుండదు. అందులో మొదటిది యూహాశాలిత. ఆ యూహ ఉక్తివైచిత్ర్యము నాశ్రయించి క్రొత్తక్రొత్తగా నుండును. అట్టిశక్తి యీ కవియందు చాల యున్నది" అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వచించి యుండిరి.

ఇట్టి కావ్యములు వస్తు కావ్యములలోఁ జేర్పవచ్చును. ఇందలి రసవద్ఘట్టము లివఱకే వీరరసభేదోదాహరణములందు కొన్ని పొందుపరచి యుండుటచే యిచ్చట వదలుచున్నాను.

నవ్యసాహిత్యప్రక్రియ లన్నియు తెలుఁగునఁ బ్రయోగకత్వను దాటి ఒక సంపూర్ణ స్వరూపముల నింకను స్థిరముగా నేర్పరచుకొనలేదు. కావుననే ప్రబంధములవలె నిష్కర్షగా నియమముల నేర్పరచి వీనిని విమర్శింపలేము. పరిణామక్రమముననున్న సాహిత్యము యొక్క దారితెన్నులు కొన్ని అస్పష్టముగానుండును కావున నిదమిత్థమని వాని నేర్పరుచుట కష్టము. రచయితలు కూడ ఇందు కొంత బాధ్యత వహింపవలెను. పరసాహిత్య వృక్షమునుండి గైకొనిన శాఖలను నాటినప్పు డది స్వదేశ వాతావరణమునకు అనుగుణముగాఁ బోషింపఁబడి తెలుఁగువారి కనుభవయోగ్యములైన ఫలముల నిచ్చునట్లు చూడ వలసిన బాధ్యతయు, ఫలముల నెట్లు వినియోగపరిచి లోకహితము చేకూర్ప వలయునో తన్మార్గముసూచించు బాధ్యతయు రచయిత కేర్పడుచున్నవి. వానిని సమన్వయదృష్టితో విమర్శించుట సహృదయుని కార్యము. వీ రిరువురి లక్ష్యములకు త్వరలో పూర్ణసిద్ధి చేకూరవలెనని ఆశించెదము !

## సిసీరియో : "నమ్మినబంటు"

వైజ్ఞానిక శాస్త్రాభ్యుదయము (Science) సాధించిన అద్భుత కార్యము లలో చలనచిత్రకళ యొకటి ! నాటకములలో లేని సంపూర్ణత, స్వాభావికత

ఇందులో కాననగును. చలనచిత్రము (సినిమా) తీయుట కనువుగా రచింపఁబడు రూపకవిశేషము సినీరియో. వేదికపై నసాధ్యములగు సన్నివేశములను, మనోభావముల నెన్నిఁటినో చలనచిత్రమునందు 'కెమేరా' సహాయముతో ప్రత్యక్షీకరింపవచ్చును. దానితో నుద్దీపనవిభావ స్ఫురణము స్ఫుటముగా నేర్పడి, రసప్రతీతికి చక్కని బాట యేర్పడును. ఇతివృత్తములో సూచ్య భాగము తగ్గి ఆధికారికమే అధికమగును. నాటకములకన్న ఇది సంపూర్ణ లలిత కళగా భాసించుటచే పాశ్చాత్యదేశములందు సినిమాకు, నాటకమునకు పోటీ పడినది. తత్ఫలితముగా 'టెలివిజన్' వంటి అద్భుత యంత్రసముదాయములు వెలిసినవి. నాటకమునందు సూత్రధారుని స్థాపకునకు ఎంత ప్రాముఖ్యమున్నదో 'సినిమా నిర్వహణమున' దర్శకునకును, ఛాయా చిత్రగ్రాహకునకును అంత ప్రాముఖ్యము కలదు. వీరిరువు రేకమైనచో చిత్రమొక రసకావ్యముగా తయారగుననుటలో అనుమానములేదు. కావ్యమున వర్ణనాదులు, అలంకారములు చేయలేని పనిని చిత్రమున ఛాయాగ్రాహకుఁడు చేయఁగలఁడు! నటకుల ప్రాముఖ్యము రెంటను సమానమే.

తెలుఁగు చిత్రరంగమున గూడవల్లి రామబ్రహ్మము, హెచ్. యమ్. రెడ్డి, బి. ఎన్. రెడ్డి, ప్రసాద్, నాగయ్య మొదలగు డైరెక్టర్లు తీసిన కొన్ని చిత్రములు జాతిగౌరవమును నిల్పుచున్నవి. చలన చిత్రపరిశ్రమ ఇప్పుడు భారతదేశములోని ప్రసిద్ధ పరిశ్రమలలో నొకటి. ఎందఱో కథారచయితలకు, కళాకారులకు, జీవన వ్యవస్థను కల్పించి తెలుఁగువారికి వినోదభిక్షతోపాటు నెడనెడ "ప్రబోధము" నిర్వహించుచున్న సినీపరిశ్రమ—'సినీరియో' అను నూతన రూపక వికాసమునకు దోహదమైనది. తెలుఁగు సినీరియోలు కొన్ని వెండి తెర నవల లనుపేర ముద్రింపఁబడినవి. అట్టివానిలో నవ్యము, అంతర్జాతీయ చలన చిత్ర ప్రదర్శనమునకు భారతదేశ పక్షమునఁ బంపబడినదియు నగు తెలుఁగు చిత్రము "నమ్మినబంటు" యొక్క సినీరియోను గైకొని రసచర్చసూక్ష్మముగా చేసెదను.

శంభూఫిలిమ్సువారి 'నమ్మినబంటు'కు కథను కూర్చినది: శ్రీసుంకర, మాటలు : శ్రీ సుంకర. శ్రీ తాపీ. పాటలు : శ్రీ కొసరాజు. ఇందులో అంగిరసము ధర్మవీరము. నాయకుఁడు ప్రసాద్, నాయిక లక్ష్మి.

యజమానిని మనసార నమ్మి అతని కండగా నిలిచి యెట్టి కష్టములైనను ఎదుర్కొనుటకు సిద్ధపడి, అతఁ డధర్మమార్గమున వర్తించు నప్పుడు వారించి, విననప్పుడు వైదొలఁగి, రైతులకు సాయశక్తుల మేలుచేయుచు,

న్యాయమునకు, ధర్మమునకు కట్టుబడి, యజమానిని ఎదిరించి, చివఱ కాతఁడు నిస్సహాయస్థితిలో మృత్యుముఖమున పడుచున్నప్పుడు, తనప్రాణములనైనను లెక్కసేయక యజమానిని రక్షింప యత్నించిన ఆదర్శసేవాధర్మమూర్తి నమ్మినబంటు ప్రసాద్. అతనిని ఋజుమార్గమునఁ బెట్టి యుత్సాహమూర్తిగా, ధర్మమూర్తిగాఁ దీర్చిదిద్దినది లక్ష్మి. వీరికి ఈ శక్తిని తన క్షమావీరముతో ప్రబోధించిన సత్త్వసంపన్నుఁడు చంద్రయ్య. వీరి కండదండగా నిలిచి ధర్మ రక్షణకు తోడ్పడినవారు సరళా దేవయ్యలు. వీరందరు మదాంధుఁడు, కుటి లుఁడునైన భుజంగరావుతో నెదురునిల్చి, పోరాడి, త్యాగమును ప్రదర్శించి, ఓర్పుతో విజయమును సాధించినవారే. వారిలో మేటి ప్రసాద్.

ఇందులోని పాత్రలన్నియు చైతన్యవంతములు; ఉత్సాహ సమన్విత ములు. ఉదాహరణకు: "మన ముత్తాతలు సంపాదించిన ఆస్తిపాస్తులేమీ మిగల్లేదు. మిగిలిందల్లా ఒక్కమాట నిజాయితీ. అదికాస్తాపోయినాక సచ్చేఁ ? బతికేం ?" అనే చంద్రయ్య సత్యక్షమావీర సంపన్నుఁడు; "చూడు! నేనుండగా నాన్న (యజమాని) నెవడయినా అన్నాడో, పళ్లు రాలినయ్యే! అది అంతే" అని అన్న ప్రసాదులో భక్తివీరము, "హుఁ! నిజాయితీ? మీ పరువు ప్రతిష్ఠల కోసం నోరులేని జంతువుల ప్రాణాలు తీయడమే నిజాయితీ అయితే, ఆ నిజా యితీ నాకక్కరలేదు" అని అన్న అతనిలో ధర్మదయావీరములు, డైనమైట్ దెబ్బకు గురియైన అతనిలో త్యాగవీరము, "నాకివ్వాల్సిన డబ్బుతీసుకొని ఆ ఎద్దు నొదిలేయండి" అనుటలో మానవీరము, భుజంగరావుపై "ఇవ్వాళ నీ చావుతప్పదు"అని హుంకరించిన అతనియందు యుద్ధవీరము, యజమానితో పాటు ఊబిలో దూకిన ఆతనియందు త్యాగ, భక్తి, దయా, ధర్మవీరములును స్ఫురించుచున్నవి.

ఇందు విశేషము: రామలక్ష్మణులను ఎడ్లు చూపు సాహసము. యజ మానిని సేవించుటయందు, శత్రువును శిక్షించుటయందును, ఆ యెడ్లజత చూపించిన యుత్సాహము అనంతము! అది రసాభాసమైనను రసమువలెనే ఆస్వాదనీయమగుచున్నది.

పాశ్చాత్యులు చలన చిత్రములలో ప్రధానముగా మానవుని యందు మౌలికమైయున్న పాశవికతను ప్రదర్శించెదరు. భారతీయులు పశువులందలి మానవత్వమును, మానవునందలి దేవత్వమును దర్శించి ప్రదర్శింప యత్నించె దరు అను సత్యమున కీ చిత్రము చక్కని యుదాహరణము.

★

# 9. జానపద సాహిత్యము

జనపదమనఁగా పల్లెపట్టు. దానికి సంబంధించిన సాహిత్యము జానపద సాహిత్యము. జానపదులు తమ జీవితరంగమున నెవ్వరేని యొక చెప్పుకొనఁ దగిన ఘనకార్య మొనర్చినఁగాని, ఏదేని యపూర్వ సంఘటన జరిగినగాని దాని నాశ్చర్యముతో నావేశముతో గీర్తించి నాల్గుకాలములపాటు గానము చేసికొందురు. అట్టి గానయోగ్యమైన కావ్యసముదాయము జానపద సాహిత్య మని యందురు. ఇట్టి సాహిత్యము తరతరములవారికి పైతృక సంపదవలె నందింపఁబడుచు సజీవన స్రవంతివలె జాతిలో ప్రవహించుచున్నది. జానపద గేయములను కూర్చువారు, పాడువారు, కావ్యలక్షణము లెఱిఁగిన మహాకవులు కాకపోవచ్చును. కాని వారికావ్యములన్నియు స్వచ్ఛమగు నమాయక హృదయములందలి యనంతానుభూతిని సూటిగా వెలార్చు రసగుళికలు. నిరాడంబర సుందర సాహిత్యమూర్తులు.

జానపదులకు సామాన్యముగా మతమనినను, దైవభక్తియనినను, ఒక ధర్మము కొఱకై చేయు మహోత్యాగమనినను, అద్భుతకార్యము లనినను, కరుణాత్మక సన్నివేశము లనినను, దయాదానాది గుణవిశేషములనినను, అధికమైన అభిమానము. వారా విషయములలో స్వచ్ఛంద సహానుభూతిని పొందినట్లు నాగరికులు పొందజాలరనుట సత్యదూరము కాదేమో! ఎందువలన ననఁగా వారు నిష్కల్మష నిరాడంబర జీవితవర్తనమును త్రికరణశుద్ధిగా నమ్మువారు కనుక! దైవముపై విధిపై వారికచంచలమైన నమ్మకమున్నది కనుక! అట్టివారి మనఃప్రవృత్తియే వారి సాహిత్యమునందు కాననగును.

జానపద కావ్యములందు వర్ణితులగు నాయికా నాయకాదులు పరమ వ్యక్తులనుండి పశుపక్ష్యాదులవఱకు గానఁబడుచు చక్కని వైవిధ్యమును సంతరింతురు. నాగరిక సాహిత్యమునందు ఇట్టిది కానఁబడినను అందు సలక్షణమైన, వ్యంగ్యప్రధానమైన, తాత్త్వికసంబంధమైన విషయవిభాగ మెక్కువ. కాని జానపద సాహిత్యమునందు సూటిదనము సత్యనిరూపణము హెచ్చు. ఇతర లక్షణములు వైకల్పికము. ఇందు సీతారామాదులవలె సంపూర్ణ మానవులు, ధీరోదాత్తులు. ఆదర్శ పురుషులు కొన్నియెడల గోచరింపక పోవచ్చును. పురుషార్థ సాధనాయత్తమగు జ్ఞానము గల్గిన పరమసాధకు లిందు లేకపోవచ్చును.

అయినను తాము నమ్మిన ధర్మమును మనసార చివఱివఱ కాచరించి, ఎన్ని కష్టములకైన నోర్చి, ఎదిరించి జీవితక్రమమును తీర్చిదిద్దుకొను స్వచ్ఛంద కర్మ వీరు లిందు గోచరింతురు. సత్త్వగుణ ప్రధానులు, ఉత్తములు వీరుకాక పోయినను రజోగుణ సంపన్నులు, ఉత్తమత్వ సాధకులు అగుదురు. అట్లని ఉత్తములు లేరని నా యభిప్రాయము కాదు. కొన్నిచోటులందు మహాకావ్య నాయకుని కెందును తీసిపోని ధీరోదాత్తులును ఈ సాహిత్యమునఁ గానవగుదురు. సీతా రాములు, యుధిష్ఠిరుఁడు మఱల నిచ్చట కూడ యవతరింతురు. కాని వీరి సంఖ్యకుమించి జానపదవీరు లున్నారు. అందువలననే శిష్టులు దీని నుత్తమ సాహిత్యమన లేదు.

నవ్య యుగమునందు జానపద సాహిత్యమున కెనలేని గౌరవము లభించు చున్నది. ప్రజాస్వామ్య వ్యవస్థ దేశమునఁ దలయెత్తి వర్థిల్లుచున్న ఈ కాలమున ప్రజాసాహిత్యము మన్ననలు వడయుట అబ్బురముగాదు! అయినను పూర్వము నుండియు శిష్ట జానపద సాహిత్యములు లతలవలె పెనవేసికొని పెరిగినవి. ఒక దాని కొకటి యాలంబనమైనవి. తెలుఁగు రామాయణములలో కెక్కిన అవాల్మీకములయినగాథలు, తెలుఁగున పురాణములే నిర్మించుకొనుటకు వస్తువులైన వీరశైవ భక్తగాథలు చాలును పై సత్యమును నిరూపించుటకు.

జానపద సాహిత్య ప్రక్రియలలో ప్రసిద్ధిఁగనినవి జానపద గీతములు, పల్లెపదములు, యక్షగానములు, హరికథలు, బుఱ్ఱకథలు మొదలగునవి. వానిలోనున్న వీరరస ప్రసక్తి నించుక యిచ్చట సూచించుట నా ధర్మము.

## 1. జానపదగేయములు

వీని లక్షణములఁ గూర్చి చర్చించుచు డా. బి. రామరాజుగారు—జానపదగేయ సాహిత్యము శిష్ట సాహిత్యమువలె గాక రచయిత నొక్కనిచే కల్పింపఁబడి పెక్కురు రచయితలచే పెంపఁబడుచుండును. కావున జానపద గేయమునకు రచయిత లేఁడనవచ్చు ననిరి. దీనితోపాటు గేయ రచనాకాల మిదమిత్థమని యుండదనియు, పరిణత(లేక నియమిత) స్వరూపము వాని కుండవనియు; మౌఖిక ప్రచారముననే అవి జీవించుననియు వివరించియుండిరి. వీనిలోని ప్రక్రియలను పేర్కొనుచు వారే పౌరాణిక, చారిత్రక, మత, పారమార్థిక గేయములనియుఁ స్త్రీ, బాల, కార్మిక గేయములనియు, శృంగారాద్భుతక

హాస్యరసప్రధాన గేయములనియు వింగడించి యుండిరి.[1] వీనిలో పౌరాణిక, చారిత్రక గేయములలో వీరరసస్ఫూర్తి ప్రస్ఫుటముగా గోచరించును.

౧. పౌరాణికగేయములు :

పౌరాణిక గేయములను రామాయణ భారత భాగవత సంబంధము లైనవి యనియు, తదితరములనియు ద్వివిధాకరింపవచ్చును. అందు రామాయణ సంబంధమైన వానిలో— రామాయణ గాథను సంపూర్ణముగనో లేక అధిక భాగముగనో చుట్టివచ్చిన పాటలు మొదటివర్గము. అందు శాంత గోవింద నామములు, అడవి అనే చరగోవిందనామములు, సూక్ష్మరామాయణము, పెళ్ళి గోవిందనామములు, లంకాయాగము, శారద రామాయణము, కుశలవ కుచ్చల చరిత్ర, రామకథా సుధార్ణవము, శ్రీరామదండకములు, శ్రీమద్రా యణము, గొబ్బిపాట మొదలగునవి ముఖ్యములు. రామాయణకథా ఘట్ట ముల నేదో యొకదానిని ప్రధానముగా చిత్రించునట్టి గేయములు రెండవ వర్గము. వీనిలో పుత్త్రకామేష్ఠి, పాతాళహోమము, లక్ష్మణ మూర్ఛ, గుహ భరతుల అగ్నిప్రవేశము, శ్రీరామ పట్టాభిషేకము, ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణ దేవర నవ్వు, సుందరకాండపదము, కుశలాయకము, కుశలవులయుద్ధము, కుశ లవ కుచ్చల చరిత్రము, శతకంఠరామాయణము, సీతాకళ్యాణము పాట, మాయలేడి పాట మొదలగునవి ప్రసిద్ధములు. ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదువారు స్త్రీల రామాయణ కీర్తనలన్నియు నొక సంకలనగ్రంథ ముగాఁ బ్రకటించి తెలుఁగువారి కృతజ్ఞతలకు పాత్రులైరి.

'లక్ష్మణదేవర నవ్వు'లో సీతారామ సేవాపరతంత్రుఁడగు సౌమిత్రి రాత్రులందు సర్వప్రకృతి సుషుప్తియందు మునిఁగియుండ తా నొక్కఁడే మేల్కొనియుండి, తన నావరింప నుద్యుక్తురాలగు నిద్రాదేవి తన్నావరింపకుండ యూర్మిళ నావహింపుమని వేడుటలో లక్ష్మణుని రామసేవా ధర్మరూపమైన యుత్కటోత్సాహము గోచరించుచున్నది. ఉదా॥

"మాయన్న రఘుపతికి మావదినకూను ఈ పర్ణశాలకు తాను కాపనెనూ
పోపొమ్మ యోధ్యా పురమునకు వేగా ధవుని జాసీనట్టి సతియుండ తగదూ
రాత్రియును పవలునూ లేవకుండగనూ తనువిడిచి పొందుమీ ధవళాక్షి నిద్రా!"

లక్ష్మణుని ఇంతటి భక్తిత్యాగములు శ్రీరామునిచే ఆతనికి సేవలొనర్చునట్లొనర్చి నవి తరువాత! అన్నదమ్ములమధ్య ఇట్టి స్నేహము నభూతో నభవిష్యతి.

1. తెలుఁగు జానపద గేయ సాహిత్యము.

సుందరాకాండ సారాంశము సుందరాకాండ పదము. హనుమంతుఁడు సీతాన్వేషణార్థము లంక కేఁగి శ్రీరాముని కార్యము సాధించివచ్చిన వీరగాథ యది! అట్లే లక్ష్మణమూర్ఛ, పాతాళహోమము, శతకంఠరామాయణము అను గేయములందును వాయుజుని బలపరాక్రమాదు లనంతములు! శ్రీరామ లక్ష్మణ రక్షణార్థ మాతఁడు గావించిన యుద్ధము లఖండములు. ఇఁక ఉత్తర రామాయణ గాథకు సంబంధించినవి శ్రీరామాశ్వమేధము, కుశలవయుద్ధము, కుశలవకుచ్ఛల చరిత్రము, సీతమ్మ భూప్రవేశము మొదలగునవి. ఇందు కుశలవుల పరాక్రమాదులతో యుద్ధవీరము జీవనము నింపుకొనుచున్నది.

మహాభారతము నందలి యుపాఖ్యానములను కొన్నిటిని, ఘట్టములను కొన్నిటిని గైకొని రచింపఁబడినవానిలో ముఖ్యములు : నలచరిత్రము, దేవయాని చరిత్రము, సుభద్రా కల్యాణము, ధర్మరాజు జూదము, కీచకవధ, విరాట పర్వము (పదము, జంగముకథ), పద్మవ్యూహము, విశ్వరూపము, భగవద్గీత కథాగీతము, సావిత్రిపాట, శశిరేఖాపరిణయము, గయోపాఖ్యానము, విరాట కర్ణశల్య పర్వములు, ఉత్తరదక్షిణ గోగ్రహణములు, అనునవి; ఇందులో కొన్ని ఘట్టములు వ్యాసకవిత్రయ భారతములలో లేనివియుఁ గలవు. శశిరేఖా పరిణయము, గయోపాఖ్యానము మొదలగునవి అటువంటివి.

శశిరేఖాపరిణయములో ఘటోత్కచుని వీరము శోభించుచున్నను అది అద్భుత మిశ్రమముగా నున్నది. ప్రత్యేకముగా హైడింబాభిమన్యుల యుద్ధము వీరరసావలంబము. గయోపాఖ్యానమున గయుని రక్షింపఁ బ్రతినఁబూను నర్జునుఁడు కృష్ణు నెదిరించుటలో వీరరసస్ఫూర్తి కలదు. ఇఁక విరాట పర్వ పదాది భారతసంబంధ గేయములలో భారతరసస్ఫూర్తి మాత్రమే వర్తించును. విరాటపర్వ పదమున రణరంగవిముఖుఁడైన దుర్యోధనునితో నుత్తరగోగ్రహణ యుద్ధమున—

"రాచజూదంబాడ రమ్మన్న నాతో నీవు నిలిచి గెలిచితేని నీది రాజ్యంబు
నేను గెలిచితేని నీవు రాజ్యము విడువు శకుని గెలు వస్థిరం బిక తిరిగిరమ్ము."

అను నర్జునుని పరిహాసోక్తులు భారతార్థచ్ఛాయలే! అవి సహృదయ హృదయ వేద్యములే కావున వదలుచున్నాను.

భాగవత సంబంధములగు గేయములలో వామన విజయము, వామన చరిత్రము, అంబరీషోపాఖ్యానము (జంగముకథ), రుక్మిణీకల్యాణము, మొ.నవి ప్రముఖములు. వామన విజయము, వామన చరిత్రము బలిచక్రవర్తి దాన వీర

మునకును, అంబరీషోపాఖ్యానము వ్రత దీక్షకును ప్రసిద్ధములు. రుక్మిణీకల్యాణమున వివాహార్థమైన యుద్ధమున శ్రీకృష్ణుని యుద్ధవీరము స్ఫురించును.

ఇతర గేయములలో చెర్విరాల భాగయ్య యను తెలంగాణా జానపద కవి రచించిన సత్యహరిశ్చంద్ర (బ్రతుకమ్మపాట) నరసింహమూర్తి విరచిత చంద్రమతీదేవి (బ్రతుకమ్మపాట) అనునవి వీరరస ప్రధానములు.

## ౨. చారిత్రక గేయములు :

జానపద వాఙ్మయమున చారిత్రక గేయములకున్న వైశిష్ట్యమును గూర్చి డా. బి. రామరాజుగారిట్లనుచున్నారు. "జానపద గేయవాఙ్మయమున చరిత్రకు సంబంధించిన గేయములకొక విశిష్టస్థానము కలదు. వస్తువునందును, శైలియందును, కథాకథన పద్ధతియందును తక్కిన జానపద గేయములకన్న నివి భిన్నములుగా నుండును. చారిత్రక గేయములను పాశ్చాత్యులు Historical Ballads అందురు. ఈ వాఙ్మయ విమర్శకులు కొందఱు వీనినే వీరగీతములనిరి. ఇట్లనుటకు కారణ మీ గీతములందు వీరరసము ప్రధానముగా నుండుటయే. వీరుల పోరాట మాధారముగా గొని పాడుకొనఁబడినవి గనుక నివి వీరరస గుంభితముగనుండి వీరగీతము లనఁబడుచున్నవి. పాశ్చాత్యులు కూడ వీనిని Heroic Ballads అనిరి. చారిత్రక లేదా వీరగీతము తత్తదుచిత వీరసంఘటన యేదియో జరిగినవెంటనే యుద్భవించును. ఆ సన్నివేశమును కన్నులార గాంచియో లేక చెవులార వినియో జానపదుఁ డుద్వేగముతో గాన మొనర్చును. ఆ పాటయంతట ప్రాకిపోవును."[1] ఈ పాటలు కాలానుగుణముగా నెన్నో మార్పులు చేర్పులు కూర్చుకొనుచు గతులను మార్చి ప్రవహించునదుల వలె ప్రవహించుచుండును. లిఖితములైన గ్రంథములందే పెక్కు ప్రక్షిప్తములు జేరెడి మన సాహిత్యమునందు మౌఖికములైన ఈ కావ్యములం దిట్టివి జరుగుటలో నబ్బురమేమి కలదు! వీనిలో కొన్నిగాథలు చరిత్రకందుచున్నవి. కొన్ని అస్పష్టముగా గోచరించుచున్నవి. ఈ రెండవవర్గమును 'అస్పష్ట చారిత్రకము (Quasi Historical) లను గేయములని డాక్టరుగారు పేర్కొనిరి.

చారిత్రక గేయములలో ప్రధానములైనవి పల్నాటి వీరచరిత్రల గీర్తించు గేయములు, కాటమరాజు కథలు, దేశింగురాజు కథ, బొబ్బిలికథ, అల్లూరి సీతారామరాజు కథ మొదలగునవి.

---

1. తెలుఁగు జానపద గేయ వాఙ్మయము, పుట. 155.

(౧) పల్నాటి వీరగేయములు : శిష్టులందు భారతమువలె జానపదులందు పల్నాటి వీరచరిత్రము వ్యాపించినది. యుద్ధస్కంధావారములందును, దేవతల కొలుపులందును, పండుగ పబ్బములందును, సామాన్యముగా నీ పాటలు పాడఁబడును. ప్రభుత్వమువారు దొంగలముఠాలను బందీచేయవలెననినచో పల్నాటి వీరగాథలవంటి ఉద్రేకము కల్పించు వీరగేయములను ముఠా నివసించు ప్రాంతమున పాడించెడివారు. నాగస్వరము వినిన కోడెత్రాచులు పుట్టలోనుండి బయటికి వచ్చి మైమరచి నృత్యముచేయునట్లు వారును వీరగాథలనిన చెవులు కోసికొనెడివారు. కథపట్టునకువచ్చినప్పుడు వారు దానిలో తన్మయీభూతులుకాగా రక్షకభటులు వారిని బందించెడివారు. అధములు తమః ప్రధానులునైన వారికే యంత వీరరసస్ఫూర్తిఁ గల్పించు ననిన ఇఁక నుత్తముల మాట యేమని చెప్పవలెను! శ్రీనాథుఁ డంతటివాడు ఈ గాథలువిని కరిగిపోయి పల్నాటి వీరచరితమును మంజరీ ద్విపద కావ్యముగా సంతరించినాఁడు. పల్నాటి వీర చరిత్రలోని రసచర్చ యితఃపూర్వమే చేయబడి యుండుటచే దానిని యితర పల్నాటి వీరగేయముల నన్నిటిని చర్చింపక వదలుచున్నాను. శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర ననుకరించి రచించిన పదకర్తలలో ముఖ్యులు—కొండయ్య, మల్లయ్య అనువారలని అక్కిరాజు ఉమాకాంతపండితులు: "వీరు తమ గ్రంథముల చాలవఱకు శ్రీనాథు ననుసరించియే చెప్పిరి. వీ రొక్కొక్కచోట లేనివి కొన్నికలిపిరి. ఉన్నవి కొన్ని తీసివేసిరి. కొండయ్య శబ్దసౌష్ఠవము పాటింపక యిచ్చవచ్చినట్లు చెప్పినాడు. మల్లయ రచనలో చాలవఱకు శ్రీనాథుని వాక్యములే యున్నవి. ఇవిగాక ప్రా. పు. భాండాగారమున 'కోళ్ళ పోట్లాట, గోవుయుద్ధము, రాయబారము, యుద్ధసన్నాహము, గురజాల యుద్ధము (పూర్వభాగము), కల్లు ప్రతిష్ఠ, బాలునికథ, బాలునియుద్ధము, బాలుని మరణము, కన్నమనేని యుద్ధము, గోవు సంస్కారము, కొమ్మరాజు యుద్ధము, బ్రహ్మనాయని విరుగు మొ॥నవి ఈ చరిత్రకు సంబంధించినవి కలవని డా. బి. రామరాజుగారు.

(౨) కాటమరాజు కథ : కాటమరాజు కథ వీరరస జానపదగేయ కావ్యములలో ప్రాచీనతరమైనది. నెల్లూరుమండల మీ కథకు రంగస్థలము. నల్లసిద్ధి నెల్లూరునేలు ప్రభువు. అతనిరాజ్యమున లంకమల, పాలకొండ, నల్లమల కొండలప్రాంత మటవీసంపదకు ప్రసిద్ధము. యాదవప్రభువైన కాటమరాజు పశువులమేతకై ఆ యడవుల నుపయోగించుకొనుచు, పుల్లరి చెల్లించుటకు నల్ల

సిద్ధితో సమయ మేర్పరచుకొనెను. కాని అతనిగోవుల కా యరణ్యవాసులగు కిరాతులవలన నష్టము సంభవించు చుండుటచే నతఁడు రాజునకు పుల్లరి చెల్లించుటమాని ప్రాతపగలను త్రవ్వికొని యుద్ధమునకు తరుణము వేచెను.

నల్లసిద్ధి సామోపాయము ప్రయోగించి రాయబార మంపెను.

"ఒడబడిన పుల్లరి నొప్పనియకుంట, యపకీర్తిచేకూర్చు నడుగు దాటకుము
ఇప్పించి పుల్లరి యిటునటు కదలు, తప్పునాడకు నీతి ధర్మమ్ముకాదు."

అని నల్లసిద్ధి పంపిన సందేశము. దానికి కాటమరాజు క్రుద్ధుఁడై తన భట్టుచే నారాయబారి కిట్లు చెప్పించెను :

"రాయబారము చాలు రసికుఁడ ! వినుము, పుల్లరంటే కానుపుట్ట దిచ్చోట
నీమాట మీరాజు కెటులఁగింపవోయి సమ్మతి, కాదేని సరసమామీద
దండెత్తి మీరాజుఁ దరలి రమ్మనుము, కాకమాపెద్దల కడు యుద్ధమహిమ
చెవికెక్కయుండు మీ క్షితి పాలునకును, గదనమంటే వీడు కదలలేదేమొ
తలచుమాటలు మాని దాగుండుమనుము."

అని ప్రతిసమాధాన మిప్పించినాఁడు; రాయబారియగు భట్టును సభ వెడల నడిపించినాఁడు. మిత్రుల సమ్ముఖమున—

"ఒదవునాకో ధర్మయుద్ధ మటంచు, గలిగితే మనకబ్బుఁ గైలాసమనుచు
సంతోషపడుదుము సమయ మేతెంచెఁ, దొల్లి పెద్దల పగల్ దొరకొని వచ్చెఁ
బల్లనరాజుతోఁ బాలేటియొద్దఁ, బగగొన్న మాతండ్రి ప్రతిన యీడేర్తు."

అని ప్రతినఁజేసి యుద్ధమునకు సర్వమాయత్త పరచినాఁడు.

కాటమరాజు వైఖరి నల్లసిద్ధికి - నిద్రించు సింహమును లేపినట్లయినది. అతని మాటలు వినినతోడనే ఆగ్రహోదగ్రుఁడై యట్టిటు చూచి, మన్నీల దొరలను పిలిపించి, నిండు పేరోలగముఁ దీర్చి అందిట్లనినాఁడు :

"సారసులార ! యో క్షత్రియులార ! భారతవేత్తలౌ భావజ్ఞులార !
వినుఁడి యాదవుల యీ వెకలి సాహసము, తొలి కౌరవులనాటి ధూర్తులటంచు
వారిపై నాకెంతొ వైరస్యముండె, భీమినాయ డనేక ప్రియములు సెప్పె
భూమి యాదవు లెంతొ పుణ్యాత్ములనుచు, సత్యముఁ దప్పని సరసులటంచు
నామాట నమ్మి నే నావుల కొఱకు, భూమి నిచ్చితి నంతఁ బూరెల్ల మేసి
యా యావు లెంతెంత హాని చేసినను, దనువులో సత్యంబుఁ దప్పకుండితిని
వీడక గొల్లలు విపరీతముగను, నాడుచున్నా రిపు డడకువ లేక
పదునైన మాటలు పలికిన వెనుక, గొల్లరాజును లెక్కగొనకుండ దండు
వెళ్ళకుండం గాదు వెసరాచపాడి."

అని ధర్మమును ప్రతిపాదించి, తద్రక్షణకై యుద్ధమునకు సిద్ధమైనాఁడు సిద్ధి. అతని నోటనే కవి వీరియుద్ధము భారతములోని కౌరవ పాండవ యుద్ధము వలె నుండబోవునని ధ్వనించినాడు. అట్లగుచో నీతఁడు ధర్మజుఁడు.

సభలోనున్న రణతిక్కన యుత్సాహవంతుడై మేనుప్పొంగ నిట్లనినాఁడు.

"ఓ సిద్ధిరాజ! నే నొకఁడనే పోయి, సమయించి వత్తును శత్రుసైన్యంబు
గహ్వారంబున రాజు గద్దించినట్లు, చల్లవారందరిని సమయించి వత్తుఁ
జక్కఁగా నరకుదు సమరంబులోను, పల్లవాధిప! రాజ! పంపుము నన్ను!"

అతనికి మారుపల్కు లేదు భూపతి. కరణాలు, లెక్కకు, సంప్రదింపులకు పంపనర్హులు గాని పగతురకండలు రాల్పఁబంప నర్హులు కారని అతని శంక. దానిని తెలిసి రణతిక్కన!

"కరణమంచును గృపఁగల్గినఁ జాలు, బ్రాహ్మణుండనె నిజము, రానీనుకొ ఉఁత
యీ పని కంపుమీ, యీడేర్చివత్తు, గట్టిగా సెలవిచ్చి కలనికిఁ బంపు."

మని 'ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్రమ్మని' యుత్సహించినాఁడు. రా జనుమతించి నాఁడు. సింగపు గొదమవలె రణరంగమునఁ బ్రవేశించినాఁడు తిక్కన! శత్రువుల డీకొనినాఁడు. కాని కాలము కలిసిరాలేదు. అతని బలమంతయు సమసి పోయినది. అయినను "యాదవులపై దూఁకి గజములఁ బరిమార్చి వత్తు"నని లంఘించినాఁడు. కాటమరాజు పక్షమునుండి చల్ల పిన్నమనేడు.

"పోరు నిల్పగదోయి! భూసురోత్తముఁడ! సరిగాదు మాతోను సమరంబుసేయ
నగ్రజన్ములు మీరు యాదవుల మేము, ఉగ్రంబు మీమీద నుంచంగరాదు....
కడకు బ్రాహ్మణహత్య కట్టుకోరాదు....పోరున కేల పో బుధపుంగవుండ
యిట సిద్ధిరాజు దండెత్తి రమ్మనుమి!"

అని హేళనముచేసి వారించినాఁడు. తిక్కన మనసులో నొక నీతిమార్గము తోచినది.

"యతిప్రాసలుండని యాకైతలేల? సుతిగూడ నడవని సొగసు పదమేల?
పతి సూచిమెచ్చని బంటుతనమేల? యితరులు మెచ్చని యీ సాధనమేల?
యేఁ బోయిరాజున కిపుడు చెప్పినను, దగు బలములఁగొని దండెత్తివచ్చు
మునిదళముతో వచ్చి ముందుగా నేను, పగతురఁ జంపుదుఁ బల్లవుల్ మెచ్చఁ
జల్లవారిని ద్రుంతు సమరంబులోన."

నని నిశ్చయించి వెన్నిచ్చి యిల్లుసేరెను. లోకమంతయు నతని నవహేళణ చేసినది. పౌరుష హీనుఁడని చీదరించినది. తండ్రి-సిద్ధన-కొడుకును గాంచి —

"పులికడుపునను బుట్టు గొఱ్ఱె చందమునఁ, గలిగితి నాయింతి గర్భంబునందు....
పగతుకు వెన్నిచ్చు ప్రాణంబ దేల ? యరులకు నోడి యీాయవని మనుకన్న
సరగ రణభూమిలో సమయుట మేలు, పందవుగాని భావజ్ఞుఁడవు గావు
ఎందుకీ ప్రాణం బదేల యీా బ్రదుకు."

అని తూలనాడినాఁడు. పురజనులు కేకలు వేయుచు చప్పట్లు చఱచుచు నిట్లు గేలిసేసి హాస్యము పట్టించినారు :

"ఘనచక్రబాణాలు గారెలు కావు. అర్చి దూసెడి కత్తు లరిసెలు కావు
పొడిచేటిబల్లెముల్ పూర్ణముల్ గావు, కుంతలములముల్ రుచిఁబప్పుకూరయుఁగాదు
కమ్మని పాయసముకాదు కయ్యంబు, వండిన యా పిండివంటయును గాదు
బంటుతన మేయూరు బ్రాహ్మఁ డేయూరు ?"

ఇంటిలో నర్ధాంగి పసుపుముద్దనుంచి మంచమడ్డముపెట్టి స్నానమునకు నీరుతోడి కాంతాసమ్మితముగా హేళనచేసినది. తల్లి అల్లంత దూరమున నుండి

"గొబ్బున నీరాడి కూఁతురువచ్చు, పల్లాన నన్నంబు బాగుగా పెట్టు."

మని ఎత్తిపొడిచినది. అన్నములో విరిగినపాలు పోసినది. కొడుకు కారణమడు గగానా వీరమాత ;

"అరుణోదయము వేళ నది యెట్లొకాని, యావులు పెయ్యలు నటు మేయబోయి
యరులతోఁ బోరాడి యటుమీఁద నీవు, విఱిగిన నినుఁజూచి విఱిగెను పాలు."

అని కట్టె విఱిచినట్లు మాట్లాడినది! చల్లని దీవెనలు కురియవలసినచోటనే పిడుగులు వర్షించినవి ! తిక్కన హృదయము అవమాన ఘూర్ణితమైనది. అతని యందు ప్రతాపాగ్ని ప్రజ్జ్వలించినది. రాత్రి యెట్టులో గడపి ప్రభాతమున పితృపాదముల కెరగి :

"యదు బలంబుల మీఁది కరుగుచున్నాఁడ ! వారిని దునుమాడి వస్తినా మేలు
పోరాడి వారిచేఁ బొలిసితినైన, నీవట కావార్త నిజమని తెలిసి
వేవేగ రణభూమి వెదకంగరమ్ము, ఆముకొని పగవారి హతము సేయంగఁ
గవగొని పగఱు నా కండలు నఱుకఁ, బరఁగ నెమ్ములెయున్నఁ బగతురఁద్రుంతు
నొకచోట నుండఁబోదొనరఁగాఁ బొంది, కదనంబులో బొంది కానకుంటేను
నచ్చట నిచ్చట నా యుద్ధభూమిఁ, బరఁగఁ గండలు వెగిరిపడుచుండ నైనఁ
దిక్కన్న కండలని తెలియంగఁ జూడు."

అని ఘోరప్రతిజ్ఞఁ జేసి కొంతసైన్యముఁ జేకొని కదనరంగమున కుఱికినాఁడు.

కాటమరాజు తంబళ బ్రహ్మారుద్రయ్యను ప్రత్యర్థిగాఁ బంపినాఁడు. అతఁడు వీరమాహేశ్వరుఁడు.

> "హరహరా యని లింగ మచ్చోట నిలిపి, గంధ మక్షింతలు ఘనపూజ చేసి
> మారేడు పత్రియును మల్లెపువ్వులును, శిరమందు ధరియించి శివలింగ మనుచు
> వీరబోనము తనకు వేగ చెల్లించి"

తిక్కని తోడి యుద్ధమునకు దొరకొనినాఁడు. పోరు ఘోరమైనది. కొంతవడికి బలములు పోరాటమాపినవి. తిక్కన బ్రహ్మారుద్రయ్య ద్వంద్వ యుద్ధమును నారంభించిరి. వీరి యుద్ధవర్ణనము రసవచ్ఛరితము :

> "విడిబడి రిద్దఱు వీరయుద్ధమున, ధరణిపై నొండొరుం దప్పించుకొనుచు
> లంఘించి వెనుకకు రాగడిల్లుచును, ప్రాకుచు దూకుచుఁ బైకి రేఁగుచును
> దాటించి నరకుచుఁ దాకి పొడ్చుచును, నురవడితో వచ్చి పరువడి సేసి
> కటపెట ఖంఖంగు ఘల్లుఘల్లనుచు, మెఱపులవలె మీఱి మెరయుచుఁ బిడుగు
> చఱపుల వలె గొప్ప సడిని వ్రేయుచును, నిర్వురు పోరిరి దుర్వారు లగుచు."

వీరరసమహాబ్ధిలో పెనుగాలి కుబ్బెత్తుగలేచు మహాతరంగద్వయము భంగి లేచి ఢీకొని యీ వీరద్వంద్వము శిథిలమై వీగిపోయినది. తరుగని రసోదధిమాత్రము మిగిలినది.

తరువాత చల్లవారి యుద్ధము, ఆవుల యుద్ధము, చివఱకు సిద్ధిరాజు కాటమరాజుల యుద్ధము వర్ణితములైనవి. "ఆవుల యుద్ధంలో బొల్లావుదే నాయకత్వం. నాయకుఁడు లేకపోయినా పశువులే కళపెళా కదంత్రొక్కుతూ శత్రువులను ఢీకొనడం పల్నాటి వీరచరిత్రమున మందపోటులో లంకన్న ఒరిగిన తరువాతనూ, ఈ బొల్లావు యుద్ధములోను మాత్రమే కనిపిస్తోంది. ఈ ప్రత్యే కత ఒక్క తెలుఁగు జానపద వాఙ్మయంలో మాత్రమే ద్యోతకమౌతోంది. ఆవులను జయించలేక సిద్ధిరాజు సైన్యం వాటిమీద తుపాకీగుండ్లను ప్రయో గించినదట !"[1] ఆపై జరిగిన రాజుల యుద్ధ మా యిరువురిని బలిగొన్నది. పుల్లరితగాదా సర్వనాశనముతో నంతమైనది. అది యొక విషాద వీరగాథ !

మదరాసు ప్రభుత్వమువారు ప్రకటించిన "కాటమరాజు" కథను రచించినవాఁడు కొమనాల గోత్రజుఁడు గంగుల మల్లియతనయుఁడు, సర్వవనోద రుఁడునైన పినమల్లయ యనువాఁడు. అతఁడు శ్రీనాథుని వచనపద్ధతిననుస రించి రచించినాఁడట ! కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దానికి సంస్కార

1. జానపదగేయవాఙ్మయ పరిచయము, శ్రీహరి ఆదిశేషువుగారు పుట, 28.

కర్తలు! కాటమరాజు కథను గుఱ్ఱముకొండ భక్తవత్సల కవి పద్యకావ్యముగా సంతరించెను.

(౩) దేశింగురాజు కథ : దేశింగురాజు కథ నారదుఁడు దేవేంద్రునకు చెప్పినట్లు కవి కల్పన. హైదరాబాదను గోల్కొండ పట్టణమును ఢిల్లీ పాదుషా పాలించుచుండెను. ఒకసారి యాతఁడు గోగు ఫకీరునుండి బారాహజారి అను అద్భుతాశ్వమును కొనినాఁడు. అది తొమ్మిదిమేఘములు గర్జించినట్లు సకిలించును; వాయువేగమున పయనించును. దానినెక్క సమర్థులెవ్వరని - పాళెగాండ్రను పాదుషా పిలిపించినాఁడు. అందఱితోపాటు చెంజికోట నేలు ధరణిసింగు రాజు తనయులైన శూరసింగు, ధరణిసింగు అనువారు ఢిల్లీకి వెడలినారు. అశ్వము నెక్కఁజాలక పాదుషాపెట్టిన నియమము ప్రకారము రాజ్యముఁ గోల్పోయి బందీలయినారు. ఈ విషయము నిండుచూలాలైన శూరసింగు భార్య రాంబాయికి తెలిసినది. ఆమె యా తీవ్రవేదనను గుండెలో దాచి తనకుఁగల్గిన పుత్త్రుఁడగు దేశింగుని పెద్దవానిఁజేసి అతనికి దానిఁ దెల్పినది. ఉగ్రుఁడై దేశింగు

"రెండు గడియలకు లోపల ఢిల్లిని పిండిచేసెదను
దండియైన గుఱ్ఱము నెక్కి దౌడాయించెదను
తప్పక తండ్రు లిద్దరి తెచ్చెద తల్లీ వినుమనెను."

తల్లి యనుమతినిగొని, శ్రీరంగనాథుని సేవించి అతనిదయకు పాత్రుఁడయి మహాబత్ఖాను తోడుగా పాచ్ఛాకొలువుఁ జేరి తనకోర్కె నెఱిఁగించెను. పాదుషా కతని పల్కులు :

"పిల్లమాటగా తోచలేదు, మరి పెద్దమాట కాదు
కల్లమాటగా తోచలేదు, నిక్కమ్ము దోచలేదు."

అతడాశ్చర్యములో మున్గి తేరుకొని అశ్వారోహణ కంగీకరించినాఁడు. దేశింగు తండ్రులు వలదని వారించినారు. కాని కొమరుఁడు :

"ఊరకెపోయిన నవ్వరె పూరులు పొసగ తండ్రులారా!
నేరక గుఱ్ఱము నెక్కగ వదలును నిజము తండ్రులారా!
పుట్టినప్పుడే చావు నిజంబని పొసఁగ తండ్రులారా!
దిట్టముగా మీమనమున నమ్ముఁడు తెలిసి తండ్రులారా!"

అనుచు నచంచల ధైర్యమును వెలార్చినాఁడు. గుఱ్ఱమునెక్కిన తోడనే బారాహజారి అయిదుదినములు వాయువువలె కొండలపై గగనమార్గమునఁ

దిరిగినది. దేశింగునకు కన్నులుతిరిగి, తూలి పడబోయినాఁడు. కాని శ్రీరంగ నాథుని దయచే నశ్వము మరలింపగల్గినాఁడు, మచ్చిక చేసుకొనినాఁడు. పాదుషా అతనికా యశ్వముతోపాటు తంత్రులను, చెంజికోటను బహుమాన ముగా నిచ్చి పంపినాఁడు.

తరువాత పంద్రెండేళ్లకు సాదుల్లాఖానుకు ఢిల్లీ పాదుషా తన కుమార్తె నిచ్చి వివాహమొనర్చి అత నార్కాటుప్రాంతమునకు ప్రభువుగాఁ బంపనాఁడు.

"అల్లుని నూట యెనుబది పాళెములు
మచ్చికతో ఫర్మానావ్రాసి మరియు నిచ్చెమేల
ధర్మము నెంచక తటుకున నప్పుడు తనమది మూఢతను
ఫర్మానాలో చేర్చెను చెంజిని."

సాదుల్లా తనపరగణాల లెక్కలు తోండ్రమల్లోజిచే చూపించెను. అతఁడు చెంజి ప్రభువులు పంద్రెండేళ్లనుండి పన్నియుటలేదని తేల్చిచెప్పెను. సాదుల్లాఖాను తోండ్రమల్లోజిని సైన్యమిచ్చి చెంజి కంపెను.

చెంజిప్రభువగు దేశింగురాజుగ్రుఁడై తోండ్రమల్లుతో—
"కోటకు వెలుపలి గుండురాళ్ళను ఎంచుక పొమ్మనుము
ఏటి యిసుక వున్నది వొంటెలపై యెత్తుక పొమ్మనుము
వరదవచ్చి నవు డీయేటిలో బురదనిలిచె మెండుగాను
పురువున కవిదగ వెండి చెక్కలై యున్నవి గొని పొండు
పెరికెలు యెండించుక పోవచ్చును గుమికూడకరండూ!"

అని హేళనచేసి, ఉత్తర మొకటి సాదుల్లాకంపెను. అతఁడు మండిపడి పాళె గాళ్లనుగొని చెంజిపై దండువెడలి, చెంజిప్రజలను హింసించెను.

దేశింగు ప్రజల కభయమిచ్చి యుద్ధమునకు సిద్ధమై మిత్రుఁడైన మహ బత్ఖానుకు కబురంపెను. అతఁడు పెండ్లిపీటలమీదనుండి లేచివచ్చెను. బందుగు లంద ఱాపెళ్లికొడుకును వారించిరి. కాని క్రొత్తపెండ్లికుమార్తె మాత్రము పసుపుగుడ్డలతో దీవించి పంపి అపరమాంచాల యనిపించుకొనినది.

"ఘనవిక్రమమున దండున జొచ్చి గ్రక్కున మీరలును
ముందు నరుకునకు పుడమిని బడినను ముఖ్యంబుగ నేను
సందేహాము లేకను చేసెదను సహగమనము నేను
వెన్నుపోటుచే ధరఁ గూలిన మిము కన్నులతో కనను."

అని వీరరస మొలకపోసినది. అర్ధాంగిని జూచి ఖానాకాళాసుం తెత్తుబ్బినాఁడు. దేశింగు నొక్క అంగలో కలిసికొనినాఁడు.

దేశింగుభార్యయు నుత్తమవీరనారి. నాథుడు తనయొద్ద సెలవు తీసికొనుచు :

"పటుతరముగ నే దండున జొరబడి పరులజయించినను
తటుకున వచ్చి నిన్నే లెదనే తప్పక యిప్పుడును
చటుల ధైర్యమున శత్రులఁద్రుంచెద నత్యంతంబుగను
రాచదండులో నీల్గిన స్వర్గము ప్రాకటముగఁ గలదు
చేకొని విజయము చెందివచ్చెదను చిరకీర్తియు గలుగ."

అని వీరోక్తులు పల్కగా నాతనిలో వీరజ్యోతి నినుమడించు స్నేహప్రవృత్తితో

"ముందు నరకునకు పుడమిని బడినను ముఖ్యంబుగ నేను
సందేహము లేకను జేసెద విను సహగమనము నేను."

అని భర్తను దీవించి రణమున కంపినది.

రంగనాథుని యాజ్ఞగైకొని, బారాహజారిని హెచ్చరించి, దుశ్శకునములఁ గాంచినను "వెనుదీయకు వైరులగెలువుము వేగమె దేశింగూ" అను రంగనాథుని వచనములు స్మరించుచు ముందుకునడిచెను. వైరులు తామనూరి చెరువుకట్టలు నరికి ఆ నీటిని శంకరాభరణ మేటిలోనికి మళ్ళించిరి. ఆ వరదలో దేశింగురాజు సైన్యము కొంత హతమైనది. దానిని దాటిమహాబత్ఖాను ముందుకు దూసుకొనిపోయి శత్రుసేనల ఢీకొనెను. సుభంగిదొర చేయినరికియు, మేకుమహమ్మదును హతమార్చియు వీరవిహారమొనర్చుచు బంగార్నాయుని తాకినాఁడు ఇంతలో నతనిపై ఫిరంగులు అగ్నివర్షము కురిసినవి. గైరికాధాతువులు కరగుటచే నెఱ్ఱవడిన సెలయేళ్ళ గుంపుతో శోభిల్లెడి పర్వతశృంగమువలె రక్తపుటేరులతో శోభిల్లినాఁ డాతఁడు. అల్లెపోరుచు చివరకు తన యశ్వమైన నీలవేణిపై వాలిపోయినాఁడు; ఆ గుఱ్ఱము శత్రువులఁ జేజిక్కక తప్పించుకొని దేశింగురాజు నొద్దకు విచ్చేసినది. అతఁడు మిత్రుని మరణమున కెంతయో ఖిన్నుఁడై, రోసపడి ద్విగుణీకృతోత్సాహముతో వైరులఁదాకినాఁడు. "ధీరులైన వారికి ప్రాణముపై దృష్టిమరలదయ్యా" అన్న శ్రీరంగనాథుని పల్కు అతని కూతయైనది.

ఎంతటి యుద్రేకము నందైనను ధర్మముఁ దప్పని మేటి వీరుఁడు దేశింగురాజు. తనసైనికుల నుద్దేశించి :

"పరుగిడువారల పరువడిమీరలు పట్టవద్దు సుమ్మీ!
జరిగినవారల జడిసినవారల జంపవలదు సుమ్మీ!
యేమరి యుండినవారల మీరలు యెదిరించగవలదు
మైమరచియు లాహిరిచే నుండినవారిఁ జంపవలద"ని

యుద్బోధించెను. అతని పరాక్రమమునకు బెదరి రాజీకివచ్చిన శత్రువుల మాటను త్రోసివైచి, శ్రీరంగనాథుఁడు వలదన్నను దేశింగు యుద్ధమునకు మఱల పూనుకొనెను. ఘోర యుద్ధముచేసి, పెక్కురు వీరుల సంహారించెను.

"తరుముచు నరికెను దేశింగుఁడును కరకుకరకుమనుచు
మరిగుఱ్ఱంబుల తుండ్లుతుండ్లుగా నరికినరికివేసి
జొన్నదంట్ల తెగవేసిన తీరున చొరబడి దండులను
ఉన్నవారి నటు చాపకట్టుగా ఉక్కడగించుచును"

శత్రువులఁ జెండాడెను. లక్ష యేనుఁగులు లక్షగుఱ్ఱము లీతని కత్తి కాహుతి యయ్యెను. నవాబు బబ్బురపడి స్వయముగా డీకొనినాఁడు. అతఁడు గజారూఢుఁడు; దేశింగు అశ్వారూఢుఁడు. అశ్వము హస్తిమై లంఘించినది. గజ గర్భముక్రింద తొట్టిలోనున్న మాష్టీడు గుఱ్ఱము వెనుకకాళ్లను నరికినాఁడు. దేశింగు పాదచారియై చిచ్చుబుడ్డివలె ప్రేలినాఁడు; చిచింద్రీవలె ఆడినాఁడు. కాని తనవైపు హతశేషుఁడు తానొక్కఁడేయైనాఁడు. గుండె చెరువైనది. నిర్వేదముతో నాతఁడు యోగాసనస్థుఁడై కత్తి పైకెగురవేసి రొమ్మునెదు రొడ్డి ప్రాణముల త్యజించినాఁడు. అతని శవమునుగాంచి నవాబు:

"ఇంతటి శూరుఁడవని తెలిసితె నే నప్పుడు దేశింగూ
ఇంతరాజ్యము చేయు మనుచు నీ కిత్తుర దేశింగూ"

అని అశ్రువులఁ గార్చినాఁడు; బంగారుపల్లకీలో నతని కళేబరమును కోట కంపినాఁడు. రాణి భర్తతో సహగమన మాచరించినది. ఈ వీరగాథకు చిహ్నముగా సాదుల్లా ఇప్పటి 'రాణిపేట'ను వెలయించినాఁడు.

ఈ యుద్ధము చారిత్రకసత్యము. క్రీ. శ. 1713 జనవరి 17 నాడు జరిగినది. "ఇది చారిత్రాత్మకమైన వీరగాథ, మహబత్‌ఖానుఁడికీ దేశింగురాజుకీ ఉన్న అన్యోన్యత హిందూ మహమ్మదీయ సఖ్యానికి నిదర్శనంగా ఆదర్శప్రాయమైంది. వారిద్దరూ చేయీచేయీ కలిపి ఫరంగీలనీ, ఆర్కాటునవాబునీ ఎదిరించారు. దేశభక్తి ప్రేరకమైన వారిచేతలు జానపదకవుల నాకర్షించాయనడంలో వింతలేదు. కవి నెల్లూర్పురవాసి. అతని పేరు మనకు తెలియదు.

కథనపద్ధతి ననుసరించి దేశింగురాజు కథ నారదుఁడు దేవేంద్రుడికి చెప్పినట్టుగా రచించాడు. ఇందులో కూడా జానపదరచన లన్నిఁటిలోనూ కన్పించే మాట సూటిదనమూ సరళపదవైచిత్రీ అంతటా కన్పిస్తాయి."[1]

(ఆ) బొబ్బిలికథ : 'బొబ్బిలికథ' రంగరాయచరిత్రమే. దిట్టకవి నారాయణకవి రచితమైన కావ్యములోని రసచర్చయే యిందును వర్తించును. కావ్యప్రక్రియ భేదమంతియే. బొబ్బిలి కథనుగూర్చి డా. రామరాజుగారు ఇట్లనినారు : "వీరగీతములం దింత సార్వజనీనతగల పద మింకొకటి లేదు. సిసలైన జానపద గేయమున కుండవలసిన లక్షణము లన్నియు దీని కున్నవి. నుడికారము, భాష, భావముల పద్ధతి పూర్తిగా జానపదులవి. బొబ్బిలి పదమునకు ఇప్పుడు మూఁడు పాఠములు గాన్పించుచున్నవి. మొదటిది ప్రా. పు. భాండాగారమున నున్నది. పెద్దాడ నాగేశముకొడుకు నాగేశము రచించినది. ఇది చక్కగా నున్న నిర్దుష్ట చారిత్రక పదము. రెండవది పార్లపల్లి వాసుఁడు కొంతం నృసింహాచార్యులుగారి బొబ్బిలి రాజుకథ. దీనికి నాల్గవ కూర్పులో (1896) ప్రభల శ్రీరామయ్యగారు పరిష్కర్త...దీనిలోని మూఁడు పాదములను రెండు పాదముల చొప్పున (అనువ)దించుకొని ధేనుకొండ వారట యెవరో నేఁడచ్చులోనున్న పెద్ద బొబ్బిలికథ రచించిరి. ఈ మూడవది అందరి ఆస్తియైనది."[2]

(ఇ) అల్లూరి సీతారామరాజు కథ : అల్లూరి సీతారామరాజు భారత స్వాతంత్ర్య వీరులలో నొకఁడు. ఆంగ్లేయుల పాలనమునుండి భరతభూమిని స్వతంత్రము చేయవలెనని బద్ధకంకణుఁడై అట్టి ప్రయత్నముననే అంత్యశ్వాసను వీడిన దేశభక్తుఁడాతడు. స్వాతంత్ర్యోద్యమ కర్తలు ప్రధానముగా రెండు విధములుగా గోచరించుచున్నారు. కొందఱు శాంతివీరులు; మఱికొందరు ఆవేశాత్మకులు. ఒకరాత్మబలముఁతోడను, మఱియొకరు దేహబలముతోడను స్వాతంత్ర్య సముపార్జనము చేయవలెనని ప్రయత్నించిరి. వారే మితవాదులు, అతివాదులు. ఒకవిధముగా సీతారామరాజు అతివాది. సుభాసుచంద్రబోసువలె బలమును ప్రోగుచేసి ఆంగ్లేయులతో బోరిన కర్మవీరుఁడు. గోదావరి మండల మీతని క్రీడారంగము. గోదావరిజిల్లా భీమవరము తాలూకాలోని మోగల్లీతని జన్మగ్రామము. తండ్రి పేరు వెంకట్రామరాజు, తల్లి పేరు నారాయణమ్మ. జన్మ

1. జాన. గేయ. వాఙ్మ పరిచయము. శ్రీహరి ఆదిశేషువు పుట. 80-81.
2. తెలుఁగు జానపద గేయ సాహిత్యము. పుట. 285.

నామము రామరాజు కాగా తాను వలచిన 'సీత' యను కన్య అకాలమృత్యువు పాలగుటచే తనపేరు తద్జ్ఞాపకార్థము సీతారామరాజుగా మార్చుకొనినాడు. అతఁడు స్ఫురద్రూపి. ఇంకను—

"బాలసూర్య తేజ స్సంపన్ను డపార బుద్ధి బలుఁడు
బాలయోగి ధవళాంబుజనేత్రుడు బాహుబలుడు త్యాగి
నిరుపమాన గుణరూప విలసితుం డరిజన భీకరుడు
కరుణారస భరభరిత స్వాంతుడు కాషాయాంబరుడు
కొండకోనలం దొంటి దిరుగుచు కోదండము పూని
చెండాడుచు మారీచుల నీచుల ; క్షేమంకరుఁడైన
సీతారాముం డేమోయన మన సీతారామరాజు."

ఇతఁడు గోదావరీ తీరమునందలి పాపికొండలలోని గుహలలో నేకాంతముగా వసించుచు నచ్చటి సవరలతో సహవాసము చేయుచుండెడివాఁడు.

సవరలు చేయునది బోడు వ్యాపారము. వారిపై నాంగ్లేయు లకారణముగా నేరములుమోపి శిక్షించుచు వారి ప్రదేశముల నాక్రమించుచుండిరి. ఇదిచూచి రాజు సహింపఁజాలక వారిపై తిరుగఁబడెను. ఒకసారి బాస్టియను మన్నె ప్రజలను బాధించుటఁగాంచి రాజు శరవేగమునవచ్చి :

"నిరుపేదల హింసించుచుంటివా నీచాత్మా తగునా ?
ఏ దీనుల రక్షింప క్రైస్తుడు తానెక్కినాడో శిలువ
ఆ దీనుల హింసింప రక్షించునె అతఁడు నిన్ను తులువ !"

అని హుంకరించెను. కాషాయాంబరరోచిస్సులతో బాలసూర్యునివలె నున్న అతని తేజోరూపముఁగాంచి బాస్టియను నిస్తేజుఁడై సిగ్గుతో తిరిగిపోయెను. అచ్చటి ప్రజయంతయు :

"మా పరిసరప్రాంతంబుల దిరిగెడి మహనీయుడ నిన్ను
పాపికొండపై జపముచేసికొను తాపసిగా నెంచి
దూరదూరమున నుంటిమి దగ్గరకు చేరక బాబయ్యా
దారిచూసి మమ్ముద్ధరించగల దైవమ రావయ్యా !"

అని మనసార ఆహ్వానించినారు. వారికాతఁడు నాయకుఁడైనాఁడు.

బ్రిటిషు పోలీసుఠాణాలను ముట్టడించి వాని నాక్రమించుకొని ఆయుధ సామగ్రిని గైకొని, తీసుకొనినట్లు రికార్డులలో వ్రాసి సంతకముచేసి తీసుకొని వెళ్లెడివాఁడు. క్రీ. శ. 1922 లో చింతలపల్లి, కృష్ణదేవిపేట, రాజవొమ్మంగి

స్టేషనులను ముట్టడించెను. తరువాత కలెక్టర్లకు నోటీసులనుకూడ ఇచ్చి సాహసముగా నుద్యమము నడపినాఁడు. గ్రామోద్యోగులకు, తానుండుచోటు, తాను వెళ్లెడిచోటు, ఎప్పుడెప్పు డెచ్చటెచ్చట యుండునది గూడ స్పష్టముగా తెల్పియే బాహాటముగా విప్లవము సాగించెడివాఁడు. అడ్డతీగల, పైడిపుట్టి, రంపచోడవరము, పనుగగుంట, పాతమల్లుపేట, అనుమలపూడి, అన్నవరము మొదలగు గ్రామములలో నిట్టి దాడియే జరిపి, ఠాణాలను దోచెను. ప్రభుత్వోద్యోగుల కితని నెదిరించుటకు గుండెలు చాలెడివికావు. విప్లవకారులు ముఖాముఖి ఆంగ్లేయ సైన్యమును డీకొని చేసిన యుద్ధము లారుకు మించినవి. ఆంగ్లేయులు మారణ యంత్రములను, అగ్నిగోళములను, ఉపయోగించుటచే విప్లవకారులు చాలమంది హతులై పోయిరి. కాని వారి యుత్సాహశక్తి మాత్ర మారిపోలేదు.

"నెత్తురుడికి అవమాన పీడితోన్మత్తులైరి ప్రజలు
కత్తులు కటార్లు బల్లెము లీటెలు గరగరనూరాడు
అగ్నిపర్వతము పగిలె గుభిల్లున ఆ మన్యములోన
అగ్నిజ్వాలవలె విప్లవధ్వజమది ఆకసమున కెగిరె
ధణధణ ధణధణ మ్రోగిందండీ రణభేరి యపుడు;
ఘనుఁడా సీతారామరాజు తన ఖడ్గంబును దూసె;
దీటుగ రాజున కిరుపార్శ్వంబుల దిగ్దంతుల రీతి
రటుక భటులై గాము సోదరులు రయమున నిల్చారు
సాయుధులై స్త్రీపురుష సమూహము సాగెను వెన్వెంట."

సీతారామరాజుకు కుడిభుజము గంటందొర, అతడు వేయి యేనుగుల బలము కలవాఁడు. అతఁడు నిప్పుల వర్షమునకు గుండె నెదురునిల్పి ముందుకు దూకి విలయతాండవ మొనర్చెను.

"గిరగిర గిరగిర గొడ్డలి త్రిప్పుచు తరగెను పుర్రెలను
పాలోపాలో యని రణరంగమున తలపడి వైరులతో
పులియన గాండ్రించుచు నా వీరుల పుర్రెలు తెగవ్రేసె
జాతరకడ బలిదున్నల నరికిన చందంబున నరికె;
ఘాతుకులగు నా వైరుల నెత్తురు కాల్వలు గట్టింది."

పర్వతమువంటి అతని శరీరము తుపాకీగుండ్లకు తూట్లుపడినది. నెత్తురు వారినది. బీభత్సమూర్తియైనాఁడు.

"శరీరమంతట తుపాకిగుండ్లను పరచినట్లుగాగ
అరిభీకరు డా వీరుని నెత్తురు వరదగ ప్రవహించె;
తలచుకొనుచు రాజును గంటందొర ధరణిపైని ఒరిగె
తెలుగుతల్లి కన్నీటి చుక్కలను జలజల రాల్చింది."

విప్లవసేన చెల్లాచెదరైనది. సీతారామరాజు మంచి తరుణము కొఱకై పర్వతములలో పారిపోయెను. ప్రజలు గాయపడిన విప్లవ వీరులకు సేవచేసి పోషించిరి. రాజు దొరకక పోవుటయు, ప్రజలు వారికి మద్దతు నిచ్చుటయుగాంచి ఆంగ్లేయులు రిజర్వుసైనికులతో గ్రామములఁ దగులపెట్టించుచు ప్రజలను పెట్టరాని బాధలపెట్టుచుండిరి. దాని నెరిఁగి రాజు ఉడుకెత్తి:

"ప్రజలు ప్రజలు నా ప్రజలన్నాడు ప్రజాద్రోహులను పడగూల్చెదనని
విడిచిన బాణంబోయన రివ్వున వెడలె నుగ్రుడౌచు."

ముందుకురికినాఁడు.

"ప్రజలారా! భయపడకండంటూ ప్రజలకు రక్షణ రక్షణ యంటూ
ఎగరగ రెక్కలు ఎగశ్వాసంతో దిగజారగ ముచ్చెమటలు వీరుడు
ఖడ్గధారియై కారడవినిబడి కన్నుల నిప్పులు గ్రక్కుచు బోయెడి
ప్రజారక్షకుని రామరాజునీ..."

దారులుకాచిన శత్రువులు మరతుపాకుల వరుసలతో ప్రేల్చిరి.

"క్రూరులు గాల్చెడి గుండ్ల దెబ్బలకు వీరుడు తట్టుకొని
వీరావేశంబున నిట్లని యాశూరాగ్రణి పలికె
ఆంధ్రదేశమా! వందన మిదిగో అందుకొనగదమ్మ
ఆంధ్రులార గైకొనుడు నా విప్లవాభివందనములు."

అని చేయెత్తి నమస్కరించుచు తూలిపోయినాఁడు:

"రాలిన దొక నక్షత్రం బవనికి—రామరాజు ఒరిగె."

ఇది బుఱ్ఱకథ రూపముననున్న అల్లూరి సీతారామరాజు కథ! దీనికర్త సుంకర సత్యనారాయణగారు. దీనికి చాలపూర్వము నుండియు ప్రచారమున నున్న గేయమొకటి కలదని డాక్టరు రామరాజుగారు. "దానిలో సీతారామరాజు జాతీయోద్యమ ప్రేరితుఁడైన యువకుఁడు. ఆయన పల్లెటూళ్ళలో పంచయితీలను పెట్టించి ప్రజలందు కలహములు మాన్పి ఐకమత్యమును స్థాపించుటకు యత్నించుచుండెడివాఁడు. వీరకులాలంకారమగుటచేత ఆయనకు

గాంధిమహాత్ముని శాంతిసమర విధానము నచ్చక విప్లవవీరుఁడుగా అవతరించి నట్లు తోచును."[1]

ఈతని స్వాతంత్ర వీరగాథ జానపద సాహిత్య భారతికొక యమూల్యా లంకారము!

చారిత్రములగు నిట్టి వీరరస జానపదగేయము లెన్నియో యున్నవి. వాని నన్నిఁటిని యిచ్చట పేర్కొనుట దుర్లభము. అందులో తెలంగాణమున సర్వాయిపాపఁడు, గద్వాల సోమనాద్రి, శంకరమ్మ, సదాశివరెడ్డి, మియా సాబు, పర్వతాల మల్లారెడ్డి, రాజరాజేశ్వరరావు వంటి పూర్వ చరిత్రగేయ ములు ప్రసిద్ధములు. హైదరాబాదు స్వాతంత్ర్య సమరమునఁ బాల్గొనిన వీరుల గాథలు కూడ విపుల ప్రచారములో నున్నవి. కుమారరామునికథ చన్నపరెడ్డి పదము, గుజ్జాల గోపిరెడ్డి మొ. లగు గేయములలోని వీరులుకూడ తెలుఁగు జానపద వీరులలోనివారే!

అస్పష్ట చారిత్రక గేయములలో ప్రధానములు: బంగారు తిమ్మరాజు కథ, ఆరెమరాఠీలకథ, బల్గూరి కొండ్రాయనికథ మొ. నవి. వేశ్యయైన రంగ సాని కుట్రకు ఫలితముగా పెదతండ్రియైన పెనుగొండనేలు రాయలవారితో యుద్ధము చేయవలసివచ్చి రణరంగమున దుర్మరణము చెందిన వీరుడు తిమ్మ రాజు. దాయాదులమధ్య రేగిన కలతలవలన కలిగినపోరు, కుక్క పరాక్రమము ప్రధానముగా గల్గినది ఆరెమరాఠీల చరిత్రము; వీరు పెనుగొండకు సంబం ధించినవారు. తెలఁగాణమునకు సంబంధించిన 'బల్గూరి కొండ్రాయని కథ' చెరువునీటి తగాదా కారణముగా రెడ్లకు వెలమలకు మధ్యజరిగిన యుద్ధగాథ! ఇట్టి వసంఖ్యాకములు ప్రజాహృదయములలో నుండి యింకను అక్షరరూపము నందలేదు.

శైవమత సంబంధములైన గేయములలో వీరమాహేశ్వరుఁడైన భళ్ళాణ రాజు కథ భక్తివీరరసముల కాకరమైనది. ఈ కథను కూచిమంచి తిమ్మకవి రాజశేఖరచరిత్రముగను, వాలేశ్వరుఁడు, కాకలూరి వీరన, పద్యకావ్యములు గను, చిత్తూరు గంగాధరుఁడు ద్విపదకావ్యముగను, జక్కన పావయ్యా అలపాక పెద్దికవులు యక్షగానములుగను, నడిమింటి రామయోగికవి దండకముగను రచించిరి. (శిష్టా రామకృష్ణశాస్త్రిగారు) ప్రస్తుతము 'భళ్లాణరాజు కథ'

1. తెలుఁగు జానపదగేయ సాహిత్యము. పుట. 251.

జంగముకథ. కిలారి బ్రహ్మయోగి యను కమ్మకులజుఁడు దీనికర్త. భళ్ళాణ రాజు వలదనినకొలఁది భీకరప్రతిజ్ఞ యొనర్చెను.

"అడుగక పోయిన జంగమునకు నే పెడుదును ఒకవట్టు
అడిగిన లేదని నుడివితినైనను నాకగు అవట్టు"

అని. నారదునివలన శివపార్వతులీ విషయము తెలిసికొనిరి. శివుఁడాతని పరీక్షింప నుద్యుక్తుఁ డయ్యెను; మిండజంగముని వేషమున వెడలి రాజును పద్మినీ జాతి స్త్రీ సంభోగ మభ్యర్థించెను. రాజు తన ధర్మపత్నినే యీయవలసిన స్థితి కల్పించెను. అతఁడు వెనుకాడక తన పట్టమహిషిని చల్లమాదేవిని నాతనియొద్ద కంపెను. దయామయుఁడైన శివు డామె పజ్జన "చలికూటిపై వెన్నచందమున" నిలిచినాఁడు. వ్రతభంగము గాకుండ నామెయే అతని నున్ముఖునిచేయ నుంకింప శివుఁడు బాలుఁడై ఆ దంపతులకు ముక్తినిచ్చినాఁడు. ఇట్టి శైవులకు సహజమైన భక్తివీరమే యిందు ప్రదర్శితమైనది.

(ఒ) పేరంటాండ్ర కథలు : వీర మంగముగా గల గేయము లద్భుత రసగేయములు. "బాలనాగమ్మ కథ"లో బాలవర్ధిరాజుయొక్క శౌర్యము, ధర్మాంగద చరిత్రమున సుందరియొక్క భక్తి శ్రద్ధారూపమైన యుత్సాహ ప్రవృత్తి వీరరసమున కాస్పదములు. కరుణరస గేయములలో కార్యసాధన రూపమైన యుత్సాహము కానరాదు గాని యొక ధర్మమునం దచంచల దీక్ష మాత్రము గోచరించును. అది ధృతిప్రధానము; దానివలన నాయకాదు లనంత యాతనలకు గురియైనను చలింపరు; కొన్నియెడల ఆత్మాభిమానముచే ధర్మము కొఱకు ప్రాణత్యాగము చేసెదరు. మానవులు పోయినను ధర్మము మాత్రము శాశ్వతముగ నిలిచి వారికి కీర్తిశరీరములఁ గల్పించి వీరమూర్తులుగా నిల్పు చున్నది. ఇందులో చాలవఱకు స్త్రీలే అధికమైన స్థానము నాక్రమింతురు. కావున వీనిని పేరంటాండ్ర కథలనియు పిలువవచ్చును.

పేరంటాండ్రలో కొందఱు దైవభక్తియుక్తులు, కొందఱు ధర్మనిష్ఠా గరిష్ఠులు. వారి జీవితము లన్నియు విషాదాంతములే. మానసంరక్షణార్థమో, అభిమానపోషణార్థమో, పతివ్రతాధర్మరక్షణార్థమో అందఱును ప్రాణములను విడిచినవారే! కన్యకామ్మవారి కథలో ఆర్యకుల ప్రదీపయగు నొక్క కన్యకను రాజొకఁడు వాంఛింపగా వానికిఁ దక్కక అగ్నిగుండమునఁ బడి ప్రాణముల

త్యజించిన మహాసాధ్వి గోచరించును. మాదాసు వెంకయ్యగారి 'కాకమ్మ కథ'లో సతీసహగమనము కొఱకై కాకమ్మ చూపిన ఆనంతోత్సాహము ధర్మ వీరమనఁబడుచున్నది. సతీసహగమన నిషేధాజ్ఞ లున్న యా దినములలో నామె కలెక్టరుగారి యొద్దకేగి తన మహిమచే పతిచితిని పొంది దేహత్యాగ మొనర్చిన పతివ్రతా తిలకము కాకమ్మ. నిడిగంటి వీరయ్యదేవర విరచితమైన "లక్ష్మమ్మ కథ"లో నామె సహనత్యాగగుణము లనంతములు. అత్తా తోడికోడండ్రు ఆమెను పెట్టరాని బాధలు పెట్టినారు. ఆమె యసూయకతను లోకువగా గొని దాసివానితో రంకులు కట్టినారు. అవివేకియైన భర్తచే నామెను హత్య చేయించినారు. బాకు పోటుకు విలవిల తన్నుకొనుచు, ఒక్కసారి భర్త సన్నిధానమును, కరతల స్పర్శను వేడుకొనినది. దానిని పొంది శాంతముగా కన్ను మూసినది. చితినబెట్టి కాల్చగా శిలయై దేవతయైనది. ఆమె పతిభక్తి అపూర్వము; సహనమకుంఠితము. విశాఖజిల్లాలో నధిక ప్రచారముననున్న 'సన్యాసమ్మపాట'లోని నాయికయగు సన్యాసమ్మ తోడికోడండ్ర ఈర్ష్యాసూయల ఫలితముగ అభిమాన ఘనుఁడగు భర్తను కోల్పోయి అతనితో తాను సహగమన మొనర్చినది. మండపేట పాపమ్మ యను పేరంటాల కథయు దాదాపిట్టిదే. ఇట్టి పేరంటాండ్ర కథలయొక్క వైశిష్ట్యమును గూర్చి డా. బి. రామరాజు గారిట్లు వ్రాసియున్నారు.

"ఈ పేరంటాండ్ర కథలలో నొక విశేషము కనఁబడుచున్నది. వీరందఱును సహగమనము నిషేధింపబడిన తరువాత విశేషయత్నము చేసి సహగమనము చేయుటకు అనుమతి తెచ్చుకొనినవారు. ఈ సుగుణము జానపదుల నాకర్షించినది. ఎరుకమ్మ ఆనంద గజపతి మహారాజు కడ నిప్పు బంతులాడి సత్యము చూపినదట! 'అగ్నికి భరింపఁ గలవా మాతల్లి'యని ఆ ప్రభువు అనియుండును. భరింపఁ గలననుటకు ఆమె నిప్పు చేతులో పెట్టి చూపియుండును. ఇది నిప్పు బంతులాటయైనది. తక్కినవారు చూపిన సత్యములు కూడ ఇటులే గ్రహింపఁదగును. సన్యాసమ్మ చూపిన సత్యములకు ఆంగ్లేయు లచ్చెరువుపడిరి. ఇవి కొంత అతిశయోక్తులు. పేరంటాండ్రందరును దేవతలై మ్రొక్కులు దీర్తుననునది ఈ గాథలందలి మరియొక విశేషము. వీరారాధనము భారతదేశమునఁ గ్రొత్తకాదు. అవతారము లొక విధముగా వీరారాధనమునకు లక్ష్యములే. ఈ పేరంటాండ్రు కూడ ఆరీతిగనే ఆరాధ్య దైవములైరి. పెద్ద (సంక్రాంతి) పండుగ తరువాత రెండవ దినమున నూతన వధువులు పట్టెడు సావిత్రి, గౌరి

(బొమ్మలనోము) పేరంటాండ్ర పూజయే. పేరంటాలనెడి పేరుతో నున్న దేవతలు సహగమనము చేసిన సాధ్వీమణులు "[1]

నల్లి తంగాల్ చరిత్రము అభిమానవతియైన స్త్రీ యొక్క విషాదగాథ. కాశీరాజు భార్యయయి కాటకమునకు గుఱియై యేడుగురు బిడ్డలతో నన్నల పంచచేరినది. మార్గమధ్యమున నడవులలో బహుయాతనల ననుభవించినది. అన్నల యిళ్ళలో వదినలచే ఘోరావమానములఁ బొందినది. అన్నలు వేటకు వెళ్ళియుండఁగా వదినలవలని యవమానము భరింపలేక అడవిలో పాడుబడిన బావియొద్దున మంగళసూత్రముంచి సుతులను ముందుత్రోసి, తానాపైఁబడి మరణ మొందినది. ఆమె కభిమానము ప్రాణముకన్న తీపి !

వీరరాజమ్మయను పల్నాటి యాడబడుచు అత్తగారి యారడి కోర్వ జాలక, యింటినుండి వెడలగొట్టబడి చంటిపిల్లవానితో బుట్టింటి కేఁగుచుండ మార్గమధ్యమున వానకురిసినది. తల దాచుకొనుటకు ఒక పాక చేరగా నందు కొందఱు దొంగలుండిరి. వాన వెలసినదేమోనని చూడ బయటికివచ్చిన దొంగ యామె యందముగని మోసగించి లోనికిఁగొంపోయి అందరితోకలిసి బలవంత పెట్టెను. ఆమె అయ్యా ! అన్నా ! అని ప్రతిమిలాడుచు వాపోయినది. తప్పించు కొనుటకు యత్నించినది. వారి మూర్ఖ మధికమాయెను. కడుపునొప్పూల వచ్చిన దని వంకపెట్టి బయటికివెళ్ళి మఱల వచ్చెదననినది. వారు బాలుని వదలిపొమ్మ నిరి. చేయునదిలేక మానసంరక్షణార్థము తనయుని వారియొద్ద వదలి బయటికి వచ్చి యింటి గొళ్ళెము వేసినది. దానిని తీయనిచో శిశువును చంపెదమని దొంగలు బెదిరించిరి. ఆమె తీయలేదు. వారాతనిని చంపి ముక్కలుచేసి గవా క్షముగుండ బయటకు పారవేసిరి. ఆ ఘోరమును చూచిన యామెకొడలు శివమెత్తినది. తలుపు తెఱచి శక్తివలె వారిపై లంఘించినది. వారికత్తినొకటి లాగి వారితో పెనగినది. అందఱినిచంపి తానునుచచ్చి శిశు మాంసఖండము లపైఁ బడి మృతినొందినది. ధర్మ సంరక్షణమునకై మానముకొఱకు ప్రాణము బలిపెట్టిన త్యాగమూర్తి వీరరాజమ్మ !

వెలమ వంశమున బీదరాలిగా పుట్టి తల్లిదండ్రులచే నెఱుకలవారి కమ్మ బడి వారి కుటుంబము నుద్ధరించిన మహాసాధ్వి యెఱుకల సానమ్మ ! రాము లమ్మ పాటలోని రాములమ్మ భీమారెడ్డి భార్యయై లంబాడివానిచే మోస గింపఁబడి అతనిచే దొంగిలింపఁబడి వ్రతనియమమిషచే మానరక్షణము చేసి

1. తెలుఁగు జానపదగేయ సాహిత్యము. పుట. 617—618

కొనుచు, చిలుక సహాయమున భర్తకా విషయము పుత్తెంచి, అతనిచే లంబాడీని చంపించి, అగ్నిప్రవేశముచేసి తన పాతివ్రత్యమును నిరూపించి, భర్తను పొంది, కొన్నాళ్లకు జనాపవాద భీతిచే భర్త వదలిపెట్టఁగా నడవులఁజేరి అగ్నిఁ బ్రవేశించి పేరంటాలై వెలసినసాధ్వి రాములమ్మ! ఈమె అపరసీతమ్మయే. చిగురాకులవంటి తమ శీలసౌకుమార్యమును కంటకముల బారినుండి తప్పించు కొనుచు జీవితమంతయు నొక అసిధారావ్రతముగా నడపిన ఈ పేరంటాండ్రు జానపదసాహిత్యమున పుణ్యదేవతలై పూజలందుకొనుచున్నారు.

## 2. యక్షగానములు

"యక్షగానములనగా సంగీత ప్రాధాన్యముగల నాటకములు. తెలుఁగు లోని పూర్వ నాటకస్వరూపములు యక్షగానములు. వీటిని యక్షగాన నాటకము లనుటయు, యక్షగాన ప్రబంధము లనుటయుగూడ కలదు. ఈ తెగ రచనలో నాటకలక్షణమైన సంభాషణములును, ప్రబంధలక్షణమైన వర్ణనములు గూడ ఉండును. కావున నీ రెండు పేరులును వీటికి చెల్లుచుండినవి. యక్షులచే గానముతో కూడుకొనునట్లు ఆడబడు నాటకములని ఈ పదమునకు అర్థము చెప్పవచ్చును. యక్షులనగా జక్కులవాండ్రనఁబడు నొకతెగవారు. వీరివృత్తి చిన్నచిన్న నాటకములను సంగీత బాహుళ్యముగా బ్రదర్శించి జనులను రంజింపఁజేసి, ధనార్జనఁ జేయుట. యక్షశబ్దమునుండి పుట్టినదే జక్కులవాఁడు అనుపదము. ఈ జక్కులవాండ్రు యక్ష కింపురుషాది దేవజాతులలోనివారు కాకపోవచ్చును. వృత్తిచేతనే వీరు యక్షులు, జక్కులును అయిరని యూహింప వలెను. తాముప్రదర్శించు నాటకములలో వీరు వివిధపాత్రధారణముచేయుచు ఒకప్పుడు యక్షులుగాను, మరొకప్పుడు దేవతలుగాను వేషములువేసికొనుటచే వారికి యక్షులు జక్కులు అను సంజ్ఞ యేర్పడియుండును. క్రమముగానది వీరి కులనామముగా స్థిరపడెను ... కవివాక్యములు స్వల్పముగానుండి వర్ణనములు తక్కువగానున్న యక్షగానములు నాటకత్వమునకు దగ్గఱగానుండును. వర్ణనాభాగము విస్తారముగాగలవి ప్రబంధములవలె నుండును. యక్షగానములలో ద్విపదలు, సీసపద్యములు, కందములు మొ. వానితోపాటు, ఆయాతాళములకు అనువుగాఁ గూర్పఁబడిన గేయములుండును. దరువులనఁబడు గేయములు తరుచుగానుండును. యక్షగానములలో దేశీరచనలు విరివిగా బ్రవేశించినవి. ఏలలు, జోలలు, సువ్వాలలు, ధవళములు, శోభనములు, కందార్థములు,

చందమామ సుద్దులు, అల్లోనేరేళ్లు తుమ్మెదపదములవంటి వెన్నియో మధుర కవితా ఫణితులు కాన్పించును. వీనిలో నంకవిభజనము అక్కడక్కడ మాత్రము కనఁబడును. శ్రీ త్యాగరాయలవారు వ్రాసిన ప్రహ్లాద భక్తవిజయ నాటకములో నంకవిభజనమున్నది. యక్షగానములవంటివే యయిన దృశ్యరచనలు మనభాషలో కలవు. వీటిని వీథినాటకములు వీథిభాగవతము లందురు. ఇందు భక్తి శృంగారములకు అగ్రస్థానమీయఁబడును. ఈ భాగవత కథలలో పారిజాతాప హారణ వృత్తాంతము, ఎక్కువ ప్రజాదరణముఁ బడసినది. భాగవత ప్రదర్శనమునందు కూచిపూడి భాగవతులకు విశిష్టగౌరవస్థానము గలదు. వీరి నృత్యము శాస్త్రీయమై భరతకళా సంప్రదాయమున కత్యుత్తమోదాహరణమై భావభరితమై యొప్పుచున్నది. కూచిపూడి వారలలో స్త్రీ పాత్రలను పురుషులే ధరించి నటింతురు. కిరాతార్జునీయము, గరుడాచలము, త్రిపుర సంహారము పార్వతీ పరిణయము, గంగాగౌరీ విలాసము ఇట్లెన్నియో యక్షగాన కథలు ప్రచారములో నున్నవి."[1]

వీరరస ప్రధానములైన యక్షగానములలో నుదాహరణమునకై రెంటిని మాత్రము పేర్కొని ముగింతును. యక్షగానములపై డా. యస్వీ జోగారావు గారు గొప్ప విమర్శన గ్రంథము రచించి తెలుఁగు సాహిత్యమునకు గొప్ప సేవ చేసినారు.

### ౧. సుగ్రీవ విజయము – కందుకూరి రుద్రకవి :

తెలుఁగున యక్షగానములలో నతిప్రాచీనమైనది. కందుకూరి రుద్రకవి – సుగ్రీవ విజయము. ఇతివృత్తము రామాయణ ప్రసిద్ధము. ఇందు రాము నాశ్రయించిన వీరమాశ్రిత రక్షాదక్షమైనది. శ్రీరాముఁడు సుగ్రీవున కభయహస్తమిచ్చినప్పుడు ధర్మవీరమును, దుందుభి శరీరము నంగుటమునఁ జిమ్ముటయందు, సప్తతాళములఁ గూల్చుటయందు, వాలి సంహారమునందు బలవీరమును స్ఫురించుచున్నవి. రామబాణమునకు నిహతుఁడైన వాలి–

జంపె: "కరుణాపయోనిధి రాఘవుఁడు –
ధర్మాత్ముఁడని నరులెంచి మదిలోన నమ్ముదురే నిన్ను!
బలిమిగా నీవింత పాపకర్మంబునకు – దలచు టేనెరుఁగ కెంతయు మోసపోతిన్
ననుచేరుకొని విలిచి నాముఖాముఖనిలిచి – జననాథ పోరాడి చంపలేవైతి

1. ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహము—ప్రొ. ఖండవల్లి లక్ష్మీరంజనముగారు. పుట. 265, 269.

పొంచియేసితి రామభూపాల నృపధర్మ - మెంచుకోలేవైతి వెంత జేసితివి
శ్రీరామ సీతామ జెరగొన్న రావణుని - వారధుల ముంచితిని వాలమునజుట్టి
ఒకమాట నాతోడ నొనరంగ తెల్పవైతకట - రావణు దున్మి యా సీతఁ దేనె"

అని రాము నధర్మపరుఁడని పల్కిన వాలికి సమాధానముగా శ్రీరాముఁడు :

జం పె: పలకపివర్య యీ పాలుమాలిన మాట - లోలినాడెదు శౌర్యశాలివై యుండి
రోసమున నీసహోదరు నాతిగైకొన్న - దోసకారివి నిన్నుఁ ద్రుంపనే తగును
పరమధార్మికుఁడైన భరతవిభు పంపునను -
చరియించు మేము దోసము చూడఁగలమా ?
పొంచి చేసితివంటి భువిలోన మృగములను -
పొంచి యేయకయున్న బోవెదవ్వులకూ
ధర్మమే జయమనుచు దలపనేరని ఘోరదుర్మార్గులకు బ్రతుకు దూరమై చనదె ?

అని తన ధర్మప్రవృత్తినిఁ ఆశ్రిత రక్షణదక్షతను నిరూపించుకొని ధర్మవీరుఁడని పించుకొనినాఁడు రాముఁడు.

౨. గయోపాఖ్యాన నాటక యక్షగానము - రామానుజకవి :

రామానుజకవి విరచిత గయోపాఖ్యాన నాటకమను యక్షగానము వీరరస ప్రధానమైనది. ఆర్తరక్షణవ్రత నిష్ఠుఁడగు నర్జునుఁడు గయున కభయ హస్తమిచ్చి కృష్ణునితో విరోధముఁ దెచ్చుకొని, ప్రతిన నిలువఁబెట్టుకొని ధర్మ యుద్ధ వీరుఁడనిపించుకొనినాఁడు. ఉదా. గయునకిచ్చిన అభయ ప్రదానము.

ధరణి చలించినన్ గిరులు తల్లడమందిన నంబరంబు ది
క్కరులు తలంకినన్ మరి జగంబులుమూఁడును పిచ్చలించినన్
శరనిధులెల్ల నింకిన భుజంగమరాజు శిరంబువంచినన్
హరికి నొసంగ నిన్నిక భయంబు తొలంగి మెలంగు మోగయా!

అను పల్కులలో ధర్మయుద్ధవీరుఁ డగు నర్జునుని యందలి అఖండ పౌరుషము దయాప్రధానముగా వెల్లివిరిసినది. అది శ్రీకృష్ణునితోడి యుద్ధముతో పరాకాష్ఠనందుచున్నది.

## 3. బుఱ్ఱకథలు

బుఱ్ఱకథలు జంగముకథలవంటివి. బుఱ్ఱల దరువుతో పాడు పాటలు కావున వీని కా పేరు వచ్చినది. దేశమును జాగృతము చేయుటలో బుఱ్ఱకథలు ఘనమైన పాత్రను నిర్వహించినవి. వీరరౌద్రకరుణములు ఇందు చక్కగా నొప్పింపవచ్చును. తెలుఁగులో వీరరసప్రధానమైన బుర్రకథలు వ్రాయు

నవ్యులలో శ్రీ సుంకర సత్యనారాయణగారు ప్రసిద్ధులు. వారు వ్రాసిన బుఱ్ఱ కథలలో వైవిధ్యము హెచ్చు. వారి "కర్ణుఁడు" పౌరాణికములలోను, 'రుద్రమదేవి' చారిత్రకములలోను, 'అమరజీవి' సాంఘికములలోను ప్రసిద్ధములైనవి. శ్రీ లక్ష్మీకాంత మోహన్ రచించిన 'ఝాన్సీ లక్ష్మీబాయి' స్వాతంత్ర్య వీరప్రధానమైన బుఱ్ఱకథ!—ఉదాహరణమునకు కొన్ని పంక్తులు :

"భారత సామ్రాజ్యానికి నిను సామ్రాట్టువు కమ్మనిన
నీరజాక్షునే కాదని నీతికి నిలిచినావునాడు
వీరాగ్రేసర మరచిపోరు నిను భారతీయు లెపుడు
స్వార్థసిద్ధికై చంపివేసె నిను పార్థుండాలమున
స్వార్థత్యాగి! గైకొను మీ మా వందనంబు లివిగో!"

అని రచయిత వ్రాసిన పదములు పాడుచున్నపుడు అంతటి త్యాగవీరుఁడు కర్ణుఁడు అస్తమించినాఁ డని కంట తడిపెట్టని వారుండరు.

"మగువను నన్నెదిరించలేని ఓ మగవాఁడా రేడా!
ఎగబడి ఉరికిన నిన్ను పోనిచ్చునె ఈ రుద్రమ నేడు!"

అని యాదవ మహాదేవుపై లంఘించిన వీరరుద్రమ తెలుఁగువారి పౌరుష సారము.

"మాతృదేశము కొరకు మరణించు వీరుల
పూలతో పూజింపరావ, వీరుల పూలతో పూజింపరావా? మాతృ.

స్వాతంత్ర్య పోరాటమున చావో బ్రతుకో తేల్చు కొనేటి
వీర దేశసేవకులకు వేగరార పూజసేయ! మాతృ.

జానిసమై యిల బ్రతికేకన్న ప్రజలకు నరకము వేరే లేదని
ప్రజారాజ్యస్థాపనయే మా పరమావధియని పోరుసల్పుచు. మాతృ.

అని ప్రారంభించిన 'అమరజీవి' అమల స్వాతంత్ర్య వీరస్ఫోరకము.

దేశకాలపాత్రముల నెఱిఁగి జాతిని ప్రబోధితముచేయుటకై బుఱ్ఱకథ యనియెడి దేశీయరచన లుపయోగపడినవి. రేడియో, ఎన్నికలు, ప్రణాళికలు దీనిని సద్వినియోగపరచుచున్నవి. తెలుఁగుదేశమున నాజరువంటివారు "అల్లూరి సీతారామరాజు" కథ చెప్పుచున్నపుడు ప్రజలు వీరరసావిష్టులైపోయెడివారు. కథా రచయితలు పెక్కుఱు కలరు. వారి నందఱను స్థలాభావమునఁ బేర్కొనఁ జాలకపోవుచున్నాను.

## 4. హరికథలు

హరికథ అభినయప్రధానమగు నొక విధమైన రూపకము. ఇందన్ని పాత్రలు ఒక వ్యక్తిచేతనే నటింపఁబడును. కావున ఏకపాత్రాభినయ విశేష మనఁబడును. చతుర్విధాభినయము లిందుండవు గాని సాత్త్వికాభినయము మాత్ర మిందు బలీయముగా నుండును. అదియే తదితరములు లేని కొఱఁతను తీర్చి ప్రేక్షకునికి భావతాదాత్మ్యముఁ గల్పించును. అట్టి యనుభూతి కల్పించుటయే హరికథకుని లక్ష్యము. హరికథ యను నామముఁ బట్టి యది దైవ సంబంధమగు పుణ్యప్రబంధమని యర్థమగు చున్నది. అనఁగా బరమాత్మ కీర్తనాత్మకమగు కథలనే హరిదాసులు గానము చేయుచుందు రన్నమాట! తెలుఁగున మొదటి రోజులలో నట్టి హరికథలే వెలసినవి. కాలక్రమేణ హరికథ సంఘసేవకు, దేశభక్తి ప్రచారమునకు, స్వాతంత్ర్యోద్యమప్రచారమునకు ఉపయోగపడి వర్తమాన యుగాభ్యుదయమునకుఁ దోడ్పడినది మహాదేవుఁడు నాయకుఁడు కాఁదగిన హరికథలలో మహాపురుషులు తావేర్పరచుకొనిరి. దేశనాయకులు, త్యాగమూర్తులు, యుగకర్తలు, మహారాజులు, మహాకవులు, వీరపుంగవులు, వీరనారులు — వారి గాథలు హరికథావస్తువు లైనవి. ఉద్యమప్రబోధముకొఱకై యుపయోగించు హరికథలలో జాతియొక్క రాజకీయ మతసాంస్కృతిక జీవితవర్ణనముకూడ కొంత తావేర్పరచుకొనినది.

తెలుఁగు సాహిత్యములో హరికథారచయితలను వేళ్ళపై లెక్కపెట్ట వచ్చును. వీరిలో నగ్రగణ్యుఁడు 'హరికథాపితామహుఁడు' కీ. శే ఆదిభట్ల నారాయణదాసుగారు. అతఁడు మేధావి, పండితుఁడు, కవి, లౌకికుఁడు, భక్తుఁడు, నటుఁడు, రసజ్ఞుఁడు అగుటచే సర్వతోముఖముగా నాతనియందా కళ పుష్పించి ఫలించినది. వీరి కలమునుండి వినిర్గతములైన హరికథ లన్నియు పౌరాణికములే! జానకీశపథము, రుక్మిణీ కల్యాణము, మార్కండేయ చరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము, అంబరీష చరిత్రము, భీష్మ చరిత్రము, గజేంద్రమోక్షము, ప్రహ్లాద చరిత్రము మొదలగునవి వీరికృతులు.

సామాన్యముగా దాసుగారు భక్తిరసప్రధానములగు కథలను వ్రాయు ప్రవృత్తిఁ గలవారు. వారి కందున్న యభినివేశ మట్టిది. కాని ఇందులో జానకీశపథము, హరిశ్చంద్రోపాఖ్యానము, భీష్మచరిత్రము అను వానిలో వీరరసము బాగుగా స్ఫురించుచున్నది. జానకీశపథము ఉత్తరరామాయణగాథ. దాసుగారి చేతిలో నాకథ రసోదంచితములగు పెక్కుమార్పులకు గురియైనది. అవి

(1) రాముఁడు మారువేషమున పట్టణమున సంచరించుచు చాకలివాఁడు మోపిన నిందను స్వయముగా వినుట. (2) సీత నరణ్యమునకుఁ గొంపోవ నచ్చట నుష్ణాధిక్యముచే నామె యొక చెట్టు నీడలో విశ్రమించి నిద్రింప నామె మ్రోల వనవాస కారణమును ఒక పత్రముపై లిఖించియుంచి లక్ష్మణుఁడు రథముపై నయోధ్యకు తిరిగిపోవుట. (3) మానవతి యగు సీత మారుపేరుతో వాల్మీకి ఆశ్రమమున నుండుట. (4) వాల్మీకి కుశలవులతో నయోధ్య కేతెంచుట. (5) సౌమిత్రిచే సీత నయోధ్యకుఁ బిల్పించుట. (6) చివటి కావనిత సీతయని ఋషికన్యలకు తెలియగా వా రాశ్చర్యపడుట!

ఇందు శ్రీరాముడు :

"తాను కష్టంబు పడియైన ధర్మపథము
వలదు తప్పింపఁ బ్రజలకు భూభర్తగాన
నింద బోగొట్టుకొనుటకై నిశ్చయముగ
భూమిజయు నేను విడిబడి పొగలవలయు."

నని నిశ్చయించుకొనిన రామునియందు ధర్మవీరము కానఁబడుచున్నది.

భీష్మచరిత్రము ధర్మవీర ప్రధానమైనది. ప్రారంభములోనే దాసుగారు:

"పౌరుషజ్ఞాన కీర్తులఁ బరఁగి స్వార్థపరుఁడు గాకెన్నఁడైనఁ బాపము నలుపక
ధర్మవర్తనమునకు నిదర్శనంబు శాంతనవుఁడయ్యె నాతని చరిత వినుఁడు."

అని ప్రేక్షకులఁ బ్రరోచన మొనర్చినాఁడు. దాశరాజు ముంగిట తన తండ్రికై భీష్ము డొనర్చిన ప్రతిజ్ఞ అతని త్యాగశీలమున కుదాహరణము :

కన్నడా — త్రిపుట

పల్లవి : నేనొల్లనిక రాజ్యభోగము – నీ మనుమలే యేల నీ.

అ. ప : భూనాథుండు నీ కొమార్తెయు - మోదవార్నిధి తేలనీ.

౧. బ్రతుకువఱకున్ బ్రహ్మచర్యవ్రతము నే కావించెదఁ
హితముగా నా కన్నతండ్రికి ఋణము దీర్చి తరించెదన్.

కాశీరాజు దుహితలను గైకొని వచ్చుచు స్వయంవర సభలో మూగి యున్న రాజసమూహముల గాంచి :

శంకరాభరణము — రూపకము

పల్లవి : వీరులున్న నెవ్వరైన వీరల విడిపించుకొండు

అ. ప : పోరిలోన మీకుఁగల్గు - భుజాబలము చూపరండు

౧. తమ్మునకుం బెండ్లిసేయఁ దలఁచి వీరిఁ గైకొంట
ఇమ్మహిలో రాక్షసోద్వాహము క్షత్రియ ధర్మమంట!

అని ధర్మబద్ధమైన యుద్ధవీరమును ప్రదర్శించినాఁడు.

జామదగ్ని అంబను గైకొను మనినప్పుడు 'ఒక్కొక్కప్పుడు పెద్దల బుద్ధులు కూడ తప్పుటడుగువేయు'నని ఇట్లని విచారించినాఁడు భీష్ముఁడు.

"తలిదండ్రు ల్గురు లాప్తులయ్యుఁ గడు మత్తంబైన చిత్తంబుతో
నలువుర్వోయిన త్రోవవోక నెపము న్గల్పించి యీ తీరునం
బలుదుర్దైవము పాటున న్వథము దప్పంజెప్ప నే జేయుచె
ట్టులు నిక్కంబుగ ధర్మవీరులకు లేఁడోరతుకుం డెయ్యెడన్."

అని పరశురాముని గాంచి యిట్లు వీరోక్తు లాడినాఁరు :

కేదారగౌడ - ఝంప

పల్లవి : నీ కరపు మేటివిలు - నేర్పు చవిఁ జూచెదో.
అ. ప : నీ కరుణ సాగెదను నే బాహుజుఁడ గనుక - క్షత్రియుండను గనుక...
౧. మున్ను రాజుల నీవు - బొలియింప గాంగేయు
డున్నచోఁ జెల్లునే - యుల్లపుం బండువుగ.
౨. నే నొంటి వత్తు మన - మెక్కుదము రథములను
ప్రాణంబు లాసింప - నన్యాయమైనచో.

అని గురువుతో కదనమునకు దిగి అతనిచే మెప్పులు వడసిన ధన్యాత్ముఁడు. నిజముగా నతఁ డర్జునుఁ డనినట్లు :

భూపాల - చతురస్ర

పల్లవి : త్రిజగదేకవీరుఁడు ధర్మాత్ముఁడు కృష్ణా! నాతాత గాంగేయుఁడు
౧. తండ్రికోఱకునై బ్రహ్మచర్యవ్రతంబు పట్టినాఁడు భీష్ముఁడెం
తయో మంచివాఁడు కులవృద్ధుఁడు.

అతని చరిత్రమొక ధర్మవీరుని పుణ్యగాథ!

తెలుఁగు సాహిత్యలక్ష్మికి హరికథాపుష్పముల నుపాయనముగా నిచ్చిన ప్రముఖ హరికథా కర్తల నీ క్రిందఁ బేర్కొందును. బి. బాలాజీదాసుగారి పౌరాణికములగు హరికథలలో పెక్కులు వీరరసప్రధానములు. అవి : సంపూర్ణ రామాయణము, కుశలవ విజయము, గయోపాఖ్యానము, త్రిశంకు విజయము, ద్రౌపదీ మాన సంరక్షణ, శశిరేఖా పరిణయము, నలచరిత్ర మొ. నవి. తిరునగరి శేషదాసుగారి హరికథలలో శ్రీరామపాదుక, ఉత్తరరామ చరిత్రము, అనునవియును, కోనూరి భోగలింగదాసుగారి కథలలో సంపూర్ణ

రామాయణము ప్రధానమైనది. నందివాడ జగన్నాథదాసుగారి కథలలో క్షీర సాగర మథనము, శ్రీకృష్ణరాయబారము మొ. వీరగాథలు. పెంటపాటి సర్వే శ్వరరావు భాగవతారుగారి భీమార్జున గర్వభంగము, భక్త ప్రహ్లాద ప్రసిద్ధ ములు. కొమ్మూరి బాలబ్రహ్మానంద దాసుగారి శివచరిత్రము, భక్తనందనారు సిద్ధయ్య చరిత్రము, సత్యనారాయణ వ్రతకథ మొ. నవి యెన్నఁదగినవి.

హరికథా కర్తలలో ములుకుట్ల పున్నయ్యశాస్త్రిగారిది విలక్షణమైన మార్గము. వీ రితిహాసపురాణగాథలను, భక్తగాథలను, కవుల గాథలను, చారి త్రక వీరగాథలను, స్వాతంత్ర్య వీరగాథలను రచించి, రచనావైవిధ్యమును సాధించినారు. హరికథ కేవలము ఆనందమునకు వినోదమునకు మాత్రమేగాక దేశభక్తిని ప్రబోధించుటకును, సంఘసేవ చేయుటకును తోడ్పడి తద్ద్వారమున సమకాలీన యుగాభ్యుదయమునకు మూలహేతువుగా దీర్చిదిద్దెను. వీరి హరి కథలలో నేతాజీబోసు, ఛత్రపతి శివాజీ, రాణాప్రతాప; శ్రీకృష్ణదేవరాయలు, మహాత్మాగాంధి, క్రిప్సు రాయబారము, సంపూర్ణ భారతము, వేమనయోగి, భక్తపోతన, భక్త త్యాగరాజు మొ. నవి ప్రసిద్ధములు. ఇందు భక్తచరిత్రలు తప్ప మిగిలినవన్నియు వీరరస ప్రధానములే. వీరివలెనే కృషిచేసినవారు పరిమి సుబ్రహ్మణ్యదాసుదారు. సంపూర్ణ మహాభారతము, సుభాస్‌చంద్రబోస్ అను ప్రసిద్ధములగు కథలు వ్రాసియుండిరి. ఇంకను ఇతరులచే రచింపఁబడినవగు మారుతీ విజృంభణము, బాపూజీ, జైమినీ భారతము, క్విట్ ఇండియా మొ. వీరరసగాథలు తెలుఁగుదేశమున ప్రచారములో నున్నవి. ఇటీవల ఆలిండియా రేడియో వారి ప్రోత్సాహమునఁ బెక్కు దేశనాయకుల చరిత్రలు, ప్రణాళికా పరములగు హరికథలు పెక్కులు వెలువడుచున్నవి. వెలుగులోనికి రానివి, ముఖస్థములైనవి పెక్కుకథలు దేశమున వ్యాపించియున్నవి.

★

# 10. ఉపసంహారము

వీరత్వము, వీరారాధనము అనునవి భారతీయుల యందు ప్రాచీన కాలము నుండియు గానఁబడు విశేష లక్షణములు. ఈ విషయమును విపులముగా నిరూపించిన ఉమాకాన్త పండితుని వాక్యముల నిచ్చట కృతజ్ఞతతో గైకొనుచున్నాను.

“వీరత్వము మిక్కిలి ప్రాచీన కాలంనుండి ఆరాధ్యంగా సంభావిత మవుతున్నది. ఋగ్వేదంలో పూజ్యుఁడయిన ఇంద్రుడికి వీర అని సంబోధనం కలదు. “సుప్రవాచనం తవ వీర” (२-२३-२२) అని ఋక్కు. “వీరబలవన్ హే ఇంద్ర” (ऋ. भा) అని విద్యారణ్యులు. శ్రుతుల్లో అగ్నికికూడా వీరుఁడని ప్రశంసకలదు. వీరహత్య ఒక గొప్ప పాపంగా పరిగణితమౌతూ వుండేది. “వీరహా వా ఏష దేవానాం యోఽగ్ని ముద్వాసయతే నవా ఏతస్య బ్రాహ్మణా ఋతాయవః పురాన్నమక్షన్” (కృ. య. ५-२-२) అని కృష్ణయుజుస్సు. వేదభాష్యంలో “దేవానాం మధ్యే వీరోఽగ్నిః తదుద్వాసయితా తద్వదికారిణః యజమానస్యాన్నం ఋతాయవః సత్యమిచ్ఛన్తో బ్రాహ్మణాః పురా నైవాక్షన్ నైవ భుక్తవన్తః” అని విద్యారణ్యులు వివరించారు. వీరశబ్దం శ్రుతుల్లో కొన్నిచోట్ల పుత్రపరంగా గూడా వ్యాఖ్యాతం. తైత్తిరీయ బ్రాహ్మణంలో “వీరహా బ్రహ్మహాణి” (తై. బ్రా. ३-८) అనేచోట వీరశబ్దం క్షత్రియవాచి అని కొందరంటారని అది పుత్రవాచకమని “వీరహా గర్భఘాతీ క్షత్రియ వాచీత్యేకే” (భ) అనే పఙ్క్తుల్లో భట్టభాస్కరులు తెలుపుతున్నారు. ఋగ్వేదభాష్యంలో కొన్నిచోట్ల వీరశబ్దానికి శ్రీ విద్యారణ్యులు పుత్రపరంగా వ్యాఖ్యచేశారు. “అవీరాయాశ్చ యోషితః” (మ. ४-२१३) అని వీరభార్య అయినా వీరమాత అయినా కానటువంటి స్త్రీచే అన్నంతినగూడదని మనువు నిషేధిస్తున్నాఁడు. ఇక్కడ వీరశబ్దం పుత్ర వాచిగా గూడా వ్యాఖ్యాతం. దుర్బలులైన శిశువులు త్యక్తులై, దేశరక్షకులు కాగల దృఢకాయులైన శిశువులుమాత్రం రక్షితులుగాఉండిన పురాతనపుగ్రీసుదేశంలో వలె,ఇప్పుడు ఇటలీవంటి దేశాల్లోవలె ఒకప్పుడు భారతవర్షపు ఆర్యుల్లో వర్ధిల్లిన పురుషులందరూ చాలామట్టుకు వీరులుగానే వుండిన కాలాన్ని పై శ్రుతిస్మృతి పఙ్క్తులు సూచించగలవేమోనని అనుకొంటున్నాను. క్షాత్రప్రతిపత్తిలో పుత్రుడు

వీరుఁడు కనుకనే "వీరప్రసవాభూయాః" (ఉత్తర) "అపరావీర మజీజనత్ సుతం" (రఘు) అని వీరపుత్రుణ్ణే భావిస్తూ వచ్చారు. మహాభాష్యంలో అనేక స్థలాలలో వీరశబ్దం ప్రస్తావించ బడింది. శాస్త్రంలో మంగళార్థక శబ్దప్రయోగాన్ని ప్రశంసిస్తూ "మంగళాదీని మంగళమధ్యాని మంగళాన్తాని చ శాస్త్రాణి ప్రథన్తే వీరపురుషకాణ్యాయుష్మత్ పురుషకాణి చ భవన్తి" (మహా) అని పతంజలి వీరత్వాన్ని సంభావించాడు. మంత్రశాస్త్రంలో కూడా "నిస్సంగే నిర్భయో వీరో నిర్ద్వంద్వో నిష్కృతూహలః" అని వీరశబ్దం సాధకపరంగా అర్థితమవుతున్నది. ఇట్లానే మరికొన్ని చోట్ల కలదు. యోగశాస్త్రంలోకూడా ఈ వీరశబ్దాన్ని స్వీకరించి వీరాసనమనే ఒక ఆసనాన్ని ప్రతిపాదించారు. దీన్నే "వీరాసనైర్ధ్యాన జుషామృషీణాం" (6) అనేచోట కాళిదాసు ప్రస్తావించాడు. శృంగార సందర్భంలోకూడా "మనసి నః స్మరం వీర యచ్ఛసి" (శ్రీ. భా. 10) అని గోపికలచేత శ్రీభాగవతకారుఁడు వీరశబ్దాన్ని ప్రయోగింపఁజేశాడు. రామాయణంలో "వీర్యశుల్కేతి మే కన్యా స్థాపితేయ మయోనిజా" (రా. బా) అని జనకుఁడు తన పుత్రిక వీర్యశుల్క అని ప్రకటించాఁడు. ఈ వీర్యశుల్క అనే మాటలనే కాళిదాసు "దృష్టసారమథ రుద్రకార్ముకే వీర్యశుల్క మభినంద్య మైథిలః" (ర. 11) అనేచోట స్వీకరించి గౌరవాన్ని తెలిపినాఁడు. వీరమాతృత్వం, వీరపత్నిత్వం మిక్కిలి ఆరాధ్యమైనవిగా ప్రాచీన కాలంలో సంభావిత మౌతూ వుండేవి. "వీరసూర్వీరపత్నీ త్వం" (మ. ఉ. 90-92) అని కృష్ణుడు కుంతిని అభినందిస్తాడు.

> "భర్త్రాసి వీరపత్నీనాం శ్లాఘ్యానాం స్థాపితా ధురి
> వీరసూరితి శబ్దోఽయం తనయాత్త్వా ముపస్థితః." (మా. 5)

అని కాళిదాసు ఈ ధర్మాల పూజ్యతను విశదం చేస్తాడు. శివోద్భూతుడైన వీరభద్రుడి వీరత్వం ప్రసిద్ధమయ్యే వున్నది. తదారాధకులు ఇప్పటికి వీరాంగాన్ని ఉద్బోధకంగా వెలయిస్తున్నారు. విష్ణువుయొక్క పది యవతారాల్లో నృసింహుఁడు, శ్రీరాముఁడు, పరశురాముఁడు, బలరాముడు యుద్ధవీరులే అయి వున్నారు. వైదికమత రక్షణాదులు విశేషలక్షణాలు వారికి వున్నా వారు యుద్ధవీరుల్లో చేరినసంగతి నిర్వివాదం. బుద్ధుడు దయావీరుడు...శ్రీరాముడికి వీరరాఘవత్వ ప్రతీతి విదితం. భవభూతి కృతులలో శ్రీరాముఁడు మహావీరుఁడుగా ప్రసిద్ధుడు. అవతార వీరుల్లో నృసింహ శ్రీరాముల కిప్పటికీ ఆల

యాల్లో పూజలు జరుగుతున్నవి. ఇంతకూ చెప్పదలచిందేమిటంటే వీరారాధనం భారతవర్షానికి నూతనం కాదని[1]"

తెలుఁగు దేశమునందు పల్నాటి వీరులను దేవతలుగా పూజించుట కలదు. ఓరుగంటి కోటలో వీరికొక దేవాలయముండెనని ప్రసిద్ధి కూడ. "భవిష్య ద్రాజేతిహాసం"అని పురాణాల్లో ప్రదర్శితులైన రాజుల కాలానికి పిమ్మట పల్నాటి వీరులవలె దైవత్వ మారోపించి పూజితులవుతున్న యుద్ధ వీరులు ఇంతవఱకు భారతవర్షంలో మృగ్యము. భారతవర్ష మందలి యితర దేశాల్లో యిట్లాటి వీరారాధనం నాకు తెలిసినంతవరకు వున్నట్లు తోచదు. నేను కలకత్తాలో వుండేరోజుల్లో "Birbhum" (వీరభూమి) అనే పేరుగల ఒక ప్రదేశం వంగదేశంలో వున్నట్లు విన్నాను. కాని యిట్లాటి వీరమత ప్రతిపత్తి అక్కడ వున్నట్లు నేను వినలేదు. ఇటీవల పరాక్రమ ప్రధానమైన సిక్కుజాతిలో కూడా ఈరీతులు కనబడవు. మహమ్మదీయులు 'మొహరం'సమయంలో ఆరాధన కొంతవరకు దీన్ని పోలివున్నది. కార్లైలు వీరపూజను గురించి యూరపుఖండంలో యెక్కువ ప్రచారం చేశాడు. పల్నాటి వీరారాధనంవంటి మతప్రస్థాన మెక్కడా యేర్పడి వుండలేదు. స్కాన్‌డినేవియా యందలి నార్సుమతం జపానునందలి షింటోమతం యుద్ధవీరారాధనముతో సంబంధం కలవని తెలుస్తున్నది. ఈ వీరమతం ఆంధ్రదేశపు గొప్ప విశేషంగా కనపడు తున్నది."[2]

స్వాతంత్ర్యముఁ బొందిన తరువాత భారతీయులు స్వాతంత్ర్యోద్యమములో నసువులు గోల్పోయిన స్వాతంత్ర్యవీరులకు, గాంధీజీవంటి జాతిపితలను, ప్రస్తుతము భరతదేశమున కంతర్జాతీయ ప్రముఖస్థానముఁ గల్పించి శాంతి సందేశమును పల్కుచు ప్రపంచశాంతికి కృషిచేయుచున్న శ్రీ పండిత జవహర్ లాల్ నెహ్రూవంటి దేశనాయకులను, పూజించుచునే యున్నారు. ఆంధ్రులు దేశనాయకులతోపాటు రాష్ట్రనాయకులను, వీరులను, అమరజీవి పొట్టి శ్రీరాములువంటి త్యాగవీరులను, ఆరాధించుచునే యున్నారు. ఈ ఆచారము అనునది అనంతముగా సాగిపోయెడి జాతిచరిత్రకు సాహిత్యమునకు ప్రజ లిచ్చు అఖండ వీరనీరాజనము !

* * *

1, 2. పండిత శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు, పల్నాటివీర చరిత్ర పీఠిక. 66-71.

ఆంధ్రసారస్వతమునంతయు సమీక్షించినచో వీరరసము ముఖ్యముగా రెండు విధములుగఁ బ్రపంచితమైనదని యేర్పరుపవచ్చును. ప్రాచీనసాహిత్యమున ప్రధానముగా నైహికాముష్మికఫలైకకాంక్షాత్మకులై వర్తించెడివారు. పురాణేతిహాసములందు పారమార్థిక ధర్మముల సాధింపఁబూనిన విశిష్ట వ్యక్తుల గాథలు వర్ణితములైనవి. ప్రబంధములం దాదృష్టి క్రమముగాఁ దగ్గి యైహిక ఫలోద్దిష్టములైన ధర్మములను సాధించు ప్రవృత్తులు తావు గల్పించుకొనినవి. విషయసుఖములే వానియందు గుమిగూడి శృంగారమునకుఁ బట్టముకట్టినవి. నవ్యయుగమున వీరరసావిష్కారమునకు విశాలమైన రంగము దొరికినది. ఇందు పారమార్థిక దృష్టియు, నైహికదృష్టియు చక్కని సమన్వయము నొందినవని చెప్పవచ్చును. వైజ్ఞానిక దృక్పథము, స్వాతంత్ర్యాభిలాష, ప్రజాపాలనదృష్టి ప్రబలినకొలఁది లౌకిక మానవాభ్యుదయమే లోకకల్యాణహేతువనియు, విశ్వశాంతి దానికి ఫలమనియు, అదియే పరమార్థమనియు ననెడి విలక్షణ తత్త్వమొకటి విశ్వము ధరించినది.

ప్రాచీన సాహిత్యమున ఒక్క తత్త్వము గర్భితమై యున్నట్లు గుర్తింపఁ దగును. మానవుని జీవితమున ప్రాప్యమగు ఆనందము మానుషానందము, బ్రహ్మానందము అని ద్వివిధమనియు, అందు మానుషానందము త్రివర్గసాధన ఫలరూపమనియు నేర్పడును. మానుషాంద సాధకుఁడైన నాయకుఁడు "యువా సాధు యువాధ్యాయకః ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణాస్యాత్ సయేకో మానుషానందః" అను ఉపనిషద్వాక్యముచే సార్వభౌముఁడై అట్టి మానుషానందమును మాత్రము ననుభవింప యోగ్యుఁడగునని ఆదర్శరూపమున నిరూపింపబడుచున్నది. కావుననే రాజనాయకము లగు కావ్యములు సాహిత్యమున పుష్కలముగా నుద్భవించి తదాదర్శమును ప్రజలకు బోధించినవి. ఈ దృష్టితో ప్రాచీన సారస్వతమును "ఆదర్శ సాహిత్య" మనవచ్చును. కాలము, అభిరుచులు మారిన ఆధునిక యుగమున కేవల ఆదర్శ నిరూపణములతో తృప్తిపొందని కవులు భిన్నమార్గమును ద్రొక్కి మానుషానంద దృక్పథమునకు వైశాల్యముఁ గల్పించి సామాన్యమానవునకే కావ్యనాయకత్వ మనుగ్రహించి, అట్టివాఁడు కాలానుగుణమైన అభిరుచులతో త్రివర్గసాధకుఁడుగా నెట్లుండవలెనో నిరూపించు సాహిత్యప్రక్రియలు సంతరించి ఆధునికసాహిత్యముగా నిర్మించుచున్నారు. మఱియు ప్రాచీనవుటాదర్శ సాహిత్యముగూడ యీనాఁడు ఆరాధింపఁబడుచుండుటచేత ఒక విధమైన

"క్రొత్తప్రాతల మేలుకలయిక" యేర్పడినది. ఉభయమార్గములకును విశ్వ శ్రేయోరూపమైన మహోత్సాహమే హేతువగుటచే వీరరసమన్ని ప్రక్రియ లందును అంగాంగి భావరూపమున మూర్తీభవించినది. దాని నావిష్కరింపఁ జేయుటయే నాయీ స్వల్పప్రయత్నము.

ప్రాచీనాధునిక సాహిత్యముల కొక విధమైన ప్రాప్యప్రాపక భావము సంపాదించి సమన్వయించిన యెడల వీరరస ప్రక్రియ మూలమున విశ్వకల్యాణము కరతలామలకము కాఁగలదు.



## ఈ గ్రంథరచనకు తోడ్పడిన గ్రంథములు

### సంస్కృత గ్రంథములు

అభిజ్ఞాన శాకుంతలము - కాళిదాసు (వీరరాఘవభట్ట వ్యాఖ్యతో).
అభినవ భారతి, భరతనాట్యశాస్త్రమునకు వ్యాఖ్య - అభినవగుప్తుఁడు.
అలంకార చంద్రిక - నారాయణదేవుఁడు.
అలంకారశేఖరము - కేశవమిశ్రుఁడు.
అలంకార సంగ్రహము - అమృతానందయోగి.
అష్టోత్తరశతోపనిత్తులు - (వావిళ్ళప్రతి.)
ఆంధ్ర శబ్ద చింతామణి - నన్నయభట్టు.
కావ్యప్రకాశము - మమ్మటుఁడు.
కావ్యాదర్శము - దండి.
కావ్యానుశాసనము - వాగ్భటుఁడు.
కావ్యానుశాసనము - హేమచంద్రుఁడు.
కావ్యాలంకారము - రుద్రటుఁడు.
కావ్యాలంకార సూత్రవృత్తి - వామనుఁడు.
కుమారసంభవము - కాళిదాసు.
గురుబాల ప్రబోధిక - అమరుఁడు.
చంద్రాలోకము - జయదేవుఁడు.
జైమిని సూత్రము - జైమిని.
దశరూపకము - ధనంజయుఁడు.
ధ్వన్యాలోకము - ఆనందవర్ధనుఁడు.
నాట్యదర్పణము - రామచంద్ర గుణచంద్రుఁడు.
నాట్యశాస్త్రము - భరతమహర్షి
ప్రతాపరుద్ర యశోభూషణము - విద్యానాథుఁడు.
భగవద్గీత - వ్యాసుఁడు.
భరతరస ప్రకరణము - (వావిళ్ళ ప్రతి)
భామహాలంకారము - భామహుఁడు.
భావప్రకాశనము - శారదాతనయుఁడు.
మనుస్మృతి - మనువు.

మహాభారతము - వ్యాసుఁడు.
యాజ్ఞవల్క్యస్మృతి - యాజ్ఞవల్క్యుఁడు.
రఘువంశము - కాళిదాసు.
రసకళిక - రుద్రభట్టు.
రసతరంగిణి - భానుదత్తుఁడు.
రసరత్న ప్రదీపిక - అల్లరాజు.
రసార్ణవసుధాకరము - సింగభూపాలుఁడు.
వాక్యపదీయము - భర్తృహరి.
వాగ్భటాలంకారము - వాగ్భటుఁడు.
వేదాంత పంచదశి - విద్యారణ్యులు (వావిళ్ళ)
శాంకర గీతాభాష్యము - శంకరాచార్యులు.
శృంగార ప్రకాశిక - భోజుఁడు
సరస్వతీ కంఠాభరణము - భోజుఁడు.
సాహిత్య కౌముది - విద్యాభూషణుఁడు.
సాహిత్యదర్పణము - విశ్వనాథుఁడు.
సాహిత్యసారము - అచ్యుతరాయలు (వ్యాఖ్యాసహితము)
సుభాషిత శతకత్రయము - భర్తృహరి.

## ఆంధ్రగ్రంథములు - పీఠికలు - వ్యాసములు

అప్పకవీయము - అప్పకవి.
అమరసింహచరిత్రము - శ్రీ డి. రాజశేఖర శతావధాని.
ఆంధ్రధ్వన్యాలోకము - శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు.
ఆంధ్రకథామంజూష - పీఠిక - శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి.
ఆంధ్రపురాణ పీఠిక - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.
ఆంధ్రపురాణము - శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.
ఆంధ్రపౌరుషము - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.
ఆంధ్రప్రశస్తి - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.
ఆంధ్రమహాభాగవతము - బమ్మెరపోతన.
ఆంధ్రమహాభారతము - కవిత్రయము.
ఆంధ్ర రచయితలు - శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము - డా. దివాకర్ల వేంకటావధాని.
ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము - శ్రీ శిష్టారామకృష్ణశాస్త్రి.
ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము - శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము.
ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథలు.
ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు.
ఉత్తర రామాయణము - కంకంటి పాపరాజు.
ఉత్తర హరివంశము - నాచనసోమన.
ఉషః కిరణాలు - "శ్రీవాత్సవ" — శ్రీ యండమూరి సత్యనారాయణరావు.
ఏకాంకికలు - పీఠిక - శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి.
కలగూరగంప - తిరుపతి వేంకటకవులు.
కళాపూర్ణోదయము - పింగళి సూరన.
కావ్యకళాతత్త్వ ప్రకాశిక (తెలుఁగు వ్రాతప్రతి)- శ్రీ బిదురు వేంకటశేషయ్య.
కావ్యకుండిక (కావ్యసంపుటి) - శ్రీ రాయప్రోలు సుబ్బారావు.
కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన.
కావ్యాలంకార సంగ్రహము - భట్టుమూర్తి.
కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య - శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.
కాశీఖండము - శ్రీనాథుఁడు.
ఖండకావ్యములు - శ్రీ జి జాషువ.
జానపద గేయవాఙ్మయ పరిచయము - శ్రీహరి ఆదిశేషువు.
తెలుఁగు జానపద గేయసాహిత్యము - డా. బి. రామరాజు.
తెలుఁగు రాజకృతులు - శ్రీ పెనుమెచ్చ సత్యనారాయణరాజు.
దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము - శ్రీ నిడుదవోలు వేంకటరావు.
దాశరథి కావ్యములు.
దాశరథి శతకము - రామదాసు (కంచెర్ల గోపన్న).
దివోదాస నాటకము - కీ. శే. శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి.
నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ,
నన్నెచోడుఁడొకఁడు ౧ - (వ్యా) (జయంతి మాసపత్రిక) శ్రీ విశ్వనాథ
సత్యనారాయణ
నవ్యాంధ్ర సాహిత్యవీథులు - కీ. శే. కురుగంటి సీతారామభట్టాచార్యులు.
నాట్యశాస్త్రము (తెలుఁగు) - శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు.

నానారాజ సందర్శనము - తిరుపతి వేంకటకవులు.
నృసింహ పురాణము - ఎఱ్ఱాప్రెగడ.
పల్నాటి వీరచరిత్ర పీఠిక - శ్రీ ఉమాకాంత పండితులు.
పారిజాతాపహరణము - నంది తిమ్మన.
ప్రభాస - ప్రబోధకవిత్వము (వ్యా) - డా. కేతవరపు రామకోటిశాస్త్రి.
ప్రవర - శ్రీ నారాయణబాబు.
భారతము - తిక్కన - శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు.
మనుచరిత్ర - అల్లసాని పెద్దన,
మహాప్రస్థానము (ఖండకావ్య సంపుటి) - శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు "శ్రీ శ్రీ"
మహాభాగవతోపన్యాసములు - 'పోతన అనువాద విధానము' (వ్యా) కీ. శే.
కురుగంటి సీతారామభట్టాచార్యులు.
రంగనాథ రామాయణము - గోనబుద్ధారెడ్డి.
రంగరాయ చరిత్రము - దిట్టకవి నారాయణకవి.
రాణాప్రతాపసింహ చరిత్ర - శ్రీ డి. రాజశేఖరశతావధాని.
రాణాప్రతాపసింహ చరిత్ర పీఠిక - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ; అభి
ప్రాయము - శ్రీ జె. టి. కృష్ణశాస్త్రి.
రామాయణ కల్పవృక్షము - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.
రాష్ట్రగానము - శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరి.
వసుచరిత్రము - రామరాజభూషణుఁడు.
విజయశ్రీ పీఠిక - శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ.
విశ్వశాంతి నాటక పీఠిక - శ్రీ శ్రీ.
విష్ణుమాయా నాటక పీఠిక - శ్రీ కోరాడ రామకృష్ణయ్య. (మ. యూ. ప్ర.)
వెలుగోటి వంశావళి—
వేమన చాటువులు.
వైతాళికులు - (సం). ముద్దుకృష్ణ.
శంకరవిజయము - శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.
శివభారతము - శ్రీ గడియారము వెంకటశేషశాస్త్రి.
శివభారతోపోద్ఘాతము - కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు;
శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.
శ్రీనాథుని చాటువులు.

సత్యహరిశ్చంద్రీయము - (నాట) కీ. శే. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.
సర్వేశ్వర శతకము - యథావాక్కుల అన్నమయ్య.
సిపాయి పితూరి - శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు.
హరవిలాసము - శ్రీనాథుఁడు.
హరివంశ పీఠిక - (వావిళ్ళ) శ్రీ వేలూరి శివరామశాస్త్రి, శతావధాని.
మఱియు విషయసూచికలోఁ జేర్కొనఁబడిన గ్రంథములు.

## ఆంగ్ల గ్రంథములు - వ్యాసములు

Dictionary of World Literature - Ed. J. T. Shipley.
Language - Jesperson.
Language as Gesture - (Essay) Richard. P. Blackmur.
Literary Criticism in America - (Ed) Albert D. Van Nostrand.
Outlines of Psychology - Mc. Daugall.
Psychological Studies in Rasa - Dr. Rakesh Gupta.
Psychology - R S. Woodworth,
Sanskrist - English Dictionary - Apte.

పై గ్రంథరచయితలకు నా కృతజ్ఞతాభివందనములు

(గ్రంథకర్త)

## ముఖ్యవిషయానుక్రమణిక

హ



★

# సవరణల పట్టిక

| పుట | వంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 20 | Mc. Dangall | Mc. Daugall |
| 2 | F 4 | వ్యాపః | వ్యాసః |
| 7 | 7 | జాత్యనే | జాత్యా |
| 7 | 9 | ఫలస్వతః | ఫలాస్తతః |
| 7 | 10 | తస్య అను గుణానురూపవాసనా | తస్యావిపాకస్యయా అను గుణాఽనురూపా వాసనా |
| 9 | 9 | ఋషిశ్చ | ఋషిశ్చ |
| 13 | 18 | తద్భూతాత్వర్థ | తద్భూధాత్వర్థ |
| 15 | 23 | ధనికాదులగు | ధనంజయాదులగు |
| 16 | F 4 | మహాభావా | హావభావా |
| 16 | F 8 | కారణం సైవసైవ | కారణైః సైవసైనవ |
| 16 | F10 | సత్త్వా | సత్త్వ |
| 18 | F16 | ససాయీ | సస్థాయీ |
| 19 | 17 | విశేషణ | విశేషేణ |
| 30 | 13 | బలేన న సామాజికైః | బలేన చ సామాజికైః |
| 30, 34, 27, 30 | | ప్రేక్షక స్మృతః | ప్రేక్షకః స్మృతః |
| 33 | 19 | ప్రాన్తా | ప్రాన్తే |
| 33 | 20 | తద్వయోరపి | తద్ద్వయోరపి |
| 34 | 7 | కాంక్షతిః | కాక్షతిః |
| 34 | 29 | శ్లోకా | శ్లోకే |
| 41 | 22 | రసంపర్యవస్యతే | రసధ్వనిం పర్యవస్యేతే |
| 47 | 9 | ఉత్సాహతే | ఉత్సహతే |
| 52 | 10 | లాతి జనాతి | లాతి జానాతి |
| 54 | 3 | యోభావాశ్చైవ | యే భావాశ్చైవ |
| 56 | F 1 | యస్తుష్టా...ప్రేక్షకస్మృతః | యస్తుష్టా...ప్రేక్షకః స్మృతః |
| 62 | 29 | న్నడిఁది | న్కడిఁది |
| 69 | 30 | యుద్ధాచ్రేయో | యుద్ధాచ్ఛ్రేయో |
| 72 | 6 | సతాః పంథాన | సతాం పంథాన |
| 76 | 9 | ధర్మః పుణ్యాయమే | ధర్మః పుణ్యోయమే |
| 77 | 25 | తత్ప్రజ్ఞకు | తత్ప్రతిజ్ఞకు |
| 86 | 11 | ద్వార ప్రభావాగ్ని | ద్వార యోగప్రభవాగ్ని |
| 93 | 27 | సర్వమోగ | సర్వయోగ |
| 97 | 25 | గగ్దదస్వరము | గద్గదస్వరము |

| | | | |
|---|---|---|---|
| 101 | 3 | ఇఱువది వఱకు | ఇఱువది యొకటి వఱకు |
| 110 | 21 | తేజాం స్వష్టా | తేజాం స్రష్టా |
| 125 | 5 | Denounement | Denouement |
| 137 | 14 | కావ్యాలంకార కర్త భట్టుమూర్తి | కావ్యాలంకార చూడామణి కర్త విన్నకోట పెద్దన |
| 143 | 19 | నపాండవముగ | నపాండవముగా |
| 149 | 7 | సర్వశాస్త్ర విద్యల | సర్వశస్త్రాస్త్ర విద్యల |
| 154 | 17 | రక్తాఘ | రక్తౌఘ |
| 154 | 26 | తరుణీ .... నొక్కరుండ | తరుణి .... నొక్కరుఁడ |
| 169 | 19 | వోపునె | వోవునె |
| 182 | 8 | బెబ్బల | బెబ్బులుల |
| 188 | 27 | యస్తుర్ష్టా | యస్తుష్టా |
| 191 | 25 | మహాత్మరతమునందు ముఖ్య ముఖా ప్రతిపాద్యములు | మాహాత్మ్యము భారతమునందు ముఖ్య ప్రతిపాద్యములు |
| 197 | 26 | కుమారుంబోలె | కుమారులుంబోలె |
| 205 | 7 | ధనుర్భ్యేంగ | ధనుర్భంగ |
| 212 | 22 | తత్సమాగయాకాంక్ష | తత్సమాగమాకాంక్ష |
| 239 | 29 | మొత్తము ధ్యేయము | మొత్తమునకు ధ్యేయము |
| 249 | 26 | వడని బాస | పడకుండు బాస |
| 249 | 27 | హారుని గణార్పితం | హారగణానర్పితం |
| 256 | 9 | జేసెదన్ | జేసెదన్ మృత్యువున్ |
| 276 | 16 | వాఁడు | వాఁడ |
| 292 | 22 | ప్రకర్షమున నాదమనూత్తమ | ప్రకర్షదమనాంకమనూత్తమ |
| 302 | 21 | ఎగురునా | ఎగురునా యా |
| 304 | 32 | ఈ మాటని | ఈ మూడింటిని |
| 374 | 30 | సృజించి యాంధ్రావళి | సృజించిరి. ఆంధ్రావళి |
| 377 | 19 | కప్పిపుచ్చి....తరువాత | కప్పిపుచ్చగా....తరువాతవారు |
| 384 | 10 | కృతజ్ఞత | కృతఘ్నత |
| 384 | 28 | ప్రతిభాతి యే | ప్రతిభాతి మే |
| 384 | 29 | వహ్నిరేధపేక్ష | వహ్నిరేధాపేక్ష |
| 402 | 8 | లక్షణముతో | లక్ష్యముతో |
| 424 | 17 | బెట్టగదా | చెట్టగదా |

★